# సంస్కృతంలోని

# ప్రసిద్ధాంధ్రవ్యాకరణాలు

## ఆంధ్ర శబ్ద చింతామణి వికృతివివేకాల పుట్టు పూర్వోత్తరాలు

డా॥ ఆ. పన్నారావు

నాగార్జున విశ్వవిద్యాలయం

నాగార్జున నగర్ 522510

# సంస్కృతంలోని
# సిద్ధాంధ్రవ్యాకరణాలు

## శబ్ద చింతామణి వికృతి వివేకాల
## పుట్టుపూర్వోత్తరాలు



ఆ. పన్నారావు

సర్వస్వామ్య సంకలితం
1974 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి పిఎచ్. డి. పట్టం
పొందిన సిద్ధాంతవ్యాసం
కాపీలు 1200, ప్రథమ ముద్రణ 1982

ముఖచిత్రం : G. చిన్నబ్బాయి,
లక్ష్మీపురం, గుంటూరు-2



ప్రతులకు : పద్మా ప్రచురణలు,
శివపార్వతీ సదనమ్,
B-72, శ్రీనివాసనగర్, గుంటూరు-6
522006




ముద్రణ : శ్రీ లక్ష్మీ ప్రెస్, అరండల్ పేట, గుంటూరు-2

Paper Supplied by the Govt of India at Concessional rate.



శైశవా భ్యస్త విద్యగాఁ జక్కదిద్ది
భావి జీవన రుచిర సౌభాగ్య గరిమ
నందఁ జేసిన వ్యాసాశ్రమాధి పతికి
యతికి మలయాళస్వామి కంకితమొనర్తు

# అనుక్రమణిక

చతుర్థభాగం - అనంతర వ్యాకరణములపై చింతామణి ప్రభావం 451-478

# కృతజ్ఞతాంజలి

నా పరిశోధన కార్యక్రమానికి మార్గదర్శకులుగా ఉండి అది సక్రమంగా, శాస్త్రీయంగా జరగడానికి నిరంతరకృషి చేస్తూ, తమ సొంత గ్రంథాలయాన్ని కొంత కాలం నా కప్పగించిన ఉదారహృదయులు ప్రొ॥ తూమాటి దొణప్పగారికి,

నేను ఈ కార్యక్రమాన్ని నిర్వహించడానికి అనుమతి ఇచ్చి అవసరమైన అనుకూలాన్ని అన్నింటిని అడిగినంతనే కల్పించి నన్ను ప్రోత్సహించిన మా కళాశాలా పాలక వర్గానికి, దానికి ఆధారమైన శ్రీ చింతలపాటి బాపిరాజు ధర్మసంస్థ (చినవింద్ర కొలను) వారికి,

పరిశోధనకై సామగ్రిని సంపాదించే సమయంలో ఎన్నో ప్రాచీన గ్రంథాలు అందించిన రాజమహేంద్రవరంలోని గౌతమీ గ్రంథాలయానికి,

అడిగిన వెంటనే అనేక గ్రంథాలు సమకూర్చి సహకరించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం లోని డా॥ వి. యస్. కృష్ణ స్మారక గ్రంథాలయానికి,

ప్రాచీన తాళపత్ర గ్రంథాలు, లిఖిత ప్రతులు పరిశీలించే అవకాశం కల్పించిన తిరుపతి లోని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయానికి, వేటపాలెంలోని సారస్వత నికేతనానికి,

నా యీ కార్యక్రమం నిరంతరాయంగా కొనసాగడానికి, విందుహృదయంతో సహకరించిన తెలుగు శాఖలోని ఉపాధ్యాయ బృందానికి, ఇతర పరిశోధక మిత్రులకు,

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయమందించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి

నా కృతజ్ఞతాంజలులు

1–1–'82 ఇట్లు

గుంటూరు గ్రంథకర్త

# అవతారిక

సంస్కృతంలో వ్రాసిన ప్రసిద్ధాంధ్ర వ్యాకరణాలు, ఆంధ్రశబ్ద చింతామణి, వికృతి వివేకాలతో నా పరిచయం మా కళాశాలలో 'భాషాప్రవీణ' విద్యార్థులకు అహోబలపండితీయం పాఠం చెప్పవలసి వచ్చినపుడు ఏర్పడింది. వాటిలో మొదటి దాన్ని నన్నయ వ్రాశాడని చదివినప్పుడు సహజంగా సందేహ మొకటి తలెత్తింది. సంస్కృతంలో ఉన్న భారతాన్ని తెలుగు చేసి గానట వీనచే చదివి గాథలు త్రవ్వి తెలుగు వారికి జ్ఞానం కలిగించిన నన్నయ, తెలుగువారికోసం వ్యాకరణాన్ని సంస్కృతంలో రచించాడా? అని ఆ సందేహం తీరకుండానే, మరొక సందేహం జత పడింది–చింతామణిలో లక్షితమైన భాష నన్నయ కాలానిదేనా? అని. చింతామణిలో వర్తమానార్థంలో 'ఘటించుచున్నాఁడు' వంటివి, భవిష్యదర్థంలో 'ఘటింపఁగలఁడు' వంటివి క్రియలు ససూత్రంగా సాధించబడ్డాయి. అలాగే జొంపములు–జొంపాలు వంటి లోపదీర్ఘత వచ్చిన రూపాలు, నవలా లకోరీ వంటి దీర్ఘాంత దేశ్య శబ్దాలు చింతామణి సూత్రాల్లో లక్షితాలై ఉన్నాయి.

అలాగే వికృతి వివేకంలో గూడ దానికి కర్తగా చెప్పబడే అథర్వణుని కాలంతో భేదించే భాషా లక్షణాలు అనేకం ఉన్నాయి పైగా ఆ కారికలు సమన్వయించేదీ, సందర్భపడేదీ అహోబలపతి వ్యాఖ్యతోనే గాని, నేరుగా చింతామణితో గాదు. చాలా కారికల అర్థ సందర్భాలు అహోబలపతి వివరిస్తే తప్ప బోధపడవు.

పై సందేహాలు తీర్చుకోవాలని, కళాప్రపూర్ణ వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారి రచనలు, చింతామణి మీద వెలువడిన వాటిని, ముఖ్యంగా చింతామణి విషయ పరిశోధనాన్ని చదవడం జరిగింది. ఆయన వ్రాతలో నన్నయ చింతామణిని వ్రాశాడనేమాట వివిధభంగిమలలో కనబడటం తప్ప, దానికి బలమైన ఆధారాలు ఉపపత్తులు కనబడవు మాటిమాటికి 'నన్నయభట్టారకుఁడు రచించిన యాంధ్రశబ్ద చింతామణిలో', 'నన్నయభట్టారకుఁడాంధ్ర శబ్ద చింతామణిని రచించి' వంటి నిష్కారణ ప్రతిపాదనలు కనబడటంతో, చింతామణి కర్తృత్వ విషయమై కలిగిన శంకలు ఇంకా గట్టి పడ్డాయి. దానితో ఆంధ్రులెరిగినవైయాకరణులుగా ఆంధ్ర విశ్వవిద్యాలయ–ఆంధ్ర విభాగంలో ఆచార్య పదవిలో ఉన్న డా॥ తూమాటి దోణప్పగారిని

నా సందేహాలతో సమీపించాను. ఆయన ఆదరంతో, ఓపికతో, నాకు చింతామణి వికృతి వివేకాల చరిత్రము పరిశీలించే సరైన మార్గాన్ని చూపారు

సహజంగా ఏర్పడిన నా కుతూహలానికి తోడుగా, ఏపాటి అలసత్వాన్నీ సహించని ఆచార్యులు లభించడంతో నా ఈ పరిశీలనా కార్యక్రమం సక్రమంగా 1974 లో ముగిసి నేటికి ఈ గ్రంథ రూపంలో వెలువడింది.

చింతామణి, వికృతి వివేకాల కాలం, కర్తృత్వం విషయమై అక్కడక్కడా కొన్ని అభిప్రాయాలు, మరికొన్ని ఊహలు, వాదాలు, వివాదాలు ఉండటమే కాని, శాస్త్రీయంగా జరిగిన నిర్ణయాలు లేనికారణాన ఈ పరిశీలనకు దిగడం జరిగింది. ఏనాటికైనా ఈ చింతామణి, వికృతి వివేకాల పుట్టుపూర్వోత్తరాలు వెలికితీస్తే తప్ప, తెలుగు విద్యార్థికి, వ్యాకరణ వికాసాన్ని గూర్చి యథార్థ జ్ఞానం కలుగదు. తెలిసీ తెలియని విషయాలు పిల్లలకు నిజాలని ఇంకా చెప్పడం అన్యాయ్యం. పాత కాలంలో, చదువు, గ్రంథం, గురువు అనే పదార్థాలు అపురూపంగా ఉన్నపుడు, కట్టుకథలకు పుక్కిటి పురాణాలకు మనలో చోటుంటే అది సహ్యమైన విషయమే కావచ్చు గాని, ఇపుడు నిజానిజాలు తేల్చుకోడానికి ఎన్నో అవకాశా లున్నపుడు, సుపరీక్షితం కాని అంశాల్ని అలాగే అట్టిపెట్టుకోవడం భావ్యంగా తోచదు కాబట్టే ప్రియమైనా, అప్రియమైనా నిజాన్ని వెలికితీయాలనే ఉత్కంఠతో నా యీ ప్రయత్నం జరిగింది.

చింతామణికే పరిమితం కావలసిన ఈ పరిశీలనం, చింతామణికి సుప్రసిద్ధ వ్యాఖ్యానం అహోబలపండితీయం ద్వారా, వికృతివివేకానికి గూడ ప్రాకింది అదీ గాక మన పండితులు ఆ మూడిటినీ ఏకంచేసి, వాటిలో ఏ ఒక్కదాన్ని కదిపినా, రెండోదిగూడ తప్పక కదిలేటట్లు, వాటిచుట్టూ ఏవో అల్లికలు అల్లారు. ఎన్నో పీటముడులు వేశారు. వాటి నన్నిటినీ, విడదీయడం సామాన్యమైనపని కాకపోయినా, శక్తివంచన లేకుండా యత్నించడం జరిగింది

చింతామణి నన్నయభట్ట కర్తృకం, కారికావళి అధర్వణ కృతం అంటూ పుస్తకాల కోటలు ఆ కర్తృత్వాల చుట్టూకట్టారు ఏజ్జల చినసీతారామస్వామిశాస్త్రిగారు. ఆయన తాను వ్రాసే గ్రంథ మేదయినా దానిలో చింతామణి–నన్నయల ఏకాంత సంబంధం

పొందు పరచవిదే విశ్రమించలేదు. అసలే వ్యాకరణం, పైగా సంస్కృతంలో ఉంది: అందువల్ల చింతామణి జోలికి ఎవరూ పోలేదు. అలాగే వికృతి వివేకం విషయంలోను జరిగినది. ఎవరైనా పోదలచినా ఆ శాస్త్రిగారితో తలపడటం కొందరు ద్రోహంగా, మరికొందరు అసాధ్యమైన పనిగా, కొందరు అకార్యంగా, మరికొందరు పాపంగా భావించి, చింతామణి ఎవరు వ్రాసినా, వ్రాయకపోయినా ఒరిగేదీ, తరిగేదీ ఏమిటిలే అని ఉపేక్షించారేమో అయితే 'దక్షులైనవారి లెవ్వార లుపేక్షచేసిరది వారల చేటగు న నే అభియుక్తోక్తివి పురస్కరించుకొని ఈ పరిశీలనకు యత్నించాను. ఇక దక్షత విషయం విజ్ఞులే వివేచించాలి.

నా ఈ పరిశీలనం ముగిసే సమయానికి డా అమరేశం రాజేశ్వరశర్మగారి 'ఆంధ్రవ్యాకరణ వికాసం' చూడటం తటస్థించింది దానిలోని నిర్ణయాలవల్ల నా ఈ పరిశీలనంలో మార్పులు, చేర్పులు చేయవలసిన స్థితి ఏర్పడలేదు.

పరిశోధన వ్యాసాల్లో చదివించే శక్తి చాలడంలేదు, ఉండటంలేదు—అనేది వాదమో, ప్రవాదమో, వినబడుతూ ఉంది. దానికి వెరచి నా రచన వ్యావహారికంగా సాగించాను. నిన్నటి దాకా గ్రాంథికంగా వ్రాస్తూ నేడు వ్యావహారికంగా వ్రాయవలసి వచ్చి నందున కొన్ని భ్రమ ప్రమాదాలు దొర్లి ఉండవచ్చు-అని శంక. ఉంటే విజ్ఞులు మన్నించాలి.

ఎంతగా యత్నించినా అచ్చు తప్పులు అనివార్యాలే అయినాయి దయచేసి క్రింది విధంగా సవరించుకొని చదువుకోవలసినదిగా మనవి.

1—1—'82
గుంటూరు

ఇట్లు
గ్రంథకర్త

# సవరణలు

| పుట | పంక్తి | |
|---|---|---|
| 3 | 5 | లోకోపకారార్థంబుగా |
| 14 | 3 | కవిత్వమహత్త్వ |
| 15 | 8 | నన్నయ |
| 17 | 14 | —న్మహనీయ |

| | | |
|---|---|---|
| 30 | 9 | సమీక్ష |
| 32 | 17 | అయథార్థమే |
| 53 | 10 | ఆసూత్రాలకు |
| 63 | 3 | పుషణ్వాది |
| 64 | 23 | సూత్ర సముదాయం |
| 76 | 8, 17 | గంభీరాశయం, అర్థ |
| 100 | 1 | ఆభాస |
| 101 | 12 | రచనలోని |
| 105 | 20, 23 | విభక్తి, విష్పత్తిని |
| 110 | 10 | అక్రమ మని |
| 130 | 20 | ప్రాణోఽత్ర |
| 156 | 1 | భల్లాటైః |
| 160 | 16 | ఐదింటిని |
| 176 | 18, 20 | గుర్తించిన, సిద్ధిస్తుందని |
| 191 | 22 | ఋజువు |
| 261 | 21 | ఋజువు |
| 276 | 26 | ('కూర్చి' 'ఱ'లను) |
| 353 | 14 | విచక్షణమణిః |
| 357 | 11 | వృత్తికర్తను |
| 418 | 23 | స్వాదేశత్వం |



# సంక్షిప్త - ఆధార గ్రంథాలు


అనంతుడు — ఛందోదర్పణము, వావిళ్ల, మద్రాసు-1958

అప్పకవి, కాకునూరి — అప్పకవీయము, వావిళ్ల, మద్రాసు-1962

అబ్బాయినాయుడు, పి — ఆంధ్రవ్యాకరణ సంగ్రహము, 1896

ఈశ్వరప్ప, బుద్ధిరాజు — మాధ్యమిక తెలుగు వ్యాకరణము 'The Lower Secondary Telugu Made Easy'
మంజువాణి ప్రెస్, ఏలూరు—1899

కృష్ణమాచార్యులు, వంగీపురము — వ్యాకరణసంగ్రహము,వావిళ్ల,మద్రాసు-1948

కేతన, మూలఘటిక — ఆంధ్రభాషాభూషణము, వావిళ్ల, మద్రాసు—1949
— కళాకృష్ణులకావ్యమాల-1953

గణపతిశాస్త్రి, చర్ల — నారాయణీయాంధ్రవ్యాకరణము, లలితాప్రెస్, హైదరాబాదు—1969

గున్నయ్య, పి — ఆంధ్రవ్యాకరణము, హైదరాబాదు, 1907

గురుమూర్తిశాస్త్రి, రావిపాటి — తెలుఁగు వ్యాకరణము,
చర్చిమిన్సయాన్ ప్రెస్, మద్రాసు—1836

గోపాలకృష్ణయ్య వడ్లమూడి — ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష, పడమట. 1955

చిన్నయసూరి, పరవస్తు — విభక్తి బోధిని, గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రి—1869
శబ్దలక్షణ సంగ్రహము, గౌతమీ గ్రంథాలయం. రాజమండ్రి.
ఆంధ్ర శబ్దానుశాసనము, ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ, 1931
పద్యాంధ్ర వ్యాకరణము, ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ, 1931
బాలవ్యాకరణము (గ్రాంథికాంధ్ర కల్పక టీకా సహితము), వావిళ్ల, మద్రాసు-1967

| | |
|---|---|
| చినసీతారామస్వామిశాస్త్రి, వఝ్ఝల | చింతామణి విషయ పరిశోధనము, కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ - 1937<br>వైయాకరణ పారిజాతము, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు—1957<br>వ్యాకరణ సంహితా సర్వస్వము, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు—1957 |
| జోగి సోమయాజి, గంటి | ఆంధ్రభాషా వికాసము, వాల్తేరు—1947 |
| తిమ్మకవి, కూచిమంచి | సర్వలక్షణసార సంగ్రహము, ఏలూరు, మంజువాణి ప్రెస్—1901<br>— నందిరాజు చలపతిరావు, - 1927 |
| దొణప్ప, తూమాటి | భాషాచారిత్రక వ్యాసావళి, ఆంధ్రసారస్వత పరిషత్, హైదరాబాదు—1972<br>వైకృత పద స్వరూప నిరూపణము (ప్రచురించబడని సిద్ధాంతవ్యాసము) |
| నన్నయ | ఆంధ్ర మహాభారతము, వావిళ్ల, మద్రాసు—1952 |
| నరసింహరాజు, బలారిసింహ | కవిజనాంజనము, సుదర్శనీ ముద్రాక్షరశాల—1911 |
| నారాయణరావు, చిలుకూరి | ఆంధ్రభాషా చరిత్ర, ఆంధ్రవిశ్వకళా పరిషత్, వాల్తేరు—1937 |
| పట్టాభిరామశాస్త్రి, వేదము | పట్టాభిరామ పండితీయము, వావిళ్ల, మద్రాసు—1951 |
| పాపయ్యశాస్త్రి, బులుసు | తెలుగు వ్యాకరణము, అనకాపల్లి, - 1906 |
| పెద్దన, చిన్నకోట | కావ్యాలంకార చూడామణి, వేదం వెంకటరాయశాస్త్రి, చెన్నపురి—1936<br>— ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో ప్రకటితము |

పెద్దన, చిత్రకవి — లక్షణసార సంగ్రహము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ—1940

బాలసరస్వతి, ఎలకూచి — బాలసరస్వతీయము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, 1932

— వావిళ్ల, మద్రాసు—1971

మల్లికార్జునశాస్త్రి, మల్లంపల్లి — పద్యాంధ్రవ్యాకరణము, శ్రీమత్త్రిపుర సుందరీ ముద్రాక్షరశాల, ఏలూరు—1897

రామన, ముద్దరాజు — కవిజన సంజీవని, వావిళ్ల, మద్రాసు— 972

రామశాస్త్రి, పారవంది — ఆంధ్రశబ్ద చింతామణి ఉద్ద్యోతిని, ఆంధ్ర పత్రికా ప్రెస్, మద్రాసు—1923

రేచన, మల్లియ — కవిజనాశ్రయము, వావిళ్ల, మద్రాసు-1950

— ఆంధ్ర సాహిత్య పరిషత్తు— 959

వీరేశలింగం, కందుకూరి — ఆంధ్రకవుల చరిత్ర, మనోరమా ముద్రాక్షరశాల, రాజమండ్రి—1917

సంగ్రహవ్యాకరణము(24వ ప్రచురణ) 1928

వెంకటస్వామి, పాడి — ఆంధ్రాక్షర తత్త్వము, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ—1906

వెంకటరాయశాస్త్రి, వేదము — ఆంధ్రవ్యాకరణ సర్వస్వ తత్త్వము, వేదం వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు—1950

వెంకట్రామయ్య, శృంగారకవి — ఆంధ్రవ్యాకరణము, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడి—1904

వెంకటరమణశాస్త్రి, వేదము — లఘువ్యాకరణము, వావిళ్ల, మద్రాసు 1951

— వావిళ్ల, మద్రాసు—1967

వెంకటరమణశాస్త్రి, దువ్వూరి — రమణీయము (బాలవ్యాకరణ వ్యాఖ్య)ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు—1967

వెంకటరావు, నిడదవోలు — తెనుఁగుకవుల చరిత్ర, మద్రాసు విశ్వవిద్యాలయం, 1953

వెంకటపతి, గణపవరపు — ఆంధ్రకౌముది, ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ—1935

వెంకయ్య, తా — ఆంధ్ర వ్యాకరణము, Empress of India Press—1892

శ్యాం. వ. — ప్రశ్నోత్తర దీపకము—1899

శేషయ్య, చాగంటి — కవి తరంగిణి, హిందూధర్మశాస్త్ర గ్రంథ నిలయము, కపిలేశ్వర పురము— 959

సత్యనారాయణరాజు, పెన్మెత్స — శిష్ట వ్యాకరణము, ఆంధ్ర నలంద, గుడివాడ, 1957

సీతారామశాస్త్రి, పుదూరి — ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము, వావిళ్ల, మద్రాసు, 1951

సీతారామకవి, ద్వితింత్రిణి — అధర్వణకారికావళి వ్యాఖ్య (కవిజన మండనము), వావిళ్ల మద్రాసు–1967

సీతారామాచార్యులు, బహుజనపల్లి — త్రిలింగలక్షణ శేషము, వావిళ్ల, మద్రాసు—1952

శబ్ద రత్నాకరము, The Madras School Book and Literature Society—1969

సుబ్బారావు, ర్యాలి — తెలుగు వ్యాకరణము, ఏలూరు—1899

సూరకవి, అడిదము — కవిసంశయవిచ్ఛేదము, వావిళ్ల, మద్రాసు—1925, 1955


## తెలుగు తాళపత్ర ప్రతులు :


తాతంభట్టు, వెల్లంకి — కవిచింతామణి, శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి, డి. 278

బాలసరస్వతి, ఎలకూచి — బాలసరస్వతీయము, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి, డి. 1252

సంస్కృతం :

| | |
|---|---|
| అహోబలపతి ప్రభంజనం | అహోబల పండితీయమ్ లేక కవిశిరోభూషణమ్, ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు—1965<br>యరసూరి మల్లికార్జునరావు, రాజమండ్రి—1970 |
| చిన్నయసూరి, పరవస్తు | సూత్రాంధ్రవ్యాకరణమ్, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ—1931 |
| పాణిని | అష్టాధ్యాయీ సూత్ర పాఠః, నిర్ణయ సాగరప్రెస్, బొంబాయి 2—1954 |
| భట్టోజీ దీక్షితుడు | వైయాకరణ సిద్ధాంతకౌముదీ, (పాణినీయ వ్యాఖ్యా) చౌఖాంబా సంస్కృత సిరీస్, వారణాసి |

సంస్కృత తాళపత్ర ప్రతులు :

| | |
|---|---|
| వాసుదేవుడు, మంచెళ్ల | ఆంధ్రశబ్ద చింతామణి వృత్తిః, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి, డి. 1241 |
| | వైకృత చంద్రికా, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి |
| | ఆంధ్రశబ్ద చింతామణిః, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి, డి. 1238; నం. 11-13-12 |
| ... | వికృతివివేకః, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి |

ప్రాకృతం

| | |
|---|---|
| చంద్రుడు | ప్రాకృత లక్షణమ్ |
| త్రివిక్రమదేవుడు | ప్రాకృత శబ్దానుశాసనమ్, శోలాపురీయ జైన సంస్కృతి సంరక్షక సంఘ—1954 |

| | |
|---|---|
| లక్ష్మీ ధరుడు | షడ్భాషా చంద్రికా |
| వరరుచి | ప్రాకృత ప్రకాశః, చౌఖాంబా సంస్కృత సిరీస్, వారణాసి |
| హేమచంద్రుడు | హైమప్రకాశ మహా వ్యాకరణమ్, అష్టమో ఽధ్యాయః పుణ్యపత్తనస్థ శ్రేష్ఠి మోతిలాలేన ప్రకాశితమ్—1928 |

వ్యాసాలు

| | |
|---|---|
| గోపాలకృష్ణయ్య, వడ్లమూడి | ఆంధ్రభాషాభూషణ పీఠిక, కళాకృష్ణం కావ్యమాల— 953 |
| దొణప్ప, తూమాటి | జక్కులు మాగధీ తద్భవమా?, భారతి మే, 1970 |
| రామశాస్త్రి, పారనంది | ఆంధ్రవ్యాకరణ విచారణము, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (దుందుభి పై శాఖశుద్ధ 14 బుధవారము) |
| రామలింగారెడ్డి, కట్టమంచి | ఆంధ్ర భాషామశాసన పీఠిక, ఆర్యపు ప్తకాలయము, రాజమహేంద్రవరం—1930 |
| వెంకటరావు, నిడదవోలు | నన్నయ వాగనుశాసనుడా?, భారతి, జూన్ ఆగస్టు—1968 |
| | తెలుగు—ప్రాకృతము, భారతి, ఆగస్టు-1966 |
| వెంకటకృష్ణారావు, భావరాజు | సారంగధరుఁడు, రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక—1922 |
| వెంకట రామానుజరావు, మంగు | ఆంధ్ర భాషాచరిత్ర సంగ్రహము, ఆంధ్ర భాషాభివర్ధినీ సమాజము, నెల్లూరు— 899 |
| వేంకటనృసింహఅప్పారావు, కేశిరాజు | ద్రుత చరిత్రము, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 43వ సంపుటం, 3 సంచిక |
| వేంకటప్పారావు, నందగిరి | రేఫద్వయ వాదనిరాసం, ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, సంపుటం 11, సంచిక |

## ENGLISH


| | |
|---|---|
| Kasinadha Vasudeva Abhayankar | A Dictionary of Sanskrit Grammar, Oriental Institute, Baroda |
| Pischel, R | Comparative Grammar of Prakrit Languages, Tr. by Subhadrajha, Motial Banarsidas, Varanasi-1957 |
| Subrahmanya Sastry, P S | Lectures on Patanjali's Mahabhashya, Tiruchirapalli-1957 |
| Suryanarayana, J | A Study of Telugu Compounds S V. University, Tirupati—1966 |

# గ్రంథ సంకేత వివరణం

| | |
|---|---|
| అప్పకవీయము | అప్ప. |
| అప్పకవీయ చింతామణి | అప్ప. చిం. |
| అహోబల పండితీయము | అహో. పం. |
| ఆంధ్ర భాషాభూషణము | ఆం. భా. భూ. |
| ఆంధ్రమహాభారతము ఆదిపర్వము | ఆది. |
| ఆంధ్ర మహాభారతము సభాపర్వము | సభా. |
| ఆంధ్రమహాభారతము అరణ్య పర్వము | అరణ్య. |
| కవిజన సంజీవని | కవి. సం. |
| కవిసంశయ విచ్ఛేదము | కవిసం. వి. |
| ఆంధ్రశబ్ద చింతామణి | చింతా. |
| చింతామణి విషయ పరిశోధనము | చిం. విష. శో. |
| చింతామణి విషయ పరిశోధన శోధనం | చిం. విష. శో. శో. |
| త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసనమ్ | త్రివిక్రమ. |
| పాణినీయమ్ | పాణిని. |
| బాలవ్యాకరణము | బాలవ్యా. |
| బాలసరస్వతీయము | బాలస. |
| లక్షణసార సంగ్రహము | ల. సా. స. |

## ఇతర సంకేతాలు

| | |
|---|---|
| ఆశ్వాసము | ఆశ్వా. |
| చూడండి | చూ. |
| సూత్రము | సూ. |

# ఆంధ్రశబ్ద చింతామణి లోకానికి తెలిసిన తీరు

## బా ల స ర స్వ తి

చింతామణిని మొట్టమొదట లోకానికి తెలిపినవాడు 16వ శతాబ్ది నాల్గోపాదానికి చెందిన బాలసరస్వతి. ఆయన మాటల్లో ఈ మణిలాభం ఇలా జరిగింది—

'మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్యానుభావోపాగమ స్నేహసాహచర్యుండగు శివయోగివర్యుచే దేవచోదనం బరిప్రాప్తమ్మైన యాంధ్రశబ్దచింతామణి గ్రంథంబు లోకోపకారార్థంబు టీక రచియింపం గోరి యిమ్మనంబున—

ఏమి మహాద్భుతంబిది మహీస్థలి నెక్కడి యంధ్రశబ్ద చిం
తామణిఁ యెక్కడ ? యెక్కడి మతంగనగంబు ? యుగాదిసంభవం
బై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు సిద్ధుఁడెవ్వఁడా
హా మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్

ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లేరే . వారు వ్యాఖ్యానికి
న్వలనోపరె పెక్కు వత్సరములందు ఖ్యాతమై యున్న యీ
తెలుఁగువ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం డీక రచింపుమం
చల సిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్

అని గణించి లోకోపకారసుకృతకీర్తిలాభవితర్కంబునం బ్రహర్షించి యాంధ్రవ్యాకరణ భాష్యనిబంధనోత్సుకుండనై (బాలసరస్వతీయము పీఠిక 3 నుండి 6)

అని టీకాభాష్యపదాలు పర్యాయాలుగా వాడిన బాలసరస్వతి తనకు శివయోగి వర్యుడే చింతామణిని 'దేవచోదనం'తో అందించినట్లు ప్రకటించాడు. అయితే ఈ సందర్భంలో బాలసరస్వతి చేసిన పదప్రయోగం 'దేవచోదనం బరిప్రాప్తంబైన' అనేది చాల అస్పష్టంగా ఉంది— ప్రస్తుతం మనకు. ఆ దొరకటం ఏరూపంలో గ్రంథరూపంలోనా ? వాగ్రూపంలోనా ? అని సందేహించవచ్చు. కాని 16వ శతాబ్దికి

గ్రంథాలరూపంలోనే వాఙ్మయం ప్రసిద్ధంగా ఉండేది. కాబట్టి శివయోగివద్యుడు వా సరస్వతిక గ్రంథమే అందించి ఉంటాడని భావించవలసి ఉంటుంది.

చింతామణిలాభమెప్పుడు జరిగిందో బాలసరస్వతి ప్రకటించలేదు. కాని ప్రకటనం, అతనికి సన్నిహితకాలంలోనే అప్పకవి చేశాడు.

## అ ప్ప క వి

'ఆలోకనుతుఁడు మొన్నటి కీలకసమమున మతంగగిరికడ గాంగెన్
బాలసరస్వతులకు నతఁడోలిఁ దెనుఁగుటీక దాని కొప్పఁగఁ జేసెన్ —
(అప్ప. పీఠిక - ౩౮)

బాలసరస్వతికి కీలకనామసంవత్సరంలో (క్రీ. శ. 1611) తనకంటె 16 సంవత్సరాల ముందుగా చింతామణి లభించినట్లు అప్పకవిచెప్పాడు. అప్పకవికి చింతామణి లభించడం లచ్చంగా బాలసరస్వతికి లభించిన పద్ధతిలోనే జరగడం విశేషాంశం.

బాలసరస్వతికి 'మతంగనగసిద్ధుని' వలన చింతామణి లభిస్తే, అప్పకవికి గూడ అతని ఇష్టదైవతం చెప్పినట్లు 'మతంగాచలవిప్రుని' వలన దొరుకుతుంది. బాలసరస్వతి 'అలసిద్ధుడు' తనఇష్టదేవత విరూపాక్షుడే నంటే, అప్పకవి గూడ తన ఇష్టదైవతం కామెపల్లి శ్రీగోపాలుడే స్వయంగా స్వప్నంలో సాక్షాత్కరించి చింతామణి కథను తెలిపినట్లు వ్రాశాడు. చింతామణి అప్పకవికి దొరికినవృత్తం చూడ అతనిమాటలలోనే గమనిద్దాం. అవని మాటలు అతనివిగావు. అవి స్వయంగా 'భగవద్వాక్యాలు'.

'ఆంధ్రశబ్దచింతామణి వ్యాకరణము
ముందు రచియించి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁ జెప్పె నన్నయభట్టు వొల్లి
పర్వములు మూఁడు శ్రీమహాభారతమున

భారతముఁ దెనుఁగించుచుఁ దా రచించి
నట్టి రాఘవపాండవీయము నతండె
ఛందము నడంప నీఫక్కి సంగ్రహించె
నరుచు భీమన ప్రముఖ్యుఁడు యుపఁడె వారు

తదనంతరంబ

అవిని పెద్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది పఠింపఁగాఁ బడియె నెంమయు దానిని గాని మాత్రసం
పాదన సేయుచేఁ దెనుఁగుపద్దెము లొక్కటఁ గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటి కవిరాక్షసుఁడే నియమంబుఁ జేసెనన్

అమూఁడు పద్యములలో
నామాన్యుఁడు నుడువుతెఱఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
భీమణి మొదలైన తొంటి తెనుఁగుకవీంద్రుల్

రాజరాజనరేంద్ర తనూజుఁడార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించునెడఁ బరనంబొనర్చె
నన్యు లెవ్వరెఱుంగరీ యంధ్రఫక్కి

బతఁడు దనకాళ్లఁ జేతులు
మతి నెడి జనకుండు దఱుగ మత్స్యేంద్రుని సం
గతి నవి గ్రమ్మఱ మొలచిన
క్షితి సిద్ధులఁ గలసి యొక్క సిద్ధుండయ్యెన్

ఆలోకనుతుఁడు మొన్నటి
కీలకసమమున మతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
ధోలిఁ దెనుఁగు టీక దానికొప్పుగఁ జేసెన్

ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మీఁదట రాజనరేంద్ర
క్ష్మాదయితునిపట్టి దాని మహి వెలయించెన్

ఇల నెనుబదిరెండార్యలు
గలిగి పరిచ్ఛేదపంచకంబునఁ దగు నీ
విలసితఫక్కి మతంగా
చలవిప్రునివలన నీదుసదనముఁ జేరున్ —

(అప్ప. పీఠిక - 42 నుండి 52 వరకు)

పై అప్పకవి స్వప్నప్రకారంవలన బాలసరస్వతి చెప్పని నూతనాంశాలు అనేకం తెలిశాయి :

1. సూత్రాల్ని ముందు చింతామణియాపంలో వ్రాసి, తరువాత వాటికి లక్ష్యంగా 'తెలుగుబాసలో' నన్నయభట్టు మూడుపర్వాలు చెప్పాడు. అంటే లక్షణం సంస్కృతంలో చేసి లక్ష్యాన్ని తెలుగులో చూపెట్టాడన్నమాట !

2. భీమన, తనరాఘవపాండీయాన్ని, భారతరచన చేస్తూ అడచినట్లే, తన ఛందస్సును అణచడానికే నన్నయ చేశాడనుకొని, దాన్ని దొంగలించి గోదావరిలో కలిపాడు.

3. రాజరాజనరేంద్రునికొడుకు సారంగధరుడు తనశైశవంలో, నన్నయ రచించే సమయంలోనే దాన్ని కంఠస్థం చేసికొని, తరువాత తనకాళ్లు, చేతులు తెగి, తిరిగి మొలిచినపిదప సిద్ధుల్లో గలిసి ఒకడై, మతంగపర్వతం దగ్గర బాలసరస్వతికి (తన కంఠంలోనివ్రాఁగూపమైన ?) చింతామణిని అందించాడు.

4. దానిలో 82 ఆర్యలు 5 పరిచ్ఛేదాలలో ఉన్నాయి.

బాలసరస్వతి ఊరక మతంగనగసిద్ధుని వలన తనకు దొరికినదన్న చింతామణి గాథకు పూర్వాపరాలు సృష్టించి ఒకఆకారాన్ని యిచ్చాడు అప్పకవి. చింతా

మణిని తెనిగిస్తే అనంతకీర్తిప్రతిష్ఠలు వస్తాయని బాలసరస్వతిని చూచి తానూ భావించాడు అప్పకవి.

అప్పకవితరువాత చింతామణికి మూడో వ్యాఖ్యాత ఒంటెద్దు వాసుదేవుడున్నాడు గాని, అతడు నేరుగా వ్యాఖ్యానమే ప్రారంభించాడు. ఉపకథాకాలక్షేపం చేయలేదు అప్పకవి అల్లిన కథనాన్ని ఇతడు ఉల్లేఖించకున్నా మూలపదార్థం కొంపడి ఉంటుంది. కాబట్టి తరువాతి వ్యాఖ్యాత అహోబలపతి, అప్పకవికథనే భాషాంతరీకరించి ఉటంకిస్తున్నాడు. అయినా అతని మాటలు కూడా అతని ముఖతః వింటాం.

**అహోబలపతి**

'సేయం కృతిర్వేములవాడభీమ ప్రబంధకర్త్రాఽహితమత్సరేణ
గోదాజలే నాశమవాపితాభూ దిత్యుద్గతాఽసీద్ భువి కింవదన్తీ

శబ్దానుశాసన కృతాదిమ పర్వముఖ్య పర్వత్రయేణ కథితం పదమేవ యోగ్యమ్
నాన్యత్ప్రయోగసరణౌ వసుధాత్రదృష్టే రేవం కృతో హి నియమః కవిరాక్షసేన

శ్రీతిక్కయజ్వ ప్రముఖ విచక్షణసుధాంశవః
తదభ్యుపగమాయత్తచేతసః కవనే రతాః

వాచానుశాసనాద్ భూమిలోకవాచానుశాసనాత్
నిర్మాణకాల ఏవేమం గ్రంథం జగ్రాహ బుద్ధిమాన్

రాజరాజతనూజాతః సారంగధరబాలకః
సకృత్తః పాణిదేన రహితోఽజని హేతునా

మత్స్యేంద్రనామసిద్ధేంద్ర మహిమ్నా సిద్ధతాంగతః
జగ్రాహ వ్యాకృతిం తస్మాత్కవిర్బాలసరస్వతీ

ఎలకూచి సుధాంభోధి శరద్రాకా నిశాకరః
సమస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే

తత్రపంచపరిచ్ఛేదాః శబ్దశాస్త్రే నియంత్రితాః
ఆర్యాఖ్యపద్యై స్తత్సంఖ్యా సమ్మితా స్యాద్గజై ర్గజైః

మతంగశైల విప్రేంద్రా దన్యద్ వ్యాకృతిపుస్తకమ్
కాకునూర్యప్పకవినా గృహీతం తత్ర షడ్గతాః

పాఠభేదాస్తు బహవో దృశ్యన్తే పుస్తకద్వయే
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే —
(అహో. పం. పీఠిక - 63 నుండి 72 వరకు

పై వ్రాతలో నూతనాంశాలేమీ లేవు—చింతామణిలాభాన్ని గూర్చి. అయితే చింతామణిలో అప్పకవి చెప్పినట్లు 82 శ్లోకాలు గాక 88 ఉన్నాయని, అప్పకవీయ చింతామణిలో 6 నష్టమైనాయని తెలపడం విశేషమే. చింతామణిని కేతనాదుల లక్షణములతో పోల్చి అవి సమ్మతాలు కావన్నాడు. వాటికీ చింతామణికిపక్కికీ భేదం చాల ఉందన్నాడు.

'నియామకత్వ మారూఢాః నూత్నదండి ముఖాః కథమ్
పూజ్యాభవేయు రాచార్యసరణే రతిదూరగాః'— (అహో. పం. పీఠిక - 74)

-అనే శ్లోకంలో. కాని ఇది అప్పకవికి ప్రతిధ్వని. అప్పకవి తన పీఠికలో—

తాతనయు నూత్నదండియు నీతెనుఁగుల లక్షణం బొకించుక తెలియన్
జేతః ప్రౌఢిమఁ జెప్పిరి క్ష్మాతలమున దీనితెఱఁగు గావవియెల్లన్' — 59

అని చింతామణిముందు కేతనాదులవ్యాకరణాలు తీసికట్టే నన్నాడు.

అహోబలపతి తన ఉపోద్ఘాతంలో మరొక విశేషాంశం గూడ వెలువరించాడు — అప్పకవీయచింతామణికీ బాలసరస్వతీయానికీ పాఠభేదాలు కొల్లలుగా

ఉన్నాయని, తాను మాత్రం తరచుగా బాలసరస్వతీయాన్నే ఆధారంగా చేసికొని వ్యాఖ్య చేస్తున్నానని.

ఇక పైమువ్వురి వ్రాతలూ పరిశీలిస్తే బాలసరస్వతికి, పూర్వమీగ్రంథం ఉనికిలేనిది. అందుకనే అతడు శ్లోకం తరువాత వ్యక్తపరుచబోయే ఆశ్చర్యాన్ని తానే ముందు కనబరుస్తూ "ఏమి మహాద్భుతం ఇది హరీహరి." అన్నాడు. ఆ అద్భుతాన్ని అల్పంగా వివరిస్తూ తనకు దొరికిన దని తాను తెల్పినగ్రంథానికి కర్త మాత్రం యుగాది సంభవుండై మనిచన్న నన్నయ అని తెలిపాడు.

తరువాత అప్పకవి, కల్పనాశక్తి కావలసినంత కలవాడు కావడంతో, పుక్కిటి పురాణంతో నన్నయకు ఈ రచనకూ, ఆకాలంలోని వారు విశ్వసించే విధంగా సంబంధాన్ని సంతరించాడు. ఈకృషిలో ఇతడు తనఇష్టదైవం సహాయం గూడ పొందాడు భగవద్వాక్యంగా తెలియవచ్చినదాన్ని తిరస్కరించడం శంకించడం జరుగదు గదా సామాన్యంగా - అనుకొని తనమాట తనఇష్టదైవతంనోట పలికించాడు.

అహోబలపతి పైకథాంశాల వ్యాప్తికి వాటిని సంస్కృతీకరించి సహకరించాడని చెప్పడం మినహా కథాసృష్టిలో అతనిపాత్ర ఏమీ లేదు.

చింతామణికి చెందిన ఈకథ పుట్టడం పెరగడం, వ్యాపించడం పెద్దగా వ్యవధానం లేకుండా రమారమి 100 సంవత్సరాలలో జరిగింది.

### చింతామణి దొరికిన సంవత్సరం :

అప్పకవి తనకాలాన్ని తనగ్రంథంలో స్పష్టంగా చెప్పాడు. శాలివాహన

శకంలో, మన్మథనామ సంవత్సరంలో శ్రావణబహుళ అష్టమినాడు అతడు కల గన్నాడు[1].

మన సంవత్సరాల వరుసలో మన్మథనామ సంవత్సరం 29 వది. కీలకనామ సంవత్సరం 12వది. అప్పకవికి కల మన్మథలో వచ్చింది కాబట్టి మన్మథకు పూర్వం కీలకసంవత్సరంలో అంటే 16సంవత్సరాలకి పూర్వం బాలసరస్వతికి గ్రంథం దొరికినదన్నమాట.

అప్పకవి బాలసరస్వతికి చింతామణి దొరికినకాలమే చెప్పాడు గాని, వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు ప్రతిపాదించినట్లు[2] బాలసరస్వతీయ రచనాకాలం కాదు. శాస్త్రిగారు తమ ప్రతిపాదనకు కారణంగా బాలసరస్వతీయంలోని 'అని ఇష్టదేవతా ప్రార్థనంబు సేసి' ఇత్యాది వచనాన్ని ఉటంకించారు. ఇక్కడ శాస్త్రిగారు చేసింది కేవలం ఊహ మాత్రమే. జ్యేష్ఠప్రపితామహునికి జరిగిన అగ్రహారదానంతో ముది మనుమనికాలాన్ని నిర్ణయించడం విశ్వాసార్హంగా లేదు. దానితో బాలసరస్వతి కాలాన్ని మరికొంచం ప్రాచీనం చేద్దామని శాస్త్రిగారియత్నం. అయితే చర్చ సాగించి చివరకు 'చింతామణి మాతృక నాకీలక సంవత్సరమందే సిద్ధించి యుండవచ్చు నని చెప్పిననూ చెప్పవచ్చునని' తమవాదాన్ని జారవిడిచారు. కాబట్టి చింతామణి బాలసరస్వతికి కీలకలోనే దొరికిందని చెప్పవచ్చు.

పైన మనం చూసిన అప్పకవికథ కేవలం నీటిమూట. అది చారిత్రకంగా బొత్తిగా పొసగని విషయమని, రాజమహేంద్రవర పాలకుడు రాజరాజనరేంద్రునికి

---

1 'ధాత రెండవపరార్ధమున నాదిదినంబు పగటి వరాహకల్పంబు నందు
మహిత వైవస్వతమనువేళ దేశంబు లర్థింపనైన మహాయుగమునఁ
గలిసమయంబునఁ దొలిచరణంబున మానితంబగు చాంద్రమానమునను
శాలివాహననామ శకమున గజశైలశరసుధాకిరణులసంఖ్య నడువ/1578/
వంగిబాబ్దంబునను దక్షిణాయనమున జలధరర్తువు మొదలి మాసంబునందు
బహుళమున దేవకికిఁ జక్రపాణి పుట్టినట్టియష్టమి సమదేవ నధికభక్తిఁ'
(అప్ప. పీఠిక - 33)

క్రీ. శ. 1656 ఆగష్టు 4వ తేదీతో ఈతిథి సమానం

2. బాలసరస్వతీయ పీఠిక వావిళ్ళ - 1971.

శారంగధరుడనే కొడుకు గాని, రత్నాంగి, చిత్రాంగి అనే భార్యలు గాని లేరని ఇటీవలి పరిశోధకులు స్పష్టంగా సహేతుకంగా నిర్ణయించి ఉన్నారు[1].

అలాగే వేములవాడ భీమకవికీ, నన్నయకు సమకాలికత్వమే లేదని, వేములవాడ భీమకవి నన్నయకు తరువాత వందలఏండ్లకు గాని లేడని, కాగా ఆఇరువురి ఈర్ష్యాద్వేషాల కథ కేవలం పుక్కిటిపురాణమని వీరేశలింగంగారు తమ కవుల చరిత్రలో సకారణంగా నిరూపించారు. ఈవిషయాలమీద ఇతరప్రకరణాలలో ప్రసక్తి గలిగినపుడు విశేషంగా వివరాలు తెలిసికొందాం.

తరువాత పదహారో శతాబ్దిచివర ఉన్న బాలసరస్వతికీ, 17వ శతాబ్ది మధ్య భాగాన ఉన్న అప్పకవికీ దొరికిన చింతామణిలో అస్వల్పవ్యవధిలోనే అన్ని మార్పులు చేర్పులూ ఎలా ఎందుకు వచ్చాయో ప్రకరణాంతరంలో చర్చించి నిర్ణయిద్దాం

---

1 రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక - 'శారంగధరుడు' అనే వ్యాసం శ్రీయుత భావరాజు వెంకటకృష్ణారావు

2 చూ చింతామణి పాఠభేదాలు అనే ప్రకరణం

# బాలసరస్వతికి పూర్వం నన్నయకు లాక్షణికత్వం కలదా?

పదహారో శతాబ్ది నాల్గోపాదానికి చెందిన బాలసరస్వతి లోకానికి నన్నయ కృతంగా తనకొక ఆంధ్రవ్యాకరణగ్రంథం సంస్కృతభాషావిరచితం దొరికినదని చాటి చెప్పేవరకూ నన్నయ వ్యాకర్త కాడు—ఆంధ్రవాఙ్మయచరిత్రలో

నన్నయకు సమకాలికులు గాని, సన్నిహితకాలంలోని వారు గాని ఆయన్ని వ్యాకర్తగా చెప్పలేదు. ఆయనతరువాత కావ్యనిర్మాణానికి నడుంకట్టిన తెనుగుకవి ప్రతిఒక్కడూ, శైవకవుల్ని మినహాయిస్తే, ఆయన్ని స్తుతించినవాడే — దాదాపు. అయినపుడు ఆంధ్రభాషా వ్యాకరణరచన ఆయనచేతిలో జరిగిఉంటే, ఆమహాసంఘట నని వారు ఉపేక్షించి ఉండేవారు కాదు. పైగా ఆదికవిగా ఆయన్ని పొగడినట్లే, ఆదివ్యాకర్తగా సగర్వంగా పేర్కొని ఉండేవారు, కాని వారి వ్రాతల్లో ఎక్కడా ఆ ఛాయలు కనబడటం లేదు.

నన్నయకు తరువాత తెలుగులో వ్యాకరణరచన చేసిన కేతనాదులు నన్నయకు నమస్కరించినవారే. అయినా వారు గూడ నన్నయకు లాక్షణికత్వ మున్నదనలేదు. వారు నన్నయను స్మరించినతీరు గమనిద్దాం.

కేతన

'మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద వి
ద్వన్నికరము మది మెచ్చఁగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్ —(ఆం. భా. భూ. 8)

ఇక్కడ నన్నయభట్టాదులు కవులే గాని వ్యాకర్తలు గాదని వివరింప పనిలేదు,

## చిత్రకవి పెద్దన.

సంతసమునఁ ద్రిమూర్తులఁ ద్రిశక్తులఁ గొల్చి వినాయకద్వయి
న్నమలను జేర్చి వ్యాసుఁ బినంబున నుంచి కాళిదాసు వెం
బడి వెనుకొని తెనుఁగు భారతము సేసిన యట్టికవిత్రయంబు సం
స్తుతు లొనరించి యాఘనికి సారికవీంద్రపతిఁ నుతింతుదున్ —
(ల. సా. సా. 3–2)

చిత్రకవి నన్నయవంటి త్రిమూర్తుల్ని, వినాయకుని స్తుతించి, భారతాన్ని తెనుగు చేయడమే కవిత్రయం చేసిన పనిగా పేర్కొన్నాడు.

## ముద్దరాజు రామన :

'వినరించెద నన్నయ భ
ట్టనయజ్వ ప్రముఖ నిఖిల కవిసూక్తిమణీ
జని యగు కవిజనసంజీ
వని' యను లక్షణము సుకవివరులు నుతింపన్ — (కవి. సం. 1–4)

ముద్దరాజు రామన నన్నయాదుల రచనలు ఆధారంగా లక్షణం నిర్మిస్తా నంటున్నాడు.

పైన పేర్కొన్నవారు నన్నయతరువాత, 11వ శతాబ్ది నుండి 16వ శతాబ్ది వరకు ఆంధ్ర లక్షణవాఙ్మయాన్ని నిర్మించి సుప్రసిద్ధులైనవారు వారి కాలానికి నన్నయ లాక్షణికత్వ మున్నదని శంకించడానికైనా వీలులేని విధంగా వారి వ్రాత లున్నాయి.

అంటే ఎంతో శబ్దసముదాయాన్ని సంస్కృతమయమైనదానిని తెలుగులో ప్రవేశ పెట్టి వికాస చేశాడు కాబట్టి దాను విపులశబ్దశాసను డనని చెప్పుకున్నాడు. అది విరుద్ధ మని వాదించేవారు దానికి సమంజస్యం 'విపుల' శబ్దాన్ని ఎలా పరిహరిస్తారో చెప్పవలసి ఉంటుంది. నిరుపాధిక విశేషణాలు చేర్చబడిన పైగా బిరుదమే అయితే, తిక్కన తెలుగు కవుల అలవాటు ప్రకారం వది ఆశ్వాసాంత గద్యలలో చేర్చబడవలసి. కాని అది జరగలేదు.

విపుల శబ్దశాసన పదానికి వ్యాకర్త గా కాక, పైన వివరించిన అర్థాన్నే నన్నయ తరువాత వారు చేసినారన్నట్లు మనం పరిశీలించి తెలిసికోవచ్చు. కవిత్రయంలో ఒకడు, నన్నయకు సన్నిహితుడు ఎఱ్ఱన 'గాసట బీసటే చదివి గాథలు త్రిప్పుచు తెనుంగువారికిన్ వ్యాసమునిప్రణీత మైన భారతాన్ని అందింపాడంటూ[2] వ్యక్తం చేసిన భక్తిశ్రద్ధలు నన్నయ వ్యాకర్తృత్వాన్ని చూచి కాదు. తరువాత ఎఱ్ఱన అభిప్రాయాన్ని సుస్పష్టంగా ఆ విశేషణానికి ఇదే అర్థమని నిష్కర్షగా చెప్పినవాడు జక్కనామాత్యుడు.

## 'శబ్దశాసనవరేణ్యుఁడు'

'వేయి విధంబులం బొగడి పెద్దలు సుప్రబంధముల్
హాయిగ చెప్పిరెల్ల విసబంధుర భావ విభావరాము చే
రేయును శబ్దశాసన వరేణ్యులు నాఁగఁ బ్రసిద్ధి కెక్కరే
మేయెడ నన్నపార్యు గతి నిద్ధు నట్టి మహాత్ముఁ గొల్చెదన్[3]

జక్కన మాటతో నిర్ద్వంద్వంగా నన్నయకున్న 'శబ్దశాసన'ప్రసిద్ధి భారత రచన వలననే అని తేలింది. ఇక్కడి జక్కన కాలానికి 'విపుల' శబ్దం ఆ

---

1. ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబయిన శ్రీమహాభారతంబునం దాది పర్వంబున ననుక్రమణికయును పౌష్యోదంక మాహాత్మ్యంబును భృగువంశ కీర్తనంబు నన్నది ప్రథమాశ్వాసము.

2. నృ. పు. పీఠిక – 9.

3. విక్రమార్కచరిత్ర పీఠిక

సమాసంనుండి తొలగించ బడినట్లు గ్రహించవచ్చు. ఆశబ్దభ్రంశం వలననే ఆవొక బిరుదమని అనంతర కాలికులు భ్రమపడడానికి అవకాశం ఏర్పడినది.

ఇక్కడ జక్కనకాలానికి (15వ శతాబ్దికి) ఆంధ్రశబ్ద చింతామణి ప్రశస్తి, ప్రసిద్ధి తగ్గడం వలన, జక్కన అలా చెప్పాడని శ్రీవజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి అన్నారు[1]. కాని జక్కనకు పూర్వం చింతామణి ఉనికే సందేహాస్పద దాని ప్రచారం తగ్గట మనేది నిరాధార—ఊహ.

బాలసరస్వతికి పూర్వం నన్నయను 'శబ్దశాసనవరేణ్యు' లన్నవారిలో ప్రథముడు జక్కన. కాని కారణం మాత్రం వ్యాకరణరచన కాదని స్పష్టపరిచాము. 'శబ్దశాసన అని కాక, దానికి మరొక విశేషణం 'వరేణ్య శబ్దం తగిలించాడు కాబట్టి, దాన్ని బిరుదంగా అతడు గ్రహించాడని అనలేము — బిరుదాలకు ముందు వెనుక ఇతరశబ్దాల జోడింపు ఉండదు.

## 'శబ్దశాసన కావ్య సంఘట్టనం'

జక్కన తరువాత ఆంధ్రకవి రామయ్య (క్రీ.శ. 1500 ప్రాంతం) తన విష్ణు కాంచీ మహాత్మ్య కావ్య పీఠికలో 'శబ్దశాసనకావ్య సంఘట్టన క్రమానందిత బుధవర్యు నన్నపార్యు' అని నన్నయకు శబ్దశాసన శబ్దానికి సంబంధం చెప్పాడు. కాని ఇక్కడ ఈయన అభిప్రాయ మేమిటో సరిగా తెలియరావడం లేదు. పై పద్య పాదానికి, శబ్దశాసన మనే కావ్యనిర్మాణంతో ఆనందితులయిన బుధవర్యులు గల నన్నయ అని అర్థం వస్తుంది. దీన్నిబట్టి శబ్దశాసన మనే కావ్యమొకటి వ్రాసి నన్నయ బుధుల కానందం కలిగించాడని కవిభావమా ? ఏమైనా ఇక్కడ కొంత ఊహాకు అవకాశ ముంది. లేకపోతే, శబ్దశాసనంవలన, కావ్యసంఘట్టనంవలన ఆనందితులయిన బుధులు గలవాడని ఎట్లో సమర్థించవచ్చు. కాని అప్పుడైనా, శబ్దశాసన మేమిటి ? ఏ కావ్యసంఘట్టనం ? అనే ప్రశ్నలు సమాధానాలు లేక మిగిలిపోతాయి.

---

1. చిం. విష. లో 8వ పుట

### శబ్దశాసన బిరుదున్

అతని తరువాత, కాకమాని గంగాధరకవి తన బాలభారతంలో —

శబ్దార్థ ఏసవిశారదు
శాబ్దిక మూర్ధన్య శబ్దశాసన బిరుమన్
శబ్దాయమాన విస్ఫుర
దబ్ధిఘుమారభటి నన్నపార్యుఁ దలంతున్ — (పీఠిక.)

అని నన్నయను పొగిడినాడు. చారిత్రకంగా మొట్టమొదట శబ్దశాసన శబ్దాన్ని బిరుదంగా ప్రయోగించిన వాడు ఇతడే.

### వాగనుశాసనుండు

తరువాత రామరాజభూషణుడు శ్లేషగర్భంగా రచన సాగించదలచి శబ్దశాసన పదాన్ని వాక్ + అనుశాసన అన్నట్లు మార్చి ప్రయోగించాడు. శబ్దశాసన ఎందుకంటె, వాగనుశాసన పదం వ్యాకర్తృత్వ కిధకు సహకారిగా ముందుకాలంలో ఉండగలదని తెలిసి ఆతడట్లు మార్చలేము గాని జరిగినది మాత్రం అంతే.

'మహా మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు ద
స్మహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు పాటించు స
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్
(వసు. - 1.)

రామరాజభూషణునికి సన్నిహితకాలంలోని వాడు మన బాలసరస్వతి. రామరాజభూషణుడు తెలుగుకవిత్వం నన్నయ సృజించాడంటే తాను (బాలసరస్వతి) తెలుగు వ్యాకరణాన్నే సంస్కృతభాషలో సృజించి పోయాడని చాటాడు

కాగా పై పరిశీలననుబట్టి నన్నయ వ్యాకర్త అయి ఉంటాడనే భ్రాంతి మొదట లేదని మధ్యకాలంలో కలిగినదని, ఆ భ్రాంతికి మూలం 'శబ్దశాసన' పదం, దాని పర్యాయంగా ఏర్పడిన 'వాగనుశాసన' శబ్దమని తెలిసికోగలిగాం.

వ్యాకర్త కావడం వలననే 'శబ్దశాసనుడు', 'వాగనుశాసనుడు' అయి ఉంటాడని బాలసరస్వతికి తరువాత, పండితులు చరిత్రజ్ఞానం చాలక నమ్మవలసినవారైనారు. రామరాజభూషణుడు గాని, తత్పూర్వుడు కాకమాని గంగాధరుడు గాని, నన్నయను వ్యాకర్తగా చెప్పలేదు. గంగాధరకవి కాలానికి నన్నయ సొంతపద్యంలోని మాటనే దాని మొదటి విశేషణాన్ని తొలగించి బిరుదంగా కొందరు సామాన్య పండితులు భావించి ఉండవచ్చు. రామరాజభూషణుడు శ్లేషగర్భంగా వ్రాస్తూ ఆమాటకే 'వాగనుశాసనుడ నేపర్యాయాన్ని సృష్టించాడు. వీరిరువురకీ ఆంధ్రశబ్ద చింతామణి గాని, అసలు ఒకవ్యాకరణంగాని నన్నయ చేశాడనే అభిప్రాయం లేదు. జక్కనాదులవలె అతనిభారతరచనే అతనిశబ్దశాసనత్వానికి హేతువని వారనుకొని ఉండవచ్చు.

చరిత్రజ్ఞానం చాలని, శాస్త్రీయ దృక్పథం కొరవడిన కాలంలో అంటే, వీరేశలింగంగారికి పూర్వం గణపవరపు వేంకటపతికవికి తరువాతి కాలంలో కొందరు పండితులు చింతామణిని నన్నయకృతంగా నమ్మడం జరిగింది. దానికి పూర్వం అడిదము సూరకవి తన లక్షణగ్రంథంలో చింతామణి రచనావిధానం మీద ఒక విమర్శ చేశాడే కాని[1] చింతామణిని నన్నయకృతంగా చెప్పలేదు. కాని కూచిమంచి తిమ్మకవి తనసర్వలక్షణసారసంగ్రహంలో చింతామణిలోని సూత్రాలు కొన్ని యథాతథంగా ఉటంకిస్తూ వ్యాఖ్యానించి మరికొన్ని శ్లోకాల తాత్పర్యాలను పద్యాలలో నిబంధించిచూపాడు. అంతేకాకుండ సూత్రాలను ఒసగినపుడు వాటిక్రింద, అవి శబ్దశాసన సూత్రాలైనట్లు వ్రాశాడు. అంటే బాలసరస్వతి వేసిన బీజం కూచిమంచి తిమ్మకవి

---

1. ఆంధ్ర మర్మంబు దెలియంగ ననువు పడునె ప్రకట సంస్కృతరచిత సూత్రములచేత
సవని బాణినిఘటిత సూత్రార్థసరణి తెనుగుటీకలచేత సాధింప నగునె?—
(కవి సం వి 1 – 5)

కాలానికి అంకురించిన దన్నమాట. అయినా గణపవరపు వెంకటపతికవి (18వ శతాబ్ది) నన్నయను వ్యాకర్తగా పేర్కొనినట్లు ఆంధ్రకౌముదీ రచనావిధానాన్ని బట్టి నిర్ణయించలేము[1].

ఇక 19వ శతాబ్దినాటి ఒకరిద్దరు పండితుల సమ్మతికి తప్పితే నన్నయ బిరుదాలుగా శబ్దశాసన, వాగనుశాసన శబ్దాలు ప్రసిద్ధమై ఉండటం ఒక కారణం కావచ్చు అంతకంటె బలీయమైన కారణం అప్పకవి సృష్టించిన సారంగధరుని కథ. నిజానికి రాజరాజనరేంద్రునికి సారంగధరుడనే కొడుకు గాని, రత్నాంగి, చిత్రాంగి అనే భార్యలు గాని లేరని చరిత్రపరిశోధకులు తేల్చిచెప్పారు[2]. అయితే ఆ చెప్పడం నిన్నమొన్న జరిగింది. అంతకు పూర్వం పండితులు అప్పకవి కథను యథార్థంగానే నమ్మారని అనుకోవాలి. కాబట్టే పరవస్తు చిన్నయసూరి బహుజనపల్లి సీతారామాచార్యులు మొదలైన ఆధునిక వ్యాకర్తలు నన్నయను చింతామణికర్తగా తమకాలానికి ఏర్పడి ఉన్న ప్రసిద్ధి ననుసరించి ఆమోదించారని భావించవచ్చు వారినిబట్టి ఇతరులు కొందరు అన్యవిషయాలలో అఖండ ప్రజ్ఞాప్రాభవాలు కలవారు కూడ హేతుపురస్సరంగా తప్ప కేవలవిశ్వాసాలను ఆమోదించనివారు కూడ నన్నయను వ్యాకర్తగా పేర్కొన్నారు అట్టివారిలో కట్టమంచి రామలింగారెడ్డి గారొకరు[3].

పైపరిశీలనం వలన పనిగట్టుకొని చింతామణి నన్నయకృతమని మొదట లోకానికి చాటిన బాలసరస్వతి ఆతనివలెనే చింతామణి వ్యాఖ్యానంద్వారా కీర్తి ప్రతిష్ఠల్ని కాంక్షించిన అప్పకవ్యాదులూ తప్ప ప్రాచీన–ఆంధ్రవైయాకరణులు, ఈ చింతామణి వృత్తాంతాన్ని బొత్తిగా ఎరుగరనీ అర్వాచీనులు అంటే బాలసరస్వతికి తరువాతివారు ఒక్క కూచిమంచి తిమ్మకవి తప్ప, గణపవరపు వెంకటపతివరకు ఉన్నవారు, బొత్తిగా పట్టించుకోలేదనీ నిశ్చయించవచ్చు. ఎటొచ్చీ 19వశతాబ్దిలోనే

---

1. చూ. అనంతర వ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం అనే ప్రకరణం.

2 రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక – భావరాజు వెంకటకృష్ణారావుగారి వ్యాసం

3 ఆంధ్ర భాషానుశాసన పీఠిక.

తెలుగుపండితులు ఆంధ్రశబ్దచింతామణి తెలుగుకి తొలి వ్యాకరణమని, నన్నయ, ఆది కవివలెనే ఆదివ్యాకర్త గూడ అనీ, కేవలం అప్పకవికథ ఆధారంగా నమ్మారని గూడ నిర్ణయంచేయవచ్చు.

ఈ సందర్భంలోనే గమనించ దగిన మరొక విశేషమేమిటంటే 19వశతాబ్దికి పూర్వం ఈచింతామణి నన్నయ్యల కథ గాని, చింతామణిలోని సంజ్ఞలు, పరిభాషలు, ప్రక్రియా విధానం గాని తెలుగు వైయాకరుణులెవరికీ అక్కరపడలేదని, అంటే చింతామణిఉనికిని వారు ఉపేక్షించారని గుర్తించగలగడం. ఈవిషయం ముమ్ముందు సవివరంగా నిరూపిస్తాను.

# చింతామణి కర్తృత్వం - వీరేశలింగంగారికి ముందు వెనుక

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో చింతామణికి కర్త నన్నయ్య అనే విషయం వివాదాస్పదం కావడం, కందుకూరి వీరేశలింగంగారి కవులచరిత్రతో ప్రారంభమైంది. ఆయనకు ముందు పండితులలో తమ పూర్వులనుంచి తమకందించబడిన అభిప్రాయాలు అన్నీ సత్యాలే అని నమ్మే అలవాటు ఉండేది. నిజం చెప్పాలంటే వారిలో చాలమందికి చారిత్రకదృష్టిగాని శాస్త్రీయమైన ఆలోచనాధోరణి గాని మృగ్యంగా ఉండేది. కాబట్టి చింతామణి కర్తృత్వ విషయమై వివాదం తమకు తరువాత ఏర్పడుతుందని గూడ వారికి తోచి ఉండదు. బాలసరస్వతిని అప్పకవిని అహోబలపతిని నమ్మకుండా ఉండడం ఎందుకో ? వారి ఆప్తత్వానికి ("ఆప్తవాక్యం ప్రమాణం") హాని ఎట్లు జరిగిందో వారు ఆలోచించలేరు. ప్రాచీనులు చేసి వదలిన పాతవివాదాలు, సాధు, శకటరేఫలకు చెందినవి కొనసాగించడమంటే వారెరుగుదురు గాని కొత్తగా ఒక మౌలికమైన వివాదాన్ని సంప్రదాయానికి భిన్నంగా లేవదీయడం వారి శక్తికీ, అభ్యాసానికీ మించినపని కాబట్టే వీరేశలింగంగారికి ముందున్న పండితప్రకాండులందరూ చింతామణి కర్తృత్వాన్ని యథాస్థితంగా అంగీకరించి ఊరుకున్నారు.

19వశతాబ్ది ప్రారంభంలో ప్రసిద్ధపండితుడై ఈస్టిండియాకంపెనీ వారిఫోర్టు సెంట్ జార్జి కళాశాలలో ప్రథమ సంస్కృతఆంధ్ర ఉపాధ్యాయుడుగా పనిచేసిన శ్రీవేదము పట్టాభిరామశాస్త్రి తమ ఆంధ్రవ్యాకరణము లేక పట్టాభిరామ పండితీయములో చింతామణి నన్నయకృతమని సంప్రదాయవాదాన్ని అంగీకరించారు[1]. ఆయన చేసిన ఆవ్యాకరణం కేవలం చింతామణికి భాషాంతరీకరణమే.

కాలక్రమాన్ని బట్టి చూస్తే పైపండితుని తరువాత శ్రీరావిపాటి గురుమూర్తి శాస్త్రి పేర్కొనవలసినవారు. ఆయన 'తెలుగువ్యాకరణము' అనే పేరుతో పట్టాభిరామపండితీయం కంటె విపులమైన వ్యాకరణాన్ని వచనంలో వ్రాశారు. [illegible]

---

1. పట్టాభి. పం 7



చింతామణిమార్గాన్ని ఉగ్గడిస్తూ దాన్ని నన్నయభట్టుమతంగా పేర్కొన్నారు[1]. కాబట్టి చింతామణి కర్తృత్వశంక ఆయనకు లేనట్లే.

తరువాతివాడుగా కాలాన్నిబట్టి లెక్కించదగినవాడు చిన్నయసూరి. ఈయన కూడా తనకాలానికి ఇంకా వివాదాస్పదంకాని చింతామణికర్తృత్వాన్ని తన పూర్వుల లాగానే అంగీకరించారు[2]

సూరి తరువాతివాడు, అతని శిష్యకోటికిచెందినవాడు బహుజనపల్లి సీతారామా చార్యులు. ఈయన గూడ పైసంప్రదాయాన్నే మన్నించి చింతామణికి కర్తగా నన్న యనే అంగీకరించారు[3]

సూరికి సమకాలికుడు, లఘువ్యాకరణానికి కర్త అయిన శ్రీవేదం వేంకట రమణశాస్త్రి చింతామణి ఆధారంగానే వ్యాకరణరచన చేసినవాడు. అదేవిధంగా పుదూరి సీతారామశాస్త్రి ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణానికి కర్త. ఈయన కూడ చింతా మణికి అనువక్త. — వీరు చింతామణి కర్తృత్వవిషయమై శంకారహితంగా అది నన్నయకృతమే అని భావించినవారు.

వీరివలెనే పద్యాంధ్రవ్యాకరణకర్త శ్రీమల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, తెలుగు వ్యాకరణకర్త శ్రీబులుసు పాపయ్యశాస్త్రి, ఆంధ్రవ్యాకరణకర్త శ్రీశృంగారకవి వెంకటరామయ్య, ఆంధ్రవ్యాకరణకర్త శ్రీతాడికొండ వెంకయ్య, ఆంధ్రవ్యాకరణ సంగ్రహకర్త శ్రీఅబ్బాయి నాయుడు, తెలుగువ్యాకరణకర్త శ్రీర్యాలి సుబ్బారావు

---

1 అక్షర లక్షణ ప్రకరణం 6 వ పేరా

2 బాలవ్యా. సంధి. 18.

3. త్రిలింగ శే సంజ్ఞా 7.

మొదలైనవారు దాదాపు సూరికిసమకాలికులుగా జీవించినవారు అందరూ చింతామణిని నన్నయకర్తృకంగానే భావించారని చెప్పవచ్చు.

## వీరేశలింగంగారు

ఇక వీరేశలింగంగారు మొదలుపెట్టిన చింతామణి కర్తృత్వ వివాదానికి వారు చూపినకారణాల్లో ప్రధానాంశాలు ఇవి కనుపిస్తున్నాయి

1. అధర్వణుడు నిశ్చయంగా నన్నయకు తరువాతివాడు. కాగా అతని పేరు 'సుమ్నోతో హ్యథర్వణాచార్య మతాత్' అనే చింతామణి సూత్రంలో గ్రథితమై ఉండడం పొసగదు.

2. అధర్వణ కృతమని చెప్పబడే వికృతివివేకంలోని 'అప్రయుక్తత్వ దోషస్తు న విరుద్ధో హరేర్మతే అనే కారికనుబట్టి (హరికారికావళి శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారిది. ఆయన చిన్నయసూరికి సమకాలికుడు.) హరికారికావళి వికృతివివేకం కంటె ప్రాచీనము పైన చూపిన కారణాన్ని బట్టి వికృతివివేకం చింతామణికంటె ప్రాచీనము, కావలసి ఉంది. అది పొసగని మాట.

3 నిస్సందేహంగా కాలం కర్తృత్వం తెలిసిన కేతన తానే తెలుగుకి ప్రథమ వ్యాకర్తనని చెప్పాడు[1].

4. 11వ శతాబ్దిలో రచితమైన గ్రంథం 18వ శతాబ్దిదాకా (బాలసరస్వతి కాలం) ఒక వ్యక్తి ముఖంలో (సారంగధరుడు) జీవిస్తూ అంతర్హితంగా ఉండడం అబద్ధం, అసంభవం కూడ అది ఒక్క బాలసరస్వతికే దొరకడం విశ్వాసార్హం కాదు. ఏదో పూర్వరంగ ముండాలి

5. తెలుగునాట సారంగధరుడు లేడు. రత్నాంగి చిత్రాంగులు కూడ లేరు.

---

1 ఆం. భా. భూ 8 నుండి 18 వరకు

6. వేములవాడభీమకవి నన్నయకు తరువాతివాడు. కాగా అతడు నన్నయ వ్రాసిన చింతామణిని గోదావరిలో కలపడం కల్ల.

7. భారతంలో పదాదిలో యకారం లేదు[1].

8. చింతామణి లక్షణానికి విరుద్ధంగా నన్నయ భారతంలో ప్రయోగాలున్నాయి

9. కేతన, పెద్దనలు తమ వ్యాకరణాల్లో వర్తమాన భవిష్యదర్థక క్రియల్ని నిర్ధనుబంధాలుగా సూత్రిస్తే, చింతామణి వాటిని సానుబంధా లంటుంది[3]

10. ఆంధ్రకౌముదీ కర్త ప్రాచీన వ్యాకర్తల పేర్లు తనసంస్కృత వ్యాకరణంలో పేర్కొంటూ చింతామణిని స్మరించనేలేదు.

11. త్రిలింగశబ్దానుశాసన కర్త కూడ తన వ్యాకరణ—ఉపక్రమణికలో ఇచ్చిన వ్యాకరణాల పంక్తిలో చింతామణిలేదు.

12. పూర్వమే కవిభల్లటాదుల వ్యాకరణాలున్నా యని చింతామణి సూత్రించింది[4]. కాగా చింతామణి మొదటి వ్యాకరణం కాజాలదు కవిభల్లటుడు నన్నయకు చాల కాలం తరువాతివాడు.

13. నన్నయకున్న శబ్దానుశాసనత్వం అతని భారతరచనవల్లనే గాని, వ్యాకరణరచనవల్ల కాదు; సాక్ష్యం జక్కనపద్యం[5].

---

1. చింతామణి ఉన్నదని చెబుతుంది. (సంజ్ఞా - 20.)

2 చింతా. సంధి – 4.; భారతం 3-2-103

3. చింతా క్రియా. 11, 12. సూ.

4. పైది హలంత 23.

5. విక్రమార్కచరిత్ర. పీఠిక.

14. చింతామణి పరిచ్ఛేదాంత గద్యాలలో నన్నయ సకల భాషా వాగను శాసనుడు గా పేర్కొనబడడం పొసగదు. అతడు సకలభాషా వ్యాకరణాలకు కర్త అనడం కల్ల గదా!

15. చింతామణి ప్రాచీన కృతులు రెంటిలోను అంత స్వల్పకాలంలో అంతగా పారభేదాలుండడం అదేదో కూటసృష్టిగా తెల్పుతుంది.

పై అంశాల్ని పురస్కరించుకొని ఆయన చింతామణి నన్నయకృతం కాదని, దానిని బహుశః బాలసరస్వతి చేసి, గ్రంథగౌరవ సంపాదనంకోసం కథ సృష్టిస్తే, దాన్ని అప్పకవి పెంచి పెద్ద చేశాడు—అని ప్రతిపాదించారు

కందుకూరి వీరేశలింగంగారికి స్వభావసిద్ధంగా ఉన్న శాస్త్రీయదృక్పథమే వారిని చింతామణికర్తృత్వ విషయంలో సంప్రదాయంతో ఏకీభవించనివ్వలేదు—అని భావించవచ్చు. ఇతరక్షేత్రాల్లో లాగానే ఇక్కడ కూడ ఆయన సంప్రదాయానికి ఎదురొడ్డి నిలువవలసిన వాడే అయ్యాడు. అయినా అనతి కాలంలోనే ఆయనవాదంలోని యాథార్థ్యాన్ని కొందరు నవీనులు గ్రహించి బలపరిచారు. వారిలో సర్వశ్రీ చిలుకూరి నారాయణరావు చాగంటి శేషయ్య, వడ్లమూడి గోపాలక్రిష్ణయ్య, మొదలయినవారున్నారు.

## చిలుకూరి నారాయణరావుగారు :

చిలుకూరి నారాయణరావుగారు తమ 'ఆంధ్రభాషాచరిత్ర'కు అనుబంధించిన చింతామణి హృదయము అనే ప్రత్యేక విభాగంలో చింతామణి ఒక ఉత్కృష్టరచన కాదని పేర్కొంటూ దాని కర్తృత్వ విషయమై ప్రతిపాదించిన అంశాలసారమిది ·

బాలసరస్వతికి పూర్వం, గ్రంథం ఉనికికి ఆధారంలేదు

---

1. బాలసరస్వతీయం అప్పకవీయం.

2. బాలసరస్వతీయంలో కారికలు ఉదాహరించబడ్డాయి. కాబట్టి ఆథర్వణ కారికలు బాలసరస్వతికి పూర్వం ఉన్నవే.

3. ఆథర్వణకారికావళి చింతామణిని సంస్కరించడానికి, పూరించడానికి పుట్టినగ్రంథం. కాగా కారికావళికి పూర్వం చింతామణి ఉంది.

4. తిక్కనకు సమకాలికుడు కేతనకు తెలియని చింతామణి ఉనికి సందేహాస్పదం.

5. వీరేశలింగంగారు, నన్నయ ప్రయోగాలకు చింతామణి సూత్రాలకు విరోధముందని చూపిన సందర్భంలో అలాంటి విరోధం కనిపించదు. కాని నన్నయ ప్రయోగాలు చింతామణి సాధ్యాలు కావు. చింతామణినిష్పన్న రూపాలు నన్నయలో గాని, ఆకాలం శాసనాల్లోగాని లేవు.

6. చింతామణి తత్సమరూప సాధనమాత్ర ప్రవణమనడం నిజం కాదు.

7. చింతామణికి పూర్వం వ్యాకరణాలుండేవని దానిలోని 'అన్య వ్యాకరణ స్పష్టాః', 'కేచిత్ విదుః', 'ఇష్యతే' వంటి పదాలు తెలుపుతున్నాయి.

8. 'కొఱకున్' అనే చతుర్థీవిభక్తి ప్రత్యయం చింతామణి ప్రతిపాదించినది. దానిలో నన్నయకాలానికి 'కున్' మాత్రమే ప్రత్యయం.

9. చింతామణిలోని లిప్యుద్ధారక శ్లోకాల్నిబట్టి చింతామణి కాలాన్ని నిర్ణయించ బూనడం కేవలం హాస్యాస్పదం. ఆలిపి నన్నయ వేయించిన నందంపూడి శాసనంలో కనుపించదు.

నారాయణరావుగారి పై ప్రతిపాదనలలో చింతామణి కర్తృత్వాన్ని ప్రశ్నించే బలమైన కారణాలు అనేకం ఉన్నాయి. ఇక ఈవిషయమై కవితరంగిణీకారులు చాగంటి శేషయ్యగారు ఏమన్నారో చూద్దాం.

*వా గం టి శే ష య్య గా రు :*

1. ఎవ్వరూ ఎరుగనంతమాత్రాన చింతామణి నన్నయకృతం కాదనలేము. ఇటీవల నన్నెచోడుని కుమారసంభవం బహిర్గతమైతే దాని కర్తృత్వాన్ని ఎవరూ శంకించడం లేదు. చింతామణికథ పేరు. అది దొరికినట్లు చెప్పబడిన కథ బొత్తిగా విశ్వాసార్హంగా లేదు.

2 కేవలం 18 సంవత్సరాల వ్యవధిలో చింతామణికి ప్రాచీనప్రతులు రెంటిలోను అంతగా పాఠభేదాలు కల్పితం కావడం, చింతామణిలోని శ్లోకాలు మార్చబడటం దాని కర్తృత్వశంకను గట్టిపరుస్తున్నాయి. నన్నయకర్తృకత్వానికి భంజకంగా ఉన్నాయని, అప్పకవీయ చింతామణిలో కనిపించే ముగ్గురు ప్రాచీన వ్యాకర్తల పేర్లు[1], బాలసరస్వతీయ చింతామణిలో అనంతరకాలికులచేత తొలగించబడ్డాయి. చింతామణి పాఠాల విషయంలో అప్పకవీయం మార్పుకు లొంగనిదిగా ఉన్నది. బాలసరస్వతీయంలోని పాఠాలు సులభంగా మార్పుకు లోనౌతాయి.

3. చింతామణి సూత్రాలకు భారత ప్రయోగాలకు విరోధముంది.

4. ధాతుకర్త నన్నయ కాక, ఇతరు డెవడైనా ఆపేరు గలవాడు చింతామణికి కర్త అయి ఉండవచ్చు.

పై ప్రతిపాదనలలో కూడ యాథార్థ్యం అధికంగా ఉంది. ముఖ్యంగా ప్రాచీన వ్యాకర్తల పేర్లు చింతామణి నుండి తొలగించబడడమనేది నిజమే. హేమచంద్ర, త్రివిక్రముల ప్రాకృతవ్యాకరణ పరిభాషలు చింతామణిలో పుష్కలంగా స్వీకరించబడ్డాయి. ఈ విషయమై రానున్న ప్రకరణంలో[2] వివరించడం జరిగింది.

---

1. అధర్వణ హేమచంద్ర త్రివిక్రములు.

2 'చింతామణిలో ప్రాకృతవ్యాకరణానుకరణం.'

### వ ఠ్ల మూ డి గో పా ల కృ ష్ణ య్యగా రు

ఇక వఠ్లమూడి గోపాలక్రిష్ణయ్యగారు తమ 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష అనే గ్రంథంలో 'అద్యః క్రియాస్విత్యాది సూత్రాన్ని బట్టి చింతామణి కాలం 11వ శతాబ్దిగా గాక 16వశతాబ్దిగా మాత్రమే నిర్ణయించవలసి ఉంటుందని పదపరిణామ చరిత్రను బట్టి సోదాహరణంగా చర్చించి నిరూపించారు.

పైనపేర్కొన్న పండితులే గాక ఇతరులు కూడ చాలమంది చింతామణికి కర్త నన్నయ కాదని ఆయా గ్రంథాల పీఠికలలో, వ్యాసాలలో వ్రాసినవారు న్నారు. అట్టి వ్రాతలు కొన్ని మచ్చుకి గమనిద్దాం.

### శ్రీ పా ద ల క్ష్మీ ప తి శా స్త్రి గా రు

ఆంధ్రభాషాభూషణపీఠికలో[1] శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు చింతామణిలోని 'హ్రస్వాత్ పూర్ణోపి భవేత్ దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ స జ్ఞేయః, అనే సూత్రాన్ని ఆధారంగా తీసుకొని చింతామణి ఆంధ్రభాషాభూషణం తరువాతిదన్నారు. క్రమపరిణామంలో పూర్ణబిందుక శబ్దానికి ఉచ్చారణ భ్రంశమేర్పడి అర్ధబిందుకత కల్గుతుందే గాని అర్ధబిందువు పూర్ణబిందువు కాదు. కేతన పూర్ణబిందువు అర్ధబిందువగునంటే చింతామణి తద్విరుద్ధంగా అర్ధం పూర్ణ మవుతుందని చూపింది — అని వారి ప్రతిపాదనం.

### సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు

ఇదేవిధంగా సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తమ తత్సమచంద్రికకు తామే వ్రాసిన పీఠికలో చింతామణిని లక్షణంగా ముందు వ్రాసి భారతాన్ని దాని

1. వావిళ్ళ 1949.

2. 'ఉటుచల తుది హల్లులకున్ బెటుదన్ పెలకొన్నయట్టి బిందువులెల్లన్
నెఱయఁగ మాదుదుఁ దేఁటు నొఱపై యరదెఱఁగుఁ జెల్లుమండుం గృతులన్.
— ఆం. భా. భూ.

లక్ష్యంగా 'తిరికూర్చొని తరువాత వ్రాశాడనడం విశ్వసనీయం కాదు — అని ప్రతిపాదించారు

'చింతామణి విషయ పరిశోధనమునకు అనుబంధించిన విశ్వవిద్యాలయ ప్రశ్నపత్రాలు, వాటికి శాస్త్రిగారు ఆక్షేపణ తెలుపుతూ వ్రాసిన వ్రాత గమనిస్తే మొన్న మొన్నటివరకు చింతామణి నన్నయకర్తృకమనడం విచారాసహమైన విషయంగా, నవీనపండితులు పలువురు భావించేవారని తెలిసికోవచ్చు.

వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారికి సమకాలంలో చింతామణి నన్నయకృతం కాదంటూ వచ్చిన విమర్శలు, ఆయన వ్రాసిన చింతామణివిషయపరిశోధనము అనే పుస్తకంలో ఖండితాలై చింతామణి కర్తృత్వం, కాలం నిర్ణీతప్రాయంగా నిరూపించబడినాయని చాలమంది సామాన్య పండితుల భావం. కాని ఆ పరిశోధనం, ముందుగా మనసులో చేసికొన్న ఒక నిర్ణయాన్ని ఏవిధంగానైనా వాదించి నెగ్గించి తీరాలనే పట్టుదలతో సాగినదే గాని నిష్పాక్షికంగా జరిగినది కాదని అది చదివి చూస్తే ఎవరికైనా తోస్తుంది. చాగంటి శేషయ్యగారు కూడ ఆపుస్తకం మీద 'శ్రీశాస్త్రులవారు బాలసరస్వత్యప్పకవులు అథర్వణోక్తులను ఉదాహరించిరని విశ్వసించి దానిపై ఆధారపడి చింతామణివిషయపరిశోధనమున వ్రాసిన వాక్యములను నిరాధారములని ఎంచదగి యున్నది అని తమ అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు.

అయినా చింతామణి విషయపరిశోధనం, బహుకాలం లోకంలో వ్యాప్తమై ఉండడం వలన దానిలోని శాస్త్రిగారిప్రతిపాదనలు మొత్తంగా ఏఒక్కరిచేత, ఎక్కడా విమర్శించబడి ఉండక పోవడంవలన చింతామణి విషయపరిశోధన శోధనం చేయవలసి వచ్చింది.

# ఆంధ్రశబ్ద చింతామణి విషయపరిశోధన శోధనం

ఆంధ్రశబ్ద చింతామణిపై విశేషపరిశ్రమ చేసి ఆగ్రంధం తప్పనిసరి నన్నయకృతమే అని నిర్ణయించుకొన్నవారు శ్రీవజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రి గారు. చింతామణినిగూర్చి తనకాలంలో తనకుపూర్వకాలంలో వచ్చిన సన్విమర్శలకు సమాధానంగా ఆయన దాన్ని రచించారు. ఆగ్రంధరచనతోనే చింతామణి కర్తృత్వం, కాలం నిర్ణయించబడ్డాయి —వాఙ్మయచరిత్రలో, అని తలచేవారు నేడు ఆంధ్రపండితలోకంలో ఉన్నారు. ఆపరిశోధనలో వారు 16 విషయాలను ప్రతిపాదించారు. 250 పుటలకు మించని ఆగ్రంథంలో 156విషయాలపై విమర్శ చేశారంటే ఆవిమర్శ బహుక్లుప్తంగా ప్రతిపద ప్రత్యక్షక ప్రామాణ్యంతో ఉంటుందనుకోవాలి. కాబట్టి ఆపరిశోధనను గూర్చిన శోధనం గూడ ప్రస్తుత సమీక్షా వ్యాసానికి ఉపశ్లిష్ట కర్తవ్యంగా అవుతున్నది.

'చింతామణి నన్నయభట్ట విరచితమే అన్న విషయాన్ని శ్రీశాస్త్రి ఒకట్రెండ్రేఖలో నిర్ణయించేశారు. నిర్ణయానికి వారు చూపిన ఉపపత్తి—చింతామణి రచన వల్లనే నన్నయకు శబ్దశాసనబిరుదం లభించినదని.

నన్నయకు ఉన్నదని వీరనుకునే శబ్దశాసనబిరుదం సందేహాస్పదం. నన్నయ తన భారత పీఠికలో తనను ప్రథమపురుషలో పరిచయం చేసికొంటూ 'విపులశబ్దశాసను'[1] అన్నాడేకాని, శబ్దశాసనుడ'నలేదు విపుల అనే విశేషణంతో ఆపదం బిరుదంగా పొసగడం లేదు ఆపద్యంలో ఆవిశేషణం బిరుదమని భ్రమించడానికి గూడ వీలులేదు.

15వ శతాబ్దిలోని జక్కనకవి తన విక్రమార్కచరిత్రలో నన్నయను శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కినట్లు నుతించాడు నన్నయకు శబ్దశాసన ప్రసిద్ధి ఉండేదనడానికిజక్కనమాటే ప్రథమనిదర్శనం — వాఙ్మయంలో. ఎయితే

---

1. ఆది – 1 — 9.

జక్కనకిచ్చినంత ప్రచారం శబ్దశాసనప్రసిద్ధి (బిరుదంతాదు) వ్యాకరణరచనవల్లకలుగ లేదు. అది అతని భారతరచనా మాత్రంవల్ల కలిగినది. ఒకప్రసిద్ధి ఉన్నదని స్వప్రశంస అతనినుండి గ్రహించి దాని కారణాన్ని మాత్రం త్యజించడం సబబుకాదు.

పైగా చింతామణి రచనవల్లనే నన్నయ శబ్దశాసను డయ్యాడనడం కేవలం ఊహ. అది నిజమే అయితే తనకుల బ్రాహ్మణు నిత్యాది పద్యంలో చింతామణి రచన చెప్పబడి ఉండేది — అది ఒక మహా సంఘటన కాబట్టి. బాలసరస్వతి కాలానికి వెలుగు చూచిన చింతామణికి, జక్కనకాలానికేఉన్న శబ్దశాసనపరేణ్య ప్రసిద్ధికి సంబంధాన్ని, జక్కనమాటను కాదని పర్వాతివారు ఏర్పరచడం అంగీకరించతగ్గ విషయం గాదు. వీరేశలింగంగారికి పూర్వం వరకూ వాఙ్మయచరిత్రకూ, పుక్కిటి పురాణాలకు భేదం పాటించని పండితపరంపర అప్పకవికథను అక్షరశః నమ్మిచేసిన ఈ కల్పనను యథార్థమనుకోవడమెలా

చింతామణివల్లనే శబ్దశాసనబిరుద ప్రాప్తి అని నన్నయనుంచి చిన్నయవరకు ఎవరూ ఎక్కడా అనలేదు. నన్నయను చిన్నయ వాగనుశాసనుఁ డన్నాడు; అతనికి పూర్వం రామరాజభూషణుడన్నాడట, అతనికి పూర్వం కాకమాని గంగాధరకవి తన నాంధారితంలో.

"శబ్దార్థ రససమాంశుడు, శాబ్దికమూర్ధన్యు, శబ్దశాసన బిరుదున్
శబ్దాయమాన విస్ఫుర దబ్దఘటా రభటి నన్నపార్యుఁ దలంతున్" — పీఠిక

---

1. వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు సుప్రబంధముల్
వ్రాయక చెప్పిరట్లు రసబంధుర భావభవాభిరామ తా
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తికెక్కరే
యేయెడ నన్నపార్యగతి నిద్దర నట్టిమహాత్ముఁ గొల్చెదన్.
(విక్రమార్కచరిత్ర. పీఠిక)

2. 'వాగనుశాసనులు యథా తథా యని గ్రహించుట ప్రమాదార్థమని యెఱుంగునది'
(బాలవ్యా. సంధి)

3 వసుచరిత్ర పీఠిక మహితగుణ వాగనుశాసనుండు - ఇత్యాది పద్యం

అని శబ్దశాసనశబ్దాన్ని బిరుదమని తొట్టతొలుత ప్రయోగించాడని శ్రీనిడద వోలు వెంకటరావు వ్రాశారు. ఈ గంగాధర కవికి పూర్వం అంధ్రకవి రామయ్య (క్రీ.శ. 1500) తన విష్ణుకాంచీమాహాత్మ్య కావ్యపీఠికలో 'శబ్దశాసనం' అని కొనియాడాడని వారే వ్రాశారు

పైఆధారాలను బట్టి 16వశతాబ్దివరకు శబ్దశాసనబిరుదం నన్నయకేర్పడలేదనీ, కాకమాని గంగాధరకవి, రామరాజభూషణులే తొలుత శబ్దశాసన, వాగనుశాసన బిరుదాల్ని నన్నయపరంగా ప్రయోగించారనీ తెలిసికోవచ్చు

నన్నయకు ఆదినుండి ఉన్నప్రసిద్ధీ, ప్రశస్తీ. అతడే వ్రాసి ఉంటే చింతామణికి కూడ తప్పక ఉండి ఉండేవి; కర్త అంత ప్రసిద్ధుడు కాగా కృతి ఏదో తత్సమపద నిరూపణ ప్రవణం కాబట్టి మరుగున పడిపోయినదనడం విశ్వాసనీయ కారణంగా కనిపించడం లేదు చింతామణి తత్సమపద నిరూపణకే పుట్టినదనడం గూడ విచారాసహమైన మాటే. చింతామణిలో మొత్తం సూత్రాలు 255 కాగా వాటిలో 47 సూత్రాలు మాత్రం కేవల సంస్కృతసమ శబ్దస్వరూప నిరూపణానికి ఉపయోగిస్తున్నవి. మిగిలిన 208 సూత్రాలలో సంస్కృత సమేతరమైన అంధ్రభాషా స్వరూపం సమ సమేతర భాషా సామాన్యనియమాలూ కనుపిస్తున్నాయి. కాబట్టి చింతామణినేదో పరిమిత ప్రయోజనం, సంస్కృత శబ్దజాలాన్ని తెలుగు చెయ్యడం మాత్రమే కాంక్షించి తత్కర్త చేశాడనడం గూడ అయథార్థమే॥ యథార్థమిట్లుండగా శాస్త్రిగారు 'తనకులబ్రాహ్మణు నిత్యాదిపద్యము 'భారతభాగరచనమునకు ముందే యాంధ్రశబ్దచింతామణిని రచించి నన్నయభట్టారకుఁడు శబ్దశాసనబిరుదము గాంచెనని చెప్పుచున్నది — అనడం కేవలం నేయార్థంగా తోస్తుంది.

---

1. తెలుగు కవుల చరిత్ర — నిడదవోలు వేంకటరావు
మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణ — 1958 పుటలు 137–144.
2. పైది పైది
3. ఈ విషయం ఈ ప్రకరణంలోనే ముమ్మందు విమర్శించబడి సిద్ధయించబడి ఉంది

## పండిత సభల అభిప్రాయ సేకరణం

తరువాత చింతామణిలో పండితసభల అభిప్రాయసేకరణ జరిగినట్లు చింతామణి విషయపరిశోధనం చెబుతుంది. దానికి ఆధారంగా అక్కడక్కడ సూత్రాల్లోని 'ప్రవదన్తి, కేచిద్విదుః. వదన్తి శాస్త్రాజ్ఞాః, న ఇత్యేకే, కథ్యంతే' వంటి పదసముదాయాన్ని చూపించింది.

నిజమాలోచిస్తే చింతామణి రచన పదాల, వర్ణాల మాత్రల అల్పాల్ప ప్రయోగంతో సంస్కృత వ్యాకరణాలవలె జరిగినట్లు తోచదు. ఛందోబద్ధంగా వ్యాకరణ సూత్రరచన సాగినది కాబట్టి ఛందస్సును సరిపుచ్చడానికై సూత్రాలలో 'స్యాత్; స్మృతః ఫః న్తి, జ్ఞేయం సర్వత్ర'--వంటి పదజాలం పుష్కలంగా ప్రయోగింపబడ్డది[1]. 'జ్ఞేయం త్రివిధా పచ క్రియారూపం' అని పాదానికి పాదమొకటి ఛందస్సు కోసం వ్రాయడం జరిగింది.

అలాగే అచ్చులు —— ప్రాణాలు అని చెప్పడానికి ఛందస్సు ఆనుకూల్యాన్ని 'సమాసతః' అనే వాక్యశిరాల అధికపదంతో సాధించవలసి వచ్చింది[3]. ఇలాటి సందర్భాలింకా ఉన్నాయి. ఇదంతా ఛందస్సులో రచన సాగడంవలన కలిగిన పొడిగింపు పదాధిక్యత తప్ప వేరు కాదు. కాగా 'భవంతి' అనేదే 'వదంతి' లేక విదంతి ఎందుకు కాకూడదు ? అంటే పాదపూరణకే ఆపదవిన్యాసం జరిగినట్లు చెప్పవచ్చు. పైగా చింతామణి రచనను పరిశీలించి చూస్తే పాదపూరణకే ఆ పదాలు ఉంచడం

---

1 అ) ద్రుతతౌతున ప్లుతస్యాత్స్వంబుద్ధా విత్యూతాం విదుః కేచిత్. అజంత—46

ఆ) గసదదవాస్వ్యః ప్రథమామాత్రా దాత్మాస్మదో ర్విస్త్రైవైతే సంధి—23

ఇ) భవతి క్రియాపదానాం త్రివిధానా మింద్యుగాగమః. క్రియ. 3

ఈ) ప్రథమైక వచనతుల్యం సర్వత్ర హలన్తె మగుణవత్ ప్రభృతి. హలన్త.

2 చిం. కా. క్రియ. 3

3. ప్రాణాః సమాసతోచః. సంజ్ఞా. 27.

జరిగింది కాని, దానికి, వివిధ పండిత సభల మతభేదావిష్కారం కారణమని అనిపించదు.

ఛందస్సు కుదరక 'ఆది శబ్దాన్ని కూడా నిరర్థకంగా ప్రయోగించిన స్థలం చింతామణిలో ఉంది[1]. రచన ఇలా సాగిందంటే తత్కర్త పాదపూరణకి కూడి విస్తృతంగా పదప్రయోగం చేశాడని నిర్ణయించవలసి వస్తుంది. అయినపుడు ఆ పద సముదాయానికి విశేషార్థాన్ని ఆపాదించడం తత్కర్త్రభిప్రేతం కాదని పిస్తుంది.

శ్రీశాస్త్రి చూపిన ఉదాహరణమొకటి వారన్నట్లు ప్రాచీన శాసనస్థ లిపిని తలపింపచేయకపోగా వికృతపదాలను సృష్టిస్తున్నది. 'స్యాదమహతాం విభక్తౌసోశ్చము', 'తదుపరి పునర్మ్బూ ప్రాచాం[2]. ఈ సూత్రాలవలన ఫలము—ఫలముము—ఫలముబు అనే రూపాలు సిద్ధిస్తున్నవే కాని. ఫలబు — ఫలంబు — ఫలమ్ము వంటి రూపాలు ఎలాసిద్ధిస్తున్నవో శాస్త్రిగారికి తప్ప ఇతరులకు తెలియరావడం లేదు.

శ్రీశాస్త్రి చింతామణి రచనాకాలానికి వాఙ్మయం, వ్యాకరణం సరిగా రూపు దిద్దుకోనిస్థితిలో ఉన్నాయని వాదిస్తూనే 'కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతే హ్యేషు[3]. అనే సూత్రాన్ని ఉదాహరిస్తున్నారు. కవిభల్లట మతంలో క్రియల్లో నామాల్లో ఉల్లోప మౌతుందని గదా ఆసూత్రార్థం. దాన్నిబట్టి వాఙ్మయం, కవిభల్లట కృతవ్యాకరణం, చింతామణికి పూర్వం ఉన్నట్లు అంగీకరించక తప్పదు. వ్యాకరణావిర్భావం వాఙ్మయం వినా జరుగదు. వ్యాకరణమొకటి లేకపోతే వ్యాకర్తృ నామ నిర్దేశం అన్యవ్యాకరణంలో సంభవించదు.

---

1. స్త్రీత్వ బహుత్వే సురాదే రవమాపే — అజంత. 63. దీనికి 'సురలు' అనే ఒక్క ఉదాహరణమే కాని ఇంకొకటి ఏర్పడదు. ఆ విషయం అహోబలపతి గ్రహించి చెప్పాడు.

2. అజంత — 34, 35.

3. హలంత 16

### కాల వైరుద్ధ్యాలు :

చింతామణిలో ఈసందర్భంలోనే పేర్కొనవలసిన వైరుద్ధ్యాలు శాస్త్రిగారి మతంలో మరి మూడున్నాయి.

సుమ్నో తో హల్యధ్వణాచార్య మతాత్

2 హేమోక్తేః పరుషాణాం గసడదవాః స్యుః పదాద్ద్వంద్వే

3. తేషామితశ్చ తద్వత్త్రివిక్రమ మతేన

పైమూడు సూత్రాలు వాటివ్యాఖ్యాన సహితం– అప్పకవీయంలో పంచమాశ్వాసంలో ఉన్నాయి

సమసనమున నామాంత శృంగములకెల్ల హల్లు గదియ స్వార్థంబునఁ
బొల్లద్రుతము
వికృతి నాగమమై ద్రుతప్రకృతి పగిదిఁ గాంచు సంధి నథర్వణ
కవిమతమున

—(అప్ప–పంచమ–120)

2. సుమనస్తుత! ద్వంద్వ సమాసమునను హేమోక్తిని బరిశబ్దాదిమ వర్ణములగు పరుషాక్షరములు తమ రూపులు విడిచి గసడదవలగు నెరుసన్

—(అప్ప–పంచమ–168)

3. నడిమి నరడలకు గుడులేఁగు నుండును దఁడఁ త్రివిక్రమ ముని మతముఁ
గన్న

పూన్కి గూర్మి కల్కి యప్ప పూనికి హరిమనుడు పలికె నడిపి
యనుచు నిల్లు

—(అప్ప–పంచమ–111)

పైముచ్చురు కాలక్రమంలో నన్నయకు అర్వాచీనులు హేమచంద్రుడు, త్రివిక్రముడు ప్రాకృత వ్యాకర్తలు. వారు క్రమంగా 12వ 13వ శతాబ్దాలకు చెందిన వారు[1]. వారిలో త్రివిక్రముడు హేమచంద్రుని తనవ్యాకరణంలో పేర్కొనడం వలన అతనికి తర్వాతివాడు. ఈముచ్చురి నామాలు సూత్రాలలో ఉండటంవలన శాస్త్రిగారి నన్నయకర్తృకత్వ వాదానికి పెద్దవ్యాఘాతం ఏర్పడింది అధర్వణనామం సూత్రగతం కావడాన్నిమాత్రం వారు నిరోధించారే కాని హేమచంద్ర, త్రివిక్రముల పేర్ల విషయమై ఏమీ అనలేదు బహుశః వారిరువురు నన్నయకు పూర్వులని అన్నారో లేక అసలు ఆవిషయం ఉపేక్షార్హం అనుకున్నారో తెలియదు అధర్వణ పద ప్రయోగవిషయమై వారిసమాధానసార మేమిటంటే—అధర్వణకారికలు చింతామణికి పూరకాలు కాబట్టి తప్పనిసరిగా చింతామణికి తరువాతివే, కాబట్టి చింతామణిలో అధర్వణనామ స్మరణం అసందర్భం కాబట్టి ఆసూత్రం ప్రక్షిప్తం—అని. చింతామణికి వికృతివివేకం పూరక గ్రంథమనడంలో ఎవరికీవిప్రతిపత్తి లేదు. కాని చింతామణి కర్తృత్వంవలె వికృతివివేక కర్తృత్వం కూడ వివాదగ్రస్తం. వికృతి వివేకం అధర్వణకృతమనడం సుపరీక్షితవచనం కాదు అపరీక్షిత నిర్ణయంమీద ఆధారపడిన శాస్త్రిగారిపైవాదం తిరస్కారయోగ్యమవుతుంది.

ఇక బాలసరస్వతీయంలో వికృతివివేక కారికలు కొన్ని ఉద్ధృతాలై కనుపిస్తున్నవి గాబట్టి బాలసరస్వతి కాలానికే వికృతివివేకం లోకంలో వ్యాప్తమైఉన్నదనీ, కాబట్టి బాలసరస్వతికి ముందే పుట్టినది కారికావళి—అని శాస్త్రిగారి మరొక వాదం. కాని బాలసరస్వతీయాలు కొన్నింటిలో, ఇటీవలి కాలంలో కనుపించే కారికలు, బాలసరస్వతీ కర లిఖితాలనడానికి ఆధారం లేదు. బాలసరస్వతీయ ప్రతులన్నింటిలో కారికలు కనిపించవు. కొన్నింటిలోనైనా ఈకారికలు బాలసరస్వతి చేతితో లిఖించబడ్డవి అని అన్యత్ర స్థాపించబడ్డనాడు గాని శాస్త్రిగారివాదనికి బలంలేదు; రాదు. తరువాత లేఖక పాఠకోత్తములు బాలసరస్వతీయం, వ్యాప్తిలోనికి వచ్చినతరువాత దాని నుండి కారికలు కొన్నింటిని బాలసరస్వతీయంలో అధ్యయన సౌలభ్యంకోసం ఎత్తి వ్రాసికొని ఉండవచ్చు వ్యాకరణాంశాలు పరస్పర సంబంధితాలు అయినప్పుడు

---

1. P chel, R Co nparati e g a nmar of Prakrit anguages.

తమకు తెలిసినవి ఒకచోట వ్రాసి ఉంచుకోవడం ఉచితమని అనుకొని వారట్లు ఉంచవచ్చు.

కారికావళి బాలసరస్వతివారికే ఉండే అహోబలపతికి సూత్రసూ అవి లభించడం, అతనికి సన్నిహితకాలంలోనివాడు, బహుగ్రంథపరిశీలకుడు అయిన అప్పకవికి లభించకపోవడం వింత. అప్పకవి పూర్వగ్రంథ నామసంగ్రహంలో నైనా వికృతివివేకాన్ని స్మరించలేదు. అథర్వణుని పేర్కొన్నాడు కాని వ్యాకర్తగా కాదు ఛందఃకర్తగానే. అహోబలపతి, అశ్రుతపూర్వం అదృష్టచరమైన వ్యాకరణాన్ని పొంది లబ్ధప్రతిష్ఠుడైన బాలసరస్వతిని కొనియాడాడు, కాని అతని వ్యాఖ్య సూత్రస్థ పదార్థవివరణంతో ముగిసిందని పెదవి విరిచాడు. అలగే అప్పకవివ్యాఖ్యానం బాగా తెలుగువద్యాలతో ఉందని గౌరవించలేదు. తాను ఆ గాత్రం బాలసరస్వతికంటె మిన్నగా అపూర్వం గా నన్నయ(లతనిదృష్టిలోచింతామణికర్త)అపరావతారంలాగ వ్యాఖ్య చేస్తానన్నాడు. కాబట్టే అంతవరకు ఎవరూ చూడని వినని వికృతివివేకాన్ని వెలికి తీశాడు. ఇక్కడకూడా జరగవలసిన పరిశోధన చాల ఉంది పరిచ్ఛేదాంతరంలో అది జరుగుతుంది[1].

## గ్రంథ ప్రాథమికావస్థ

స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధ ధియః
లోకే బహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దపహాయ' సంజ్ఞా—6

అనే చింతామణికారిక తద్గ్రంథ ప్రాథమికావస్థను బోధింపఁజాలి యున్నది - ఇదొక వాదం. వైకృత కావ్యాలు గూడ స్వీకార్యాలే, ఫరవాలేదు—అనే భావం వాఙ్మయారంభ దశలోనేమో గాని పండితలోకంలో నిన్నమొన్నటివరకు ఉండేది. అహోబలపతిగూడ పీఠికలో 86వ, 87వ శ్లోకాల్లో భాషాకావ్యాల ఉపాదేయత్వాన్ని గూర్చి ఉపన్యసించాడు చివరకు 'తద్భేదో న పురాణ వక్తృ కవిరాడ్ జల్పాంధ్ర సత్కావ్యయోః అని సంస్కృతాంధ్ర కావ్యాలకు భేదం లేదని చెప్పాడు అంటే

1 చూ అథర్వణకారికలమూలస్థానాలు అనే ప్రకరణం

అతని కాలానికి కూడ దేశభాషా కావ్యాలు పండితామోదాన్ని అంతగా పొంది ఉండ లేదనుకోవాలి. స్వస్థానేత్యాదిశ్లోకం గూడ భాషాకావ్యాల ఉపాదేయత్వకథనప్రవణమే గదా ! తావన్మాత్రంతో అది వాఙ్మయానికో, వ్యాకరణానికో ప్రారంభ దశ అనలేం.

## 'సత్' పద వాదం:

ఇక ఈశ్లోకంలో 'సంతః' అనే పదం, భారతంలోని ఆదిపర్వ ప్రథమాశ్వా సంలో 24వ పద్యంలో 'సత్సభాంతర సరసీ వనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్ —అనే భాగంలోని సత్' అనేపదం—ఈరెండు పదాలూ, ఈ రెండు గ్రంధాలు ఏకకర్తృకాలని రుజువుచేస్తున్నవంటాడు శ్రీశాస్త్రి. ఇది మహా విచిత్ర వాదం. భారతంలో సత్సభశ్లాఘ ఉంది. చింతామణిలో సజ్జనుల ప్రసక్తి ఉంది. భారతంలో సత్పదం సమాసపూర్వాంగం, చింతామణికర్త నిజంగా సభలనే స్తుతించ దలిస్తే అలాగే చేయడం జరిగి ఉండేది. అతని సూత్రాల్లో ఎక్కడా సభా పదం గాని, సత్సభాపదం గాని, పండితసభాపదం గాని లేదు. చింతామణికర్త కేవలం పాదపూరణకుగా వాడిన వదన్తి విదన్తి' వంటి పదాలు ఆధారంగా ఏహోపండితసభల నిర్ణయాలనే ఆశబ్దాలు తెలుపుతున్నవనడం—ఆకల్పన ఆధారంగా వాదాన్ని పెంచు కుంటూ పోవడం సమంజసమైన విమర్శకమార్గంకాదు. అపదాల ప్రయోగం కేవలం యాదృచ్ఛికం: నన్నయ ఆంధ్రభాషకు ఆదివ్యాకరణరచన స్వయంగా చేసి, అమహా విషయాన్ని ఇంత వంకరటింకరగా, ఇంత అపహాసాత్మకంగా దుర్బలంగా తెల్పు కుంటాడని ఎందుకనుకోవాలి ?

ఇలా అక్షరాలు, అక్షరాంశాలు రెండుగ్రంథాల్లో సంవదించడం వల్లగూడ ఆ రెండు గ్రంథాలకు సమానకర్తృకత్వం చెప్పుకుంటూ పోతే ఇక మన వాఙ్మయచరి త్రల ప్రామాణ్యాన్ని నమస్కరించి వదిలివేయవలసి వస్తుంది. ఇటువంటి ప్రమా ణమే మరొకటి గూడ వారు చూపారు—'విశ్వ శ్రేయః కావ్యం[1]' — 'శ్రీవాణీ

---

సంజ్ఞా.

గిరిజా శ్రీకంధరా. శ్రేయసే[1] అనేచోట్ల రెండు గ్రంథాల్లో యీ శ్రేయశ్శబ్ద ప్రయోగ మొక్కటే తత్కృతుల కర్తృత్వైక్యాన్ని సాధిస్తున్నట్లు వాదించారు. ఇక్కడ గూడ శ్రేయశ్శబ్దం చింతామణిలో సమాశోత్తరభాగం[4]' భారతంలో వ్యస్తంగా చతుర్థ్యంతంగా వః శ్రేయసే భూయాసుః (మీకు శ్రేయస్సునకగుదురుగాక) అని ప్రయోగించబడింది. సందర్భాలు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి.

భిన్నకర్తృకాలైన గ్రంథాల్లో ఇంతకంటె స్పష్టంగా పెద్దపెద్దసమాసభాగాలే సంవదిస్తున్నవిగదా! అలాంటప్పుడు కేవలంరెండక్షరాలు సమానంగాఉండటంతో రెండు గ్రంథాలు సమానకర్తృకాలనడం ఎంతసముచితమో విజ్ఞులే నిర్ణయించాలి. ఒకవేళ ఆ పదాలురెండూ సమానాలే అనుకున్నా నన్నయమీది ప్రామాణికబుద్ధివల్ల ఇతరులే ఆ పదాలను ఎందుకు వాడిఉండగూడదు? పూర్వకవుల ననుకరించడం, పదాల్ని, పాదాలకుపాదాల్నే కూడ యథాతథంగా ఉత్తరోత్తరకవులు ప్రయోగించడం మనమెరిగిన విషయమే. ఇంతటి దుర్బలాధారాలతోనా నన్నయకు చింతామణి కర్తృత్వం కట్టబెట్టడం?

### అక్షరరమ్యతావాదం.

సారమతిం గవీంద్రు లిత్యాది పద్యంలో[1] అక్షరరమ్యత అనే పదానికి శబ్ద సాధుత్వ మనే అర్థం చెప్పి, ఆసాధుత్వ సాధనకోసం వ్యాకరణరచన చేశాడనడం ఏపాటిసందర్భ శుద్ధమైన కల్పనో పరిశోధకులే నిర్ణయించాలి. మోకాలికి బోడితలకి ముడిపెట్టినట్లుగా ఉంది—ఆకల్పన.

---

1. ఆది. 1–1.
2. ఉత్తమ ధర్మమని విశ్వశ్రేయ శబ్దాన్ని వ్యాఖ్యానించారు బాలసరస్వతి మొదలైన వారు
3 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ'—ఇత్యాది నన్నయ ప్రార్థన. 'శ్రీవాణీగిరిజేశ'—ఇత్యాది కేతన ప్రార్థన.
4 భారత. ఆది పీఠిక.

## నన్నయత్రివిక్రములు :

'సిద్ధిర్లోకాద్దృశ్యా[1]' అనే చింతామణి సూత్రం గూడ దాని ప్రాథమికావస్థను, లోకం తప్ప ఇతరత్ర శబ్దసిద్ధికి ఆధారం లేకపోవడాన్ని, తద్వారా వాఙ్మయ వ్యాకరణాల ప్రారంభాన్ని తెల్పుతున్నదని శాస్త్రిగారివాదం. కాని త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనంలో చింతామణిలోని ఈసూత్రానికి మూలం కనిపిస్తుంది. శబ్దానుశాసన ప్రారంభంలోనే సిద్ధిర్లోకాచ్చ'అనే సూత్రం, జనవ్యవహారంవల్లనే భాషాసిద్ధి అనే అర్థంగల దానివృత్తీ కనిపిస్తున్నాయి.

'సిద్ధిర్లోకాచ్చ అనే సూత్రం త్రివిక్రముని ప్రాకృతవ్యాకరణంలో ఉండటం, దాని రూపాంతరంగా చింతామణి 'సిద్ధిర్లోకాద్దృశ్యా' అనిసూత్రించడం, తరువాత చింతామణిలో త్రివిక్రముని పేరు, తత్పూర్వుడు హేమచంద్రుని పేరు సూత్రస్థంగా అప్పకవీయ మాతృకలో ఉండడం—వీటనన్నింటనీ నిశితంగా పరిశీలిస్తే,

ఈ వ్యాకరణం ఎట్టిపరిస్థితిలోనూ త్రివిక్రముని ప్రాకృతశబ్దానుశాసనానికి తరువాతిదేనని; అంటే దీనిసృష్టి 13వశతాబ్దికి తరువాతనేనని

2. ప్రాకృత వ్యాకరణానుశీలనం చేసిన సంస్కృతజ్ఞుడైన ఆంధ్రభాషా పండితుడెవడో దీని కర్త, అని నిర్ణయించవలసి వస్తుంది.

ఇక్కడ త్రివిక్రముడే చింతామణినుండి సిద్ధిర్లోకాద్దృశ్యా' అనేసూత్రాన్ని స్వీకరించి 'దృశ్యా అనేపదాన్ని పరిహరించి తనవ్యాకరణంలో వేసికొన్నాడని వాదించవచ్చు. కాని త్రివిక్రమవ్యాకరణం అఖిలభారతప్రసిద్ధం; ఆంధ్రేతరులకి గూడ అది సుపరిచితం. చింతామణి బాలసరస్వతికాలానికి గాని తెలుగుదేశంలోనయినా తెలియబడని పుస్తకం—ఈభేదం పరిశీలిస్తే త్రివిక్రమవ్యాకరణమే చింతామణికి తర్వాతిదని అనడానికి నోరాడదు, వ్రాయడానికి కలం కదలదు. పైగా త్రివిక్రముడు, హేమ

---

1. సంజ్ఞా — 6.

చంద్రుడు, చింతామణిలో స్మరించబడ్డారేగాని నన్నయ ప్రాకృతవ్యాకరణాలకెక్కడా ఎక్కడా లేదు.

సిద్ధిర్లోకాద్ధృత్వా అనేసూత్రం ప్రాకృతవ్యాకరణ మూలకమని ఆప్రాకృత వ్యాకరణం గూడ 1వశతాబ్దిదని నిర్ధారింపబడం తేలినప్పుడు, ఇక ఆసూత్రంతో చింతామణిని 1 వశతాబ్దికి లాగవచ్చంగాని, మరోవాదం—ని నిల్వజాలవుగదా

ఇతర విషయాల్లో గూడ చింతామణి ప్రాకృత వ్యాకరణాన్ని అనుకరించినది. ఆ విషయం ముందు వివరించబడుతుంది

## 'పేచ, ఊష' శబ్దచర్చ

'డుపచష్పాకే ధాతు—లిట్-మధ్యమపురుష—బహువచనం—పేచ. వస నివాసే ధాతు—లిట్-మధ్యమపురుష—బహువచనం—ఊష. డుపచష్ ధాతువు ప్రసిద్ధమే. పచతి పచన్తి మొ రూపాలు ప్రసిద్ధప్రయోగారూఢాలే—సంస్కృతంలో. బహుశః దానిమధ్యమబహువచనమేఅప్రసిద్ధమేమో। ఇట్లె వసధాతువుగూడ. వసతి—వసన్తి—సుప్రసిద్ధరూపాలే. ఏదిఏమైనా పేచఊష— ఆవిశబ్దాలుసంస్కృతంలో ప్రయుక్తాలౌతాయి—శబ్దజ్ఞులచే, ఇక్కడ మాత్రం (తెలుగులో)సంకేతిత సుప్రసిద్ధ పదమే ప్రయోగార్హం. అనిచింతామణిచెబుతుంది పేచ, ఊషాదులు కేవలసంస్కృత శబ్దాలు, కొందరి మతంలో అవి అప్రసిద్ధాలు కావచ్చు. అయినా అవి క్రియాపదాలు. వాటికి ఆంధ్రంలో ప్రయోగశంకే లేదు. ఒకవేళ వాదంకోసం ఉందనుకుంటే తానే 'నపదాన్యవ్యయ సుప్ తిజ్ క్త్వా తుమునాం —అంటూ నిషేధించి ఉన్నాడు. ఇక తత్తుల్యాలైన ఆంధ్రశబ్దాలేవో చూపి, వాటి ప్రయోగాన్ని నిషేధించాలి గాని, సంస్కృతశబ్దాల్ని చూపి వాటినో, వాటివంటివాటినో ఇట ప్రయోగింపరాదనడ

1. చూ 'చింతామణిలో ప్రాకృత వ్యాకరణానుకరణం' అనే ప్రకరణం.

2. చింతా. సంజ్ఞా 47

3 సంజ్ఞా 33

మేమిటి ? వాటివంటివి ఏవో తెలియాలిగదా ఆంధ్రపండిత లోకానికి లేక కావ్యకర్త లకు? ఈశ్లోకరచనలో ఈఅస్పష్టతాదోషం ఇలా ఉంటే దానిని'సారమతిం గవీంద్రు' లిత్యాది నన్నయ పద్యంతో బలాత్కారంగాపోల్చి రసస్ఫూర్తి, రసాస్వాదం అంటూ ఆకాశంలో మూరలు వేయడం శ్రీశాస్త్రికి న్యాయంకాదు. పేచ. ఊష అనే లిఙ్మ ధ్యమ బహువచన రూపాలు అప్రసిద్ధాలు గాని వాటిధాతువులు ప్రసిద్ధాలే. పచించు, వసించు అంటూ ఆధాతువులను సంస్కృతసమాలుగా మనం వ్యవహరిస్తూనే ఉన్నాం. ఇక సంస్కృత ప్రకృతులను ప్రసిద్ధమైనవానినే తెనుగులోనికి తెచ్చికొన వలయునని చెప్పదలిస్తే అలాగే చెప్పలేడా చింతామణికర్త? అతడు చెప్పదలచేది ఒకటి, చెప్పేది ఒకటిగ ఉం..ందా ? ఇటువంటి ఈ శ్లోకం ఆంధ్రవ్యాకరణ ప్రాథ మిక దశను వేనోళ్ళ' కాకున్న ఒంటి నోటితో నైనా చాటడం ఎలాగో తెలియదు.

'ఈ విరళాన్ పేహోషాదిక—ఇత్యాది సూత్రము అప్రసక్తముగ నాచ్ఛికశబ్ద విషయమునను సమన్వయించి ఉదాహరించి రని బాలసరస్వత్యహోబల పండితా దులను శాస్త్రిగారుతప్పుపట్టి దాని గూఢాశయాలను వారు గ్రహించలేదన్నారు. కాని వారివ్యాఖ్యానపద్ధతి ననుసరించే శాస్త్రిగారు తమప్రసంగాన్ని మహాభాష్యో క్తులతో సందర్భపరచి కొనసాగించారు బాలసరస్వతి ఈసూత్రాన్ని ఆచ్ఛిక శబ్దజా లంతో సమన్వయించనే లేదు. వివరమాత్రం సూత్రాన్ని తెలుగువ్యాకరణంతో పొస గించడానికై 'ప్రయోగసిద్ధము గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనుల వివక్ష.—అనిముగించాడు. ఈపాటి సమన్వయమైనా జరగకపోతే ఆసూత్రాన్ని తెనుగువ్యాకరణానికి లతికించడం అసాధ్యంగదా! అహోబలపతి గూడ బాలసరస్వతి మార్గాన్నే అప్పకవిలాగ అనుసరించాడు. ఇలా చేయడంతో వారేదో సూత్రకృదభి ప్రాయాన్ని తప్పుగా వ్యాఖ్యానించారనడం నిజంకాదు. నిజానికి శాస్త్రిగారి మాట ల్లోనే సూత్రకర్తకు లేని అభిప్రాయాలు చాల వ్యక్తమైనాయి— 'నన్నయభట్టారకుడు రసప్రధానమగు తన భారతకావ్యము నిర్మాణసందర్భమున'1 ఇత్యాదిగా సాగిన వారి ప్రసంగం సూత్రానికి బొత్తిగా సందర్భపడదు. ఇక్కడే శాస్త్రిగారు మరొకవాదం చేశారు. 'ఆంధ్రశబ్దచింతామణి సంస్కృతభారతాంధ్రీకరణ సమర్థముగాఁ దెలుగునుఁ జేయఁగోరి సంస్కృతశబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనుటలోని నియమ

1 చిం. విష శ్లో—2వ విషయం.

ముల నుపదేశించుట, వానికి సుప్తివిభక్తులను జేర్చు పద్ధతులను ఉపదేశించుట ప్రధానముగ జేసికొని రచింపబడినది'—ఈ వాదం ఆపాత మధురంగా ఉంటుందే గాని తీరా భారతాంధ్రానువాదాన్ని చింతామణినియమాల్నిపోల్చిచూస్తే మూలోచ్ఛేదిగా పరిణమిస్తుంది.

### చింతామణి లక్షణం భారతరచన లక్ష్యమా? :

కర్మ ప్రవచనీయకే కూర్చిః ( చింతామణి—అజంత—17)

కర్మప్రవచనీయార్థంలో 'కూర్చి'అనే ద్వితీయా విభక్తిప్రత్యయం వస్తుందని సూత్రార్థం దీనికుదాహరణం నన్నయరచన మొత్తంలో ఎక్కడా కనబడదు. కాబట్టే చింతామణి విషయపరిశోధనానుబంధంలో శాస్త్రిగారు చింతామణిలో ఉండి, భారతంలో లేనివిగా ఎవరిచేతనో పేర్కొనబడ్డ విభక్తులు నాల్గింటిలో—(కూర్చి, కొఱకు, వలన, యొక్క)—'వలన'కు ఒక్కదానికి మాత్రం భారతప్రయోగం చూపి, మిగిలినవి లేకున్నా 'ఫరవా లేదన్నట్లు వాదించి ముగించారు. ఆచోట శాస్త్రి గారి వాదం సమంజసంగాగాని, సమర్థంగాగాని అనిపించదు; ఎందుకంటే

కూర్చిపదం కూర్చు ధాతుక్త్వార్థకం. అది నన్నయకు చాలఅర్వాచీనకాలానికి గాని, ద్వితీయా విభక్తి స్థానంలో వాడబడటం తరువాతవ్యాకర్తలు దాన్ని, దాని స్థానాన్ని పరిశీలించి కర్మప్రవచనీయస్థానంలో ఉంచడం జరగలేదు. పైగా కూర్చు ధాతురూపాలు 'కూర్తు'వేని వంటివి నన్నయకాలానికి ప్రసిద్ధప్రయోగాలై తత్ క్త్వార్థకం 'కూర్చి' విభక్తిప్రత్యయంగా రూపుదాల్చడం ఆకాలానికి నిజంగా

---

1. అ) అమితపదాతుల నొడఁగూర్చి యంతకాకారులై. ఆది - 2-21

ఆ) మేలుగాఁగూర్చి దీని నిర్మించె. సభా—2—180

ఇ) వానికి కూర్చి యిచ్చిరి. ఆది-7-138

ఈ) కొండుకుమతనికిఁ గూర్చు మంత్రులమనై. ఆది—2—131

ఉ) ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తురు సభా— 2—10

జరిగిఉండదని పని. కాబట్టే ఒక్క నన్నయలోనే కాక ఆ విభక్తికి కవిత్రయయుగం లోని ఏకవిరచనలోనైనా ఉదాహరణం మృగ్యంగానే ఉంది

అయినా నన్నయరచనలో ఎంతాపతి సూత్రాలన్నింటికీ ఉదాహరణలు చూపి స్థానంటూ ప్రతినపట్టిన శ్రీపారనంది రామశాస్త్రి తమ ప్రతిజ్ఞాభంగం జరగకుండా ఉండాలని 'అంబుజసంభవుగుఱిచి' [illegible] ఉదాహరించాడు కాని [illegible] నికీ, కూర్చి అనేవిభక్తికి వ్యత్యాసం చాలాఉంది ఆరెంటూ రూపాంతరాలని వైయాకరణులెవరూ అంగీకరించలేరు.

2. జేసః కై కొఱకూ (అ.౦.త 23)

కూర్చివంటి విభక్తిప్రత్యయమే స్వభావాన్నిబట్టి కొఱకు గూడ. ఇదినన్నయ కాలానికి విభక్తిప్రత్యయంగా ఏర్పడలేదు. దీనిలోని కు మాత్రమే విభక్తి. కొఱ ప్రాతిపదిక. కాబట్టే మూలఘటికకేతన తనఆంధ్రభాషాభూషణంలో కువర్ణాన్నే[2] చతుర్థీవిభక్తిప్రత్యయంగా పేర్కొన్నాడు

కొఱకు అనే పదం చతుర్థీప్రత్యయంగా గుర్తించబడడం కూడా నన్నయకు పిదప జరిగిన వ్యాకరణపరిణామం. కాబట్టే ఆంధ్రభాషాభూషణకాలానికి దానికి విభక్తిత్వంలేదు. కావ్యాలంకారచూడామణి కాలానికి ఆవిభక్తిత్వం సిద్ధించింది. ఈ అర్వాచీన విభక్తి ప్రాచీనవ్యాకరణం (శాస్త్రిగారి వాదం ప్రకారం)లో ఎలా సూత్రిత మౌతుంది? ఇక్కడ నన్నయ రచనలో కొఱ ప్రత్యేకపదంగా ప్రయోగించబడడం గమనించదగ్గ విషయం. నీకున్ మడవక మాయట్టివారి మాటలు గొఱయే[3].

---

1. ఆది 2—169

2. వృక్షంబులు వృక్షంబుల వృక్షంబులచేతఁ బరికెఁ వృక్షంబులకున్
వృక్షములవలనఁ బండను వృక్షంబుల తుదలఁగలవు వృక్షములందున్

(ఆం భా. భూ)

3. సభా—2—190

3. ఎట్టేతు పంచమీ గుణే హేతౌ, (అజంతి—30)

ఈనిలోని పట్టి విభక్తిగా నన్నయకాలానికి మార్పు గొనలేదు. కాబట్టేపట్టిపదం ఆయన రచనలో విభక్తితరంగానే కనిపిస్తుంది

భారతకర్త నన్నయ వ్యాకర్త కూడా అయివుంటే అతని రచనలో విభక్తులస్థానంలో ప్రయుక్తాలై అల్పాకారంతో పదాంశాలుగా కనిపించే మైన్,కోలెన్, చేసి, పొంటెన్ వంటివాటిని విభక్తులుగాచెప్పి ఉండేవాడు క్రింది ప్రయోగాల పరిశీలనం చేస్తే ఈ ప్రతిపాదనలోనియాథార్థ్యం స్పష్టమౌతుంది.

## భారతంలో ఉండి 'చింతామణిలో' సూత్రితం కానివి

### మైన్

1. వీరకమైఁ జొడుపంగానేపారు ఘోరాజి నల్లాడెం ధాత్రి (ఆది–1-70)

2. గురువృత్తిమైఁ గఱపు (ఆది–5–222)

3. పూవులుఁ జందనంబుఁ జనుపె బలిమిమైఁ గొనితాల్ప
(సభా — 1 — 182)

4. సకలభూత ప్రపంచంబునెల్లఁ దనదివ్యశక్తిమైఁ దాల్చిన సర్వాత్మ
(సభా—2—29)

5. మొనసి యొరుల ధనము నికృతిమైఁ గొనుటది ధర్మమగునె
(సభా—2—204)

పై స్థలాలన్నింటిలో మై తృతీయావిభక్తి స్థానంలో ప్రయుక్తమై ఉందనటంలో ఎవరికీ అభిప్రాయభేదం ఉండదుగదా

---

1 నన్నయ పదప్రయోగ కోశము—617వ పుట

కొలెన్ :

1. నాఁటంగోలె నేకచక్ర నివాసులకు (ఆది–6–308)

2. నినుఁ జూచిన యప్పటఁగోలెను గడు (ఆది–6–193)

3. నూతేండ్లం గోలె నుగ్రగ్రాహ గృహీతంబులయి (ఆది–6–110)

4. ఈరాజ్యంబు మొదలింటం గోలె భవదీయంబయినది (ఆది–6–120)

5. దానిశరీరసౌగంధ్యంబు యోజనంబునంగోలె (ఆది–3–41)

పై స్థలాలన్నిటిలో 'కోలెన్' అనేది పంచమీవిభక్తి స్థానంలో ప్రయుక్తమై ఉండడం నిస్సందేహంగా గుర్తించవచ్చు.

చేసి.

1. భూరిభుజశక్తిం జేసి పాలించుచున్ (ఆది–3–99)

2. వెలయ తండ్రి పనుపుఁజేసి ముదిమి గొని (ఆది–3–95)

3. దుహితృ స్నేహంబునంజేసి యద్దేవయాని పలుకులు (ఆది–3–107)

4. మృగయా వినోదార్థంబు యాయాతి వచ్చుటంజేసి (ఆది–3–141)

5. సత్సంగతిం జేసి తాను దౌహిత్రులు (ఆది–3–226)

పై స్థలాలన్నింటిలో 'చేసి' అనేది పంచమీవిభక్తి స్థానంలో ప్రయుక్తమై ఉండటం స్పష్టంగా కనిపిస్తుంది.

## పొంటెన్

తిసితంత్రికి వివాహంబు సేయు పొంటె గీర్వాణ
హితము సేయుపొంటె మతిఁ దలంచి (ఆది–7–276)

2 కురుకులవృద్ధి పొంటె మేముద్భవిల్లితిమి (ఆది–5–89)

3 కార్యసంప్రయోగము పొంటెన్ (సభా–1–27)

4. పతినన్వేషించు పొంటె నరిగెడి (అరణ్య–2–121)

5. వీరలెల్ల నాత్మోదయ వృద్ధిపొంటెను దదున్నతి (ఆది–8–13)

పై స్థలాల్లో పొంటెన్ అనేది చతుర్థీ విభక్తి స్థానంలో ప్రయుక్తమై ఉన్నదనడంలో విప్రతిపత్తి లేదు

ఈవిధంగా మైన్, కోలెన్, చేసి పొంటెన్–అనే వాటిని స్వయంగా విభక్తి స్థానాల్లో విభక్త్యర్థాల్లో ప్రయోగించినవాటిని విడిచిపుచ్చి తాను ఎక్కడా ప్రయోగించనివాటిని, తనరచనలో ఏవిధంగాను విభక్తులుగా కనుపించనివాటిని ఎట్టి, కూర్చి, కొరకు అనేవాటిని విభక్తులుగా చింతామణిలో నన్నయ సూత్రించడం జరగని పని—అని నిష్పాక్షికంగా చూస్తే ఎవరికైనా తెలుస్తుంది.

ఒక శాస్త్రిగారన్నట్లు యొక్క చరిత్ర మాత్రం చాల విడ్డూరం. అది 'ప్రయోగశరణం వ్యాకరణం' అనే వైయాకరణ న్యాయాన్ని త్రోసి రాజంటున్నది. కాని దానికథ వేరు. దాన్నిబట్టి మిగిలిన విభక్తుల చరిత్రలు, ప్రయోగాప్రయోగాలు నిర్ణయించబూనడం సబబుకాదు.

ఇక ప్రస్తుతాంశానికి వస్తే,

1. 'విషయనిమిత్తాదిజా తథైవాన్యా (అజంత—13)

ఈ సూత్రానికి బాలసరస్వత్యాదులు సప్తమ్యర్థంలో విషయనిమిత్తాది శబ్దాలు ప్రథమాంతాలుగా ప్రయోగించబడతాయని అర్థంచెప్పి హరివిషయము,హరినిమిత్తము అని ఉదాహరించారు

లోక వ్యవహారంలో పైఉదాహరణలు సప్తమ్యర్థంలో కనిపించవు ఆవి సప్తమ్యర్థకాలు కావాలంటే హరివిషయమున హరినిమిత్తమున అన్నట్లు సప్తమి ప్రత్యయం న వివర చేరాలి లేకపోతే హరివిషయము ఎమిజరిగెను? అన్నట్లు అవి ప్రథమాంతాలూ ప్రథమార్థకాలూ అవుతాయి ఇక నిమిత్తపద యో మున్ను పుడు కొఱకు అనే అర్థం పదానికి వస్తుంది ఉదా - ధర్మ నిమిత్తం వా- వచ్చాడు ఈ పదం కొఱకు అనే తెలుగు దానికి సంస్కృత పర్యాయమని భా ంవ వచ్చు ఈసూత్రం పాణినియంలోని సప్తమ్యధికరణేచ నిమిత్తాత్ క... (వార్తికం) అనే సూత్రార్థాన్ని తెలుగులో యిరికించడానికి చేయబడినట్లు కవి లో భూషణం2 చేసిన ఈ సూత్రవ్యాఖ్యానం చూస్తే స్పష్టపడుతుంది

ఎమైనా భారతాంధ్రీకరణంకోసం నన్నయ వ్యాకరణరచన కావించాడవటం నిజమై ఉంటే ఇలాటి సూత్రాలు చింతామణిలో తప్ప ఇతరవ్యాకరణాల్లో కలవు... నివి నన్నయ భారతంతో తప్పకుండా సమన్వయించాలి ఓకవేళ భారతంలో కాక పోతే తత్కాలీనవ్యవహారంలో అంటె శాసనాల్లోనైనా కనబడాలి—ఈ సూత్రోదాహ రణలు కాని ఇలాంటిపదాలతో (విషయనిమిత్తాది పదాలలో) విభక్త్యర్థాలు చెప్పటి మనే అలవాటు నన్నయకు చాల అర్వాచీనకాలంలో ఉంపే ఆంధ్రభాషాభూషణం కావ్యాలంకారచూడామణి మొదలైన వ్యాకరణ గ్రంథాలు వెలసిన తరువాత గాని తెలుగునాట ఎర్పడలేదు అందుకనే ఇలాంటిసూత్రాలు వేటిని ఆవ్యాకరణాలు చేసి ఉండలేదు

## లోపదీర్ఘత కల్గిన రూపాలు

5 వికృతౌ క్వచిచ్చ లోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్

(అజంత—42)

ఈసూత్రం తెలుగులో ము వర్ణానికి లోపం ఆలోపంవల్ల ఎర్పడిన హానిని పూడ్చడానికి తత్పూర్వస్వరానికి దీర్ఘం వస్తుందని చెపుతుంది ఉదా - జొంప ములు > జొంపాలు గుఱ్ఱములు > గుఱ్ఱాలు ఈపరిణామం కూడా వాఙ్మయంలో

---

1 పాణిని 2-3-36

2 అహోబలపండితుని వ్యాఖ్యానానికి పేరు

ఈ చెప్పటం నన్నయ కాలంలో లేదు ప్రత్యేకించి సూత్రరచనే చెయవలసి వచ్చిందంటే ఆ ప్రయోగాలు అతనిలోగాని అతని సమకాలికులలోగాని ఉండాలి కాని శాస్త్రి బహుళ ప్రయోగరాహిత్యంవలననె కేతన విన్నకోట పెద్దనలు ఇలాంటి సూత్రాలు చెప్పలేదు ఆ ప్రయోగాలు వారి తరువాతి వాఙ్మయంలో ఎప్పుడుంటాయి

ఇట్టి ప్రయోగాలు నన్నయలో దొరకవు కాబట్టే శ్రీవాసనంది రామశాస్త్రి తమ ప్రతిజ్ఞాపాలన కోసం నన్నయ పాఠాన్ని అపార్థంచేసికొని ఉదాహరించటం జరిగింది

## దీర్ఘాంత దేశ్యపదాలు

6 నవ దెశ్యపదే (అజంత–47)

సంస్కృతప్రాతిపదికలు దీర్ఘాంతాలు హ్రస్వాంతాలుగా మారుతాయని సూత్రించిన తరువాత ఈ సూత్రం చెయబడింది దేశ్యపదాలలో దీర్ఘాంతాలు దీర్ఘాంతాలుగానే ఉంటాయి గాని వాటికి హ్రస్వత్వప్రాప్తి లేదని సూత్రార్థం

దేశ్యపదాలు దీర్ఘాంతాలుగా ఉండటమనేది కూడ భాషాచరిత్రలో ప్రాఙ్నన్నయ యుగంలో గాని నన్నయయుగంలోగాని జరగలేదు కాబట్టే ఆ యుగవాఙ్మయంలో ఎక్కడా ఈ సూత్రానికి ఒక్క ఉదాహరణమైనా దొరకదు బాలసరస్వతి ఉదాహరించిన నవలా జెజె తెటీ లకోరీ శబ్దాలు దేశ్యేతరాలుగా కనిపిస్తున్నాయి అవి ఆంధ్ర వాఙ్మయంలో చోటుచేసికొన్నది కూడ నిశ్చయంగా నన్నయకాలానికి తర్వాతే కాబట్టే చింతామణి సూత్రాలకు నన్నయ రచనలో లక్ష్యాలు తప్పక చూపడానికి యత్నించిన పాఠనంది రామశాస్త్రిగారు యిక్కడ అపపాఠాన్ని ఉదాహరించడం జరిగింది _ ఎహూటుగాదిలను- అని బండిని గాడీ అని తెలుగు వాసనడం నిన్న

మూరిరత్నాల యష్టుల (అది __ 8— 6)

ఇక్కడ రత్న + ఆలయష్టుల అను విభాగం కాని రత్నాల + అష్టుల అను కాదు

2 ఆది 8 2

మొన్నటి అలవాటు పొంది ఒకప్రత్యేకి భాషగా బాగా స్థిరపడ్డాక గానీ అధాషలో కటపర్యాయంగా వాడే గాడీ పదం అదే రూపంలో తెలుగునాట వ్యవహారంలోనికి రావడం జరిగలేదు ఈ గాడీ పదం గాడిద పదానికి పాఠాంతరంగా ఇటీవలి కాలంలో ప్పించబడిందని ప్రొఫెసర్ తూమాటి దొణప్ప సోదాహరణంగా నిరూపించారు [1] ాగా ఈ సూత్రం నన్నయ భాషతో విరోధిస్తుందనడం నిర్వివాదం పాఠిసెం రామశాస్త్రిగారు ఈ సూత్రానికే నన్న యోదాహరణంగా తా మమ్మ అని చూపడం వారికి నన్నయ కర్తృకత్వస్థాపనలో తప్ప తెలుగుభాషా స్వరూపస్వభావాల పరిశీల నంలో జొత్తిగా ఆస్థ లేదని నిరూపిస్తుంది

దేశ్యాలు దీర్ఘాంతాలుగా ఉండటం వాఙ్మయంలో అర్వాచీన పరిణామం కాబట్టి కేతన చిన్నకోట పెద్దనలు తమ లక్షణాలలో సంస్కృతప్రాతిపదికల దీర్ఘాలని హ్రస్వాలు చేస్తూ దేశ్యపదాల దీర్ఘాంతత్వ రక్షణక్కోసం సూత్రించలేదు కాబట్టి చింతా మణిని ఆంధ్రభాషాభూషణం కావ్యాలంకారచూడామణులతర్వాతి గ్రంథంగా భావించవచ్చు

7 స్త్రీవద్గ్లౌ (అజంత–63)

ఈసూత్రం పనిగట్టుకొని గ్లౌ శబ్దానికి తెలుగులో ప్రయోగమెలా ఉంటుందో చెప్తుంది అంటే దీనిప్రయోగదశ చింతామణి కాలానికి తప్పక ఎప్పుడో ఉండాలి చింతామణికాలం నన్నయకాలం సమానమంటే నన్నయ్యే చింతామణికి కర్త అంటే తప్పక అతనిలో ఈపదప్రయోగం ఉండి తీరాలి కాని అతని భారతంలో ఎక్కడా దానికి ప్రయోగం లేదు

8 ఋర్ద్వంద్వే రి (అజంత–66)

ద్వంద్వసమాసంలో ఋకారానికి రేఫ వస్తుందని సూత్రార్థం ఎక్కడా ఋకా రాంత వ్యాఖ్యాతి పూర్వ దాంతమని చెప్పాడు యాత్రిపత్ర భావమని శైలపుత్రి గాయతు — అనిఉదాహరించాడు కాని ఇట్టిప్రయోగాలు ఎప్పుడు నన్నయిలో

---

1 నన్నయ–అన్యదేశ్యాభాసములు ప్రొ తూమాటి దొణప్ప భాషాచారిత్రక వ్యాసాలి — ఆంధ్ర సారస్వత పరిషత్ హైదరాబాద్ — 1972

మ్యాఖ్యాలే ప్రత్యేకించి వ్యంద్వసమాసంలో పూర్వపదం ఋకారాంతమైనపుడు జరిగె ఎర్ణ విపరిణామాన్ని చెప్పడ మనేది ప్రయోగం లేకుండా జరగదు కాబట్టి అట్టిప్రయోగాలు బయలుదేరిన తరువాత గాని చింతామణి వ్రాయ బడడము సన్నయలో ఈసూత్రానికి ఉదాహరణలు చెప్ప కొబట్ట పాలెంది రామశాస్త్రిగారు నన్నయభారతం నుండి ఎతరుల ఋణంబును నాన్నిశం స్వంబునంజేసి —అని అనుదాహరణమైన భాగాన్ని ఉదాహరణంగా చూపారు

## ఔపవిభక్తికాలు

0 ఔపవిభక్తికలీనా మిల్లుగ్ బహుత్వం తథైవ డుశ్చ స్యాత్ (అజంత —76) ఈ సూత్రం ఔపవిభక్తికాల్లో బహువచనం పరమైతే లిఏర్ణంలో ఇకార లోపం బిందు యుక్తమైన డువర్ణం వస్తుందని చెబుతుంది ఉదా గుదలి — గుద్దండ్లు పెండ్లిండు రొకంన్లు గొడ్డండ్లు శ పదాలు గానీ విటిని పోలినవిగానీ నన్నయలో ఎక్కడా కన్పించవు విభక్తులకే ఒకసమగ్ర స్వరూపం ఎప్పడి ఉండని లకాలంలో ఉపవిభక్తుల ప్రసక్తి వ్యాకరణ రచనలో వచ్చి ఉన్నదనడం విశ్వాసార్హమైన విషయంకాదు

## వర్తమానభవిష్యదర్థకరూపాలు

0 వసతి రనుబంధకస్స్యాత్ యత్ర లదర్థో వివక్షిత స్తత్ర (క్రియా— ) ఈసూత్రం వర్తమానార్థంలో ధాతువుకి ఉన్న—అనేది అనుబంధ మవుతుందని తెలుపుతుందని వ్యాఖ్యాతలు వ్రాశారు ఉదాహరణంగా ఏందుచున్నాడు—వంటి రూపాలు ఇవ్వబడ్డాయి

వర్తమానార్థంలో సానుబంధక ధాతువుల ప్రయోగించడం భాషాచారిత్రిక దృష్టితో చూస్తే చాల అర్వాచీనమైన అలవాటు—వాఙ్మయంలో గాని వ్యవహారంలో

---

అది 5 70

గాని ఆంధ్రభాషాభూషణ కావ్యాలంకార చూడామణుల కాలానికి ఆ వ్యాకరణాల్లో ఉన్నానుబంధం వాడుకలో లేదు కాబట్టె వారు వర్తమానకాలాన్ని ఆ పెదనలు ఈ అనుబంధం లెకుండా ప్రస్తుతం మనం తద్ధర్మార్థకాలనెవాటి రూపాలు పెట్టి చింతామణి పైరెండు గ్రంథాలకంటె ప్రాచీనమని అంగీకరించాలంటె అర్వాచీన రూపాలు ప్రాచీనగ్రంథంలోను ప్రాచీనరూపాలు అర్వాచీనగ్రంథంలోను ప్రతిపా దించబడ్డాయని ఒప్పుకొవలసివస్తుందిగదా

అ స్త్రి వనుబంధకి స్స్యాత్ యత్ర ల్భదర్థౌ విపక్షతౌ ధాతౌ

(క్రియా – 2)

ఈసూత్రం భవిష్యత్కాలంలో కిలా నుబంధం ధాతువుకి అవుతుందని చెబు తుంది ఇది కూడ పై వర్తమానకాలికానుబంధంవలె కేతన పెద్దన్నల అర్వాతనే వాఙ్మయంలో గాని వ్యవహారంలో గాని చోటుచెసికొన్నది కాబట్టే వీరి ఉదాహృతరూపాలు వారి వ్యాకరణాల్లో అనుబంధ రహితాలుగానే ఉదాహృతాలై ఉన్నాయి

ఈవిరోధాన్ని కనిపెట్టి ఆ రెండుచోట్లా వ్యాకర్త ఉద్దేశం వేరని వ్యాఖ్యాతలు మొదటినుండీ చివరిదాకా అందరూ తప్పుచేశారనీ శ్రీవజ్ఝల సీతారామస్వామి శాస్త్రి వాదించారు- వసతి అంటె ఉన్న కాదనీ ఉండు అని లస్తి అంటే కల కాదనీ కలుగు అని చెబుతూ అసలు చింతామణికి ఈరూపాలు చెప్పడి మిష్టమే లేదు దాని కర్తవ్యమిది కాదు ఒకవేళ ఎవరైనా చింతామణితో వసల్యను బంధసహిత అస్త్యనుబంధసహిత రూపాలు సాధించుకోవాల్సిందే లని పట్టుబడితే ఆరూపాలు రక్షించుకున్నవా రున్నా రక్షింప గలవా రము అన్నట్లు విశేషణాంతాలుగా ఉండవలసిందే తప్ప ఇతరవిధంగా ఉండటానికి వీలులేదన్నారు ఇలా అనడానికి

| | |
|---|---|
| కేతన–వర్తమానకాలం | అడిగెదుము–అడిగెదరు |
| | అడిగెదవు–అడిగెదరు |
| | అడిగెదను–అడిగెదము |
| భవిష్యత్కాలం– | వలుకుము–వలుకుదురు |
| | వలుకుదువు–వలుకుదురు |
| | వలుకుదును–వలుకుదుము |

పెద్దన్న ఉదాహరణలు గూడ ఇలాంటివే

2 చింతామణి విషయ పరిశోధనం — 58 శివ విషయాలు

2 నవ విషయాలు

కారణం చింతామణి చెప్పే యథార్థరూపాలు రక్షించుచున్నాడు రక్షింపగలడు వంటివి నన్నయరచనలో ఎక్కడాలేకపోవడం—అ

పైవాదం యథార్థాన్ని తిరగవేసి చెప్పడంగా ఉంది చింతామణికీ నన్నయ రచనలో భేదమున్నదనే కొత్తగా పొసగని సందర్భాలున్నవనే వీరేశలింగం ప్రభృతులు చెప్పాకకి విమర్శకులు చింతామణిరచన నన్నయచేసి ఉండదని చెప్పారు ఇప్పుడు ఆవాదాన్నే మలిచి స్వమతానికి మాపటానడం విచిత్ర విషయం

చింతామణికర్త క్రియలుగా అనుబంధసూత్రాలయిన వర్తమాన భవిష్యదర్థక రూపాల్ని రక్షించుచున్నాడు రక్షింపగలడు వంటివాటిని ఎలుగెత్తి చాటుతుంటే గ్రంథకర్త చెప్పనిదీ వ్యాఖ్యాతలుచేయనిదీ అయిన చిత్రార్థం అసూత్రాలకుచెబుతూ చింతామణికి నన్నయకి ఏకత్వాన్ని అంటగట్టడం ఉచితమైన కార్యంగా కనుపించదు

పైన చూపిన సందర్భాలు పరిశీలిస్తే భాషాంధ్రీకరణోపయోగిగా చింతామణి రచన జరిగినదనే వాదం ఎలాసందర్భపడదో పైగా మూలోచ్ఛేదిగా ఎలా పరిణమిస్తున్నదో తెలిసివస్తుంది

ఆంధ్రభాషాభూషణ కావ్యాలంకారచూడామణి వికృతివివేకాలు ఆచ్ఛికశబ్ద నిరూపణ ప్రవణాలనీ వాటిలో సంస్కృతశబ్ద నిరూపణం చాలతక్కువనీ దీన్ని బట్టి గూడ అవి చింతామణికి తరువాతివని శాస్త్రిగారి వాదం — 26వ విషయంలో

## చింతామణి సంస్కృతసమ స్వరూప నిరూపణ ప్రవణమా?

తెలుగుభాషకు వ్రాసిన వ్యాకరణంలో శాస్త్రిగారనుకున్నట్లు అచ్చమైన తెలుగుకు తక్కువగా లక్షణం ఉండటం దానిప్రాథమికతను ఎట్లు సాధిస్తుందో తెలియడం లేదు అట్లే శాస్త్రిగారన్నట్లు ఆచ్ఛికశబ్దాలు అధికంగా సాధించినంతమాత్రాన ఒకవ్యాకరణం అర్వాచీనమని వాదించడం ఎలా సబబో బోధపడదు ఈవాదాలు అసహాయస్థితిలో వ్యక్తిచేసే అసందర్భ ప్రసంగాలుగా కనుపిస్తున్నాయి పైగా

చింతామణిసూత్రాలు 275 (శాస్త్రిగారన్నవి)లో ౦0 మాత్రం ఆచ్ఛిక విషయకాలైనట్లు వారు వ్రాయడం కేవలం సాహసం అజంత పరిచ్ఛేదంలో కేవలం మూడు సూత్రాలు తప్ప మిగిలినవన్నీ సంస్కృతసమశబ్ద నిరూపణం చేస్తున్నట్లు వ్రాశారు ఆవ్రాత ఎంతగా అయథార్థమో సోదాహరణంగా తెలుసుకుందాం

## అజంతపరిచ్ఛేదం

అజంతపరిచ్ఛేద ప్రారంభంలో నామవిభక్తులు వాటి ప్రయోగం చూపించబడ్డాయి ఇవన్నీ కేవలం సంస్కృత సమ భాషకే నిర్దేశించబడ్డాయని అనగలరా ఎవరైనా ? అయినా కొంత తడవు వారి మాటనే పాటించి వారి వాదంలోని నిజానిజాల్ని పరిశీలిద్దాం

న చ దేశ్య పదే (అజంత–48)

ఉదా నవలా జేజే తేజీ నేజా లకోరీ–ఈసూత్రం సంస్కృతసమ భాషకు ఉద్దిష్టమైందని అనలేము కేవలం దేశ్యశబ్దజాలంకోసమే చూపించబడినది

2 క్వచిద మహతోఽపి డుక్ స్యాత్ (అజంత–53)

ఉదా కైరఁడు కత్తెఁడు జన్నఁడు–ఇవి సంస్కృతసమాలా ? ఈసూత్రం సంస్కృతసమాలకు అసలు అన్వయిస్తుందా ?

3 ఏకాదే రమహతాం చ డావున్న (అజంత–5 )

ఉదా ఒక్కఁడు జేఁడు మనుమఁడు మొ ఇది కేవలాచ్ఛికశబ్ద నిరూపణం చేయడం లేదా

4 వికృతౌ చ స్త్రీలింగా స్త్రీలింగక సర్వనామదేయాస్స్యుః
(అజంత 54)

---

చింతామణి విషయ పరిశోధనం - 27వ విషయం

ఉదా గట్టురాపట్టి ముక్కంటి కలికి మొ సూత్రం వికృతౌ అని కంఠోక్తి చెబుతుంటే అది అచ్చికభాషను మినహాయించిన సూత్రమయినట్లు కొత్త వారెలా వాదించారు ?

5 వాయిరవు ర్వక్రతమా (అజంత-67)

ఉదా కై-కయి జౌర-అవుర ఇది కేవల సంస్కృతసమాలకు ఉద్దేశించిన సూత్రమా

6 న్వంతా న్నామ్న ఙజ్ నోర్బహువచనే (అజంత-70)

ఉదా గొలను-కొలఁకులు కెలఁకులు ప్రూ కులు ఇది సంస్కృతసమేతర భాషా విషయకం కాదని ఎవరైనా అనగలరా

7 కుత్రచిన్నులోపశ్చ (అజంత-7 )

ఉదా చేను-చేలు మీను-మీలు ఈసూత్రం గూడ కేవలాచ్ఛాంధ్ర భాషావిషయకమే

8 నలలో ర్బిందుయుతో డుర్వా లులయో
ఉల్లగపి తయో పరత (అజంత-7 72)

ఉదా విల్లు-విండులు ముల్లు ముండులు-విండ్లు-ముండ్లు

ఈ క్రింది సూత్రాలు కూడ సంస్కృతిసమేతర శబ్దవిషయకాలని తెలుస్తూ ఉంది

9 నిత్యం దారాదేశ్చ స్యాల్లోర్లులయో రురౌచ తత్ర స్త (అజంత-78)

ఉదా అలు-అండ్రు అండ్ర చెల్లెండ్రు కోడండ్రు అల్లుండ్రు మొ

ఈ సూత్రంలో అనాచ్ఛికశబ్దాలకు ప్రమేయం ఎమైనా ఉందా ?

0 రోశ (అజంత-74)

ఉదా గోరు-గోళ్లు పేరు-పెళ్లు ఇదికూడా పైసూత్రం వంటిదే

ఇలా ఒక్కొక్క సూత్రాన్ని వివరిస్తూ ఉటంకిస్తూపోతే పెద్ద గ్రంథం కావచ్చు కాబట్టి ఇట్టివే అయిన సూత్రాల్ని కొన్నిటిని ఉదాహరణమాత్ర సహితంగా క్రింద ఇస్తాను

డలటా ముదితాం తస్యచ వాలుక్ (అజంత–75)

ఉదా గుడి–గుళ్లు కాలు–కాళ్లు, వ్రేలు–వ్రేళ్లు మొ

2 సలోలా శ్చ (అజంత–75)

ఉదా అంబళ్గాచి పందిళ్వేలు

3 ఔపవిభక్తిక లీనా మిల్లుగ్ బహుళం తద్వైవ డుశ్చ స్యాత్ (అజంత–77)

ఉదా గుద్దలి–గుద్దండ్లు రోకలి–రోకండ్లు పెంటిలి–పెండ్లిండ్లు గొద్దలి–గొద్దండ్లు

4 అపిసరయుక్త సమాప్తౌ ఘాయోఽంతే లుక్ ప్రదృశ్యతే నాఖ్యాసు (అజంత–78)

ఉదా పండ్లు–పండ్లులు ముళ్లు–ముళ్లులు మొనళ్లు–మొనళ్లులు

5 కేషాంచి దుదంతానాం నేతివిభక్తావుసో యక్స్యాత్ (అజంత–79)

ఉదా ఊరునన్–ఊరన్ మేనునన్–మేనన్ మొ

6 నౌ విభక్తికినామ్నో మిత్వం స్యాత్ సప్తమి తృతీయార్థే (అజంత–80)

ఉదా వింటన్ ఇంటన్ కంటన్ మొ

పైన ఉదాహరించిన సూత్రాలు కేవలం అచ్చాంధ్రభాషకు పరిమితమైనవి ఇంత సూత్రాసముదాయం వారెన్నుకున్న అజంత పరిచ్ఛేద మొక్కదాంట్లోనే వారు చెప్పిన సూత్రాల కిబ్బడిముబ్బడిగా కనిపిస్తుండగా చింతామణి కేవల సంస్కృత సమ భాషా మాత్ర వ్యాకరణ మనడం ఎంత న్యాయ్యమో విజ్ఞులే వివేచించాలి

శాస్త్రిగారు తమ విషయపరిశోధనంలో 28వ విషయంలో వికృతౌ సర్వే శబ్దా క్లీబసమా స్త్రీసమాశ్చ నాన్యేస్మ్యు క్లీబసమా ఏషామాద్వివత్ స్త్రీవమ్స్యు స్త్రీసమా సమాస్తు సహా అనే శ్లోకాన్ని వ్రాసి దానిక్రింద మరిమూడు శ్లోకాలు వాత వ్రాసి పైసూత్రమువెల్ల సామాన్య విధులగునంతేయు క్రమం ప్రవృత్తి విషయకము లగునంజేసియు వానిని జెప్పినంత మాత్ర మున నాచ్చికవిషయ ప్రాధాన్యము తోంచనెందు రున్నారు వారి వ్రాతనుబట్టి ఆ శ్లోకం బాది సామాన్య విధులనె చెపుతుండాలి కాని అచ్చిక శబ్దంబులెల్లం దఱమగి స్త్రీసమంబులు క్లీబసమంబులు నైయుండు అను బాలవ్యాకరణసూత్రానికి మూలంవంటి దాని పూర్వార్థం గాని ఎలాగే క్లీబసమాలంటే స్త్రీసమాలంటే ఏమిటో వివరించె దాని ఉత్తరార్థం గాని ఎలా సంస్కృతసమ భాషకు గూడ లక్షణం కాగలదో తద్జ్ఞులె నిర్ణయించాలి

### హలంతపరిచ్ఛేదం

ఇలాగే హలంతపరిచ్ఛేదంలో కూడ వారు చూపినవి రెండు సూత్రాలు — కేవలాచ్ఛికాలుగా వాటిలోనూ ఒకసూత్రం మాత్రం సంస్కృతసమ కేవలాచ్ఛాంధ్ర భాషా సామాన్యంగా ఉన్నదట మిగిలిన సూత్రసముదాయ మంతా కేవలం సంస్కృతిసమ భాషాపరిమితమట ఈవాదం కూడ కేవలం అయథార్థమే మోదండి

ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతపాక్ ప్రాకృతభవ
వికృతిభవా

వ్యతిరిక్తా ఘూయాంసో వ్యతిరిక్తా స్సంప్రదాయతో వేద్యా
(హలంత— )

---

ఇక్కడ నాన్యేమ్యు [ఇతరాలు—పుంలింగపదాలు ఉండవు] అనడం అవిచార మూలకం ఎందుకంటే తమ్ముడు అల్లుడు మనమడు మగడు—ఇవన్నీ దుష్టాలు కావలసి వస్తుంది

చింతామణి విషయ పరిశోధనం—27వ విషయం

ఈ శ్లోకం వ్యాఖ్య లేకుండా బాలసరస్వతీయ ప్రతులు కొన్నింటిలో ఉండటం వలన ప్రక్షిప్తమా అని సందేహించబడింది అయినా మరికొన్ని ప్రతుల్ని బట్టి దీన్ని బాలసరస్వతి అహోబిలపతి ఇద్దరూ వ్యాఖ్యానించినట్లు ఈ గ్రంథంలోనే ప్రకరణాంతరంలో నిర్ణయించబడింది కాబట్టి దిన్ని చింతామణి సూత్రంగానే స్వీకరించుదాం

దీని వ్యాఖ్యల్నిబట్ట ఇది ప్రాకృతభవ శబ్దాలూ కేవలాచ్ఛికశబ్దాలూ ఎలా ఉంటాయో చెబుతుంది ఉదా జముఁడు జాతర మొ కాబట్టి దీన్ని సంస్కృత సమభాషామాత్రసంబంధిగా లెక్కించలేం

2 దేశ్యా దస్మద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుమూ వురూచ స్తః (హలంత — 2)

ఉదా ప్రక్రియాదశలో - నాను నాము నీవు విరు

ఈసూత్రం కేవలం దేశ్యశబ్ద నిరూపణ ప్రవణమే కదా

3 న్నుమ్మూ హ్రస్వశ్చాదే రమి శసి చ (హలంత — 3)

ఉదా నన్ను మమ్ము నిన్ను, మిమ్ము

4 అన్యతరలుక్ చ యు క్తస్య (హలంత — 4)

ఉదా నను—మము నిను—మిము

5 కిర్నజమ (హలంత — 5)

ఉదా నీకి మొ రూపాల్ని నిషేధించే సూత్రం

6 ప్రథమాయా మేద స్మదః (హలంత — 5)

ఉదా నాను-నేను నాము-నేము—ప్రక్రియాదశలో

7 ఏతయోర్బహుత్వే మ (హలంత — 6)

ఉదా మేము-మాచేత మీరు-మీచేత

8 హ్రస్వో వాదౌ నము వాన్ ద్వయవద్ ఏచనద్వయేఽన్యయో ర్వాత్
(హలంత — 7)

ఉదా తాను-తారు తన్ను-తను తమ్ము-తమ తనచేత—తముచేత

9 భూయ ఉభయార్థివాచీ య కశ్చిద్ భవతి నిత్యబహువచన
తస్య జసో ముశ్శసో ల (హలంత—2)

ఉదా మనము మనల

0 ప్రాగ్వద్ సర్వం భినాదికేఽన్యత్ర (హలంత—2)

ఉదా మనచేత మనకొఱకు-మనవలన—ఇత్యాది

కవిభల్లాస్తై క్రియాణాం నామ్నాం వోల్లోప ఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యంతే (హలంత-28)

ఉదా బూదర్జనులు వత్తుర్జనులు—క్రియలు
కన్దెరచి చన్గడిచి విల్వాని కల్దాగివి—నామాలు

2 ది స్స్యాత్ సంబంధార్థే సరంస్మాత్ (హలంత—25)

ఉదా బంటుది నీది నాది మొ ప్రాతిపదిక ప్రథమాంత రూపం ఒకటైన శబ్దా
లకే అంటే సామాన్యంగా అచ్చతెనుగుశబ్దాలకే ఈసూత్ర మన్వయిస్తుంది
చెట్టుది—పుట్టది

3 యుష్మదస్మ దాత్మభ్యో ద్వితీయర్థకః (హలంత—26)

ఉదా నాదు (సొమ్ము) నీదు (వేడుక) తనదు (కీర్తి)

4 అ ఇ ఉ స్త్రీవిషయాః (హలంత—27)

ఉదా లచ్చ లచ్చి లచ్చు రామ రామి రాము గౌర గౌరి గౌరు
మల్ల-మల్లి మల్లు ముంత పడి తూము స్త్రీసమాలు చేసికొని సులోపం
చేసికోవాలి

15. నామ్నః కవర్గక స్యాత్ స్వార్థే స్యాదుత్వమపి పరే తస్మిన్
(హలంత — 29)

ఉదా పొలఁతి—పొలఁతుక చెలఁతుక గొంతుక పెలఁచుక, నిప్పుక

16. ఇదు పో త్తమో త్తమానాం బహువచన ఉకో త్తమేత ఉద్భవతి
(హలంత — 37)

ఉదా బలిమి—బలుములు కలుములు, చెలుములు మలుకులు, కులుసలు మొ

17. కార్యా ఔపవిభక్తికి ఒంటపుంయశ్చ (హలంత—40)

ఉదా పూవిలుతుఁడు వాలుగంటి నలువ మొ॥

18 లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాంగేషు (హలంత—41)

ఉదా వేల్పుదొర కైదువదారి. పేల్పుచెట్టు. గట్టురాకొమరుఁడు: జవ్వాదిసెట్టి, మొ

19. కేవల వికృతిపద్దై ర్వ్యస్సమానకం తంత్రువ న్తి వాక్యజ్ఞాః,
(హలంత—42)

ఉదా : నిండుపున్నమి జాబిల్లి, వెన్నెలతేట, పేరామనిచిగురు, మొ

పైసూత్ర సముదాయమంతా సంస్కృతానపేక్షంగా కేవలం అచ్చికశబ్ద సముదాయానికి మాత్రం అన్వయించేదే ఈయథార్థాన్ని శాస్త్రిగారు ఎందుకు స్పష్ట పరచలేదో, పైపెచ్చు హలంతపరిచ్ఛేదంలో సంస్కృతసమేతర భాషావిషయకంగా ఒక్క సూత్రమే కలదంటూ ఎల చెప్ప సాహసించారో తెలియదు.

హలంత పరిచ్ఛేదంలోని మొత్తం సూత్రాలు 46లో కేవలం సంస్కృతసమ భాషామాత్రాన్వయిగా ఎంత సూత్రసంఖ్య గలదో చూద్దాం.

'ప్రథమైకవచన తుల్యం సర్వత్ర హలంత మగుణవద్రూపకృతి — 1

ఉదా · సుకర్మా సుశర్మా ఇంద్రవర్మా, విశ్వజిత్ మొ

మనిముందు నిర్ణయించి ఉన్నాం పోగా మిగిలినపదహారు సూత్రాలు సంస్కృతి సమ సమేతరభాషా సామాన్యంగా అన్వయిస్తున్నాయన్నమాట

ఉదా షష్ఠి భవేత్ ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా సామ్యాం (హలంత-? )

సంస్కృతసమము—రాముని గుణము అచ్చతెనుగు—ఆయమ్మనిమాట

ప్రతిషేధ వాచినాం ని —(హలంత—23)

అచ్చతెనుగు—వందని సంస్కృతసమము-పరింపని ఇలాగే మిగిలిన సూత్రాలు కూడ ద్వివిధ పదజాలానికి సమన్వయిస్తాయి

## క్రియాపరిచ్ఛేదం

ఈవిధంగానే శాస్త్రిగారు క్రియాపరిచ్ఛేదం మొత్తంలో ఒక్కసూత్రం మాత్రమే అచ్చాంధ్రభాషకు ఉద్దిష్టమైనదని మిగిలినసూత్ర సమూహమంతా సమ భాషకే పరిమితమనీ వాదిస్తున్నారు ఆవాదనలోని నిజానిజాలు కూడ చూడవలసి ఉంది

క్రియాపరిచ్ఛేదంలో మొత్తం 45 సూత్రాలున్నాయి వీటిలో సమేతరభాషకు సమ భాషకు ఉభయభాషాసామాన్యానికి ఎంతెంతసూత్ర సముదాయం సమన్వయిస్తుందో పరిశీలిద్దాం

## సమేతరభాషకే ఉద్దిష్టమైన సూత్రాలు

ఆత్వాదీ తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం చ (క్రియా—43)

2 వర్ణాగమో విశేష పురుషేష్వర్థేషు చాప వచనేషు (క్రియా—45)

## సమభాషకు మాత్రము ద్విష్టమైన సూత్రాలు

ఉపకృతి పరిః - సంవృతి ఫేనా త్రివిధా క్రియా —
2 వుపణ్వాది రుపకృతిః —
3 అథ ఘాజ్యాదిః పరిణతిః —3
4 అన్యా లు రింజవన్యాది —
5 స్యాద్ధురుపకృతి కృదన్తా —5
6 సా పరిణతి పియవరన్విశ్రైవ భవేత్ —6
7 సంవృతి రివాతాకారా —7
8 భవతి క్రియాపదానాం త్రివిధా మించుగాగమః — 8

పై ఎనిమిది సూత్రాలూ సమేతరభాషకు అన్వయించనివి మిగిలిన ముప్పై ఆరు సూత్రాలు సమభాషకూ సమేతరానికీ సమంగా సమన్వయిస్తాయి

ఉదా

వసతి రనుబంధకి స్స్యాత్ యత్ర లదర్థో వివక్షిత స్తత్ర — 0
సంస్కృతసమం-పఠించుచున్నాడు అచ్చతెనుగు-వండుచున్నాడు

2 క్త్వాభూతయోః క్రియా స్త్వస్యేత్ — 5
సంస్కృతసమం-పఠించి అచ్చతెనుగు-వండి పఠించితిమి వండితిమి

3 తిర్యగ్దేవ కర్తృమ బహువచనం చైకవచనమేవ స్యాత్ భూతే తద్ధర్మే చ —20

సంస్కృతసమం—సింహములు చరించె అచ్చతెనుగు-గుఱ్ఱములు వచ్చె
ఇలాగే మిగిలిన 36 సూత్రాలూ సమభాషకూ సమేతరభాషకూ సమానంగా అన్వయించి రూపనిష్పత్తిని చేస్తాయి

అయితే అత్వాది తత్సమానాయిన దేశ్యానాం క్రియాపదానాం చ — అనే సూత్రం విడి [illegible] ప్పవలసిన అవసరం ఏమిటి? ఈసూత్రార్థాన్నింతో నే శాస్త్రిగారు

ఈ ఒక్క పరిచ్ఛేదమే కాక మిగిలిన పరిచ్ఛేదాలన్నీ కేవల సంస్కృతసమభాషకే ఉద్దిష్టాలని వాదించారు ఆవాదం అబద్ధమని వారెన్నుకున్న అజంత హలంత పరిచ్ఛేదస్థ సూత్రాల పరిశీలనంతో తెలిసినది కాని క్రియాపరిచ్ఛేదంలో మాత్రం ఆ సూత్ర నిర్మాణావశ్యకత ఏమిటో తెలుసుకోవలసి ఉంది ఆ పరిచ్ఛేద ప్రారంభం సంస్కృత ధాతువుల ఆంధ్రీకరణకు ఉద్దిష్టమైన సూత్రాలతో జరిగినమాట యథార్థం తెలుగు క్రియల్లో కాలవిభాగం క్రియాపదనిర్మాణం వ్యతిరేక క్త్వార్థకాది క్రియాపద నిర్మాణం క్రియాప్రత్యయవిధానం సంప్రార్థనార్థంలో పుడుట ఏకం మొదలుగా కొన్ని ప్రయోగనిరూపణంవరకు సూత్రరచన కొనసాగింది అప్పటికి క్రియాపరిచ్ఛేదంలో 42 సూత్రాలు చేయబడ్డాయి క్రియాపరిచ్ఛేదం మరో మూడు సూత్రాలతో ముగియ బోతున్నది అపుడు సూత్రకర్త పరిచ్ఛేదప్రారంభాన్ని తిరువాత సూత్రరచనని గుర్తించి రచనలో దొర్లిన పొరపాటును అంటే ఇంతవరకూ జరిగిన సూత్ర నిర్మాణం సంస్కృతసమ ధాతువులకే అన్వయిస్తుంది—అనే భ్రాంతిని సరిదిద్దుతూ చివరి సూత్రానికి ముందుసూత్రంగా ప్రస్తుత సూత్రం చేసిఉంటారు ఇది పఠితల సందేహనివారణార్థమై కల్పించబడింది కాని దాన్ని శాస్త్రిగారు తమ వాదానికి అనుగుణంగా మలచుకొని కొంత వివాదం లేవనెత్తగలిగారు

శాస్త్రిగారు చింతామణి సంస్కృతసమభాషా నిరూపణ ప్రపంచమని నిర్ణయించడానికి కేవలం అజంత హలంత క్రియాపరిచ్ఛేదాలనే ఎన్నుకోవడంలో విశేషముంది మిగిలిన సంజ్ఞా సంధి పరిచ్ఛేదాలలో సంస్కృతసమభాషకొఱకు ఉద్దిష్టమైనట్లు ఆభాసించే సూత్రాలు కూడ మిక్కిలి తక్కువ

సంజ్ఞాపరిచ్ఛేదంలో మొదట శ్లోకం వ్యాకరణ శాస్త్రానికి సహజంగా సంబంధించి పడనిది ఆశ్లోకాన్ని 4సూత్రాలుగ విభజించి వ్యాఖ్యాతలు వివరించారు దాన్ని మినాహాయించి చూస్తే ఈపరిచ్ఛేదంలో 37సూత్రాలున్నాయి వీటిలో సమేతర భాషకు సమభాషకు ఉభయభాషాసామాన్యానికి ఎంతెంత సూత్రసముదాయం సమన్వయిస్తుందో పరికిద్దాం

## సంజ్ఞా పరిచ్ఛేదం

స్వస్థానవేష భాషాభిమతా అపహాయ - 5

స్వదేశవేష భాషాభిమానంతో రసదృష్టిగల సుజనులు తెనుగుకావ్యాల్ని గూడ బహూమానిస్తార ని సూత్రతాత్పర్యం ఇదితెలుగులో కావ్యరచనను పండితులు సమాదరించరేమో అనేసందేహానికి నివృత్తకంగా చేయబడింది కాబట్టి తెలుగుకే సంబంధించినది-అనవచ్చు కాని తెలుగుకి సంస్కృతసమ విరహితమైనదనేఅర్థం ఎలా చెప్పగలం అని ప్రశ్నిస్తేమాత్రం దీన్నిఉభయభాషా సామాన్యంగా గణించ వలసి ఉంటుంది

సిద్ధిర్లోకాద్దృశ్యా — 6

భాషాసిద్ధి లోకంవలన తెలియదగినది అని సూత్రార్థం లోకవ్యవహారంవలన భాషాసిద్ధిని పొందాలంటే అదిఅచ్చంగా తెలుగే కావాలి సంస్కృతానికి లోక వ్యవహారం మృగ్యంగాబట్టి

లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ —7

లోకము అన్యాదృశముకానిదీ నిత్యమును అని సూత్రార్థం ఇదిగూడ పై సూత్రానికి వివరణం - కాబట్టి దీన్నిగూడా అచ్చతెనుగుకే అన్వయించాలి

సంస్కారార్థో నియమ —8

భాషానియమనం సంస్కారంకోసం సంస్కృతభాషా నియమం పాణి నీయమే చేసిందిగాబట్టి ఈ నియమ కల్పనం తప్పనిసరిగా సంస్కృతేతరభాషకే అంటే అచ్చతెనుగుకే సమభాషలో ప్రత్యయాలే తెలుగువిగా ఉండి మిగిలిన ప్రకృతి సంస్కృత వ్యాకరణసిద్ధంగానే ఉంటుందికదా

అనియమాద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశ — 9

నియమరాహిత్యం వలన గ్రామ్యము దాన్నేఅపభ్రంశమని అంటారు అని సూత్రార్థం ఇదిగూడ పైసూత్రం వంటిదే

ఏషా తయోర్భవేద్వికృతి — 1

ఈభాష ఆ రెండింటికి వికృతి అని సూత్రార్థం ఇది అచ్చతెనుగుకె అన్వయిస్తుంది

కేవలతయా నుసర్పత్యుభేచ యేయం యథాతథం భాషా —

ఆ రెండింటిని (సంస్కృత ప్రాకృతాలను) యధేచ్ఛగా కేవలంగా అనుసరిస్తుంది-ఈ తెలుగు ఇదీ సమేతర భాషనుగూర్చి చెప్పినదే

షట్త్రింశదత్రతే అన్యేచాను ప్రవిశంతి శబ్దయోగవశాత్ — 2

తెలుగులో వర్ణాలు 36 ఇతర వర్ణాలుగూడ శబ్దయోగవశాన తెలుగులో జేరును—అని సూత్రార్థం ఈ సూత్రమూ అచ్చతెనుగునకు చెందినదే ఇతర వర్ణాలంటే రవర రేవ మజ్ఝా—వంటి అన్యదేశీయాలలోని వర్ణాలు

ద్వివిధాదిదుదేతోఽచో వక్రతమౌ చాప్యనుస్వారౌ
కగచజయుగ టడణతదనపబమ యరలవసహాళం తు హల్వర్గ — 3

అచ్చతెనుగు వర్ణసమామ్నాయాన్నే ఆవిష్కరిస్తుంది - ఈ సూత్రం కాగా సమేతర భాషకు చెందినదే

సిద్ధస్సాధ్య శ్చానుస్వార పూర్ణార్ధభేదతో ద్వివిధ — 4

బిందువు పూర్ణార్ధభేదంతో సిద్ధమనీ సాధ్యమనీ ద్వివిధం అని సూత్రార్థం ఈ సూత్రమూ అచ్చతెనుగునకు చెందినదె

హ్రస్వాత్ పూర్ణోఽపి భవేత్ దీర్ఘాత్‌చేత్-ఖండ ఎవ సజ్ఞేయః — 5

హ్రస్వాంకంటే పరమైన బిందువు పూర్ణంగాడా అవుతుంది దీర్ఘంకంటే పరమైతే అర్ధబిందువే - అని సూత్రార్థం పడఁతి-పడంతి ముద్దుఁగన్నియ—ముద్దుంగన్నియ వీక దాఁక—అచ్చతెనుగులే

లఘవోఽలఘవశ్చేతి ద్వేధాంతస్థాన్ విదన్తి శాస్తారః
అన్యేఽన్య వ్యాకరణస్పష్టా రస్త్వత్ర గృహ్యాతే ద్వివిధః 6

య ర ల వ ల ద్వైవిధ్యం లఘ్వలఘు భేదం వాటి ఉనికి చెప్పబడ్డాయి కాగా ఈ సూత్రమూ సమేతరభాషా సంబంధే

'అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః'—17

క్రియలలో భూతార్థకాలలో కనిపించేది, నామాదిలో ఉండేది అయిన యకారం మినహా, మిగిలిన యకారం అకారంతో ఉంటుంది – అని సూత్రార్థం పోయెను, యెవ్వడు మొ పదాల సాధుత్వాన్ని నిర్ణయించే సూత్రం కాబట్టి ఇదీ అచ్చతెనుగే.

తరువాత 18వ సూత్రంనుండి 2 వ సూత్రంవరకూ, యడాగమాన్నీ, లఘు–అలఘు–అంతస్థ వర్ణాలలో సాధర్మ్య, వైధర్మ్యాలనీ, చజల దంత్య తాలవ్యభేదాల్నీ, సావర్ణ్యాన్నీ వివరించడం జరిగింది. ఈ కార్యాలన్నీ సమేతరభాషా సంబంధులే.

అలాగే 22నుండి 33వరకు గలసూత్రాలతో తెలుగువ్యాకరణంలో సంస్కృత వ్యాకరణసిద్ధ సంజ్ఞలకే మారుపేర్లు చెప్పబడతాయి. ప్రత్యేకంగా సంజ్ఞాకల్పనం, తత్రాపి అచ్చతెనుగు వర్ణాల్లో పరుష సరళాది భేదనిర్ణయం జరిగింది. దీన్నిబట్టి ఈ సూత్రసముదాయమంతా సమేతరభాషాసంబంధిగానే ఉంది. అయినా వాటిలో నాలుగు సూత్రాలనే అచ్చాంధ్రభాషా సంబంధులుగా నిర్ణయిద్దాం.

అలాగే 34, 35 సూత్రాలల్లో దేశీయ ఛందస్సుకొఱకైన ఇంద్రాదిగణాలు, వళిప్రాస లక్షణాలు చెప్పబడ్డాయి. కాగా అవి సమేతరభాషాసంబంధులే.

పైపరిశీలనలో 18సూత్రాలు దేశభాషాసంబంధులుగా నిర్ణయించబడ్డవి. ఇక సంస్కృతసమభాషా మాత్రసంబంధి సూత్రాలు ఎన్ని ఉన్నాయో చూద్దాం.

1. 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే'-10వ సూత్రం - ఉత్తరార్థం.

సంస్కృత ప్రాకృతాలు మొదటివి అంటే మాతృభాషలు-అని సూత్రార్థం.

2. 'ఆద్యాయాః పంచాశత్ వర్ణాః —11

సంస్కృతానికి వర్ణాలు యాభై—అని సూత్రార్థం.

3. 'ప్రకృతేస్తుతే దశోనాస్స్యుః'—12

ప్రాకృతానికి ఆ వర్ణాలు పదితక్కువ, అంటే నలభై—అని సూత్రార్థం.

4. 'నపదాన్యవ్యయ సుప్తిఙ్ క్త్వా తుమునాం'—36

అవ్యయాలు (ప్రాతః), సుబంత తిఙంతాలు; (రామః, రమతి) క్త్వాంతాలు (గత్వా), తుమునంతాలు (గన్తుం)—వీటికి సంస్కృతసమ పదాలు ఉండవు.

5. 'అనుకృతౌ స్తి వాక్యంతు'—37

అనుకరణంలో సంస్కృతవాక్యమైతే ఉండవచ్చు—అని సూత్రార్థం.

ఈ సూత్రాలైదు సంస్కృతసమ భాషామాత్రోపయోగులు. పోగామిగిలిన 14 సూత్రాలు సమ, సమేతరభాషా సంబంధులుగా ఉన్నాయి.

1. 'ప్రాతిపదికం హి నామ'—22

ప్రాతిపదికాన్ని నామమంటారు—రామ, బల్లిద.

2. 'తిఙ్మధ్య శేషషష్ఠీ సుప్కర్మ ప్రవచనీయజ విభక్తీః
కించిత్ప్రికంపనాద్భుత సంతాప యదా తదా కిమేవాంశ్చ
క్త్వా కిల తూష్ణీమాద్యా నభిదధతి కళా ద్రుతోవ యేషాంస్యాత్'—38

ద్రుతరహితాలైన తిఙ్మధ్యక్రియలు (వండితిరి—వండితిమి, మొ।) రాముడు మనుమడు వంటి ప్రథమార్థకాలు, రామునియొక్క, రామునిగూర్చి మొదలయిన పదజాలం 'కళ' అనబడుతుంది.

3. 'విర్రశాన్ పేచోషాదిక శబ్దాన్ ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః
ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్'—41

"పేచ, ఊష వంటి పద్దాలు సంస్కృతంలో ప్రయోగార్హాలైతే అగుగాక, ఇక్కడ (తెలుగులో) మాత్రం కవిసమయసిద్ధము, సుప్రసిద్ధము అయిన పదమే ప్రయోగించాలి. ఉభయభాషా (సమ, సమేతర) సామాన్యోపయోగి సూత్రం.

ఇలాగే మిగిలిన 11 సూత్రాలు సమ, సమేతరభాషా సామాన్యంగా ఉన్నాయి

## సంధి పరిచ్ఛేదం

మిగిలిన సంధిపరిచ్ఛేదాన్ని గూడ ఇదే దృష్టితో పరికిస్తే, అది కేవలం సంస్కృతసమభాషా నిరూపణానికే ఉద్దిష్టమూ కాదూ అనే అంశాన్ని సహేతుకంగా నిర్ణయించవచ్చు.

సంధిపరిచ్ఛేదంలో 42 సూత్రాలున్నాయి. వాటిలో క్రింద ఉటంకించినవి సమేతరభాషకే సంబంధిస్తాయి.

1. 'పరిమితౌ సమస్తానాం'—5:

ఉదా : పీఠెడు, తూమెడు, మొ।

2. 'తద్వత్త దాదిజస్య'—8:

ఉదా : ఆదెపుడు, అదియెపుడు, ఇదెపుడు, ఇదియెపుడు మొ।

3. 'ప్రాయస్తు స్యాత్ కిమాదికస్యేతః'—9:

ఉదా : ఏమేమి, ఏమియేమి, మొ

4. 'అపిశబ్దార్థస్యేతః'—10

ఉదా : హరినేనద్బిజనేని, హరినేనియద్బిజనేని

5. 'చారే రుపధాత్మనశ్చ ఉగ్వాస్యాత్'—11

ఉదా : కూర్చి—కూరిచి: అమర్చి—అమరిచి

6. 'శత్రర్థే తూతశ్చానోః, తస్యస్యాచ్చ పూర్ణబిందురపి'—12

ఉదా : అనుచు—అన్చు: అంచు: వినుచు—విన్చు: వించు

7. 'శబ్దాత్తచ్ఛబ్దాతః'—13

ఉదా : బాపనది - బాపనయది: కోమటిది - కోమటియది

8. 'పోశ్చ తదాద్యర్థవాచకే మాతః—14

ఉదా : అపుడు - అప్డు: ఇపుడు - ఇప్డు

9. 'ఆద్యస్యామ్రేడితే౽న్త్యలోపశ్చ'—17

ఉదా : అన్నన్న, ఏమేమి, ఔరౌర

10. 'గసడదవాః స్యుః ప్రథమామాత్రాత్ ఆత్మాస్మదో ర్ద్విసైసై తే'—22

ఉదా : అతడు గనెను, సనెను, దక్కరి, దనరెను; వలికెను

11. 'సర్వత్రాజ్వత్ కార్యం జ్ఞేయంయస్య ద్రుతప్రకృతికేభ్యః—27

ఉదా : కలిగెనెమ్మె; సిరినెద

12. 'ఐక్ సంశ్లేషో నాచి ద్రుతస్య'—28

ఉదా : పలికెనెవ్వఁడు; వచ్చెనతండు

13. 'మమ్వోతః —30

ఉదా : చిగురుంగైదువు; పువ్వుంబోణి

14. 'పరుషాణాం గసడదవా స్స్యుః పదాద్ద్వంద్వే'—31

ఉదా : కూరగాయలు; అక్కసెల్లెండ్రు

15. ప్రథమలుగపి ద్విమలోపః—35

ఉదా:— కన్నుఁదమ్మి - కనుఁదమ్మి;
చన్నుఁదోయి—చనుఁదోయి; కల్లుకుండ—కలుకుండ; ముల్లుకంప—ములుకంప

16. 'ఇచ్ఛ విభక్త్యంతిమస్య'—37

ఉదా - నాతోడి చెలిమి, నీచేతిచలువ, నావలని భయము

17. 'ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవంతీహ రుల్వాదే ర్నామ్నాంస్యు స్తేహ్యావిభక్తౌ సమాసేచ'—38

ఉదా : గోటిమొన, గోరిమొన; ఏటికాల్వ; వింటినారి; నూతిగట్టు

18. 'వాఽత్మాస్మదో ర్ద్విత్వస్య స్యాల్లుక్ —39

ఉదా తా ఘనుఁడు—తానుఘనుఁడు; నేవింటి - నేనువింటి

19. 'నలడాదే రంత రుతళ్చ'—41

ఉదా : వెనుక - వెన్క; చిలుక - చిల్క; గాడుపు - గాడ్పు

20. 'అన్యేషాంచ ప్రయోగమహితానాం'—42

ఉదా : కపురము - క్ప్రము; అబ్బురము - అబ్రము; ఉంగరము—ఉంగ్రము

పై సూత్రాలను సమభాష కన్వయించే వీలేలేదు. అవన్నీ కేవలం సమేతర భాషకే సంబంధితాలు. ఇక సంస్కృత సమ భాషకే ఉద్దిష్టమైన సూత్రసముదాయం

1. 'అహమాదీనాం ద్విత్వం'—18

ఉదా : అహమ్మని; కిమ్మని

2. 'లోపో నమ ఆదికే విసర్గస్య'—19

ఉదా : నమ యని; ధర్మసహాయ యని

3. 'నవికృతిశబ్దాత్ పరతః సాంస్కృతికానాం భవన్తిగసడదవాః'—23

ఉదా : దొర కరుణించె, సిరి చంచలము, వాడు టంకాయుధుఁడు, వేల్పుతోయాధిపతి వేల్పు పరబ్రహ్మము

పైమూడు సూత్రాలే సమభాషామాత్రాని కుద్దిష్టమైనాయి. మిగిలిన సంధి పరిచ్ఛేదంలోని 19 సూత్రాలు ఉభయభాషా సామాన్యాలే. ఉదాహరణంగా కొన్ని చూద్దాం.

1. 'మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ'—34

ఉదా : సం. సమ.—కనకపుబొమ్మ, అచ్చతెనుగు—బెట్టిదపు మాట

2. 'దారార్థేఽత ఉదపి రః'—33

ఉదా : ధీరురాలు, బల్లిదురాలు

3. 'ద్రుతస్య సర్వత్రలుక్ సమాసేషు'—29

ఉదా : రాముని యాకృతి, తెల్లదమ్మి

4. 'ఙిగ్వా ద్రుతప్రకృతికాత్ పరతః పరశే స్థిరే చ నస్య స్యాత్'—24
ఉదా : రక్షించెమాధవుఁడు, సం.సమ. కాంచెమగువ, అచ్చతెనుగు.

5. వరుషా ద్రుతప్రకృతికాత్ సరళా స్స్యుః తద్ధ్రితంచబిందు స్స్యాత్—20
ఉదా : హరుఁగొలిచి, సం.సమ. నేఁగొలిచితి, అచ్చతెనుగు

ఇలాగే మిగిలిన సూత్రసముదాయమంతా ఉభయభాషా సామాన్యోపయోగిగా ఉంటుంది. వీటిల్లో పై ఐదవసూత్రం ద్రుతం బిందువుగావడాన్ని విధిస్తుంది. కాగా అద్ది కేవలం సమేతరభాషా సంబంధిగానే నిర్ణయించడానికి వీలుంది. ఐనపుడు సమ సమేతరభాషా సంబంధి సూత్రాల సంఖ్య 18కి తగ్గుతుంది.

## చింతామణి సంస్కృత సమశబ్దమాత్ర నిరూపణ ప్రవణం కాదు

శాస్త్రిగారు ఒకమాట—"ఆంధ్రశబ్ద చింతామణి సంస్కృత భారతాంధ్రీకరణ సమర్థముగా దెలుఁగును జేయఁగోరి సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనుటలోని నియమముల నుపదేశించుట, వానికి సుప్తిఙ్విభక్తులను జేర్చు పద్ధతుల నుపదేశించుట ప్రధానముగఁ జేసికొని రచింపఁబడినది" - అని అనడంవలన, ఆ మాటను కాదని తేల్చడానికి ఇంత గ్రంథం పెరగవలసి వచ్చింది. ఈ పరిశీలన వలన మొత్తం చింతామణిలోని సూత్రాల్లో పరిచ్ఛేదానుగుణంగా సమేతర, సమ, ఉభయభాషా నిరూపణంకోసం ఎంతెంత సూత్రసముదాయం వినియుక్తమైందో ఒక పట్టికగా వేసి చూడవచ్చు.

| | మొత్తం సూత్రాలు[1] | సమేతర భాషకు | సమ భాషకు | ఉభయ భాషా సామాన్యానికి |
|---|---|---|---|---|
| 1. సంజ్ఞా పరిచ్ఛేదం :- | 37 | 18 | 6 | 14 |
| 2. సంధి పరిచ్ఛేదం :- | 42 | 20 | 3 | 19 |
| 3. అజంత పరిచ్ఛేదం:- | 86 | 18 | 21 | 47 |
| 4. హలంత పరిచ్ఛేదం:- | 45 | 19 | 10 | 16 |
| 5. క్రియా పరిచ్ఛేదం:- | 45 | 1 | 8 | 36 |

1. ఈ సూత్రసంఖ్య బాలసరస్వతీయము, వావిళ్ల 1971 నుండి గ్రహింపబడినది. సంజ్ఞలోని మొదటి శ్లోకం నాలుగు సూత్రాలుగా విభక్తమైంది. అది వ్యాకరణ సంబంధి కాదు గాబట్టి ఇక్కడ గ్రహింపబడలేదు

పై పరిశీలనవలన శాస్త్రిగారు 'రమారమి పదునేను శ్లోకములుగ నేర్పడిన యేబది సూత్రములు మాత్రమే యాచ్ఛికశబ్ద విషయకములై యున్నవి' అనిఅనడం కూడా యథార్థం కాదని తేలింది. పైన సమేతరభాషా మాత్రోపయోగి సూత్రాలని చూపబడిన వాటితో సమభాష కేపాటి అన్వయంకూడా కల్పించడానికి వీలులేదు. కారణం వాటి స్వభావ మట్టిది[1]. మొత్తం సూత్రసముదాయంలో సగానికి పైగా భాషా సామాన్యాన్ని ఉద్దేశించి రచితమైనదని, కేవలం 47సూత్రాలు మాత్రమే సమ భాషామాత్ర ఉపయోగార్థం, అంటే శాస్త్రిగారన్నట్లు "సంస్కృతశబ్దములను దెనుగు లోనికిఁ దెచ్చుకొనుటలోని నియమముల నుపదేశించుట" కోసం రచించబడ్డట్లు తేలింది. కాబట్టి చింతామణి సంస్కృత సమభాషా నిరూపణ ప్రవణమనే శాస్త్రిగారి వాదంలో ఏపాటి నిజమూ లేదని తేలింది. కాగా ఆ వాదంమీద ఆధారపడిన శాస్త్రి గారి ఇతర వాదాలనేకం స్వయంపరాస్తాలు అవుతున్నాయి.

### ఆంధ్రభాషా భూషణం ఆచ్ఛికశబ్ద ప్రముఖమా ?

శాస్త్రిగారు తమ పరిశోధనంలో 26వ విషయంగా ఒక విచిత్ర వాదం ప్రతిపాదించారు - ఆంధ్రభాషా భూషణం, కావ్యాలంకార చూడామణి మొదలైన వ్యాకరణాలు ఆంధ్ర వాఙ్మయం వెలిసిన తరువాత పుట్టినవి గాబట్టి అవి ఆచ్ఛికశబ్ద ప్రాముఖ్యంతో ఉండి సంస్కృత సమ శబ్దాల్ని కొద్దిగా మాత్రమే నిరూపిస్తున్నా యని. ఈ కాదం చింతామణి సమశబ్ద నిరూపణ ప్రవణమన్న వాదం నిలబడితేగాని పరిశీలనార్హంకాదు. పైన జరిగిన పరిశీలనలో ఆ వాదం నిజంకాదని తెలిసిందికాబట్టి ప్రస్తుతవాదం పరిశీలించకే ఉపేక్షించడానికి తగిఉంది. అయినా ఆ వాదంలోని నిజానిజాల్ని కూడా సోదాహరణంగా పరికిద్దాం.

"ప్రయోగశరణం వ్యాకరణం" అన్న న్యాయాన్ని భాషలన్నింటికి అన్వయించినట్లే ఆంధ్రభాషకు కూడా అన్వయిస్తే ఆంధ్రవాఙ్మయం వెలసిన తరువాత

---

1. ఉదా – సంధిలో 'అపిశబ్దార్థస్యైతః' అనే సూత్రం ఏని శబ్దంలోని ఇత్వానికి వికల్పంగా లోపం చెబుతుంది కాగా, దాన్ని సమభాషకు అన్వయించలేం. ఇలాగే మిగిలిన సూత్రాలు.

వెలువడ్డ వ్యాకరణాల్లో ఆ వాఙ్మయంలోని భాషానియమాలే ప్రతిపాదించబడతాయి. అయినపుడు కేతన కాలానికి సుప్రతిష్ఠిత వాఙ్మయం నన్నయదే. తిక్కన, కేతనకు సమకాలికుడు. "నన్నయభట్టాది కవిజనంబులలో" అతనికి (తిక్కనకు) కూడ స్థానముంది. నన్నయ తరువాత ఎందరు కవులున్నా, నన్నయ పర్వత్రయంలోని భాషను దప్ప ఇతరాన్ని ప్రమాణంగా అంగీకరించడం అప్పకవివరకూ, ఇంకా వాదిస్తే చిన్నయసూరివరకూ సందేహాస్పదంగానే ఉంటూవచ్చింది.[1] అలాంటప్పుడు కేతన, విన్నకోట పెద్దన చేసిన వ్యాకరణాలకికూడా నన్నయ భాషే ప్రమాణం. అంటే నన్నయ భాషలోని నియమాలే సంస్కృత సమభాషకు చెందినా, సమేతర భాషకు చెందినా, ఆ వ్యాకరణంలో ప్రతిపాదితాలై ఉంటాయి; ఉండాలికూడ.

శాస్త్రిగారు ఆంధ్రభాషాభూషణంలో కొన్ని పద్యాలు ఎత్తివ్రాసి మరికొన్నింటి సంఖ్యచూపి[2] "పైన వ్రాసిన యేఁబది పద్యములలోని యాచ్ఛిక లక్షణములు చింతామణిలో స్మరింపఁబడనైనలేదు' అని వ్రాశారు. ఈ వ్రాత నిజంకాదు. వారుచూపిన 122వ పద్యంలో ఇల్లు, కల్లు, ముల్లు, విల్లు, పల్లు, కన్ను, మిన్ను, వెన్ను, చన్ను శబ్దాలు హల్ పరకత్వమున జడ్డలుడిగి ప్రయోగింపబడతాయనేది విషయం ఈ విషయం చింతామణిలో స్మరింపబడక పోవటమేమిటి? స్పష్టంగా సూత్రించబడే ఉంది. అదొకటే కాదు మరికొన్ని కూడ కేతన నియమాలు చింతామణిలో సూత్రితాలై ఉన్నాయి.

1. "ప్రథమలుగపి ద్విమలో్వః"—(చింతామణి-సంధి—38)

ఉదా : కన్నుఁదమ్మి - కనుఁదమ్మి; చనుదోయి; కలుకుంద; ములుకంప

కేతన : "తననాసీ యను పలుకుల, నెనయగ హలాదులదుకు నెడ దుజ్జునగున్
దనదు ధనము నాదు గుణం, బన నీదు యశంబునాఁగ ననువై యునికిన్"
(ఆ. భా. భూ. 128)

---

1. 'ఆదిని శబ్దశాసన మహాకవి చెప్పిన భారతంబులో
నేఁడి వచింపగాఁబడియె నెండును దానకాని సూత్రసం
పాదనశేముషీచేఁ దెనుఁగు పల్కుమరొక్కటిఁగూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటి కవిరాక్షసుఁడీ నియమంబుఁజేసినన్'—అప్ప—పీఠిక—48
చిన్నయసూరి 'గంగమునాసె' అనే ప్రయోగం ఆధునిక కృతిలోనిదనుటకూడా పై ప్రకటనకు సమర్థకమే (బాల వ్యా సంధి 2)

2. చిం. విష. శ్లో—28

2. చింతామణి : "యుష్మదస్మదాత్మభ్యో ద్వితివర్ణకః" (హలంత 26)

ఉదా : నీదుగరిమ; నాదుసొమ్ము; తనదుకీర్తి

కేతన : "వాడి మయూఖములనఁగా, వేడి పయోధారలనఁగ వింజామరనా
మూఁడస్త్రింబులనంగా, బోఁడిమి కలికంఠ నామమున్ బోలి తగున్"
(ఆ. భా. భూ. 134)

3. చింతామణి : "సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి" (హలంత—44)

ఉదా : కలికి భుజంగ కన్యలు; వాడి మయూఖములు వాడిబాణములు
(బాలసరస్వతీయ ఉదాహరణలు)

వేడిపయోధారలు; వాడిమయూఖములు (అహోబలపండితీయ ఉదాహరణలు) పై పరిశీలనంవలన శాస్త్రిగారన్నట్లు కేతన లక్షణాలు చింతామణిలో స్మరింపబడక పోవడం అనేది అబద్ధమని, పైగా కేతన లక్షణాలు ఎన్నింటికో చింతామణిలో సమాన లక్షణాలు కన్పిస్తున్నాయని గమనించగలిగాం. ఇంతేగాక చింతామణికి మూలపారాలుగా కేతన లక్షణాలు అనేకం ఉపయోగపడినట్లు ప్రకరణాంతంలో వివరించబడింది[1].

చింతామణిలో అపరూపాలు

శాస్త్రిగారు 31వ విషయంలో 'త్రాడ్లు' మున్నగు అపరిపూర్ణ రూపాలు చింతామణిలో సాధించబడటాన్ని సమర్థిస్తూ ఆ కాలంలో వాటి ఉచ్చారణ అట్లే (త్రాడ్లు) ఉండేదని కాబట్టి అక్కడ 'డా' కి 'ళా' దేశం చేయకపోవడమే సరియైనదని వాదించారు. కాని చింతామణికర్తకు కొన్ని రూపాల్ని ప్రక్రియాదశలో అసంపూర్ణంగా వదలడం అలవాటైన విషయమే[2]. ఇక్కడకూడ ఆ అలవాటే అవృత్త

---

1. చూ. 'చింతామణి మూలపారాలు' అనే ప్రకరణం

2. చూ 'చింతామణిలో లక్షితమైనభాష' అనే ప్రకరణం.

మైనదని అనుకోవడం సమంజసం. ఎందుకంటే "శ్రాద్ధు" వంటి రూపాలు నన్నయ రచనలో లేవు. శాసనాల్లో ఉన్నవనివాదిస్తే చింతామణి శాసనభాషను వ్యాకరించేదిగా కనబడటంలేదు. ఇక 'శ్రాద్ధు' మాత్రమే నాటి పండిత వ్యవహార ములో నుండెడిది' అనడం కేవలం ఊహ. కాబట్టి తిరస్కార్యం. దీనినిబట్టి చింతా మణి ప్రాచీనమవడంగూడ అంగీకార్యం కాజాలదు.

ఇలాగే 'ఊళ్లు, కాళ్లు' వంటి రూపాల్ని సాధించబోయి చింతామణి 'ఊల్లు, కాల్లు, వంటి రూపాల్నే సాధించి ఊరుకున్నది. చింతామణి చేసిన ఈ దోషాన్నే ఒక గంభీరాశయంగా ఉటంకిస్తూ[1] శాస్త్రిగారు కొంత చర్చచేశారు. దాని సారమేమి టంటే, లకార, లఘ్వలఘుభేదం పండితోచ్చారణమాత్ర వేద్యమేగాని, ప్రత్యేకించి చెప్పదగింది గాదు. మరి రేఫల లఘ్వలఘుభేదం అటువంటిది కాదా అంటే, కాదు. ఎందుకంటే శకటరేఫ ద్విరుక్తమైతే '్ట' ఉచ్చారణ పుడుతుంది-అని. ఇదంతా ఇటీవలి భాషాశాస్త్రం. దీన్ని మనసులో పెట్టుకొని చింతామణికర్త అలఘులకార విధానాన్నిపై "కాల్లు, ఊల్లు,"-వంటిచోట మానినాడని నమ్మడం ఒక్క శాస్త్రిగారికే సాధ్యం. ఇతరులెవరూ ఏ ఆధారమూ లేని పై కల్పనల్ని నమ్మలేరు. కాగా 'శ్రాద్ధు, కాల్లు ఊల్లు'-వంటి అపరూపాల్ని సాధిస్తున్నది కాబట్టి చింతామణి కేతనకు ప్రాచీన మనడం పొసగని మాట.

## అర్ధబిందు లేఖనక్రమం

ఇక్కడే శాస్త్రిగారు అర్ధబిందు లేఖన క్రమాన్నిగూర్చి ప్రసంగిస్తూ "నన్నయ భట్టారకుఁడును నథర్వణాచార్యులును, నాంధ్రభాషాభూషణ కర్తయగు కేతనయు '౿' అనెడి యర్ధబిందులిపిని నిరూపించియున్నను బ్రాచీన తాళపత్ర మాతృకా లేఖకులును శాసనలేఖకులును మాత్రమట్టిపండిత సంప్రదాయమునుల్లంఘించి లేఖక పరంపరాయాతమగు నలవాటు చొప్పున నర్ధబిందు వున్నచోట సయితము పూర్ణ మునే వ్రాయుచు, నిండుసున్నకు వ్యావర్తకముగఁ బరాక్షరమునకు లేనిపోని ద్విత్వము వ్రాయుచునుండుట ప్రాచీనలిపి పరిశోధకులకెల్లఁ దెలిసిన విషయమే గదా!" అన్నారు.

---

1. చిం. విష. శో. 37

దీనిలో నన్నయాదులు అర్ధబిందు లిపిని గూర్చి చెప్పారనడం యథార్థంగాదు. చింతామణిలో "పూర్ణార్ధభేదతో ద్వివిధః, దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ సజ్ఞేయః[1]' అనే సూత్రాలు బిందువు యొక్క పూర్ణార్థభేధాన్ని చెబుతున్నాయేగాని, వాని లేఖన క్రమాన్ని గాదు: సూత్రంలో 'ఖండ ఏవ' అనడం లేఖనక్రమాన్ని సూచిస్తున్నదని శాస్త్రిగారి ఊహకావచ్చు. కాని ఆమాట (ఖండఏవ) అర్థశబ్ద పర్యాయమే. కారణం దానికి ఆఅర్ధమే (శాస్త్రిగారు ప్రతిపాదించినది) సూత్రకర్త ఉద్దేశించి ఉంటే అతడే వ్రాశాడని శాస్త్రిగారు నమ్మే ఆంధ్ర లిప్యుద్ధారక శ్లోకాల్లో ఆ లిపిక్రమం వ్రాయబడి ఉండేది. కాని అక్కడఎక్కడా అదిలేదు. ఇక కేతన మాట ' . నిడుపుల మీది బిందులరబిందులగున్[2]' దీనిలో లిపిక్రమం ఎక్కడ ఎట్లా కనబడుతుందో శాస్త్రిగారికే తెలియాలి. సామాన్యంగా అర్థబిందువు అనడానికి బదులుగా అర్థ బిందువు అనడం జరిగింది.కాబట్టి కేతనగూడ అర్ధబిందువు అర్థాకారంతోటే వ్రాయాలని చెప్పాడనడం ఆధారంలేని మాట అసలు ఈ మాట అనవలసిన అవసరం శాస్త్రిగారి కెందుకే ర్పడినదంటే,

అధర్వణ రచితాలని అహోబలపతిచే ప్రకటించబడ్డ కారికల్లో "పూర్ణేందు సదృశః పూర్ణ స్స్వార్థ స్స్వార్థేందు సన్నిభః అనే సూత్రముంది. లేఖనంలో బిందువు స ంగా వ్రాయబడడం మిక్కిలి అర్వాచీనాభ్యాసం.అది అప్పకవి కాలానికో అహో బ పతి కాలానికో చెందవచ్చు. అంతేగాని ఒకవేళ ఉండిఉంటే, 12వ శతాబ్దివాడుగా భా ంచబడుచున్న అధర్వణుని కాలానికి బొత్తిగా చెందదు ఈ విరోధాన్ని పరి హ ్ంచడంకోసం, ఈలేఖనక్రమం నన్నయ్య కాలంనుండే చెప్పబడి గూడ ఉపేక్షిత మ తూ వస్తుందని మనం అనుకోవాలని శాస్త్రిగారి ఆకాంక్ష కాని వారి ఆకాంక్షను తిరస్కరించడమే మనం చేయగల పని.

## ేతన రూపసాధనలో దోషం ?

ఇలాగే శాస్త్రిగారు 38వ విషయంగా తన పరిశోధనంలో కేతన గోరు— గోళ్ళు; వ్రేలు—వ్రేళ్లు; గూడు - గూళ్లు; లేడి - లేళ్లు; వంటి రూపాల సాధనచేసి

1. నం.జ్ఞా. 4. 15

2. ఆం. భా. భూ. 87

అశాస్త్రీయ పద్ధతి ననుసరించాడని, అకారణంగా అతనిపై, చింతామణికర్త వలె అప రూప సాధనకు అతడు పాల్పడలేదు గాబట్టి, విరుచుకుపడ్డారు.

ఇక్కడ కేతనలో శాస్త్రిగారుచూపే దోషం ఏమంటే - ,ళ్లు, అనే వర్ణ సము దాయాన్ని అతడు బహువచనంలో రు, లు, డు, డి - అంతమందుగల పదాలపై విధించాడు. ఆ విధించిన ,ళ్లు, అలఘు లకారమని చెప్పలేదు గాబట్టి అది వర్ణ సమామ్నాయగత 'ళ'కారమే అనుకోవడానికి అవకాశం ఉన్నది. రెండు ళకారాల్ని సంకరపరచడానికి వీలున్నది గాబటి ఇది అశాస్త్రీయం అని. ఇది భ్రాంతిమూలకమో లేక ఊహాజనితమో అయిన దోషారోపణం. కేతన ళ్లు" ఇట్టి ళకారమని ఉద్దేశించ లేదు, నిర్దేశించనూలేదు వర్ణసమామ్నాయగత ళకార మనుకోవడానికి వీలున్నట్లే అలఘు లకారమనుకోవడానికీ వీలుంది - అతని వ్రాతలో. కాబట్టి శాస్త్రిగారి ఊహ నిరాధారం, నిరాకరణ యోగ్యంగూడాను.

అసలు అలఘు లకారం వేరనీ, వర్ణసమామ్నాయగత 'ళ'కారం వేరనీ, చిన్నయసూరి చెప్పేవరకు[1] పూర్వ వైయాకరణులెవరూ ఆవిషయమై పట్టుబట్టినట్లు గాని, కనీసం ఆ అభిప్రాయంతో ఉన్నట్లుగానీ మనకు స్ఫురించదు. ఎందుకంటే ఈ అంతస్థవర్ణాల ద్వైవిధ్యాన్ని వివరిస్తూ బాలసరస్వత్యాదులు చెప్పినమాటలలో చూపిన ఉదాహరణలలోనూ ఈ ళకార భేదం వ్యక్తంకావడంలేదు. చూడండి.

> "లఘువులు, అలఘువులునగు ఇతరములయిన యవలలకు విరోధము లేదు. లళలుప్రసిద్ధములే,"

ఉదా : నీళ్లు పాలును గలిసినట్లెల్ల ప్రొద్దు (బాలసరస్వతి–సంజ్ఞా—19)

2. విరమణములకును బ్రాసాక్షరములకును ళలలు దొడ్డసన్నములును మచ్చరము లెఱుంగక చెల్లును హరనుత। 'లళయోరభేద' యనుసూత్ర మునన్' (అప్ప–ద్వితీయ—247)

'గంగకొడుకుమాట గాదని సభను బెట్లుపడ నెల్ల నృపులలోన హరిని గొల్లఁడనుచుఁజాల ద్రుళ్లిచేదివిభుండు వాలిసెఁబఱచి బలమునెళవుఁ జేరె (అప్ప–ద్వితీయ—248)

---

1. వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని యలఘు ళకారము గాదని యెఱుంగునది – బాలవ్యా. సంజ్ఞా – 18 వృత్తి

3. 'బెళుకుంజూపులు తళుకుంజెక్కులు; పొలఁతి చెలువ ఇత్యాదౌ లస్య ద్వైవిధ్యమ్' — (అహోబలపతి - సంజ్ఞా —19)

పై వ్రాతలలో అహోబలపతి, అప్పకవి అలఘులకారాన్ని వర్ణసమ్నాయగత ళకారంతో సమానమనే భావించారని నిరాఘాటంగా చెప్పవచ్చు. బాలసరస్వతి ఉదాహరణలో 'సీళ్లు' లోని ళకారం ఇప్పటి దృష్టితో కూడా అలఘువే. కాని అది యదృచ్ఛాపతితమైనది కావచ్చు ఒకటేఉదాహరణం కావడంతో అతని అభిప్రాయం చిన్నయసూరి అభిప్రాయానికి మూలమా? అని సందేహించే వీలు మాత్రముంది, అంతే ఏమైనా అతడు వర్ణమాలలోని ళకారం అలఘు ళకారం కంటె భిన్నమైనదని భావించాడనడానికి ఆధారంలేదు.

ఇంతకూ ఉచ్చారణలో అభిన్నంగా కనబడే అలఘు ళకార ళకారాలు భిన్న వర్ణాలని చింతామణికర్త చెప్పలేదు. తద్వ్యాఖ్యాతలూ చెప్పలేదు. వారు అలా భావిస్తున్నట్లైనా ఆధారంలేదు. ఇట్టిస్థితిలో ఈ దోషాభాసాన్ని చూపి కేతనను తప్పు బట్టడం భావ్యంగాదు.

## దంత్యతాలవ్య చజలపై నిలిచే అచ్చులు

శాస్త్రిగారి పరిశోధనలోని నలభైయవ విషయానికి మూలం చింతామణిలోని దంత్య తాలవ్య చజలపై నిలిచే అచ్చులు. సూత్రకర్త మిగిలిన అనేక సందర్భాల లోవలె ఇక్కడగూడ[1] అసంపూర్ణంగా, అవ్యాప్తి దోషజుష్టంగా లక్షణం చేశాడు.[2]

శాస్త్రిగారి ఈ సూత్రం, చజలమీద ఏ ఏ అచ్చులుంటే ఎలా ఉచ్చరించాలో తెలపడం కోసం ముఖ్యంగా అకార ఎకారాలు చజలమీద ఉన్నపుడు వాటి ఉచ్చారణలో భేదం ఎలా ఉండాలో నిర్ణయించడం కోసం ఏర్పడిందని వాదిస్తున్నారు. నిజమే కావచ్చు. కాని నేటి ఉచ్చారణలోకాక, బాలసరస్వతి కాలంనాటి ఉచ్చారణలో

1. ప్ర.తా. సంజ్ఞా. 27

2. చూ. చింతామణిలో లక్షితమైన భాష అనే ప్రకరణం

దంత్య తాలవ్యాలైన చజలమీదఉన్న అత్వ ఏత్వ వినిమయం నన్నయకాలంలో కూడ ఉన్నదని నిరూపితమైతే తప్ప ఈ సూత్రానికి నన్నయ కర్త కాలేదు. కాని అలా నిరూపించడానికి శాసనాల్లోగాని, వాఙ్మయంలోగాని ఏ ఆధారమూలేదు.

## పదాది యకారం

ఇలాగే 'అద్యః క్రియా స్విత్యాది' సూత్రంగూడ సందేహ నిర్ణాయకంగా చెప్పబడిందేనన్నారు. ఈమాట యథార్థమే. కాని ఆ చెప్పినతీరు చాల అసమర్థంగా ఉంది. ఒక మహావ్యాకర్త గాకాదు, సామాన్య వ్యాకర్త గాగూడ చింతామణికర్త కనిపించదు - ఈసూత్రరచనలో. సూత్రాని కర్థంవేరు, దాని తాత్పర్యం వేరు. ఇక్కడ వ్యంగ్యప్రసక్తిలేదు. ఉద్దిష్టార్థాన్ని వ్యక్తంచేసే సరైనమార్గం తోచక చేతనైనట్లు సూత్రించడం జరిగింది 1

ఈ సూత్రంలో పదాది యకారాంగీకారంగూడ చింతామణి ప్రాచీనతకు ప్రబలాధార మంటున్నారు శాస్త్రిగారు. ప్రాచీనతకుగాదు, నవీనతకు ప్రబలాధార మని నిరూపిస్తున్నారు విమర్శకులు2. ఈచర్చ ముందు కొంత కొనసాగి ముగిసిందే.

ఇక ఇలాంటి సందేహ నిర్ణాయక సూత్రాల రచనావసరం గూడ ప్రథమ వ్యాకరణానికే ఉంటుందని శాస్త్రిగారి మరొకవాదం3. సందేహ నిర్ణయం సందేహం కలిగిన కాలంలో అవసరం. సందేహం కలిగిన, లేక కలిగే, కాలం వాఙ్మయం పుట్టిన కాలమే అని వాదించడం విచారాసహమైనది. అలాంటి సందేహనిర్ణయం అర్వాచీన వ్యాకర్తలు పెక్కుమంది చేశారు మరి. వారందరూ వాఙ్మయారంభ కాలానికి వెళ్ళిపోవలసిందేనా ?4

---

1. చూ. చింతామణిలో లక్షితమైన భాష అనే ప్రకరణం
2. 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష' - వడ్లమూడి గోపాలకృష్ణయ్య.
3. చిం. విష. శ్లో. 48
4. అ. ఆది ప్రత్యయాంతావ్యయంబు కళయ — ప్రౌఢవ్యా.
   ఆ. వాటితో వ్యత్వంబులు పదముల మొదటలేవు మునిజనవిమతా! కవి సం. 1—85
   ఇ. ఆయెతయు-మయ్యెలయుఁ బయ్యెదయుఁ దక్క- గలుగ దెత్వంబు మధ్య యకారమునకు తుదముగ్గియుఁ దక్క- వెత్వంబుగ దియదాది, నత్వ మొందదు తెనుఁగున వజ్జినాథ. — పైది—1

శాస్త్రిగారు తమ పరిశోధనంలో పెక్కు విషయాల్ని స్వవాద ప్రతిపాదన పరవాద ఖండనల్ని పునరుక్తం చేశారు దాన్ని అనుసరించి ఇక్కడగూడ పునరుక్తులు తప్పడంలేదు 4వ విషయంలో పురాపరాస్తమైన వాదం సంస్కృత శబ్దములను దెనుగులోనికిఁ దెచ్చుకొనెడి పద్ధతులను మాత్రమే ప్రధానమ్ముగా నుపదేశించెడి యాంధ్రశబ్ద చింతామణి అని పునరుక్తిగా అంటున్నారు ఈవాదం ముందు ఖండితమైందే

తరువాత ఆంధ్రవాఙ్మయము విస్తరించినపద్దప దానిప్రచారము సహజముగఁ దగ్గుటచేత నద్దాని యునికి నెఱుఁగకయో లేక యెఱిఁగియు నది తెనుఁగునకు లక్షణమనిపించుకొనదని తలచియో యాంధ్రభాషా భూషణకర్త మున్ను తెనుగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్పరన్నాఁడు అని అంటున్నారు

ఈ వాదం చింతామణి సంస్కృతసమశబ్ద మాత్రసాధన ప్రవణమనే వాదం మీద ఆధారపడినది అది వీగిపోతే ఇదీ వీగిపోతుంది ముందు నిరూపించాను. మొదటి వాదం పరాస్తమయిందని కాబట్టి ఈ వాదమూ పరాస్తమే అలాగే కేతన ఆంధ్ర శబ్ద చింతామణి తెనుగుకు లక్షణమనిఎంచుకోదని అనుకున్నాడని అనుకోవడం ఎలాసబబో దాని కాధారమేమిటో శాస్త్రిగారే వివరించాలి

### కేతన చెప్పిన ఉపోద్ఘాతం

కేతన తన వ్యాకరణ ప్రారంభంలో చేసిన ప్రసంగం చాలాముఖ్యమైనది

మున్ను తెనుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్పరే జెప్పెద వి
ద్వన్నికరము మదిమెచ్చఁగ నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్
(ఆం భా భూ 4)

సంస్కృత ప్రాకృతాది లక్షణముఁజెప్పి తెనుగునకు లక్షణముఁ జెప్పకునికి యెల్ల కవిజనంబుల నేరమిగాదు నన్ను ధన్యుఁగావింపఁ దలఁచిన తలఁపు గాని
(పై ది—6)

భాషావేదులు నను వేని యాషణ్ముఖ పాణినులకు నగు నెనయని సం
భాషింప నాంధ్రభాషాభూషణమను శబ్దశాస్త్రమును రచియింతున్ (పైది–7)

క్రొత్తగ నాంధ్రభాషకును గొందొక లక్షణ మిట్లు చెప్పనే
యుత్తమబుద్ధి నేర(దని యొరులు వోవక విన్న మేలు మీ
రొత్తిన మీకు మాఱుకొని యుత్తరమిచ్చుట చాల ప్రేగు మీ
చిత్తమునందు నన్నెరవు సేయకు(డీ కవులార మ్రొక్కెదన్ (పైది— 0)

కంచి నెల్లూరు మతి యోరుగల్లు యోధ్య యనుపురంబులపై గంగకరుగు
మనిన పగిది నొకత్రోవ( జూపెద బహుపథంబు లాంధ్రభాషకు( గలవని
యరసికొనుడు (పైది— 3)

కేతన తన గ్రంథంలో చేసిన పై ఉపోద్ఘాతాన్ని చూస్తే ఎవరికైనా కేతన ఆంధ్రశబ్ద చింతామణి తెనుగునకు లక్షణమనిపించుకొనదని ఇట్లా చెప్పాడనే అర్థం స్ఫురిస్తుందా? శాస్త్రిగారికే స్ఫురించినది మరి వారి స్ఫురణలన్నీ దాదాపు ఇలాంటివే

45వ విషయంలో 'ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్ట విరచితమే యను సిద్ధాంతము చిరకాలమునుండియు నాంధ్రపండిత ప్రపంచమున సుప్రసిద్ధమై యున్నది అన్నారు ఈ మాటలోని చిరకాలానికి అర్థం దాదాపు 80వ సంవత్సరానికి అరచే బాలసరస్వతి కాలానికి పూర్వమని చెప్పడానికి వీలేలేదు బాలసరస్వతికి ముందు చింతామణి ఉనికిగాని తత్కర్త నన్నయ అనడంగాని లోకంలో పండిత లోకంలో వినబడనేలేదు చింతామణి నన్నయ కృతం కాదు అనేవారుకూడా బాలసరస్వతి తరువాతి కాలంలో దానికి నన్నయ కర్తృకత్వ ప్రసిద్ధి లేదనడంలేదు

తరువాత చింతామణి పరిచ్ఛేదాంత గద్యలలో ఇతిశ్రీ సకలభాషావాగను శాసన నన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణౌ అని ఉన్నదిగాబట్టి నన్నయయే తాను శబ్దశాసనుడనని భారతకృత్యాదిని చెప్పికొనియున్నా(డు కాబట్టి ఇది నన్నయ కృతమే నంటారు శాస్త్రిగారు — చిం విష శ్లో 45

సకలభాషా వాగనుశాసన అనే బిరుదం నన్నయకున్నట్లు ఒక్క చింతామణిలోతప్ప ఇతరత్రా ఎక్కడా లేదు దానికి అర్థం ఎల్ల భాషలను అనుశాసించిన

వాడని అయినపుడు మిగిలిన ఏ భాషలకు అతడు వ్యాకర్తో తెలియాలి కాగా పరిచ్ఛే దాంతగద్య మాత్రంతో నిర్ణయం జరిగే అవకాశం ఇక్కడ లేదు

ఆంధ్రవాఙ్మయంలో వాగనుశాసన బిరుదాన్ని నన్నయకు తొట్టతొలుత ఉప యోగించినవాడు రామరాజభూషణుడని ఈ పరిచ్ఛేద ప్రారంభంలో గమనించాం అతడు ఆ బిరుదాన్ని కల్పించడానికి అతని శ్లేషార్థకల్పనం కారణమని ఆ సందర్భాన్ని చూస్తే తెలుస్తుంది రామరాజభూషణుని కాలం క్రీ శ 1570 ప్రాంతం నన్నయను అతని తరువాతి కవులు శ్రీ పురాణప్ప దాకాపు అందరూ స్తుతించారు వారిలో ఏ ఒక్కరూ నన్నయను వ్యాకర్తగా పేర్కొననేలేదు వారి వ్రాతలలో ఎక్కడా వాగనుశాసన బిరుదంకూడ రామరాజభూషణునికి పూర్వం కనబడడంలేదు కాబట్టి ఈ బిరుదప్రసక్తి 16వ శతాబ్దికి పూర్వం ఆంధ్రవాఙ్మయంలోలేదని నిర్ణయించవచ్చు

*వీరేశలింగంగారి వాదం*

హేతువాది శాస్త్రీయ దృక్పథంగలవారూ అయిన శ్రీవీరేశలింగంగారు కవుల చరిత్ర రచిస్తూ ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతంకాదని కారణాలు చూపి ఖండిస్తే వారివాదాన్ని శాస్త్రిగారు తమ పరిశోధనంలో ఖండించారు వారి వాద సారమిది అధర్వణకారికావళి చింతామణికి శేషగ్రంథం చింతామణి సామాన్య విధుల్ని తెలిపితే కారికావళి విశేష విధుల్ని వివరిస్తుంది కాబట్టి విశేష విధుల్ని వివరించే కారికావళి సహాయంతో సామాన్య శాస్త్రమైన చింతామణిని బాలసరస్వతి వ్రాశాడని వీరేశలింగం గారనటం పొసగదు ఇంతవరకు శాస్త్రిగారి వాదం సబబే కాని వీరేశలింగంగారు తమ వాదంలో ఈ లొసుగు చేసింద్రి కవుల చరిత్ర మొదటి ముద్రణలో ద్వితీయ ముద్రణలో దాన్ని సవరించి చింతామణి బాలసరస్వతీ విరచితమనీ అధర్వణ కారికావళి అహోబలపతి విరచితమనీ వ్రాశారని కూడా శాస్త్రిగారే అన్నారు పరిశోధన చాలక మొదట పొరబడినా తరువాత దిద్దుకున్నట్లు తెలుస్తుందిగదా

చింతామణి రచనకు కారికావళి మూలమనడం పొసగదని ఆ రెండుగ్రంథాలు తులనాత్మకంగా చూస్తే తెలిసేమాట యథార్థమే అంతమాత్రాన నన్నయ కృతమై నట్లుకాదు బాల సరస్వతికృతం కాకూడదన్నట్లూకాదు ఎందుకంటె చింతామణికి

వ్యాఖ్యానం చేసేవాడు తప్ప ఇతరుడెవడూ కారికావళిని వ్రాసిఉండడానికి వీలెలేదు కారణం కారికావళికి చింతామణి సూత్రాలతోకంటె దాని వ్యాఖ్యానంతో, అహోబలపతి వ్యాఖ్యానంతో మాత్రమే ఎక్కువ సంబంధమున్నట్లు ఆకారికల్ని పరిశీలిస్తే తెలుస్తుంది[1]

ఇక వీరేశలింగంగారి యుక్తుల దౌర్బల్యమంటూ శాస్త్రిగారు సర్వత్రాజ్వత్ కార్యంజ్ఞేయం - ఇత్యాది సూత్రం భారతప్రయోగ విరుద్ధంగా ఉన్నదనే యుక్తి చెల్లదన్నారు నన్నయ్య భారత ప్రయోగాల్లో కళలమీద యకారాదిగా ఏ పదమూ కనిపించదుగదా మరి ద్రుతప్రకృతికాలమీద అజ్వత్ కార్యమంటే ఇతరత్రి కళల మీద యకారాదిగానే పదముంటుందని గదా భావం కాని ఇక్కడ శాస్త్రిగారు సూత్రం ఈ విరోధం ఒక్క భారతానికేనా మొత్తం ప్రాచీన వాఙ్మయాని కంతటికి వర్తిస్తుందిగదా అని ప్రశ్నిస్తారు నిజమే తొలి వ్యాకరణం అంటున్నారుగాబట్టి నన్నయ వ్రాశాడని అంటున్నారుగాబట్టి అతని రచనలోనైనా ఆ విరోధం లేకుండా ఉండవద్దామరి నన్నయ ఉచ్చారణానుగుణంగా పదాది యకారాన్ని చెప్పి ప్రక్రియా గౌరవాన్ని సహించేవాడని శాస్త్రిగారి వాదం[2] అయినప్పుడు తన మతానికి తన రచనలోనే గతి కల్పించడా ఆ వ్యాకర్త కాబట్టి ఆ సూత్రం చింతామణి నన్నయ కృతంకాదని నిరూపించడానికి సమర్థమై ఉంది

## ప్రథమ పురుష-ఇకారసంధి

వీరేశలింగంగారు చింతామణి ప్రథమ పురుషేకార సంధి నిత్యమని నిత్యమను త్తమపురుష క్రియాస్వత [3] అనే సూత్రంతో చెబుతుంటే నన్నయభారతంలో దానికి విరుద్ధంగా

---

1 చూ అధర్వణకారికల మూల పాఠాలు అనే ప్రకరణం

2 చిం విశ

3 ఒంతా సంధి

అంతఁగొంద రధిక హాస్యంబు సేసిరి
యదవి నేమిరోసె దనిరి కొంద
అవ్వ నీవు వేల్పవౌదని కొందఱు
మొద్దుకేలుతోడ మ్రొక్కిరంత భారత అరణ్య. 03

ఆనేపద్యంలో ప్రథమ పురుషేకారసంధి జరగని ప్రయోగం కనిపిస్తుంది కాబట్టి చింతామణికి భారతకర్త నన్నయకు సంబంధంలేదని కవుల చరిత్రలో వ్రాశారు దానికిశాస్త్రిగారి సమాధానమేమిటంటే వాక్యాంతంలోగాని పాదాంతంలో గాని సంధి వైకల్పికమని నన్నయాభిప్రాయం కాబట్టి ఇక్కడ సంధి లేకున్నా విరోధం లేదు— అని కాని చింతామణిలో ఎక్కడా వాక్యాంతంలోగాని పాదాంత ములోగాని సంధిలేకపోయినా దోషంలేదు—అనే సూత్రంగాని సూచనగాని లేవు కాని శాస్త్రిగారు స్వభావనాబలైక సాధ్యమైన అబద్ధ గ్రంథం - నన్నయాధర్వ ణీయంలో1 ఈవిషయం ఉన్నదంటారు వారి దృష్టిలో నన్నయ భావించినది అధర్వ ణుడు చెబుతుంటాడు అధర్వణుడు చెప్పదలచినది నన్నయభావించి ఊరుకుంటాడు చెప్పడు వారిద్దరికి రచనలో అభేదం పాటిస్తేతప్ప భారత ప్రయోగాలకీ చింతామణి సూత్రాలకీ విరోధం తొలగదు ఇది వారి విశ్వాసమైతే కావచ్చుగానీ హేతువాది అయిన విమర్శకుడెవడూ అంగీకరించే విషయం కాదని వేరే ఋజువుపరచ పనిలేదు కదా

శాస్త్రిగారు తమ పరిశోధనంలో బాలసరస్వతి నాటికే కొన్ని అధర్వణ కారికలు పండిత పరంపరాయాతంగా అక్కడక్కడా వినిపిస్తున్నాయని వాటినే తరువాతివారు తత్పూర్వులైన ముద్దరాజు రామనాదులూ తెనిగిస్తూవస్తున్నారని మరొక వాదం లేవనెత్తారు ఇదినేలవిడిచిన సాము పుస్తకం ఉనికినే ఎరుగనివారు ఆపుస్త కంలోని గాలిలో ఎగిరివచ్చే కారికల్ని పట్టుకొని ఆవిషయం చెప్పకుండా రహస్యంగా అనువదించడమేమిటి ? ఈవిచిత్రవాదం యథార్థాన్ని తిరగవేసి చెప్పడంవలన ఏర్పడింది నిజానికి అధర్వణకారికలనబడేశ్లోకాలు చాలభాగం అహోబలపతికిపూర్వం దేశీయవ్యాకర్తలు తమ వ్యాకరణాల్లో చేసిన లక్షణాల సంస్కృతీకరణంతో ఏర్పడి

---

1 శాస్త్రిగారి వ్యాకరణ సంహితా సర్వస్వంలో ఈ పేరుతో చింతామణి వికృతి వివేకాల కారికలు శోధించి యివ్వబడి ఉన్నాయి

నవే[1] ఆవ్యాకర్తలు తెలుగులో స్పష్టంగాచెప్పినవిషయాల్నే ఆకారికల్లో అస్పష్టంగా ద్వితీయసృష్టి అని తెలిపేవిధంగా సంస్కృతీకరించడం జరిగింది[2] కాగా అధర్వణ కారికలు బాలసరస్వతికి పూర్వం ఉండడంగాని అవి పరంపరాయాతంగా తెలుగు లాక్షణికులు బాలసరస్వతికి పూర్వులు తెనిగించడంగాని బొత్తిగా పొసగని విషయాలని మున్ముందు తేలుతుంది

*గణపవరపు వెంకటపతి*

తమ పరిశోధనంలోనే 6 వ విషయంలో శాస్త్రిగారు, కేతన తనకు పూర్వం వ్యాకరణం వ్యాకర్త లేరన్నట్లే 8వ శతాబ్దివాడైన గణపవరపు వేంకటపతి కూడా తన ఆంధ్రకౌముదిలో తనకు పూర్వం తెలుగుకు వ్యాకరణం లేదని చెప్పాడని కాబట్టి కేతన మాట విశ్వాసార్హం కాదని వాదించారు. కాని గణపవరపు వేంకటపతి కవి మాటకు అతని గ్రంథంలోని సందర్భాన్ని బట్టి శాస్త్రిగారనుకున్నది అర్థం కాదని తెలిసికోవచ్చు

శ్రీకరముగ సంస్కృతమునకును బ్రాకృ
తమునకుఁగల లక్షణములు చెప్ప
తెనుఁగున కా విధంబున లక్షణము చేయ
రాకుర్కి యదియు నేరంబు గాదు
తొల్లిటి సుకవుల కెల్లను నను దన్కఁ
గావించు తలఁపింతె గాని యనుచుఁ
గుకవి జనాజ్ఞాన ఘోరాంధతమసముఁ
బోఁగొట్టఁగల్గు కౌముది విధమున
విలమున్న తెనుఁగున నెవ్వారెఱుంగని
యాంధ్ర కౌముది యనునట్టి కృతిని
పీఠ మాలికగాఁగఁ జేసితి నిపుడున్న
కవులకు రానున్న కవులకెల్ల

---

1. చూ అధర్వణకారికల మూల పాఠాలు అనే ప్రకరణం
2. చూ పైది

మపకారముగ విది యెపుడు నాచంద తా
రార్కమై కౌముది యటుల వెలయు (ప్రారంభ పద్యం)

అని చెప్పుకొనడంవలన కేతన మాటలుకూడా అలాంటివేనని శాస్త్రిగారివాదం కాని ఒకరిని ఉదాహరించి దాని ప్రభావం మరొకరిపై చూపడం సమంజసంకాదు వెంకటపతికవి కేతననే ప్రతిధ్వనిస్తున్నాడు —పై పద్యంలో ఐనపుడు అతడు కేతన వ్యాకరణాన్ని ఎఱుగకపోవడమనేది అసంగతం ఇక్కడ కేతన మాటల్ని కూడ వేంకటపతికవి మాటలతో పోల్చి చూస్తే యథార్థం తెలుస్తుంది

> సంస్కృత ప్రాకృతాది లక్షణముఁజెప్ప తెలుగునకు లక్షణము చెప్పకునికి
> యెల్ల కవిజనంబుల నేరమిగాదు నన్ను ధన్యుగావింపఁ దలఁచిన తలఁపుఁ
> గాని (ఆం భా భూ —8)

పై పద్యంలోని చెప్పకునికి నన్ను ధన్యుఁ గావించు తలఁపు గాని అనే పదాల్ని అక్షరశః ఆంధ్ర కౌముదీ కర్త అనుకరించాడుకదా అయినపుడు అతడు కేతన నెరిగున్నట్లే అతని పద్యంలోని తాత్పర్యం సంస్కృతంలో కౌముదివలె తెనుఁగులో కౌముది నెవరూ నంతరించలేదని కావచ్చు ఆ తలంపే ఆతని కున్నట్లు అతని పద్యంలోని చివరి వాక్యాలు తెలుపు తున్నాయి కూడా

పైగా ఆంధ్ర కౌముదీ కర్త ఉపోద్ఘాతాన్ని కేతన ఉపోద్ఘాతాన్ని మొత్తంగా పరిశీలిస్తే భేదంకొట్టవచ్చినంత స్ఫుటంగా కనిపిస్తుంది కేతన షణ్ముఖ పాణినుల తో తుల్యంగానంభావింపబడాలని వ్యాకరణానికి ప్రథమ ప్రయత్నకర్త కావడంవలననే భావించాడు తనది ప్రథమ ప్రయత్నమని 4వ, 10వ పద్యాలలో నిస్సందేహంగా నిష్కపటంగా చెప్పాడు కాబట్టి ఆంధ్రకౌముదీకర్త ఉదాహర్తలతో కేతనమాటలని సందేహించడం, తద్వారా చింతామణి కర్తృత్వాన్ని నన్నయకు అంటగట్ట చూడడం సక్రమమైన ఆలోచనకాదు

ఇక 64వ విషయం—చింతామణి వికృతివివేకాలు పరస్పర సంబంధితాలనడం నిర్వివాదం ఒకప్రక్క చింతామణి సూత్రాలు చూస్తూ వాటిలోని లొసగుల్ని దొసగుల్ని సరిచేయడం కోసమే కారికలు పుట్టినాయి ఆ విషయంలో తగ్గవే లేదు ఉన్నదంతా ఆ కారికల కర్తృత్వంమీద, చింతామణి కర్తృత్వంమీద మాత్రమే

కర్తృత్వమే వివాదాస్పదమయినపుడు నమోస్తుతే హల్యాధర్వణాచార్య మతాత్ అనే అప్పకవీయ సూత్రంలోని అధర్వణాచార్య పదం పొసగదు గాబట్టి ఆ పాఠం ప్రక్షిప్తం అని అంగీకరించాలి—అని శాస్త్రిగారంటారు అది ప్రక్షిప్తమనడానికీ కాదనడానికీ వాదబలం సమానంగానే ఉంది పైగా ఏఅంశాన్ని విరోధంగాచూపి చింతామణి నన్నయకృతం గాదంటున్నామో ఆ విరోధాన్ని తామూ అంగీకరిస్తూ అది మాత్రం ప్రక్షిప్తమనడం విచారాసహమైన వాదం

46వ విషయంలో అధర్వణకారికావళి దురవగాహం కాబట్టి పఠన పాఠనాది ప్రచారంలో లేదని ఒకప్రక్క చెబుతూనే మరొకప్రక్క 56వ విషయంలో బహుశః పండిత పరంపరాయాతంగా గావచ్చు కొన్ని కారికలు బాలసరస్వత్యప్పకవులకు దొరికినవని వాదించడం చాల విచిత్రంగా ఉంది బొత్తిగా బలంలేని వాదమిది విచిత్రంలో విచిత్రమేమిటంటే అధర్వణకారికల్ని ఆంధ్రీకరించినవాడుగా చెప్పబడ్డ (శాస్త్రిగారిచేత) అప్పకవే తన చింతామణిలో నమోస్తుతే హల్యాధర్వణాచార్య మతాత్ అనే సూత్రాన్ని వ్రాసి శుభ్రంగా వ్యాఖ్యానిస్తూ కూడ కవిస్తుతిచేసే సందర్భంలో అధర్వణుని కవిగానే పేర్కొనడం జరిగింది వ్యాకర్తగా పేర్కొనడం జరగలేదు దీనినిబట్టి అప్పకవికి అధర్వణకారికలు పండిత పరంపరాయాతంగా దొరకడం శాస్త్రిగారి ఊహాజనితమైన సంఘటన అని కాగా తిరస్కారయోగ్యమని నిర్ద్వంద్వంగా నిరాకరించవచ్చు

## లిప్యుద్ధారక శ్లోకాలు

తరువాత బాలసరస్వతీయంలో లేకుండా అప్పకవీయంలో కనుపించిన లిప్యుద్ధారక శ్లోకత్రయాన్ని గూర్చి కొంత చర్చ జరిగింది ఆంధ్రలిపికి ఒక శ్లాఘ్యమైన రూప మిద్దామనే తలంపుతో నన్నయ తన కాలంనాటి లిపికి కొన్ని సంస్కారలు ఉపదేశించాడనీ ఆ శ్లోకాల అర్థం సరిగానో అసలే కాకో బాలసరస్వతి వాటిని వ్యాఖ్యానించకుండా విడిచిపుచ్చాడని అప్పకవికూడా వాటి అర్థం సరిగా చేసికోలేక పెక్కు ప్రమాదాలకు లోనయి వ్యాఖ్య చేశాడని శాస్త్రిగారు వాదించారు

శాస్త్రిగారి ఈ వాదానికీ ఇంకా ఇతర అనేక వాదాలకీమూలం కేవల—ఊహ పైగా వారు చింతామణికీ అధర్వణకారికలకీ నాటినుండి నేటివరకువచ్చిన వ్యాఖ్యానా

అన్నింటిలో తమ ఊహాగతికి భేదంకనిపిస్తే ఆయా వ్యాఖ్యాతలందరూ భ్రమపడ్డారనీ పొరబడ్డారనీ నిశ్శంకంగా నిందారోపణం చేసారు తాము ఒక్కరే ఎల్లకాలానికీ సరిపడిన నిజమైన వ్యాఖ్యానం చేస్తున్నామని వారి భావన 1 పైగా ముందు తమ మాటగా ఒక అభిప్రాయాన్ని ప్రవేశపెట్టి తరువాత ఆ అభిప్రాయమే ప్రాచీనుల కున్నదని వ్రాయడంకూడా కద్దు ఈ పద్ధతి వారి పాండిత్యంలోని ఒక దౌర్బల్యాన్ని తమ వాదంకోసం తాము ఎట్టి చర్యకైనా పాల్పడగలరని తెల్పుతుంది 2

అసలు ఈ లిప్యుద్ధారక శ్లోకాల్ని శాస్త్రిగారా శ్రయించి వాటిమీద ఒకచర్చ జరిపి ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించబూనడం ఎందుకంటె చాలమంది సామాన్య పండితులు కొందరు మహా పండితులు కూడా ఈ లిపిశాస్త్రానికి దూరంగా ఉన్న వారు ఇక్కడ జరిగే వీరిచర్చను బహుస్వల్ప సంఖ్యలో మాత్రమే ప్రత్యర్థులు ఎదుర్కొగలరు మిగిలిన వారు అది తమకు లేని చాలని అధికారమని భావించి తొలగిపోతారు పైగా ఆ శ్లోకార్థాల ద్వారా వచ్చే లేఖన క్రమం వాది బలాన్నిబట్టి

---

౮ వ విషయం - నవికృతి శబ్దాత్ వరత స్స్వాంసకృతికానాం భవన్తి గసడదవాః అనే సూత్రానికి విపరీత వ్యాఖ్యానం చేశారు సూత్రంలోని నవికృతి శబ్దాత్ అనేది ఏకపదమని దాని అర్థం - వికృతి చిహ్నములగు డుమువులు అనెడి ప్రథమా ప్రత్యయములు లేని యన గా నవి లోపించిన శబ్దమునకన్న పరమైన కచటతపలకు పై తమ అని వ్రాశారు ఈ వ్రాతమీద వ్యాఖ్య అనవసరం

సంస్కృతపదేన వరిమిత మాంధ్ర పదం కర్మధారయో భవతి (హలంత- ౪౮ సూత్రం) ౮౯వ విషయం చివర జరిగిన చర్చలో వరిమితం ఆంధ్రపదం అంటే రాయఁడు వంటి పదమనీ షడ్వర్ణ వరిమితమైనదికాదానీ తమకు తోచినట్లు వ్రాసి తర్వాత అ పుట చివర వేయేల అథర్వణాచార్యు లందరి వరిమిత శబ్దమునకు నేను బైని వానినరీతినే బిరుదాదివాచక పరముగనే యర్థము చేసి యీ క్రింది రీతిని వివరించి యున్నాడు- అంటూ ద్వ్యక్షరాది చతుర్వర్ణ పర్యంత జననామము లోప స్యాద్ద్వాది వర్ణానాం శబ్దేరాయాదికే పరే అని ఉదాహరించారు ఇక్కడ వీరు కారికలోని రాయ శబ్దాన్నిబట్టి పైన తామిచ్చిన ఉదాహరణ రాయ శబ్దాన్ని ఉంచారా? స్వతంత్రంగా కారికానపేక్షంగానే ఉంచారా తమ ఊహాధోరణి కొండొకచో అథర్వణాచార్యుని భావనాపరణిలో సాగుతుందనీ వేరొకచో దాన్ని మించి అతని పొరపాట్లను (తమ వాదానికి భిన్నంగా ఉన్నపుడు) బయట్పెట్టగలదని భావించడం న్యాయ్యం గాలేదు

ఎల్లాగైనా మార్పులకి వీలుగా కూడా ఉన్నట్లు కనబడుతుంది అందుకనే ఆంధ్రు లేవ్వరూ ప్రస్పష్టంగా ఊహించి కూడా ఉండరని తెలుగు క్రమాన్ని ఆ శ్లోకాల అర్థంగా శాస్త్రి స్వయంగా వ్రాసి చింతామణి విషయ పరిశోధన గ్రంథంలో పొందుపరిచారు[1]

ఆ శ్లోకాల్ని వాటి అర్థ తాత్పర్యాల్ని పరిశీలించి తరువాత వాటిమీద పరి శోధక పండితుల అభిప్రాయాల్ని గమనించి తర్వాత ఒక నిర్ణయం చేద్దాం

బాలేందు పరిధి శృంగావర్త కుశగ్రంథి దాత్ర పరశు సమాః
ఆద్యా ఇత్యకరర్తులాః స్వర్ణీర్ఘా శ్మాలసన్నిభా వన్యా (అప్ప చిం-వర్ణ—౮)

దరశార్ఙ్గపిప్పల దళాంకుశ పన్నగ సన్నిభాః క్రమాత్ పరుషాః
స్తంభ విలేఖాధిక్యైః ప్రయేన వర్గ ద్వితీయ వర్ణాద్యాః (అప్ప చిం-వర్ణ—౯)

కీర తరి హస్తి మస్తక శుక్తి తులాసన వితర్ది సీరసమాః
అంతస్థా శ్చోష్మాణో దంత్య చజౌ గురుతా చ బిందుయుతౌ
(అప్ప చిం-వర్ణ—౧౦)

వీటి అర్థాలు ఆకారాలు

| | | |
|---|---|---|
| బాలేందు | అర్ధ చంద్రుడు ◡ | అ |
| పరిధి | సున్న ఆకారం ○ | ఇ |
| శృంగ | కొమ్ము ఆకారం | ఉ |
| ఆవర్త | నీటిసుడి ఆకారం | ఋ |
| కుశగ్రంథి | దర్భముడి | ఌ |
| దాత్ర | కొడవలి | ఎ |
| పరశు | గండ్రగొడ్డలి | ఒ |

1. చిం విష శో 67

తద్దీర్ఘా ఇతరకర తుల్యా - వాటి దీర్ఘాలు ఏనుగు తొండంతో సమానాలు

| | | |
|---|---|---|
| అన్యౌ | ఇతర-అచ్చులు రెండూ | |
| శూలసన్నిభౌ | శూలాలవంటివి | ఐ ఔ |
| దర | శంఖము | - క |
| శార్ఙ్గ | చాపము | — చ |
| పిప్పలదళ | రావియాకు | — ట |
| అంకుశ | అంకుశం | — త |
| పన్నగ సన్నిభా | పాముతో [సమానమైనవి] | — ప |
| తే ఏవ | అవే, పై కచటతపల లిపులే | |
| స్తంభవిరేఖాధిక్యే | గీత గీయుట అధికంగా చేస్తే | |
| వర్గ ద్వితీయవర్ణాద్యా | ఖ ఛ ఠ థ ఫ—మొదలైనవి ఏర్పడతాయి | |
| కీర | చిలుక | — య |
| తరి | ఓడ | — ర |
| హస్తిమస్తక | ఏనుగుతల | — ల |
| శుక్తి | ముత్యపు చిప్ప | — వ |
| తులాసన | త్రాసు | — శ |
| వితర్ది | అరుగు | — ష |
| సీరసమా | నాగలి/తో సమానాలు/ హ | |
| దంత్య చజౌ | చ, జ లు | |
| గుర్ఘరలౌచ | ఘ ళ లును | |
| బిందుయుతౌ | చుక్కతో కూడి ఉంటాయి | |

పై అర్థాలు ఆకారాలు పరిశీలిస్తే, ఈ లేఖనక్రమం ఏనాటైనా తెలుగునాట వాడుకలో ఉండేదా? అనే సందేహం ఏమాత్రం యోచన చేసేవాడికైనా కలుగుతుంది ఈ లిపిలో వర్గ తృతీయ చతుర్థ పంచమాక్షరాలు ఎలా ఉంటాయో చెప్ప

బడలేదు వాటినన్నిటినీ ఆది శబ్దంతో సరిపెట్టడం ఏవిధమైన లక్షణ నిర్మాణ చాతుర్యమో సూత్రకారునికి తెలియాలి

ఈ లిప్యుద్ధారక శ్లోకాల్ని గూర్చి డా చిలుకూరి నారాయణరావు తమ ఆంధ్ర భాషా చరిత్ర - ఆంధ్రశబ్ద చింతామణి హృదయంలో - దీనిని (లిప్యుద్ధార క్రమాన్ని) బట్టి చింతామణి కాలనిర్ణయమునకుఁ బూనుట హాస్యాస్పదము

అచ్చుల దీర్ఘములు - ఇభకర తుల్యములెట్లు? ఒక్క ఆకారమునకుఁ జెల్లునేమొ స ంభాకారపు బొత్తులు ఇ ఛ థ ర ఫ ల కుండునను ట 1వ శతాబ్దికిఁగాదు గదా 9వ శతాబ్దానికి నన్వయింపదు

దంత్య చ జ ల శకార శకటరేఫముల బొట్టులెక్కడ? క్రిందా? మీఁదా? ముందా? వెనుకా?

నన్నయ నందంపూడి శాసనమున నీలిపిలేదుగదా ఈ గీతులు ప్రక్షిప్తములయినఁగావలె లేదా చింతామణి నన్నయ కృతమయినఁ గాకపోవలె అని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు డా నారాయణరావుగారిని శాసన పరిశోధకులుగా విశేషించి నన్నయ యుగ భాషా స్వభావ పరిశీలకులుగా తెలుగునాడు గుర్తించింది కాగా వారి అభిప్రాయానికి ఎక్కువ విలువ ఉన్నదనే విషయం వేరే చెప్పనిలేదు

లిపిమీద తెలుగు పరిశోధకులు వ్రాసిన గ్రంథాల్లో[1] గాని వ్యాసాల్లో[2]గాని ఈ చింతామణి శ్లోకాలు స్మరించనైనా పడకపోవడం గుర్తించవలసిన అంశం ఈ లిపి శ్లోకాలకు లిపి పరిణామ చరిత్రతో ఏపాటి సమన్వయం సంబంధం ఉన్నా పండితులు వీటిని గ్రహించి ఉండేవారే కాబట్టి శాస్త్రిగారి వాదంతో ఏకీభవించి అర్ధచంద్రాకారమంటే నేటి వర్ణాల తలకట్టు అనీ యవర్ణం చిలుకలాగ షవర్ణం

---

1 లిపి ప్రాదుర్భావ పూర్వోత్తరాలు - డా తిరుమల రామచంద్ర

2 లిపి పరిణామము - మల్లంపల్లి సోమశేఖర శర్మగారు - తెలుగు విజ్ఞాన సర్వస్వము 8వ సంపుటము

అరుగులాగ ఉంటుందని-అంగీకరించడం సాధ్యమైన విషయంగా తోచడంలేదు కాబట్టి వారి ఇతరవాదాలు అనేకంవలె ఇదీ తిరస్కార్యమే అనినిర్ణయించవచ్చు

64వ విషయంలో చింతామణికీ నన్నయ భారతానికీ ఒక ఏకాంత సంబంధాన్ని ప్రతిపాదించడం జరిగింది దాని సారమిది

*ఏకాంత సంబంధ-వాదం*

ఆంధ్రవాఙ్మయంలో ఒక్క నన్నయ భారత భాగంలోనే తత్సమ క్రియల్లో రక్షించెడి రక్షించెదు వంటి తద్ధర్మధాతుజ విశేషణ రూపాలు రక్షించెద వంటి తద్ధర్మ రూపాలు, విచారింతము వంటి ఉభయకర్తృక రూపాలు విచారింపకు వంటి వ్యతిరేక ప్రార్థనార్థక రూపాలు ఉద్భవిల్లుదును[1] వంటి భావార్థకాలు తేజరిల్లని వంటి వ్యతిరేక-భావార్థకాలు అతివిరళంగా ప్రయోగించబడ్డాయి ఒక్క చింతామణి మాత్రమే అట్టి రూపాల్ని సంపూర్ణంగా సాధించకుండా వదిలివేసింది కాబట్టి రెండు గ్రంథాలూ ఏకకర్తృకాలే

ఈవాదం ప్రత్యర్థులు కొన్ని నిర్దుష్టమైన కారణాలు చూపి చింతామణి నన్నయ కృతం కాదంటున్నారని తాముకూడ కొన్ని నిర్దుష్టకారణాల వంటివి చూపి అది నన్నయ కృతమే అని అనాలని బలాత్కృతంగా కల్పించినట్లుంది

నన్నయ ప్రయోగ ప్రాచుర్యాన్నిబట్టి చింతామణిలో లక్షణాలుండటం ప్రయోగ వైరళ్యాన్ని బట్టి చింతామణిలో లక్షణాలుండకపోవడం అన్నది-జరిగి ఉంటే ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో చింతామణి కర్తృత్వాన్నిగూర్చి ఇతింత చర్చలు ఇంత దీర్ఘకాలంగా కొనసాగి ఉండేవి కావు చింతామణి నన్నయకృతమని ఎప్పుడో నిర్ణయం జరిగి ఉండేది

శాస్త్రిగారి ఈ వాదం కేవలం అవకాశవాదం ఎందుకంటే చింతామణి చెప్పిన విభక్తి ప్రత్యయాలు కూర్చి కొలకు పట్టి లకు నన్నయలో ప్రయోగమే

---

1 ఇవి ఆనంతర్యార్థకాలు కాని శాస్త్రిగారు మాత్రం వాటిని భావార్థకాలని వాదిస్తారు-(చిం విష శో 68)

లేదంటే లేకపోతే ప్రమాదం లేదు వ్యాకర్త తన లక్షణాలన్నీ తన గ్రంథాల్లో సమన్వయించి తీరాలనే నియమం ఎక్కడున్నది?' అని వాదిస్తారు[1] ఇక్కడేమో నన్నయ తన లక్షణానికి అనుగుణంగానే తన గ్రంథాన్ని నిర్మించాడంటున్నారు

చింతామణి చెప్పిన వసతి అస్త్యనుబంధాలు క్రియలకు వర్తమాన భవిష్యదర్థాల్లో నన్నయలో కనబడవంటే ఆ అనుబంధాల అర్థమే వేరని ఆ అనుబంధాలతో ఏర్పడేవి క్రియా పదాలుగా కాక క్రియాజన్య విశేషణాలుగా ఉండాలని[2] అంటారు కారణం ఉన్న కలానుబంధాలతో నన్నయ ప్రయోగించలేదుకదా అంటారు అన్యోన్యాశ్రయకంగా

ఒకచోట లక్షణకర్త చేసిన లక్షణాలకి విపరీతార్థాలు కల్పించి తాము ఉద్దేశించిన లక్ష్యాలకు వాటితో (లక్షణాలతో) వైరుద్ధ్యాలు సరిచేస్తూనే మరొకచోట కేవలం స్వలక్ష్యానుగుణంగానే లక్షణకథనం చేశాడు వ్యాకర్త—అనడంన్యాయ్యంకాదు

ఎడి ఎదు—ప్రత్యయాలు 2 ఎద—ఆగమం 3 విచారించెదము—సంక్షిప్త రూపం విచారింతము—వంటి ఉభయార్థక రూపాలు 4 ధు ఆగమం గల వ్యతిరేక మధ్యమ పురుష రూపాలు 5 దున్ అనే అనంతర్యార్థకం 6 మి అనే వ్యతిరేక భావార్థక ప్రత్యయం చింతామణిలో ప్రక్రియా సహితంగా నిరూపించబడలేదు దానికి కారణం వాటి ప్రయోగం నన్నయ భారత భాగంలో లేకపోవడమనివాదిస్తే చెల్లదని (అటువంటి రూపాలు నన్నయలో కొల్లలుగా కనుపిస్తాయి) కొత్త కారణం ఊహించి చెప్పారు—'ఆ ప్రత్యయాలు ఆగమాలు సంస్కృతసమ ధాతువులతో కూడి విరళంగా నన్నయలో ప్రయోగించబడటం అని

వ్యాకర్త తన ప్రయోగాలకు లక్షణం చెప్పడంలో ఈ విధమైన సంకుచిత దృష్టితో కొన్ని ప్రత్యయాలు ఆగమాలు సంస్కృత సమ ధాతువులతో కూడి అధికంగా ప్రయోగించబడలేదు కాబట్టి ఆ ప్రత్యయాల్ని ఆగమాల్ని లక్షణబద్ధం చేయకుండా విడిచిపుచ్చాడనడం విడ్డూరమైన విషయం అందులోను ప్రథమ

---

1 చిం విష లో 5

2 చిం విష లో 2 3 విషయాలు

వ్యాకర్త తన ప్రయోగాల మొత్తాన్ని సాధ్యమైనంతగా లక్షణబద్ధం చేయడానికి యత్నిస్తాడే కాని ఇలా కారణంగాని కారణాన్ని కల్పించుకొని మానివేస్తాడని అనడం అంగీకార్యం కాదు

విజానికి ప్రాచీన వాఙ్మయంలోని ప్రసిద్ధ ప్రయోగాల్నిగూడ లక్షించలేని చింతామణి అసామర్థ్యాన్ని ఒక విచిత్రమైన ఫక్కీలో సమర్థిస్తూ శాస్త్రిగారు చేసిన పై వాదం బహుదుర్బలమై విచారాసహంగా ఉంది

పై ప్రత్యయాగమాలు దేశ్య శబ్దజాలంలో విరివిగానే నన్నయ భారతంలో కలవనివారే ఒప్పుకొన్నారు శాస్త్రిగారి ప్రస్తుతవాదం చింతామణి సంస్కృత సమ భాషా నిరూపణ ప్రవణం అనే వారి మరొక వాదంమీద ఆధారపడింది కాని ఆ వాదం సోపపత్తికంగా ఇంతకు ముందే ఉన్మూలించబడింది కదా అయినపుడు ప్రస్తుత వాదమూ స్వయం పరాస్తమే చింతామణి కర్త తెలుగుకి వ్యాకరణం వ్రాస్తూ సంస్కృత సమ ధాతువులమీద ఏవో ప్రత్యయాలు ఆగమాలు చేసిన రూపాలు ఎక్కువగా లేవని (తన గ్రంథంలో) ఆ ప్రత్యయ విధానమే మాని వేస్తాడా? ఇది వితండవాదం కాగా అనాదరణీయం తిరస్కరణయోగ్యం

శాస్త్రిగారు ఈసందర్భంలో ఆయా రూపాలు నన్నయ భారతంలో కనిపించే వ టి సంఖ్య ఇచ్చారు అవి సరిగా లేవు

ఎడి ఎడు ప్రత్యయాలతోడి రూపాలు నన్నయభారతంలో అగుపడవన్నారు కాని మూడు ప్రయోగాలు సంస్కృత సమ ధాతువులమీదే కనిపిస్తున్నాయి ఉద్భవిల్లెడు 2 లయంపడియెడు 3 భేదించుచుండెడు

ఎదగాగమంతోడి తద్ధర్మ రూపాలు రెండే కలవన్నారు కాని ఏడు కనుపిస్తున్నాయి జన్మించెదన్ 2 జీవించెదము 3 పుత్తెంచెద 4 పరిగ్రహించెదన్ 5 పరిభ్రమించెదన్ 6 ప్రసాదించెదని 7 రచియించెదన్[2]

దుగ్గకారం తకారమై తరువాత ఉభయార్థకంగా ప్రయోగించబడే రూపాలు రెండేనన్నారు కాని నాల్గు కనుపిస్తున్నాయి ఉపయోగింతము 2 నిశ్చయింతము 3 భేదింతము 4 విచారింతము[3]

1 నన్న వ కా 228 688 683 పుటలు క్రమంగా
2 నన్న వ కా 5 5 2 593 684 686 678 7 2 పుటలు క్రమంగా
3 నన్న వ కా 248 586 68 634 పుటలు క్రమంగా

మి ప్రత్యయాంత రూపాలు-మూడే నన్నారు నాల్గు కనుపిస్తున్నాయి

ప్రయోగింపమి 2 రక్షింపమి 3 లక్షింపమి లంఘింపమి

పైన ఒనగినవనీ తత్సమదాతు రూపాలే.

చింతామణిలో సూత్రించని వ్యాకరణాంశాలు ఇంకా బోలెడున్నాయి మరి దానికి ఏమి కారణం చెప్పగలరు శాస్త్రిగారు? ఉదా

1 చేయువాడు వంటి తృవర్ణకార్థక విశేషణాలు 2 చేయగల వంటి భవిష్యదర్థక విశేషణాలు 3 చేయను వంటి తుమున్నంతావ్యయాలు 4 చేసిన వంటి చేదర్థకాలు మొదలైన అనేకాంశాలు చింతామణిలో లక్షితంకాలేదు వీటిని విడచిపెట్టడంలో ఉన్న కారణమే పై ఎడి ఎద్వాది ప్రత్యయ సహిత రూపాలను సూత్రించకపోవడంలోను ఉన్నదనుకోవడం సముచితంకాని అదొక ఏకాంత సంబంధం —చింతామణి భారత భాగాలకు-అని సూత్రకర్తకు బొత్తిగాలేని అభిప్రాయాన్ని వాదంకోసం ఊహామాత్రంగా కల్పించడం పరిశోధకుల పని కాదు కారాదు కూడ

## దుగాగమ రూపవాదం

56వ విషయంలో దుగాగమ-రూపాలు (ఎదగాగమ రూపాలుకూడా తద్ధర్మార్థంలో ఉన్నా వాటిని చింతామణి చెప్పలేదు-నన్నయ ప్రయోగించాడు) తద్ధర్మార్థకాలుగా చింతామణి చెప్పడంవలన వాటిని నన్నయ ప్రయోగించడంవలన చింతామణిని భారత కర్తే వ్రాసినట్లు రుజువగుతున్నదన్నారు ఆ విషయం శ్రీ వీరేశలింగం గ్రహింపజాలక అది బాధక మని వింతగా వ్రాశారని కూడా ఒక విసురు విసిరారు

వీరేశలింగంగారి వాదాన్ని తిరస్కరించాలి లేక ఖండించినట్లు కనబడాలి అని చేసిన వాదంవలె ఉన్నదేగాని పై వాదం దానిలో పసలేదు

---

1 నన్న వ కో 877 7 2 7 2 7 7 క్రమంగా

తద్ధర్మసంజ్ఞను చేసినది చింతామణి చింతామణి ననుకరించిన వ్యాకరణాలలో వికృతి వివేకం బాలవ్యాకరణం మొదలైన వాటిలో తప్ప ఇతరత్రా ఆ సంజ్ఞే కనిపించదు కేతనాదులు మూడు కాలాలు పేర్కొని వాటిలో ఆయా రూపాలు చూపారు అంతే

తద్ధర్మ శబ్దాన్ని క్రియాపరంగా వాడటం సంస్కృత వ్యాకరణాల్లో కూడా అపూర్వ విషయం ఆ శబ్దం వాటిలో ప్రయుక్తమైందికాని అర్థ సందర్భాలు వేరు 1 అక్కడ తద్ధర్మ పదానికి ఒక కృత్ప్రత్యయార్థం వివరించబడింది ఏమైనా తద్ధర్మ పదాన్ని క్రియాన్వయిగా వాడటం చింతామణితో ప్రారంభమైన విషయం చింతామణిలో తద్ధర్మార్థకాలుగా చూపిన రూపాలు ఆ పేరుతో కాకపోయినా కేతనాదుల వ్యాకరణాల్లో లక్షితాలై ఉన్నాయి వారు సూత్రించిన భాషకూడ నన్నయదే అయినపుడు ఆ రూపాలు నన్నయలో ఉన్నవి కాబట్టి చింతామణి నన్నయ కర్తృక మనడం నిలబడే వాదంకాదు ఈ సందర్భంలో వీరేశలింగంగారి వాదసార మేమిటంటే—

ప్రాచీన వ్యాకర్తలు వర్తమాన భావ్యర్థక క్రియలు నిరనుబంధాలుగా ఉంటాయని చేసెదను చేయుదును వంటి వాటిని ఉదాహరిస్తే చింతామణి కర్త ఆ క్రియలు సానుబంధకాలుగా ఉంటాయని చెప్పుచున్నాను చెప్పగలను-వంటి వాటిని ఉదాహరించాడని చింతామణి చెప్పిన ఆ రూపాలు నన్నయ యుగంలోని వాఙ్మయంలోనే లేవని పైగా ఆ రూపాలు మిక్కిలి అర్వాచీన కాలంలో గాని ఏర్పడలేదనీ కాగా చింతామణికి భారత భాగ కర్త కర్త కాజాలడని మాత్రమే

పై వాదంలో స్పష్టమైన హేతుపూర్వకమైన ఆలోచనను రేకెత్తించే అంశాలు ప్రతిపాదించబడి ఉంటే వాటికి సూటిగా సమాధాన మియ్యకుండా ఏవో మాటలు శాస్త్రిగారు అప్రసక్తంగా ఆడటం సరిగా లేదు

---

పాణినీయ సూత్రం - ఆక్వే స్తచ్ఛీల తద్ధర్మ తత్సాధు కారిషు (3–2– 3)
వృత్తి క్విపం అభివ్యాప్య వక్ష్యమాణా ప్రత్యయా తచ్ఛీల
తద్ధర్మ తత్సాధుకారిషు కర్తృషు బోధ్యా
ఉదా ర్తాకటం అలంకరిష్ణు జిష్ణు శమీ ఇత్యాదయ

ఆ తరువాత 60వ విషయంలో కేతన పెద్దనాదులు పరిశీలనారహితంగా లక్షణ లక్ష్యాలు ఏర్పర్చారని భవిష్యదర్థ క్రియలకు చేశారని వారిమీద కూడ వారి వ్రాత చింతామణి ప్రాచీనతకు భంగకరం కావడంవలన కోపగించారు శాస్త్రిగారు

కేతనాదులు తమ వ్యాకరణాల్లో అప్పటివరకు వెలువడిన వాఙ్మయ ప్రయోగాలు ఆధారంగా సునిశిత పరిశీలనం చేసిన తరువాత కాలత్రయంలో త్రివిధ రూపాల్ని సమూత్రంగా సాధించి చూపారు వారి లక్షణాలు సామాన్యంగా అవ్యాప్తి అతివ్యాప్తులకు దూరంగానే ఉన్నాయి కాని ఇక్కడ మనం గమనించవలసిన విషయం వారి కాలానికి స్పష్టంగా ఇది వర్తమాన కాల మాత్రోపయోగి రూపమని ఇది భవిష్యత్కాల మాత్రోపయోగి రూపమని క్రియా ప్రయోగాల్లో నిశ్చితమైన విభాగం జరగడానికి అవకాశం లేదు—అన్నది వారి కాలానికి ఉన్న—కలానుబంధాలతో డి రూపాలు ఏర్పడనేలేదన్నది ఏర్పడని రూపాల్ని వారు ఎలా చెప్పగలరు? అయినపుడు క్వాచిత్కంగా వారు వర్తమాన భావ్యర్థకాలన్నవాటికి వ్యత్యయం కొన్ని ప్రయోగాల్లో జరిగింది[2] గాబట్టి వారి పరిశీలనాశక్తిని శంకించడం కాని వారి రచనను క్షించపరచడంగాని వైయాకరణులు మెచ్చే పని కాదు ఆ కాలంలో అంతకుమించి ప్రయోగాలు లేనందువల్ల ఎవరు వ్యాకరించినా నియమ కల్పనం అలాగే ఉంటుంది కాగా యథార్థ విషయాల్ని కప్పిపుచ్చి అస్థాన సంరంభం చూపడం శాస్త్రిగారికి అనవసరం

ఇంతవరకు 65 విషయాల్ని పరిశోధించి చింతామణి నన్నయ కృతమే అని నిర్ణయించినట్లు శాస్త్రిగారు భావించారు కాని ఆ నిర్ణయాల్లో చాల భాగం వారి ఊహలు -ఆలోచనలు తప్ప బలీయమైన కారణాలు కనబడలేదు

చింతామణి సంస్కృతంలో వ్రాసిన తెలుగు వ్యాకరణమై ఉండటం తెలుగు వ్యాకరణాల వివాదం తెలుగు పండితులకే పరిమితమైనదని లోక మనుకోవడం ఇదేదో గత కాలానికి చెందిన శుష్కవాదమని విశేషజ్ఞులు భావించి ఉపేక్షించడం—

---

1 చూ చింతామణిలో లక్షితమైన భాష అనే ప్రకరణం

2 చిం విష శ్లో లో 62 63 64వ విషయాలుగా ఈ వ్యత్యయాన్ని శాస్త్రిగారుచూప యత్నించారు ఆ చోటులలో సిద్ధాంతంగా వారన్న అర్థమే చెప్ప వనిలేదని ఆ సందర్భాల్నిబట్టి చూస్తే తెలుస్తుంది

—ఇవన్నీ కారణాలుగా ఈ చింతామణి కర్తృత్వ వివాదం ఇంతకాలం అపరిష్కృతంగా నిల్చిపోయింది

పై పరిశీలనంవలన చింతామణి విషయ పరిశోధనంలో జరిగిన ప్రధాన నిర్ణయాలలో ఏ ఒక్కటీ చింతామణి కాల కర్తృత్వాల విషయమై నిస్సందిగ్ధమైన ప్రమాణాన్ని ప్రదర్శించలేక పోయిందని కాగా ఆ నిర్ణయాలన్నీ అనాదరణీయాలే అని నిర్ణయించవచ్చు

## చింతామణి విషయ పరిశోధన ద్వితీయ భాగం

చంద్రశబ్ది చింతామణి విషయ పరిశోధన ద్వితీయభాగం ౧౦వ పై ౭౦వ విషయంతో కావ్యభాషకు సంస్కారం కావాలి అనే ఆశయ ప్రతిపాదనతో ప్రారంభమై సంస్కృత వ్యాకరణాల స్థితిగతులను విమర్శిస్తూ వాటిప్రభావం తెలుగు వ్యాకర్తలపై ప్రసరించినదని వివరిస్తూ చింతామణి కర్త (నన్నయ అని శాస్త్రిగారి భావం) కావ్య భాషకే సంస్కారం గాని కావ్యేతర భాషకి అక్కరలేదని భావించాడని చెప్పడంతో ౯౩వ విషయంతో ముగిసింది

ఇక్కడకూడి శాస్త్రిగారు ముందు చేసినట్లే వాఙ్మయారంభానికి ఒక మార్గం ఏర్పరచే అభిప్రాయంతో భాషానుశాసనం నన్నయ ముందు చింతామణిద్వారా చేసి పిదప భారతరచనకు దొరకొన్నాడని వాదించారు[1] అలాగే చింతామణి సంస్కృత సమ శబ్ద నిష్పాదన ప్రవణమని కూడా అన్నారు

ఈ రెండు విషయాలూ యథార్థాలు గాజాలవని పూర్వమే నిర్ణయించడం జరిగింది మాటిమాటికి శాస్త్రిగారు చింతామణి సంస్కృత శబ్దాలను తెనుగులోనికి తెచ్చుకొనే మార్గం ఉపదేశించడానికే పుట్టినదనడం జరిగింది చింతామణి మొత్తాన్ని పరికించి చూస్తే ఆ అభిప్రాయం హలంత క్రియా పరిచ్ఛేదాల ప్రారంభంలో కొద్దిగా ఆభాసించడానికి అవకాశం కనిపిస్తున్నది కాని పరిచ్ఛేదాలలోనికి వెళితే ఆ భావం ఎంత మాత్రం నిలబడడం లేదు—అని ప్రస్తుత ప్రకరణంలోనే పరిశీలించి తెలిసికొన్నాం కాగా పరాస్తవాదాలమీద మరికొన్ని వాదాలు లేవనెత్తి శాస్త్రిగారు సాధించింది ఏమీ లేదు

1 చిం విష శో 70 7

ఏది ఏమైనా శాస్త్రిగారి వాద సర్వస్వానికి ఒక్క అభాస కారణమే – చింతామణి సంస్కృత సమశబ్ద నిరూపణ ప్రవణమన్నది ఆధారంగా కనుపిస్తున్నది కాబట్టి ఆయన మాటిమాటికి ఆవాదాన్నే పట్టుకొని వ్రేలాడుతుంటారు ఈ ద్వితీయ భాగంలో గ్రాంథిక వ్యావహారిక భాషల తారతమ్య పరిశీలనం ప్రాకృత సంస్కృతాల జనక జన్య భావపరిశీలనం[2] పాణినీయం యొక్క వేదభాషానుశాసకత్వ నిరూపణం[3] జరిగాయి ఈ విషయాలు ప్రస్తుత పరిశోధన పరిధికి రానివి కాబట్టి వాటిలో కొన్ని విమృశ్యాంశాలు[4] ఉన్నా ఉపేక్షించడం జరిగింది

తరువాత రాజరాజ నరేంద్రుడు పూర్వాచార పరాయణుడని నన్నయసనాతన ధర్మ పరిపాలన తత్పరుడని భారతావతారికలోని పద్యాన్ని ఉదాహరించి చూపారు వారి పూర్వాచార పరాయణత్వం సనాతన ధర్మ పరిరక్షణ తాత్పర్యం ఎవరూ సందేహించడం లేదు సందేహించేదల్లా ఒక్క చింతామణి కర్తృత్వాన్నే ఆ విషయం సిద్ధాంతితమైనట్లుగా భావించి చేసిన ప్రసంగం ఈ భాగంలో ్ంతఉంది అది –

చింతామణి భారత భాగాలు ఏకకర్తృకాలు కాబట్టి వాటిలోని సూక్తుల సమాన భావాన్ని విశదీకరిస్తున్నాయని వారికితోచినట్లు క్రిందివిధంగా ఉదాహరించి వ్యాఖ్యానించారు.

విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ
సావాగ్యా రసవృత్తి సాధ్యోహి రసో యథాతథం కవిభిః (సంజ్ఞా— )

స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధధియః
లోకే బహు మన్యంతే ప్రైకృత కావ్యాని వాన్య దవహాయ (సంజ్ఞా—2)

---

1 చి విమ శ్లో 88

2 పైది 76 8

3 పైది 8 78

4 76వ విషయంలో సంస్కృతం నుండి ప్రాకృతం పుట్టినదంటే అజ్జ ఉత్త –నుండి అర్యపుత్ర శబ్దం పుట్టినదని–వ్యుత్పత్తిగణిత పద్ధతి ననుసరించు- అని వస్తుందని ఎగతాళిగా వ్రాశారు కాని అజ్జఉత్త అనేది అర్వాచీన ప్రాకృతం అది సంస్కృతానికి మూలంకాదు ప్రాచీన ప్రాకృతమే సంస్కృతానికి మూలమని తద్జ్ఞుల అభిప్రాయం

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థ యుక్తిలో
నారసి మేలునా నితరులక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురు డయ్యె జగద్ధితంబుగన్ (ఆది - —26)

చింతామణి శ్లోకాలకు భా తి పద్యానికి ఏదో ఆంతరంగిక సంబంధం ఉన్నదని ఆ సంబంధాన్ని బట్టి అ రెండు గ్రంథాలు ఒకరే వ్రాసి ఉంటారని శాస్త్రిగారు వాదించారు కాని పై రెండింటి అర్థ తాత్పర్యాల్లోగాని శబ్ద రచనలో గాని ఎ విధమైన సంవాదమూ కనుపించడం లేదు పై చింతామణి రసప్రధానంగా కావ్య ముండవలెనంటుంటె భారత పద్యం ప్రసన్నకథా కలితార్థయుక్తితో అక్షర రమ్యతతో నన్నయ రచన ఉండబోతున్నదని వివరిస్తున్నది దేశభాషాభిమానం కారణంగా వైకృత కావ్యాలుకూడ రసజ్ఞులకు ఉపాదేయాలే అని చింతామణి చెబుతుంటే తన రచలోని ప్రధానాంశం ప్రసన్నకథా కలితార్థయుక్తిని కవీంద్రులు గుర్తిస్తే ఇతరులు అక్షర రమ్యతను ఆదరిస్తారని నన్నయ చెబుతున్నాడు ఈ ప్రసంగాలు రెండింలో సామ్యం ఎముంది ఎక్కడుంది లేదు

చింతామణి సంస్కృతంలో రచించబడడానికి హేతువులు రెండు చెప్పారు. వ్యాకరణ విషయాలను చెప్పజాలిన భాష సంస్కృతమే 2 వ్యాకరణ శాస్త్రం వేదాంగాలలోని దగుటచేత అది పవిత్రమైన సంస్కృతభాషలోనే ఉండాలి ఈ రెండభిప్రాయాలు చింతామణి కర్త (నన్నయ—అని శాస్త్రిగారి అభిప్రాయం) అభిప్రాయాలనికు ద అన్నారు 1 వీటిలో మొదటి కారణం చింతామణిని నన్నయ చేశాడనే వాదానికి తలవంపు సంస్కృతంలోని భారతాన్ని తెలుగువారి కోసం తెలుగులో వ్రాసేవాడు తెలుగువారికి తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతంలో చేశాడనడం విశ్వాసార్హంగాలేదు వ్యాకరణ విషయాల్ని చెప్పలేని భాష వేదాంతధార్మిక విషయాల్ని మాత్రం చెప్పగలుగుతుందా భారతం తెలుగులోనికి మార్చడంలో ముఖ్యోద్దేశమే అదిగదా కాగా తెలుగు భాషా సామర్థ్యాన్ని శంకించి సంస్కృతంలో తెలుగు వ్యాకరణ రచన జరిగిందనడం విచారాసహమైన వాదం




చిం విష శ్లో 78

రెండవ కారణం ఇక్కడ అనన్వితంగా ఉంది వేదాంగాలలో వ్యాకరణ మొకటే సందేహం లేదు కాని ఏ వ్యాకరణం? వైదిక సంస్కృత భాషా వ్యాకరణం మాత్రమే. అంతే గాని తెలుగు (వికృతి) వ్యాకరణం కాదు

కాబట్టి చింతామణికర్త సంస్కృతంలో తెలుగు వ్యాకరణం చేయడానికి కారణాలు శాస్త్రిగారు చెప్పినవి కావు సంస్కృతంలో చెబితేగాని గౌరవం ప్రమాణబుద్ధి పండితులకి కలగవనే భావన మొదటి కారణం ఆ విషయాన్ని చింతామణికి బృహద్వ్యాఖ్యానం చేసిన అహోబలపతి వెలువరించే ఉన్నాడు

నిజమాడితే నిష్కర్షంగాని నిన్నమొన్నటివరకుగూడ మన పండిత ప్రకాండు లనేకులకు ఇట్టి అభిప్రాయమే ఉండేది—అనడానికి తెలుగునాటి సహృదయ పండితులే ప్రమాణం

శాస్త్రం-ప్రయోగం రెంటిలో ఏది ప్రమాణం?

86వ విషయంలో ఒక విచిత్ర వాదం చేశారు శాస్త్ర ప్రయోగ వచసో శాస్త్రం బలవదుచ్యతే అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్ అనే కారికకు వికృతి వివేకకారుఁడు సంస్కృత వైయాకరణుల సిద్ధాంతము ననుసరించి సంస్కృత వ్యాకరణమునకు లొంగనపుడు తెల్గు కావ్యములందలి మహాకవి ప్రయుక్త సంస్కృత శబ్దములను నపశబ్దములె యనియు శాస్త్రవిరోధము లేనపుడే కవి ప్రయోగములకుఁ బ్రామాణ్యమనియు శాస్త్ర కవి ప్రయోగములకు విరోధము కలుగునపుడు శాస్త్రమునకుఁ బ్రామాణ్యము నంగీకరించి యా ప్రయోగములను నిరసింపవలసినదే యనియు సిద్ధాంతము చేసి యున్నాడు — అని వికృతివివేకకర్త తాత్పర్యంగా తమ తాత్పర్యం వెలువరించారు

వికృతివివేక కర్త తన కారికలో సంస్కృతశబ్దాల సాధుత్వాసాధుత్వాల విషయంలో శాస్త్రానికీ ప్రయోగానికీ విరోధంవస్తే ఏం చేయాలనే విషయం చెప్పి ఉంటాడనటం కంటె తెలుగు శబ్దాల సాధుత్వాసాధుత్వాల విషయంలో విరోధం

---

అహో సం పీఠిక 78 శ్లో

శాస్త్రానికీ కవి ప్రయోగానికీ వస్తే శాస్త్రాన్ని ఆదరించాలనీ అయితే శాస్త్రం కవి ప్రయోగాన్ని నిష్పన్నం చేయలేని స్థితిలో ఉంటే ప్రయోగమే శరణ్యమని వివరించాడనడం సందర్భశుద్ధంగా ఉంటుంది

వికృతి వివేకకర్త కు ఈ కారిక సంస్కృత శబ్దాల విషయంలో అన్వయించాలనే అభిప్రాయం అంటగట్టడమే అనవసరం కాబట్టే అహోబలపతి—

యత్ర శాస్త్రేణ విశిష్య కార్య ముచ్యతే తత్ర శాస్త్రం బలవద్భవతి యత్ర శాస్త్రేణ సామాన్యవిధానం తత్ర ప్రయోగో బలవానితి తదర్థః అని వ్యాఖ్యానించాడు

కాగా కారికాకర్త కు లేని వ్యాఖ్యాత చెప్పని అర్థాన్ని శాస్త్రిగారు ఎందుకు సృష్టించారంటే—

అహోబలపతి ఆద్యుఁడు వారణ్యాగర్భు నందంతకంటె నిత్యాది కవిపితామహాద్యుక్తిస్తు నిర్మూలైవ అని షష్ఠీ విశేషణానాం ప్రథమాస్యాత్ [1] అనేసూత్ర వ్యాఖ్యానంలో ఇంకా ఇలాగే ఇతరత్రా కొన్ని ప్రయోగాల్ని నిరాకరిస్తూ చేసిన ప్రసంగాన్ని నిరసించడానికి

వికృతివివేక కారికకు శాస్త్రిగారనుకున్న అర్థం చెప్పకపోతే అహోబలపతిపై చేసే నిరసన కారికాకర్త కు కూడా అన్వయించవలసి వస్తుందని వారి భయం-అంటే కారికాకర్త అభిప్రాయాన్ని అపార్థం చేసుకొని అహోబలపతి ప్రాచీనుల తెలుగు ప్రయోగాల్ని నిరసించాడని వాదించాలని వారి ఉద్దేశం కాని నిజానికి కారికకు శాస్త్రిగారనుకున్న అర్థం చెప్పకపోయినా కొన్నిచోట్ల మహాకవి ప్రయోగాలుకూడా స్వయంగానే సూత్రానపేక్షంగానే స్వీకార్యాలు అన్నభావం పై కారికలో సహజంగా ఉండనే ఉంది కాబట్టి మహాకవి ప్రయోగాల్ని పట్టుకొని తప్పులనడం అహోబలపతికి కూడదని సామాన్యంగానే ఆక్షేపించవచ్చు

ఈ ద్వితీయ భాగంలో శాస్త్రిగారు చింతామణి విషయాలకు దూరాన్వయం గల సంస్కృత వ్యాకరణ విషయాలు కొన్ని తడిమి విమర్శించారు ఆ విమర్శలో

---

అజంత శబ్ద సూ

మొత్తంమీద తెలుగు వైయాకరణులు కవుల మహాకవుల ప్రయోగాలు కొన్ని ప్రమాదాలని అనాకరాలని అనడం సంస్కృత వైయాకరణులనుండి నేర్చుకున్నారని నిరూపించారు అది నిజమే

ఈ భాగంలో చింతామణి కర్తృత్వ విషయమై చర్చ జరగలేదు ముందు చెప్పినట్లు అది నిశ్చితమైనట్లు భావించి ప్రసంగించడం జరిగింది కాని ఆ నిశ్చయం ఏక పక్షంగా జరిగింది గాబట్టి దాన్ని గౌరవించవలసిన పని లేదు

## చింతామణి విషయ పరిశోధన తృతీయ భాగం

చింతామణి విషయ పరిశోధనంలోని తృతీయ భాగం (చివరి భాగంకూడ) చింతామణి కర్తృత్వ విషయమై వివాదం ముగిసినట్లే భావించి తరువాత చింతామణిలోని నిగూఢాశయాల ఆవిష్కరణకోసం చేయబడినట్లు దాని ఉపోద్ఘాతంలో ఉంది

చింతామణి నన్నయచే పదకొండవ శతాబ్దిలో రచితమైనదని నిశ్చితమైతే తప్ప ఈ మూడవ భాగంలో చేసిన పసంగమంతా నేలవిడిచిన సాము కావలసి వస్తుంది కాగా కర్తృత్వం అనిశ్చితంగా ఉన్నంతకాలం ఈ భాగంలో శాస్త్రిగారు చేసిన చిత్ర విచిత్ర వాదాలు అంతగా పట్టించుకోవలసిన అవసరం లేదు అయినా వాటి పరిశీలనం కూడా ఇక్కడ చేద్దాం వారి వాదాల జోలికి పోవడానికి ముందు 2 ఆటంకాలు కనిపిస్తున్నాయి

చింతామణి ఆశయాలు నిగూఢం అయిపోవడానికి అది రచించిన కాలానికి బయల్పడిన కాలానికి మధ్య 500 ఏండ్లు వ్యవధానం ఉన్నదని విశ్వసిస్తేనే గాని ఆధారమే లేదు

2 ఒకవేళ వాద సౌలభ్యంకోసం కొంత తడవు విశ్వసించినా దాని వ్యాఖ్యాతలందరూ బాలసరస్వతి అప్పకవి అహూబలపతి వరుసగా తప్పనిసరిగా పొరబడ్డారని అంగీకరిస్తే తప్ప శాస్త్రిగారు కొత్తగా వెలికితీసి చూపే విచిత్రార్థాలు అంగీకరించలేము.

మొదటి ఆటంకం తొలగవలసే ఉన్నదని ఇంతవరకు సాగిన పరిశీలన వలన తెలుస్తుంది రెండవ ఆటంకం కూడ బలీయంగానే ఉంది. అసలు బాలసరస్వతి

లేకుంటే చింతామణి ఉండేదికాదు ఒకవేళ ఎదిరి వాద సౌలభ్యంకోసం ఉండేదనుకున్నా దానికి అర్థ తాత్పర్యాలు ఏర్పడి ఉండేవికావు ఎందుకంటే నాటికి, నేటికి కూడా అతడు గీసిన గీట్లలోనే ఆ సూత్రాల వ్యాఖ్యానాలు సాగుతున్నాయంటే చింతామణికి అతనికీ ఉన్న సంబంధ మేపాటిదో సులభంగా ఊహించవచ్చు ఈ విషయం ఈ గ్రంథంలోనే ప్రకరణాంతరంలో[1] సోపపత్తికంగా నిరూపించబడి ఉంది కాగా బాలసరస్వతికి తప్ప యితరులెవ్వరికి తెలియని తెలియరాని అర్థాలు చింతామణిలో ఉన్నాయని అయినపుడు అతడు అతని టీకను ఆధారంగా చేసికొని పెద్దవ్యాఖ్యానాలు వ్రాసిన అప్పకవి అహోబలపతి పొరబడటం ఆ పొరబాటును ఆధునికులు దిద్ది సరైన అర్థాలు చెబుతారనడం - ఇదంతా లేని వస్తువును చీకటిలో అంధులు పట్టుకొన్నట్లుంది చింతామణి సూత్రాలకి బాలసరస్వతి చేసినదే అర్థం అతడిచ్చినవే లేక అటువంటివే ఉదాహరణలు అయినపుడు అతడే పొరబడ్డాడనడం కంటె ఆ గ్రంథమే ఒక పొరపాటనడం భావ్యంగా ఉంటుంది

### నన్నున్ మమ్మున్ రూపనిష్పత్తి

ఇక శాస్త్రిగారి వాదాల్ని వాటి గుణదోషాల్ని గమనిద్దాం

అనాదిషు విభక్తిషూ తో వేతి సూత్రార్థ విమర్శనము —వాదసారం

దీనిలో నన్నున్ + ఏలున్ = నన్నేలున్ నన్నునేలున్ అనేరూపాలు ఈ సూత్రానికిఉదాహరణలు కావంటారు కారణంగా న్నుమ్మూ హ్రస్వాశ్చాదే రమికసిచ[2] అనే సూత్రాన్ని వ్రాసి దాన్ని బట్టి న్నుమ్ములు ద్వితీయావిభక్తి ప్రత్యయాలు కావుగదా అంటారు (వాటిని ఆగమాలుగా భావిస్తే నన్నునున్ మమ్ములన్ అనే రూపాలు సిద్ధిస్తున్నాయి) అనాదిష్విత్యాది సూత్రం విభక్త్యర్థకారానికే సంధిని విధిసున్నది కాని ఇతరానికి కాదు

అయినా నన్నేలున్ నన్నునేలున్ - వంటి సంధియుత రూపాలు భారత ప్రయోగ అనుగుణాలే అయితే వాటి నిష్పత్తిని మాత్రం చింతామణి చెప్పదు

---

1. చూ సూత్రకర్త వివరిస్తేగాని తెలియని సూత్రాలు అనే ప్రకరణం
2. చింతా హలంత. 6 సూ

నన్నయ ప్రయోగాల్ని బట్టి నన్ నిన్ తన్ అనే నన్నును ఇత్యాది రూపాల సంక్షేపపారూలకి అచ్చు పరమైనపుడు చివరి ద్రుతం ద్విత్వయుక్త మౌతుందని గ్రహించాలి

అయితే మమ్మేలు మమ్మునేలు – అనే రూపాల్ని మాత్రం ప్రకృత సూత్రోదాహరణలుగానే స్వీకరించాలి కారణం వీటి రూపనిష్పత్తి (మిమ్ము తమ్ము మమ్ము) నిన్ను తన్ను నన్ను – అనేవాటి రూప నిష్పత్తి కంటె భిన్న మైంది ఇక్కడ బహువచనంలో లశసోఽన్తాత్ అనేసూత్రం ప్రవర్తించదు ఆ శస్ (ద్వితీయా బహువచన ప్రత్యయం) విభక్తి రాకుండానే ఊరకే లోపిస్తుంది –ఇవి శాస్త్రిగారి వాదాలు

ఇక్కడ మాత్రం మిమ్ము లో ఉత్వానికి విభక్తిత్వసిద్ధి ఎట్లు? అనే శంక ఉండనే ఉంది ఆ శంకకు వారొసగిన సమాధానం విభక్తి ప్రత్యయం వేరుగా లేదుగాబట్టి చివరి వర్ణాన్నే విభక్త్యంత వర్ణంగా గ్రహించాలని

శాస్త్రిగారి పై వాదాల్లో వక్రత్వం చాల కనిపిస్తుంది పైగా నిరంకుశత్వం దుస్సహంగా ఉంది చింతామణికి నాటినుండి నేటిదాక వచ్చిన వ్యాఖ్యానాలన్నీ ఈ విషయంలో తప్పులంటారు కేవలం తమ బుర్రలో పుట్టిన విచిత్ర అనన్విత వాదాల్ని సిద్ధాంతాలుగా తెలుగు పండితులపై రుద్దాలని వారి తొందర ఆ అధికారం వారికి ఉన్నదనుకోవడంతో వచ్చిపడిన దురవస్థ ఇది నిజానికి ఈ ఒక్కచోట వార్లు చేసిన వాదంలోని అపక్రమాలే అన్నిచోట్లా కొద్దిగానో గొప్పగానో కాపడతాయి

ఒకే ఆకారం చింతామణి రీతిలో ఒకే నిష్పాదన ప్రక్రియ కలిగిన రెండు పదాల్ని భిన్న విధానాలతో ఉత్పన్నం చేసే అధికారం శాస్త్రిగారు వహించడం నిరంకుశత్వానికి చిహ్నం ఇక్కడ వీరు చెప్పిన విచిత్ర ప్రక్రియకు చింతామణిలో ఎక్కడా ఆధారం లేదు పూర్వ వ్యాఖ్యానాల్లో అసలే లేదు కేవలం తమ ఊహ ఒక్కటే ఆధారం

చింతామణి నన్నున్ మమ్మున్ – వంటి రూపాల్నే చేసి చూపిందిగాని వారన్నట్లు నన్ తన్ – వంటి వాటిని చేయలేదు వాటిని నన్నయ ప్రయోగించి

ఉండడం వేరే విషయం నన్నయ్యే చింతామణి కర్త అనడం నిశ్చితం కాకపోగా విపరీతంగాకూడ నన్నయేతరుడే కర్త అని నిశ్చయం జరిగే అవకాశం ఉండవచ్చు కాబట్టి భారత ప్రయోగాలతో తమ వాదాన్ని సమన్వయించబూనడం ఇక్కడ అనవసరం అక్రమంగూడ

నన్ను లో ఉత్వం విభక్తిస్థం కాదంటూ మమ్ము లో ఉత్వం విభక్తిస్థం అనడం వక్రవాదన దానికి వారిచ్చిన సమర్థనం ఎమాత్రం అంగీకార్యం కాదు సంస్కృత ప్రత్యయాల్ని తెలుగు ప్రకృతులపై నిలిచినవాటిని నపదాన్యవ్యయ – ఇత్యాది సూత్రంతో లోపంచేయాలనడం – వక్రతమవాదం ఆదే నిజమైతే చింతామణిలోని విభక్తి ప్రత్యయాలకు లోపంచెప్పే సోర్లుగిత (అజంత 36) వంటి సూత్రాలు దండుగ ఆ సూత్రం (నపదాన్యవ్యయ–ఇత్యాది) సంస్కృతంలోని అవ్యయాలు తెలుగులో ప్రయోగార్హాలుకావని చెప్పడానికి ఉద్దిష్టమైంది తెలుగు ప్రకృతులమీద చేర్చిన సంస్కృత విభక్తి ప్రత్యయాల లోపానికి కాదు సూత్రకర్తకులేని విచిత్రార్థాలు అన్వయాలు శాస్త్రిగారు కల్పించినంత అధికంగా పూర్వులుగాని ఆధునికులుగాని ఎవరూ ఎక్కడా కల్పించి యెరుగరు

'నిత్యమనుత్తమ పురుష క్రియాస్వితం

ఈసూత్రవ్యాఖ్యానంలో అప్పకవి–

పుడమి సూత్రోక్త ముత్తమ పురుష మనుచు
దత్పురుష మెల్లఁ గొనరాదు తద్బహూక్తి
మున్ను తిఙ్మధ్యములతోడ నెన్ను కతన
నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు (అప్ప-6 62)

అని ఉత్తమ పురుష బహువచన రూపాలకి నిత్యసంధిని చెప్పాడు ప్రయోగ బాహుళ్యాన్ని బట్టి అతని మాట సమంజసమే అయినా అనవసరంగా అతనిపై కోపగించారు శాస్త్రిగారు

ఇక్కడ ప్రధానాంశం ఉత్తమ పురుష ఏకవచన రూపం–భూతకాలంలో ఎది? అనేది

శాస్త్రిగారు కొలిచితినిన్ వంటి రూపాలు చింతామణి సాధిస్తున్నదంటారు

ఉత్వయుతౌ వనకారౌ స్యాతాం మధ్యోత్త మైకవచనానాం క్రియా—25

భూతాదుతాం పరేషామిత్ క్రియా—35

పై రెండు సూత్రాలతో ని ప్రత్యయం ఎద్దిసుంది ఇంతవరకు శాస్త్రగారికి పూర్వ వ్యాఖ్యాతలకు భేదంలేదు దీనిపైన మళ్లీ అన్యే ద్రుతప్రకృతయ యేస్యుర్ హ్యాను జీవితద్రుతా నిత్యం అనే సూత్రంతో నకార మొకటి వస్తేగాని దానికి ద్రుతప్రకృతికత్వం ఎద్దించదని కాబట్టి కొలిచితినిన్ అనేవి పరిపూర్ణ రూపమని శాస్త్రిగారి వాదం

అయితే అలాంటి రూపాలు ఆంధ్రవాఙ్మయ సర్వస్వంలో ఎక్కడా సముచ్చ యార్థ రహితంగా ప్రయుక్తాలుగా కనుపించవు నన్నయ భారతంలో కూడ ఆది పర్వం చతుర్థాశ్వాసం 08వ పద్యంలో ఒక్కచోట తప్ప ఇతరత్ర ఎక్కడా అటు వంటి ప్రయోగం కనపడదు ఆ ఒక్క ప్రయోగంలో ఆ ద్రుతం ఛందస్సౌకర్యం కోసమో సముచ్చయార్థంకోసమో ప్రయుక్తమైనదంటే కలిగే విప్రతిపత్తి లేదు అయినా ఏకమాత్ర ప్రయోగాన్ని పురస్కరించుకొని మిగిలిన వాఙ్మయసర్వస్వంలోని ప్రయోగాల్ని తిరస్కరించలేం కదా

కొలిచితబ్బిజన్ వంటి రూపాలు సంధి జరిగినవిగా కొలిచితినబ్బిజన్ వంటి రూపాలు సంధి జరుగనివిగా వ్యాఖ్యాతలందరూ ఉదాహరించారు శాస్త్రిగారేమో ఆ వ్యాఖ్యాతల సంధ్యభావ రూపాలే సంధిగత రూపాలని కొలిచితిని నబ్బిజన్ వంటి రూపాలు సంధ్యభావ రూపాలుగా ఉండాలని వాదించారు వారిచ్చిన రూపాలు సంధ్య భావానికి అని వారుదాహరించిన కొలిచితిని నబ్బిజన్ వంటివి ప్రయోగాల్లో ఎక్కడా కనుపించవు కాబట్టి ప్రయోగ విదూరమైన వారి వాదం తిరస్కార్యమే

కొలిచితబ్బిజన్ వంటి రూపాలు ఉత్తమ పురుష-ఏకవచనంలో నన్నయ రచనలో కనుపించడం లేదుగాబట్టి చింతామణి నన్నయ కృతమని రుజువు కావడం

---

చింతా న క్షా 2

లేదా? అంటారు। ఆయన అటువంటి రూపాలు నన్నయలోలేవు కాబట్టి చింతామణి నన్నయ కృతం కాదని కూడా అనవచ్చు అది బలహీనమైన వాదం

కొలిచితినిన్ వంటి రూపాల్ని సామాన్య రూపాలుగా స్వీకరిస్తే వాటినుండి కొలిచితి వంటి రూపాల్ని సాధించడం క్లిష్టమైన ప్రక్రియాగౌరవంతో కూడిన పని సిద్ధరూపాన్నుండి రూపాంతరాన్ని సిద్ధింపచేసికోవడం కోసం మళ్లీ మూడు సూత్రాల్ని ఉపయోగించుకోవాలి– శాస్త్రిగారి నిర్దేశం ప్రకారం కాబట్టి దాన్నితిరస్కరించడమే శ్రేయస్కరం

3వ విషయంలో ముందు ప్రతిపాదించినదాన్నే తిరిగి ప్రతిపాదిస్తున్నారు దీని ఖండనం 48వ విషయ శోధనంలో జరిగే ఉంది ఇక్కడ వారు చూపిన నూతన యుక్తులు లేవు

వాద మధ్యమునం బ్రథమ పురుషేకార సంధ్యభావమును జూపినంగాని యాంధ్ర కవుల చరిత్రకారులు కృతార్థులు కానోపరు -అని ఈ సందర్భంలోనే అన్నారు పాదమధ్యంలో సంధ్యభావాన్ని చూపవలసిన అవసరం చింతామణిని బట్టి కలగడమే లేదు చింతామణి పాదాంతంలో సంధిని అంగీకరిస్తేగదా పాద మధ్యంలో చూపవలసిన అవసరం ఏర్పడేది కాబట్టి శాస్త్రిగారే చింతామణిలో పాదాంతంలో సంధ్యభావాన్ని చెప్పే సూత్రాన్ని చూపాలి

గుప్తార్థప్రకాశికాకారులు (బాలవ్యాకరణ వ్యాఖ్యాత) ఈ సూత్రానికర్థం వివరిస్తూ సూత్రకర్త ఉద్దేశాన్నే వికృతివివేకకర్త కారికా రూపంలో ఒనగినారని వ్రాశారని వారిమీద కోపగించారు శాస్త్రిగారు² సూత్రకర్త చెప్పివ దాన్ని వికృతి వివేకకర్త చెప్పడని ఆ విషయమైనా తెలిసికోకపోవడం ఎంతయుశోచనీయ మని కూడ అన్నారు

శాస్త్రిగారు చేసిన విచిత్రవాదాల్లో ఒకటి–చింతామణి చెప్పిన మాట వికృతి వివేకం చెప్పదని కాని చింతామణికి పునరుక్తులు వికృతి వివేకంలో బోలెడు కనిపిస్తున్నాయి ఉదా –

---

చిం విష శో ౦౭

2 పైది ౦౬

అపి సంయుక్త సమాప్తౌ భూయోంతే యః ప్రదృశ్యతే నామ్నాం
(అజంత—77)

దాని వ్యాఖ్యలోనే "సమాప్తవర్ణకా కేచిత్ దేశ్యే పునరపి స్మృతాః - కారిక

పై రెండింటికి అర్థంలోగాని సందర్భంలోగాని భేదంలేదు కాగా సూత్రానికి కారిక పునరుక్తి

యశ్రీతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణత పరం ప్రాణం
(సంజ్ఞా—2 )

దాని వ్యాఖ్యలోనే ప్రాణాత్ ప్రాణో లఘుస్స్యాత్ —కారిక సూత్రానికి కారికకూ అర్థ సందర్భాలు సమానమే కాబట్టి ఈ విషయంలో శాస్త్రిగారి వాదం నిరాధారమని గుప్తార్థ ప్రకాశికాకారుని తప్పుపట్టడం అక్రమని తెలుస్తుంది

## నస్యాత్తద్ధర్మేత ఇతి సూత్రార్థ విమర్శనము

ఇక్కడ శాస్త్రిగారు చేయుదము + ఇప్పుడు ఇత్యాది స్థలాల్లో ఉకారం ధాతునిష్ఠం గాదు గాబట్టి ప్రత్యయస్థం గాబట్టి అక్కడి సంధి నిర్బాధమని వ్రాశారు[2]

చింతామణి క్రియాధాతుః[3] అని నిర్వచించింది అయినపుడు క్రియాపదానికి ధాతువుకి భేదం పాటించడం చింతామణి మార్గానికి వ్యతిరేకం అలాగే సూత్రం లోని తద్ధర్మపదం ధాతుమాత్ర వాచి అనడానికి ఆధారంలేదు పైగా తద్ధర్మత్వం కేవల ధాతు మాత్రానికి కాదు దానిపై చేరే ప్రత్యయాల్ని బట్టి అక్రియ తద్ధర్మార్థక మవుతుంది అయినపుడు ఈసూత్రానికి అవ్యాప్తి దోషం ఎలా వారించగలం?[4]

ఈ సందర్భంలో అప్పకవి ధాతుజ విశేషణములు తిఙ్మద్ధ్యేత్యాది సూత్రము చొప్పున ద్రుతప్రకృతికములే అని చెప్పేది చింతామణి ఆశయమే సరిగ గ్రహింప

---

ఇచ్చవిభక్త్యన్తిమస్య జేరలిచ సంధి 87 88 వీటికిపునరుక్తులుగా అలా గమనిస్తే దంద్వందోష్వ తకేదిత్ జసిచేతయో తథా తోడవిభక్తౌచ సమాసే కవిసమ్మతేః

2 చిం విష శ్లో 86

3 సంజ్ఞా - 26 కారిక

4 చూ అవ్యాప్తి దోషము అనే ప్రకరణం

లేదని తోచుచున్నది అని శాస్త్రిగారు వ్రాశారు ఒక్క అప్పకవికే కాదు ఆ విషయం పెక్కుమంది వ్యాఖ్యాతలకి వ్యాకర్తలకీ కూడ తెలియదు అసలు చింతామణి కర్తకి కూడ ఆ అభిప్రాయ మున్నదనడానికి ఆటంకింగా అప్పకవీయ చింతామణిలో—

ధాతు పద సంభవానాం విశేషణానా ముత్తథా నుమచి (అప్ప చిం సంధి) అనే సూత్రం కనిపిస్తున్నది ధాతుజ విశేషణాల ఉత్తుకి అచ్చు పరమైతే నుమాగమం వస్తుందని సూత్రార్థం వచ్చు + ఇతడు=వచ్చునితడు అనేది ఉదాహరణ

శాస్త్రిగారి వాదం ప్రకారం కళలు చింతామణి పేర్కొన్నవాటిని మినహాయించి మిగిలిన అన్నింటిని ద్రుతప్రకృతికాలని సిద్ధాంతంచేస్తే వ్యాకరణరంగంలో కల్లోలాలు కలుగుతాయి తిజ్మధ్య శేష షష్ఠీ-ఇత్యాది సూత్రంలో ధాతుజవిశేషణాల సంగతి లేదు కాబట్టి అవి ద్రుత ప్రకృతికాలయితే చేయుచున్న చేయఁగల చేసిన చేయని—ఇవన్ని కూడ ధాతుజ విశేషణాలే కాబట్టి వీటిని ద్రుతాంతాలని అనగలమా

కాగా శాస్త్రిగారిపైవాదం కూడా పరాస్తమే

మరొక సందర్భంలో బాలవ్యాకర్తపైకూడ డు ప్రత్యయాంతాలు ఆనంతర్యార్థకా లవుతాయని సూత్రించాడు కాబట్టి వాటి విషయంలో బాలవ్యాకర్త భ్రాంతి పడ్డాడు—అని ఒక ఆరోపణం చేశారు తరువాత డున్ ప్రత్యయాంత శబ్దాల్ని భావార్థకాలే అని వాదించారు కాని అది లక్ష్య లక్షణ విరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబని చిన్నయసూరి మాటలలో మనం గ్రహించాలి సూరి ఒసగిన లక్షణ లక్ష్యాలు

ఆనంతర్యార్థంబున డు వర్ణకంబు ద్రుతాంతంబగు (బాలవ్యా క్రియా - 2)

ఉదా జాబిలి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లె

ఆనంతర్యార్థంలో డున్ ప్రత్యయాంత శబ్దానికి నన్నయ ప్రయోగాలు

---

బాల వ్యా ఆచ్ఛిక - 21వ సూత్ర వృత్తి

1 ఆదిత్యుం డ స్తగిరి శిఖరగతుండగుడు (ఆది–3– )

2 అచ్యుతుండు పూజితుఁడగుడుం దేజమున (సభా–28)

3 అది స్పష్టంబగుడు నందఱు నాశ్చర్యంబందిరంత (అరణ్య–2– 50)

4 తద్దర్శన గోచర యగుడు నపుడు (అరణ్య–3–88)

ఇలాంటి ప్రయోగాలు కొల్లలుగా భారతంలో కనిపిస్తుండగా వాటికి ఆనంత ర్యార్థం తప్ప అర్థాంతరం పొసగదని ఆ సందర్భాల్లో స్పష్టంగా బోధపడుతుండగా తమ పండితత్వ ప్రకటనకా అన్నట్లు అసందర్భంగా బాలవ్యాకర్తను తప్పు పట్టడం శాస్త్రిగారు చేయదగిన పని కాదు

ప్రస్తుత సందర్భంలో కూడ బాలవ్యాకర్త తద్ధర్మార్థక విశేషణోకారమునకు అచ్చు పరమగునపుడు నకారము వచ్చునని సూత్రించడం అంతగా విరుద్ధం కాదన్నారు అంతగా కాదు అసలు విరుద్ధమే కాదు ఎంతో అవసరమైన సూత్ర రచన అది ఇక దాన్ని చూచి నస్యాత్ తద్ధర్మోక్త అనే సూత్రానికి బాలవ్యాకరణ సూత్రార్థం కొందరు చేసికొంటున్నారని విచారించడం సరియైనదే

## అధర్వణునికి గూడ ప్రమాదం?

ఈ సందర్భంలోనే ఇంతవరకు తప్పుపట్టబడక శాస్త్రిగారిచే వదలబడ్డాడను కున్న అధర్వణునికి (కనీసం శాస్త్రిగారి ఊహలోనైనా అతడు వికృతి వివేకానికకర్త) కూడ ఒక ప్రమాదం అంటగట్టబడింది వచ్చున్ + ఉపాయము వంటి స్థలంలో వచ్చున్ శబ్దము తద్ధర్మవిశేషణం కాబట్టి వికృతివివేక కారిక[1] ఇక్కడ అన్వయించక సంధి కావలసివస్తుంది - అని శాస్త్రిగారి శంక దాన్ని వారించకుండా తద్ధర్మశబ్ది నిర్వచనం చేశాడని అధర్వణునిపై ఆరోపణ నిజమే కాబట్టే అప్పకవీయ చింతా మణిలోని సూత్రం (ధాతుపద సంభవానాం విశేషణానా ముత స్థా నుమచి) చింతా మణిలో సహజమైనదని కాగా ఉండవలసినదని అంగీకరించవచ్చు అపుడు వికృతి వివేక కారికలో ఆరోపితమైన ప్రమాదం తప్పుతుంది కూడ

---

1 ప్రథమశ్చోత్తమశ్చైవ–ఇత్యాది

08వవిషయంలో రక్షించెదున్ వంటివి శబ్దర్మార్థకాలే అయినా చింతామణి అటువంటి వాటిని చెప్పలేదు గాబట్టి చింతామణి సూత్రం అలాంటి స్థలాల్లో సంధి విషేధానికి తాము చెప్పిన వ్యాఖ్యానం ప్రకారం ఉపకరించకపోయినా ప్రమాదం లేదన్నారు

ఈ వాదమంతా వ్యాకరణ శాస్త్రమర్యాదల్ని భగ్నంచేసి శాస్త్రిగారి చిత్తమే శాస్త్రంగా అంగీకరించమన్నట్లున్నది గాబట్టి తిరస్కార యోగ్యమే

పునరాగమ క్రియాణాం పర్యాప్తో మన్మతేతు సంకేత ఇతి సూత్రార్థ విమర్శన సందర్భంలో శాస్త్రిగారు చింతామణి రచనా-ఉద్దేశాన్ని ఇలా వివరించారు

క్వాచిత్క రూపములకెల్ల సూత్ర విధానము చేయుట దిక్ప్రదర్శన మాత్రో పదిష్ట చింతామణి రచనోద్దేశము కాకుండుటచేతను ప్రయోగారూఢములైన యట్టి క్వాచిత్క రూపములను నీ సూత్రముచే సంగ్రహించుకొనవలెనని నన్నయ భట్టార కుఁడు తలంచి యుండెనని గ్రహింపవలసి యున్నది

ఇతరులు సహేతుకంగానైనా కాదన్నకొద్దీ శాస్త్రిగారికి చింతామణి నన్నయ కృతమనే నిశ్చయం అకారణంగా గట్టిపడిపోతుంది అందుకనే వారు మాటి మాటికి నన్నయ భట్టారకుఁడు తలఁచలేదు 1 నన్నయభట్టు వికల్పించెనని వాదింతురా యేమి 2 ఇట్లే నన్నయభట్టు మరొకచోట సైతము సంధ్యభావమును బ్రయోగించి యున్నాఁడు 3 కాగా నన్నయభట్టు ప్రయోగములలో సంధి వైకల్పికమని నన్న యాభిప్రాయ మగుటచేతను ...అని యిట్లు ఒక్క పేరాలో 2 పంక్తుల వ్రాతలో నాల్గయిదుసార్లు నన్నయ భట్ట శబ్దాన్ని జపిస్తారు

---

చిం విష శో 4 వ విషయం

2 పైది పైది

3 పైది పైది

4 పైది పైది

5 పైది పైది

పై వాదం అహోబిలపతి అవధరింపుము అనే పదానికి అవధారు అనే రూపాంతర్గాన్ని ఘటింపుచున్నాడు వంటి రూపాల్లో ఉన్నానుబంధ దీర్ఘాల్ని పై సూత్రంతో సాధిస్తుంటే చూచి అవి సరిగావనడానికి చేసింది

ఈ సూత్రం బాలసరస్వతి అహోబిలపతి చేసిన వ్యాఖ్యల్ని యథాస్థితంగా అంగీకరించక ఏవ్యాఖ్యానమైనా చేయడానికి అనువుగా ఉన్నదని కాకోలు శాస్త్రిగారు దీనికి కొత్త వ్యాఖ్యచేశారు దాని సారమిది –

నన్నయ తన భారతంలో ప్రయోగించి కూడ ఇక్కడ లక్షణబద్ధం చేయకుండా వదలిన రూపాల్ని ఈ సూత్రంతో సాధించాలి ఉదా – తేజరిల్లమి 2 భేదింపక 3 విచారింపకు 4 విచారింతము 5 ఉధ్వనిల్లుడును 6 పరిభ్రమించెద శాస్త్రిగారి ఈ అభిప్రాయం సూత్రకర్తకు ఉన్నదా? అనే అంశం పరిశీలించాలి ఈ రూపాలే తమ పరిశోధనంలో ప్రథమ భాగంలో ఇస్తూ వీటిని చింతామణి సాధించలేదు గాబట్టి చింతామణి నన్నయ కృతమని విచిత్రంగా వాదించారు ఇక్కడేమో చింతామణితో ఆ రూపాలే సాధించుకోవచ్చు అని అనుజ్ఞ ఇస్తున్నారు

చింతామణిలో క్రియాపరిచ్ఛేదంలో పునరాగమః క్రియాణాం -ఇత్యాది సూత్ర రచన వరకు జరిగిన ప్రక్రియలో చాల కొరత లున్నాయి ఉదా –

వర్తమానకాలికరూపాల్లో రక్షించుచున్నాడు వంటివాటిల్లో దీర్ఘత్వ విధానం లేకపోవడం

భవిష్యత్కాలిక క్రియారూపాల్లో రక్షింపఁగలఁడు వంటి వాటిలో నుమాగమానికి సూత్రం లేకపోవడం

3 కర్మానుబంధ రూపాలలోగూడ పై రూపాలలో వలెనే నుమాగమ విధానం లేకపోవడం

పై కొరతల పూరణ కోసం ఈ సూత్రం ఉద్దిష్టమైనదని పూర్వవ్యాఖ్యాతలు వ్రాస్తే దానిలో తప్పులేదు ఇక శాస్త్రిగారు చూపించిన తేజరిల్లమి మొదలగు

ప్రాచీనుల నవీనుల దృష్టిలో చింతామణి

రూపాల్ని లక్షణబద్ధం చేయాలని సూత్రకర్త భావించి ఉంటే సూత్ర నిర్మాణమే చేసి ఉండేవాడు - వాటికోనం అయినపుడు ఏ వ్యాఖ్యాతకూ తోచని ఎవరి ఊహకైనా రాని ఈ మార్గంలో ఆ రూపాల నిష్పత్తిని సూత్రకర్త ఉద్దేశించని విధంగా చేయాలని శాస్త్రిగారు వాదించడం సక్రమంగా లేదు

అసలు ఈ విచిత్రవాదం శాస్త్రిగా రెందుకు లేవనెత్తారంటే నన్నయ భారత ప్రయోగాలతో చింతామణి విరోధిస్తున్న పెక్కు సందర్భాలు పూర్వ విమర్శకులు చూ౦ ఇది నన్నయ కృతం కాదన్నట్లు నన్నయ ప్రయోగాలు పెక్కింటికి చింతామణిలో లక్షణం లేదని చూ౦ ఎవరైనా భావివిమర్శకులు చింతామణిని నన్నయ రచించలేదు-అని అంటారేమో అనే శంకతో

ఈ వాదం చివర నన్నయ భట్ట భారత భాగమున రక్షించెడు రక్షించెది రక్షించెడున్ రక్షించుతన్ అను జాతిగల తత్సమ రూపము లగపడలేదు కావున నట్టివానినిఁ జింతామణి చొప్పున సాధించు కొనవలసిన యావశ్యకత లేదు అని వ్రాశారు

ఈ వాదం ఈ ప్రకరణంలోనే ప్రథమ భాగంచివర ఖండితమై ఉంది భారత ప్రయోగాలు చింతామణితో సహజంగా సంవదించాలిగాని ఇలా బలవంతంగా భారతంలో లేని ప్రయోగాలు చింతామణి సాధించరాదని వాదించడం అక్రమం

తద్ధర్మ వర్తమానాతీతాగామ్యర్థకా క్రియా జ్ఞేయా
తత్ర ద్వితీయ తుర్యౌ యౌ తౌ సస్వానుబంధకావేవ
వసతి రనుబంధకస్స్యా ద్యత్ర లదర్థో వివక్షితస్తత్ర
అస్తి రనుబంధకస్స్యాద్యత్ర ల్భడర్థో వివక్షితో ధాతోః

ఈసూత్రార్థ విమర్శనంలో గూడ శాస్త్రిగారికి విచిత్రంగా వాదించకతప్పలేదు తప్పదు మరి వారు సిద్ధాంతీకరించ దలచుకొన్న విషయం అలాంటిది వారి వాద సారమిది -

వర్తమాన ఆగామ్యర్థకక్రియల్లో వసతి అస్తి అనుబంధాలౌతాయి కాని అవి ఉండు కలుగు అనేవికాని ఉన్న కల అనేవికావు కారణం ఉన్న పదాన్ని చింతామణి నిర్మించ జాలదు

అసలు వర్తమాన భావ్యర్థాలలోని క్రియల్ని చింతామణి సాధించలేదను కుంటే తప్పులేదు అంతగా సాధించాలనుకుంటే రక్షింపఁగలవాఁడు వంటివి క్రియా జన్య విశేషణాలు సాధించుకొనవచ్చు ఎందుకంటె నన్నయ రచనలో ఉన్నాఁడు ఉన్నావు ఉన్నాను- వంటి ప్రయోగాలు మచ్చుకైనా లేవు

పై వాదంలో ప్రతిమాట విచారాసహమే అసలు చింతామణి వర్తమాన భావ్యర్థిక క్రియల్ని సాధించదమే లేదనవలసిన అగత్యం పట్టినదంటే వారి వాద దౌర్బల్య మెలాంటిదో తెలుస్తుంది స్పష్టంగా చింతామణి

వ్యతిరేకార్థే ల్పటి లటి డుజ్ స్యాత్ (క్రియా— 8)

స్త్వర్థే పునర్దుదీ భవత (క్రియా— 9)

అనే సూత్రాల్లో వర్తమాన భావ్యర్థక క్రియల ప్రకియను చేసి చూపెడుతుంటే అంత మాత్రమున నట్టి దేశ్యక్రియలను జింతామణి సాధించుచున్నదను కొనవలసిన యావ శ్యకత లేదు [ శివవిషయం] అనివ్రాయడమేమిటి? తరువాత అంతగా సాధింపఁ దలఁచినపుడు అవి ప్రారంభించి తమ అనుమతిని ప్రసాదించడమేమిటి?

వారు చెప్పిన ఉండు కలుగు అనుబంధాలతో సిద్ధించే రూపాలు ఎలా ఉంటాయో చూద్దాం

రక్షించు ధాతువు చు ఆగమం ఉండు అనుబంధం డు ప్రత్యయం= రక్షించుచుండుడు- ఇది వర్తమానార్థక రూపం ప్రథమపురుష-ఏకవచనం

రక్షించు ధాతువు కలుగు అనుబంధం అత్వపత్వా దేశాఖ=రక్షిం పగలుగుడు - ఇది భవిష్యదర్థక రూపం ప్రథమ-ఏకవచనం

ఇటువంటి అనన్విత రూపాల్ని శాస్త్రిగారి వాదం ప్రకారం చేసికొనవలసిన అవసరం చింతామణి విద్యార్థులకు లేదు ఇక వారి సందేహాలు ప్రశ్నలు ఈ సందర్భంలో వేసినవి కారణంగానే చింతామణి నన్నయకృతం కాదని పూర్వ ఆధునిక విమర్శకలోకం వాదిస్తున్నది మరి ఆప్రశ్నలూ సందేహాలూ వితండవాదం చెయ్యక సరిగా తీరడం లేదని ఈ సందర్భంలోనైనా శాస్త్రిగారి అంతరాత్మకు

తోచి ఉండాలి కాని ఇంతదూరం వచ్చిన తరువాత వెనుదిరిగే స్వభావం కాదు వారిది కాబట్టి క్రియా రూపాలకి బదులు క్రియాజన్య విశేషణాలను సిద్ధింపజేసి సరిపెట్టు కొమ్మంటున్నారు

పై పరిశీలనం వలన శాస్త్రిగారి వాదం ఒకతీరు తెన్నును బట్టి నడవడం లేదనీ ఏదో ఒక విధంగా చింతామణి కర్తృత్వాన్ని నన్నయకు అంటగట్టటమే దాని ఏకైక నిర్ణయమని తేలిపోతుంది కాబట్టి ఒక నిర్ణయం పరిశోధనకు పూర్వమే గట్టిగా ఏర్పరచికొని దాన్ని ప్రతిపాదించి సిద్ధాంతం చేయడానికై చేసిన గ్రంథం గాబట్టి దీనిలో అన్ని సందర్భాల్లోనూ అశాస్త్రీయమైన పద్ధతిలోనే ఆభాస నిర్ణయాలు జరిగాయి

## పదాది యకార వకారాలు

### సర్వత్రాజ్యాత్ కార్యం జ్ఞేయం యస్యేతి సూత్రార్థ విమర్శనము

ఇక్కడ బాలసరస్వతి మాటను ఓయి యెత్వమురాఁ జెప్పనేల? అజ్యాత్కార్యము వచ్చుననినేల? ఆదియందు యకారము లేదు అచ్చే అంటే చాలదా? చాలదు ప్రయోజ నాంతరము లేకున్నను ఉచ్చారణ విరోధ మగుచున్నది కనుక యెకార మెకారము గానేరదు అని ఎత్తి వ్రాసి చింతామణి వంటి ప్రౌఢగ్రంథమును రచించిన యాతఁడు పదాది యకారాంగీ కారమునఁ బ్రకియా గౌరవమున్నదని తెలిసికోలేనంతటి అప్రౌఢుఁడనుట పరమ సాహసము కాదా అని అన్నారు తరువాత వారు చేసిన వాద సారమిది —

చింతామణి కర్త తన కాలానికి వాడుకలో ఉన్న పదాది యకారాన్ని ఆచ్ఛిక భాషకు లోక వ్యవహారమే మూలమనే నిశ్చయంతో ఉన్నవాడుగాబట్టి అంగీకరించి చెప్పాడు

2 పదాది వకారం లోక వ్యవహారంలో ఉన్నా అది భ్రష్టోచ్చారణ సిద్ధంగాబట్టి తిరస్కరించాడు

---

బాలవ లిఖిత మాతృక సంధి 2 వ కాగితం లోనిదిగా శాస్త్రిగారు వ్రాశారు

3 పదాదిలో ఈ వర్ణా లుంటాయి ఇవి ఉండివు ఽని చెప్పడం ఉద్దేశం కాదు యకారంమీద అ ఎ లు విపర్యయంగా ఉచ్చరించబడుతుంటే దాని నివారణకే అద్యః క్రియా స్వీశ్యాది సూత్ర రచన

పైమూడు విషయాల్లో మొదటిదీ మూడవదీ యథార్థ విషయాలే దానిలో వివాదంలేదు ఉన్న వివాదమంతా అవి ఏకాలంలో ఏర్పడినాయి: (పదాదిలో యకారోచ్చారణం యకారంమీద అ ఎ లు వ్యత్యస్తం కావడం) అనే ప్రశ్నకు చెప్పే సమాధానాలలోనే ఈ విషయం చింతామణిలో లక్షితమైన భాష అనే ప్రకరణంలో విమృష్టమై ఉంది శాస్త్రిగారి పై రెండవ వాదానికి కూడ అక్కడే సమాధానం ఈయబడింది కాగా అనంతరాంశానికి వెళదాం

అప్పకవీయ సూత్రాలు –

వికృతిపదాదౌ పరిథమాంతస్థ తృతీయానునాసికౌ నస్తః
(అప్ప చిం–వర్ణ—9)

2 క్వచిదపి న స్త ఉదోతౌ దంతోష్ఠ భవస్య వికృతి శబ్దాదౌ
(అప్ప చిం–వర్ణ— 2)

పై రెండూ ప్రక్షిప్తాలని శాస్త్రిగారు నిర్ణయించబోయారు ఈ రెండు సూత్రాలే గాక బాలసరస్వతీయంతో భేదించే అప్పకవీయ సూత్రాలు ఇంకా కొన్ని ఉన్నాయి: వీటిలో మొదటి సూత్రం ప్రస్తుతం విమర్శించబడుతున్న జంట సూత్రాలకు2 బొత్తిగా పొసగనిది అది యకారణకారాలు తెలుగుపదాల మొదట నిలవవని చెబుతున్నది జంట సూత్రాలు యకారాన్ని పదాదిలోచెప్పి సంధిజరిగే సమయంలో హలంశం నష్టమౌతుందని చెబుతున్నాయి కాబట్టి ఆ జంట సూత్రాలూ ఈసూత్రం ఏక కర్తృకాలవడం పొసగని విషయమే

తెలుగువారి ఉచ్చారణను (గ్రాంథికంగా) సరిజేయడానికి ఇలాంటి సూత్రాలు పుట్టినపుడు పదాదిలో యకారం వు వోలు ఉండవనడం సరిపోతుందిగాని ణకారం

---

చూ చింతామణి పాఠభేదాలు అనే ప్రకరణం
2 అద్యః క్రియాసు–ఇత్యాది వర్ణ త్రాస్యత్ ఇత్యాది–రెండు సూత్రాలు

విషయం చెప్పపనిలేదు పదాది యకార ఙకారాల్ని నిషేధించే పై సూత్రం చింతామణిలో ప్రక్షిప్తమని పైన ఉదాహరించిన జంట సూత్రాల బలంతో నిర్ధారణ చేయవచ్చు

ఇక వు వోలను నిషేధించే సూత్రాన్ని చింతామణి నిర్మించలేదు–అనడానికి ఎంత వీలున్నదో నిర్మించింది అనడానికి గూడ అంతే వీలున్నది పైగా ఉచ్చారణ భ్రంశాల్ని సరిదిద్దే ఉద్దేశంతో నిర్మించిన సూత్రం ఒకటి చింతామణిలో ఉన్నదని (అద్య క్రియాసు ఇత్యాది) శాస్త్రిగారే చెబుతున్నారు దాని సరసనే ఈ సూత్రం కూడ (వు వోలను నిషేధించే సూత్రం) ఉంటే తప్పేమీ లేదు దీని ఉనికితో విరోధించే సందర్భం చింతామణిలో ఏదీ లేదు

ఇక పదాదిలో యకారం ఉండడం వ్యవహారసిద్ధం కాబట్టి స్వీకార్యమే అంటూ వ్యవహారస్థమైన వు వో లు స్వీకార్యాలు కావు అవి భ్రష్టోచ్చారణలు కాబట్టి - అని శాస్త్రిగారు వాదించడం న్యాయ్యంగా కనబడడం లేదు ఉచ్చారణ భ్రంశాన్ని యథాస్థితంగా ఒప్పుకుంటే రెండుచోట్ల ఒప్పుకోవలసిందె ఒకచోట గుణమూ ఒకచోట దోషమూ ఎలా అవుతుంది భ్రష్టోచ్చారణం కాగా ఇక్కడ కూడా వారి వాదాన్ని అంగీకరించలేం

## ద్రుతమంటే ఏమిటి?

ద్రుతాఖ్యోన ఇత్యాది సూత్రార్థ విమర్శనము

ఈ సూత్రానికి నకారము ద్రుతమని అర్థం కాగా నకారంబసాధారణంబు ద్రుతంబు ప్రత్యయాగమావ్యయాత్మకంబై యుత్వ విశిష్టమైన నకారంబు ద్రుత సంజ్ఞకంబని యర్థము అని త్రిలింగ లక్షణ శేషకర్త ద్రుతలక్షణంలో అదనంగా

ఉత్వముండాలనడం 2 అది ప్రత్యయ–ఆగమ–అవ్యయాత్మకంగా ఉండాలనడం సరిగాదన్నారు కారణం కొన్నిచోట్ల శబ్దావయవ నకారం గూడ ద్రుతంగా స్వీకరించక తప్పడం లేదు–అని చెప్పి మును + చేయి=ముంజేయి కందోయి మొ ఉదాహరించారు

---

ప్రౌఢ వ్యా సంజ్ఞా 7

నకారమాత్రాన్నే ద్రుతంగా స్వీకరించాలంటే ప్రయోగాలతో విరోధం వస్తుంది గానీ నకారాన్ని ద్రుతంగా స్వీకరించడంలో ఏ విప్రతిపత్తి లేదు ఇక శబ్దావయవ నకారం ద్రుతం కావడమన్నది పరిమిత స్థలాల్లో జరిగేది మును కను -వంటి పదాల్లో శబ్దావయవంగానే ద్రుతమున్నదని ఒప్పుకోక తీరదు కాని ఈ కతిపయ స్థలాల కారణంగా మొత్తం ద్రుత నిర్వచనాన్ని అవ్యవస్థకు గురి చేయడం తగని పని కాబట్టి ద్రుత లక్షణం వారన్నట్లు ఆధునికులు చేసినది తిరస్కారయోగ్యంగా కనిపించడం లేదు

ఇక ఉకారసహితంకూడ ద్రుతమే అని అంగీకరించకపోతే వాఙ్మయారంభం నుండి ఎన్నో తగవులు ఏర్పడతాయి ఆదికవి నుండి ఆధునికులవరకు ఉత్వ సహిత నకారం ద్రుత మనిపించే ప్రయోగాలు చేశారు వారిలో మచ్చుకి నన్నయ్య ప్రయోగాలు గమనిద్దాం

అనియును రమ్యంబనియును బాంచాలవతి (ఆది-7 30)

2 అనియెను అనిన విని నగుచు వాఁడిట్లనియెను దక్షకుఁడనేన (ఆది-2- 90)

3 చెలుచును క్రోధము తపమును జెలుచును గ్రోధము (ఆది-2- 4)

4 గాడ్పును నభము ధాత్రియు గాడ్పును గాంచుచుండెడున్ (అరణ్య- -28)

5. చేయును ఎగ్గు సేయును గావున (అరణ్య- -3 )

పై స్థలాల్లో పరుషాలు సరళాలుగా మారిన ఉదాహరణలే ఒసగబడ్డాయి పరుష పరకత్వం లేనిచోట్ల ను అంతానగల పదాలు ఎన్నను పొందను-వంటి రూపంతో[1] ద్రుతస్వరూపంతో ఉత్వమున్నా పొసగుతుంది-అని నిర్ణయించడానికి వీలుగా ప్రయోగాలు కొల్లలుగా కనిపిస్తున్నాయి కాని శాస్త్రిగారి వాదం ప్రకారం అవన్నీ నకారమాత్రాలుగానే పదాలకు చేరపలసి ఉన్నది ఉదా - ఎన్నన్ పొందన్ అన్నట్లు

---

ఆది 9

చేయును అనే తద్ధర్మరూప చింతామణిప్రక్రియ శాస్త్రిగారిచే ఉపదిష్ట మార్గంలో జరిగితే చేయున్ 1 అని మాత్రం సిద్ధిస్తుంది అయినపుడు వాఙ్మయంలో ఒప్పెను ఉడుగుచు పడసెను —వంటి నన్నయ ప్రయోగాలు- ఇతరుల వేల సంఖ్యలోగల ప్రయోగాలు దుష్టాలైనా కావాలి లేక శాస్త్రిగారు వాదించి చూపినట్లు సముచ్చయార్థ ద్యోతనార్థం ఉత్వాన్ని చేర్చుకున్నవైనా కావాలి

ఇలా ఒక నిరాధారమైన వాదం బయల్వెడలించి మొత్తం వాఙ్మయ రంగాన్ని సంక్షోభానికి గురిచేయడం అసహ్యమైన అన్యాయం

చింతామణి అయినా నకారం ద్రుతమన్నదే కాని దానిపై చేరే అచ్చుల విషయం చెప్పలేదు ఇదంతములమీద నిగా (చేసితిని మె) ను వర్ణం మారడం ప్రయోగాల్లో కనుపిస్తుండడం వలన అజ్విసక్తిని మాని ఉండవచ్చు ఈ అభి ప్రాయాన్నే ప్రాచీన వైయాకరణులు కూడ కలిగి ఉన్నట్లు వారి వ్రాతలవల్ల తెలుస్తుంది

అహోబలపతి

అలుకిచ సంశ్లేషస్స్యాత్ (సంధి— 26)

అనేసూత్రానికి వ్యాఖ్య చేస్తూ లుగభావే నస్య పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ భవతి చకారేణ స్వరూపేణావస్థితి వర్ణాంతరత్వేన సందర్భవేళాయాం పృథక్ పరిగణనం తస్య ఫలం అతఏవ అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శాస్త్రముల యశేష సారము మదంబునఁ బొందను బుద్ధి బాహు విక్రమమున ఇత్యాది పద్యేష్వాచార్యేణ వర్ణాంతరత్వ ముపపాదితమ్ ఏతచ్చ సమాసే న సంభవత ప్రయోగాభావాత్ అన్నాడు

దీన్నిబట్టి ద్రుతస్వరూపం ఉత్వసహితంగా కూడ ఉంటుందని ప్రథమా చార్యుని మతంగా అహోబలపతి అభిప్రాయ పడినట్లు స్పష్టమైనదికదా అయితే

---

1. యు ధాతువు చేయ + తి ప్రథమైకవచన లోపస్తద్ధర్మా తీతయో క్రియాణాం పా 5 – క్రియా– 7

చేయున్ అన్యే ద్రుతప్రకృతయో యేను ర్త్యావ జీవిత ద్రుతాన్తం-సంజ్ఞా–39 ఆది 2– 59 2 0 ఆది —93 మొ॥

ఈ ఉత్వ సహితత్వం ద్రుతానికి సమాసాల్లో మాత్రం ఉండదని కూడ చెప్పి ద్రుత స్వరూప నిర్ణయం చేశాడు ఈ విషయమై అప్పకవి అభిప్రాయం కూడ శాస్త్రిగారి వాదానికి విరుద్ధమే

అప్పకవి

అలుకిచ సంశ్లేషస్స్యాత్ (అప్ప–5––40)

లలి సరళ స్థిరములం దాపలి నాంత పదంబులూఁది పలికెడుచో సం
ధులు గాంచును దత వర్గంబులు నాటివి చెంతఁదక్క బొల్లులయిహరీ

నలువఁగవిన వేల్పు స్గంధవాహాద తల్పు
న్నలకలి భయ హర్త జాంబవత్యాత్మ భర్త
న్నలినదళ సమాక్షు న్బాణ దైత్యేంద్ర శిక్షుం
దలఁతు ననఁగఁ జెందుం దన్నకారంబు లెందున్ (అప్ప 5– 45 47)

పై వ్రాతలో అప్పకవి పొల్లు నకారాలకు ఉదాహరణ లిచ్చాడు పొల్లు కాన పుడు ఉత్వ సహితంగానే ద్రుత ముంటుందని అతని అభిప్రాయం విడిగా ద్రుత స్వరూప చర్చ చేయకపోయినా బాలసరస్వతి కూడ ద్రుతం ఉత్వ సహితంగా ఉంటుందని చెప్పాడు

బాలసర్వతి

పై సూత్ర వ్యాఖ్యానంలో ఆ నకారము బింద్వాది రూపము గాకిపోయినను స్వభావమున నున్నను గానీ ద్రుత ప్రకృతిమీదనుగూడ ఆ పరుషములు సరళములే యైయుండును అని వ్రాసి అంబను గొలిచెద శుభమును బడసెద అని ఉదాహరించాడు

కాగా లక్ష్య లక్షణ విరుద్ధంగా ఒక వాదాన్ని నూతనంగా ప్రవేశపెట్టి దాని కోసం పూర్వ ప్రయోగాలకి పొసగని నవీనార్థాల్ని కల్పించడం నిరర్థక ప్రయాస తప్ప వేరుకాదు

ఈ వాదానికి తోడుగానే మస్తాక వాదాన్ని సంశ్లేష స్వరూపాన్ని గూర్చి లేవనెత్తి ఒక విలక్షణ నిర్వచనాన్ని దాని కొసగినారు - ద్రుతము పూర్వస్వరమున కంగమగుట సంశ్లేషముగా నన్నయభట్టు వ్యవహరించుచుండును అని

సంశ్లేషమంటే ద్రుతం(నకారం) పూర్వస్వరాన్ని అంటి ఉండడమంటారుగదా మరి స్వత్వమేర్పడినపుడు ద్రుతం దేన్ని అంటి ఉంటుంది? ఉదా – చేతన్ ఇది వారి మతంలో స్వత్వ రూపమా? సంశ్లేష రూపమా? ద్రుతానికి స్వతః స్వతంత్రమైన ఉనికి లేదు అది సహజంగా పూర స్వరాన్ని అంటి జీవిస్తుంది అయినపుడు ఆ రూపాన్నే సంశ్లేష మనడమేమిటి అలా అసంగతంగా అనడానికి ప్రాతిశాఖ్యల్ని ఉదాహరించడమెందుకు ?

స్వత్వమే సంశ్లేష మయినపుడు ప్రత్యేకంగా సంశ్లేష విధానం చింతామణి ఎందుకు చేసినట్లు ? ఇటువంటి ప్రశ్నలకు సూటిగా సమాధానం చెప్పజాలక నాదము శ్వాసమగుట అని ఏదో వ్రాసికొని పోవడం విచిత్ర మనస్తత్వమే

స్వత్వమంటే ఏమిటో తాము స్వయంగా వ్రాయక అథర్వణాచార్యుల మత మంటూ ద్రుతము పూర్వాచ్చునత్తి యుండెడి స్థితి పై రీతిని సంశ్లేష మనిపించు కొన్నపుడింక రెండవదగు పర హల్లుతో సంయోగించి పరస్వరాంగ మగుచునుండెడి స్థితియే గదా పై యథర్వణ కారికలోని స్వతా అనుదానిచే గ్రహింపవలసి యుండును అని వ్రాశారు

ఇక్కడ విషయం వ్యత్యస్తం చేయబడింది ద్రుతం పూర్వాచ్చును అంటి ఉంటే సంశ్లేషమని పరాచ్చును అంటి ఉంటే స్వత్వమని ఇదంతా తప్పిబ్బు వ్యవహారం ఇంతకీ వారి వాదంలో స్వత్వానికి సంశ్లేషకి భేదం లేనట్లే గదా అయి నపుడు అథర్వణుడే చెప్పాడని అహోబలపతి ఉదాహరించిన పద్యావసానేసర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతాం కారిక కర్థమేమిటి? ఇంతగా విరోధించే విధంగా సంశ్లేష స్వరూపాన్ని కొత్తగా నిర్వచించి శాస్త్రిగారు సాధించినదేమిటి? చదువరుల తలనొప్పి వినా

ఈ పై విరోధాల్ని పరిహరించడానికి ఆయన చేసిన దుర్బల వాదాన్ని పరీక్షించి చూస్తే సంశ్లేష స్వరూపం పూర్వ వైయాకరణులు చెప్పినట్లు ద్రుతం పర

సంధి 21 సూ

హల్లుతో గూడికొనడమే అని సూక్ష్మంగా గ్రహించవచ్చు కాబట్టే ఈ వ్యాకరణాల్లో విశేష శ్రమచేసిన బాలవ్యాకరణ సంశ్లేషం అనగా ద్రుతంబు మీది హల్లుతో గూడికొనుట 1 అని నిర్వచించాడు

నన్నయ భారతంలోని ప్రయోగం అన్నిష్ట సఖినూది యున్న దాని- అనే దాన్ని బట్టి కొందరు తర్వాతి కవులు నాంత పదాలకి పరం అచ్చు వచ్చినపుడు నకార ద్విత్వాన్ని అప్పకవి ద్భులో సంశ్లేష రూపాన్ని కల్పించడం జరిగింది ఈ విషయాన్ని ప్రౌఢ వ్యాకర్త సంధి పరిచ్ఛేదంలో మూడవ సూత్రంలో నిబద్ధం చేశాడుకూడ ప్రౌఢ వ్యాకర్త సశ్లేష పదానికి లుక్సంశ్లేషౌనాచి అనే సూత్ర సందర్భంలో నైనా అప్పకవి వలెనే అర్థం చేసుకొన్నాడని స్ఫురిస్తుంది కాబట్టే లుక్సంశ్లేషౌ నాచి అనే సూత్రానికి అర్థంకాని అర్థం చెప్పుకొని సమర్థించుకోవడంకంటె అహోబలపతివలె అప్పకవి ప్రౌఢ వ్యాకర్తల మతాన్ని పాటించడం సమంజసమైన పని

ఇక 34వ విషయంగా వారు ప్రతిపాదించిన నన్నయ భారతమున ద్రుతము స్వరూపము లేదు అనే వాదం లక్ష్య లక్షణ విరుద్ధం గాబట్టి సామాన్యంగానే తిరస్కరించవచ్చు ఈ సందర్భంలో వారు చూపిన అర్థ సందర్భాలు నన్నయ ప్రయోగాలకు మిక్కిలి అసంగతంగా ఉన్నాయని చెప్పక తప్పదు

ఇలాగే 35వ విషయంలో కూడ భూత తద్ధర్మార్థక ప్రథమైక వచనాంతాల్లో ను లేదని (చూచెను చూచును-వంటివి లేవని ఆంధ్ర వాఙ్మయాన్ని ఏపాటిగ పరిచూచిన వారైనా అంగీకరించలేరు

ఫలితార్థం

ఈ వాదాల తీరు తెన్నులు చూస్తే శాస్త్రిగారికి చింతామణిని నన్నయ కృతంగా నిరూపించడానికి పెద్ద పట్టుదల ఉందని తేలుతుందేగాని దానిలో శాస్త్రీయ దృక్పథం గాని యథార్థ కథనంగాని బొత్తిగా లేవని స్పష్టపడుతుంది

---

1 బాల వ్యా సంధి — 7
అది 8 9

కాగా ఈ చింతామణి విషయ పరిశోధనము వ్రాసి వారు ఏ ప్రయోజనాన్ని సాధించా మనుకున్నారో అది సాధించబడలేదని కూడ నిర్ణయించవచ్చు

పైగా వారి వాదాల్లో అన్యోన్యాశ్రయ దోషం మెండుగా కనబడింది చింతామణి సంస్కృత సమ శబ్ద మాత్ర నిరూపణ ప్రవణమనే వాదం ఆధారంగా ఎన్నో ఇతర వాదాల్ని ప్రతిపాదించారు ఆ ఆధారం కూలిపోగానే ఆ ఆధేయాలన్నీ సహజంగానే పడిపోయాయి వికృతివివేక కారికలు అధర్వణ కృతమని సిద్ధాంతిత మైనట్లు భావించి ఆ సిద్ధాంతం ఆధారంగా చింతామణి కర్తృత్వ నిర్ణయం చేయబోయారు అలాగే చింతామణి నన్నయ కృతమని సిద్ధాంతం చేసినట్లు భావించి నన్నయ ప్రయోగాలతో చింతామణి సూత్రాలు భేదించే సందర్భాల్లో ఆ సూత్రాల అర్థాలు ఉదాహరణలు మార్చారు ఈ విధంగా చింతామణి విషయ పరిశోధనం అనిశ్చిత విషయాన్ని నిశ్చితం చెయకపోగా మరీ క్లిష్టపరిచిందని మాత్రం చెప్పవలసి ఉంది

# చింతామణి పాఠభేదాలు

చింతామణిలో – సంజ్ఞా 2 సంధి 3 అజంత 4 హలంత 5 క్రియా పరిచ్ఛేదా లున్నాయి పరిచ్ఛేదాని కొక్కొక్క దానికి ఇన్నిన్ని సూత్రాలని నిర్ణయించి బాలసరస్వతి చెప్పడం జంగలేదు మొత ం గ్రంథంలో 88 ఆర్యలున్నా యని వాటిలో అప్పకవీయమైన దానిలో ఆరు నష్టమైనాయనీ అహోబలపతి అన్నాడు అతని ఈ మాటకు అప్పకవిమాటే ఆధారం[1]

పరిచ్ఛేదాల విషయంలో గూడ బాలసరస్వతీయ చింతామణికీ అప్పకవీయ చింతామణికీ భేదముంది బాలసరస్వతి పంచపరిచ్ఛేదకం[3] అన్నాడే గాని వాటిని విడిగా చూపలేదు గ్రంథంలో మాత్రం పైన చూపిన 5 పరిచ్ఛేదా లున్నాయి అప్పకవీయ చింతామణిలో ఈ పరిచ్ఛేదాల పేర్లు ఇలా మారాయి – సంజ్ఞా 2 సంధి 3 తత్సమ 4 దేశ్య 5 క్రియా[4] బాలసరస్వతి సంజ్ఞా పరిచ్ఛేదంగా వ్యవహరించిన సూత్ర సంచయాన్ని అప్పకవి భాషా పరిచ్ఛేదమని వర్ణ పరిచ్ఛేద మని రెండుగా పునర్విభజనచేసి చూపాడు అప్పకవీయ చింతామణి మనకు పూర్తిగా లభించడం లేదు గాని అతని రచనా ప్రణాళికలో తరువాతి పరిచ్ఛేదా లేమిటో మొత ం పరిచ్ఛేదాల విభాగ మెలాజరిగిందో తెలిసికోవచ్చు చింతామణిలోని ఐదు పరిచ్ఛేదాల్నే తాను పెంచి ఎనిమిది ( భాషా 2 వర్ణ 3 వశిప్రాస 4 పద్య 5 సంధి 6 తత్సమ 7 దేశ్య 8 క్రియా) విభాగాలతో వ్రాయ తలపెట్టినట్లు అతని పీఠిక తెలుపుతుంది

---

మతంగ శైల విప్రేంద్రా దన్యద్ వ్యాకృతి పుస్తకమ్ కాకునూర్యప్పకవినా గృహీతం తత్రషడ్గతా (అహో పం పీఠిక 7 )

2 ఇల నెనుబదిరెండార్యలు గలిగి పరిచ్ఛేద పంచకంబునఁదగునీ
విలసిత ఫక్కి మతంగాచల విప్రునివలన నీదు సదనము చేరున్
(అప్ప ఎరిక 52)

3 బాల స పీఠిక

4 అప్ప పీఠిక 96

5 పైది

బాలసరస్వతీయ చింతామణిలో సంజ్ఞా పరిచ్ఛేదంలో 6 శ్లోకా ఉన్నాయి మరొక శ్లోకం—

స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధ ధియ
లోకే బహుమన్యన్తే ప్రాకృతకావ్యాని చాన్య దపహాయ అని కనిపిస్తున్నది[1]

కాని దానిని పరిచ్ఛేదాంతర్గత శ్లోకంగా పరిగణించినట్లు లేదు కాబట్టే దానికి సంఖ్య ఒసగబడలేదు అయితే వ్యాఖ్యానం మాత్రం చేయబడి ఉంది ఇటీవలి ప్రచురణలలో ఆ శ్లోకం గూడ సంఖ్యాతమై సంజ్ఞా పరిచ్ఛేదంలో ˜ శ్లోకాలు కని స్తున్నాయి సంధి పరిచ్ఛేదంలో 3 శ్లోకాలు అజంత పరిచ్ఛేదంలో 22 శ్లోకాలు హలంత పరిచ్ఛేదంలో 9 శ్లోకాలు క్రియా పరిచ్ఛేదంలో 7 శ్లోకాలు కనిపిస్తున్నాయి అయితే క్రియాపరిచ్ఛేదంలో కుండలీకృతాలై మరొక రెండు శ్లోకాలు ఆంధ్ర సాహిత్య పరిషత్ కాకినాడవారి ప్రతిలో పాఠాంతరంగా ఒకటి అధిక పాఠంగా మరొకటి కనుపిస్తున్నాయి[3]

క్రియా పరిచ్ఛేదంలో కనుపించే పాఠాంతర శ్లోకం అధికపాఠశ్లోకం మినహాయించి లెక్కిస్తే పైన తెలిపిన ప్రతిలో 87 ఆర్యలే ఉన్నట్లు తెలుతుంది కాని అసంఖ్యాతంగా ఉన్న స్వస్థానేత్యాది శ్లోకాన్ని గూడ కలిపి లెక్కిస్తే 88 ఆర్యలు ఉంటాయి

అనంతర కాలీన ప్రతులలో పై కాకినాడ వారి ప్రచురణలోని కుండలీకృత శ్లోకాలు వదలి మిగిలినవాటిని స్వీకరించడం జరిగింది

---

1 ఆంధ్ర సాహిత్య పరిషత్ కాకినాడ 93

2 వావిళ్ళ మద్రాసు 97

3 సంప్రార్థనార్థక ముదుజ్వర్ణాద్యన్తా క్రియాపదాదీత్ స్యాత్
వ్యతిరేకే తు మబన్తాదేదాతౌ ప్రశ్న లక్షణౌ భవత -క్రియా 5వ శ్లోకానికి పాఠాంతరం
కర్మణ్యనుబంధస్స్యాత్ పతిధాతు కర్తృవచ్చ తద్విధయ
ఆశిష కాపుత కాతా వెడుతేత్యాద్యా భవన్తి కాకశ్చ —క్రియా 7 తరువాత అధికపాఠం

చింతామణికి ప్రాచీనకాలంలో ఎన్ని ప్రతు లుండేవి? అనే ప్రశ్నకు నిస్సం శయంగా ఒక సమాధానం - రెండుప్రతు లుండేవి అని - చెప్పవచ్చు బాల సరస్వతిది 2 అప్పకవిది అయితే అప్పకవీయ చింతామణిలో మనకు సంజ్ఞా సంధి పరిచ్ఛేదాలలోని సూత్రాలే లభిస్తున్నాయి మిగిలిన పరిచ్ఛేదాలలోనివి అప్ప కవి ఎరికలో వాకొన్నట్లు తన గ్రంథాన్ని 8 పరిచ్ఛేదాలుగా వ్రాసి ఉంటే ఆ వ్రాఁతది మనకు దొరికి ఉంటే లభించి ఉండేవి

## అప్పకవీయ చింతామణి

మనకు లభిస్తున్న అప్పకవీయ చింతామణి సూత్రాలకూ బాలసరస్వతీయ సూత్రాలకు చాలభేదం కనుపిస్తున్నది అప్పకవీయ చింతామణిలో సంజ్ఞాపరిచ్ఛేద ములో 6 + 20=26 శ్లోకాలు (భాషా వర్ణ పరిచ్ఛేదాలలో యథా సంఖ్యంగా) సంధిలో 5 శ్లోకాలున్నాయి

అప్పకవి తన తెలుగుసేతలో పద్యపరిచ్ఛేదానికి మూలమంటూ చూపిన 5 శ్లోకాలు బాలసరస్వతీయ చింతామణికి బొత్తిగా కొత్తవి ఆ శ్లోకాలు చింతామణిలో వర్ణపరిచ్ఛేదం చివరి వ్రాయబడి ఉన్నాయని అప్పకవి అన్నాడు యథార్థానికి చింతామణిలో వర్ణపరిచ్ఛేదమేలేదు అప్పకవి స్వయంగా చింతామణిలోని వంటూ పేర్కొన్న పరిచ్ఛేదాలలో గూడ ఈ పరిచ్ఛేదంలేదు[2]

## వర్ణ పరిచ్ఛేదం

ఈ వర్ణ పరిచ్ఛేదమనేది అప్పకవి కల్పించినదే గాని చింతామణిలోనిది కాదు చింతామణిలోని ఐదు పరిచ్ఛేదాలనే తాను 8 పరిచ్ఛేదాలుగా పెంచి తెనిగిస్తు

---

ఘనుఁడు వాగనుశాసన కవివరుండు ముందు వర్ణ పరిచ్ఛేదమునకుఁ దుదిని బద్యలక్షణమెల్ల నేర్పడ గఁ బల్కె సొరిది సంక్షేపముగ నైదుశ్లోకములను
అప్ప 4—3

2 అప్ప ఎరిక 96

న్నట్లుచెప్పి తనరచనాప్రణాళికలో వర్ణ పరిచ్ఛేదమున్నట్లు పేర్కొన్నాడు కాగా వర్ణ పరిచ్ఛేదం చివర అంటే చింతామణిలో సంజ్ఞా పరిచ్ఛేదాంతంలో అని అర్థం చేసి కోవలసి ఉంది దేశంలోని ప్రస్తుతం లభించే చింతామణి ప్రతుల్లో ఎక్కడా సంజ్ఞా పరిచ్ఛేదం చివరగాని షురెక్కడగాని అప్పకవీయ పద్య పరిచ్ఛేదానికి మూల భూతమైన 5 శ్లోకాలు కనుపించవు ఆ అయిదు ఇవి -

వృత్తం జాతిశ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యై
సంబద్ధం వృత్తం స్యాదుపగణ మాత్రాభిరన్వితా జాతి
శాస్త్రార ఏకమాత్రాం లఘో ర్ద్విమాత్రే గురో రితి వదన్తి
గౌ లౌ గగ లల సంజ్ఞాగ్లౌ హగణో లఘు గురూ లగో వగణ
గత్రితయం లత్రితయం మ న సంజ్ఞా వాద్య మధ్య మాన్త్యార్ణా
గురవశ్చే ద్భ జస గణా ఽఘవో యది య ర త సంజ్ఞకా క్రమశ
మిత్రా నగలా వింద్రా నల నగ సల భరతా శ్చంద్రా మలఘు
రల రగ తల తగ నస నహా భల భగ సలల నలల నగగ సవ సహా
దీర్ఘ స్సంయుక్తాద్య ఃపూర్ణానుస్వార పూర్వ వర్ణశ్చ
ఏతే గురవశ్శేషాస్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయా

ఈ శ్లోకాలే కాకుండ అప్పకవీయ చింతామణిలో వర్ణపరిచ్ఛేద ప్రారంభంలో క్రింది శ్లోకాలు గూడ కనుపిస్తున్నాయి అవి గూడ ఛందశ్శాస్త్ర సంబంధులే

శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణా స్తఏవ కావ్యాదౌ
గ్రాహ్యా పురాస్త్ర రస గిరి రుద్రే ష్వకచటత మాతృకా నింద్యా
ఆద్యోవశి ర్ద్వితీయో వర్ణ ప్రాసోఽత్ర పాదపాదేషు
స్వస్వచరణేషు పూర్వ ప్రాసస్సర్వేషు చైక ఏవ స్యాత్ — 4 5

పై శ్లోకాల్లో రెండవదాని పూర్వార్థం అక్షరభేదంతో తాత్పర్య సామ్యంతో బాలసరస్వతీయంలో గూడ వళిరాద్య మనన్తరాక్షరం ప్రాస అని కనిపిస్తున్నది కాగా అప్పకవీయ చింతామణిలోని మిగిలిన శ్లోకాల విషయం పరిశీలనార్హం

---

బాలస సంజ్ఞా 37

## ఛందోదర్పణ-అప్పకవీయాలు

అనంతుని ఛందోదర్పణంలో పై శ్లోకాల తాత్పర్యాన్ని కొన్నిచోట్ల పదాల్ని పదబంధాల్ని గూడ ప్రతిఫలించే పద్యాలు కనుపిస్తున్నాయి కాగా ఛందోదర్పణ అప్పకవీయాల్ని ఒకే వరుసలో చూద్దాం

పద్యంబు లవియు వృ
త్తములు జాతులనఁగ నమరుఁ గృష్ణ
వృత్తంబులు గణబద్ధము
లుత్తమమగు జాతులెల్ల నొనరఁగ మాత్రా
యత్తంబులు లఘువగుఁబురు
షోత్తమ యొకమాత్ర గురువునొదవు ద్విమాత్రన్ (ఛందో -6 7)

వృత్తం జాతిశ్చేతి ద్వివిధం పద్యం గణైర్నిసర్గాఖ్యే
సంబంద్ధం వృత్తం స్యాదుపగణ మాత్రాభిరన్వితా జాతి
శాస్త్రార ఎకమాత్రాం లఘోర్ద్విమాత్రే గురోరితివదన్తి
(అప్ప చిం పద్యపరిచ్ఛేద 2)

వివిధముగఁజాపి పలికెడు
నవియును మరియూది పలుకునవియును గురువుల్
భువి నిలిపి వలుకు వర్ణము
లవి యెల్లను లఘువులయ్యె నంబుధి శయనా (ఛందో -8)

దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణానుస్వార పూర్వవర్ణశ్చ
ఏతేగురవ శ్శేషాస్సర్వే లఘ్వక్షరాఇతి జ్ఞేయా (అప్ప చిం పద్యపరి 5)

గురు లఘువులోలి మూడేసి గూడిన మన
లాది మధ్యావసానంబు లందు గురువు
లొంద భజసలు లఘువులొ్లొంద యరత
లఁనఁగ నయ్యష్టగణములొప్పు ముకుంద (ఛందో. - 2)

గత్రితయం లత్రితయం మనసంజ్ఞౌ ఆద్య మధ్య మాన్త్యార్ణా
గురవశ్చేద్భజసగణా లఘవో యది యరత సంజ్ఞకా క్రమశః
(అప్ప చిం పద్యపరిచ్ఛేద ౫)

గురువును లఘువును లఘువును
గురువును హవలగును గలలు గురులఘుసంజ్ఞల్
వరుసను గగలల గణముల
కరయగ వర్ణములు ద్విగుణమై యొప్పు హరీ (ఛందో – 6)

గౌ లౌ గగ లల సంజ్ఞౌ గ్లో హగణో లఘుగురూ లగో వగణః
(అప్ప చిం పద్యపరిచ్ఛేద 2)

గల నగణములినుఁడింద్రు డు
నల నగ సల భరత లింక నగగ నహ సలా
భల భగురు మలఘు సవ సహ
తల రల నవ నలల ౦గురు తగలిందుఁడజా (ఛందో – 9)

మి తౌ నగలౌ ఇంద్రా నల నగ సల భరతా శ్చంద్రా మలఘు
రల రగ తల తగ నవ నహ భల భగ సలల నలల నగగ సవ సహా
(అప్ప చిం పద్య 4)

పురశర రసగిరి రుద్రుల
నరయ నకచట తపలిడుట యనుచిత మయ్యె
క్షరములను రసభజంబులు
బరిహరణీయంబులాదిఁబంకజనాభా (ఛందో –26)

పురాస్త్రి రసగిరి రుద్రేష్వకచట తమాతృకా నింద్యా
(అప్ప చిం వర్ణ 4)

పై ఉద్ధృత పద్యాల శ్లోకాల పరిశీలనంతో ఏవో కొన్ని ఛందస్సు బాధించినచోట్ల తప్ప ఇతరత్ర అనంతుని వ్రాతనే యథాతథంగా సంస్కృతీ

కరించటం జరిగినట్లు తెలిసికోవచ్చు అష్టవిధగణ నిర్వచనం చేసేచోట సూర్యేం
ద్రగణాలు పేర్కొనేచోట నిషిద్ధాక్షరాల వివరణంలో పదాలు పదబంధాలు గూడ
యథాతథంగా స్వీకరించబడి కనుపిస్తున్నవి–శ్లోకాలలో

ఎది దేనికి అనుకరణం?

అయితే ఛందశ్శాస్త్ర ప్రారంభాన్ని రచించదలిస్తే ఎవరికైనా రచనాక్రమం ఒకటిగానే ఉండవచ్చు గదా అట్టిదే ఈ క్రమం గూడ అని పూర్వపక్షం చేయవచ్చు కాని విసర్గ గణాల నిర్వచనం సూర్యేంద్రగణాల వివరణం తెలుగులో ప్రథమ ఛందశ్శాస్త్రమైన కవిజనాశ్రయంలో భిన్నమార్గంలో కనబడుతున్నది ఒక వేళ మార్గం సమానమైతే కావచ్చు గాని ఇక్కడ రెండు గ్రంథాలలో అర్థ సందర్భాలతో సహా బింబ ప్రతిబింబాలు కనిపిస్తుంటే వాటిలో ఒకటి నిశ్చయంగా ప్రాచీన మని తేలినపుడు రెండో గ్రంథం దానినుండి ఆయా అంశాలు గ్రహించిన దని నిర్ణయించవలసిందే

అనంతుని రచననే అప్పకవీయచింతామణి అనుసరించిన దని మరొక ఆధారంతో గూడ నిర్ణయించవచ్చు

కేవలం ఛందశ్శాస్త్రాన్నే రచిస్తున్నాడు గాబట్టి అనంతుడు పద్యం రెండు విధాలని ప్రారంభించి గురు లఘు లక్షణం చెప్పి విసర్గ గణాలను మాత్రా గణాలను వివరిస్తూ ప్రయోజ్య అప్రయోజ్య వర్ణాల్ని చూపించడం సమంజసమే కాని వ్యాకరణశాస్త్ర ప్రణేతకు పై వివరాలు తెలుప వలసిన అవసరంలేదు అయితే

---

పౌనరుక్త్యగ మూండెడలను మొద
లనడుమందుదిగదియంగ గురులఘువులు నేతెం
చిన మభజసనయరత నా
మనిరూపిత గణములయ్యె మల్లియరేచా (కవిజనాశ్రయము -౯వ పుట)

భరత నగ నల సలంబులు వరుసనె యియ్యాఱు నెన్న వాసవగణముల్
మరి నహము లినగణంబులు సరవిం దక్కినవియెల్లఁ జంద్రగణంబుల్
(కవిజనాశ్రయము -౯ పుట)

తెలుగు లాక్షణికుల వ్రాతలలో ఛందశ్శాస్త్రాలలో వ్యాకరణం కొద్ది కొద్దిగా అక్కడక్కడా కనుపించడం కద్దు కాని ఇది దేశీయ శాస్త్రరచనా విధానం అదైనా మల్లియ రేచన మూలఘటిక కేతనలకు తరువాత ఏర్పడిన సంప్రదాయం కవిజనాశ్రయంలో వ్యాకరణాంశ కథనం లేదు కేతన తన వ్యాకరణంలో ఛందశ్శాస్త్ర విషయాలు ఎక్కడా చెప్పలేదు తరువాత విన్నకోట పెద్దన అయినా వ్యాకరణాంశాలను ప్రత్యేక పరిచ్ఛేదంలో వివరించే సందర్భాన మధ్య మధ్య ఛందో విషయాలు చొనప లేదు

లభించే ఆధారాల్ని బట్టి అనంతుడే ఈ కలగలుపు కార్యక్రమానికి ఆద్యుడుగా కనుపిస్తున్నాడు అతని ఛందస్సులోనే తొలిగా అక్కడక్కడ వ్యాకరణాంశాలు వివరించబడి ఉన్నాయి1 ఆంధ్రశబ్ద చింతామణిలో గూడ ఈ పద్ధతి అనుసరించబడి ఉంది అంటే చింతామణి కర్త నుండి అనంతుడో అనంతుని నుండి చింతామణి కర్తో ఈ పద్ధతిని స్వీకరించి ఉండాలి కాని చింతామణి అనే గ్రంథ మొకటి ఉన్నట్లు 16వ శతాబ్ది చివరివరకు ఎవరికీ తెలియదు అనంతుని విషయ మటువంటిది గాదు అతని ఛందస్సు తెలుగుదేశంలో సుప్రసిద్ధం 16వ శతాబ్ది మధ్యభాగం నుండే తెలుగు లక్షణ కర్త లందరూ అతని నెరిగినవారే2 అతనికి లాక్షణికులలో అప్పటికే ఉన్నతమైన స్థానమేర్పడింది కాగా వ శతాబ్ది చివరికి గాని అస్తిత్వమేర్పడని చింతామణిని అనంతు డెరిగి ఉండడం అసంభవం కాని చింతామణిని తొట్టతొలుత లోకానికి పరిచయం చేసి కొందరు ఆధునిక పరిశోధక విమర్శకులచేత దానికి కర్తగా శంకితుడైన బాలసరస్వతి అనంతుని ఛందస్సు నెరిగి ఉండటం అబద్ధంగాదు అదేవిధంగా ఛందశ్శాస్త్రనిష్ణాతుడైన అప్పకవికి అనంతుని గ్రంథంలో

---

ప్రథమాంత విభక్తు లపైఁ గథితమ లగు కచటతపలు గసడదవలగున్
పృథివి నివి గజడదబలగుఁ బ్రథమపు సున్నలగు నాంత పదముల మీఁదన్
(ఛందో -62 ఇంకా 64 65 66 67 మొదలగునవి)

2 త్ర్యక్షవర ప్రసాద కవితాఢ్యుని వేము లవాడ భీము న య్యాక్షిత భక్తి విస్ఫుర దనంతు ననంతుఁ గవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని భైరవు నూత్నదండి వా గ్వీక్షణ కర్ణనేత్రుఁ దగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నుచున్ (ల సా స -3)

గొప్ప పాండిత్యమే ఉంది బహుశ అతడే అనంతుని ఛందస్సులోని పద్యాల్ని ఈ శ్లోకాలుగా సంస్కృతీకరించి ఉండవచ్చు కాబట్టే ఆ పద్యాల శ్లోకాల సామ్యం అంతప్రస్ఫుటంగా కనిపిస్తూ ఉంది పైగా రచనలోని క్రమబద్ధమైన పైఅనుసరణం గూడ అప్పకవీయ చింతామణి అనంతుని ఛందస్సు తరువాతిది - అని రుజువు చేస్తున్నది కాబట్టి అప్పకవి నన్నయభట్టు సూత్రాలంటూ తన చింతామణిలో ఈ సూత్రాలను ఇరికించి పరిచ్ఛేదాలకు పరిచ్ఛేదాలే పెంచి వ్రాశాడని నిర్ణయించవచ్చు

బాలసరస్వతీయ సంజ్ఞాపరిచ్ఛేదంలో మొత్తం 7 శ్లోకాలుంటే అప్పకవీయ సంజ్ఞాపరిచ్ఛేదంలో 27 శ్లోకా లున్నాయి ఈ భేదం ఎక్కడ ఎందుకు ఏర్పడిందో గమనించ వలసి ఉంది

## అప్పకవీయంలో అదనంగా సూత్రాలు

అప్పకవి బాలసరస్వతి చూపని 7 శ్లోకాలు[1] తన తృతీయ చతుర్థాశ్వాసాల రచనకోసం అధికంగా చూపాడని తేలింది కాగా మరొక మూడు శ్లోకాలుగూడ అప్పకవీయ చింతామణిలో అధికంగానే ఉన్నాయి ఆ శ్లోకాలు మూటితోపాటు మరో ఆరు సూత్రాలూ కనుపిస్తున్నాయి

శ్లోకాలు బాలేందు పరిధి శృంగావర్త కుశగ్రంధి దాత్ర పరశు సమా
ఆద్యా ఇభకరతుల్యా స్త్రదీర్ఘా శ్చాంఛసన్నిభావన్యౌ
దరశార్ఙ్గ పిప్పలదళాంకుశ పన్నగ సన్నిభా క్రమాత్ పరుషా
స్తంభి విరేఖాధిక్యే స్త ఎవ వర్గద్వితీయ వర్ణాద్యా
కీర తరి హస్తి మస్తక శుక్తి తులాసన వితర్ది సీరసమా
అంతస్థా శ్చోష్మాణో దంత్య చజౌ గురురలౌ చ బిందుయుతౌ
(అప్ప చిం వర్ణ 3 5 6)

---

ఈ 7 శ్లోకాల్లో ఒక దాని పూర్వార్ధం మాత్రం బాలసరస్వతీయంలో ఉంది
ఇంద్రాద్యా అపిచగణా వళిరాద్య మన న్తరాక్షరం ప్రాస (సంజ్ఞా 2)
మరొక నగంశ్లోకం ఏతాస్సంజ్ఞా స్సర్వాజ్ఞాత్వా పశ్చాత్ ప్రవర్తయేదత్ర అనేది (సూత్రం కాదు) అధికంగా ఉంది

సూత్రాలు వికృతిపదాదౌ ప్రథమా స్తస్థ తృతీయా నునాసికౌ న స్త (అప్ప చిం వర్ణ)

2 క్వచిదప న స్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ (పైది)

3 ధాతుపద సంభవానాం విశేషణానా ముత స్తథాను మచి (అప్ప చిం సంధి )

4 బోరుద్భుత శబ్దార్థే (పైది)

5 వికృతిపదే లౌటోరపి (పైది)

6 తేషామితశ్చ తద్వ త్త్రివిక్రమమ తేన (పైది)

వీటిలో పైమూడు శ్లోకాలు తెలుగులో లేఖన క్రమాన్ని ఉపదేశిస్తాయి వీటిని గూర్చిన పరిశీలనం పూర్వప్రకరణంలో జరిగిఉంది కాగా తరువాతి అంశానికి వెళదాం

## పదాదియకార నిషేధం

అధిక సూత్రాలు ఒకొక్క దానిని వరుసగా గమనిద్దాం

విక్రృతి పదాదౌ ప్రథమా స్తస్థ తృతీయానునాసికౌ న స్త

తెలుగు పదాల మొదట యకారము ఙకారము ఉందవు — అని సూత్రార్థం ఇది చింతామణి మూలసిద్ధాంత మొకదానితో విరోధిస్తుంది చింతామణి పవాదిలో యకార ముంటుందని ఒకచోట ఆయకారం ద్రుతప్రకృతికాలకంటె పరంగాఉన్న పుడు అచ్చువంటిదేఅవుతుందని మరొకచోట చెబుతుంది² అయినపుడు అచ్చతెలుగు పదంల మొదట యకారం ఉండవని చెప్పడం చింతామణి ప్రణాళికకు సరిపడదు అయినపుడు అప్పకవీయంలో ఈ సూత్ర మెందుకు ఉంది

---

అట్యుకి క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినాసర్వ (చింతా సంజ్ఞా 8)

2 సర్వత్రాజ్వత్ కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్య (చింతా సంధి 9)

అప్పకవి తనపూర్వ వ్యాకర్త లందరివలెనే పదాది యకారాన్ని అంగీకరించడు కేతన విన్నకోట పెద్దన ఇట్టి లక్షణం చేయలేదు చిత్రకవి పెద్దన పదాది యకారాన్ని నిషేధించాడు ఈ కోవకె చెందిన అప్పకవియొక్క చింతామణిలో మాత్రం ఈ సూత్రం లభించడం విచిత్ర విషయ మేమీ కాదు సూత్రానికి అప్పకవి చేసిన వ్యాఖ్యాన మిది

తెలుఁగున యణకారంబులు
గలుగవు శబ్దాదులను యకారము పగిదిన్
బలుకఁబడునవి స్వాంశములగు
ఖలపూర్వా మరవినాశ కామె పలీశా (అప్ప 2 - 65)

తెలుగులో శబ్దాదిని ఏఏ అక్షరా లుండవో చెప్పదలిస్తే ఇంకా కొన్ని అక్షరాలు ఈ వరుసలో చేర్చవలసి వస్తుంది అవి హకార శకారాలు హకారం తెలుగు మాటల మొదట నన్నయలోగాని ఆకాలంలోని ఇతర వాఙ్మయంలో (శాసనాలు రేచనాదుల రచనలు) గాని కనబడదు అలాగే ళాక్షరం గూడ పదాంతాన పద మధ్యాన ఉంటుందే గాని పదాదిలో ఉండదు అయినపుడు ప్రత్యేకించి ణకారం ఒక్కటే పదాదిలో ఉండదని చింతామణి చెప్పడం అసమగ్రంగా ఉంది హకారం తెలుగు మాటల మొదటనే కాదు మధ్యలోగాని చివరగాని కనపడదు- వ శతాబ్దిలో కాగా అచ్చతెలుగు అక్షరసమామ్నాయంలో హకారాన్ని గూడ చేర్చి చింతామణి తాను వ శతాబ్దినాటి రచన కాజాలనని స్వయంగా నిరూపించుకున్నట్లయింది అప్పకవి ఈ పదాది యాకారంతో గట్టిగా విరోధించాడు కాబట్టే సందర్భం కల్పించుకొని దాన్ని మరొకచోట గూడ కూడదన్నాడు

పద్యాది ప్రాణంబుల
నాద్యంతస్థములుగాగ నజ్ఞులు కృతులన్
జైద్యహర వ్రాయుదురు తమ
విద్యాధికులెల్లఁజూచి వికవిక నవ్వన్ (అప్ప 2—43)

---

తెలుగుల మొదళ్ల నెయిలివి (మొదళ్లన్ + ఎ ఇ-వర్ణాలు) యలహల్లులు
గావు స్వరములగు వ్రాయంగన్ (ఇ. సా వ 3—6)

ఇంకొకచోట గూడ స్వయంగా సందర్భం కల్పించుకొని యకార నిషేధం చేశాడు

ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు ప్రాణమై యది గనుపట్టుగాని
(అప్ప 2— 75)

బాలసరస్వతికీ అప్పకవికీ మధ్యకాలంగూడ ఎమంతదీర్ఘంగాలేదు అప్పకవి కథనం ప్రకారం అప్పకవికి మన్మథనామ సంవత్సరంలో చింతామణి దొరికితే అంతకుముందు కీలకనామ సంవత్సరంలో బాలసరస్వతికి అది దొరికింది కాబట్టి ఇంత స్వల్ప వ్యవధిలోనే సూత్రభేదాలు చింతామణిలో కలగడానికి అవకాశం లేదు. సహజంగా కాబట్టి ఈ భేదాలు అసహజంగా ఏర్పడినవే కావాలి

చింతామణి ప్రతుల విషయంలో ఆకాలాన వీరిరువురిదే ఆధిపత్యం మూడో వ్యక్తిలేదు కాబట్టి ప్రత్యంతర పరిశీలనతో ఈ సూత్రభేదాలకు మూలం కనిపెట్టడం అసాధ్యమైనపని అహోబలపతి తనకాలానికే పాఠభేదాలు అధికంగా ఉన్నాయంటూ తాను తరచుగా బాలసరస్వతి గ్రంథాన్నే ఆధారంగా తీసికొని వ్యాఖ్యానం సాగిస్తు నట్లు చెప్పాడు

పద్యపరిచ్ఛేదం వ్రాయాలని సంకల్పిస్తే అప్పకవి చింతామణిలో చందస్సం బంధి సూత్రాలు గూడ (7 శ్లోకాలు) ఆవిర్భవించాయని తెలిసికొన్నాం ఇపుడేమో పదాదిలో ఫలానా వర్ణం ఉండదని సిద్ధాంతం చేయదలిస్తే మరొక సూత్రం అతని చింతామణిలో పుట్టినట్లు గ్రహించాలి కాగా అప్పకవి సంకల్పాలకు అనుగుణంగా అతని చింతామణిలో సూత్రాలు ఆవిర్భవిస్తూ వచ్చినట్లు మనం నిర్ణయించుకోవడం తప్ప ఇక్కడ గత్యంతరం కనిపించడం లేదు

చింతామణి రచనా ప్రణాళితో ఏమాత్రం సందర్భపడని అధిక సూత్ర మింకొకటి ఇది —

*పదాది వృవోల నిషేధం*

2 క్వచిదపినస్త ఉదోతౌ దంతోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ

---

అప్ప పీఠిక 33

తెలుగుమాటల మొదట వకారం మీద ఉ ఓ ఋ ఎక్కడా ఉండవని సూత్రార్థం దీనికి అప్పకవి వ్యాఖ్యాన మిది

జాతి వాగల వోర్ధ్వ శబ్దమొక్కటి దక్క
సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు
నోత్వంబులును గల్గ వొకటికైన
వాకు శృంగములకై వడి నోత్వముల భంగి
శబ్దాది గలయవి స్వరములగును
రెండును లా కులనుండుఁ గృష్ణుఁడు గిన్క
వుట్ట మోఁదినఁజెట్టు వొలిసెననఁగ

నడుమఁగొమ్ములు సంస్కృతాంధ్రముల రెంట
బలసి జాత్యక్షరములకే గలిగి యుండు
భావుకము నీవు భవుకంబు భవుఁడనంగఁ
బొడవు దీవులు సవురంబు పువ్వులనఁగ (అప్ప 2-22)

ఆంధ్రవాఙ్మయంలో శివకవులకాలం నుండి అజాదులయిన పదాలు ఒక్కడు ఉడిపు ఉండు-వంటి శబ్దాలు హలాదులుగా వొక్కడు వుడిపు వుండు-వంటి రూపాలతో వ్యవహారాన్ని పొంది గ్రంథస్థాలుగా గూడ అయినాయి[1]

ఈ సంస్కారం ఆధారంగానే తెలుగు కవులు కొందరు వు ఓ లకు వు ఊ లకు యతికల్పనం గూడ చేశారు[2] ఈ అవ్యవస్థను లాక్షణికు లంగీరించలేరు కాబట్టి నిషేధించాలి ఆ నిషేధం అప్పకవి స్వయంగా చేస్తే పండితలోకం స్వీకరించక పోవచ్చు కాగా తాను చేయదలచిన నిషేధాన్ని చింతామణి ముఖతః ప్రవేశపెట్టాడు

---

పాల్కురికి-వృషాధిప శతకం 98 గౌరన-నవనాథ చరిత్ర 92 77వ పుటలు తిమ్మకవి-ద్విపద భారతము 2 4 వ పుట

2 బసవ పురాణం - 52 భాగవతం 0-46 7 5 900 ఈదుపల్లి భవానీశంకరకవి-ధర్మఖండం 3-82

మన శాస్త్రాల్లో పురాణాల్లో ఆయాపట్టుల కనుఎంచే ప్రక్షేపాలన్నీ ఇలా మధ్య కాలాల్లో ఏర్పడినవే గదా

## ఉదన్త ధాతుజ విశేషణ - నుమాగమం

బాలసరస్వతీయంతో విరోధించక అప్పకవీయంలో అధికంగా ఉన్న సూత్రాలలో ఒకటి

3 ధాతుపద సంభవానాం విశేషణానా ముతస్తథా నుమచి

ఉదంత ధాతుజ విశేషణాలకి అచ్చు పరమైతే నుమాగమం వస్తుందని సూత్రార్థం అప్పకవి వ్యాఖ్యాన మిది -

క్షితిని బై పదములకు విశేషణంబులగు క్రియాపదముల తుది నమరుశృంగ
మునకు వచ్చు నాగమమయి పొల్లు ద్రుతము ప్రాణపరమైన గర్మధారయమునందు
అని పేయు నత డు కవ్వడి కనుగొనియెడు నతఁడు మాద్రి కడపటి కొడుకా
మొననుండు నతఁడు వడముడి వెను సను నతఁడర్క సుతుఁడు విరథుండనఁగన్
(అప్ప 5–93 94)

ఈ సూత్రంలో లక్షితమైన ప్రయోగాలు నన్నయనుండి చిన్నయవరకు ఉన్నవే అయినా ఇట్టి లక్షణం మాత్రం కేతనాదులు చేయలేదు కాగా తనకు పూర్వమున్న లక్షణ గ్రంథాల్లోని ఆ కొరతను తీరుస్తూ సూత్రీకరించాడు అప్పకవి ఇది అతని పరిశీలనా ఫలితంగా ఎర్పడిన స్వతంత్ర సూత్రమే

బాలసరస్వతీయ చింతామణిలో ఈ సూత్రం అవసరం గాని విధంగా వాసు దేవ వృత్తిలో తదనుగుణంగా అహోబలపండితీయంలో నస్యాత్తద్ధర్మోత 2 అనే సూత్రానికి వ్యాఖ్యలు చేయబడి ఉన్నాయి సూత్రస్థ తద్ధర్మ పదానికి తద్ధర్మ క్రియ

---

సుఖనివాసంబగు విప్పురి అరణ్య 4 - 75
2 చింతా సంధి 6

చింతామణి స్వరూప స్వభావాలు కాల కర్తృత్వాలు

విశేషణం—రెండూ గ్రహించ దగిన అర్థాలని వాసుదేవుడు అహోబలపతి[2] అన్నారు

### పదమధ్య - అజ్లోపం

ఒక పదంమధ్య అజ్లోపాన్ని విధించేది ఈ క్రింది సూత్రం

బోరద్భుత శబ్దార్థే

అబ్బురము అనే శబ్దంలోని బు లోని ఉత్వం లోపిస్తుందని సూత్రార్థం

అద్భుతార్థ వాచకాంధ్ర శబ్దంబున నడిమి వ్రాత కొమ్ము చెడును నిలుచు
హరి ధరించె గేల నబ్రంపు గిరి యనఁ ద్రావె నబ్బురంపు ద్రవ మనంగ
(అప్ప 5— 00)

ఈ సూత్రం సంధిపరిచ్ఛేదంలో పోశ్చ తదాద్యర్థ వాచకేషూత అనే సూత్రానికి ముందుగా నిబద్ధమై ఉంది కాబట్టి స్థానం సక్రమంగానే కనుపిస్తుంది అప్పుడు మొదలైన పదాల నడిమి ఉకార లోపం చెప్పడాని కొక మాత్రమున్నట్లే అబ్బురము శబ్దంలో మధ్యోకారలోపం చెప్పడానికి మరొక సూత్ర మన్నమాట

ఈ సూత్రం చింతామణిలో ప్రక్షిప్త మని బాలసరస్వతీయ పీఠికలో[3] చర్ల నారాయణశాస్త్రిగారు అన్నారు గాని ఆమాట నిరాధారం బాలసరస్వతీయంలో గూడ ఈ జాతికి చెందిన సూత్రాలు కొల్లలుగా ఉన్నాయని సంధి పరిచ్ఛేదంలో 2 5 సూత్రాలు సాక్ష్యమిస్తున్నాయి కాగా అప్పకవీయంలోని ఈ సూత్రం దాని నిర్మాణాన్నిబట్టి చింతామణిలోనిది కాదని చేసే వాదం నిలబడదు

---

తద్ధర్మపదేన తద్ధర్మక్రియాజన్య విశేషణంచ గృహ్యతే

2 తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తజ్జన్య విశేషణంచ గృహ్యేతే

3 ఆంధ్రసాహిత్య పరిషత్ ప్రచురణ కాకినాడ 932

పై జాతికి చెందినదే క్రింది సూత్రం

6 వికృతిపదే రౌ టోరిం

తెలుగు పదంలో లు పరంగా ఉంటే టు లోని ఉత్వం ఇ ఒస్తుంది–అని సూత్రార్థం అప్పకవి వ్యాఖ్య

అవని శృంగ సహితమగు తృతీయాంతస్థమునకు డాపలించి తెనుఁగులందు
గల టకార శృంగములు పోవునుండు నిట్లనియె నిట్టులనియె ననఁగ గృష్ణ
(అప్ప 5–26)

ఇట్టులు - ఇట్లు వంటి శబ్దాల నిష్పత్తికి ఉద్దిష్టమైనది ఈ సూత్రం ఇటు వంటి రూపాలు దీనికి పూర్వ సూత్రంలో సాధించబడ్డ రూపం నలడాదే రంతరు తశ్చ అనే సూత్రానికి లక్ష్యాలుగా చేయవచ్చు - సూత్రంలోని ఆది శబ్ద మహిమను పురస్కరించుకొని లేకపోతే అనంతర సూత్రం అన్యేషాం చ ప్రయోగ మహితానామ్ అనేదానికి లక్ష్యాలుగా చూపవచ్చు కాని చింతామణి కర్త పదానికొక సూత్రం చేసె అలవాటు ఉన్నవాడు కాబట్టి దీనిని గూడ చేసి ఉండవచ్చు

ఇక చివరిదైన అధిక సూత్రం

6 తేషా మితశ్చ తద్వత్త్రివిక్రమ మతేన

పద మధ్యంలో న ర ల డ మొదలగు వర్ణాలమీద ఉండే ఇకారానికిలోపం కలుగుతుందని సూత్రార్థం అదీ త్రివిక్రమ మతానుసారంగ అని గూడ సూత్రం చెబుతుంది అప్పకవి వ్యాఖ్య

నడిమి నరడలకు గుడులేఁగునుండును ధరఁద్రివిక్రముని మతమునఁగొన్ని
పూన్కి కూర్మి కల్కి ఒడ్పి పూనిక గూరిమనుడు కలికి బుడిపి యనుచునిట్లు
(అప్ప 5– )

---

చింతా సంధి 42

పై సూత్రంలో తెలుగుపదాల నడిమి ఇత్వలోపానికి ప్రసిద్ధ ప్రాకృత వ్యాకర్త త్రివిక్రముని మతం పేర్కొనబడింది త్రివిక్రముని ప్రాకృత శబ్దాను శాసనంలో ఎక్కడా ఈ విషయంగాని ఈ విషయానికి సూచన గాని కనుపించవు ఈ సూత్రం బాలసరస్వతీయ సంధిపరిచ్ఛేదాంత్య సూత్రంతోనే గతార్థమౌతుంది గాబట్టి అనంతర వైయాకరణులచేత చింతామణి నుండి పరిహృతమై ఉండవచ్చు

ఇప్పటివరకు బాలసరస్వతి పుస్తకంలోలేనివి అప్పకవి పుస్తకంలో ఉన్నవి అయిన శ్లోకాలు 8 సూత్రాలు 6 పరిశీలించాం వాటిలోశ్లోకాలన్నీ (అప్పకవికిగల ఛందశ్శాస్త్ర పాండిత్యావిష్కరణకోసం) ప్రాచీన తెలుగు ఛందస్సులలోని పద్యాల సంస్కృతీకరణలే అని నిర్ణయించ గలిగాం

మిగిలినసూత్రాలు ఆరింటిలో మొదటిరెండూ అప్పకవికి పూర్వులైన ఆంధ్ర వ్యాకర్తల మతాల స్థాపనకోసం అప్పకవి కల్పించిన సూత్రాలని తేల్చగలిగాం తరువాతి సూత్ర మొకటి అప్పకవి వాఙ్మయ పరిశీలనకు ఫలితంగా ఏర్పడినదని తెలిసికొన్నాం తరువాతి సూత్రాలు మూడూ చింతామణి రచనా ప్రణాళికనుబట్టి పరిశీలించినపుడు చింతామణిలో ఉండదగినవే అనీ అయినా పునరుక్తులూ నిరర్థకాలూ కాబట్టి బాల సరస్వతి తరువాతి వారు వాటిని పరిహరించారని అప్పకవీయంలో మాత్రం అవి యథాతథంగా బహుశ ఛందస్సు కారణంగా నిలిచి ఉన్నాయని తెలిసికోగలిగాం

## విభిన్న సూత్రాలు

ఇక బాలసరస్వతీయ అప్పకవీయ చింతామణులు రెంటిలోను ఉండి భేదం కలిగిన సూత్రాల్ని పరిశీలిద్దాం

షట్ త్రింశదత్ర — బాలసరస్వతి సంజ్ఞ
సప్తత్రింశదిహ — అప్ప చిం వర్ణ

కగ చజ యుగ టడణ తదస పబమ యరలవ సహాళంతు హల్వర్గ
—బాలసరస్వతి సంజ్ఞ 8

కగ చజ యుగ టడణ తదన పబమ యరయుగ లయుగ వసహాళ్చ హల
— అప్ప చిం వర్ణ

అద్య క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం ఎనా సర్వ
—బాలసరస్వతి సంజ్ఞా 8
అద్య క్రియాసు భూతాద్యర్థ ఎమిద్ద్యోతినం ఎనా సర్వ
—అప్ప చిం వర్ణ

పై మూడు సూత్రాల్లో మొదటి రెండూ కేవలం తెలుగువర్ణ సమామ్నాయంలో అక్షరసంఖ్యను తద్వివరాల్ని చెప్పడంలో భేదిస్తున్నాయి బాలసరస్వతీయం 36 అక్షరాలంటే అప్పకవీయం 37 అంటున్నది ఆ ఒక్క అక్షరం శకటరేఫం దాన్ని అప్పకవి అక్షర సమామ్నాయంలోనిదిగా గుర్తిస్తే బాలసరస్వతీయంలో ఆ గుర్తింపులేదు కాబట్టి అప్పకవికి 37 అయిన అక్షరాలు బాలసరస్వతికి 36 అయినవి

ఇక్కడ మరొక అంశం చర్చనీయమే అప్పకవి రయుగము లయుగము తెలుగువర్ణాల్లో ఉన్నాయన్నాడు ఱఱ ళళ లు రెండేసి లఘ్వ లఘువులుగా సామాన్యంగా గుర్తిస్తాం అయితే అలఘువు లయిన రల లకు ప్రత్యేక వర్ణాలుగా గుర్తింపు ఉన్నదో లేదో పరిశీలించవలసి ఉంది అలఘు వర్ణాలకు ప్రత్యేక పరిగణన మున్నట్లయితే యవ లకు గూడ అలాంటి గుర్తింపు ఉండవచ్చు గదా

బాలసరస్వతి ఈ తగవు గురించే రేఫ లకారాలు రెండినీ సామాన్యంగా పేర్కొని భిన్న వర్ణంగా అంటే వర్ణాంతరంగా ళకారాన్ని నిర్దేశించాడు అంటే అతని అభిప్రాయంలో అలఘు వర్ణాలకు ప్రత్యేక పరిగణనలేదు అతడు నిర్దేశించిన ళకారం వర్ణాంతరమే గాని అలఘు లకారం గాదు తరువాత బాలవ్యాకర్త గూడ బాలసరస్వతి యొక్క ఈ అభిప్రాయాన్నే గౌరవించి ఆమోదించాడు

అప్పకవి మతాన్నిబట్టి అలఘులకారం ళకారం అభిన్నాలుగా అంగీకరించవలసివస్తుంది అలా అంగీకరిస్తే ఉచ్చారణ విధేయంగా చూచినపుడు దోషం లేదు- ప్రస్తుతకాలంలో ప్రాచీన లాక్షణికులు కేతనాదులు గూడ లకార ద్వైవిధ్యం (అలఘువు – వర్ణాంతరం) చెప్పలేదు ఈ రగడ అంతా మధ్యకాలంలో 6వ శతాబ్దిలో చింతామణి రాకతో దాని వ్యాఖ్యాతల వ్రాతలతో పుట్టి పెరిగిందే అనిపిస్తుంది

---

బాలవ్యా సంజ్ఞా 8వ సూత్ర వృత్తి

ఉచ్చారణలో ప్రత్యేకంగా కనిపించే చజల్ని వర్ణాంతరాలుగా స్వీకరించినట్లే గురు రలల్ని గూడ ప్రత్యేక వర్ణాలుగా అప్పకవీయ చింతామణీస్వీకరించినది దాని మతంలో గురు లకారానికి బాలసరస్వతి చెప్పిన లకారానికి భేదం లేదు ఇక భాషా చరిత్రనుబట్టి చూచినా ఒక ప్రత్యేకచరిత్ర గల శకటరేఫను వర్ణసమామ్నాయంలో ప్రత్యేకంగా పేర్కొని అప్పకవి మంచిపనే చేశాడు

ఇక మూడవ సూత్రం ఇరువురి గ్రంథాలలో భిన్నంగా ఉండటం కూడ ఆయా వ్యాఖ్యాతల స్వసిద్ధాంత ప్రతిపాదనార్థం జరిగి ఉంటుందని నిస్సందేహంగా చెప్పవచ్చు చింతామణిలో వ్యాఖ్యాతల సిద్ధాంత ప్రతిపాదన కోసమే ఏర్పడి ఉన్న సూత్ర సముదాయం కొంత పూర్వమే మనం గమనించాం

అప్పకవీయ సూత్రం ధూతాద్యర్థక క్రియల్లో కనుపించేది తప్ప మిగిలిన వాఙ్మయస్థ యకారం మొత్తం అకారంతో మాత్ర ముంటుందని చెబుతుండగా బాలసరస్వతీయ సూత్రం ధూతార్థక క్రియల్లోను పదాదిని తప్ప ఇతరత్ర వాఙ్మయస్థ యకారం మొత్తం అకారంతో ఉంటుందని చెబుతున్నది నిజానికి ఈ రెండింటిలో ఏది సరైన పాఠమో చింతామణి రచనా ప్రణాళికనుబట్టి సులభంగా కనిపెట్టవచ్చు చింతామణిలో పదాది యకార – అంగీకారం ఒక ముఖ్యవిషయం పదాదిలో యకారాన్ని అంగీకరించింది గాబట్టి ఆ అంగీకారంవల్ల కలిగిన దుష్ఫలితాన్ని తుడిచివేయడానికిమరొక సూత్రాన్ని నిర్మించింది చింతామణి అది సర్వత్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్య అనేది పదాదియకార అంగీకారంతో ఏర్పడిన యెవడు యెమ్మె వంటి పదాలు ద్రుతప్రకృతికాలకు పరంగా ఉంచే వాటిలో హల్లుతనం పోయి అచ్చుతనం మిగులుతుందని సూత్రార్థం కలిగెన్ + యెమ్మె అనేది కలిగెనెమ్మె గా అప్పుడు మారుతుంది కాగా చింతామణిలో సరైన పాఠం బాలసరస్వతీయంలోనిదే నని అప్పకవీయ పాఠం అతని సిద్ధాంత ప్రతిపాదకంగా మార్చబడిందని చెప్పవచ్చు

---

అద్య క్రియాసు–ఇత్యాది

2 చింతా సంధి–28

అభిప్రాయమొకటే అక్షరాలు వేరు

ఇక తాత్పర్యంలో భేదంలేకపోయినా రచనలో భిన్నంగా కన్పించే సూత్రాల పరిశీలనం చేద్దాం

వాయిరవుర్వ్రక్రతమౌ (బాల స అజంత 65)

అయిగవుగాదేశౌస్తః క్రమేణ సర్వత్ర వక్రతమయోర్వా (అప్ప చిం వర్ణ)

2 క్వచిద్గకారోవ (బాల స అజంత 67)

వాస్యాత్క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గ సరళస్య (అప్పచిం వర్ణ)

3 అపిశబ్దార్థస్యేత (బాల స సంధి 0)

అపిశబ్దేతో లుగ్వాస్యాత్ (అప్పచిం సంధి)

4 శబ్దాత్తచ్ఛబ్దాతః (బాల స సంధి 4)

శబ్దాత్తచ్ఛబ్దాతో లుక్ (అప్పచిం సంధి)

5 దారార్థేఽత ఉదపి ర (బాల స సంధి 34)

దారార్థేఽత ఉదపి రేఫస్స్వాత్ (అప్పచిం సంధి)

6 చౌరే రుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్ (బాల స సంధి )

ఉపధారేశ్చావితశ్చ లుగ్వాస్యాత్ (అప్పచిం సంధి)

7 నలడాదే రంతరుతశ్చ (బాల స సంధి 42)

పదమధ్య నరలడానా ముతశ్చ పూర్వప్రయోగ సిద్ధానాం లోపో వాస్యాత్ (అప్పచిం సంధి)

8 ప్రథమా వైభక్తిక మోర్బిమ్దళ్ళ మహాన్ పతిక్రియార్థేషు
(బాల స సంధి 6)

ప్రథమా వైభక్తిక మోర్లుక్ పూర్ణోవా పతిక్రియార్థేత్.
(అప్పచిం సంధి )

9 మోస్తువిభక్త్యేకవచనకే పుంపూ (బాల స సంధి 35)

తస్య సమాసే పుంపూ (అప్పచిం సంధి )

0 నుమ్యోత (బాల స సంధి 3 )

నుమ్యోతో హల్య ధర్వణాచార్యమతాత్ (అప్పచిం సంధి )

1 పరుషాణాం గసడదవాస్స్యు పదాద్ద్వంద్వే (బాల స సంధి 32)

హేమోక్తే పరుషాణాం గసడదవాస్స్యు పదాద్ద్వంద్వే
(అప్పచిం సంధి )

2 గసడదవా స్యు ప్రథమామాత్రా దాత్మా స్మదోర్విన్వై వైతే
(బాల స సంధి 28)

గసడదవా స్యు ప్రథమామాత్రా దాత్మా న్మదోర్వినాపరుషా
(అప్పచిం సంధి )

పై సూత్రాల భేదాన్ని ఒక్కొక్కటిగా వరుసగా పరిశీలిద్దాం మొదటి బాలసరస్వతీయసూత్ర ప్రకారమైతే అయి అవు ఐ ఔ లలో స్థానులేవో ఆదేశాలేవో స్పష్ట తెలియదు అప్పకవీయసూత్రం మాత్రం ఐ ఔ లకు అయి అవు లవుతాయని స్పష్టంగా చెబుతున్నది అయితే వ్యాఖ్యాతల వ్రాతలుమాత్రం ఐ ఔ లు స్థానులుగా అయి అవు లు ఆదేశాలుగా తెలియపరుస్తున్నాయి1 అప్పకవీయ సూత్రంలో పాదపూరణకోస మన్నట్లు క్రమేణ స్తు ఆదేశా అనే పదాలు

---

కాని అగుధాతువు అవు గా మారి ఎదప పై అవుతుంది–భాషాచారిత్రక దృష్టితో చూస్తే కాగా అయి–అవులు స్థానులు ఐ ఔలు ఆదేశాలూనూ

అధికంగా కనుపిస్తున్నాయి సర్వత్ర అనే పదం సార్థకమే అనిపిసుంది అచ్చ తెనుగులో ఐ ఔలు అయి అవులుగా అన్నిచోట్ల మారవచ్చు—నామవాచకాల్లోగాని క్రియల్లో గాని ఐదు—అయిదు ఔను—అవును

రెండవసూత్రం బాలసరస్వతీయ పాఠం అల్పాక్షరంగా ప్రాథమికం వలె కనుపిస్తుంది—అప్పకవీయ పాఠంతో పోల్చిచూచినపుడు బాలసరస్వతీయ వ్యాఖ్యానం పరిశీలించినపుడు అక్కడి ఉదాహరణ లన్నింట గకారం వకారం గావటం అనాద్యమైనపుడే జరిగినదని గమనించవచ్చు ఆ గమనికే అప్పకవి సూత్రంలో చోటు చేసికొన్నది అతని సూత్రమే అనంతరం అహోబలపతి ప్రవేశపెట్టిన అధర్వణకారికలో గూడ ప్రతిఫలించింది[1]

ఈ అప్పకవి సూత్రంలో ఆదిగతస్య అనేపదం బాలసరస్వతికి అనంతరం జరిగిన అభివృద్ధి గకారస్య అంటే సరిపోయే స్థలంలో ఆద్యవర్గ సరళస్య అని పెంచడం పాదపూరణకే

మూడో సూత్రం గూడ బాలసరస్వతీయమే సంగత మనిపిస్తుంది ఎని పదంలోని ఇత్వ లోపం చెప్పే సూత్రమిది తెలుగులోని ఎని ని అపిశబ్ద మనడం కంటె అపిశబ్దార్థ మనడమే సరి ఆలు శబ్దాన్ని దారార్థ శబ్దంతో సూత్రాంతరంలో చెప్పడం జరిగింది[2] అది సరియైన పద్ధతి అప్పకవి ఇంకా ఇతరత్ర అద్భుత శబ్దార్థే అంటూ బాలసరస్వతి తదాద్యర్థవాచకేషు అంటూ ఆయా పదాలని అచ్చ తెనుగులోని వాటిని సంస్కృతంలో వ్యక్తంచేసి ఉన్నారు ఈధోరణి బాలసరస్వతీయంలో గాని అప్పకవీయంలో గాని అప్రతిహతంగా సాగినదనలేమ శబ్దాత్ తచ్ఛబ్దాతః[3] అనే సూత్రంలో తచ్ఛబ్దాత్తునకే లుక్కు గాని తచ్ఛబ్దార్థానికి గాదు ఈ సూత్రం రెండు పుస్తకాల్లోనూ సమానంగానే ఉంది కాబట్టి ఉన్నంతలో స్పష్టత బాలసరస్వతీయంలో అధికమని అనగలమే గాని క్రమాక్రమాల సంగతి వస్తే ఇరువురి పాఠాల్లోనూ అవి ఉన్నట్లు కనబడుతుంది

---

1 చూ అధర్వణకారికల మూలపాఠాలు అనే ప్రకరణం

2 దారార్థేఽత ఉదపిరః — చింతా సంధి

3 చింతా సంధి 14

నాల్గో సూత్రంలో అప్పకవీయంలో ఉక్ పద మొకటి అధికంగా ఉండటం తప్పిస్తే భేదం లేదు రెండింటికీ రెండింటిలోను తచ్ఛబ్దార్థం అని ఉండవలసినది తచ్ఛబ్దమంటే తచ్ఛబ్దమే గాని తదర్థకమైన తెలుగుపదం అది అని అర్థం చేసి కోవడం కష్టం

ఐదో సూత్రంలో గూడ బాలసరస్వతీయంలో ర అని ఉంటే అప్పకవీయంలో రేఫ స్యాత్ అను అక్షరాలు అధికంగా ఉన్నాయి ఆ అక్షరాలు శ్లోకాల్లో సూత్రాన్ని ఇరికించడంలో అవసరమైనవే

ఆరోసూత్రంలో రెండు పాఠాల్లోను అక్షరాలు సమానమే కాని పదాలు భిన్నాలుగా ఉన్నాయి బాలసరస్వతీయంలో ఉపధాత్మన అని ఉంది ఇత అనేది పూర్వసూత్రం నుండి అనువృత్తమౌతుంది ఉపధా తరువాతి ఆత్మన్ శబ్దం నిరర్థకమే ఉపధ అంటేనే ఒక అక్షరానికి సంకేతం1 అయినపుడు పున తదాత్మకమైన ఇత్తు అనడం అనవసరం

అప్పకవీయంలో ఉపధారే అని ఉంది ఇతః అనేది గూడ సూత్రస్థమే చేయబడింది

ఏడో సూత్రం బాలసరస్వతీయం అల్పాక్షరంగా ఉంది పూర్వ సూత్రం నుండి వా పదాన్ని అనువృత్తం చేసికొంటె అప్పకవీయ పాఠసామర్థ్యం దానికి వస్తుంది

అప్పకవీయంలో పదమధ్య అనే నాల్గక్షరాల అర్థం బాలసరస్వతీయంలో అంత శ్శబ్దంతో సిద్ధిస్తుంది పూర్వప్రయోగసిద్ధానాం అనేపదం అప్పకవీయంలో అధికం అలాగే వా స్యాత్ అనే పదాలు గూడ అధికమే సూత్రాన్ని శ్లోకాల్లో ఇమడ్చవలసి రావడంతో ఈ అధిక పదాలు దొర్లి ఉండవచ్చు దానితో సూత్రానికి సూత్రత్వహాని ఏర్పడింది

ఎనిమిదో సూత్రం అప్పకవీయమే సక్రమంగా సమగ్రంగా ఉంది పడు ధాతువుకు పూర్వమున్న మువర్ణకానికి నిండు సున్నాను లోపాన్ని విధించే సూత్ర

---

అలోన్త్యాత్ పూర్వ ఉపధా పాణినీయం -1-65

మిది బాలసరస్వతీయంలో నిండుసున్న విహితమైనదే గాని లోపం గాలేదు కాని లోపాన్ని పూర్వ సూత్రంనుండి వికల్పంగా అనువృత్తం చేసికోవచ్చు

బాలసరస్వతీయంలో పూర్ణబిందువు అనడానికి మహాన్ బిందుః అనడం ఛందస్సౌకర్యం కోసమే లుక్పూర్ణోవా అని అప్పకవీయ మన్నచోటనే మహాన్ బిందుః అని బాలసరస్వతీయ మన్నది

బాలసరస్వతీయంలో పతిక్రియార్థేషు అని నిమిత్తం చెప్పబడగా అప్పకవీయంలో దాని ఏకవచన రూపం పతిక్రియార్థే అని చెప్పబడి పాదపూరణం కోసం చివర తు చేర్చబడింది అయితే బాలసరస్వతీయంలో గూడ పాఠాంతరంగా అప్పకవీయరూపం కనుపిస్తున్నది[1]

తొమ్మిదవ సూత్రం అప్పకవీయమే ఋజువుగా కనుపిస్తున్నది బాలసరస్వతీయం ప్రకారం ఏకవచన ము ప్రత్యయానికి పుంపు లవుతాయి గాని బహువచన ముగాగమానికి కావు ప్రథమావిభక్తి ము ప్రత్యయమని అప్పకవీయంలో పూర్వ సూత్రానువృత్తి జరిగినపుడు ముగాగమానికి పుంపు లెలావస్తాయని ప్రశ్నించవచ్చు సమాధానంగా విభక్తి నిమిత్తకమైన ఆగమం గాబట్టి ప్రయోగాలు కొల్లలుగా ఉన్నాయి గాబట్టి దానికి గూడ పుంపు లాదేశాలౌతాయని చెప్పవచ్చు బాలసరస్వతీయంలో సూత్రకర్త పనిగట్టుకొని ఏకవచనకే అనడం వలన అప్పకవీయంలో సాధ్యమైన సర్దుబాటు అక్కడ సాధ్యపడదు

ఈ సూత్రాల స్థలాలు రెండు పుస్తకాల్లో భిన్నంగా ఉండటం వలన గూడ సూత్రాల ఆకారాల్లో మార్పు వచ్చింది ఉదా - అప్పకవీయంలో ప్రథమావైభక్తిక మో రిత్యాది సూత్రానంతరం తస్యసమాసేపుంపూ అనే సూత్రం ఉంది కాబట్టి తస్య అంటే సరిపోయింది బాలసరస్వతీయంలో అలాగాక దారార్థేఽత ఉదపిరః అనే సూత్రం తర్వాత ప్రస్తుత సూత్రం నిలిచింది గాబట్టి విడిగా విభక్త్యేకవచన కేమోః అని చెప్పవలసి వచ్చింది ఈ సూత్రాల స్థాన పరిణామం చూస్తే బాలసరస్వతి—అప్పకవి పుస్తకాలు రెండూ ఒక మాతృకయొక్క భిన్నప్రతులే అయినా-

---

ఆంధ్ర సాహిత్య పరిషత్ ప్రచురణ కాకినాడ 98

వాటి రచనలో వ్యాఖ్యాతల జోక్యం చాల అధికంగా జరిగి ఉన్నట్లు సులభంగా గుర్తించవచ్చు

## అధర్వణ - హేమచంద్రులు

పదో సూత్రం అప్పకవీయంలోనిది అమాయకంగా కనుపిస్తున్నది తన కాలానికి అప్పకవి పరిశోధకుడే అయినా అతనికి వాఙ్మయచరిత్రలోని పూర్వాపరాలు తెలియవు అధర్వణాచార్యుడు నన్నయకు తరువాతివాడే నని వాఙ్మయచరిత్రకారులు నిస్సందేహంగా నిరూపించారు అయితే ఈ కాలవిరోధాలు ఇటీవల మనకు తెలిసి వచ్చినవి మాత్రమే కాబట్టి అప్పకవీయంలోని ఈ సూత్రం చింతామణి నిజ స్వరూపాన్ని తత్కర్తృత్వాన్ని కాలాన్ని కనుగొనడానికి ఒక ప్రాథమిక పరికరంగా ఉపకరించవచ్చు బాలసరస్వతీయంలో సుమ్నోత్తః అనేదే సూత్రంగా చెప్పబడి తరువాత అప్పకవీయంలోని హల్యథర్వణాచార్య మతాత్ అనే పంక్తి స్థానంలో పరుషాణాం గసడదవాస్యు పదాద్ద్వంద్వే[1] అనే సూత్రం ఉంచబడింది

పదకొండవ సూత్రం గూడ అప్పకవీయంలోనిది పై తరగతికి చెందినదే. బాలసరస్వతీయంలో కంటె ఇందులో హేమోక్తః అనే పద మొకటి అధికంగా ఉంది ద్వంద్వ సమాసంలో పదముమీది పరుషాలకు గసడదవలు విధించేసూత్రమిది హేమచంద్రుని కథనం ప్రకారం ఆవిధానం జరిగినదంటుంది అప్పకవి సూత్రం బాలసరస్వతీయంలో హేమోక్తః అనే పదం కనబడదు హేమచంద్రుడు సుప్రసిద్ధ ప్రాకృత వ్యాకర్త

బాలసరస్వతీ అప్పకవీ ప్రాకృత భాషల్లో గూడ పండితులైనవారని వారి పుస్తకాలే సాక్ష్యమిస్తున్నాయి ప్రాకృతం గూడ సంస్కృతం లాగానే తెలుగుకి మూలమని చింతామణి చెప్పింది పైగా అప్పకవి తెలుగు కూడ ఒక ప్రాకృతమే అన్నాడు[2] అయినపుడు తెలుగు వ్యాకరణంలో ప్రాకృత-వ్యాకర్తల నామస్మరణం సంగతమని ఉన్నదున్నట్లు అప్పకవి ఉంచి ఉండవచ్చు

---

1 సంధి 32

2 అప్ప -75

ప్రాకృతం తెనుగుకంటె ప్రాచీనమే గాని దాని వ్యాకర్త హేమచంద్రుడు నన్నయకు నిస్సందేహంగా తరువాతివాడు హేమచంద్రుడు 2వ శతాబ్దిలోను, త్రివిక్రముడు 3వశతాబ్దిలోను ఉన్నట్లు ప్రాకృతభాషా పరిశోధకులు నిర్ణయించారు1 అయినపుడు అప్పకవీయ చింతామణిలో ఈ ఇరువురి పేర్లూ ఉండటం కాలవిరోధ మౌతుంది పైగా చింతామణిలో పై ఇరువురి వ్యాకరణాల అనుకరణలు వారి సూత్రాల సమన్వయం చాలచోట్ల కనుపిస్తున్నది ఈ పరిస్థితుల్లో అప్పకవీయంలో కనుపించే ఈ ప్రాకృత వ్యాకర్తలపేర్లు ఎవో యాదృచ్ఛికాలనిగాని కేవలం అప్ప కవి పొరబడి కల్పించినవని గాని త్రోసివేయడానికి వీలులేదు ఈ పేర్ల వెనుక కొంత చరిత్ర చింతామణి కాలకర్తృత్వ నిర్ణయానికి ఉపకరించేది ఉన్నట్లు తెలిఎకో వచ్చు

బాలసరస్వతీయ అప్పకవీయ సూత్రాల్లో ఉన్న భేదాల్ని వింగడించి చూశాం ఇంతేకాకుండ సూత్రాలస్థానాలు గూడ రెండు పుస్తకాల్లో విభిన్నంగా ఉన్నాయి బాలసరస్వతీయంలో సంజ్ఞా పరిచ్ఛేదంలో ఉన్న సూత్రం ఒకటి2 అప్పకవీయంలో సంధి పరిచ్ఛేదంలో ఉంది అలాగే అప్పకవీయంలో సంధి పరిచ్ఛేదంలోనివిగా ఉన్న సూత్రాలు బాలసరస్వతీయంలో హలంత అజంత పరిచ్ఛేదాలలో కను పిస్తున్నాయి3

---

R P sche – Comparat ve Gran mar of Prakr t Langua- ges

2 కళా నిర్వచనం చేసే తిజ్మద్యేత్యాది సూత్రం

3 కవిభల్లపై క్రియాణాం నామ్నా ముల్లోప ఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే
(అప్ప సంధి శ్లో )

—పైది— (బాల స హలంత 23)

వాస్యాత్క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గసరళస్య
(అప్ప చిం సంధి 0 శ్లో )

క్వచిద్గకారోవః (బాల స అజంత 67)

### ఫలితార్థం

పై పరిశీలనం వలన చింతామణికి బాలసరస్వతీయ అప్పకవీయ పాఠభేదాలు అధికంగా ఉన్నాయని కొన్ని సూత్రాలు పరస్పరం విరోధించేవిగా ఉన్నాయనీ గ్రహించగలిగాం కొన్ని సూత్రాలు మాత్రం అప్పకవి వ్యాఖ్యానానికి సాధనాలూ ఆతని పూర్వ లాక్షణికుల తెలుగు పద్యాల సంస్కృతీకరణలే అని గూడ తెలిసికో గలిగాం

చింతామణి పాఠాలు సంస్కృతంలో రచన చేయగల వారి హస్తకౌశలానికి గురై మార్పులు చేర్పులు చెంది ఉండవచ్చునని పైన జరిపిన పరిశీలనం వలన అవగతమవుతుంది

అప్పకవీయంలోని ప్రాకృత వ్యాకర్తల పేర్లు చింతామణి కర్తృత్వాన్ని నన్నయ నుండి వేరుచేసి దాని కాలాన్ని గూడ రెండు మూడు శతాబ్దాల ముందుకు త్రోసివేసినట్లు గూడ గమనించ గలిగాం

## చింతామణి కల్పించిన సంజ్ఞలు

చింతామణిలోని రచనా ప్రణాళికకు ఒక సౌలభ్యాన్ని కోరి తత్కర్త కొంత సంజ్ఞా కల్పనం చేశాడు ఈ సంజ్ఞలు అధికంగా సంజ్ఞాపరిచ్ఛేదంలోను అల్పంగా క్రియా పరిచ్ఛేదంలోను అల్పాల్పంగా ఇతర పరిచ్ఛేదాల్లోను ఉన్నాయి

*సంజ్ఞాపరిచ్ఛేదంలో*

నామ1 2 వర్ణక 3 క్రియా 4 ప్రాణా 5 బిందుః

---

ప్రాతిపదికం హి నామ ప్రత్యయ ఇహ వర్ణక క్రియా ధాతు
ప్రాణాస్సమాసతోఽచ బిన్దు రనుస్వార ఏజధో వక్ర

చింతా సంజ్ఞా— 0

వక్రతమ ఐచ్ హలస్స్వ స్సమాసతో ప్రాణిన ద్రుతాఖ్యోన
కచటతపా పరుషాఖ్యా గజడదబాస్తు సరళా స్థిరా ఇతరే —పైది—

6. వక్రః 7 వక్రతమః 8 ప్రాణిన 9 దృతః 0 పరుషా
సరళాః 2 స్థిరాః 13 కళా 14 దృతప్రకృతయః[1]

క్రియా పరిచ్ఛేదంలో

ఉపకృతిః 2 పరిణతిః 3 సంవృతిః[2] 4 తద్ధర్మార్థక [3]

అజంత పరిచ్ఛేదంలో

1. మహత్[4] 2 అమహత్[5] 3 అమహతీ[6]

హలంత పరిచ్ఛేదంలో

సమాసకం[7]

---

తిఙ్మధ్య శేషష్ఠ సుప్కర్మ ప్రవచనీయజ విభక్తి
కించిత్ ప్రశంసనాద్భుత సంతాప యదాతదా కిమేవాంశ్చ
క్వాకిల తూష్ణీ మాద్యా నభిదధతి కళాద్రుతో న యేషాం స్యాత్
అన్యే ద్రుతప్రకృతయ యేస్యు అను జీవితద్రుతా నిత్యమ్–పైది– 3 4

2 ఉపకృతి పరిణతి సంవృతి భేదాత్ త్రివిధా క్రియా
చింతా–క్రియా—

3. తద్ధర్మ వర్తమానాతీతా గామ్యర్థకా క్రియా జ్ఞేయా చింతా క్రియా—9

4 త్రపరు జడాన్ వినాన్యే మహదాఖ్యా చింతా అజంత—9

5 స్యాదమహతాం విభక్తౌ సోళ్ళము చింతా అజంత—35

6 ఉభయవిభ షుమహతీనాం చింతా అజంత—60

7 కేవల వికృతిపదైః యస్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః
చింతా హలంత—46

సంధి పరిచ్ఛేదంలో

ఔపవిభక్తిక 1  2 వికృతిః2

ప్రాతి పదిక

వీటిలో నామ సంజ్ఞ ప్రాచీన కాలంలో యాస్క నిరుక్తంలో ప్రయుక్త మైనదే 3 నామమంటే ప్రాతిపదిక ప్రాతిపదిక పదానికి పూర్వరూపం ప్రాతిపదికకూ పదానికీ సంస్కృతంలో భేదం సుస్పష్టంగా కనిపిస్తుంది పైగా సంస్కృతంలో ప్రాతిపదిక ప్రయోగాని కనర్హం అపదం న ప్రయుంజీత అనే నిషేధం దానికి కారణం తెలుగులో పద సముదాయంలో ఎక్కువభాగం ప్రథమా-ఏకవచన ప్రత్యయం లేకుండా ఉండడంతో ప్రాదిపదిక పద విభాగం అంతస్పష్టంగాతెలియరాదు కాని చింతామణి మార్గాన యాయి వ్యాకర్తలు సంస్కృత వ్యాకరణ మర్యాద ననుసరించి తెలుగు పద జాలంలో కూడ ప్రాతిపదిక పద విభాగం చొప్పించి చూపారు ఉదా — రామ—ప్రాతిపదిక రాముడు- పదం కాని అచ్చతెనుగు పదాలు తల్లి తండ్రి గోడ మేడ వంటి వాటిలో ప్రాతి పదిక మేది? పద మేది?

ఈ ప్రాతిపదిక ను పాణినీయం నిర్వచించి చూపింది4 దాని నిర్వచనాన్ని బట్టి ప్రాతిపదికకు అర్థ ముండాలి అది ధాతువు కాకూడదు ప్రత్యయం కాకూడదు ఆ స్థితిలో దానికి- ప్రత్యయం చేరి తరువాత పదంగా ఏర్పడుతుంది ఇదిః ప్రాతి పదిక లక్షణం చింతామణి ఈ లక్షణాన్నే నామ సంజ్ఞతో చెప్పింది

కాని చింతామణి ఈ పదాన్ని ప్రాతిపదికార్థంలోనే కాక పదమనే అర్థంలో కూడ ప్రయోగించినట్లు కనుపిస్తున్నది

---

1 ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణా టింట్వాదయో భవన్తీహ చింతా సంధి 39

2 నవికృతి శబ్దాత్ పరత సాంస్కృతికానాం భవన్తి గసడదవాః చింతా సంధి—24

3 నామాఖ్యాతోపసర్గ నిపాతాశ్చ (యాస్కనిరుక్తః నస్తపాదీ 1—1)

4 అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికం—పాణిని— —2—45

కవిఖలభై క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు
(చింతా–హలంత—23)

ఉదా - చూతుర్ చూతురు–క్రియ పేరు + వాడి=పేర్వాడి–నామం

పై ఉదాహరణల్లో చూతురు పేరు–వంటివి క్రమంగా క్రియలుగా నామాలుగా చూప బడ్డాయి కదా చూతురు అనేది సంపూర్ణ క్రియాపదం అలాగే పేరు కూడ ప్రథమాంతమైన పదమే అయినపుడు సంస్కృతంలోలాగ ధాత్వర్థంలో క్రియాపదాన్ని ప్రయోగించ కుండా ఉండడంజరగలేదని చింతామణి ప్రయోగం, నామ పదానికి సంబంధించికూడ సంస్కృతంలో లాగ ప్రాతిపదికార్థంలో సాంకేతికంగా జరగలేదని స్పష్టమవుతుంది

అలా కాకుండా యాస్క నిర్వచనాన్ని ( భావ ప్రధాన మాఖ్యాతం సత్వ ప్రధానాని నామాని ) బట్టి చూస్తే చింతామణి వ్యవహరించిన తీరు సరిపడవచ్చు కాని పనిగట్టుకొని స్వయంగా చింతామణి ధాత్వర్థంలో క్రియాపదాన్ని వాడుతున్నట్లు చెప్పడంవలన ఈ విరోధం ఏర్పడింది

వర్ణకం

ప్రత్యయాన్ని వర్ణకం గా చెప్పడంవలన సిద్ధించిన ప్రత్యేక ప్రయోజనం కనబడడం లేదు వర్ణం–వర్ణకం అనే ఏర్పాటు సమాసం–సమాసకం అనే పద బంధాలతో పోల్చిచూస్తే బొత్తిగా కుదరదు వర్ణం కంటె వర్ణకం పెద్దది సమాసం కంటె సమాసకం పెద్దదనలేం ఇటువంటి సంజ్ఞలు ప్రాకృత వ్యాకరణాలలో కనబడవు

ధాతువును క్రియగా పేర్కొనడంవలన కలిగిన లాఘవంగానీ ఇతర ప్రయోజనంగాని లేకపోగా ఒక అవ్యవస్థకు అది దారితీసింది సంస్కృతంలో ధాతువుకి క్రియకు భేదముంది తెలుగులోకూడ ఆభేదం ఒక్కచోట తప్ప ఇతరత్ర కనిపిస్తూనే ఉంటుంది ఆ ఒక్క చోటు తద్ధర్మార్థకంలోని ప్రథమా ఏకవచనం దానిలో చదువు -వంటి ధాతువే చదువు అనే క్రియగా వాడబడుతుంది అప్పు

---

యాస్కనిరుక్తి – –

దైనా దానికి చివర నకార మొకటి చేరి చదువును – వంటి రూపం ఏర్పడుతుంది చివరి వర్ణం ద్రుతం కాబట్టి అవసరం లేకుంటే కరిగి పోతుంది మిగిలినచోట్ల క్రియకు ధాతువుకూ కావలసినంత భేదం ఉంది అయినపుడు ధాతువుకు క్రియా సంజ్ఞను కల్పించడం ఏ ప్రయోజనాన్నీ సాధించకపోగా అనర్థాన్ని తెచ్చిపెట్టినట్లు అవుతుంది బహుశ అది గమనించే కావచ్చు అనంతర వ్యాకర్తలెవరూ ఈ సంజ్ఞను స్వీకరించలేదు ముఖ్యంగా చిన్నయసూరి దీన్ని విడిచిపుచ్చటం గమనించ దగ్గ విషయం

### ప్రాణం-ప్రాణి

అచ్చులు ప్రాణాలుగా సంజ్ఞితాలైనాయి హల్లుల ఉచ్చారణలో వీటి అవస రాన్ని గమనించి చేసిన సంజ్ఞ కావచ్చు లేక స్వతంత్రోచ్చారణగల వర్ణాలని తెల్ప డానికి చేసిన సంజ్ఞ కావచ్చు అచ్చుల్ని తమిళంలో (తొల్కాప్పియంలో) ఉయిర్ అంటారు ఆ సంజ్ఞ మన ప్రాణసంజ్ఞతో అర్థంలో సమానం కావచ్చు అలాగే తమిళంలో హల్లుని ఉయిర్ మెయ్ అంటారు అది మన ప్రాణిసంజ్ఞతో తుల్యం కావచ్చు

హల్లులు ప్రాణులుగా చెప్పబడడం ప్రాణసంజ్ఞా కల్పనంతో సంబంధించిన విషయం అచ్చు ప్రాణం కాబట్టి దానితో కూడిన హల్లు ప్రాణి ప్రాణ శబ్దమొకటి ప్రయుక్తమై ఉంది గాని చింతామణిలో ప్రాణి శబ్దానికి ప్రయోగమే లేదు అచ్చు లకి హల్లులకి స్వరవ్యంజన సంజ్ఞలు సార్థకంగా పూర్వమే సంస్కృతవ్యాకరణ ప్రోక్తంగా ఉన్నపుడు తిరిగి వాటికి మూడవ పేరు పెట్టడం చింతామణి ఎందుకు చేసిందో తెలియదు

### బిందువు

అనుస్వారాన్ని బిందువుగా చెప్పడం లేఖన క్రమాన్ని గుర్తించి జరిగింది బహుశ సున్నకు సంస్కృతీకరణమే బిందువు కావచ్చు ఈ బిందు శబ్దాన్ని

శేతనలో కూడ చూడవచ్చు1 తరువాతి కేతన మార్గానుయాయు లందరూ దీన్ని ప్రయోగించారు ప్రసిద్ధ ఛంద కర్త అనంతుడు కూడ బిందుశబ్ద ప్రయోగాన్ని చేశాడు2 పూర్వప్రకరణంలో అప్పకవీయ వర్ణపరిచ్ఛేదాన్ని పరామర్శించే సందర్భంలో చింతామణి ఛందో దర్పణానికి తరువాతి రచన అని నిర్ణయించడం జరిగింది దాన్ని బట్టి అనుస్వారానికి బిందు సంజ్ఞా కల్పనం కూడ చింతామణి అర్వాచీనతను పట్టి ఇస్తున్నట్లు తెలిసికోవచ్చు చింతామణినుండే కేతనాదులు ఈ సంజ్ఞను స్వీకరించి ఉండవచ్చునని శంకించడం పొసగదు చింతామణికి కర్తగా శంకితుడైన బాల సరస్వతి కేతన పెద్దన అనంతులను ఎరుగునే గాని వారు చింతామణిని గాని బాల సరస్వతిని గాని ఎరిగి ఉంటారనడం అవాస్తవికం కదా 3

తెలుగులో అనుస్వార లేఖనం ప్రాచీన కాలంలో వర్గ పంచమాక్షరాలతో కూడ జరిగేదని ఆ ఆచారం తరువాత పలుచబడి బిందు లేఖనం ప్రబలినదని విజ్ఞు లంటారు వర్గ పంచమాక్షర స్థానాన్ని శాశ్వతంగా బిందువు ఆక్రమించిన తరువాత మాత్రమే ఈ సంజ్ఞా కల్పనం తద్ద్వారా చింతామణి రచన జరిగి ఉంటాయని భావించవచ్చు

ఏ ఓ లు వక్రాలుగా ఐ ఔ లు వక్రతమాలుగా ఎలువబడ్డాయి ఈ వక్ర త్వం లిపిదా? ఉచ్చారణదా? వివేచించాలి ఈ వక్ర శబ్ద వ్యుత్పత్తిని మొదట ప్రతిపాదించుకున్నవారు కందుకూరు వీరేశలింగంగారు ఆయన తన సంగ్రహ వ్యాకర ణంలో వంకరగా మిక్కిలి వంకరగా ఉండటంవలన వీటికి వక్ర వక్రతమ సంజ్ఞ

---

1 తలచల తుది హల్లులకున్ బిలుఁదన్నెలకొన్న యట్టి బిందువులెల్లన్
నెలయఁగ నూఁదుచుఁదేలుచు నొలపై యిరుదెల ఁజెల్లుచుంగున్ గృతులన్
(ఆం భా భూ )

2 పేర్చి పొల్లనకారంబు బిందువగుచు మీఁద నున్న ధకారంబునూదఁ బ్రాస
బంధమగుఁ గృష్ణుదుదయించినం ధరిత్రియంతయును నిరుపద్రవంబయ్యెననఁగ
(ఛందోద— —౯ )

3 చూ చింతామణికి మూలసారాలు అనే ప్రకరణం

లేర్పడినట్లు చెప్పారు[1] దూసి రామమూర్తి శాస్త్రిగారు తమ బాలవ్యాకరణ వ్యాఖ్యానంలో పై వ్యుత్పత్తినే సమర్థించారు కాని డా బొడ్డుపల్లి పురుషోత్తం ఈ అభిప్రాయంతో విభేదిస్తున్నారు ఉచ్చారణలోని వక్రతను తెలపడానికి ఈ సంజ్ఞ ఏర్పడినట్లు ఆయన భావిస్తున్నారు[2] ఉచ్చారణలో వక్రత్వాన్ని నిరూపించడం కష్టసాధ్యమైన పని

చింతామణి రచనా ప్రణాళికనుబట్టి చూస్తే ఈ సంజ్ఞా కల్పనం అనవసరమనిపిస్తుంది చింతామణిలో ఎక్కడా వక్రసంజ్ఞతో ఏ ఓ లు ప్రయుక్తం కాలేదు వక్రతమ సంజ్ఞ మాత్రం ఒక్కచోట ప్రయోగించబడింది[3] తన రచనలో ఎక్కడా అవసరమే కాని సంజ్ఞను కల్పించడం దేనికి?

నకారానికి ద్రుతసంజ్ఞ ఈసంజ్ఞను వక్ర వక్రతమ సంజ్ఞల్ని ప్రాణ ప్రాణి సంజ్ఞల్ని చేసినది గాబట్టి చింతామణి తదుపజీవ్య గ్రంథం వికృతివివేకంగా అహోబలపతిచేత పిలువబడిన కారికల సంపుటి చింతామణి వ్యాఖ్యానాలు తప్ప బాలసరస్వతికి తరువాత చిన్నయసూరి వరకు తెలుగు వ్యాకరణాలేవీ స్వీకరించలేదు

## వ్యుత్పన్న సంజ్ఞలు

చింతామణి కల్పించిన సంజ్ఞల్లో వ్యుత్పత్తి ప్రస్ఫుటంగా కనిపిస్తుంటుంది ద్రుతమంటే ద్రవించేది కొన్ని పదాల చివర వచ్చే నకారం కొన్ని అక్షరాలకు పూర్వంగా ఉండేటప్పుడు మారుతుంది లేక లోపిస్తుంది[4] ఆ విషయాన్ని స్ఫురింపజేయడానికా అన్నట్లు ఈ సంజ్ఞ చేయబడింది

ఈ సంజ్ఞమీద ఏర్పడినదే ద్రుతప్రకృతిక సంజ్ఞ న్నాంత పదమని దాని అర్థం చింతామణి కల్పించిన ఈసంజ్ఞలోక్రంతె నాంతము అనే పదంలోనే లాఘవ

---

1 సంగ్రహ వ్యా వర్ణ 4 సూ

2 తెలుగు వ్యాకరణ వికాసం పుట 8

3 చింతా అజంత 65

4 పూచెన్ + కలువలు=పూచెంగలువలు— మార్పు తోచెన్ + రవి=తోచెరవి— లోపము

ముంది అయితే నాంతము అనేది విశేషణంగా ఉంది కాబట్టి నాంత పదములు అని చెప్పవలసి వస్తుంది[1] కేతనాదులు ద్రుతప్రకృతిక సంజ్ఞకు బదులుగా నాంత శబ్దాన్నే ప్రయోగించారు

దీనికి వ్యతిరేకమైనది కళ పదం చివర నకారం లేకపోతే కళ అన్నమాట ఇతర వ్యాకర్తలెవరూ ఈ సంజ్ఞను స్వీకరించలేదని ముందే తెలిసికొన్నాం అయితే తెలుగుపద సముదాయం మొత్తాన్ని రెండుగా చీల్చడం – కళా ద్రుత ప్రకృతిక విభాగంతో చింతామణి సంప్రదాయంగా గుర్తించవచ్చు అంతకుముందు అంత సుస్పష్టమైన వింగడింపు తెలుగు వ్యాకరణాల్లో జరగలేదనే చెప్పాలి ఈ విభాగం తెలుగు భాషకు సహజమే అయినా దానికొక ప్రాముఖ్యాన్ని కల్పించడం చింతామణి చేసిన పని కాని కళా శబ్ద ప్రయోగంతో విహితమైన వ్యాకరణ కార్యమేదీ చింతామణిలో కనుపించదు కాగా అది కేవలం పదసర్వస్వ విభాగం కోసమే చేయబడిన సంజ్ఞ

వర్గ ప్రథమాక్షరాలు (కచటతప) పరుషాలు బహుశ వర్గ తృతీయాక్షరాలు (గజడదబ) సరళాలుగా పేర్కొనబడ్డాయి గాబట్టి వీటికి పారుష్యం కలిగిందని ఊహించవచ్చు క కంటె గ ఉచ్చారణలో మార్దవముంది హల్లులన్నింటిని తీసికొని నాల్గింటిని పరుషాలుగా మరొక నాల్గింటిని సరళాలుగా పేర్కొని మిగిలిన వాటి నన్నింటినీ స్థిరాలు అని పిలిచింది చింతామణి ఈ సంజ్ఞ లన్నింటినీ ప్రక్రియా సౌలభ్యంకోసం ప్రయోగించడంకూడ జరిగింది ఈ సంజ్ఞా కల్పనంవలన అల్ప లాఘవం కొన్నిచోట్ల అనల్ప లాఘవం మరికొన్ని చోట్ల కనబడుతుంది పరుషా అనడానికి కచటతపా అనడానికంటె ఏకమాత్రా లాఘవం కనబడుతుంది అలాగే పరుష సరళాలు వినా మిగిలిన హల్లులన్నింటిని స్థిర శబ్దంతో రెండక్షరాల్లో చెప్పడం పెద్ద లాఘవమే అవుతుంది ర్ణాంతర సంయోగం వలన మార్పు చెందవు గాబట్టి వాటికి పెట్టిన పేరు కూడ సార్థకంగానే ఉంది

---

నాంతంబైన పదంబుల పొంతన్ బైనున్న శబ్దములు కచటతపల్
దొంతి గజడదబలగు న య్యంత నకారమగు సున్న యభినవ దండీ
(ఆం భా భూ 64)

## చింతామణి స్వరూప స్వభావాలు కాల కర్తృత్వాలు

చింతామణి కల్పించిన పై సంజ్ఞలు అన్నింటిలో ద్రుత ద్రుతప్రకృతిక కళా పరుష సరళ స్థిరాలు లాఘవంతో సార్థక్యం కలిగి ఉన్నట్లు తెలుస్తోంది చిన్నయ సూరి బాల వ్యాకరణంలో ఆయనకు సమీప సమ కాలంలోని ఇతర వ్యాకర్తలు తమ వ్యాకరణాల్లో వీటిని స్వీకరించేవరకు తెలుగు విద్యార్థులు చాలమందికి ఈ సంజ్ఞలు ఉన్నట్లే తెలియదంటే అతిశయోక్తి కాదు 1

క్రియాపరిచ్ఛేదంలో సంస్కృత ధాతువులు తెలుగులో స్వీకృతాలై పొందే మార్పులు చెప్పడానికి మూడు సంజ్ఞలు కల్పించ బడ్డాయి అవి సోదాహరణంగా ఇవి —

| | 2 | | 3 |
|---|---|---|---|
| ఉపకృతి | — పుష ణు | — మొదలయినవి | — పోష నుతి |
| పరిణతి | — భూ జీ | — మొదలయినవి | — భవ జయ |
| సంవృతి | — రంజ వస | — మొదలయినవి | — రంజ వస |

ఇక్కడ ఈ సంజ్ఞలు లేకపోతే ప్రక్రియ కుదరదని గాని సౌలభ్యం తగ్గుతుందని గాని అనలేము పుషాదులు కృదంతాలు భ్వాదులు అయవర్యుక్తాలు రంజాదులు యథాస్థితంగా స్వీకరించవచ్చునంటే సరిపోతుంది స్వీకార్య ధాతువుల్ని మూడు గణాలుగా విభజించడం ఈ సంజ్ఞాకల్పనం వలన తప్పిపోవడం లేదు అయినపుడు అదనంగా ఈ సంజ్ఞలేల ? బహుశ అందువలననే కావచ్చు బాల వ్యాకర్త ఈ సంజ్ఞల్ని పరిత్యజించడం జరిగింది

### తద్ధర్మ సంజ్ఞ

క్రియాపరిచ్ఛేదంలోని మరొకసంజ్ఞ తద్ధర్మార్థం దీన్ని చింతామణి సంజ్ఞగా పేర్కొనలేదు నిజానికి వర్తమానము భూతము భావి వలె అది ఏకకాల వాచిగా కాక త్రికాలవాచిగా పేర్కొనబడింది కాని దాని నిర్వచనం చింతామణి చేయలేదు

---

1. చూ అనంతర వ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం అనే ప్రకరణం

చింతామణినిర్మాణ రహస్యం తెలిసిన బాలసరస్వతిమాత్రం ధాతోర్ధర్మ యితి ప్రోక్తా విశ్రుతౌ పూర్వ సూరిభి క్రియా త్రయీ గోచరార్థస్తద్ధర్మ ఇతి కథ్యతే అని నిర్వ చించి క్రను విను వోవు ఇటువంటిది తద్ధర్మార్థము-అని వివరించాడు చింతామణికి బృహద్వ్యాఖ్యానం వ్రాసిన అహాబలపతి కూడ ధాత్వాద్యర్థాల కంటె భిన్నంగా స్వార్థంలోమాత్రం ప్రయుక్తమైంది తద్ధర్మమని వివరించాడు బాలవ్యాకర్త తద్ధర్మ పదానికి తాచ్ఛీల్య సాతత్య సంప్రశ్నాదుల్ని జోడించి తద్ధర్మాదులందు లాట్టగు అని సూత్రించాడు దానితో తద్ధర్మ పదానికి స్పష్టార్థాన్ని కల్పించిన వాడయ్యాడు తద్ధర్మమనేది ఒక కాలవాచకం గాదని క్రియయొక్క స్థితిగతుల్ని తెలిపే తాచ్ఛీల్యాదులవంటిదని సూరి వ్యాఖ్యానించినట్లయింది ఈ సంజ్ఞకూడ చింతామణి పరిధి లోని వ్యాకరణాల్లోతప్ప ఇతరత్ర కనుపించదు

పై వివరించిన సంజ్ఞలేకాక మరికొన్ని సంజ్ఞలుకూడ ఆయా పరిచ్ఛేదాల్లో చింతామణి కల్పించినట్లు ముందు అనుకున్నాం అవేవో పరిశీలిద్దాం

సంధిపరిచ్ఛేదంలో ంటి మొదలయిన వాటికి ఔపవిభక్తిక సంజ్ఞ ఒసగ బడింది ప్రాతి పదికకు విభక్తికి మధ్య అదనంగా చేరే కొన్ని అక్షరాలకి ఈపేరు పెట్టబడింది చింతామణిలోని ఇతరసంజ్ఞలలాగానే ఇదికూడసార్థకంగా కనుపిస్తుంది విభక్తి కారణంగా దానిముందు చేరే అక్షరాలు గాబట్టి వాటి కాపేరు తగి ఉంది

మిగిలిన అన్ని సంజ్ఞల వలెనే ఇదిగూడ ఇతర వ్యాకర్తలచే ఉపేక్షితమైంది చిన్నయసూరి కాలం వరకు

## వికృతి

చింతామణి చేయక చేసిన సంజ్ఞల్లో వికృతి ఒకటి తెలుగు అనే అర్థంలో ఇది ప్రయుక్తమైంది తెలుగు వ్యాకరణాల్లో చింతామణి పరిధిలోని గ్రంథాల్లో తప్ప 19వ శతాబ్దికి ముందుగాని వెనుకగాని ఇది కన్పించదు బాలసరస్వతికి తరువాతి లాక్షణికులు సైతం ఈ పదప్రయోగం చేయలేదు చింతామణి సంజ్ఞా ప్రకరణంలో

---

ఈ వివరణం వావిళ్ళవారి ప్రతిలో ( 97 ) లేదు ఆంధ్రసాహిత్య పరిషత్ ( 932) ప్రతిలో ఉంది

తెలుగు సంస్కృత ప్రాకృతాల వికారమని చెప్ప తరువాత అచ్చతెనుగు అనే అర్థంలో వికృతి శబ్దాన్ని ప్రయోగించి అటుతరువాత తెనుగు భాషకే పర్యాయంగా దాన్ని ప్రయోగించింది

కేతన కాలానికి తెలుగు సంపూర్ణంగా సంస్కృతజన్యమని పండితులు అనుకున్నట్లు రుజువులేదు[4] పై తెలుగు సంస్కృత ప్రాకృతాల వికారం అనేభావం ప్రాకృతాధ్యయనం అధికంగా చేస హేమచంద్ర త్రివిక్రముల సూత్ర రచనల్ని తెలుగు పండితులు పుణికిపుచ్చుకున్న బాలసరస్వతికాలంలో కలిగి ఉండవచ్చు గాని ఏ శతాబ్దికి తెలుగునుగూర్చి అట్టి భావముండి ఉండేదని అనడానికి ఆధారం లేదు కాగా తెలుగుకి వికృతి అనేపేరు 16వ శతాబ్ది తరువాతిదిగా గ్రహించవచ్చు

## మహత్తు - అమహత్తు

అజంత పరిచ్ఛేదంలో మహత్ మహతీ అమహత్ అమహతీ సంజ్ఞలు చేయబడినాయి శబ్దజాలంలో స్త్రీ పశు జడ వాచకాలు వినా మిగిలినవి మహదాఖ్యలని చింతామణి నిర్వచనం ఈ నిర్వచనంలోనే అమహత్తులు కూడ నిరుక్తాలైనట్లు చింతామణి భావించింది ఈ సంస్కారంతోనే మహతీ అమహతీ శబ్దాల నిర్వచనం కూడ సుగ్రాహ్యమని కావచ్చు - చింతామణి విడిగా చెయ్యలేదు ఇవికూడ ఇతర సంజ్ఞలవలెనె దేశీయ వ్యాకర్తలచేం తిరస్కృతాలనిగాని ఉపేక్షితాలని గాని చెప్పవలసి ఉంటుంది

సుప్రసిద్ధ సంస్కృత సమాస పదానికి క ప్రత్యయం చేర్చి సమాసక శబ్దాన్ని సృష్టించి దాన్ని కేవల వికృతిపదాల సమాసానికి పేరుగా పెట్టింది

---

1 సంజ్ఞ 2
2 సంధి 24
3 అజంత 8
4 అం భా ఘా 4
5 తెలుగును తెలుగులో వ్యాకరించిన 9వ శతాబ్దికి పూర్వులయిన వారిని యిలా వ్యవహరించాను

హలంత పరిచ్ఛేదంలో - చింతామణి ఒకచోట ఆ శబ్దాన్ని ప్రయోగించింది కూడ[1] అల్పార్థంలో స్వార్థంలో క ప్రత్యయ ప్రయోగం సంస్కృత వ్యాకరణంలో ప్రసిద్ధంగా ఉంది ఇక్కడ కూడ సంస్కృత సమాసాలకంటె సహజంగా తెలుగు సమాసాలు చిన్నవిగా ఉంటాయి కాబట్టి వాటిని సమాసకాలు అని పిలవడం ఒక విధంగా సమంజసమే అయినా ఈ సంజ్ఞకూడ దేశీయ వ్యాకర్త్రి తిసంస్కృతమే- 9వ శతాబ్ది ప్రారంభంవరకు

వ్యాకరణ ప్రారంభంలో కొత్తగా సంజ్ఞా కల్పనం ప్రాకృత వ్యాకరణాల్లో తత్రాపి త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనంలో అధికంగా ఉంది కాని ఆ సంజ్ఞలన్నీ విస్పందేహంగా లాఘవాపేక్షతో కల్పించ బడినవే చింతామణి మీద ప్రాకృత వ్యాకరణ ప్రభావం కొంత ఉన్నట్లు పూర్వ ప్రకరణంలో కనుగొన్నాం కాబట్టి ఈ సంజ్ఞాకల్పన వ్యామోహం చింతామణి కర్తకు ప్రాకృత వ్యాకర్తలనుంచి సంక్రమించినదని నిర్ణయించవచ్చు

పై పరిశీలనంవలన చింతామణి చేసిన సంజ్ఞలన్నీ వ్యుత్పన్నాలనీ వాటిలో కొన్ని చింతామణిలో ప్రయుక్తమే కానివి కూడ ఉన్నాయని గ్రహించగలిగాం కొన్ని సంజ్ఞల కల్పనం నిష్ప్రయోజనమని కూడ గుర్తించగలిగాం చింతామణి కల్పిత సంజ్ఞలన్నింటికి చిన్నయసూరి కాలం వరకు ఇతర వ్యాకరణాల్లో ప్రయోగమే లేదనికూడ ముమ్ముందు తెలిసికోగలం[3]

## చింతామణి - రూపనిష్పాదన ప్రక్రియ

చింతామణిలో రూపనిష్పత్తి పాణినీయంలోని రూపనిష్పత్తిని పోలిఉంటుంది అంటే నామపదాలైతే తొలుత ప్రాతిపదికతరువాత ప్రత్యయం ఆటుతరువాత ఆగమాదేశాలు-వీటిద్వారా రూపనిష్పాదనం ఒక రూపం నిష్పన్నం కావాలంటె అనేక

---

1 హలంత 45

2 చూ చింతామణిలో ప్రాకృత వ్యాకరణానుకరణం అనే ప్రకరణం

3 చూ అనంతర వ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం అనే ప్రకరణం

సూత్రాలప్రవృత్తి అవసరం[1] అయితే ఇందులో తెలుగు ప్రాతిపదికలకు తొలుత సంస్కృత నామవిభక్తులు చేర్చడం విశేషం ఏభాషకైనా ప్రాతిపదిక సొంతంగా ప్రత్యయం తాత్కాలికంగానైనా పరాయిదిగా ఉండటం విచిత్రమే చింతామణి కర్త మాత్రమే ఇట్టి సంప్రదాయానికి తెలుగులో ప్రథమ ప్రవర్తకుడు కేతనాదుల వ్యాకరణాలు స్వతంత్ర విధానం గలవి అందులో సంస్కృత విభక్తి ప్రత్యయాలకి తెలుగు ప్రత్యయాల్ని ఆదేశించడ మనే ప్రక్రియలేదు చింతామణి కర్తకి హేమచంద్ర త్రివిక్రమాదుల ప్రాకృత వ్యాకరణాల పాండిత్యం అపారంగా ఉంది పైగా త్రివిక్రముని వ్యాకరణంలోని కొన్ని పరిభాషలు సంజ్ఞలు చింతామణిలో స్వీకరించబడి ఉన్నై[2] ప్రాతిపదిక ఒకభాషదీ ప్రత్యయం తొలుత మరొకభాషదీ కావడ మనే వైలక్షణ్యం ప్రాకృత వ్యాకరణాల్లో ఉంది[3] ఆ పద్ధతినే చింతామణి కర్త తెలుగు వ్యాకరణాల్లో గూడ ప్రవేశపెట్టాడు

## సంస్కృత ప్రత్యయవిధానం

తొలుత చింతామణికీ తరువాత తదనుయాయి వ్యాకరణాలకీ ఈ సంస్కృత ప్రత్యయ విధాన మన్నది ఒకవిధంగా తప్పనిసరి అయింది వారందరూ పాణినీయం

---

రామ ప్రాతిపదిక

అ ప్రీపరుజడాన్ వినాఽన్యే మహదాఖ్యా

రామ మహద్వాచకము రామ + సు

ఆ మహతస్సో ర్డుజనితో భవేత్ పుంసి

రామ + ఉజ్

ఇ మహతోఽత ఉద్వివక్త

రాము + డుజ్

అను క్రమ స్యశబ్దానుశాసనవత్

ఈ సానునాసికోచ్చారం జిత్

రాముఁడు

2 చూ ప్రాకృతవ్యాకరణానుకరణం అనే ప్రకరణం

3 భిహిభిసః - త్రివిక్రమ —2—5 రామేహి=రామై

ఆదర్శంగా తీసికొని భాషను వ్యాకరించడానికి పూనుకొన్నవారు గాబట్టి సంస్కృతంలో లాగ తెలుగులో గూడ కొన్ని పదాలకి ప్రథమైకవచన లోపం విధించారు కాని ఆ పదాలకి ప్రథమైక వచనంలో ప్రసక్తమయ్యే ప్రత్యయమే లేదు తెలుగులో తెలుగు భాషా స్వభావం గుర్తించకుండా సంస్కృతానుకరణం చేయడం వలన కలిగిన దుస్థితి ఇది కాబట్టి సంస్కృత ప్రత్యయం పెట్టి లోపింపచేశారు[1] ఇది నామపదాల (సుబంతాల) నిష్పత్తివిధానం

క్రియాపదాల నిష్పాదనం గూడ ఇలాగే జరిగింది మొదట ధాతువు తరువాత క్రియావిభక్తి తరువాత ఆగమాదేశాలు - అపుడు రూప మేర్పడుతుంది[2] తెలుగు క్రియావిభక్తి సంస్కృత క్రియావిభక్తికి ఆదిష్టమగుట అనే ప్రక్రియ

---

హరి ఇకారాంత ప్రాతిపదిక మహద్వాచకం పుంలింగం దీనికి ప్రథమైక వచనంలో డుము వు అనే ప్రత్యయ త్రయంలో ఏదీ ప్రసక్తంగాదు కాని పదం కావాలంటే ప్రత్యయం చేరవలెనందే అపదం నప్రయుంజీత (పదం కానిది ప్రయోగార్హంకాదు) అనేనిషేధాన్ని పురస్కరించుకొని చేరి లోపస్తే ఫువా లేదు ప్రత్యయలోపే ప్రత్యయలక్షణం అనేపరిభాషనుబట్టి కాబట్టి అక్కడ ప్రథమైకవచన ప్రత్యయంగా సు చేర్చి సోర్లుగిః (అజంత 36) అనే సూత్రంతో దానికి లోపం చేస్తారు

2 ఘట సంస్కృత ధాతువు

అ భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమ (క్రియా 3)
ఘటించు + లట్

ఆ వ్యతిరేకార్థే ల్ప్రట ఒవే డుజ్ స్యాత్ (క్రియా— 9)

ఇ సామనాసి కొచ్చారం జిత్ - అజంత లో త్రివిక్రమవ్యాకరణం నండి ఎరవు సూత్రం
ఘటించు(డు

ఈ వ్యతిరేకాదౌ భావినిచాత్ స్యాత్ (క్రియా— 6)
ఘటించ(డు

ఉ అనుబంధపార్శ్వనయోర్ణౌ వ్యతిరేకాదికేవ చో ప స్యాత్ (క్రియా— 5)
ఘటింప(డు

ఇక్కడ కూడ తప్పనిసరే లేకపోతే ఇక్కడగూడ కొన్ని క్రియల్లో ప్రథమ పురుషైకవచనాలుక్తిలోపిస్తాయని సూత్రించిన సందర్భాల్లో ఆలోపందేనికి వస్తుందో తెలియనిస్థితి ఏర్పడుతుంది

చింతామణి సంస్కృత సమరూపనిష్పత్తి చేసేటపుడు సంస్కృతంలోని లింగవిధానాన్ని కొన్నిచోట్ల స్వీకరించినా కొన్నిచోట్ల త్యజించవలసి వచ్చింది

స్వీకారం కృష్ణశబ్దం ఇది పుంలింగం పురుషవాచకం గూడ కాగా చింతామణి కల్పించిన మహత్‌సంజ్ఞకు లోబడినది కావున మహాతస్సోర్డుజనితో భవేత్‌పుంసి – ఇత్యాది సూత్రాలతో కృష్ణుడు అనే రూపం ఏర్పడింది

త్యాగం వృక్షశబ్దం ఇది పుంలింగం కాని పురుషవాచకం కాదు జడ వాచకం కాబట్టి అమహత్ సంజ్ఞకు లోబడింది కాగా స్యాదమహతాం విభక్తౌ సోశ్చము 2 అనే సూత్రంతో వృక్షము అనే రూపాన్ని పొందింది అంటే తెలుగు భాషాస్వభావానికి సంస్కృతలింగవిధానం విరోధించనిచోట స్వీకరించడం విరోధించినచోట విడిచిపుచ్చడం జరిగినదన్నమాట అక్కడి లింగానికి ఇక్కడి ప్రయోగానికి సమన్వయం లేకపోవడం వలననే చింతామణి మహదమహద్భేదంతో నామపదాల్ని రెండుగా కొత్తగా విభజించవలసి వచ్చింది అయితే కేతనాదులు ఈ నూతన సంజ్ఞ కల్పించకుండానే రూప నిష్పత్తి చేశారు మహచ్ఛబ్దాలుగా చింతామణి పేర్కొన్నవాటిని వారు పురుషవాచకాలన్నారు[3] ప్రక్రియావైరుధ్యం పోవడానికి అదిచాలు

---

ఘటించున్–ఇది తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనరూపం చింతామణి ప్రక్రియను బట్టి ఇక్కడ ప్రథమ పురుషైకవచనం లోపించింది (ప్రథమైక వచనలోప తద్ధర్మాతీతయో క్రియాణాంస్యాత్ – క్రియా 8) కాని ప్రథమపురుషైకవచనంగా ఏ ప్రత్యయమూ అక్కడలేదు కాగా తిప్ అనే సంస్కృత ప్రత్యయం పెట్టి దానికి లోపమని వ్యాఖ్యానిస్తారు తెలుగు వ్యాకరణాల మీద సంస్కృత వ్యాకరణాల ప్రభావం అంత గాఢమైందిమరి

2 అజంత 34

3 ఆం భా భూ 34

చింతామణి సంస్కృత సమ శబ్దాల్ని అజంతాలు హలంతా లని రెండుగా విభజించింది అజంత శబ్దాలకు సంస్కృత ప్రాతిపదికలే తెలుగులోను ప్రాతిపదికలుగా స్వీకరించడం జరిగింది

అజంత శబ్ద నిరూపణం

అకారాంత శబ్దాలకు ఉత్వడుజ్జులు విధించి ప్రథమైకవచన రూపాల నిష్పత్తి చేయబడింది ఉత్వం ఇతర విభక్తులు పరమైనపుడు గూడ విధించబడింది ఏకవచనంలో ని బహువచనంలో ల మహద్వాచక శబ్దాలకు తృతీయాది విభక్తులు పరమైనపుడు ఆగమాలుగా చేయబడినాయి ల అనే ఆగమం మహద్వాచక శబ్దాలకే వస్తుందని సూత్రించడం సరిగాదు అమహద్వాచకాలకు గూడ ఆ ఆగమం సహజంగానే వస్తుంది (హలములచేత) కాబట్టే వ్యాఖ్యాతలు ఆ సూత్రంలో ఒక జ్ఞాపన ను సృష్టిచేసి ఆ దోషపరిహారం చేశారు ఈ లకారాన్ని తృతీయాది విభక్తులు పరమైనపుడు విధించడం వలన ద్వితీయలో ఉన్న లకారం ఆగమం కావడం లేదు పైగా దాన్ని చింతామణి విభక్తిప్రత్యయ మంటున్నది3 నిజానికి తృతీయాది విభక్తులలో బహువచనంలో కనిపించే లాగమమే ద్వితీయ బహువచనంలోను ఉంది కాబట్టే చింతామణితప్ప ఇతర వ్యాకరణాలేవీ లా ని ద్వితీయావిభక్తిప్రత్యయ మని చెప్పలేదు–చింతామణికి అనువాదాలుగా వెలసినవి తప్ప చింతామణి మార్గంలోనే వ్యాకరణ రచన చేసినా చిన్నయసూరి లా ని ద్వితీయగా చెప్పకపోవడం గమనించదగ్గ విషయం పైగా ఆయన లాగమాన్ని ద్వితీయకు గూడ చేప్పి, తృతీయాదులలోని బహుత్వ లకార మెలాంటిదో ఈ లకారమూ అటువంటిదే అని చాటాడు4

---

మహతోఽత ఉద్విభక్తౌ అజంత

2 విభక్తౌ ఇత్యేకవచనేన వాఽయమర్థో జ్ఞాప్యతే నేదేవ ఏకత్వార్థకస్య మహతి నియమ బహుత్వార్థకస్య లస్యతు అమహతోపి టాదివిభక్తౌ ప్రాప్తిరస్తీతి అహోబలపండితీయం

3 కూర్చి ల ను నయోర్భవే ద్వితీయా తు —అజంత 2

4 బాల వ్యా తత్సమ 3

చింతామణి విభక్తి ప్రత్యయాల్లో ని ను అని ద్వితీయను తో తోడ చే చేత పుని తృతీయను కి కు అని షష్ఠిని నిర్దేశించడంతో ఒక ప్రత్యయం యొక్క రూపాంతరాలను గూడ ప్రత్యేక ప్రత్యయాలుగా స్వీకరించినట్లయింది అయినపుడు లోపల ఒక్కదాన్నే గ్రహించి లో ను చెప్పకుండటం సరిగాలేదు. సప్తమిలో అందు తోపాటు ఇందు గూడ ప్రత్యయంగా చెప్పడం విచిత్రమైన విషయం

రూపనిష్పాదన కుద్దిష్టమైన పరిచ్ఛేదాలు మూడు మొదటి రెండూ (అజంత హలంత పరిచ్ఛేదాలు) నామశబ్దాలను చివరిది (క్రియాపరిచ్ఛేదం) క్రియాపదాలను విష్పత్తి చేస్తున్నవి

అజంత పరిచ్ఛేదంలో తొలుత నామవిభక్తుల నిర్దేశం తరువాత వాటివిధానం జరిగింది ఇక్కడే స్వల్పంగా కారక వివరణం గూడ జరిగింది ఆపైన అజంత శబ్దాల నిష్పత్తి ఆయితరువాత కొన్ని ఆచ్ఛికశబ్దాల రూపనిష్పాదనం ఆచ్ఛికశబ్దాల అంతస్వర్ణలోపం ఔపవిభక్తిక శబ్దాల్లోని విభక్తి విపరిణామం ఆచ్ఛికశబ్దాల రూపభేదం చివరకు స్త్రీసమ క్లీబసమ శబ్ద నిర్దేశం విధానం—ఇదీ అజంతపరిచ్ఛేదం లోని స్థూలరచనా ప్రణాళిక

ఇందు విభక్తి ?

విభక్తిప్రత్యయాల్ని విధించే సందర్భంలో ఇందు ను సంబంధవర్తినామిందు [1] అని విధించడం జరిగింది దానికి పూర్వం అందు జీ పః [2] అని సప్తమికి అందు ను విధించడం జరిగింది కాగా సప్తమీవిభక్తి ప్రత్యయత్వం ఇందు కు ఉన్నట్లా? లేనట్లా? ముందు నిర్దేశించాడు గాబట్టి ఈ శంక అనవసరమే అయితే మరి ఈ విధాన మీవిధంగా జరిగిందేమిటి సమీపవర్తులకు సప్తమ్యంతము ఇందు అని బాలసరస్వతి తదనుగుణంగా అహోబలపతి వ్యాఖ్యానించారు కాబట్టి ఇందు

1 అజంత 28

2 అజంత 27

విభక్తి ప్రత్యయమే కాదు అది విభక్త్యంతమైన పదం-అని సూత్రకర్త ఉద్దేశమూ అయినపుడు విభక్త్యంతాన్ని కానిపోయి విభక్తుల్లో ఎందుకు పఠించినట్లు? సమాధాన మతడే చెప్పాలి ఈ నిదర్శనాన్ని బట్టి సూత్రకర్తకు వ్యాకరణరచనకు వలసినంత ప్రజ్ఞాపరిణతి ఏర్పడలేదేమో అని శంకించవలసి వస్తుంది

ఇది శబ్దానికి దీనియందు అనే సప్తమ్యంత రూపంతోపాటు ఇందు అనేది గూడ అదనంగా ఉంది-సప్తమ్యంతంగా అట్లే అది శబ్ద సప్తమ్యంత రూపం అందు -అని గూడ సులభంగానే గ్రహించవచ్చు కాబట్టే ఆ శబ్దాలకు స్వతంత్ర ప్రయోగం నాటికీ నేటికీ విరివిగా ఉంది అయినా కొలకు మున్నగు శబ్దాల్ని విభక్తి ప్రత్యయాలుగా గ్రహించినట్లే తెలుగు వ్యాకర్తలు అందును సప్తమీవిభక్తి ప్రత్యయంగా గ్రహించారు నిజానికి నామ విభక్తిప్రత్యయాల్లో ఎక్కువ భాగం వ్యుత్పన్నమైన పదాలుగానే కనిపిస్తున్నాయి సంస్కృతంలో లాగ తెలుగులో గూడ సప్తవిభక్తులు ఏర్పరచవలసి వచ్చినపుడు తప్పనిసరై ఈ శబ్దాలు ప్రత్యయ స్థానీయాలుగా వాడబడినాయని తద్‌జ్ఞులు ఎరిగిన విషయమే

సవిధవర్తినామిందు అని ఇందు ను ప్రత్యేకంగా విధిస్తే మరి ఎందును గూడ ఎందుకు విధించలేదని ప్రశ్నించవచ్చు ఎందు సప్తమీవిభక్తి ప్రత్యయం కాదని సమాధానించవచ్చు కాని ఇందు గూడ కాదని తేలిందికదా అని పూర్వపక్షం తరువాత సమాధానం సూత్రకర్తే ఇవ్వాలి

## విషయ నిమిత్తార్థాల్లో సప్తమి

సంస్కృతంలో విషయార్థంలో నిమిత్తార్థంలో సప్తమి విధించబడింది (సప్తమ్య ధికరణే చ నిమిత్తాత్కర్మయోగే)1 విషయసప్తమికి ఉదాహరణంగా అపత్సుమిత్రం జానీయాత్ యుద్ధేశూరం ఋణేశుచిం భార్యాం క్షీణేషువిత్తేషు వ్యసనేషుచ బాంధవాన్ అనే శ్లోకం ఇస్తారు ఇక్కడ సప్తమీవిభక్తికి విషయం అర్థం అంటే ఆపదల విషయమున ఋణ విషయమున అనిఅర్థం చెప్పబడుతుంది అలాగే నిమిత్తసప్తమికి చర్మణి ద్వీపినం హన్తి సీమ్ని పుష్కలకో హతః అనే

---

1 పాణిని 2-3-36 వార్తికం

శ్లోకాన్ని ఉదాహరిస్తారు ఇక్కడ చర్మం నిమిత్తం దంతాల నిమిత్తం అని అర్థం చెప్పబడుతుంది సంస్కృతంలో కేవలం సప్తమీ విభక్తికే ఈ విషయార్థం నిమిత్తార్థం వస్తున్నవి తెలుగులో సప్తమికి ఆ శక్తి లేదు అయినపుడు దాన్ని పేర్కొనవలసిన పనిలేదు కాని చింతామణి విషయ నిమిత్తాదిజా తద్వైవాన్యా అని విషయ నిమిత్తార్థాల్లో సప్తమీవిభక్తి(అన్య) అట్లే ప్రయోగింపబడుతుంది–అనిసూత్రించింది వ్యాఖ్యాతలు ఆయా అర్థాల్లో ఆ పదాలనే విషయ నిమిత్త పదాలనే ప్రయోగించి సప్తమ్యంతార్థం గ్రహించమని చెప్పడం జరిగింది అది కేవలం సంస్కృత వ్యాకరణ విధేయతను తెలుపుతుందే కాని దానివల్ల ప్రయోజనాంతరం లేదు పైగా వ్యాఖ్యాతలు సప్తమ్యర్థంలో ప్రథమాంతాలు ఉంటాయని చెప్పి హరివిషయము హరినిమిత్తము అని ఉదాహరించారు అహోబలపతి మరొక అడుగు ముందుకు వెళ్లి అదర్వణకారిక అంటూ ఒక సూత్రం గూడ ఇచ్చాడు

భావాదిజన్యజీవ్ తుల్యస్సుపాస్స్యాదత్రసర్వదా
సత్యర్థజాసప్తమితు ఏ ర్థానార్థతాంగతా (అహో పం అంత —3)

కాని లోకవ్యవహారంలో ఈ విషయ నిమిత్తాది శబ్దా ప్రథమాంతాలుగా గాక సప్తమ్యంతాలుగా భృత్యుల విషయమున అన్నట్లు ప్రయోగించ బడుతుండటం అనుభవంలో ఉన్న విషయం తెలుగువారి వాడుక కారణంగా ఇక్కడ అధికరణార్థములో లో లోపల విభక్తులు వాడబడటం గూడ సహజమే ఉదా పుస్తకాల విషయంలో (విషయమున) చింతలేదు ధన విషయంలోనే చింత

అలాగే ఈ శబ్దాలు నుజ్యంతమైన క్త్వార్థమైన అగుధాత్వను ప్రయోగంతో వ్యవహరించబడటం గూడ కద్దు ఉదా నీ నిమిత్తంగా నేను సుఖపడ్డాను నీ నిమిత్తమై కష్టపడ్డాను ఆ విషయమయి దిగులుపడవద్దు ఈ విషయమయి వివాదాలు జరిగినవి వీటిలో గా అనేది (కాన్ నుజ్యంతమైన అగుధాతువు అయి అనేవి క్త్వార్థమైన అగుధాతువు

పైగా విషయార్థంలో నిమిత్తార్థంలో సప్తమి వాడుకమే సంస్కృతంలో విశిష్టప్రయోగం అటువంటి సప్తమివాడుక తెలుగులో లేదు కాబట్టి ఆప్రసక్తి అనవసరం బహుశః అందుకనే కావచ్చు చిన్నయసూరి ఇటువంటి సూత్రాల నిర్మాణం చేయలేదు – చింతామణిని అనుసరించి వ్యాకరణ రచన చేసినా

సప్తమిని వాడి విషయనిమిత్తార్థాలు పుట్టించడం వ్యాకరణమే కాని స్వయంగా ఆ శబ్దాలే ప్రయోగించి ఆ అర్థాలు వస్తాయని చెప్పడం ఏమివ్యాకరణం? ఇక ఆశబ్దాలైనా ప్రథమాంతాలే ప్రయుక్తాలౌతాయని చెప్పడం వ్యాకర్తఉద్దేశమని వాదించ వచ్చు కాని అదీ నిలబడటం లేదు సప్తమ్యంతంగా ఇతర విధాలుగా ప్రయోగాలు రోజూ వ్యవహారంలోనూ పుస్తకాల్లోనూ కనుపిస్తున్నాయే

చింతామణి కర్తకి తన పూర్వులు చెప్పిన లక్షణాలు సంస్కృతీకరించడం అభ్యస్తవిద్యే అని పూర్వప్రకరణంలో మనం గమనించి ఉన్నాం ఆ గమనిక ఆధారంగా సప్తమ్యర్థంలో నిమిత్తాది శబ్దప్రయోగం జరగవచ్చునని పూర్వలాక్షణికు డెవడైనా అని ఉంటే అతడు స్వీకరిస్తాడు అని భావించవచ్చు అది నిజమే బాలసరస్వతికి ముద్దరాజు రామనకీ పూర్వుడయిన అనంతుడు తనఛందోదర్పణంలో చతుర్థాశ్వాసంలో 07వ పద్యంలో తెలుగు విభక్త్యంత పదాలు ఉదాహరిస్తూ సప్తమ్యంతాలుగా

జలధియందు లక్ష్మి గలుగుచుండ గ(ఁ)దన్ని
మిత్తమనగ సప్తమీవిభక్తి

అని వ్రాశాడు దానిలో జలధియందు అనే పదం సప్తమ్యంత మనడంతోపాటు తన్నిమిత్తము గూడ సప్తమ్యర్థకమే అనడం జరిగింది అనంతుడు ఈ పరిచ్ఛేదం లోనే ముందుగా సంధులు సమాసాలు కారకాలు సంస్కృత మర్యాదానుసారంగా పాణినీయ మాధారంగా విరచించి ఉన్నాడు అది చూచిన చింతామణి కర్త దాన్ని మరికొంత దీర్ఘీకరించి (విషయ – ఆది – శబ్దాలు జోడించి) సంస్కృతీకరించి ఉంటాడు

## అసంపూర్ణ రూప నిష్పాదనం

చింతామణి చూపిన రూపనిష్పాదన ప్రక్రియ అసంపూర్ణంగా చాల సందర్భాల్లో ఉంటుందని అది నిస్సంశయంగా నిర్దుష్టంగా రూపనిర్మాణం చేయలేదనీ చింతామణి హృదయకారులు అనడం సమంజసమే

---

అం భా చ అనుబంధం

వనము ఫలము వంటి రూపాలకు వనమ్ము-వనంబు వంటి రూపాలు ఏర్ప రచడానికి చింతామణి తదుపరి పున ర్మ్కబూ ప్రాచాం అని సూత్రించింది తదుపరి అంటె అ(మూ)మీదను అని అర్థం పూర్వ సూత్రంలో ము విధానం చేసి ప్రస్తుత సూత్రంలో దానిమీద మళ్లీ ము బు లు విధించాడు సూత్రకర్త అంతే ఊరుకున్నాడు దానితో సిద్ధించే రూపాలు వికృతంగా ఉన్నాయి వనముము-వనముబు అని వ్యాఖ్యాత మాత్రం (బాలసరస్వతి) వనము + ము అని యుండిన మొదటి ము సున్నయై ద్విత్వమాయెను వనమ్ము బు ఉండిన నట్లే వనంబు అని రూపమాయెను అని సరిచేశాడు అయితే అహోబలపతివ్యాఖ్యానం వెలసినతరువాత వచ్చిన వ్యాఖ్యానాల్లో ఇక్కడ అధర్వణునిదిగా కారిక ఒకటి కొన్నింటిలో (బాల సరస్వతీయాల్లో) జొనుపబడింది కొన్నింటిలో పాణినీయ పరిభాషలు చొప్పించి క్లిష్టమార్గం ద్వారా సాధురూపనిష్పాదన యత్నం జరిగింది[1]

సురలు రూపనిష్పత్తి కోసం చేసిన సూత్రంలో ( స్త్రీత్వబహుత్వే సురాదే రనమాసే[3] ) ఆదిశబ్దం ఏదో ధోరణిలో దొర్లినట్లుంది దానికి సార్థక్యకల్పన వ్యాఖ్యాతలు కష్టపడి చేశారనుకోండి అది వేరే విషయం అసమాసంలో స్త్రీత్వ బహుత్వాలు వచ్చేది ఒక్క సుర శబ్దానికే యోధ కుంర-వంటి వానికి బహుత్వ ముండవలసిన పనిలేదు గదా అలాగే అసుర అనే శబ్దం సమాసమైనా స్త్రీత్వార్హ మైనది ర శబ్దాలన్నింటికీ ఈ సూత్ర మొక్కటే గతి కాబట్టే మహాయోధ మొదలయిన రూపాలకోసం ప్రపూర్వసూత్రం నుండి క్వచిత్ శబ్దాన్ని అనువృత్తం చేసి సూత్రంలోని అసమాసే అనే పదాన్ని ఒకసారి సమాసే అనిగూడ పఠించి వ్యాఖ్యానం చేయాలనీ యోధ కుంరాది శబ్దాలకోసం స్త్రీత్వ బహుత్వాలు విడివిడిగా కూడ విహితాలౌతాయని వ్యాఖ్యానించాలనీ అలాచేస్తే తప్ప సూత్రస్థ ఆది శబ్దానికి సార్థక్య మేర్పడదనీ సూత్రానికి అల్పవిషయతాదోష పరిహారం అపుడుగాని లభించ దనీ వ్యాఖ్యాత (అహోబలపతి) చింతామణి కర్తను రక్షించవలసి వచ్చింది

---

బౌపరే మస్యబిందు స్స్యాత్ మౌ పరే మేళనం భవేత్ (అహో పం)

2 వావిళ్లవారి ప్రతి 97

3 అజంత 69

చింతామణిలో నిరూపితమైన రూపనిష్పాదన ప్రకియ అసమగ్రంగా ఉంది అనడానికి మరొక ఉదాహరణ గూడ ఒసగవచ్చు

త్రాడు–త్రాళ్లు చాలు–చాళ్ళు ఊరు–ఊళ్ళు -వంటి రూపాల్ని సాధించడానికి దలటా ముదితాం తస్యచ వాలుక్ అనే సూత్రం వ్రాయబడింది కాని సూత్రం ద ల ట లలోని ఉత్వేత్వాల లోపమే చేస్తుంది అపుడు త్రాడ్లు ఊర్లు వంటి రూపాలే ఏర్పడతాయిగాని త్రాళ్ళు వంటివి గావు - ఆ విషయం గమనించే అహోబలపతి ల డ ళ లకు అభేదం చెప్పబడింది గాబట్టి త్రాళ్లు-వంటిపై రూపాలేర్పడినవని వ్రాశాడు

## పాణినీయ పరిభాషా స్వీకారం

చింతామణి ప్రక్రియలో మరొక విశేషం పాణినీయ పరిభాషను విధిగా స్వీకరించడం స్వీకరించకపోతే రూపసిద్ధి గాదు ఆగమాలలోని ఇత్తులనుబట్టి అవి ఆద్యవయవంగా గాని అంతావయవంగా గాని రావడం టిత్తైతే ఆద్యవయవంగా కిత్తైతే అంతావయవంగా మిత్తైయినా అంతావయవంగానే రావడం జరిగింది (ఆద్యన్తౌ టకితౌ మిద చోన్త్యాత్ పర -పాణినీయ పరిభాషా ప్రకరణం )

ఉదా మిత్తు నుమ్యోత ౹ అనే సూత్రంలో మిత్తు గావడంవలన నకారం ఉకారాంత శబ్దానికి అంతావయవంగా వస్తుది తఋకుంగజ్ఞౌ కిత్తు సామానాధికరణ్యేషూదన్తానాం టుగాగమోఽచిస్యాత్ ౹ దీనిలో కిత్తు గావడం వల్న టకారం ఉదంత శబ్దానికి అంతావయవంగా వస్తుంది చిగురుటాకు

---

అజంత 76

2 ఈ విధమైన రచన చింతామణి ప్రాచీనతాద్యోతక ముని చిం విష శ్లో లో ప్రతిపాదితమైంది కాని ఆ ప్రతిపాదన విచారాసహమూ అసంబద్ధమూ అని వివరించి ఖండించడం జరిగింది చూ చిం విష శ్లో శ్లో

3 సంధి 3

4 పైది 33

ఇంతే గాకుండా హలంత పరిచ్ఛేదంలో రాజన్ ఆత్మన్ మహిమన్ వంటి వాటిని తత్సమాలు చేయడానికి సంస్కృతవ్యాకరణ ఫక్కీని అతిగా అనుస రించా డనవచ్చు—చింతామణి కర్త డుస్స్యాత్సదారాజ్ఞ[1] అనే సూత్రంతో ఉకా రాన్ని దిత్తుగా విధించాడు. గాబట్టి దిత్వసామర్థ్యం వలన రాజన్ శబ్దంలోని అన్ లోపించి రాజ్ అనే పదాంశం మిగులుతుంది ఇది కేవలం పాణినీయ పరిభాషా పారీణులకుగాని తెలియని విషయం తరువాత ఉ తో చేరి రాజు రూపమేర్పడు తుంది

ఈవిధంగా పాణినీయ విధేయంగా చింతామణి రచన సాగినా సాంతం సక్రమంగా పాణినీయ పరిభాషానుసరణం దీనిలో జరిగిన దనలేము కొన్ని చోట్ల ఆగమాలు అంతావయవాలో ఆద్యవయవాలో మనంశబ్దసిద్ధికనుగుణంగా ఊహించి తెలసికోవలసిందే గాని మార్గాంతరం లేదు

మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్త—(అజంత 8) ఈ సూత్రంలో మహచ్ఛబ్దాలకు ఏకవచనంలో ని బహువచనంలో ల తృతీయాది విభక్తులు పరమైతే ఆగమా లౌతాయని చెప్పడం జరిగింది కాని ఆగమానికి స్థాన నిర్దేశం జరగలేదు కాని మనకు ప్రక్రియావిధానం తెలిసి ఉండటం వలన అంతావ యవంగా ఈ ఆగమం వస్తుందని అనుకుంటాం ఇలాంటిస్థలాలు ఇంకా ఉన్నాయి[2]

చింతామణి కర్త పెద్ద వైయాకరణుని వలె గూడ కన్పించడు అతని వ్యాకరణ జ్ఞానం కొన్నిచోట్ల అపర్యాప్తంగా ఉంటుంది విభక్తి విధానం చేసే టప్పుడు కూర్చిని కర్మప్రవచనీయకే కూర్చిః[3] అనే సూత్రంలో చెప్పాడు సంస్కృత వ్యాకరణంలో కర్మ ప్రవచనీయ సంజ్ఞ అను ఉప ప్రతి పరి అభి అధి సు అతి అప అనే ఉపసర్గలకి అవి ద్వితీయావిభక్త్యంత రూపాలపైచేరి కర్మను స్పష్టంగా ప్రకటిస్తాయి గాబట్టి ఏర్పడింది అవి కర్మప్రవచనీయాలుగా ప్రయుక్త లైనపుడు అవ్యయాలై క్రియల అర్థంతో అన్వయిస్తాయి ఉదా నదీ మన్వసితా

---

1 హలంత 9

2 క్రియా 3

3 అజంత 7

సేనా జపమనుప్రావర్షత్ దీన్నిబట్టి కర్మప్రవచనీయం ఒక విభక్తి ప్రత్యయం కాదని తెలిసికోవచ్చు చింతామణి కర్త మాత్రం కూర్చిని ద్వితీయాప్రత్యయంగా నిర్దేశించాడు (కూర్చిలను నెయో భవేద్ద్వితీయాను) దాన్ని విధించేటపుడు కర్మప్రవచనీయ మంటున్నాడు ఎమిటీ సందిగ్ధస్థితి? నిజానికి కూర్చి సంస్కృతంలోని అన్వాది ఉపసర్గల్లాగ కర్మ ప్రవచనీయమంటె వివాదం లేదు అయినపుడు తెలుగులో ఎడ వంక ప్రక్క వేః -వంటివి (రామునియెడ భక్తి) గూడ కర్మ ప్రవచనీయాలే అవుతాయి గాబట్టి అట్టివాటిని గూడ సంగ్రహించి సూత్రించి ఉండవలసింది

చింతామణి కర్త పాణినీయ పరిభాషను సక్రమంగా పాటించక పోవడంవలన కొన్ని రూపాల విషయమై విద్వాంసులలో వివాదాలు గూడ తలెత్తడం జరిగింది

న్నుమ్మూ హ్రస్వశ్చాదే రమి శసి చ —హలంత 6

దీనికి బాలసరస్వతి అహోబలపతిచేసిన వ్యాఖ్యానంలో అమ్ అనే ద్వితీయైక వచన స్థానంలో న్ను శస్ ద్వితీయాబహువచన స్థానంలో మ్మ ఆదేశాలౌతాయని వ్రాయబడి ఉంది సంస్కృత వ్యాకరణ పరిభాష ప్రకారమైతే అమి శసి అని సప్తమ్యంత శబ్దాలకి ఆదేశాలు రా వీలు లేదు – సామాన్యంగా అది గుర్తించిన శ్రీ వజ్ఝల చినసీతారామ స్వామిశాస్త్రి తమ వ్యాకరణ సంహితా సర్వస్వంలో ఆరెండూ ఆగమాలనీ ఆ ఆగమాలు వచ్చిన తరువాత అమ్ స్థానంలో తిరిగి ద్వితీయావిభక్తి ప్రత్యయం ను వచ్చి నన్నును అనే రూపం ఏర్పడి అన్యేద్రుత ప్రకృతయ యేస్యుర్వ్యాను జీవితదుత్రానిత్యం – అనే సూత్రంలో మరొక నకారం చివర చేరి నన్నునున్ అనే రూపం నిద్ధిస్తుందని వ్రాశారు

నిజమాలోచిస్తే శాస్త్రిగారి వాదం వితండమే వారి యుక్తిని ప్రయోగిస్తే చింతామణిలోనే కొల్లలుగా సమస్యలు పుట్టుకొస్తాయి[3] అంతవరకెందుకు ఆ

---

అజంత 2

2 సంజ్ఞా 4

3 ఔపవిభక్తిక నామ్నా మత్వంస్యాత్ సప్తమీ తృతీయార్థే—అజంత 7౪

ఇక్కడ సప్తమీ తృతీర్థే అనే శబ్దం సప్తమ్యంతమైనా సప్తమీ తృతీయా విభక్తులకే అత్వవిధానం జరుగుతుంది లేకుంటే శాస్త్రిగారి యుక్తిని ప్రసక్తించేస్తే మింటన్, కంటన్ అని కాక యింట యందున్ కంట యందున్ వంటి అపరూపాలు నిరాఘాటంగా ఏర్పడతాయి

యుక్తిని శసి అనేచోట గూడ సమన్వయించి చూస్తే అస్మచ్ఛబ్ద ద్వితీయాబహు వచనం మమ్ములన్ అనేదే కావలసి వస్తుంది మమ్మున్ అనేది ఉండదు మమ్ములన్ వంటి రూపాలు మాత్రమే కనిపించడం నన్నయలో గాని ఇతరత్రా గాని లేదు పైగా మమ్మున్ వంటి రూపాలె వాఙ్మయంలో కొల్లలు అది తెలిసిన శాస్త్రిగారు అక్కడమాత్రం (శస్ స్థానంలో) ల రాకుండా శస్ తనంతట తానే లోపిస్తుందని విచిత్రవాదం చేశారు ఈ విషయమై వాదోపవాదాలు ఎన్ని జరిగినా శాస్త్రిగారి కుందేటికి మూడేకాళ్లు వారికి ఇలా వాదించే అవకాశం చింతామణి పాణినీయ పరిభాషానుసరణాన్ని శాస్త్రీయపద్ధతిలో చేయకపోవడం వలన ఏర్పడిందే

హలన్తశబ్ద నిరూపణం

చింతామణి హలంతశబ్ద సముదాయాన్ని మొత్తాన్ని నాల్గు గణాలుగా విభజించింది అగుణవద్గణం 2 గుణవద్గణం 3 అపయ ప్రభృతి 4 పయ ప్రభృతి అని వీటిలో అగుణవద్గణానికి ప్రథమైకవచనమే ప్రాతిపదికగా చేసి తరువాత ద్విత్వోత్త్వాలు కల్పించి ఆపైన సులోపం చెప్పి తత్సమాల నిర్మాణం చేసింది ఉదా మరుత్తు రాట్టు గుణవద్గణానికి మాత్రం ద్వితీయైకవచనం ప్రాతిపదికగా చేసి (చివరి మకారం ఎలా పోతుందో చెప్పకుండానే) తరువాత పూర్వంలాగానే డుము లు విధించింది ఉదా భగవంతుడు అనడ్వాహము అపయ ప్రభృతికి (సకారాంతాల్లోనే ఈ గణవిభజన) మొదట సకారలోపం తరువాత సామాన్యంగానే (అజంతమైనది గాబట్టి) ముప్రత్యయం చేసి యశము తేజము వంటి రూపాల్ని పయ ప్రభృతికి అగుణవద్గణ కార్యాలు అంటే ద్విత్వోత్త్వాలు సులోపం చేసి పయస్సు వయస్సు వంటి రూపాల్ని సాధించింది

సర్వనామప్రకరణంలోని శబ్దాలన్నిటినీ వదిలి కేవలం అస్మద్యుష్మచ్ఛబ్దాల్ని ఆత్మన్ శబ్దాన్ని ఉభయార్థవాచినీ మాత్రం ససూత్రంగా సాధించింది చింతామణి దీనికి కారణం ఆంధ్రభాషాభూషణంలో కేవలం యుష్మదస్మచ్ఛబ్దాలు ప్రక్రియాసహితంగా నిరూపించబడి ఉండటం కావచ్చు చింతామణికర్త కేతన వ్యాకరణం చూచి

---

చూ చింతామణికి మూలపాఠాలు అనే ప్రకరణం

ఉండటానికి వీలుంది గాని కేతన చింతామణిని చూడలేదని విజ్ఞులందరూ అంగీకరించిన సత్యమే మిగిలినవాటిలో (సర్వనామాల్లో) ప్రకృతి ప్రత్యయ విభాగం ప్రకృతుల్లోగూడ మహదమహద్భేదాలవల్ల కలిగే వైవిధ్యం ద్వితీయాది విభక్తులు చేరేటప్పుడు ప్రకృతి మారిపోవడం – ఈ సంక్లిష్టస్థితిని ఊహించి వాటి నిష్పాదన ప్రక్రియకు పూనుకొనకపోయి ఉండవచ్చు–అని వాదించవచ్చు గాని ఆ క్లిష్టస్థితి వీటి ప్రక్రియలోను తప్పలేదు గదా కాబట్టి మిగిలిన సర్వనామ శబ్దాలకు ప్రక్రియ చూపకపోవడం కేతన ననుకరించడంవలన మాత్రమే ఏర్పడిన దనవచ్చు

త్రికసంధి

ఈ హలంత పరిచ్ఛేదంలోనే త్రికసంధిని విధించడం జరిగింది

ఇదమద సేతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్
హ్రస్వంప్రపద్య దీర్ఘా ద్విత్వముపర్యక్షరస్య జనయన్తి (హలంత 24)

ఈ సూత్రంతో ఈదెశము–ఇద్దేశము ఆకాలము–అక్కాలము ఏదేశము–ఎద్దేశము అనే రూపాలు సిద్ధిస్తున్నాయి బహుళశబ్ద సామర్థ్యం వలన ఊష్మరేఫలకు ఈకార్యం కలగదనీ శబ్దాంతరాన్వయం లేకున్నా ఎది–ఎద్ది వంటి రూపాలు కలుగుతాయనీ వివరించాడు బాలసరస్వతి

ఇక్కడ తెలుగులోని ఈ శబ్దానికి సంస్కృతంలోని మూడు శబ్దాలు పర్యాయాలుగా ప్రయుక్తమై ఉన్నాయి ఇదమ్ అదస్ ఏతత్ అని సూత్రకర్తకు గల బలమైన ప్రాకృత వ్యాకరణ సంస్కారం ఈ పదాలు దొర్లేటట్లుచేసి ఉండాలి త్రివిక్రమ విరచితమైన ప్రాకృత శబ్దానుశాసనంలో ఇదమే తత్కిం యత్తద్భ్యష్టోడిణా అనే సూత్ర చ్ఛాయ ప్రకృత చింతామణి సూత్రం మీద పడింది సంస్కృత పదాల భ్రష్ట రూపాలతో ఏర్పడే ప్రాకృత శబ్దాల నిష్పత్తిని చూపవలసిన త్రివిక్రముడు ఇదం–ఎతత్ రెండింటిని పేర్కొనడంలో అర్థముంది కాని తెలుగులో ఉన్న ఒక్క శబ్దానికి పర్యాయంగా మూడు సంస్కృత శబ్దాల్ని పేర్కొనడం వ్యాకర్తకు ఎలా న్యాయ్యమో విజ్ఞులే యోచించాలి అర్థ

---

1 త్రి 2 78

మాత్రాలాఘవంతో పుత్రోత్సవం పొందే వ్యాకర్త పదాలకి పదాల్నే నిరర్థకంగా వాడటం సమర్థనీయం గాదు

## సంబంధార్థక ప్రత్యయం

నాది రాజుది-వంటి రూపాల నిష్పాదనకోసం దిస్స్యాత్ సంబంధార్థే సర్వస్మాత్ 1 అనే సూత్రం నిర్మితమైంది దీనితో సిద్ధించినరూపాలు యథాతథంగా ప్రయోగార్హాలే ఉదా పుస్తకము నాది సింహాసనము రాజుది కాని అనంతర సూత్రం యుష్మదస్మదాత్మభ్యోద్వితివర్ణకః నీ నా తన శబ్దాలకు మాత్రం దు ప్రత్యయం సంబంధార్థంలో వస్తుందని చెబుతుంది ఉదా నీదు నాదు తనదు కాని ఇవి సమాసంలో పూర్వాంగాలుగా మాత్రమే నిలుస్తాయి ఉదా నాదు వినయము నీదు కలహము అయినపుడు ఎ వివరణము లేకుండ ది వలెనే దు గూడ సంబంధార్థంలో విహితమై ఉండటం పరితలకు సమ్యగ్జ్ఞానాన్ని కలిగించదు

చింతామణి ప్రక్రియలో కొన్ని వైచిత్రు లున్నాయి సంధి పరిచ్ఛేదం 4వ సూత్రంతో బాపనది బాపనయది వంటి రూపాల నిష్పత్తి చేయబడింది అది చాలు కాని హలంత పరిచ్ఛేదంలో మళ్లీ 26వ సూత్రంతో కొత్తగా రాజుది బంటుది వంటి రూపాల నిష్పాదనం చేయబడింది సంధిపరిచ్ఛేదంలో శబ్దానికి అది శబ్దం పరమైతే దాని (అది) అత్వానికి లోపం వికల్పంగా విధించబడింది కాని అవే రూపాల్ని మళ్ళీ హలంత పరిచ్ఛేదంలో అన్ని శబ్దాలమీద సంబంధార్థంలో ది వస్తుందని పైసూత్రం ద్వారా సాధించడం జరిగింది హలంత పరిచ్ఛేదంలో సాధితాలైన రూపాలకి రూపాంతరాలుగా నాయది అతనియది వంటివి ఉండనే ఉన్నాయి అయినపుడు అది శబ్దంలోని ఉత్తరాక్షరాన్ని ప్రత్యేక ప్రత్యయంగా ఇక్కడ విధించడ మెందుకు అది (ది) అదిశబ్దావశిష్ట రూపమని సంధిపరిచ్ఛేదంలో స్వయంగా తానే చెప్పి చూపి ఇక్కడ కొత్తగా దాన్ని ప్రత్యయంగా విధించడం అనవసరమైన పని అయినా ఎందుకిలా జరిగింది? ప్రకరణాంతరంలో సమాధాన ముంది²

---

1 హలంత 26

2 చూ చింతామణికి మూలపాఠాలు అనే ప్రకరణం

తెలుగులో వ్యతిరేక తృవర్ణకార్థంలో ని ప్రత్యయం విధించే సూత్రాన్ని చింతామణి ఎంత పేలవంగా నిర్మించిందో ప్రతిషేధవాచినాం ని — ప్రతిషేధ వాచక క్రియాపదాలకి ని వస్తుందని సూత్రార్థం క్రియాపదం ప్రతిషేధవాచకం (ముందే) అయినపుడు ని రా పని లేదు ప్రతిషేధార్థంలోనే అది రావాలి పైగా ప్రతిషేధం=నిషేధం ఒక అర్థమే కాని ఆ అర్థంలో ని వస్తుందంటే పూర్వజ్ఞాన మ్మంటేతప్ప అది తృవర్ణకార్థమని గ్రహించడమెలా? ప్రతిషేధార్థం క్త్వార్థంలో ఉండవచ్చు దానికి ని ప్రసక్తిం కాకుండా చూచే శక్తి సూత్రానికి లేదు పైగా ఈ పరిచ్ఛేదంలోని ఈ సూత్ర మొక్కదానితో దీని ఉదాహరణరూపం ఘటింపని అనేది ఏర్పడదు ఈ సూత్రమాత్ర సాధ్యరూపం ఘటించుని మాత్రమే నివర్ణ కం వ్యతిరేకార్థకం గ్నాబట్టి క్రియాపరిచ్ఛేదంలోని 6వ సూత్రాన్ని 6వ సూత్రాన్ని తీసికొని వచ్చి ఇక్కడ సమన్వయిస్తే తప్ప మనకి సాధురూప నిర్మాణం కుదరదు కాని ఏ వ్యాఖ్యాతా ఈవిషయం చెప్పడు ఊరక ఘటింపనివాడు అని సూత్రంక్రింద ఉదాహరించి ఊరుకుంటాడు పతంజలి స్థానంలో తనను తాను నిక్షేపించుకొని అపర నన్నయగా తనను తాను భావించుకొన్న అహోబలపతి గూడ కేవలం బాల సరస్వతి ఏమి వ్రాస్తే దాన్నే ఎత్తి వ్రాసి ఊరుకున్నాడు—ఇక్కడి అనంతర సూత్రంలోని న ప్రత్యయ విధానం గూడ ఇంతగా లోపయుతంగానే కనిపిస్తుంది

## సమాస నిరూపణం

చింతామణి చూపిన రూపనిష్పాదన ప్రక్రియ కొన్నిచోట్ల మరీ విలక్షణం సమాసమంటే సామాన్యంగా సంస్కృత వ్యాకరణ జ్ఞానమున్నవాడు విభక్తిలోపం జరగగా ఎర్పడే పదసముచ్చయ మనుకుంటాడు అలా కాకుండా అలుక్సమాస మంటే విభక్తి ఉండికూడ పదం సమస్తమవుతుందని తెలిసికొంటాడు కాని చింతామణి సమాసంలో ఒక విభక్తి మరొక విభక్తితో తుల్యత్వం పొందుతుందని సూత్రిస్తుంది మొట్టమొదట ఈ లక్షణం చూచినపుడు భారతీయభాషావిద్యార్థి కెవరి కైనా పెద్ద ఆశ్చర్యమే కలుగుతుం దనుకుంటాను

షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నాం (హలంత 34)

---

హలంత 3

దీనికి ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రిత బాలసరస్వతీయంలో వ్యాఖ్యానమే లేదు వావిళ్ళవారి ప్రతిలో[1] మాత్రం అర్థం వ్రాసి రాముగుణములు రాముని గుణములు మలపట్టి శంభురాణి కలుములపడతి కవినేర్పు వనముదగలు ఇత్యాది— అని ఉదాహరణ లొసగబడినాయి అహోబలపతి గూడ పై ఉదాహరణలతో పాటు కొండల రాయడు అనే ఉదాహరణాంతరం గూడ ఇచ్చాడు రామునియొక్క గుణములు—రాముని గుణములు రాములయొక్క గుణములు—రాముల గుణములు ఈ రూపాలు పరిశీలించినపుడు ని ల లను ద్వితీయా ప్రత్యయాలుగా గుర్తించి ఉండటం వలన షష్ఠి ద్వితీయగా మారినట్లు చింతామణికి తోచింది నిజమే కాని అలా తోచడం వైయాకరణునకు తగునా? అని యోచించాలి రామునియొక్క అనేది షష్ఠ్యంత పదం దానిలో యొక్క ప్రత్యయం ని ఆగమం యొక్క లోపిస్తే ప్రత్యయం లోపించినట్లే తరువాత సమాస మేర్పడింది యొక్క లోపించిన తరువాత మిగిలిన ప్రకృతిని తదాగమ ని వర్ణాన్ని కలిపి మళ్ళీ దాన్ని విభక్త్యంత తుల్యమని చెప్పడం వైయాకరణులు హర్షించే వైఖరి కాదు

ఇక చింతామణి చెప్పిన సమాసాలు కొన్ని విలక్షణంగా ఉన్నాయి వాటిని పరిశీలిద్దాం

> ద్విగుకర్మధారయౌ తత్పురుషద్వంద్వౌ బహువ్రీహిః
> అన్యే చ కేచి దుపమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యా పరిదృశ్యా ఇహ
> (హలంత 48)

వీటిలో ద్విగుకర్మధారయాలు తత్పురుష ద్వంద్వాలు బహువ్రీహి అనేవి నిజంగా సమాసాలే కాని తరువాత అలంకారాలు కొన్ని సమాసాలుగా నిర్దిష్టాలై ఉన్నాయి ఉపమానము—మెఱుఁగుబోఁడి మచ్చెకంటి వంటివి రూపకము—మోవిపండు కేలుదమ్మి వంటివి అలంకారాలే కాక మతుబంత (తద్ధిత) శబ్దాలు గూడ మతుప్ సమాసాలని ఆదిశబ్ద గ్రాహ్యాలని వ్యాఖ్యాతలు వ్రాస్తున్నారు ఈవిధంగా అలంకారాల్ని తద్ధితాంతశబ్దాల్ని సమాసవ్యపదేశంతో పిలవడం చాల అర్వాచీనమైన అలవాటు ప్రాచీనకాలంలో తత్రాపి వ

---

97 నాటి ప్రచురణ

శతాబ్దిలో ఇట్టి వ్యవహారం లేదని నిస్సంశయంగా చెప్పవచ్చు ఇది బాలసరస్వతి కాలానికి చెందినదే కాని నన్నయకాలానికి చెందదని బాలసరస్వతికి పూర్వమున్న వ్యాకరణ పరిశీలనం వలన నిశ్చయించవచ్చు కేతన చేసిన సమాస నిరూపణంలో సమాసాలపేర్లు గూడ లేకుండ కేవలం పూర్వపదార్థ ప్రధానం ఉత్తరపదార్థ ప్రధానం అన్యపదార్థ ప్రధానం ఉభయపదార్థ ప్రధానం అని సంప్రదాయానురోధంగా పేర్కొనడం జరిగింది ఉదాహరణలు అవ్యయీభావ తత్పురుషాదులే ఒసగబడినాయి చింతామణి ఉపమాన సమాసంగా యిచ్చిన మచ్చెకంటి ని కేతన అన్యపదార్థ ప్రధాన సమాసంగా (బహువ్రీహి) ఇచ్చారు అనంతర వ్యాకర్తలు గూడ ఇటువంటి శబ్దాల్ని బహువ్రీహిగానే భావించారు (బాలవ్యా సమాస 22) చింతామణిలో గూడ 44వ సూత్రానికి ఉదాహరణగా ఇటువంటి శబ్దం (ముక్కంటి) ఇవ్వబడింది విన్నకోట పెద్దన గూడ తత్పురుష కర్మధారయ బహువ్రీహు లని సంప్రదాయానుసారంగా చెప్పాడేగాని ఉపమాన రూపకాలు సమాసా లని అనలేదు అంటే ఆనాటికి సమాసాల్లో అలంకారాల్నీ మతుబంత శబ్దాల్నీ కలిపి చెప్పే నవీనాభ్యాసం ఏర్పడ లేదన్నమాట ఈ అంశాన్ని పురస్కరించుకొని గూడ చింతామణి ప్రాచీన వ్యాకరణం కాజాలదని నిర్ణయించవచ్చు

అచ్చతెలుగులో అ ఇ ఉ ఈ మూడు వర్ణాలు స్త్రీలపేర్లను లేక స్త్రీలింగత్వాన్ని అంటే స్త్రీసమత్వాన్ని తెలుపుతాయని ఒకసూత్రం అ ఇ ఉ స్త్రీవిషయా చెబుతున్నది ఈ సూత్రానికి స్త్రీలపేర్లే ఉదాహరణగా ఇచ్చి అహోబలపతి దీని ప్రమేయాన్ని పరిమితం చేశాడు బాలసరస్వతి వ్యాఖ్యానమే ఇక్కడ సమంజసంగా ఉంది అతడు ఈ సూత్రానికి స్త్రీసమత్వాతిదేశం గూడ ఫలమని చెప్పి ముంత పడి తూము వంటి శబ్దాల్ని ఉదాహరించాడు అచ్చతెనుగు పదజాలంలో ప్రథమైకవచన ప్రత్యయంలేని అ ఇ ఉ లు అంతమందు గల శబ్దాలు సామాన్యంగా స్త్రీసమాలౌతాయని అతని ఉద్దేశం

తరువాత తద్ధితప్రత్యయాలు రెండుమాత్రం చింతామణి పేర్కొన్నది తనప్రత్యయం 2 కప్రత్యయం[1] ఉదా దొరతనము—దొడ్డతనము పొలతి పొలతుక గొంతు—గొంతుక నివ్వు—నివ్వుక మెలత—మెలతుక ఇత్యాది

---

హలంత 27

2 హలంత 28 29

ఎమ్మట వర్తమాన కాలవాచిగా సర్వక్రియా పదాలకు చు ప్రత్యయం తరువాత క్రియాజన్య విశేషణాలుగా లి న వర్ణకాలు రెండు[1] చెప్పబడినాయి అటుతర్వాత సంస్కృత వ్యవహారానికి భిన్నంగా తెలుగులో క్త ప్రత్యయాంత శబ్దాలు ప్రథమా విభక్త్యంత పదంతో సమన్వయించడం సూత్రితమైనది ఇది ముఖ్యమైన సూత్రం[2] సంస్కృత వ్యవహారం తెలుగులో భిన్నమార్గంలో జరగడాన్ని పరిశీలించి చెప్పే సూత్రం సంస్కృతంలో దృష్ట వంటి క్త ప్రత్యయాంత పదం క్రియాజన్య విశేషణంగా తృతీయాంత కర్తతోనే అన్వయిస్తుంది ఉదా త్వయా దృష్ట గ్రామ అంతేగాని అక్కడ ప్రథమాంత కర్తృపదం అతకదు కాని తెలుగులో ప్రథమాంత కర్తృపదమే అక్కడ ప్రయుక్తమౌతుంది ఉదా నీవు చూచిన గ్రామం

అస్మద్యుష్మద్విశేషణాలమీద ని వి ప్రత్యయాలు అవి (విశేషణాలు) ఇదంతాలైనపుడు విధించబడినాయి ఉకారాంతాలైతే ను వు లు విధించబడినాయి[3] ఉదా నేను కవిని నీవు పతివి మేము కవులము మీరు పతులరు వ్యాఖ్య చివర సర్వేషు పదసార్థక్యం వివరిస్తూ క్రియలయొక్క ఉకారమునకు అకారము వచ్చును పొగడుచున్నాడను ప్రోచుచున్నాడవు ఇత్యాది అని బాలసరస్వతిచే వివరించబడి ఉంది ఈ వ్రాతనుబట్టి బాలసరస్వతి పై పదాల్ని క్రియలుగా భ్రమించాడనవలసి వస్తుంది యథార్థానికి అవి పొగడుచున్నవాడు వంటి రూపాల్లోని తచ్ఛబ్దవకారం లుప్తం కాగా ఎర్పడిన విశేషణ రూపాలు ఇటువంటివి క్రియాజన్య విశేషణా లని అహోబలపతి గుర్తించి చెప్పాడు[4] వీటిని క్రియాజన్య విశేషణాలుగానే బాలవ్యాకరణమూ చెప్పింది కాని ఇటీవలి వర్తమానార్థక రూపాలు అంటే వండుచున్నాను–వండుచున్నావు వంటివి వండుచున్నాడను-వండుచున్నాడవు వంటి క్రియాజన్య విశేషణాల నుంచి ఎర్పడినవే అని సులభంగా గుర్తించవచ్చు

---

1 హలంత 30 3 32

2 పైది 33

3 పైది 36 నుండి 39 వరకు

4 భూతారే ప్రతిషేధార్థే నశ్చనిశ్చ భవేత్ క్రమాత్ కర్మాది కర్తృతాయాం చ తౌ క్రియాజ విశేషణమ్ –అహో పం 43 సూ వ్యాఖ్య

5 బాలవ్యా క్రియా 7

వండుచున్నారను వంటి పదాల్లోని ద లోపించినా దాని ఉత్తమపురుష ద్యోత కత్వ హానిజరగదు—చివరి ను ప్రత్యయంవలన కాబట్టే ఆ ద లోపించి వండు చున్నాను వంటి రూపాలు బాలసరస్వతి కాలానికే ఏర్పడుతూ ఉన్నాయి కాబట్టే అతడు క్రియా పరిచ్ఛేదంలో అటువంటి రూపాలనిష్పత్తిని చేసి చూపాడు[1] కాబట్టి క్రియాజన్య విశేషణాలు క్రియలుగా రూపుగొంటున్న ఆ సమయాన ఆపాటి భ్రాంతిపడే అవకాశం ఉన్నదనుకోవచ్చు

తరువాత కారకవిధానం రెండు సూత్రాల్లో జరిగింది[2] తొలి సూత్రంలో తెలుగు విభక్తులన్నీ సంస్కృత తుల్యాలని అంటే సంస్కృతంలో ఏయే అర్థంలో ఏయే విభక్తి వస్తుందో తెలుగులో గూడ ఆయా అర్థంలో ఆయా విభక్తి వస్తుందని చెప్ప పాణినీయానుసారంగా ఉదాహరణలు ప్రాతిపదికాద్యర్థాల్లో ఇవ్వడం జరిగింది మలి సూత్రంలో మాత్రం ఒకవిభక్తికి మరో విభక్తి వస్తుందని చెప్ప తెలుగు పలుకుబడికి అనుగుణంగా విప్రులకు దానము శిరమున గురుపాదుకలు అరణ్య మేగుట సుఖముండుట—వంటి కారకాలు వివరించబడినాయి

## సమాసక నిరూపణం

తరువాత అచ్చతెనుగు పదాల సమాసానికి సమాసక మని పేరుపెట్టి దాన్నిల్లో విభక్తులు మొదలయిన వాటికి లోపం విధించబడింది[3] అయితే ఈ విభక్తి లోపం క్లిష్టం అచ్చతెనుగు సమాసాలకే విధించడంలో ఉన్న ప్రక్రియాలాఘవ మేమిటో తెలియడంలేదు వేల్పులదొర కైదువదారి తమ్మికంటి జవాదిసెట్టి— వంటివి సమాసకాలుగా ఉదాహరించబడినాయి కాని వేల్పులదొర ఏర్పడడానికి ఒక సూత్రం సురలప్రభువు ఏర్పడడానికి మరొక సూత్రం[4] నిర్మించడంలో ప్రక్రియా లాఘవమా విషయవిభాగమా? ఏ మహాప్రయోజనం సిద్ధించినట్లు? ఇలాంటి సూత్రాలు చేస్తే దొంగభయము వంటి సమాసాలు ఎలా నిర్మించుకోవాలి

---

1. చింతా క్రియా
2. హలంత 40 4
3. పైది 46
4. పైది 34

దానిలో భయము సంస్కృతపదం కాబట్టి అది సమాసకం కాజాలదు కాకపోతే విభక్తిలోపం జరుగదు కదా అచ్చతెలుగు సమాసాల నిర్మాణంలో సంస్కృత సమాసాల నిర్మాణంలోకంటే భేదం ఖచ్చితంగా ఉంది కాని దాన్ని సక్రమంగా ఆవిష్కరించడం జరగలేదని చెప్పవలసి వస్తుంది

హలంతపరిచ్ఛేదం చివరిసూత్రానికి పూర్వసూత్రంలో కర్మధారయ సమాస స్వరూపం సూత్రించబడింది పరిమితమైన తెలుగుపదం సంస్కృతపదంతో సమసిస్తుందని దానిఅర్థం ఉదాహరణగా కలికి భుజంగకన్యలు వేలుపు వీరభటవరము వాడిమయూఖములు వేడి పయోధరలు ఒసగబడినాయి వీటిలో పూర్వపదాలు పరిమితమైనవే రెండు మూడు అక్షరాలకు మించని అచ్చతెలుగువి స్వీకరించబడినాయి వీటిలో వాడి మయూఖములు వేడి పయోధరలు అనేవి కేతన ఆంధ్రభాషా భూషణంలోనివి కావడం గమనించదగ్గ విషయం[2]

ఈ సమాస నిరూపణంలో చివరి సూత్రం పూర్వసూత్రాల అవ్యాప్త్యతివ్యాప్తుల పరిహారంకోసం వ్రాయబడినట్లుంది బహుళబ్దాలు యథేచ్ఛగా తమతమ విభక్తి వికారాలతో సమసిస్తాయని దాని అర్థం ఉదా మేటి మునిరాజు బ్రహ్మదండపుఁగైదువు ముక్కంటి గేహాని పుట్టినింటిసంపత్తి పెంపు ఇత్యాదులు ఈ సూత్రంతో తెలుగు వాఙ్మయంలోని ఏ తెలుగు సమాసాన్నైనా సాధించిచూపవచ్చు ఎందుకంటే సూత్ర వైశాల్యమటువంటిది ప్రత్యేక నియమాలు లేవు– యథాతథం సమస్యంతే[3]

## క్రియాపద నిష్పాదనం

ఇక క్రియాపదాల నిష్పత్తి గూడ పాణినీయ మార్గంలోనే జరిగిందని ముందే గమనించాం దాన్ని కొంచెం వివరంగా తెలిసికొనడానికి య ‌ ‌ సంస్కృత సమధాతువులు తెలుగులో మూడు విధాలుగా జేరుతాయట కృదంతాకారంతో కొన్ని

---

హలంత 48
2 34వ పద్యం
3 హలంత 49

ధాత్వంతాన ఇ ఉ ఋ లుంటే అని జయ్ అప్ అర్ గా మారి ొన్ని యథా తథంగా ఎమార్పు లేకుండా కొన్ని ప్రవేశిస్తాయట తెలుగులో ఈ మూటికీ క్రమంగా ఉపకృతి పరిణతి సంవృతి అనిపేర్లు పోష జయ్ రంజ అనేవి మూటికీ క్రమంగా ఉదాహరణలు

తరువాత క్రియ నాల్గర్థా లిస్తుందని-ఆ నాలుగు తద్ధర్మ వర్తమాన అతీత అగాములనీ చెప్పి వాటిలో రెండవ నాల్గవ క్రియారూపాలు అనుబంధ సహితాలుగా ఉంటాయని వివరించబడింది ఆ అనుబంధాలు అచ్చతెలుగు పదాలైనా సంస్కృతంలో వ్రాసే వ్యాకరణం కాబట్టి సంస్కృతంలోనే ఇవ్వబడినాయి కాని ఆ సంస్కృత అనుబంధాలకి తెలుగులో అవే అర్థాలని ఆ సూత్రనిర్మాతకి తప్ప అన్యునికి తెలిసే అవకాశం లేదు వసతి రనుబంధక స్స్యాత్ యత్ర అదర్థో వివక్షిస్త్ర — అస్తి రనుబంధక స్స్యాత్ యత్ర ల్వదర్థో వివక్షితో ధాతో — 2 ఈ సూత్రాల్లోని వసతి అస్తి అనే క్రియలు తెలుగులో నివసించుచున్నాడు ఉన్నాడు అనే అర్థాలిస్తాయి (వస నివాసే అస-భువి) అనేది నిర్వివాదాంశం కాని అలా అంటే సూత్రకర్త మనతో వివాదపడతాడు అతని ఉద్దేశంలో వసతి అంటే ఉండు కాదు ఉన్నాడు కాదు ఉన్న అనీ అస్తి అంటే కలుగు కాదు కలదు కాదు కల అనీ మాత్రమే అర్థమట ఈ అర్థాలు కేవలం స్వసంకేత ప్రసిద్ధాలని వేరే రుజువు అవసరంలేదు[1]

చింతామణిలో రూపనిష్పత్తి ఈ క్రియాపరిచ్ఛేదంలో మరీ అసంపూర్ణంగా అపరూప ప్రతిపాదకంగా ఉంది ఈ పరిచ్ఛేదంలోని సూత్రాలతో సాధిస్తే వచ్చే వర్తమానార్థక భావ్యర్థక క్రియాపద మొకటీ సరిగా లేదు అన్నీ అపరూపాలే అక్రమరూపాలే ఉదాహరణకి ఒక్కొక్క తెగనుండి ఒక్కొక్కటి సాధించి చూద్దాం

సూ స్యాదుపకృతి కృదన్తా (క్రియా 6)

పుష్ ధాతువు షణన్త రూపం పోష

---

చూ సూత్రకర్తే వివరిస్తే గాని తెలియని సూత్రాలు అనేప్రకరణం

సూ భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమ (క్రియా 3)

పోషించు పోషించు + లట్

సూ వసతి రనుబంధకస్స్యాత్ యత్ర లడర్థో వివక్షితస్త్ర
(క్రియా )

వసతి అనే అనుబంధం ఉన్న అని అనుకుంటే
పోషించు + ఉన్న + లట్

సూ చరితి క్రియావదానాం సర్వేషాం వర్తమానకాలేస్యాత్
(హలంత 30)

పోషించుచు + ఉన్న + లట్

సూ చోర్వాస్యాత్ వర్తమానవిహితస్య (సంధి 7)

ఇది వికల్పసంధి కాబట్టి రెండు రూపాలుంటాయి
పోషించుచన్న + లట్ 2 పోషించుచునున్న + లట్

సూ వ్యతిరేకార్థే ల్యటి లటి డుజ్ స్యాత్ (క్రియా 9)

సూ సానునాసికొచ్చారం జిత్ (అజంత )
పోషించుచున్న(డు

సూ అనుబంధప్రార్థనయో ర్ణా వ్యతిరేకాదికే చ చో పస్స్యాత్
(క్రియా 5)

అనే సూత్రం ప్రకారం పైరూపంలో చకారానికి పకారం రావాలి అయితే ఆ చకారమేది వర్తమానార్థక చకారమా? లేక ఇంచుగాగమ చకారమా? లేక రెండూనా? అనేద్విసూత్రాన్నిబట్టి తెలియదు కాబట్టి పై అపరూపం తిరిగి మహా అపరూపంగా మారుతుంది పోషింపుచున్న(డు పోషించుపున్నడు ఇది ఇలా ఉండగా దకార పూర్వ ఖండబిందువు (చున్న(డు) హ్రస్వంమీద ఉంది గాబట్టి

హ్రస్వాత్ పూర్ణోపి భవేత్[1]—అనే సూత్రం ప్రకారం మరొక అపరూపం—పోషింపు చున్నండు సిద్ధిస్తుంది వసతి అనుబంధం ఉండు అనుకుంటే పోషించు చుండుఁడు వంటివి ప్రథమపురుషైకవచన రూపాలుగానే సిద్ధిస్తాయి

పై ధాతువుకే భవిష్యదర్థక రూపాలు ఎలా సిద్ధిస్తున్నాయో చూద్దాం

పోషించు + ల్కృట్

సూ అస్తి రనుబంధక స్స్యాత్ యత్ర ల్కృదర్థో వివక్షితోధాతో (క్రియా 2)

అస్తి అంటే కల అనుకుంటే పోషించు కల + ల్కృట్

సూ వ్యతిరేకాదౌ భావినిచాత్ స్యాత్ (క్రియా 8)

పోషంచ కల + ల్కృట్

సూ వ్యతిరేకార్థే ల్కృటిలటి డుజ్ స్యాత్ (క్రియా 9)

పోషించ కల + ఁడు

సూ అనుబంధ ప్రార్థనయో ణౌవ్యతిరేకాదికే చ చో ప స్యాత్ (క్రియా 5)

పోషింప కలఁడు

వీటికి ణిజర్థంలో ఇంచుగాగమం స్తే తరువాత చకారానికి పకారం చేయాలి అపుడు తిరిగి అపరూప పరంపర ఏర్పడుతుంది వీటికే కలుగు అను బంధంగా తీసికుంటే పోషింపకలుగుఁడు—వంటి అపరూపాలు సిద్ధిస్తాయి ఈ సందర్భంలో ఉన్న కల అనేవి కాకుండా ఉండు కలుగు అనేవే అనుబంధాలుగా స్వీకరించాలని వ్యాకరణ సంహితాసర్వస్వకారుల మతం అపుడైనా అప రూపాలకు కొదువ ఏమీ ఉండదు

---

1. సంజ్ఞా 20

చింతామణి చివర వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు । -నే కాపుదల సూత్ర మొకటి ఉంది క్రియలలోని వివిధ పురుషలలో వివిధార్థాలలో వివిధ వచనాలలో వర్ణాగమం విశేషంగా వస్తుందని సూత్రార్థం దీన్నిబట్టి మనకు కావలసిన ఆగమ ఆదేశా లన్నింటినీ కల్పించుకోవాలి అని కొందరంటారు కాని బాలసరస్వతి చేసిన వ్యాఖ్యానాన్నిబట్టి చూస్తే ఆసూత్రం తత్సమ క్రియలకు గాక కేవలం దేశ్యక్రియల కోసం నిర్మితమైనట్లు స్పష్టంగా తెలుస్తుంది ఆ సూత్రానికి పూర్వసూత్రంలో దేశ్యక్రియలకు గూడ తత్సమ క్రియలకు వలెనే అత్వాదులు వస్తాయని చెప్పబడి ఉంది ఆ సూత్రానికి (వర్ణాగమో ఇత్యాది) బాలసరస్వతి ఒసగిన తాత్పర్యమిది దేశీయ తెలుగులకు ఎత్వాత్వములు సమములే యగును స్థానాస్థానముల వర్ణవిశేషములు వింత అదెట్లంటేని–వచ్చెనను క్రియకు తద్ధర్మ మధ్యమ పురుషకు వత్తు ౠడర్థమందు రాఁగలఁడు ఇది మొదలయిన వర్ణాగమములు బహువిధములు ప్రయోగ వేద్యములు అని

పై వ్రాతనుబట్టి సూత్రకర్త తాను తత్సమక్రియల్ని సంపూర్ణంగా సిద్ధింపజేసినట్లే భావించాడని మనం నిర్ణయించక తప్పడంలేదు ఏదెలా ఉన్నా క్రియా పరిచ్ఛేద ప్రక్రియా నిర్మాణంలో లోపాలివి

ముందుగా లక్ష్యాలు తెలిసి ఉపక్రమిస్తే తప్ప ప్రక్రియ తెలయదు

2 వసతి అస్తి అనుబంధాల తెలుగు పర్యాయాలు స్వసంకేత ప్రసిద్ధాలు

3 వసతి అనుబంధం ఉన్న అనేదే అని ఒప్పుకున్నా దానికి దీర్ఘం (లడర్థంలో) చెప్పకపోవడం

4 అస్తి అనుబంధం కల అనేదే అని ఒప్పుకున్నా దానికి పూర్వం ధాతువుకి నకారాగమం చెప్పకపోవడం

5 చో వస్స్యాత్ (క్రియా 5) అనే సూత్రంలో చు వర్ణం మొత్తానికి వకారమాత్రమో వవర్ణమో (అత్వసహితంగా) తెలియదు ఏది చేసినా

క్రియా 49

అపరూప పరంపర సిద్ధిస్తుంది పైగా ఏ చు వర్ణమో చెప్పకపోవడం వలన వర్తమానార్థక చు వర్ణం ఇంచుగాగమ చు వర్ణం రెండూ సూత్రానికి విషయాలై కొల్లలుగా అపరూపాలు ఏర్పడుతున్నాయి

పరిచ్ఛేద ప్రారంభం నుండి అంతం వరకు తత్సమక్రియాపద నిర్మాణం చేసి చివర ఒక సూత్రంతో అత్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియా పదానాంచ అని దేశ్యక్రియల ప్రక్రియను పేర్కొనడంతో దేశ్య క్రియల రూపనిర్మాణం బొత్తిగా సాధ్యపడదు

సంధి విధానం

ఇక చింతామణిలో సంధివిధానాన్ని గూడ దిఙ్మాత్రంగా పరిశీలిద్దాం

యశ్రుతి ర్వార్యాలఘుయం ప్రవదన్తి ప్రాణత ఏరం ప్రాణమి
(సంజ్ఞా 2)

ఇది సంజ్ఞాపరిచ్ఛేదంలో ఉన్నా సంధిసంబంధి సూత్రం అచ్చుకు అచ్చు పరమైతే పరాచ్చు యకార శ్రుతిగా అవుతుందని అర్థం ఆ యకారం లఘువనికూడ అర్థమే సంధి కానపుడు అని సందర్భాన్నిబట్టి ఊహించాలి ఈ సూత్రానికి స్వర సంధులు విధించిన తరువాత స్థానం కల్పించి ఉంటే సందర్భం తెలిసేది అలా కాకుండా అసలు పరిచ్ఛేదమే మార్చి సూత్రాన్ని నిబంధించడం వలన చదువరికి ఇబ్బంది కలుగుతుంది సూత్రోదాహరణ లివి హరి యధికుఁడు మా యేలిక మొదలగునవి ఇదంత అదంత శబ్దాలకి సంధి రాదు గాబట్టి యడాగమం వచ్చిన దని ఆ యకారం లఘువనీ తెలిసికోవాలి

తరువాత సంధిపరిచ్ఛేదంలోని మొదటిసూత్రం సంధిర్నాచో వ్యనుత ఈ ప్రారంభమే వింత ఉదంత వ్యతిరిక్త పదానికి అచ్చుపరమైతే సంధిలేదు-అని సూత్రార్థం నిషిద్ధార్థం నుండి విహితార్థాన్ని తెలిసికోవాలి ఉత్తుకైతే సంధి అవు తుంది-అని వ్యాఖ్యాతలు ఉదాహరణలు గూడ అలాగే ఇచ్చారు ప్రథముడు

క్రియా 48

బాలసరస్వతి ఎలాచేస్తే అనంతర వ్యాఖాతలూ అలాగే చేశారు మేనయత్త చిన్ని యిన్న వన్నెయొల్లె రోయీావి మైయెఅపు ఉదంతవ్యతిరిక్త పదాలన్నింటికి సంధిలేదు కాబట్టి ఉదాహరణల్లో పరాచ్చులు యకారంతో ఉన్నాయి గాబట్టి సంజ్ఞా పరిచ్ఛేదంలోని 2 వ సూత్రం ప్రవర్తించినదని తెలిసికోవాలి

నస్యాత్ తద్ధర్మోత (సంధి 6)

దీనికి ప్రథమ ప్రధాన వ్యాఖ్యాత బాలసరస్వతి తద్ధర్మక్రియల ఉత్తుకి సంధి లేదు అని అర్థం వ్రాసి రక్షించునంబ పోషించునీశ్వరి అని ఉదాహరించాడు

తద్ధర్మక్రియలు మూడుపురుషల్లోను ఏక బహువచనాలుగా కనీసం ఆరుంటాయి వాటిలో ప్రథమ ఉత్తమ ఏకవచనాలు తప్ప మిగిలిన వాటికి ఉత్వసంధి తప్పకుండా అవుతుంది పోషింతురు + అమరులు=పోషింతురమరులు మొ కాని సూత్రం మాత్రం సంధి కావడానికి వీలులేదని నిషేధిస్తుంది కనీసమని ఎందుకన్నానంటే తద్ధర్మార్థంలో ఎద గాగమం వస్తే మరికొన్ని ప్రథమైకవచనంలో ఎడి ఎడు ఆగమాలు వస్తే మరికొన్ని రూపాలు సిద్ధిస్తాయి అయితే చింతామణి ఎద గాగమసహిత రూపాల్నీ ఎడి ఎడు సహితరూపాల్నీ అసలు తద్ధర్మార్థకాలుగానే చెప్పలేదు- అని పూర్వపక్షం చేయవచ్చు కాని ఉన్నదాన్ని (నన్నయ నాటినుండీ) గుర్తించకపోవడం మరొక కొరతే అవుతుంది తప్ప గుణంగాదు

ఈ సూత్రానికి బాలసరస్వతి మాట ప్రకారం కేవలం ప్రథమపురుషైకవచనంలోని ఉత్తుకే సంధిరాదనే అర్థం చేయడానికి శాస్త్రమర్యాద అంగీకరించదు పోనీ బాలసరస్వతి అయినా సూత్రార్థమిది కాని దాని తాత్పర్య మిది—అని తాను విశేషంగా వ్యాఖ్యానిస్తున్నట్లు గూడ చెప్పలేదు ఆపని అతని తరువాతి వ్యాఖ్యాత అప్పకవి చేశాడు దాన్నే అహోబలపతి గూడ స్వీకరించాడు ఏమైనా సూత్రకర్త అనుకున్న దొకటీ సూత్రించిన దొకటీ అని ఈసూత్రం ఋజువుచేస్తున్నది గదా

శిథిలమైన సూత్రనిర్మాణం

చౌరే రుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్ (సంధి )

ఇది అమరిచి—అమర్చి వంటి రూపాల సిద్ధికి ఉద్దిష్టమైంది సూత్రనిర్మాణం చాల సంకుచితం చి పరమైతే రి లో ఉండే ఇత్వానికి లోపమౌతుంది వికల్పంగా

1 చూ అప్పకవీయం అనే ప్రకరణం

అని సూత్రార్థం చి పరంకావడ మేమిటి? చి ఒక పదంగాదు ఒక ప్రత్యయం గాదు అయినపుడు ముందు లక్ష్యజ్ఞానముంటే తప్ప ఈ సూత్రానికి ఉదాహరణ తెలుస్తుందా? అమరు అనే ధాతువుకి ప్రేరణార్థంలో చు వస్తే అమరుచు [1] అయితే దానిమీద క్త్వార్థంలో ఇ ప్రత్యయంచేరితే అమరిచి రూపమేర్పడుతుంది ఇపుడు ఈ సూత్ర ప్రవృత్తి ప్రారంభ మన్నమాట ఎంత విచిత్రమైన ప్రక్రియా నిర్మాణం పైగా చి నిమిత్తంగా చెప్పడం వలన చు పరంగా ఉన్నపుడు (అమ రుచు) ఈ లోపం రాకూడదు-అంటే అమర్చు అనే రూపం ఉండదు అమర్చి మాత్రం ఒక్కటే ఉంటుంది సూత్రానికి లక్ష్యపరిధి విశాలంగా ఉండటం వ్యాకర్త చేస్తాడు గాని కావాలని కుదిస్తాడా కాని చింతామణికర్త చేశాడాపని

ఈ సూత్రం వెంటనే ఇటువంటిదే మరొక సూత్రం వినుచు-విన్చు అనుచు-అన్చు వంటివి ఏర్పడడానికి చేయబడింది

శత్రర్థే తూతశ్చానో (సంధి 2)

అమరిచి-అమర్చి కావడానికి ఒకసూత్రం వెంటనే వినుచు-విన్చు కావడానికి మరొక సూత్రం ఇంతటితో సూత్రకర్త తృప్తిపడలేదు తరువాత అపుడు-అప్డు వంటివి ఎర్పరచడానికి ఇంకో సూత్రం చేశాడు

షోశ్చ తదాద్యర్థ వాచకేషూత (సంధి 5)

పోనీ అంతటితో అతని పదమధ్యాజ్లోప విధానం ముగిసిందనుకుందామా అంటే లేదు సంధి పరిచ్ఛేదాంతంలో కినుక-కిన్క చిలుక-చిల్క గాడుపు-గాడ్పు వంటివి ఎర్పరచడానికి మరో సూత్రం చేశాడు

నలడాదే రంతరుతశ్చ (సంధి 42)

అంతటితోనూ ఆగక చిట్టచివర మళ్ళీ ఇంకేమైనా ప్రయోగాల్లో కనిపిస్తే వాటికి గూడ (పదమధ్యంలో ఉండే అచ్చులకే) లోపం చెయ్యవచ్చు అని మరొక విశాల పరిధిగల సూత్రం చేశాడు

అన్యేషాం చ ప్రయోగ మతూతానాం (సంధి 43)

---

1 ప్రేరణార్థంలో చు ప్రత్యయాన్ని చింతామణి విధించనే లేదు

దానికి ఉదాహరణలుగా కలికి — కల్కి ఈడిచి — ఈడ్చి వంటివి ఇచ్చాడు బాలసరస్వతి

కేవలం పదమధ్యాజ్లోపం అదీ దాదాపు సమానాకారం నిర్మాణక్రమం కలిగిన పదాల్లో విధించడం కోసం చింతామణి కర్త ఐదు సూత్రాలు వ్రాశాడు అందులో 6వ సూత్రం ఎరిధినిబట్టి చూస్తే నిర్నిమిత్తంగా ముందు నిర్మించినవాటిలో మూటిని తీసివేసినా తరిగేది లేదు ఇంత ధారాళంగా సూత్రనిర్మాణం చేసిన చింతామణిని ఏదో దిఙ్మాత్రంగా లక్షణం చెప్పడానికి పుట్టినదని కొందరు పెద్ద పండితులు అనడం న్యాయ్యంగా కనిపించడంలేదు ఒక చిన్న సందర్భంలో ఇంత విస్తృత సూత్రనిర్మాణం చేయడం దిఙ్మాత్ర ప్రదర్శనమెలా అవుతుందో వారికే తెలియాలి ఒకవేళ అక్కడక్కడ చింతామణి లక్షణాల్లో విస్తృతి కొరవడితే అది సూత్రకర్త రచనాప్రణాళికలోని లోపమే అవుతుంది గాని దాన్ని దిక్ప్రదర్శన మనడం విచారాసహామైన మాట

## ఫలితార్థం

చింతామణిలోని రూపనిష్పాదన ప్రక్రియా పరిశీలనం వలన చింతామణి మన పండితులలో కొందరను¹న్నట్లు మరికొందరు అన్నట్లు గొప్ప వ్యాకరణం కాదని దాని రచనలో సామాన్యమైనవీ అసామాన్యమైనవీ ఉపేక్షింపదగినవీ ఉపేక్షింపదగనివీ ఎన్నో లోపాలున్నాయని సులభంగా తెలిసికోగలిగాం రచనను బట్టి రచయితను కొలిస్తే అతడు సంస్కృతం నేర్చి ప్రాకృత వ్యాకరణాధ్యయనం గూడ చేసిన ఒక సామాన్య పండితునివలెనే భాసిస్తున్నాడు తప్ప ఒక భాషను దాని స్వరూప స్వభావాల సంపూర్ణావగాహనతో వ్యాకరించగల మహా ప్రతిభాశాలిగా కనబడటంలేదు

---

చర్ల నారాయణశాస్త్రి వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారలు

## ఆంధ్రశబ్ద చింతామణి నామకరణం

తెలుగులో లక్షణ గ్రంథాల్ని పేర్ల ప్రకారం పరికిస్తుంటే వాటిలో ఒక క్రమ వికాసం ఉన్నదా అనిపిస్తుంది కేతన తనకు ముందు రచించబడ్డ కన్నడంలోని భాషా భూషణాన్ని చూచి తన వ్యాకరణానికి ఆ పేరు ఎన్నుకున్నాడు తరువాత విన్నకోట పెద్దన తన లక్షణ గ్రంథానికి కావ్యాలంకార చూడామణి అని నామ కరణం చేశాడు కేతన చేసిన భూషణం సామాన్యంగా ఉండటం చూసి తన గ్రంధంలో ఆ భూషణానికి శ్రేష్ఠత్వ మాపాదించడం పెద్దన చేసిన పని కావ్యా లంకారాలకు అంటే తత్సంబంధి సాహిత్యాంశాలకు శిరోధార్యమైన లక్షణ గ్రంథం తనదని తెలుపడం కోసమే అలా చేశాడు

### భూషణాలు-మణులకోవ

తరువాత వెల్లంకి తాతంభట్టు కవిచింతామణిని చేశాడు దీనిలో వ్యాకర ణాంశాలకే ప్రాధాన్యం తాతంభట్టు అష్టభాషావతారుఁడు అంటే సంస్కృతంలోనే కాకుండా షడ్విధప్రాకృతాలలో గూడ అతడు నిష్ణాతు డన్నమాట కాబట్టే ఆశ్వా సాంత గద్యంలో తన గ్రంథాన్ని కావ్యానుశాసనము[1]ని ప్రాకృత వ్యాకర్తల ధోరణిలో తన వ్యాకరణానికి అనుశాసనత్వాన్ని కల్పించాడు అయితే తెలుగు లాక్షణికుల మనస్తత్వాన్నిబట్టి తన గ్రంధానికి పేరు మాత్రం చూడామణి ని మించిన చింతామణి అని పెట్టాడు

తరువాత చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహమని తన లక్షణగ్రంథాన్ని కొంత సామాన్యంగానే ఎలుచుకొన్నాడు లక్షణాలసారాన్ని సంగ్రహించి చెబు తున్నానని ఆయన ఉద్దేశం తరువాతివాడు కూచిమంచి తిమ్మకవి ఈ పెద్దన గ్రంథాన్ని మించిన గ్రంథం తనది అని స్ఫురింపజేస్తూ తన లక్షణ గ్రంథాన్ని సర్వలక్షణసార సంగ్రహ మన్నాడు పెద్దన గ్రంథంమీద కొంత ఆధిక్యం తన గ్రంథాని కున్నదని అతని తాత్పర్యం అలాగే పొత్తపు వెంకటరమణకవి తన లక్షణ గ్రంథాన్ని అంతకు ముందున్న గ్రంధసముదాయాన్ని మించేది అని తల

---

1 కవి చింతామణి — 6వ తాటాకు

పింపజేయడానికా అన్నట్లు లక్షణశిరోమణి అని పిల్చుకున్నాడు వెంటనే అతని తరువాతివాడు గణపవరపు వెంకటపతికవి తన లక్షణ గ్రంథాన్ని సర్వలక్షణ శిరోమణి గా పెర్కొన్నాడు

ఇలా భూషణాలు మణుల కోవకు చెందకుండా మరొక ఫక్కిలో నామ కరణాలు జరగడం గూడ తెలుగు లక్షణ వాఙ్మయంలో ఉంది

### ఆశ్రయాలు-రంజనాల కోవ

కేతనకు పూర్వుడు వ్యాకరణ ప్రధానంగాకాక ఛంద ప్రధానంగా గ్రంథాన్ని చేసినవాడు అయిన మల్లియరేచన తన కృతిని కవిజనాశ్రయ మన్నాడు ఈ ఒరవడిలో కొందరు తరువాతివారు గ్రంథరచన చేశారు వారు తమ గ్రంథాలకు పెట్టిన పేర్లలో గూడ ఒక సంప్రదాయబద్ధత కనుపిస్తుంది రేచన తరువాతి ఛంద కర్త అనంతుడు తన ఛందో గ్రంథాన్ని ఛందోదర్పణ మని పిల్చుకున్నాడు దీనిలో సంస్కృత-ఆలంకారికుల గ్రంథాల పేర్ల ప్రభావం కొంత కనుపిస్తుంది- కావ్యాదర్శః అన్నట్లు

కేతనకు అనంతునికి తరువాతివాడు ముద్దరాజు రామన రేచన పద్ధతిలో (నామకరణంలో మాత్రం) కవిజన సంజీవని రచించాడు దీనిలో కవిత్వాంగమైన ఛందోవిషయాలు అంటే యతులు ప్రాసలేకాక వ్యాకరణాంశాలుగూడ సూత్రితాలై ఉన్నాయి దీనిలో లక్షణం సొంతం ఉదాహరణలు ప్రాచీన గ్రంథాలలోనివి బహుశ ఈ ధోరణికి ఆంధ్రవాఙ్మయంలో ఆద్యుడు రామనే కావచ్చు ఈ ఫక్కిని ఆదర్శంగా తీసికొనే పెద్ద గ్రంథాన్ని ఛందో వ్యాకరణాంశాలతో చింతామణిని వెపంగా పెట్టుకొని అప్పకవి రచించాడు – తరువాత

ముద్దరాజు రామన నాదర్శంగా తీసికొని అడిదము సూరకవి కవిజన రంజనం కవిసంశయ విచ్ఛేదం అనే గ్రంథాల్ని చేశాడు

---

కవిజనసంజీవని లోఁ దవిలిన పద్ధతులు మఱి యితర లక్షణ ల

క్ష్య వినిర్దిష్ట గతుల్ చెప్పవలయు నని వేఱ యొక్క పద్ధతి చేతన్

(కవిసం వి -8)

పై పట్టికలవలన స్థూలంగా తెలుగు లక్షణ వాఙ్మయంలో రెండు విధాలైన నామకరణాలు ఉన్నాయని ఒకటి భూషణాలు మణులతో నిండినది రెండు ఆశ్రయ రంజనాల తో కూడినది—అని తెలిసికొనవచ్చు

ఈ రెండువిధాల నామకరణాలు దృష్టిలో ఉంచుకొని చూస్తే ఆంధ్రశబ్ద చింతామణి అనే పేరు కావ్యాలంకార చూడామణి కవిచింతామణుల తరువాత ఆ కోవకే చెంది ఆ మణులకంటె మిన్నగా ఉండాలనే దృష్టితో పెట్టబడినట్లు స్ఫురిస్తుంది ఈ సందర్భంలో చింతామణి కర్తకు అతని సమకాలికులూ కించిత్ పూర్వులూ అయిన ప్రాకృత వ్యాకరణ కర్తలు మార్గదర్శకులై ఉంటారు చింతామణిలో లక్షితమైన భాషను పరిశీలించేటపుడు పై అభిప్రాయంలోని నిజానిజాలు సులభంగా గ్రహించవచ్చు

భాషకు తొలిగా పుట్టే వ్యాకరణాల పెర్లు సాధారణంగా సామాన్య పద్ధతిలోనే ఉంటాయి సంస్కృతానికి పాణినీయం లేక అష్టాధ్యాయి తొలిగా పుట్టిందని అనడానికి వీలులేకపోయినా అతి ప్రాచీన వ్యాకరణం దాని పేరులో ఎ ప్రత్యేకతా లేదు అలాంటివే హేమచంద్రుని ప్రాకృత వ్యాకరణం త్రివిక్రముని పాకృత శబ్దానుశాసనం గూడ వీరికి పూర్వుడు వరరుచి అతనికంటె పూర్వుడుగా భావితుడైన చండుడు తమ వ్యాకరణాల పేర్లను క్రమంగా ప్రాకృత ప్రకాశ ప్రాకృత లక్షణమ్ అని సామాన్యంగానే ఉంచారు

అనంతర కాలంలో వెల్వడేవాటికి పేర్లలోనే ఏదో మహత్త్వం స్ఫురించాలనే ఊహతో తత్కర్తలు ఇలాంటి చమత్కారాలు చేస్తుంటారు ప్రాకృతంలో అనంతర వ్యాకరణాలు లక్ష్మీధరుని షడ్భాషాచంద్రిక మార్కండేయ కవీంద్రుని ప్రాకృత సర్వస్వం రామతర్క వాగీశుని కల్పతరువు నరసింహుని ప్రాకృత శబ్ద ప్రదీపిక శుభచంద్రుని శబ్దచింతామణి ఈ కోవకు చెందినవే

ప్రథమ వ్యాకర్తలలో సామాన్యంగాఉండే నిగహం జ్ఞానపరిణతి వినయం సాధారణంగా తరువాతి వారిలో తక్కువగా ఉంటాయని తెలుగు లక్షణ వాఙ్మయాన్ని గమనిస్తే అనిపిస్తుంది చిన్న చిన్న గ్రంథాలకి పెద్ద పెద్ద పేర్లు పెట్టడం మన లాక్షణికులలో అక్కడక్కడ ఉంది

---

కవిగజాంకుశము కవిసర్పగారుడము—వంటివి

మొదటిసారిగా ఆంధ్రభాషను వ్యాకరించినవానికి అతడెంత ఆత్మవిశ్వాసం గలవాడైనా తన రచన ఇతరుల దృష్టికి ఎలా కనిపిస్తుందనే విషయంలో పెద్ద అనిశ్చయం ఉంటుందనేది నిజం కేతన తెలుగు వ్యాకరణానికి తొలికర్త కావడం వలన తనను పాణిని షణ్ముఖులతో పోల్చుకున్నా[1] వెంటనే

ఒప్పులు గల్గిన మెచ్చుఁడు
తప్పులు గల్గిన నెఱింగి తగ దిద్దుఁడు త
ప్పొప్పనకుఁ దొప్పు తప్పని
చెప్పకుఁడీ కవులుపాస్తి చేసెద మిమ్మున్ (ఆం భా భూ 9)

క్రొత్తగ నాంధ్రభాషకును గొందొక లక్షణ మిట్లు చెప్పెనే
యుత్తమ బుద్ధి వీఁడ యని యోరలు వోవక విన్నమేలు మీ
రొత్తిన మీకు మాఱుకొని యుత్తర మిచ్చుట చాల వ్రేఁగు మీ
చిత్తమునందు నన్నెరవుసేయకుఁడీ కవులార మ్రొక్కెదన్
(ఆం భా భూ 10)

అని అనడాన్నిబట్టి ప్రథమవ్యాకర్త తనకు తానే మార్గాన్ని చూచుకొనేవాడూ వేసి కొనేవాడూ కాబట్టి తన కృతికి కల్పతరువు శిరోమణి చింతామణి వంటిపేర్లు పెట్టడానికి ఇష్టపడడనో సాహసించడనో తలపోయడంలో తప్పులేదు

కాబట్టి ఆంధ్రశబ్ద చింతామణి పేరునుబట్టి గూడ ప్రథమ వ్యాకరణంగా విల బడలేదని ప్రతిపాదించవచ్చు ఆ ప్రతిపాదనకు ఇతరాధారాలు గూడ అంటే అందులో లక్షితమైన భాష ప్రయుక్తమైన ప్రాకృత వ్యాకరణ పరిభాష వంటివి బలమొసగినపుడు నిర్ణయ మొకటి సహజంగానే ఏర్పడుతుంది

## చింతామణిలో లక్షితమైనభాష

వాది బలంతోగాక వాద బలంతో చింతామణికాలాన్ని తద్వారా కర్తృత్వాన్ని నిర్ణయించవలసి వచ్చినపుడు చింతామణిలోని అంతస్సాక్ష్యాలు పరిశీలించదగినవి కాబట్టి అది లక్షించిన భాషనుబట్టి దాని కాలాన్ని కనుగొనగలమేమో ప్రయత్నిద్దాం

---

[1] ఆం భా భూ 7

## పదాది యకారం

చింతామణి చరిత్రవలెనే చింతామణి సూత్రాలుగూడ కొన్ని విచిత్రంగా ఉంటాయి సంజ్ఞాప్రకరణంలో యకారంమీద ఏ అచ్చు ఎక్కడెక్కడ ఉంటుందో ఒక సూత్రం చెపుతుంది

అద్య క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వ
(చింతా సంజ్ఞా 8)

దీనికి బాలసరస్వతి వ్యాఖ్య క్రియాసు=క్రియాపదములయందు భూతార్థ ద్యోతినం=భూతార్థములం గనిపించునవియు ఆద్యగం నామాది నుండునవియు వినా=వినాగాను సర్వ=సమస్తమైన య=యకారమును అత్ అకారము అకార మనఁగాఁ దలకట్టనుట చనియె వినియె మొదలయినవి క్రియాభూతార్థ స్థిత యెకారములు యెమ్మె యెప్పుడు మొదలయినవి నామాదినున్న యెకారములు ఈ రెండును విడిచిపెట్టి కడమ యకారములెల్లఁ దలకట్టుగాఁ దెలియునది

అప్పకవీయ వ్యాఖ్య[2]

ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థముండదు ప్రాణమై యది గనుపట్టుఁగాని
నుడుగుల నడుమను గడను యాకెందును దలకట్టుదక్క నెత్వంబు లేదు
యాకు భూతాదిక్రియా ద్యోతితములఁ జూపట్టునెత్త్వము దలకట్టు గాదు
తలకట్టు వక్రముల్ దాల్చు నీరెండును నలఘు యకారంబు లన గఁ బరఁగు

---

ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రచురణ 932

2 అప్పకవివ్యాఖ్య తెలపడానికి ముందు ఈ సూత్రం అప్పకవీయ చింతామణిలో భిన్నరూపంతో ఉన్నదన్న విషయం తెలపాలి అతని పాఠమిది

అద్య క్రియాసు భూతాద్యర్థ సముద్ద్యోతితం వినా సర్వః
(అప్పకవీయ చింతామణి–వర్ణపరిచ్ఛేదం– 2వ శ్లోకం
వావిళ్ళవారి ప్రచురణ 962)

నిప్పుడీవంకఁ గనుగొంటి నింతలోన నెచ్చటికి నేఁగె ననఁగ నాద్యచ్చులయ్యెఁ
గయ్యమైనను గానిమ్ము గాయకమునఁ గాయవలె శౌరిననఁ దలకట్టులయ్యె
(అప్ప 2– 77)

ఎక్కడఁ గనఁబడియెడుఁ జక్రి చెలులార యింక నెవ్వరు చనియెదరు వెదుక
నీవేళ నెటకుఁ బోయెదవన్న మిన్నక యేఁగె నన్నేమని యెదురు మీరు
హేమాంగదము లిడియెదఁ జెప్పరే వాని నేరీతిఁ బొడఁగనియెదము మనము
హితము దలంపడాయెను నన్నుఁగని నగియెడు నవతులకిది హేతువయ్యె
ననుచు నిట్లు భూతాదిక్రియాపదాంతముల విశేషణ భావిక్రియలను దక్క
మొదలి యంతస్థమున కేత్వములు త్రిలింగ దేశభాషను బుట్టవు దితిజభేది
(పైది 78)

పై రెండు వ్యాఖ్యానాలను పరిశీలిస్తే వ్యాఖ్యాతల ఉద్దేశానుగుణంగా సూత్ర పాఠాలు మార్చబడ్డాయనేది నిర్వివాదం వ్యాఖ్యాత లిద్దరూ దాదాపు సమకాలికులే ముందుగా బాలసరస్వతికి తరువాత అప్పకవికీ చింతామణి లభించినట్లు అప్పకవి వ్రాతవల్ల తెలుస్తుంది బాలసరస్వతికి చింతామణి దొరికిన 46 సంవత్సరాలకి అప్పకవికి అది దొరికినది ఇంత స్వల్పవ్యవధిలో దానిలో ఇంతగా పాఠభేదం సహజంగా వచ్చి ఉండదు ఈ ఒక్కచోటే గాక చాలచోట్ల ఇదేవిధంగా వ్యాఖ్యాతల ఉద్దేశాల్ని అవసరాల్నిబట్టి సూత్రాలు మారడం జరిగినది2

బాలసరస్వతి సూత్రానికి భూతార్థక క్రియల్లోను (నామ)ఆదిలోను తప్ప ఇతరత్ర ఉండే యకారం హ్రస్వ అకారం (తో ఉంటుంది) అని ప్రతిపదార్థం దీన్నిబట్టి సూత్రకర్త చెప్పదలచినది స్పష్టంగా తెలియదు భూతార్థక క్రియల్లోను పదాదిలోను ఉండే యకారం ఏ అచ్చుతో ఉండవచ్చునో సూత్రం చెప్పడంలేదు ఆ రెండుచోట్ల తప్ప మిగిలినస్థలాల్లో ఉండే యకారం మాత్రం హ్రస్వాకారమై ఉండాలని చెబుతుంది ఇదేదో స్వసంకేత ప్రసిద్ధార్థమైన రచన నిజానికి కాని బాల

---

అప్ప పీఠిక 50

2 చూ చింతామణి పాఠభేదాలు అనే ప్రకరణం

సర్వస్వతికి సూత్రరచనా సందర్భం తెలిసి ఉండటం వలననో ఏమో తాత్పర్యం తెలిసింది అతడు వివరించాడు — చనియె వినియె వంటి భూతార్థక క్రియల్లోను య్యెమ్మ యెప్పుడు వంటి నామాల (ప్రాతిపదికల) మొదటను హ్రస్వ ఎ కారంతో యకారం కలిసి ఉన్నది ఈ రెండుచోట్ల తప్ప ఇతరత్ర యకారంతో కలిసుండే అచ్చు హ్రస్వ అకారమే అంటే తలకట్టే అని

యె య వర్ణాల వ్యత్యయం

దీని తాత్పర్యం గూడ పూర్వరంగం తెలియకపోతే బోధపడదు యె అనేది భూతకాలిక క్రియల్లోను ప్రాతిపదికల మొదట్లోను ఉంటుంది ఇతరత్ర ఉండదు ఇతరత్ర ఉండేది య మాత్రమే అని చెప్పవలసిన అవసరమేమిటి ఈ ప్రశ్నకు సమాధానం తెలిస్తే ఈ సూత్రానికి సందర్భం తెలిసినట్లే

భూతకాలిక క్రియలు చనియెన్ వినియెన్ వంటివి యెత్వసహితాలే అయినా య త్వోచ్చారణతో లోకంలో వ్యవహరించబడటం క్రీ శ 6వ శతాబ్దిలో జరిగి నది ఆ వ్యవహారమే బలీయమై గ్రంథస్థం కావడం గూడ జరిగింది ఈ ఉచ్చా రణ భ్రంశాన్ని అరికట్టడానికే చింతామణి కర్త ఈ విధమైన సూత్ర రచన చేయ వలసి వచ్చింది 6వ శతాబ్దికి పూర్వం ఇలాంటి విలక్షణ ప్రయోగాలు మృగ్యం

తరువాత ప్రాతిపదిక మొదటగూడ యకారం ఎత్వసహితంగా ఉండవచ్చు నని బాలసరస్వతి వ్యాఖ్యానిస్తున్నాడు ఈ వ్యాఖ్యానం గూడ సూత్రానికి సందర్భం తెలిస్తేతప్ప చేయలేడు

బాలసరస్వతి కాలానికి ఎవడు ఎక్కడ వంటి పదాల ఉచ్చారణలో యకారం జొరబడటమే కాక అది అకార సహితంగా వ్యవహరించబడటం (ఎవడు–యవడు ఎక్కడ–యక్కడ) జరిగినది ఈ విధమైన ఉచ్చారణ బాలసరస్వతికి సమీప పూర్వాపర కాలాలు రెంటిలోను ఉన్నట్లు అంగీకరించాలి కాబట్టే 6వ శతాబ్ది మధ్య

---

అయ్యో నీసుతు గ్రద్ద తన్నుకొనిపోయన్ భీతివాపోవగన్ (పంచతంత్ర 2)
అని శాపావధి చెప్పి ముదలుడు పోయన్ (పంచతంత్ర 4)

భాగంలోనివాడు చిత్రకవి పెద్దన తన లక్షణసార సంగ్రహంలో తెలుగుమాటల మొదట్లో ఎ ఇ లు అచ్చులే గాని హల్లు లుండవని చెప్పవలసి వచ్చినది1 ఎ య గా వ్యవహరించబడి ఆ వ్యవహారం బలీయమై గ్రంథస్థం గూడ కావడం జరిగినది2 ఈ భ్రష్టోచ్చారణల్ని సంస్కరించడానికే ప్రకృత సూత్ర రచన జరిగిన దని తెలిసికోవాలి

పదాదినితప్ప యె ఉండదని నిషేధించవలసిన అవసరం సూత్రకర్తకేర్పడిన దంటే దానికి ప్రసక్తి ఉండితీరాలి ప్రసక్తి లేనిదే నిషేధ ముండదు గదా బాల సరస్వతి కాలానికే చాయకు పాయకు చయ్యన కయ్యము చేయన్ పాయన్–వంటి రూపాల్లో యకారం మీద ఎత్వం స్థానంచేసికొని చాయెకు పాయెకు చయ్యెన కయ్యెము చేయెన్ పాయెన్–వంటి వికృతోచ్చారణ ఏర్పడి ఉన్నది కాబట్టే గణపవరపు వెంకటపతికవి అలాంటి ఉచ్చారణల్ని సరిదిద్దుతూ అక్కడ ఎత్వం గాక అత్వమే ఉన్నదని వివరించాడు చాయకుఁబాయకు లోయకు నను పల్కాలం దెత్వమమరక యత్వమెగును 3 ఇతనికంటె ముందే ఈ భ్రష్టోచ్చారణ లోకవ్యవహారంలో ఎర్పడినట్లు అప్పకవి మాటల్నిబట్టి గూడ మనం తెలిసికో వచ్చు4 ఈ పరిస్థితుల ప్రభావం వలననే చింతామణి ఇతరత్ర ఉంటే యకారం

---

తెలుఁగుల మొదళ్ళ నెయిలివి యలహల్లులు గావు స్వరములగు వ్రాయంగన్ (ల సా స 3–6)

ఎఋక యిరవనంగ నీరెండు వర్ణంబు లచ్చు లగును హల్లు లాదిగావు (పైది 7)

2 యఱ్ఱనామాత్యు ననుజన్ముఁ డహిపభూష (శృం శా )

శివలో కావాప్తిం బడసెఁగాదె యంబన నాచేన్ (శివతత్త్వసార 425)

యబ్బురమా యెఱుకగన్న యఱుగుడికన్నా (కన్నశతక )

యండమావు లుదకమైనట్లు తాజీవు (పరశురామ శతక 94)

యవతె యేనియు వెన్నుని యౌవనాఢ్య (కాళిందీ పరిణయం 2- 5)

3 సర్వలక్షణ శిరోమణి వ్యాకరణభాగం 25వ పుట

4 నుడుగుల నడుమను గడను యాకెందును దలకట్టు తక్క నెత్వంబులేదు (అప్ప 2– 75)

అకారంతోనే ఉంటుందని సూత్రించవలసి వచ్చింది అయితే ఇంత పూర్వరంగం ఈ సూత్ర నిర్మాణానికి ఏ శతాబ్దిలో అవసరమైనదని ఏ వైయాకరణుడూ అన లేదు నన్నయభాషలో గాని తత్సమకాలిక ఇతర రచనలలో గాని ఇలాంటి ఉచ్చా రణ భ్రంశాలు బొత్తిగా లేవు నన్నయ కాలానికే కాదు సుప్రసిద్ధ ఛంద కర్త అనంతుని కాలానికి కూడ పదాదిలో యకారోచ్చారణం గాని పదమధ్య యకారంలో ఎత్వాత్వాలు వ్యత్యస్తం కావడంగాని లేవని ఊహించవచ్చు

### ఋ ర వర్ణాల వ్యత్యయం

అతని కాలానికి ఋకారోచ్చారణం మాత్రం హల్లులమీద ఉన్నపుడు రేఫో చ్చారణవలె మారడం జరిగింది కాబట్టి ఆ ఉచ్చారణం మూలంగా వ్రాతలో కల్గిన తప్పును అనంతుడు ఒకటికి రెండుసార్లు సరిదిద్దాడు[1] — అంధ్రలిపి చొప్పడదు ఋకారాన్వితంబు అంటూ అతడు వ్రాసినది ఛందశ్శాస్త్రమే అయినా అక్కడక్కడ వ్యాకరణాంశాలు గూడ చెప్పి ఉన్నాడు[2]

### ఈ సూత్రం తెచ్చిన ముప్పు

ఈ సూత్ర మొక్కటే చింతామణి కర్తృత్వాన్ని నన్నయ నుండి తొలగించ డానికి సమర్థమై ఉన్నట్లు కనిపిస్తుంది బాలసరస్వతి కాలానికి కొంచెం ముందు వెనుక గూడ పదాదిలో అచ్చులు హల్లులలాగ ఉచ్చరితాలవుతున్నట్లు అప్పకవి వ్రాతనుబట్టి గూడ మనం నిర్ధారించవచ్చు[3] ఈ ఉచ్చారణ భ్రంశాన్ని తన్మూలక మైన అక్షరదోషాల్ని చిత్రకవి పెద్దన అప్పకవి వంటివారు ఖండిస్తూ సవరించడానికి యత్నించారు ఈ పద్ధతే ఆధునిక వ్యాకర్తల వరకు అనుసృతమై వస్తున్నది[4] కాని ఈవిషయంలో చింతామణి మార్గం భిన్నంగా ఉంది అది పదాదిలో యకారం ఉంటుందనీ ఆ యకారంమీద అ కారం తప్ప ఏ అచ్చైనా ఉండవచ్చుననీ

---

ఛందో ద —58 5

2 ఛందో ద —62 నుండి 85

3 అప్ప 2–43 44

4 బాలవ్యా సంజ్ఞా 7

సూత్రించింది ఈసూత్రానికి సందర్భపడే మరొక సూత్రం చింతామణిలో సర్వత్రా జ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్యః అనేది ఉంది1 ఈ సూత్రం పూర్వసూత్రంచేత (అద్యఃక్రియాస్విత్యాది) సిద్ధమైన పదాది యకారానికి అత్త్వం చెప్పడానికి ఉద్దిష్టమైంది కాగా ఈ రెండు సూత్రాలు అన్యోన్యాశ్రయాలు

ప్రస్తుతం కన్పించే అప్పకవీయ చింతామణిలో ఈ సర్వత్రాజ్వత్కార్య మిత్యాది సూత్రం దానికి అప్పకవి చేసిన వ్యాఖ్య చూపిన ఉదాహరణలు ఉన్నాయి2 కాని అహోబలపతి పదాది యకారానంగీకారంలో అప్పకవితో ఏకీభవించి అప్పకవి పారమే సమీచీనంగా భాసిస్తున్నదని వ్రాస్తూ అప్పకవీయ చింతామణిలో సర్వత్రా జ్వదిత్యాది సూత్రం లేదు గాబట్టి బాధలేదని వివరించాడు3 కాబట్టి ప్రస్తుతం అప్ప కవీయంలో కన్పించే సూత్రం ప్రక్షిప్తమని నిర్ణయించవచ్చు

బాలసరస్వతి ఓయీ యెత్వము రాఁజెప్పనేల అజ్వత్కార్యము వచ్చునన నేల? ఆదియందు యకారము లేదు అచ్చేకాని యనినఁజాలదా? అంటేఁ జాలదు ప్రయోజనాంతరము లేకున్నను నుచ్చారణ విరోధ మగుచున్నది గనుక యకార మెకారము గానేరదు అని ఈ విషయమై తన అభిప్రాయాన్ని దృఢంగా తెల్పాడు

బాలసరస్వతి అభిప్రాయంతో అతని పూర్వులు గాని సమకాలికులు గాని అనంతర కాలికులు గాని ఏకీభవించడం లేదు కేతనాదులు ఇలాంటి విచికిత్సకే స్థానమీయలేదు బహుశః సందర్భపడక కావచ్చు చిత్రకవి పెద్దన అప్పకవ్యాదులు పదాది యకారాన్ని పనిగట్టుకొని ఖండించారు చిన్నయసూరి మున్నగువారు గూడ అప్పకవ్యాదుల మార్గాన్నే స్వీకరించారు

---

1 చింతా సంధి 28

2 అప్ప 5–40 4 సూత్రానికి వ్యాఖ్యానానికి ఈ సందర్భంలో సంబంధమే లేదు పదాది యకారం మీద ద్రుతప్రకృతికాలు చేరితే ఆ యకారం అచ్చు అవుతుందని సూత్ర తాత్పర్యం కాగా వ్యాఖ్య మాత్రం పదాదిలో యకార ముండదని ప్రారంభించబడి ఉంది

3 అహో పం సంజ్ఞా 8 వ్యాఖ్య

వువూ వొవో లు

ఇక్కడ బాలసరస్వతి సమాధానించవలసిన ప్రశ్న ఒకటి మిగిలి ఉంది ఉచ్చారణలో ఉన్నదున్నట్లే గ్రహిస్తే అసలు భాషాసర్వస్వమే గ్రాంథికరూపంనుండి వ్యావహారిక రూపాన్ని దాల్చవలసి వస్తుంది కేవలం ఒక వర్ణం విషయంలో ఉచ్చారణకు ప్రాముఖ్య మిచ్చి మిగిలిన భాషాసర్వస్వ విషయంలో ఈయకుండటం విచిత్రం కాదా? అలాగే యకారంతోపాటు వువూ వొవో లు గూడ అచ్చుల స్థానంలో (ఉఊ ఒఓ) ఉచ్చరించబడి గ్రంథాల్లో గూడ చోటుచేసికొనడం జరిగింది అతని కాలానికే[1] కాబట్టి ఈ ఉచ్చారణ సిద్ధాంతాన్ని అక్కడ గూడ అన్వయించి పదాదిలో వువూ వొవో లు గూడ అంగీకరించి తరువాత వాటికి అచ్చ్వ విధానం చేయవలసి ఉంది

ఈ విషయమై బాలసరస్వతి ఈయని సమాధానం శ్రీ వజ్ఝల చినసీతారామ స్వామిశాస్త్రి ఇచ్చి ఉన్నారు- కాని అది అంగీకారయోగ్యం కాలేదు[3]

ఈ ప్రాసంగిక చర్చలు ముగించిన తరువాత చింతామణి కర్త పదాదిలో యెవడు యేమి మొదలైన రూపాలేగాక యిపుడు యిది వంటి రూపాల్ని గూడ (యకారాదులుగా) అంగీకరించా దనడానికి బాలసరస్వతి పారం అవకాశమిస్తుంది పదాదిలో యకారం మీద అకార ముండదని మాత్రమే సూత్ర మంటున్నది గాబట్టి ఇతరాచ్చులు ఇకారాదులు ఉండవచ్చు గదా

---

కళ్ళదే వునకు ననుంగువాఁడనని వుత్సుకతన్ నుతియింతు

(వృషాధిపశతకం 98)

వొక్కని డించిపోవుటయు భీతిల్లి (గౌరన నవనాథ చరిత్ర 92 పుట)

వుండంగఁదగిన తావులను విశ్వాస్య (పైది 77 పుట)

వోజమై జరయుచావును దెవుల్లేని (తిమ్మకవి ద్విపద భారతము 2 పుట)

వుడిపి కోలూని పోవుచునుండి (పైది 4 పుట)

2 చిం విష శ్లో 5

3 చూ చిం విష శ్లో శ్లో

## అజ్వత్కార్యం

యెవఁడు యెమి యెగ్గు వంటివి సహజంగా యకారాదులై ఉంటూ ద్రుత ప్రకృతికాలకంటె పరమైనపుడు మాత్రం అజ్వత్కార్యం పొందుతాయి–సర్వత్రాజ్వ దిత్యాది సూత్రి మహామచే అంటే ద్రుతప్రకృతికాలకు పరం కానపుడు యకారా దులుగానే ఉంటాయని అర్థం కాని నన్నయ నుండి చిన్నయ వరకు పదాది యకారం కనబడదు పైగా ఉత్తుకి ఇత్తుకి అత్తుకీ ఈపదాది యకారాలు పరమైతే సంధి ఎలా జరుగుతుందో చింతామణి చెప్పదు ఈ మహావిరోధం గమనించే అహోబలపతి వికృతివివేకంలోనిదంటూ ఒక కారికను చూపి ఉత్వాది సంధులు బాధారహితంగా జరిగేటట్లు చేశాడు: కాబట్టి బాలసరస్వతి పారం ప్రకారం పదాది యకారాన్ని చింతామణి అంగీకరించినట్లు ఒప్పుకుంటే రెండు విరోధాలు అపరి హార్యాలుగా మిగిలిపోతున్నాయి సహజంగా యకారాదులుగా ఉన్నపదాలకి ప్రయోగాలు లేకపోవడం 2 కళలకు పరమైనపుడు ఉత్వాది సంధులు యకారాది పదాలకి జరగకపోవలసిరావడం రెండో విరోధం అహోబలపతి సమాధానంతో అంటే వికృతివివేకి కారికతో పరిహరించ వచ్చునని అనగూడదు చింతామణి కర్త తన గ్రంథం స్వతంత్రంగానే రచించి ఉంటాడు గాని భవిష్యత్తులో వికృతివివేక శ్లోకంతో పరిహరించ దగిన విరోధాలు కొన్ని తన రచనలో మిగిలించి పోయాడని ఎలా విశ్వసిస్తాం?

## సూత్రాన్నిబట్టి చూస్తే అపరూపాలు

ఈ పైచర్చ సర్వస్వం బాలసరస్వతి వ్యాఖ్యానాన్ని ఆమోదిస్తే పుట్టు కొచ్చింది ఆ సూత్రం తాను నిర్దేశించిన స్థానంలో ఏ అచ్చు ఉంటుందో చెప్పక పోవడం నిరుద్దేశంగా ఇతరస్థానాల్లో అన్నిచోట్ల అకారంతోటే యకారం ఉంటుం

---

వాఁడు + యెవఁడు అనేచోట సంధిర్వాచోచ్యనుత (సంధి–) అనే సూత్రప్రవృత్తికి వీలులేదు–అక్కడ ఉత్తుకి యకారం (స్థిరాక్షరం) పరమై ఉందే గాని ఎకారం పరమై లేదు గాబట్టి

2 అహో పం సంజ్ఞ 0 సూ వ్యాఖ్య

దనడం ఏమి రచనో తెలియదు ఆ సూత్రానికి అవ్యాప్తులు అతివ్యాప్తులు కొల్లలు దాని ప్రకారం క్రింద చూపిన పదజాల మంతా తప్పుకావలసి వస్తుంది

వ్రాయుట చేయుట— భావార్థక కృత్తులు

2 చేయుము వ్రాయుము—విధ్యర్థక క్రియలు

3 అయ్యెడున్ పోయెడున్—తద్ధర్మార్థకాలు

4 ఏయుచున్ చేయుచున్—శత్రర్థకాలు

5 ఏయుడున్ చేయుడున్—ఆనంతర్యార్థకాలు

6 కొనియెడువాడు చనియెడువాడు—తృవర్ణకార్థకాలు

7 చేయుదురు వ్రాయుదురు—తద్ధర్మార్థికాలు

8 దోయిలి చెయిది—వంటి పదాలు

9 అయారె ఒయారి—వంటి పదాలు

0 ఊయెల తాయెతు—వంటి పదాలు

ఇంత అసందర్భంగా అస్పష్టంగా చేసిన సూత్ర రచన తెలుగులో ఆదికవిగా ఆరాధించబడే వ్యక్తికి బలాత్కారంగా అంటగట్టకపోతే కలిగే నష్టమేమిటో విజ్ఞులే వివేచించాలి

అఱ నెఱ సున్నాలు

హ్రస్వాత్ పూర్ణోఽపి భవేత్ దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ స జ్ఞేయ
(సంజ్ఞ 20 2 )

దీనికి బాలసరస్వతి వ్యాఖ్య హ్రస్వాత్=లఘ్వక్షరంబుకంటెఁ బరమైన ఖణ్ణ -అర్ధబిందువు పూర్ణోఽపి=నెఱబిందువును భవేత్=అగును దీర్ఘాచ్చేత్=దీర్ఘాక్షరముకంటె బరమైనదైన ఖణ్ణఎవ=అర్ధబిందువే కాని నెఱబిందువు కాదని

జ్ఞేయః=తెలియునది దీని వ్యవహారం మెల్లంటే పదఁతి అనునది యర్ధబిందువు లఘ్వక్షరముమీద నున్నది గనుక పదంతి యను నెఱబిందువునౌను ముద్దుఁగన్నియ అనునది సాధ్యానుస్వారమును లఘ్వక్షరము పరమును గనుక ఆలాగుననే ముద్దుం గన్నియ యను నెఱబిందువును ఔను సర్వత్ర ఇట్లే తెలియునది దీర్ఘ పరములైన వీఁక వాఁక కాఁక అని యర్ధబిందువులే యవుంగాని నెఱబిందువులు గావు

అప్పకవి వ్యాఖ్య

జగతిపై సిద్ధసాధ్యసంజ్ఞలఁబొసఁగు ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁబూర్ణంబులనుజేయ వచ్చుఁ గృతులఁ బూర్ణములు ఖండములు
సేయఁబొనఁగ వెందు

కొలకులకుఁ గొలంకులునాఁ దలఁపులకుఁ దలంపులిట్లు తగ సిద్ధములై
చెలువందుఁ జిఱుత సున్నలు వెలయును బూర్ణంబులగుచు విషధరతల్పా

జలజాక్షిఁ గొలుతు ననుచో జలజాక్షుం గొలుతు ననుచు సాధ్యార్ధము భూ
తలమున నెరసున్నయునై చెలువగుఁ గామె పలివాన సిద్ధోల్లాసా

నిడుదలగు నక్కరములపై నిలిచినట్టి యర్ధబిందువు లన్నియు నరసిచూడ
ధరణి సిద్ధంబులైన సాధ్యంబులైన ఖండములె కాని పూర్ణముల్ గావుసుమ్మ

లోఁగ వించుకైన బాఁగతనంబున దోఁచి వలువలెల్ల దాఁచినావు
గీఁజు బూరకొమ్ము నేఁజనవలెనన్న నిడుదమీఁదసున్న నిలుచనగము
(అప్ప 2–26 నుండి 30)

హ్రస్వముమీద ఉండే అరసున్న నిండుసున్నగా గూడ కావచ్చుననీ దీర్ఘం మీద అరసున్న అరసున్నే అని చింతామణి సూత్రించింది

వ్యవహారంలో మొదట ఉచ్చారణలో ఉన్న సున్నలు తరువాతి కాలంలో ఉచ్చారణను కోల్పోయి లేఖనంలో మాత్రం పాత అలవాటును బట్టి నిలిచి ఉండట మన్నది తెలుగుభాషలో ఉంది

కొన్ని దేశ్యపదాల్లో ఉండే సున్నలు కొన్ని ప్రాంతాలలో ఉచ్చారణలో ఉండటం మరికొన్ని మండలాలలో లేకపోవడం 6వ శతాబ్దివాడు ప్రసిద్ధ ఛంద కర్త అయిన అనంతునికాలం వరకు జరుగుతున్నట్లు అతని రచననుబట్టి నిర్ణయించవచ్చు

పొండి మరగి బ్రతుకు వాండ్రిల్రవే లు వాండ్ర వెన్నలేల తండ్రి యన టి
పండుకొలకు వింత యిండ్లకుఁబోకు కృష్ణుండ నీకుఁబ్రాతె పండ్లు నిచట
(ఛందో ద –64)

కాబట్టే వ్యాకర్తలు దీర్ఘాక్షరాలమీద నిండుసున్న లుండవని చెబుతున్నా కవుల కావ్యాల్లో మాండలిక భాషాప్రభావం వలన కావచ్చు అవి ప్రత్యక్షమౌతుండేవి నన్నెచోడుని కుమారసంభవంలో పాల్కురికి సోమన బసవపురాణంలో మల్లియ రేచన కవిజనాశ్రయంలో దీర్ఘంమీద నిండు సున్నలు కనుపిస్తున్నాయి బహుశ కేతన ఈ ప్రయోగ పరిశీలనం వలననే కావచ్చు పద్యాల్లో దీర్ఘాలమీద నెఱసున్న ఉండవచ్చు అరసున్నలు నిండుసున్నలుగా ఉచ్చరితాలు గావచ్చు అని లక్షణం చేశాడు

కుఱుచలపై నరబిందులు నెఱయగ నూదినను జెల్లు నిడుపులమీ దన్
నెఱయవు గద్యంబులలో నెఱబిందువు లూదుఁ బద్య నికరములోనన్
(ఆం భా భూ 58)

పై పద్య పరిశీలనం వలన మొదట వ్యవహారంలో ఉన్న నిండుసున్నలే తరువాత భ్రష్టాలై అరసున్నలుగా (కేవలం లేఖనంలో ఉండి ఉచ్చారణలో లేనివిగా)

---

వ ఆశ్వాసంలో 4–పీంగు 2వ ఆశ్వాసంలో 82–పీండె 5వ ఆశ్వాసంలో 4 –నాందగు 6వ ఆశ్వాసంలో 57–పోండిగ మూండు 8వ ఆశ్వాసంలో 89–పోంక సోంకిన 0వ ఆశ్వాసంలో 55–పీండు వాండు 2వ ఆశ్వాసంలో 69–ఆంక పీంక

2 3వ పుటలో బోండిగ

3 జాత్యధికారంలో ౧ ప పు౦ మూంపు మూండిన పోండిగా

నిలిచిపోయినట్లు తెలిసికోవచ్చు అయినపుడు ఆ విషయం ప్రతిఫలించేటట్లు సూత్రించిన కేతనే చింతామణి కర్తకంటె పూర్వుడని నిర్ణయించవచ్చు

కుఱుచల తుది హల్లులకున్ బిఱుదన్ నెలకొన్నయట్టి బిందువులెల్లన్
నెఱయఁగ నూదుచుఁదెలుచు నొంబై యిరుదెఱ గుఁజెల్లుచుండుం గృతులన్
(ఆం భా భూ 56)

పై లక్షణంలో గూడ అరసున్నలు నిండుసున్నలౌతాయని గాక వ్రాస్తాల మీద ఉండే సున్నలు ఉచ్చారణలో ఉండటం (ఊదుట) ఉండకపోవడం (తేలుట) మాత్రమే చెప్పాడు దీనికి పూర్వపదంలో అరబిందులు అని ప్రయోగించినా అందులోను దీర్ఘాలమీద గూడ ఈ అరబిందులు పద్యాల్లో మాత్రం నెఱబిందు లౌతాయని సూత్రించడం తప్పనిసరిగా ఆంధ్రభాషాభూషణం చింతామణికంటె ప్రాచీన మని నిర్ణయించడానికి ఒక ఆధారం

చింతామణి సూత్రించిన దాన్నిబట్టి సహజంగానే పదాల్లో అర్ధబిందు లున్నాయని అనిపిస్తుంది కాని ఆంధ్రభాషాభూషణ నియమాన్నిబట్టి చూస్తే ఉచ్చారణలో సున్న ఉండటం ఉండకపోవడం మాత్రమే సూత్రితమైనట్లు తెలుస్తుంది కేతన తరువాతివాడు అనంతుడు గూడ ఈ విషయాన్ని కేతన మార్గంలోనే వివరించాడు

కుఱుచమీఁది సున్న మఱితేల వ్రాయఁ బ్రాసద్వయాది నిట్లు జరుగునచ్చు
తుఁడు సమస్త వల్లభుఁడు నాఁగనయ్యచ్యుతుండు సకలవల్లభుండనంగ
(ఛందో ద -34)

ఈ సందర్భంలో ప్రాచీన బిందులేఖన విధానంలోని ఒక ముఖ్యాంశం గమనించాలి వాతలో సున్నలు రెండూ నిండుగానే ఉంటూ తరువాతి అక్షరాన్ని జడిగా వ్రాస్తే నిండుగా (ఊది) పలకడం అలాకాకుంటే అరగా (తేల్చి) పలకడం జరిగేది పై పద్యంలోని ఉత్తరార్ధమే ప్రాచీన లేఖనంలో తుండు సమస్త వల్లభుండు నాంగ నయ్యచ్యు తుండ్డు సకల వల్లభుండ్డ నంగ్గ అని ఉండేది వ్రాతలో అరసున్నను అరగానే వ్రాయడమనేది మిక్కిలి అర్వాచీనమైన అలవాటు

ఎని శబ్దానికి సంధి

(సంధి 0)

అపశబ్దార్థస్యేత

బాలసరస్వతి వ్యాఖ్య అపశబ్దార్థస్య - అప అను నుపసర్గార్థ పదముయొక్క ఇత =ఇకారమునకు వికల్పమున లోపము వచ్చును ఉదా హారునే నంబనే హారునేని నంబనేని

అప్పకవి వ్యాఖ్య

ఏని యనుమాట కడపలఁ గానంబడు నిత్తుమీఁదఁ గదిసినచోటన్
బ్రాణములు సంధిగాంచును బూనివికల్పంబువలనఁ బుణ్యచరిత్రా

(అప్ప 5–80)

ఉదా పలుకుచెలియే సుమా ప్రాణభర్త యేని
వనజభవుడేని యహికులస్వామియేని (పైది 8 )

ఈ సూత్రంలో ఎని పదంలోని ఇత్వానికి వికల్పంగా లోపం చెప్పడం జరిగింది లోపమంటే సంధి చెప్పినట్లే దీనికి పూర్వాన ఇత్వసంధులు విడిగా చెప్పబడి ఉన్నాయి దీనిని గూడ వాటిలోనే గతార్థం చేయవచ్చు కాని సూత్రకర్త అలాచేయలేదు చేయకపోవడానికి అహోబలపతి ఒక కారణం చెప్పాడు–రామునే సీతనేఁ గొల్తు వంటి సంధిరూపాల నిష్పత్తి కోసం ఈ సూత్రం చేయబడిందనీ లేకపోతే కిమాదిగణంలోనే ఈ పదాన్ని వేయవచ్చు[1] ననీ

అయినా ఇదొక విచిత్ర యాత్రం ఒక సామాన్య పదాన్ని ఎత్తుకొని దానిలోని ఒక అచ్చుకు మాత్రం లోపం విధించడ మేమిటి అసలు ఎని అనేపదానికి ప్రత్యేకించి సంధివిధానం ఎందు కవసరమయ్యింది ఈ రెండక్షరాల ఎదానికి ఇంత ప్రాముఖ్యం ఎందుకు వచ్చింది

అనంతుని ఛందోదర్పణంలో ఈ ఎని పదానికి ఒక ప్రముఖస్థానం ఈయబడి దీని సంధి కథ చెప్పబడి ఉంది

---

అహో పం సంధి 0

ఎని యను పదంబుతో నాదిపదమంది
సంధి నిత్యయతుల జరుగుచుండు
నెట్టి క్రూరకర్ముఁడేని సద్గతినొందు
నిన్ను నాత్మఁదలఁచెనేని కృష్ణ (ఛందో ద – 03)

అనంతుడు నిత్యయతిని ప్రతిపాదించే సందర్భంలో ఈ ఏని పదానికి ఒక చరిత్ర కల్పించగా తరువాతి లాక్షణికులు కొందరు ఆ పద ప్రాముఖ్యాన్ని గుర్తించి తమ గ్రంథాల్లో దానికి స్థానం కల్పించారు వారిలో మన చింతామణి కర్త ఒకడు ఇక ఇక్కడ అనంతుడు చింతామణిలోని అపశబ్దార్థే స్యేతి అనే సూత్రాన్ని చూచి తన నిత్యయతి లోని ఏనిశబ్ద సంధివిషయాన్ని చెప్పాడని అనలేము ఎందుకంటే అనంతుని కాలానికి చింతామణి ఉనికి లోకానికి సంబంధించినంతవరకు లేదు పైగా అపశబ్దార్థ మంటే సామాన్యంగా తెలుగు విద్యార్థికి కూడ స్ఫురిస్తుందే గాని ఏని గాదు బాలసరస్వతీ అప్పకవీ చేసిన చూపిన వ్యాఖ్యల్ని ఉదాహరణల్ని బట్టి గూడ ఏని కి వికల్పార్థమే కనుపిస్తున్నది గాని అపార్థం గాదు

ఇక్కడ అపశబ్దార్థ మనే సూత్రస్థ పదానికి ఏని అని అర్థం చెప్పడం సూత్రకర్తా వ్యాఖ్యాతా ఒకరేనా అనే సందేహాన్ని కల్గిస్తున్నది

ఛందోదర్పణంలోని ఏనిశబ్దాన్నే సంస్కృతంలో చెప్పవలసిన కారణాన అపశబ్దార్థంగా చింతామణి స్వీకరించినదని ఒక ప్రతిపాదన చేయవచ్చు ఇతర విధాల చింతామణి కాలాన్ని నిర్ణయించే ఆధారాలు దొరికిన తరువాత ఈ ప్రతిపాదనను నిశ్చయంగా మార్చవచ్చు

చింతామణి చెప్పిన నామవిభక్తి ప్రత్యయాలు

ప్రథమ—డు ము వు లు ( డుమువు లవ ప్రథమాస్యాత్ అజంత )

ద్వితీయ—కు ర్చి ల ను ని ( కూర్చి లనునయో శ్చవేద్ద్వితీయాతు అజంత 2)

---

చూ సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు అనే ప్రకరణం

తృతీయ—తో చేత తోడ చే (తో చేత తోడచే స్యుః తృతీయాయాః అజంత 3)

చతుర్థి —కొఱకు కై (కొఱకు కై చతుర్థ్యాః స్త్రు అజంత 4)

పంచమి—పట్టి వలన కంటె (పట్టి వలన కంటె ఇతి పంచమీ అజంత 5)

షష్ఠి —లోపల కి కు యొక్క (అథ లోపల కి కు యొక్కాన్యాః అజంత 6)

సప్తమి —అందు ఇందు న (అందిందు నాస్తు సప్తమీ అజంత 7)

సంబోధన ప్రథమ—ఓయి (ఓయీత్యామంత్రణం చ విశ్రుతౌ స్యాత్ అజంత)

విభక్తి ప్రత్యయాలు ప్రసిద్ధమైన వ్యవహారబలంమీద ఏర్పడతాయి తెలుగులో వాక్యాల్లోని కొన్ని కొన్ని పదాలు పదాంశాలూ తమ పూర్వపర పదాలతోడి సంబంధాన్ని పురస్కరించుకొని సంస్కృత వ్యాకరణ నియమాన్నిబట్టి అంటే సంస్కృతంలోని పర్యాయ వాక్యాల పోలికల్నిబట్టి విభక్తి ప్రత్యయాలుగా స్వీకరించబడినాయి రామునికంటె భీముడు బలవంతుడు అనే తెలుగువాక్యాన్ని రామాత్ భీమ బలవాన్ అనే సంస్కృత వాక్యంతో పోల్చిచూస్తే రామాత్ అనే సంస్కృత పంచమీ విభక్త్యంత పదం స్థానంలో రామునికంటె అనే పదం ఉన్నదిగాబట్టి అది పంచమ్యంతం అందులో రామ ప్రాతిపదిక కంటె అనేది ప్రత్యయం మిగిలిన వర్ణాలు ఆగమాలు ఇదీ తెలుగు పదనిర్మాణ క్రమం – మన వ్యాకర్తల దృష్టిలో నిజానికి ఇక్కడ కంటె అనేది ఒక విభక్తి ప్రత్యయం ఒక పదం కలిస్తే ఏర్పడిన పదబంధం ఇలాగే కొఱకు అనేది గూడ ఒక పదం

---

కి + అంచే అంటివి + ఎని – అంటి + ఎని – అంటేన్ – అంచే కంచే – కంటె

ఒక ప్రత్యయం కలిసి ఏర్పడిన పదబంధమే ఇలాగే ఏ రెండు మూడో తప్ప తెలుగులో మిగిలిన విభక్తులన్నీ పదాలో పదసముదాయాలో పదాల అవశేషాలో అయ్యుంటాయని భాషా శాస్త్రవేత్త లంటారు

## నన్నయ్యలో లేని విభక్తులు

నన్నయ కాలానికిగాని తత్సన్నిహిత కాలానికిగాని చింతామణి పేర్కొన్న విభక్తి ప్రత్యయాల్లో – కూర్చి 2 కొఱకు 3 పట్టి అనేవి ఏర్పడి ఉండ లేదని తత్కాలీన వాఙ్మయాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది

నన్నయలో ఎక్కడా కూర్చి కొఱకు పట్టి అనేవి విభక్తి ప్రత్యయాలుగా కనబడలేదు కాని వీటిలో కొఱకు అనేది పాఠాంతరాల్లో కేవలం రెండుచోట్ల ఉన్నట్లున్నది గాని ఆ రెండుచోట్లా సందర్భాన్నిబట్టి చూస్తే కొఱకు లేని పాఠాలే సమీచీనాలుగా కనిపిస్తున్నాయి కై విభక్తికి గూడ నన్నయలో ప్రయోగం మృగ్యమే కేవలం ఒకచోట మాత్రమే కనిపిస్తుంది॰ ఇక కూర్చి పట్టి అనేవి పదాలుగా అంటే కూర్చు ధాతువు క్త్వార్థకంగా కూర్చి పట్టు ధాతువు క్త్వార్థకంగా పట్టి ప్రయుక్తాలైనవే గాని విభక్తి ప్రత్యయాలుగా కావు॰ కాబట్టి తన కాలంలో ఇంకా పుట్టని కూర్చి పట్టి అనే విభక్తి ప్రత్యయాల్ని నన్నయ చింతామణిలో ముందుగానే పేర్కొన్నాడని వాదించడం ఎంత పెద్ద పండితులకైనా న్యాయ్యమూ భావ్యమూ అయిన పని కాదు

## నన్నయ్యలో ఉన్న అభాస విభక్తులు

ఇక్కడ మరొక విషయం గూడ చర్చించాలి నిజంగా నన్నయ్యే చింతామణికి కర్త అయి ఉంటే అందులో అతని కాలానికి సుప్రసిద్ధంగా వ్యవహారంలో

---

కొఱ ( ప్రయోజనం) + కు = కొఱకు కొఱ గాని కొదుకు ఇత్యాది ప్రయోగం సుప్రసిద్ధం

2 సభా – 74

3 నన్నయ పద ప్రయోగకోశం 424 6 7 పుటలు

విభక్తి ప్రత్యయాలవలె ఉన్న అవ్యుత్పన్న శబ్దాలు రెండు మూడు కనీసం చోటు చేసుకొని ఉండవలసింది

ఉదా తొట్టి – ఇది నేటి మన వ్యవహారంలోని నుండి వంటిది దీనికి నన్నయలో 20కి పైగా ప్రయోగాలు కనుపిస్తున్నాయి[1]

2 వొంటె – ఇది నేటి మన వ్యవహారంలోని కొఱకు వంటిది దీనికి నన్నయలో 3కి పైగా ప్రయోగాలున్నాయి[2]

3 చేస – ఇది నేటి మన వ్యవహారంలోని చేత వంటిది దీనికి నన్నయలో వందల ప్రయోగాలున్నాయి[3]

కాగా పై పరిశీలనంవలన నన్నయ కాలానికి ప్రసిద్ధాలుగా విభక్తిస్థానంలో వ్యవహృతాలై ఉన్న పెక్కు శబ్దాలు చింతామణిలో లేపనీ అతనికి తరువాత కొన్ని వందల ఎండ్లకు గాని వ్యవహారసిద్ధంగాని పెక్కు విభక్తి ప్రత్యయాలు చింతామణిలో ఉన్నాయనీ నిశ్చయించవచ్చు కాబట్టి చింతామణిని నన్నయతో ముడి పెట్టడం బొత్తిగా కుదరదు

## లోపదీర్ఘత కల్గిన రూపాలు

వికృతౌ క్వచిచ్చలోపో మార్దీర్ఘశ్చాత ఆదిమస్యభవేత్

(చింతా అజంత 43)

బాలసరస్వతి వ్యాఖ్య వికృతౌ=తెనుఁగునందు క్వచిత్ = ఒక్కొక్కదిక్కున మో =మూకు లోప =లోపమవును ఆదిమస్య=ఆ మొదటనుండెడు అత =అకారమునకు దీర్ఘశ్చ=దీర్ఘమును వచ్చును చకారము వలన వికల్పమనుట

ఉదా జంపాలు జాంపాలు

---

1 నన్నయ పద ప్రయోగకోశం 544

2 పైది 663

3 పైది 495 నుండి 497

ఈ సూత్రం అప్పకవీయ చింతామణిలో లేదుగాబట్టి అతని వ్యాఖ్యగూడలేదు

సంస్కృతంలో నపుంసకలింగాలైన శబ్దాలు జ్ఞానం పుస్తకం వంటివి ఉత్వసహితాలై జ్ఞానము పుస్తకము వంటి రూపాల్ని పొందగా వాటి సామ్యంతో అమహద్వాచకాలు వృక్ష మంచ వంటివి వృక్షము మంచము వంటి రూపాల్ని ధరించాయి సంస్కృతం నుండి తెలుగులో చేరిన అమహద్వాచకాల ము ప్రత్యయం అలా ఎర్పడింది

సహజంగా తెలుగులో బెల్లము అల్లము సున్నము వంటివి ఉన్నాయి

వీటికి బహువచనాల్లో జ్ఞానములు పుస్తకములు వృక్షములు మంచములు బెల్లములు అల్లములు సున్నములు—వంటి రూపాలు ఎర్పడినాయి

తరువాత మానవుని ఉచ్చారణ త్వరలో సుఖాభిలాషతో అవి వృక్షాలు సున్నాలు అన్నట్లు మార్పుచెందాయి ఈ మార్పులో బహువచన ప్రత్యయానికి ముందున్న ము లోపంచి ఆ లోపాన్ని పూరించడంకోసం తత్పూర్వస్వరం దీర్ఘమయింది

ఇలాంటి రూపాలు నన్నయ కాలానికి వ్యవహారసిద్ధాలుగా కనిపించవు తరువాత కేతనకాలానికి గూడ వీటికి వ్యవహారం ఉన్నట్లు చెప్పలేం కాని కేతన గ్రామ్యభాషను ఉదాహరిస్తూ —— యేదాలు – వోదాలు అని వేదములు—వాదములు అనే రూపాల భ్రష్టోచ్చారణల్ని పేర్కొంటాడు ఈ ఉదాహరణల్లో ద్వివిధమైన గ్రామ్యత్వం కనిపిస్తుంది ఒకటి వకారం యకారం గావటం రెండు ము లోపించి పూరణగా పూర్వస్వరం దీర్ఘం కావడం కేతన ఇచ్చిన ఈ ఉదాహరణల్ని బటి అతని కాలానికి ఈ ము లోపించిన జొంపాలు జంపాలు వంటి రూపాలకు గ్రామ్యత్వమే ఉందని అనుమానించివచ్చు ఆ అనుమానాన్ని అతని వ్యాకరణంలో అలాంటి రూపాల నిష్పత్తిని చేయకపోవడాన్ని బట్టీ వాటికి పయోగార్హతను కల్పించకపోవడాన్నిబట్టీ నిశ్చయంగా మార్చుకోవచ్చు

---

అం భా భూ 26

పై పరిశీలనకు అనుగుణంగానే నన్నయకు సమకాలంలో గాని సమీప కాలంలో గాని అలాంటి రూపాలు వాఙ్మయంలో ఎక్కడా కనిపించడంలేదు అతనిలో అలాంటి రూపాలు లేనేలేవు నన్నయ కాలానికి తరువాత తిక్కన యుగంలో గాని అలాంటి రూపాలకు వ్యవహార ప్రసిద్ధి ప్రబలి వాఙ్మయంలో స్థానం దొరకలేదు కాబట్టే కేతనకు తిక్కనకూ తరువాతివాడు ముద్దరాజు రామన తన కవిజన సంజీవనిలో ఇలాంటి రూపాలకు ఉపాదేయత్వాన్ని కల్పించాడు

సంస్కృతపదంబు గృతుల దత్సమము సేయు
నపుడు ముత్వంబగున్ దీర్ఘమైనఁ జెల్లు
భానుకులఁ డగ్గె బరుని ప్రాణాన కనఁగ
మౌనులు భజింతు రతని సౌఖ్యాన కన గ (కవిజనసంజీవని –20)

ఉదాహరణగా తిక్కన ఉద్యోగపర్వంలోని

మానుగ ధృతరాష్ట్రి దు ప్రా
ణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామ య
శోనాశము నుడుపనేల చూచెదు చెపుమా

అనే పద్యాన్ని ఉదాహరించాడు

నన్నయలో ఈ సూత్రానికి ఉదాహరణ గాదగిన రూపాలు లేనికారణంగానే చింతామణికీ నన్నయ రచనకీ లక్షణ లక్ష్య సమన్వయం చేసి చూపుతానని ప్రతిజ్ఞ చేసిన పారనంది రామశాస్త్రిగారు తమ ఉద్ద్యోతినీ వ్యాఖ్యలో ఈ సూత్రానికి నన్నయోదాహరణంగా ఘూరిర త్నాల యస్థుల వీర్యవంతుల నర్థవంబు సమస్త సత్త్వాలి దోప గ (అరణ్య 3– 6) అనే పద్యభాగాన్ని పొరపాటుగా ఇచ్చారు ఇక్కడ రత్నాలయస్థుల (రత్న + ఆలయ) అనే సమాసంలోని రత్నాల అనేదాన్ని రత్నముల అనే పదానికి క్లుప్తరూపంగా భ్రమించారు నిజానికి నన్నయ రచనలో ఎక్కడా ఈ సూత్రానికి ఉదాహరణ లేదు

---

అరణ్య 3– 6

అప్పటికి ఇంకా అటువంటి రూపాలకు వ్యవహారసిద్ధి లేదు అవి భవిష్యత్తులో గాని వ్యవహారంలో ఎర్పడి వాఙ్మయంలో చోటుచేసుకోలేదు

## దీర్ఘాంత-దేశ్య శబ్దాలు

నచ దేశ్యపదే (అజంత 48)

బాలసరస్వతి వ్యాఖ్య దేశ్యపదే=దేశీయపుఁదెనుఁగునందు నచ=లేదు ఉదా నవలా నేజా లకోరీ ఇత్యాది అప్పకవీయ చింతామణి సంధి పరిచ్ఛేదాంతము వరకే లభిస్తుంది గాబట్టి అజంత పరిచ్ఛేదానికి చెందిన ఈ సూత్రం దానిలో ఉండదు

సంస్కృతంలో దీర్ఘాంతాలైన శబ్దాలు తత్సమాలుగా తెలుగులో చేరేటపుడు కలిగే మార్పును వివరిస్తూ దీర్ఘాలు హ్రస్వాలౌతాయని సూత్రించి ఆ నియమం దేశ్య శబ్దాల దీర్ఘాలకు అన్వయించదని నిషేధించే సూత్ర మిది

సంస్కృతంలో దీర్ఘాంతాలైన శబ్దాలు హ్రస్వాంతాలుగా తెలుగులో చేరడం తెలుగు వాఙ్మయంలో మొదటినుండీ ఉన్నదే ఆవిషయాన్ని సూత్రించే సమయంలో సూత్రకర్తకి సంస్కృతాలే గాక దేశ్యపదాలు గూడ కొన్ని దీర్ఘాంతా లున్నట్లు స్ఫురణకు వచ్చి వెంటనే ఈ నిషేధ సూత్రాన్ని నిర్మించవలసి వచ్చింది

దేశ్య పదాలు దీర్ఘాంతాలుగా ఉండద మనేది తెలుగుభాషలో నన్నయకాలంలో లేదు తెలుగుకి పారశీ ఉరుదూ భాషల సాంగత్యం ముదిరి తెలుగునాట ముస్లిముల పాలన నె కొన్న తరువాత గాని సంస్కృతేతర పదాలు దీర్ఘాంతాలుగా తెలుగులో అడుగు పెట్టడం ప్రారంభం కాలేదు ఈస్థితి వ్యాకరణ వాఙ్మయంలో గుర్తింపునకు రావడం అర్వాచీన కాలంలో జరిగింది కాబట్టే కేతనకు ఈ పటున దేశ్యపదాల ప్రసక్తి రాలేదు అతని లక్షణ మిది

లలినేకాక్షర పదములు వెలిగాఁ దక్కిన పదముల వెలసిన తుద య
చ్చుల నిడుపు లుడుపఁ దెనుఁగగు నిల నెప్పటియట్ల యుండు
నీ యంతంబుల్ (ఆం భా భూ 31)

లక్ష్యంగా—

ఘ్రు యన ధీ యన శ్రీ యన నీ యెకాక్షరపదంబు లీక్రియ జను గౌ
రీయన గౌరియగున్ వాణీయన వాణియగు మణి మణీయనుచోటన్
(పైది 32)

కేతన దేశ్యపదాల దీర్ఘాంతత్వాన్ని రక్షించడానికి సూత్రరచన చేయలేదంటే అతని కాలానికి ఆ శబ్దాల పుట్టుక లేక వాటికి తెలుగులో వ్యవహారసిద్ధి ఏర్పడ లేదన్న మాట కేతన తరువాత పుట్టిన వ్యాకరణంలోనే దీర్ఘాంతాలైన అన్యదేశ్య పదాలకోసం లక్షణం చెప్పవలసి వచ్చినదని అనుమానించవచ్చు ఈ అనుమానాన్ని కేతన తరువాతి వ్యాకరణ వికాసాన్ని పరిశీలించి నిశ్చయంగా మార్చుకోవచ్చును

ఇక్కడ నన్నయభారతంలో పాఠాంతరంగా కనుపించే ఒక్క శబ్దం గాడీ అనేది దీర్ఘాంతంగా సంస్కృతేతరంగా ఉన్నదన్న విషయం గమనించతగిందే[1] కాని దేశంలోని తాళపత్ర ప్రతులు లిఖిత ప్రతులు ముద్రిత ప్రతులు – అన్నింటిని కూలంకషంగా శోధించి సంస్కృత మూలాన్ని గూడ సంప్రదించి అక్కడి పాఠం గాడిదలే కాని అర్వాచీన రూపమైన గాడీలు కాదని ఆచార్య దోణప్ప నన్నయ అన్యదేశ్యాభాసములు అనే తమ వ్యాసంలో సహేతుకంగా నిర్ణయించి చూపారు[2] కాబట్టి నన్నయనాటికే తెలుగులో సంస్కృతేతర (అన్యదేశీయ) దీర్ఘాంత శబ్దాలు చేరబడ్డాయని వాదించడానికి వీలులేదు

బాలసరస్వతి ఉదాహరించిన నవలా శబ్దానికి 16వ శతాబ్దిలో గాని వాఙ్మయంలో ప్రవేశం లభించలేదు కాబట్టి చింతామణి కర్త నన్నయ్యే అయితే దానిలో లక్షితమైనభాష అనంతరకాలీనం కావడం పొసగదు కాగా చింతామణి 16వ శతాబ్ది తరువాతి వ్యాకరణమే అనవచ్చు

---

1 చిత్ర లలితగతి నొప్పు నేనూరు గాడీలు ఆది 3–22
2 భాషాచారిత్రక వ్యాసావళి ఆంధ్రసారస్వత పరిషత్ 972
3 పెద్దన–మనుచరిత్ర 2–25

ఐకా రౌకారాన్త శబ్దాలు

ప్రు వద్గ్లౌ (అజంత 63)

బాలసరస్వతి వ్యాఖ్య గ్లౌ =గ్లౌ శబ్దము ప్రువత్=ప్రుశబ్దమువంటిదౌను ఏకాక్షరమై నిలుచు ననుట గ్లౌ

సంస్కృతంలో గ్లౌ వంటి ఔకారాన్త శబ్దాలు పెక్కులుండగా ఒక్క ఈ శబ్దానికిమాత్రమే తత్సమరూప నిర్దేశ మేలచేయవలసి వచ్చిందో? దీనికి నన్నయలో ప్రయోగం మృగ్యం ఆయన సమ సమీప కాలాల్లోగూడ ఈపదం కనిపించడంలేదు

కావ్యాలంకార చూడామణి బాలసరస్వతి కాలానికి నిశ్చయంగా పూర్వమే విన్నకోట పెద్దనచే రచితమై ఉంది దాని రచనా ప్రణాళిక ఆంధ్రభాషాభూషణాను కారి దానిలో అజంత సంస్కృత శబ్దాల రూపనిష్పత్తిని తెలుపుతూ ఐకారాంతౌ కారాంత శబ్దాలకు

ఐకారాంతము లోకారౌకారాంతములు దెను గులై నప్పుడు పూ
ర్వాకృతి తోడన యుండును నోకారాంతంబులై బహుత్వమునొందున్

రై వరగును నడుగోవున గోవులు ఎదుకింగ గ్లౌనికుల నృపతులు ధ
ర్మావిష్కృతిఁ బడయుదరనఁ గావెలయుఁ గవిప్రయోగ తతిఁ దెలియంగన్
(కా చూ మ 9—37)

అని లక్షణ లక్ష్యాలు ఒనగబడి ఉన్నాయి ఐకారాంత శబ్దంగా రై ఔకారాంతంగా గ్లౌ లక్ష్యాలుగా పైన కనుపిస్తున్నాయి చింతామణిలో గూడ ఆ శబ్దాలు అదే క్రమంలో ఒకేచోట ఉండటం ఏదో యాదృచ్ఛికమైన అంశం కాదు స్త్రోవా వౌ రైనావో ప్రువద్గ్లౌ (అజంత 62 63) చింతామణిని కావ్యాలంకార చూడామణి కర్త చూడలేదనడం నిస్సందిగ్ధమైన నిజం చింతామణి విషయంలో కర్త కాలం రెండూ సందిగ్ధాలే బాలసరస్వతి ముఖత గాని దాని ఉనికి లోక మెరుగదు పైగా చింతామణి లాభగాధ బొత్తిగా అవిశ్వాస్యం గ్రంథౌత్కృష్ట్య సంపాదనం కోసం నవీన రచనలు ప్రాచీనుల పేరిట ప్రకటించడం మన పండితులకు అభ్యస్త విష

యమే అని శిష్టు కృష్ణమూర్తిగారి హరికారికావళి కథ ఇటీవలనే రుజువుచేసింది[1] అయినపుడు కావ్యాలంకార చూడామణిలోని పై పద్యాల భావం చింతామణి కర్తచే సంస్కృతంలోనికి అనూదితమైనదని ప్రతిపాదించవచ్చు

## ఋకారాన్త ద్వంద్వాలు

క్వచి దుర్ ద్వంద్వే రః (అజంత 67)

బాలసరస్వతీ వ్యాఖ్య ద్వంద్వే=ద్వంద్వ సమాస మందలి ఉ =ఋకార మునకు క్వచిత్ కొన్నిచోటుల రః=రేఫమగును ఉదా మాత్రపితృభావనను శైలపుత్రిఁ గొలుతు కొందరీ క్వచిచ్ఛబ్దము నుత్తరమునకే నన్వయించు కొందురు

ఋకారాంత పదాల ద్వంద్వసమాసంలో పూర్వపదాంత్య ఋకారం రేఫగా మారటం విహితమయినది దీనికి ప్రయోగం గూడ నన్నయలో చూపజాలక శ్రీ పారనంది రామశాస్త్రి పితరుల ఋణంబు (ఆది 6–70) అనే తత్పురుష సమాసాన్ని పొరపాటుగా ఉదాహరించారు – తమ వ్యాఖ్యలో

ఇటువంటి లక్షణాలు లక్షణకర్తలు చేయాలంటే వారి కంటికి అటువంటి ప్రయోగాలు పూర్వ మహాకవి రచనల్లో కనుపించాలి అట్టి ప్రయోగాలు లేనిదే వాటిని సూత్రబద్ధం చేసే యత్నం లాక్షణికులు చేయరు కాగా ఈ సూత్రం గూడ చింతామణి తెలుగునాట తెలుగు వాఙ్మయం విలక్షణ ప్రయోగాలకు లోనైన అర్వాచీన కాలంలో ఏర్పడినదని రుజువు చేయగలిగి ఉంది

## ఇయాన్తాలు ఎదన్తాలు కావడం

ఎదన్తతా చ నామ్నాం అన్యతరస్యా మియాన్తానామ్ (అజంత 82)

ఈ సూత్రం తెలుగులో ఇయాంతాలయిన ప్రాతిపదికలకు పాక్షికంగా ఎదంతత్వాన్ని విధిస్తుంది ఉదా గద్దియ–గద్దె సురియ–సురె ఇత్యాది

---

1. దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారి రమణీయము లో అనువాద వివేచనము అనే ప్రకరణం

భాషాచారిత్రక దృష్టితో ఇయాంతాలు ఎదంతాలు ఎలా కావలసివస్తుందో ముందు గమనించాలి

సంస్కృతం — మల్లికా లంజికా

ప్రాకృతం — మల్లిఅ లంజిఅ

తెలుగు — మల్లియ, లంజియ

తెలుగు సంక్షిప్త రూపం — మల్లె లంజె

పదాల పరిణామక్రమాన్ని పరిశీలించినపుడు మల్లియ గద్దియ వంటిరూపాలు ప్రాచీనాలని మానవుని ఉచ్చారణత్వర సుఖాభిలాష కారణంగా అర్వాచీన రూపాలుగా మల్లె గద్దె — వంటి రూపాలు ఏర్పడ్డాయని మనం గ్రహించవచ్చు

వైయాకరణులు ముఖ్యంగా తెలుగువారు తమకాలంలో కొత్తగా వ్యవహారంలోనికి వచ్చిన రూపాల్ని వెంటనే స్వీకరించరు ఆ పదాలు కొంతకాలం వ్యవహారంలో నలిగి బలం పుంజుకొని మహాకవుల రచనల్లో చోటు చేసికోవాల్సి, అపుడుగాని వానికొక గతిని ముందు కల్పించడం తరువాత సూత్రీకరించడం జరగదు ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకొని చూచినపుడు ఈ మల్లియ వంటి రూపాల లుప్త రూపాలైన మల్లె వంటి వాటిని తొలుత వ్యాకర్తలు స్వీకరించడానికి ఇష్టపడి ఉండగూడదు అది నిజమే కేతన ఈ విషయంలో ఏమంటున్నాడో చూద్దాం

మల్లెయు లంజెయు గద్దెయు
నొల్లెయు ననుపగిది పలుకు లొప్పవు కృతులన్
మల్లియ లంజియ గద్దియ
యొల్లియ యని పలికిరేని యొప్పుం గృతులన్ (ఆం భా భూ 77)

వ శతాబ్దివాడు తిరస్కరించిన రూపాన్ని వ శతాబ్దిలో పుట్టిన దని చెప్పబడే చింతామణి స్వీకరించడ మెలాపొసగుతుంది? కేతనకు ప్రత్యేకించి మల్లె వంటి రూపాలమీద కోపమని అనలేంగాని అతనికాలానికి ఆ ఉచ్చారణను వ్యవహారసిద్ధంగా అంటే స్వీకార్యమైనదిగా పండితలోకం భావించలేదు అందుకనే

పనిగట్టుకొని ఎదంతాలు (అర్వాచీన రూపాలు) ఒప్పవనీ ఇయాంతాలే ఒప్పునని చెప్పాడు

అప్పకవి కథను (చింతామణి నన్నయకృతిమని) తిరుగులేని సత్యంగా నమ్మిన అహోబలపతి తన కవిశిరోభూషణ వ్యాఖ్యలో ఈ సందర్భంలో— మల్లెయు లంజెయు గద్దెయు నొల్లెయు ననుపగిది పలుకులొప్పవు కృతులన్ ఇతీదానీన్తనా నాము క్తిస్తు నిర్మూలైవ అని కేతనని ఆధునికునిగా చింతామణిని ప్రాచీనంగా పేర్కొనడం ఉపేక్షించి విడిచిపుచ్చదగిన అంశమే ఈ విషయమై కేతనకు అర్వాచీనుడూ మల్లె వంటి రూపాలు వాఙ్మయంలో స్వీకృతాలైన తరువాత లక్షణం చెప్పినవాడూ అయిన కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహంలో కేతనను తప్పుపట్టాడు — మల్లెయు లంజెయు గద్దెయు నొల్లెయు ననుపగిది పలుకు లొప్పవటంచున్ బొల్లెను భ్రమానయ కేతన తెల్లంబుగ నివియు గలవు త్రిపురారాతీ

ఇటువంటి రూపాలు నన్నయలో నమ్మదగిన ప్రయోగాలుగా ఎక్కడా లేవు ఒకచోట మాత్రం వచనంలో గద్దె అనే ప్రయోగం కనిపిస్తున్నది[2] దాని పూర్వ పద్యంలోనే యతిస్థానంలో గాదుగాని గద్దియ పదం ప్రయుక్తమై ఉంది వచనంలో కనుపించే ఏకమాత్ర ప్రయోగంతో నన్నయ ఎదంత రూపాలు అంగీకరించాడని నిర్ణయించలేం పైగా ఈ జాతికే చెందిన పదం సురియ ను ఇయాంతంగానే ప్రయోగించి ఉన్నాడు[3]

ఇక్కడ పారనంది రామశాస్త్రిగారి ఉదాహరణం ఒకటి విమర్శనార్హంగా ఉంది ఆయన ఈ సూత్రానికి నన్నయోదాహరణంగా అరణ్యపర్వ సప్తమాశ్వాసం లోని వ పద్యంలోని తేనె శబ్దాన్ని చూపారు ఈ శబ్దం నిజానికి మల్లియ జాతికి చెందినదిగాదు పైగా సప్తమాశ్వాసం ఎఱ్ఱయది గాని నన్నయది గాదు నెయి—నెయ్ శబ్దం తెలుగులో నేతికి వాచకమైనా సారభూతమైన ద్రవపదార్థం

---

1 సర్వలక్షణసార సంగ్రహం —9
2 అరణ్య 2—347
3 పైది 2—89

అనే అర్థంలో ఇతర ద్రావిడ భాషల్లో ప్రయోగించబడుతుంది నూ (వుల నెయ్=నూనె తీ (యని) నెయ్=తేనె (సమన్వరిత) తరువాత వ్యవహారంలో తైలమాత్ర పర్యాయంగా నూనె పదం ప్రయుక్తమై కొబ్బరినూనె నువ్వులనూనె వంటి వ్యవహారాలు వచ్చినాయి

తరువాత మల్లియ మొదలయినవి మల్లె లుగా తెలుగు వాఙ్మయంలో శిష్టవ్యవహారాలుగా స్వీకృతాలైన తరువాత[1] వాటి సామర్థ్యంతో తేనె నూనె వంటివి తేనియ నూనియ లని వ్యవహృతాలైనాయి కాబట్టి ముందు తేనియ గా రూపం ఉండి తరువాత తేనెగా మారినట్లు పారినంది రామశాస్త్రులు భావించి ఉంటే అది పద పరిణామాన్ని ఓరుగవేసినట్లౌతుంది సూత్రం గూడ ఇయాంతాలు ఎదంతా లౌతాయని చెబుతున్నదే గాని దానికి విపర్యయంగా కాదుగదా

సమాసాల పేర్లు

ద్విగు కర్మధారయౌ తత్పురుష ద్వంద్వౌ బహువ్రీహి
అన్యే చ కేచిదుపమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యా పరిదృశ్యా ఇహా
(బాలంత 43)

దీనిలో తెలుగులో గల సమాసాలన్నీ నామత నిర్దిష్టాలై ఉన్నాయి ద్విగు కర్మధారయములు తత్పురుష ద్వంద్వములు బహువ్రీహి ఉపమానము ఉత్తరపద లోపము రూపకము మొదలైనవి తక్కిన మరికొన్ని సమాసములు గూడ తెలుగు నందు చూడదగినవి — అని బాలసరస్వతి వ్యాఖ్యానము

సంస్కృత వ్యాకరణాల్లో సమాసాల్ని చెప్పేచోట వాటిని అలంకారాలతో ముడిపెట్టరు ముఖపద్మం వంటి రూప కాలంకారాల్ని సమాసాలుగా చెప్పవలసివస్తే కర్మధారయ భేదంగా చెబుతారే గాని సంస్కృత వైయాకరణులు వాటిని రూపక

[1] మల్లియ వంటి వాటిలో సహజంగా ఇయ ఉంది తేనియ వంటి వాటి లోని ఇయ సహజంగాదు తొలిరూపం తేనె మల్లియ వంటి వాటి సామ్యంతో మలిరూపంగా తేనియ వంటివి ఏర్పడినాయి

సమాసాలని అనరు కాని తెలుగు పండితులు సంస్కృతం నేర్చినవారి పద్ధతి వేరు వారు స్పష్టతకోసం సమాసాల్ని అలంకారాలతో ముడిపెట్టి చెబుతారు కాని యీ పద్ధతి ప్రాచీనకాలంలో అంటె నన్నయకాలంలో లేదు—అని చింతామణీతర వ్యాకరణాల పరిశీలనం వలన తెలుసుకోవచ్చు కేతన సమాసాల్ని ఎ ఫక్కిలో చెప్పాడో చూద్దాం

ఆఱుసమాసము లిరువది యా అంతములాఱు సంధులవ్యయములు పె
క్కాఱింట నగము రీతులు నాఱింటికి నొక్కడెక్కుడౌను విభక్తుల్
(అం భా భూ 8)

సమాసాలు ఆఱని తొలుత చెప్పి లక్షణ లక్ష్యాలు మాత్రం నాల్గింటికే చూపాడు బహుశ సంస్కృత వ్యాకరణ మర్యాద ప్రకారం ఆఱనిచెప్ప తెలుగులో అన్వయించేవి నాల్గే కాబట్టి వాటినే చూపి ఉంటాడు

| | | |
|---|---|---|
| | పూర్వపదార్థ ప్రధానం | పెడతల క్రీఁగన్నులు నడురేయి ఎడకాలు |
| 2 | ఉత్తరపదార్థ ప్రధానం | చలిగాడ్పు నల్లకలువ వలవంతలు తెల్లదమ్మి వలిక్రొవ్విరి ఎత్తెలమావిమోక కెంజిగురల రమ్మలు |
| 3 | అన్యపదార్థ ప్రధానం | చలివెలుగు వేడివెలుఁగు పులుఁగు వడ నఱవ మచ్చెకంటి అలరువిల్తుఁడు వాతివాడి చేతలాఁడి |
| 4 | ఉభయపదార్థ ప్రధానం | తల్లిదండ్రులు అన్నదమ్ములు కూడ్కొరలు ఆలుబిడ్డలు ఎద్దుబండ్లు బంటుజేడులు ఆటపాటలు |

లక్షణం సంస్కృతమైనా లక్ష్యం తెలుగే ఈ కేతన పద్ధతి ప్రశంసార్హం అనంతుడు ఛందోదర్పణం చివర సంధిసమాసములు దిరంబుగఁజేర్తున్ 1 అని అన్నీ సంస్కృత లక్షణ లక్ష్యాలు చూపాడు అతని నోట సమాసాలు సంప్రదాయ

1 ఛందో ద 4—37

బద్ధంగా సంస్కృత వ్యాకరణోక్త ప్రకారంగానే చెప్పబడ్డాయి 8వ శతాబ్దివాడు గణపవరపు వెంకటపతి గూడ సమాసాలు ఇత్తిగ తెలుగుల నమరు అని కేతన వలె సంస్కృత వైయాకరణుల వలెనే చెప్పి అవి పంచవింశతి విధములఁబరఁ గును దెలిపెద అంటూ లక్ష్యాలు తెలుగులోనివి ఇచ్చాడు అతని గ్రంథంలో ఈ సమాసవివరణ సందర్భంలో నైనా ఎక్కడా రూపక సమాసాలు ఉపమాన సమాసాలు కనబడవు అలాంటివాటిని ప్రాచీన వైయాకరణ మార్గంలో అవధారణా పూర్వపద కర్మధారయాలనీ ఉపమానపూర్వపద – ఉత్తరపద కర్మధారయాలనీ చెబుతాడే గాని అర్వాచీన ఆంధ్రపండితులవలె చెప్పడు- బహుశః అతనిపై కేతన రచనా ప్రభావమే గాఢంగా ఉన్నదనుకోవాలి కాగా సమాసాల్ని తెలుగులో వివ రించవలసినపుడు రూపక ఉపమానాలుగా పేర్కొనడం గూడ చింతామణి నన్నయ కాలానికి చెందిన వ్యాకరణం కాజాలదని సాక్ష్య మిస్తున్నది ఈ సందర్భంలో బాల సరస్వతి వ్యాఖ్యానం గమనించతగి ఉంది చింతామణికర్త అలంకారాల్ని సమాసా లంటుంటే దాని తొలి వ్యాఖ్యాత సాంకేతికంగా చూచినపుడు తద్ధితమని చెప్పవలసిన దాన్ని సమాసం అంటున్నాడు – ఆదిశబ్దముచేత తావిమొల్ల ఉప్పునీళ్ళు మొద లైన మతుప్సమాసములును గలవు –అని

దీనినిబట్టి అర్వాచీనకాల పండితుల వ్యావహారికమైన అభ్యాసానికి అను గుణంగా చింతామణిలో సూత్రీకరణ జరిగినదని నిర్ణయించవచ్చు – నన్నయకాలా నికి రూపకాలు ఉపమానాలు మతుప్పులు సమాసాలుగా వ్యవహృతా లయ్యేవని నిరూపించడం అసంభవం గాబట్టి

*భవిష్యద్వర్తమానార్థక క్రియలు*

చింతామణి క్రియలు నాల్గువిధాలుగా పేర్కొన్నది

తద్ధర్మ వర్తమానాతీతాగామ్యర్థికా క్రియాః జ్ఞేయాః (క్రియ 9)

---

ఆంధ్రకౌముది 7వ పుట

2 ఆంధ్రకౌముది 2 వ పుట

వీటిలో తద్ధర్మం తప్ప మిగిలిన మూడు కేతన మొదలు గణపవరపు వెంకటపతి వరకు వ్యాకర్త అందరూ పేర్కొన్నవే[1] అయితే చింతామణి తద్ధర్మార్థకంగా చూపిన క్రియలే ఆంధ్రభాషా భూషణాదుల్లో భవిష్యదర్థకాలుగా చూపబడి ఉన్నాయి అంటే రూపాలు సమానమే పేరే భిన్నం

చింతామణి తద్ధర్మార్థకాలు

| | | | |
|---|---|---|---|
| ప్రథమ — | ఘటించును | ఘటించుదురు | ఘటింతురు |
| మధ్యమ — | ఘటించుదువు<br>ఘటింతువు | ఘటంచుదురు | ఘటింతురు |
| ఉత్తమ — | ఘటించుదును<br>ఘటింతును | ఘటించుదుము | ఘటింతుము |

ఆంధ్రభాషాభూషణ భవిష్యదర్థకాలు

| | | |
|---|---|---|
| ఒరులకు | పలుకును | పలుకుదురు |
| ఎదిరికి | పలుదువు | పలుకుదురు |
| తనకు | పలుకుదును | పలుకుదుము |

ఈ తద్ధర్మ పదంగూడ చింతామణిలోని ఇతర సంజ్ఞలు పరిభాషలు లాగానే ఆంధ్రవైయాకరణు లెవరూ చిన్నయసూరికి పూర్వం తమ గ్రంథాల్లో స్వీకరించ లేదు వారి దందరిదీ సామాన్యంగా కేతన మార్గమే గణపవరపు వెంకటపతి మనకు రెండు శతాబ్దాల పూర్వుడు భవిష్యదర్థక క్రియలుగా చింతామణి చూపిన తద్ధర్మార్థకాల్నే ఇచ్చాడు

---

కాలత్రితయంబున నలవడి యీక్రియలుచెల్లు నభినవదండీ

(ఆం భా భూ 39)

అననిట్లు కాలత్రయ ప్రసంగొక్తుల వలన గ్రియల్దగు వరుసనింక

(ఆంధ్రకౌముది 24వ పుట)

| | | |
|---|---|---|
| ప్రథమ | చేయును | చేయుదురు |
| మధ్యమ | చేయుదువు | చేయుదురు |
| ఉత్తమ | చేయుదును | చేయుదుము |

ఆంధ్రభాషాభూషణాది వ్యాకరణాలు వర్తమానార్థకాలుగా ఆంధ్రకౌముది మినహా ఒకవిధమైన రూపాల్నే ప్రదర్శించాయి

| | | |
|---|---|---|
| ఒరులకు | అడిగెడును | అడిగెదరు |
| ఎదిరికి | అడిగెదవు | అడిగెదరు |
| తనకు | అడిగెదను | అడిగెదము |

ఆంధ్రకౌముది గూడ ఆంధ్రభాషాభూషణాదుల రూపాల్నే ఇచ్చింది

| | | |
|---|---|---|
| ప్రథమ | పలికెడిని | పలికెదరు |
| మధ్యమ | పలికెదవు | పలికెదరు |
| ఉత్తమ | పలికెదను | పలికెదము |

కాని వీటితోపాటు చింతామణి చెప్పిన ఉన్నానుబంధసహిత రూపాలు గూడ వర్తమానార్థకాలుగానే పేర్కొన్నది ఉదా పల్కుచున్నాఁడు–పల్కుచున్నారు మొ

## క్రియాప్రత్యయ విధానం

ధాతువులమీద ప్రత్యయాలు విధించడంలో గూడ కేతన దారికి తదనుయాయుల దారికి చింతామణి మార్గానికి భేదముంది

కేతన

| | | | |
|---|---|---|---|
| ఒరులకు | ఎను ఇరి — | పలికెను — పలికిరి | భూతార్థం |
| ఎదిరికి | తివి తి తిరి — | పలికితివి పలికితి పలికితిరి | భూతార్థం |
| తనకు | తిని తిమి — | పలికితిని పలికితిమి | భూతార్థం |

| | | | | |
|---|---|---|---|---|
| ఒరులకు | (ఎ) డును | (ఎ) దరు | అడిగెడును | అడిగెదరు |
| | | | | వర్తమానార్థం |
| ఎదిరికి | (ఎ) దు | (ఎ) దవు దరు | అడిగెదు లడిగెదవు | అడిగెదరు |
| | | | | వర్తమానార్థం |
| తనకు | (ఎ) దిను | (ఎ) దము | అడిగెదను | అడిగెదము |
| | | | | వర్తమానార్థం |

గణపవరపు వెంకటపతి గూడ కేతనాదుల మార్గాన్నే అనుసరించి ధాతువుల మీద ప్రత్యయాలు విధించాడు

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూతార్థకాల్లో | ప్రథమ | ఎను | ఇరి | చేసెను | చేసిరి |
| | మధ్యమ | ఇతివి | ఇతిరి | చేసితివి | చేసితిరి |
| | ఉత్తమ | ఇతిని | ఇతిమి | చేసితిని | చేసితిమి |
| భవిష్యదర్థకాల్లో | ప్రథమ | ఉను | దురు | చేయును | చేయుదురు |
| | మధ్యమ | దువు | దురు | చేయుదువు | చేయుదురు |
| | ఉత్తమ | దును | దుము | చేయుదును | చేయుదుము |
| వర్తమానార్థకాల్లో అ | ప్రథమ | ఎడి | ఎదరు | పలికెడి | పలికెదరు |
| | మధ్యమ | ఎదవు | ఎదరు | పలికెదవు | పలికెదరు |
| | ఉత్తమ | ఎదను | ఎదము | పలికెదను | పలికెదము |
| ఆ | ప్రథమ | ఉన్న + ఆడు | | ఉన్న + ఆరు | |
| | | పల్కుచున్నాడు | | పల్కుచున్నారు మొ | |

పై వివరణల పరిశీలనాన్నిబట్టి కేతన కాలానికి తద్ధర్మార్థకమనే క్రియా భేదం నామత ఎర్పడలేదనీ అతని కాలంలో భవిష్యదర్థకమైన దాన్నే చింతామణి తద్ధర్మార్థక మని పేరుమార్చి చూపిందని తెలిసికో గలిగాం అయితే ఇక్కడ

చింతామణి కేతనగాని తదనుయాయు లయిన ఇతర వ్యాకర్తలు గాని చెప్పని కొత్త విషయ మొకటి వర్తమాన భవిష్యదర్థక క్రియా నిర్మాణంలో చెప్పింది

## అనుబంధ సహిత రూపాలు

తత్రద్వితీయ తుర్యౌ యౌ తౌ స్త సానుబంధకావేవ (క్రియా 0)

బాలసరస్వతి వ్యాఖ్య తత్ర=ఆనాలుగింటి యందు ద్వితీయ తుర్యౌ= రెండవదియు నాలుగవదియు నగు వర్తమానా—ఖ్యర్థము లనునవి యౌ=ఎవో తౌ=అవి సానుబన్ధకౌ ఏవ = క్రియాంతరానపాయులే (అనుబంధకములు లేక యుండునవికావు) స్త =అవును

వర్తమాన భావిక్రియలు సానుబంధకాలే అవుతాయనేది చింతామణి చేసిన కొత్త ప్రతిపాదనం దీనిని చింతామణి తరువాతి వ్యాకర్తలు అంటే బాలసరస్వతి తరువాతివారు స్వీకరించారని సాధికారికంగా చెప్పలేం కాని ఆంధ్రకౌముదీ కర్త వర్తమానార్థంలో ఉన్నానుబంధ సహిత రూపాల్ని గూడ స్వీకరించటం వలన చింతామణి మార్గం సంపూర్ణంగా పరిత్యక్తమయినదని గూడ నిర్ణయించలేం కాని ఆంధ్రకౌముదిలోని ఉన్నానుబంధ సహిత రూపాలు చింతామణి నుండి స్వీకరించినవి గాక లోక వ్యవహారం నుండి సూటిగా పరిగ్రహింపబడినవే—అని అనుకోవచ్చు చిన్నయసూరి తెలుగులో వ్యాకరణాన్ని రచించేవరకు చింతామణి వేసిన ఈ మార్గం దాదాపు ఉపేక్షితంగానే ఉండిపోయిన దనేది నిర్వివాదం

చింతామణి ప్రతిపాదించిన అనుబంధా లివి

వసతి రనుబంధక స్స్యాత్ యత్ర లడర్థో వివక్షితస్తత్ర
అస్తి రనుబంధక స్స్యాత్ యత్ర లృడర్థో వివక్షితో ధాతో
(క్రియ 2)

---

చూ అనంతర వ్యాకరణాలమీద చింతామణి ప్రభావం అనే ప్రకరణం

బాలసరస్వతి వ్యాఖ్య యత్ర- ఎందైనను లడర్థః=వర్తమానార్థకము వివక్షితః వివక్షితమౌనో తత్ర అక్కడ వసతి = ఉన్న అను వసధాత్వర్థము అనుబంధకఃస్యాత్=అనుబంధకమౌను యత్ర=ఎందు లృడర్థ =భవిష్యదర్థకము వివక్షితః=వివక్షితమౌనో తత్ర=అందు ధాతో =క్రియకు అస్తి-కల అను అసధాత్వర్థము అనుబంధకస్స్యాత్=అనుబంధకమౌను అనగా లడర్థసూచకమైన వర్తమానార్థమును జెప్పు క్రియాపదమునకుఁ బయిని ఉన్న అను వర్ణకమును లృడర్థ సూచకమైన భవిష్యదర్థమును జెప్పు క్రియాపదము పయిని కల వర్ణకము నుండును

వర్తమానార్థకక్రియకు ఉన్నానుబంధం భవిష్యదర్థకక్రియకు కలానుబంధం విహితమై ఉన్నాయి ఇక్కడ వసతి అంటే ఉన్నానుబంధం అస్తి అంటే కలానుబంధం గాదని శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి చింతామణి విషయ పరిశోధనలో అన్నారు గాని ఆ అనుబంధా లేమిటో సరిగా నిరూపించలేకపోయారు పైగా క్రియలుగా పరిగణించడానికి వీలులేని రక్షించుచున్నవాఁడను రక్షించుచున్న వాఁడవు వంటి క్రియాజన్య విశేషణాలు చింతామణి సాధించే వర్తమానార్థకా లని వితండంగా వాదించారు ఆ వాదం చివరకు క్రియకు క్రియాత్వభంజకంగా పరిణమించింది గాబట్టి దాన్ని ఉపేక్షించి తిరస్కరించడమే మేలు

తెలుగునాటి వ్యవహారంలో వర్తమానార్థకా లివి భవిష్యదర్థకా లివి అని స్పష్టమయిన వింగడింపు ప్రాచీనకాలంలో అంటె కవిత్రయ యుగం నుండి ప్రబంధయుగం వరకు ఉన్నట్లు కన్పించదు వాక్యాల సందర్భాన్నిబట్టి క్రియ భవిష్యదర్థకమో వర్తమానార్థకమో తెలియడం జరిగేది2 కాబట్టే కేతనాదులు వర్తమా

---

చూ చింతామణి విషయం పరిశోధన శోధనం అనే ప్రకరణం

2 అ ఇక్కావ్యంబు రచియించెద నని (భార ఆది పీఠిక 20)

ఆ నీకు నభివాంఛిత మెయ్యది దానిఁజెపుమ చేయుదు ననినన్

(భార ఆది - 0)

ఇ భక్తి నెప్పుడు ధరణీసురోత్తములఁబూజలఁదన్పుదు నల్గనోడుదున్

ఈ ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ ఒంటి చరించె దోటలే కివ్వనభూమి

(మనుచరిత్ర 5)

నార్థకానికి భవిష్యదర్థకానికి ఇచ్చిన ఉదాహరణలు ఒకవిధంగా దాదాపు అభిన్నాలుగా కనిపిస్తాయి ఉదా పలుకుదురు–భవిష్యదర్థకం అడిగెదరు–వర్తమానార్థకం చింతామణి ననుకరించిన నవీన వ్యాకర్తలు ఈ రెండువిధాలైన క్రియల్ని ఒకే తెగకు చెందినవిగా అంటే తద్ధర్మార్థకాలుగా పేర్కొంటున్నారు (బాలవ్యాకర్త క్రియా 22 నుండి 26వ వరకు)

ప్రాచీన కాలంలో వర్తమానార్థకాలుగా ఘటించుచున్నాఁడు ఘటించుచున్నావు వంటి రూపాలు భావ్యర్థకాలుగా ఘటింపఁగలఁడు ఘటింపఁగలవు వంటి రూపాలు లేవనేది నిర్వివాదాంశం అవి క్రియాజన్య విశేణ రూపాల పరిణత రూపాలు అర్వాచీన కాలంలో ఏర్పడినవి ఉదా వర్తమానార్థకాలు క్రియాజన్య విశేషణ రూపాలు – ఘటించుచున్నవాఁడు ఘటించుచున్నవాఁడవు ఘటించుచున్నవాఁడను – వీటిలోని చివరిపదం వాఁడు లో వకారం లోపించగా – ఘటించుచున్నాఁడు ఘటించుచున్నావు ఘటించుచున్నాను వంటి క్రియలు ఏర్పడినాయి

భవిష్యదర్థకాలు ఘటింపఁగలవాఁడు వంటి క్రియాజన్య విశేషణాలే పైరీతిగా వకారలోపం జరిగి ఘటింప గలాఁడు–ఘటింపఁగలఁడు అని పరిణామం చెందాయి ఇట్లు అనుబంధ సహితంగా వర్తమాన భావ్యర్థాల్లో క్రియలు వ్యవహారంలోనికి రావడం 5వ శతాబ్ది తరువాత గాని జరగలేదు కాబట్టే కేతనాదులు అట్టి రూపాలను తమ వ్యాకరణాల్లో చేసి చూపలేదు అవి వారికి అనంతరకాలములో గాని బయల్వెడలలేదు కాగా చింతామణి వ్యవహారంలో మిక్కిలి అర్వాచీనకాలిక రూపాలైన సానుబంధ వర్తమాన భావికాల రూపాల్ని సూత్రీకరించి చూపడం నిస్సందేహంగా అది ప్రాచీన వ్యాకరణం కాజాలదని రుజువు చేయగలిగిన నిదర్శనంగా మనం స్వీకరించవచ్చు

ఫలితార్థం

ఈ ప్రకరణంలో జరిపిన పరిశీలనం వలన చింతామణి లక్షించిన భాషలో దాని ప్రాచీనతా పరిహారకమైన లక్షణాలు పెక్కు ఉన్నట్లు సోదాహరణంగా తెలిసికోగలిగాం ఈ అంతస్సాక్ష్యాన్ని చింతామణి కాల కర్తృత్వ నిర్ణయంలో ఒక

ప్రముఖాంశంగా స్వీకరించి చింతామణి నన్నయ రచన కాదని ఎట్టిపరిస్థితులలోను 6వ శతాబ్దికి పూర్వకాలికం కాజాలదని నిస్సంశయంగా నిర్ణయించవచ్చు భాషా పరిణామాన్ని సాధికారికంగా పరిశీలించి చేసిన నిర్ణయం కాబట్టి ఇది శాస్త్రీయమూ అందువలననే విశ్వాస్యమూ అని వేరే చెప్పపనిలేదు

## చింతామణిలో ప్రాకృత వ్యాకరణానుకరణం

చింతామణి కాలాన్ని కర్తృత్వాన్ని గూర్చి ఇంతవరకు చర్చించిన పెద్ద లెవరూ చింతామణిని ప్రాకృత వ్యాకరణాలతో పోల్చి చూచినజాడ లేదు చింతామణి రచనలో ప్రాకృత వ్యాకరణాల ఛాయ బాగా కనిపిస్తుంది ప్రాకృత వ్యాకరణాలలో గూడ త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనం చింతామణికి మార్గదర్శకమని చెప్పవచ్చు

### శబ్దానుశాసన సూత్రకర్త వాల్మీకి?

అయితే త్రివిక్రమ వ్యాకరణంలో వృత్తి మాత్రం త్రివిక్రమునిదనీ సూత్రాలు వాల్మీకి మహర్షివనీ ఒక వాదం వినబడతున్నది కాని ఈ వాదం ప్రథమంగా శంభు రహస్యమ నే గ్రంథంలో కనిపిస్తున్నదని అది ప్రాకృతభాషా గౌరవాన్ని మధ్యకాలంలో పెంచడానికి కల్పించిన కథ అని డా ఉపాధ్యాయ తమ వ్యాసంలో[1] నిరూపించారు వారి నిరూపణకు ఒక ఆధారంగా అప్పయ్య దీక్షితుని ప్రాకృత మణిదీపం లో వాల్మీకి ప్రసక్తి లేకపోవడం చూపబడింది పైగా త్రివిక్రముడు తాను వ్యాకరణానికి కర్త నని తెల్పాడే కాని దాని వృత్తి మాత్ర కర్త నని చెప్పలేదు[2] త్రివిక్రముని వ్యాకరణంలోని సూత్రాల్లో చాలభాగం హేమచంద్రుని

---

Dr Upadhyaya s ar ᴗ e Va Sut a — A Myth n Bharateeya V dya Vo I — — pp 60— 76

2 నిజసూత్రమార్గ మనుజిగ మిషతాం

(త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసన ఎరిక)

శబ్దానుశాసనమిదం ప్రగుణ ప్రయోగం త్రైవిక్రమం భజత మంత్రమివార్థ

సిద్ధ్యై (పైది)

ప్రాకృత వ్యాకరణంతో సంవదిస్తుంది అయినపుడు త్రివిక్రముని ప్రాకృత వ్యాకరణంలోని సూత్రాలు వాల్మీకీయాలైతే హేమచంద్రునివి గూడ వాల్మీకీయాలే కావలసి వస్తుంది హేమచంద్రుడు తన సూత్రాలు ఇతరులవని చెప్పలేదు కాగా ఈ వాల్మీకి కథ మధ్యకాలంలో ప్రాకృతాలకి మహత్వ కల్పనం కోసం చేయబడిందనవచ్చు

6వ శతాబ్దికి చెందిన లక్ష్మీధరుడు తన షడ్భాషా చంద్రిక లో వాల్మీకి ర్మూల సూత్రకృత్ అనిడం చూచిన అప్పకవి అహోబలపతి మొదలయిన తెలుగు వైయాకిరణులు గూడ త్రివిక్రమ వ్యాకరణంలోని సూత్రాలు వాల్మీకీయాలుగా భావించారు అయితే వారి భావన తన్మూలమైన లక్ష్మీధరుని మాటా ముందు పేర్కొన్న శంభు రహస్యంలోని క్రింది శ్లోకాలు ఆధారంగా ఏర్పడినవే

కో వినిన్దే దిమాం భాషాం భారతీముగ్ధ భాషితాం
యస్యా ప్రచేతసః పుత్రో వ్యాకర్తా భగవాన్ ఋషి
గార్గ్య గాలవ శాకల్య పాణిన్యాద్యా యథార్షయ
శబ్దరాశే సంస్కృతస్య వ్యాకర్తారో మహత్తమా
తథైవ ప్రాకృతాదీనాం షడ్భాషాణాం మహామని
ఆదికావ్య కృదాచార్యో వ్యాకర్తా లోకవిశ్రుత
యథైవ రామచరితం సంస్కృతం తేన నిర్మితం
తథైవ ప్రాకృతేనాపి నిర్మితంహా సతాంముదే
పాణిన్యాద్యై శిక్షితత్వాత్ సంస్కృతీస్యాద్యథోత్తమా
ప్రాచెతస వ్యాకృతత్వాత్ ప్రాకృత్యం తథోత్తమా
ప్రాకృతం చార్షమేవేదం యద్ది వాల్మీకి శిక్షితం
తదనార్షం భవేద్యోవై ప్రాకృత స్యాత్స ఏవ హి

పై శ్లోకాల పరిశీలనం వలన తత్కారం ప్రాకృతానికి సంస్కృతాని కున్నట్లే ఋషి శిక్షితత్వం ఉన్నదని లోకం నమ్మి ప్రాకృత మనార్షభాషగా ఈసడించబడ గూడదనే సంకల్పంతోనే అలా వ్రాశాడని స్పష్టపడుతుంది

---

R P sche — Comparat ve Gramn ar of Prakr t Languages

ఏమైనా త్రివిక్రముడు గాని తత్పూర్వుడు హేమచంద్రుడు గాని వాల్మీకి ప్రాకృతానికి సూత్రకర్త అని చెప్పలేదు కాగా హేమచంద్ర త్రివిక్రముల కాలానికి లేని వారి తరువాత వందల సంవత్సరాలకు పుట్టిన ఈ వాల్మీకి సూత్ర ప్రసంగాన్ని ఉపేక్షించిచూస్తే త్రివిక్రముడు 13వ శతాబ్ది ప్రాకృత వ్యాకర్తగా స్థిరపడతాడు హేమచంద్రుని త్రివిక్రముడు సూత్ర నిర్మాణ విధానంలో అనుకరించినా తాను స్వయంగా ప్రాకృత వ్యాకరణోపయోగి సంజ్ఞలు కొన్ని కొత్తగా కల్పించాడు అతడు కల్పించిన సంజ్ఞలు కొన్ని మన చింతామణి గ్రహించడం జరిగింది

## ప్రాకృత శబ్దానుశాసన-చింతామణులు

అయితే ఈ వాదాన్ని గూడ తిరగవేసి చింతామణి కల్పించిన సంజ్ఞలే త్రివిక్రమ వ్యాకరణం స్వీకరించినదని ఏల అనరాదు అని ప్రశ్నించవచ్చు ఎవరైనా త్రివిక్రమ వ్యాకరణం అఖిలభారత ప్రచారం గలది మన చింతామణి ఆంధ్ర ప్రాంత మాత్ర విదితమైనది కాగా అఖిలభారత ప్రసిద్ధమైనది అనేక భాషా భాషుల కవసరమైనదీ అయిన త్రివిక్రమ వ్యాకరణాన్ని ఆంధ్రుడు చూడటం పొసగుతుందే కాని ఆంధ్రభాషకే పరిమితమైంది 16వ శతాబ్ది వరకు ఉనికి మనకీ తెలియరానిదీ అయిన చింతామణిని త్రివిక్రముడు చూడటం సంభావ్యం కాదు పైగా సంస్కృత ప్రాకృత వ్యాకర్తలు ఏ ఇతర దేశ భాషలలోని లక్షణ గ్రంథాల నుండీ పరిభాషలను గాని ప్రక్రియా విధానాన్ని గాని స్వీకరించిన జాడలు లేవు

పైగా సంజ్ఞా కల్పన ప్రక్రియ త్రివిక్రమునిలో కనిపిస్తుండగా అది లేని చింతామణి అతని నుండి దానిని స్వీకరించిన దని నిరభ్యంతరంగా అంగీకరించ వలసిందే

త్రివిక్రముడు ప్రాకృతానికి ఒక వ్యాకర్తే గాని అతడే ఆద్యుడు గాడు అతనికి పూర్వం ప్రాకృత వ్యాకర్తలున్నారు — వరరుచి చండ ధనపాల హేమ చంద్రాదులు చింతామణి కర్త చేసిన అనుకరణం ఆ ప్రాచీనుల వ్యాకరణాలకే ఎందుకు చెందదు? అని కూడ ప్రశ్నించవచ్చు ఆ అందరి వ్యాకరణాల్లో ఎక్కడా చింతామణి పాటించిన సంజ్ఞలు పరిభాషలు లేవు — అని దానికి సమాధానం

ఇక్కడ మరొక ఆక్షేపం రావచ్చు — త్రివిక్రముని ఈ పరిభాష సంస్కృతంలోను ప్రాకృతంలోను రచితమైన పూర్వ వ్యాకరణాలనుంచి ఎరువు తెచ్చినది కాగూడదా అని కాని ఈ పరిభాష ఏ సంస్కృత ప్రాకృత వ్యాకరణాలలోను అతనికి పూర్వం రచితమైన వాటిలో కానరాలేదు పాణినీయంలో సుప్ తిఙన్తం పదమ్ వంటి సూత్రాల్లో సుప్ తిఙ్ అనే నామ క్రియా విభక్తుల ప్రత్యాహారాలు ఉన్నాయి ఈ రెంటిని మినహాయిస్తే నామ విభక్తులతో గాని క్రియావిభక్తులతో గాని ఏర్పడిన ఇతర ప్రత్యాహారాలు పాణినీయంలో లేవు పాణిని మొత్తం నామ విభక్తుల క్రియా విభక్తుల సముదాయాన్ని ప్రత్యాహారంతో సూచిస్తే అనంతర ప్రాకృత వ్యాకర్త ఆ పద్ధతినే మరికొంత విశాలం చేసి ఒక్కొక్క విభక్తిలోని మూడు ప్రత్యయాలను ఒక ప్రత్యాహారంతో సూచించాడు — సు ఔ జస్ — సుస్ అమ్ ఔట్ శస్ — అస్ ఇత్యాదిగా ఈ పద్ధతికి శ్రీకారం చుట్టినవాడు త్రివిక్రముడే

## త్రివిక్రముని సంజ్ఞా పరిభాషలు

త్రివిక్రముడు తన వ్యాకరణంలో ప్రథమంగా కల్పించిన సంజ్ఞలు స్తు తు వంటివి ఇంకా ఉన్నా కాని వాటి ఉపయోగం చింతామణిలో లేదు

చింతామణి స్వీకరించిన త్రివిక్రమ ప్రాకృత శబ్దానుశాసన సంజ్ఞలు రెండు పరిభాష ఒకటి వాటిని క్రమంగా ముందు మూలంలో (ప్రాకృత శబ్దానుశాసనం) తరువాత అనుకరణంలో (ఆంధ్రశబ్ద చింతామణి) పరికిద్దాం

సుప్స్వాది రన్త్యహలా ( — —4)

ఉదా సు ఔ జస్ సుస్ అమ్ ఔట్ శస్ అస్ టా భ్యామి భిస్ టాస్ ఙే భ్యామ్ భ్యస్ ఙేస్ ఙసి భ్యామ్ భ్యస్ ఙసస్ ఙస్ ఓస్ ఆమి ఙమ్ ఙి ఓస్ సుప్ ఙిప్

---

1 పాణిని —4 – 4

వృత్తి ‹పంచమ్యా జస్ ఇతి వక్తవ్యే జసిస్ ఇతి జస షష్ఠ్యైకవచనస్య అసందేహార్థం›

(పంచమికి పై సూత్రం ప్రకారం జస్ అనే ప్రత్యాహార మేర్పడవలసి ఉంటే, జసిస్ అని చెప్పడ మెందుకంటే జస్ అనేది షష్ఠి ఏకవచన ప్రత్యయంగా ఉంది గాబట్టి సందేహం కలగకుండటం కోసం)

2 సస్సమాసః ( - -8)

వృత్తి సమాస ససంజ్ఞకో భవతి

వా సే ( -4-90)

వృత్తి సే సమాసే శషాదేశయోర్ద్విత్వం వా భవతి

ఉదా ణ ఇగ్గామో ణ ఇగామో

సానునాసికోచ్చారం జిత్ ( - - 6)

వృత్తి జకారానుబంధం కార్యం సానునాసికోచ్చారం భవతి యథా కాముక యమునా చాముండాతి ముక్తకే మో జ్లిజ్ ( -3- )

ఉదా కాముక - కా ఉ ఓ యమునా - జ ఉ ణా ఇత్యాది

*వీటి ప్రయోగాలు త్రివిక్రమ వ్యాకరణంలో*

అమ (2-2-2)

వృత్తి నామ్న పరస్య సుప సంబంధినో అమ ద్వితీయైకవచనస్య స్థానే మకారో భవతి

ఉదా వచ్ఛం గిరిం

2 సోర్లుక్ (2-2-9)

వృత్తి నామ్న పరస్య సో ప్రథమైక వచనస్య లుగ్భవేత్

ఉదా హేదేవ

3 అర ఋం (2-2-49)

వృత్తి ఋదన్తస్య సుం పరే అర ఇత్యాదేశో భవతి

ఉదా భత్తారో భత్తారా భత్తారం భత్తారే

4 టోవాత్మనో ణిఆ ణఇఆ (2-2-6 )

వృత్తి ఆత్మన పరస్య టావచనస్య ణిఆ ణఇఆ ఇత్యాదేశౌ వా భవతః

ఉదా అప్పణిఆ

5 జే సో ణ మ్ (2-3-35)

వృత్తి జే స్ చతుర్థీ ణమ్ షష్ఠ జేసః స్థానే ణమ్ భవతి

ఉదా మునిస్స మునీణం బోఅణం దేహి

*యథాక్రమంగా వీటి ప్రయోగాలు - చింతామణిలో*

ని రమో మహతాం లుక్ చ స్యాత్ (చింతా అజంత 6)

మహత్తుల యొక్క ద్వితీయైక వచనానికి ని వస్తుంది దానికి లోపం గూడ అవుతుంది ఉదా రామునిన్ రామున్

2 టాసశ్చేత (చింతా అజంత 2 )

తృతీయా విభక్తికి చేత ప్రత్యయం వస్తుంది ఉదా రామునిచేత రాములచేత

(చింతా అజంత 25)

3 జమ కు రనితాం

ఇదంతములు -ని శబ్దాల షష్ఠ విభక్తికి కు ప్రత్యయం వస్తుంది ఉదా రామునకు కృష్ణునకు

(చింతా అజంత 36)

4 సోర్లుగిత

ఇకారాంత శబ్దాలకంటె పరంగా ఉన్న ప్రథమా – ఏక వచనానికి లోపం వస్తుంది ఉదా హరి శౌరి

5 ఒసిన ఉచ్యతే వలన (చింతా అజంత 23)

పంచమీ విభక్తికి వలన వస్తుంది ఉదా రాముని వలనన్ రాముల వలనన్

ఇలాగే సమాస సంజ్ఞ స అనే దానికి చింతామణిలో ప్రయోగం షష్ఠ్యాశ్ ఉతోఽచి నుమ్ పే (చింతా సంధి 7)

షష్ఠీ సమాసంలో ఉదంత శబ్దానికి అచ్చు పరమైతే నుమాగమం వస్తుంది ఉదా రాజు నాజ్ఞ కొడుకు నాలు

ఇలాగే సాను నాసికోచ్చారం జీత్ అనే సూత్రానికి త్రివిక్రమునిలో ఉదాహరణాన్ని ముందే చూచి ఉన్నాం ఇప్పు డిక చింతామణిలో దాని ప్రయోగం ఎక్కడ ఎలా జరిగిందో చూద్దాం

---

త్రివి — — 6

చింతామణిలో రాముఁడు వంటి రూపాల నిష్పత్తి పైసూత్రాన్ని ప్రవర్తింప చెస్తేగాని కుదరదు రామ ప్రాతి పదికకు సు చేర్చి దానికి మహతస్సోర్డుజనితో ఖవేత్ పుంసి అనే సూత్రంతో డు ప్రత్యయం విధించబడింది డు ప్రత్యయానికి జిత్త్వం వలన ముందు బిందువు వస్తుందని వ్యాఖ్యాతలు చెప్పి ఆధారంగా త్రివిక్రమ వ్యాకరణంలోని పై సానునాసికోచ్చారం జిత్ అనే సూత్రాన్ని ఉదాహరించారు

చింతామణి కర్త గూడ డుజ్ ప్రత్యయాన్ని విధించి నిశ్శబ్దంగా ఊరుకోవడం వలన పై సూత్రంతో అనుసున్నను చేసికోవడం చెప్పవలసిన అవసరం లేని విషయమని అంటే అంత సామాన్యమైన సర్వవైయాకరణులకు సువిదితమైన అంశమని భావించాడన్నయాట

ఈ సూత్ర ప్రవృత్తి చింతామణిలో గోఁగులు [2] మొదలైన శబ్దాల నిష్పత్తిలో కలఁడు [3] వంటి క్రియాపదాల నిష్పత్తిలోను కావలసి వస్తుంది

ఈ విధంగా మొత్తం చింతామణిలో ఆద్యంతం అవసరమయిన ఈ సానునాసికోచ్చారం జిత్ అనే సూత్రం త్రివిక్రముని వ్యాకరణంలోనేగాని మరి ఎఇతర పూర్వ వ్యాకర్తల రచనల్లోను ఉపలభ్యమానం గాదు కాగా త్రివిక్రముని వ్యాకరణం కంటె ముందు చింతామణి పుట్టి ఉండడానికి వీలే లేదు ఈ రుజువు వలన చింతామణి కర్తృత్వం నన్నయకు దూరమయి పోయింది

ఇక్కడ సూత్రకర్త జిత్తులు గా కొన్ని ప్రత్యయాల్ని విధించి ఆ విధాన ప్రయోజనాన్ని చెప్పకుండ వదలివేయడం ఎందుకు జరిగిందో యోచించాలి

### త్రివిక్రమ వ్యాకరణ ప్రసిద్ధి

సూత్రకర్త కాలానికి త్రివిక్రమ వ్యాకరణం తెలుగునాట పండితుల్లో సుప్రసిద్ధంగా పఠన పాఠనాల్లో ఉండి ఆ వ్యాకరణ ప్రతిపాదితమైన సానునాసికోచ్చారం

---

చింతా అజంత 2

2 కుజ్ నోర్బహువచనే (అజంత 68)

3 వ్యతిరేకార్థే ల్యటి లటి డుజ్ స్యాత్ (క్రియా 9)

జిత్ అనే సూత్రం పాణినీయ సూత్రాలు హలంత్యమ్ మొదలయిన వాటివలె ప్రత్యేక కథనం అవసరం లేకుండానే ఇతర వ్యాకరణాల్లో గూడ అన్వయించుకో దగినంత ప్రసిద్ధిని పొంది ఉండాలి లేకపోతే కేవలం డుజ్ కుజ్ దుజ్ అని ప్రత్యయమాత్ర విధానంతో సూత్రకర్త యిన్నుకుండిలేడు గదా

త్రివిక్రముని వ్యాకరణానికి తెలుగునాట అంత మహా ప్రసిద్ధి ఉన్నట్లు కావ్యాలంకార చూడామణి కర్త సాక్ష్య మిస్తున్నాడు

విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు
లొనరఁ జూపరి ప్రాకృతంబునకుఁ ద్రోవ
నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము గాన
వలయుఁ దల్లక్షణంబులు వరుస దెలియ (కా చూ మ 9–8)

పై పరిశీలనాన్నిబట్టి చింతామణి రచన ఏ శతాబ్దికి తరువాత రెండు మూడు వందల యేండ్లకు గాని జరిగి ఉండిదనుకుంటే తప్పులేదు

ఈ ప్రాకృత వ్యాకరణాల సమ్యక్పరనం వలననే చింతామణి కర్తకు బల మైన ప్రాకృత వ్యాకరణ సంస్కారం సిద్ధించి ఉంటుంది

బింబ ప్రతిబింబాలు

సిద్ధిర్లోకాచ్చ (త్రి – – )

ప్రాకృత భాషా వ్యవహార సిద్ధి లోకము ద్వారా త వేద్యమనే పై ప్రథమ సూత్రం త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసనంలో మొట్టమొదటనే కనిపిస్తుంది దీని ప్రతి బింబం చింతామణిలో

సిద్ధిర్లోకాద్దృశ్యా (చింతా సంజ్ఞా 6)

అని కనిపిస్తుంది త్రివిక్రముడు తన సూత్రాన్ని చకారంతో ముగిస్తే చింతామణి కర్త ఆ చ వర్ణ స్థానంలో దృశ్యా అనే పదాన్ని నిక్షేపించాడు ఎంత బలీయమైన ప్రాకృత వ్యాకరణ ప్రభావమో చింతామణిమీద

యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్
(చింతా సంజ్ఞా 2)

అని అచ్చుకంటే పరమైన అచ్చు యకారమౌతుందని సూత్రించే సందర్భంలో చింతామణికర్త ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధమైన యశ్రుతి శబ్దాన్ని ప్రయోగించాడు

త్రివిక్రమ వ్యాకరణంలోను తత్పూర్వం హేమచంద్రుని వ్యాకరణంలోను యశ్రుతి శబ్దం సుప్రయుక్తమై ఉంది

యశ్రుతిరః (త్రివిక్రమ వ్యాకరణం -3- 0)

వృత్తి ఆదిత్యనువర్తతే ప్రాయోలుక్ ఇత్యాదినా ఒకి సతి యోఽవ శిష్యతే అవర్ణః సః అవర్ణాత్ పరః లఘుప్రయత్నతర యకార శ్రుతిర్భవతి

ఉదా శకటమ్-సయఢం ఆకరః-ఆయదో ప్రకారః-పయారో

అవర్ణో యశ్రుతిః (హేమచంద్ర వ్యాకరణం-అష్టమాధ్యాయం 80 సూ)

వృత్తి కగజేత్యాదినా లుకి సతి శేష అవర్ణః అవర్ణాత్ పరో లఘుప్రయత్నతర యకార శ్రుతిః భవతి

ఉదా సయఢం నయరం లాయణ్ణం

హేమచంద్ర త్రివిక్రముల వృత్తిలోని లఘు యకార పదం కూడ చింతామణి సూత్రాలలో చోటుచేసికోవడం గమనిస్తే చింతామణి రచనమీద ప్రాకృత వ్యాకరణాల ప్రభావ మేపాటిగా ప్రసరించిందో వ్యక్తమవుతుంది

ఇలాగే సంస్కృత పదాల్ని సంస్కృతేతర వ్యాకరణాల్లో సంజ్ఞా కల్పన విషయంలోను అర్థవివరణ సందర్భంలోను వాడుకోవడాన్ని కూడ చింతామణి కర్త ప్రాకృత వ్యాకర్తలనుండె నేర్చుకున్నాడు

6]

## ఇతర విధాలైన అనుకరణలు

చింతామణి నకారము అనవలసనచోట న అని మళ్ళీ న (న్ + అ) అనవలసనచోట గూడ న అనే అనడం కద్దు ద్రుతాఖ్యోన ఇక్కడ నకారం అని అర్థం న కౌ- ఇక్కడ నకార అకాకారాలని అర్థం అలాగే ర అనే పదాన్ని షష్ఠ్యంతంగా ప్రయోగించిన సందర్భం గూడ ఉంది రో శ 3 ఇక్కడ రేఫకు అని అర్థం ఈ ప్రయోగాల్లో ఇతనికి క్రింది ప్రాకృత సూత్రాలు మార్గదర్శకాలు

తోఽచ (త్రివిక్రమ - -52) అచ పరస్య ఇతి శబ్దస్యాదే రితారెస్య తకారో భవతి పో వ (త్రివిక్రమ -3 55) పకారస్య వకార స్యాత్

వీటిలో తకార వకారాలు ఎలా నిర్దిష్టాలైనాయో చింతామణిలోని నకార రేఫలు గూడ అలాగే నిర్దిష్టాలైనాయి

వచ్చి రాన్ వంటి తెలుగు అసమాపక క్రియల్ని సంస్కృతంలో చెప్ప వలసి వచ్చినపుడు చింతామణి కర్త తప్పకుండా ప్రాకృత వ్యాకరణాల పారిభాషిక మార్గాన్ని అనుగమించాడు ఉదా న పదాన్యవ్యయ సుప్తిజ్ క్త్వాతుమునామ్4 దీనిలో క్త్వా శబ్దంతో తెలుగులోని భూతకాలిక-అసమాపక క్రియలు విహరించి- వంటివి చెప్పబడ్డాయి

సంస్కృతంలో క్త్వా తుమున్ వంటి ప్రత్యయాలు భూ మొదలైన ధాతు వులమీద చేరి భూత్వా భవితుం వంటి అసమాపక క్రియారూపాల్ని సృష్టిస్తాయి తెలుగులో ఆ ప్రత్యయాల పర్యాయాలుగా ఇ నజీ వంటి ప్రత్యయాల్ని ప్రయో గిస్తాం (వచ్చు + ఇ=వచ్చి వందు + ను=వందను) కాబట్టి అట్టివాటిని క్త్వాంతా

---

సంజ్ఞా 30

2 అజంత 24

3 హైది 74

4 సంజ్ఞా 42

లనీ తుమునంతాలనీ తెలుగు వ్యాకర్తలు చెప్పారు కాని ఆ చెప్పడంలో చింతామణి కర్తే ఆద్యుడు కేతనాదులు క్త్వాంత ల్యబంతాలుగా తుమునంతాలూ సంస్కృతంలోని పారిభాషిక పదాల్నే చెప్పారు గాని వాటి తెలుగు పర్యాయాల్ని కాదు చింతామణి కర్త మాత్రం తెలుగులోని వచ్చి పోయి రాన్ పోన్ వంటి పదాల్ని క్త్వాంత తుమునంతాలుగా వ్యవహరించడం ప్రారంభించాడు ఈ పద్ధతిని తప్పక ఇతడు ప్రాకృత వ్యాకర్తలనుండి స్వీకరించి ఉండాలి

ఏచ్చ క్త్వా తుం తవ్య భవిష్యతి (త్రివిక్రమ 2-4- 9)

వృత్తి క్త్వాతుం తవ్యేషు భవిష్యత్కాల విహితే చ ప్రత్యయే పరత అత ఏత్వం చకారా దిత్వంచ భవతి

ఉదా క్త్వా — హసే ఉణ హసి ఉణ

తుం — హసే ఉం

తవ్య — హసే అవ్వం

భవిష్యత్ — హసే హిఇ

ఇటువంటి సూత్రి రచననే చింతామణిలో క్త్వా భూతయో క్రియాం తస్యేత్- వంటిచోట్ల చూస్తాం క్త్వార్థంలోను భూతార్థం లోను క్రియ చివర ఇత్తు వస్తుందని సూత్రార్థం ఉదా వచ్చి వచ్చిరి

ఇలాగే భావార్థంలో సంస్కృతంలో త్వ ప్రత్యయం వస్తుంది తెలుగులో తన ప్రత్యయం వస్తుంది తెలుగులో ఈ తన ప్రత్యయం ఏ అర్థంలో వస్తుందో చెప్పవలసి వచ్చినపుడు చింతామణి కర్త ప్రాకృత వ్యాకరణాన్ని అనుసరించాడు ప్రాకృతంలో—

---

అం భా భూ 28

2 చింతా క్రియా 6

3 పాణిని 6- - 8

త్వస్యతు డిమాత్తణౌ (త్రివిక్రమ 2 - 3)

వృత్తి భావార్థే విహితస్య త్వప్రత్యయస్య డిత్ ఇమాత్తణ ఇత్యాదేశౌ తు భవతః

ఉదా పీనత్వం ఎణిమా

పై ప్రాకృత వ్యాకరణ సూత్ర రీతిలోనే చింతామణి—

త్వార్థే తనశ్చ విశ్రుతౌస్యాత్ (చింతా హలంత 28)

అని త్వార్థంలో అంటే భావార్థంలో తెలుగులో తన ప్రత్యయాన్ని సూత్రించింది
ఉదా రాముని తనము మంచితనము

చింతామణి విభక్తి విపరిణామాన్ని సూత్రీకరిస్తూ—

అన్యస్యా క్వచిద్ భవేచ్చాన్యా (చింతా హలంత 4) అని అన్నది

ఒక విభక్తికి మరొక విభక్తి కూడ కొన్నిచోట్ల వస్తుంది —అని సూత్రార్థం
ఉదా విప్రుల కుపాయన మిచ్చెన్ నూటికి నమ్మెన్ దొరకుహితము రామునకు మ్రొక్కులు — వీటిలో చతుర్థీ స్థానంలో షష్ఠి ప్రయోగం జరిగింది ఈ విధంగా సంస్కృత వ్యాకరణ మర్యాద నతిక్రమించి విభక్తులు మారడమన్న విషయం ప్రాకృత వ్యాకర్తలు గ్రహించి సూత్రించారు

జె సో జ మ్ (త్రివిక్రమ 2-3-35)

వృత్తి జే స్ చతుర్థీ జమ్ షష్ఠి జే స స్థానే జమ్ భవతి

ఉదా మణిస్స మణీణం భోఅణం దేవా ణమో దేవస్స దేవాణం

మొదట సర్వవిభక్తి సంస్కృత తుల్యా అని సర్వ విభక్తులు సంస్కృత వ్యాకరణ మర్యాద ననుసరించి ప్రయోగించబడాలి—అని సూత్రించి వెంటనే ఆ

---

హలంత 40

ప్రయోగంలో విపర్యయా లుండవచ్చునని తెలపడం చింతామణి కర్త పైన చూపి నట్లు ప్రాకృత వ్యాకర్తల నుండి నేర్చుకొని ఉండవచ్చు

సూత్రంలో శబ్దాల కూర్పు గూడ చింతామణి ప్రాకృత వ్యాకరణం నుండి స్వీకరించినదని చెప్పవచ్చు

సంస్కృత రాజన్ శబ్దం తెలుగులో రాజు గా ప్రయుక్తమౌతుంది ఈ విషయాన్ని చింతామణి ఈ విధంగా సూత్రించింది డుస్స్యాత్ సదారాజ్ఞ [1] రాజన్ శబ్దానికి ఎప్పుడూ డు వస్తుంది అని సూత్రార్థం ఉదా రాజు ఈ శబ్ద ప్రయోగాన్ని ప్రాకృత వ్యాకరణం అచ్చంగా ఇలాగే చేసి చూపింది – చింతామణికి పూర్వమే రాజ్ఞ (త్రివిక్రమ 2-5-53) రాజన్ శబ్దస్య నలోపేసతి అన్త్యస్య సౌపరే ఆత్వం వా భవతి — రాఆ

*ఇదం శబ్ద నిర్దేశం*

పై విధంగానే చింతామణి త్రిక సంధిని

ఇదమదసేతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుశం
హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వ ముపర్యక్షరస్య జనయంతి
(చింతా హలంత 24)

అని సూత్రించింది

ఆ ఈ ఎ అనే శబ్దాలు శబ్దాంతరంతో కలిసేటపుడు హ్రస్వాన్ని పొంది తమ మీది అక్షరానికి ద్విత్వాన్ని కలిగిస్తాయి –అని సూత్రార్థం ఉదా ఈదేశము–ఇద్దేశము ఎదేశము–ఎద్దేశము ఆదేశము–అద్దేశము ఇక్కడ నిజానికి సంస్కృతం లోని ఇదం అదస్ ఏతత్ ఈ మూడు శబ్దాలకు తెలుగులో ఈ అనే ఒక పదమే పర్యాయమౌతుంది అయినపుడు సంస్కృతంలోని మూడు శబ్దాల్ని సూత్రస్థం

---

హలంత 8

చేయవలసిన పనిలేదు అయినా చేయడం ఎందుకు జరిగిందంటే అది ప్రాకృత వ్యాకరణ ప్రభావం ప్రాకృత వ్యాకరణంలో ఇలాంటిదే పద రచన కనిపిస్తున్నది

ఇదమేతత్ కిం యత్తద్భ్యష్టో డిణా (త్రివిక్రమ 2-2-73)

వృత్తి ఏభ్యః స్వరాదిభ్యో దన్తేభ్య పరస్య టావచనస్య ఇణా ఇతి డిత్ భవతి తు

ఉదా ఇమిణా-ఇమేణ ఏదిణా-ఏదేణ జిణా-జేణ తిణా-తేణ ఇక్కడ ఇదం ఏతత్ శబ్దాలు పర్యాయాలే అయినా ఆవిధానం వాటికై జరిగింది కాగా అది సమంజసమే కాని తెలుగులో అలాకాదు అక్కడ ఆవిధానం అశబ్ద పర్యాయానికి (ఈ) ఉద్దిష్టమయింది కాగా అసమంజసం

ఇదేవిధంగా తెలుగు పదాన్ని సంస్కృతపర్యాయంతో స్వీకరించి దానికి అర్థశబ్దాన్ని జోడించి సూత్రించడమనే పద్ధతిని గూడ చింతామణి ప్రాకృత వ్యాకరణం నుండే స్వీకరించింది

## సంస్కృత పర్యాయంతో తెలుగును నిర్దేశించడం

దారార్థేఽత ఉదప ర (చింతా అజంత 34)

ఆలు శబ్దం పరమైతే అత్వానికి ఉత్వం రేఫ వస్తాయి ఉదా గుణవంతురాలు ధీరురాలు శూరురాలు జవరాలు

ఇక్కడ దారార్థము సంస్కృతంలో దార శబ్దానికి తెలుగులో అర్థమైన పదం ఆలు అని గ్రహించాలి పాకృత వ్యాకరణంలో ఈవిధమైన రచనామార్గం కనిపిస్తూ ఉంది

కేర ఇద మర్థే (త్రివిక్రమ 2- - )

వృత్తి ఇదమర్థే విహితస్య ఛ ప్రత్యయస్య కేర ఇత్యాదేశో భవతి

ఉదా యుష్మదీయ తుమ్హకేరో

చింతామణి అయి అవు లకు ఐ ఔ లు గాని లేక తద్వ్యత్యయం గాని ఆదేశిస్తూ సూత్రించింది

వాయి రవు ర్వక్రితమౌ (చింతా అజంత 65)

అయి అవులు వికల్పంగా వక్రతమాలౌతాయి అని సూత్రార్థం

ఉదా అయిదు-ఐదు అవును-ఔను

దీనికి మార్గదర్శకంగా ప్రాకృత వ్యాకణంలో ఐకార స్థానంలో అయి ఆదిష్టమయి కనుపిస్తుంది

అయిహి వైరాదౌ (త్రివిక్రమ - - 02)

వృత్తి ఏఐ చ ఇత్యనువర్తతే వైరాదిష్వాదేః ఐ చ అఇ ఇత్యాదేశో భవతి తు

ఉదా వైరం వయిరం వేరం వైశమ్పాయన -వయిశమ్పాయనో

చింతామణి నౌ శబ్దాన్ని తెలుగులో నావ గా ప్రయోగించవచ్చునని

స్తోఽవావౌ రైనావోః (చింతా అజంత 62)

అని సూత్రించింది రై నౌ శబ్దాలకు ఓ ఆవ అనేవి అంత–ఆదేశాలౌతాయి – అని సూత్రార్థం ఉదా రో యావి నావ

ఈ రచనకు మూలంగా లేక మార్గదర్శకంగా ప్రాకృత వ్యాకరణంలో

నావ్యావః (త్రివిక్రమ -1- 04)

అనే సూత్రం నౌ శబ్దస్య ఏచః ఆవ ఇత్యాదేశో భవతి

అనే వృత్తి నౌ -ణావా అనే ఉదాహరణ కన్పిస్తున్నాయి

ఫలితార్థం

పై పరిశీలనం వలన చింతామణి మీద త్రివిక్రమ ప్రాకృత వ్యాకరణ చ్ఛాయలు స్ఫుటంగా ఉన్నాయని తెలుస్తుంది కాగా ఏ పరిస్థితుల్లోనైనా చింతామణి త్రివిక్రముని కాలానికి అంటే 3వ శతాబ్దికి1 పూర్వ రచన కాజాలదని నిర్ణయించ వచ్చు అలాగే త్రివిక్రమ వ్యాకరణం రచితమై తెలుగునాట నేటి పాణినీయం లాగ సుప్రతిష్ఠితమైన తరువాతగాని చింతామణి రచన జరిగి ఉండదని గూడ నిర్ణయించ వచ్చు త్రివిక్రమ వ్యాకరణ ఫక్కి తెలుగునాట ప్రవేశించి వ్యాపించి సుప్రతిష్ఠితం కావడానికి కనీసం 300 ఏండ్లు పట్టిందనుకుంటే చింతామణి రచన 6వ శతాబ్దిలో జరిగి ఉండవచ్చునని చెప్పవచ్చు

## సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు

చింతామణి కర్తృత్వ నిర్ణయంలో బలీయమైన అంతస్సాక్ష్యం — సూత్రకర్తకు సూత్రార్థానికి ఉన్న ఏకాంతసంబంధం సూత్రంలోని పదాలు ప్రసిద్ధార్థాల్నీ తమకు ఉన్న అర్థాల్నీ కాకుండ సూత్రకర్తకు మాత్రం తెలిసిన అంటే అతడు సంకేతించిన అర్థాల్ని ఇవ్వడం చింతామణిలో కొన్ని చోట్ల కనిపిస్తుంది సంజ్ఞాపరిచ్ఛేదంనుండి క్రియాపరిచ్ఛేదం వరకూ అలాంటి సూత్రాలు కనిపిస్తున్నాయి ఆ సూత్రాలు ఆ అర్థాలే ఇవ్వాలి — అంటే తప్పనిసరిగా సూత్రకర్తే వ్యాఖ్యాన కర్త గూడ అయి ఉండాలి ఇతరులకు సూత్రకర్త సంకేతించిన అర్థం తెలియడం అసంభవం

అయితే ఈ ప్రకరణం చదవడానికి ముందు పఠిత ఇంతకాలం తనకు చింతామణి పఠన పాఠనాలవల్ల కలిగిన సంస్కారాన్ని (ఇత పూర్వ మేర్పడిఉంటే) పూర్తిగా తుడిచివేసికొని కొత్తగా ప్రథమంగా బాలసరస్వతికి వలెనే తనకూ ఒక చింతామణి ప్రతి ఏ వ్యాఖ్యా ఉదాహరణ లేకుండా లభించినట్లు భావించాలి తనకున్న సంస్కృతజ్ఞానాన్ని వ్యాకరణ పరిభాషాపరిజ్ఞానాన్ని మాత్రం ఉప

---

Comparat ve G ammar of Prakr t Languages by R P sche p 45

యోగించి ఇందులో వివరించిన సూత్రాల అర్థతాత్పర్యాలు గ్రహించడానికి యత్నించాలి అప్పుడుగాని ఈ పరిశోధనం అవగాహనకురాదు ఈ ప్రకరణంలో వివరించిన అంశాల తాత్పర్యం తెలియదు

సంజ్ఞా పరిచ్ఛేదంలో

అద్య క్రియాసు భూతార్థ ద్యోతినమాద్యగం వినా సర్వః (20)

దీనికి అర్థమిది క్రియాసు= కియాపదములయందు భూతార్థద్యోతినం - భూతార్థములం గనిపించునదియు ఆద్యగం=(నామ) ఆదినుండునదియు వినా= వినాగాను సర్వః =సమస్తమైన యః యకారమును అత్=అకారము

ఈ అర్థాన్ని యథాతథంగా గ్రహిస్తే ప్రప్రథమంగా సూత్రకర్త ఉద్దేశ మేమిటో తెలియదు బాలసరస్వతికి పూర్వం ఈ వ్యాకరణం ఉనికి మృగ్యం కాగా ఇది పరన పారనాల్లో ఉన్నట్లు నిదర్శనాలులేవు అతని మాటే ఇందుకు ప్రమాణం (బాలసరస్వతి ఎరిక) క్రియాపదాల్లో కనిపించే యకారం ఆదిలో (నామమాః ఆఖ్యాతమా? అవ్యయమా?) ఉండే యకారం ఎలా ఉంటుందో చెప్పలేదు ఆ యకారాలమీద ఎ అచ్చు లుంటాయో సూత్రం తెలపడంలేదు ఆ రెండు రకాల యకారాలు తప్ప మిగిలిన సమస్తమైన యకారం హ్రస్వ-అకారమట దీని తాత్పర్యం వక్తకు తప్ప ఇతరునికి ఎవరికైనా బోధపడుతుందా అకారమంటే అకారం-కలది అని అర్థమట అది సూత్రకర్త సంకేతించిన అర్థమే కాని పదానికి ఉన్నదికాదు అలా అర్థం చెప్పిన తరువాత గూడ సూత్రతాత్పర్య మేమిటో నూతనంగా చూచే వాడికి బోధపడదు

అసలు భూతార్థకక్రియల్లో యకార మేమిటి వండెను ఎండెను నచ్చెను మెచ్చెను వ్రాసెను-చూసెను-లేదే? కాగా కొన్ని క్రియల్లో మాత్రం అంటే అమహత్ ఎకబహువచనాల్లోనూ మహత్ ఎకవచనంలోను (ప్రథమపురుషలో) కనిపించే (పోయెను_అయెను) యకారాన్ని సామాన్య లక్షణంగా చెబితే చెప్పిన వానికితప్ప వ్యాఖ్యాతకా అర్థం ఎలాతెలుస్తుంది పైగా ఇక్కడ మొట్టమొదటే

మనసా పోయెను-ఆయెను-వంటి క్రియాపదాల్ని పంలిక్షించి చూస్తేతప్ప ఈ సూత్రానికి ఒక అర్థమున్నట్లే అనిపించదు? అంటే ముందే లక్ష్యాన్ని గ్రహించ గల్గితే తప్ప లక్షణాన్ని వ్యాఖ్యానించలేడు అలాగే ఆదిలో ఉండే యకారం ఏ అచ్చుతో ఉంటుందో గూడ సూత్రం చెప్పదు ఆ రెండుచోట్ల (క్రియల్లో ఆదిలో) ఉండే యకారాల్లో ఏ అచ్చులుంటాయో చెప్పడంకోసమే అసలు సూత్రం పుట్టినా సూత్రానికి ఆ శక్తిలేదు ఎంత సంస్కృతం చదువుకున్నా మరెంత వ్యాకరణ పరిశీలనం ఉన్నా సూత్రకర్త సంకేతించి చెప్పాడు గాబట్టి ఇతరునికి ఆ అర్థం తెలిసే అవకాశం లేదు మొదట బాలసరస్వతి వ్రాసిన అర్థం మాత్రం చదివినా మనకు తెలిసేది ఏమీలేదు తరువాత అతని ఉదాహరణలు చూస్తే ఓహో ఇదా దీని తాత్పర్యం అని అనిపిస్తుంది ఈ విషయాన్ని అంత అస్పష్టంగా అసహజంగా చెప్పాడెందుకు అని సందేహం కూడ సామాన్యంగా కలుగుతుంది

ఆ రెండు స్థలాల్లో యకారంమీద అకారాన్ని ఉచ్చరించే అలవాటు తన కాలంలో ఉండగా చూచి దాన్ని సరిదిద్దాలని సూత్రకర్త ఈ సూత్రాన్ని చేశాడు అతడే పదాలకి ప్రతిపదార్థం చెప్పినా దాని తాత్పర్యం తెలియదు అది ఒక సంకేతితార్థమే కాని సామాన్యార్థం కానేకాదు అతని ఉదాహరణలు అకారమనఁగా దలకట్టనుట -అనే వివరణం చూచిన తరువాత గూడ మన సందేహాలు కొల్లలు ఆ రెండు స్థలాల్లో యకారం ఏ అచ్చుతో ఉంటుందో అతని ఉదాహరణల్నిబట్టి మాత్రమే తెలిసికోగలుగుతున్నామంటే అది సంకేతితార్థం కాక మరేమిటి? మిగిలిన స్థలాల్లో యకారం హ్రస్వ అకారమంటే అర్థమేమిటి ఆ రెండుచోట్ల హ్రస్వాకారం వ్రాయగూడదని చెప్పినట్లు భాసించినా వివక్షితార్థం వ్యక్తమవుతుందా? పైగా ఇతరత్ర ఉండే సర్వ యకారమూ అత్తే నంటే వాఙ్మయంలో ఎన్ని పదాలు దోషాలై

---

పోయను-యవ్వడు-వంటి ఉచ్చారణ ఈ సూత్రతాత్పర్యంకోసం చింతామణిలో లక్షితమైన భాష అనే ప్రకరణం చూడండి

2 బాలసరస్వతీయ వ్యాఖ్య

పోవలసివస్తుంది : సూత్రలక్షణానికి ఇంతకంటె దుష్టోదాహరణం ఏభాషావ్యాకరణాల్లోనైనా ఉంటుందా? ఈ సందేహాలు వ్యాఖ్యాత సూత్రకర్తకంటే భిన్నుడై ఉంటే తప్పక కలిగి ఉండేవి కాదుగాబట్టే కలగలేదు

2 అద్దన్త్యస్తాలవ్యశ్చుర్వక్రస్స్యాన్మిథస్సవర్ణశ్చ — 27

దీని అర్థమిది దన్త్య దన్త్యమైన చు చవర్గము అత్=హ్రస్వ అకారము (కలది) తాలవ్య =తాలవ్యమైన చు =చవర్గము వక్ర = ఎ ఒ లు (కలది) స్యాత్=అగును మిథః=పరస్పరము సవర్ణశ్చ—సవర్ణములు గూడ (అగును)

సూత్రార్థాన్ని ఉన్నదున్నట్లుగా గ్రహిస్తే వివక్షిత అర్థమే స్ఫురించదు— చ జ లు మాత్రమే చవర్గ పద ఉద్దిష్టాలని తెలిస్తే తప్ప అప్పుడైనా సూత్రానికి అవ్యాప్తిదోషం పడుతుంది — దంత్యాల్లో చుక్క చూపు చొక్కు చోటు చౌక — వంటి వాటిలో దంత్య చకారం అదేవిధంగా జున్ను మొదలగువానిలో దంత్య జకారం సూత్రానికి లక్ష్యాలు కాజాలవు కాని సూత్రకర్త ఉద్దేశం కొన్ని శబ్దాల్లో తలకట్లు (అకారాలు) ఉండవలసినచోట ఎత్వాలు ఎత్వాలుండవలసినచోట తలకట్లు ఉంచి ఉచ్చరించడాన్ని నిషేధించడం మాత్రమే కాబట్టే బాలసరస్వతి చందురుడు చక్కెర జాద జంట—మొదలయిన దంత్యములు తలకట్లనుట అని ఆ అంతరార్థం వివరించాడు ఆ శబ్దాలు తలకట్లతో గాక ఎత్వంతో చెందురుడు—వంటివిగా ఉచ్చరించడం వ్రాయడం అతనికాలానికి జరిగేది దాన్ని సరిదిద్దడంకోసమే సూత్రం అదేవిధంగా చెన్ను చెల్వ జెట్టి జెట్టి—వంటివాటిలో గూడ అత్వోచ్చారణ లేఖనాలు వినబడుతూ కనబడుతూ ఉంటే వాటిని నిషేధించడానికే ఈ సూత్రం ఉద్దిష్టమయింది బాలసరస్వతి కాలానికి చల్వ జట్టి-వంటి ఉచ్చారణ లుండి ఉండటంలో అసహజమేమీలేదు

---

) చేయును-వ్రాయును-వంటివి

2) చేయుట— వాయుట—వంటివి

3) చేయుము—చేయుడు—వ్రాయుము వ్రాయుడు—వంటివి

4) చెయిది—అయిదు—వంటివి

5) ఎయిదు (వెంబడించు) లోనగునవి

ఈ అంతరార్థం సూత్రం రచించినవానికి తప్ప ఇతరులకి అవగాహనకావడం సంభవించదు

3 తిఙ్మధ్య శేషష్షు సు స్కర్మప్రవచనీయజవిభక్తి
కించిత్ ప్రశంసనాద్భుత సంతాప యదా తదా కిమేవాం శ్చ
క్త్వా కిల తూష్ణ్యమాద్యా నభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్ – 44

దీని బాలసరస్వతీయ వ్యాఖ్య కించిత్ ఇంచుకంత కొసంతం సుంతః మొద లయిన కించిదర్థములును ప్రశంశన=బళి మజ్జా మొదలయిన ప్రశంసార్థములును అద్భుత=అహో ఓహో౹ ఔరా మొదలగు అద్భుతార్థములును సన్తాప=అక్కట అయ్యో మొదలయిన సంతాపార్థములును యదా తదా=ఎప్పుడు అప్పుడు అనెడి వియు కిం–ఏమి యనునదియు ఏవాంశ్చ=నిన్నే నన్నే అను నేవార్థములును క్త్వా=ప్రకాశించి హరించి విహరించి యిత్యాది క్త్వాప్రత్యయాంతములును కిల= చేసెనఁట అనెడి కిలార్థమును తూష్ణం=ఊరక మిన్నక మొదలయిన తూష్ణమర్థము లును అది శబ్దముచేత పట్టియనుం విభక్తియు మఱి సుమ్ము కద మొదలయి నవియు కళా =కళలని అభిదదతి=చెప్పుదురు

పై వ్యాఖ్యలో పదాల అర్థాలు వివరించేటపుడు ఒక క్రమం పాటించబడలేదు కొన్నిచోట్ల తెలుగుపర్యాయాలు ఇస్తూ కొన్నిచోట్ల పర్యాయాలుగాక స్వసంకేతి తార్థాలు ఇవ్వడం జరిగింది

---

వావిళ్లవారి ప్రతి ( 97 ) లో ఇంచుక

2 ఇది ఎక పదం కాదు కొసు + అంత=కొసంత అని పదద్వయ ఘటిత రూపం సుంత గూడ ఇటువంటిదే–పూర్వపద స్వరూపం గవేషించాలి అది పొరపాటో గ్రహపాటో వ్యాఖ్యాతదో లేఖకునిదో అయి ఉండాలి

3 వావిళ్లవారి ప్రతిలో లేదు

4 లేదు

5 వావిళ్లవారి ప్రతిలో కయి గూడ కలదు

కించిత్ శబ్దానికి పర్యాయంగా ఇంచుక సుంత శబ్దాలు తెలుగులోనివి ఇవ్వ బడ్డాయి కాని దాని అనంతరపదానికి (ప్రశంసన) పర్యాయం ఒసగబడలేదు (ప్రశంసనం=పొగడ్త) ప్రశంసనంలో చేసే ధ్వనులు బళి మజ్జా అనేవి ఒసగ బడినాయి అలాగే అద్భుత శబ్దానికి గూడ తెలుగు పర్యాయం గాకుండ (అచ్చె రువు) తద్భావప్రకటనలో వెలువడే శబ్దాలు అహో ఓహో ఔరా అనేవి కళలుగా చూపబడినాయి బళి మజ్జా అనేవి అద్భుతార్థాలు ఎందుకు కావు అదేవిధంగా సంతాపశబ్దానికి కూడ తెలుగు పర్యాయం (వేఁడిమి కాఁక) ఇవ్వకుండా సంతప్తుల వ్యవహారంలోని ఆక్రిందనాన్ని సూచించే శబ్దాలు అయ్యో అక్కటా అని ఇచ్చాడు

ఇది అపవ్యాఖ్య అనీ సంతాపశబ్ద తెలుగు పర్యాయం వేఁడిమి వంటిది (యదా తదా శబ్దాలు తెలుగులో ఎప్పుడు అప్పుడు అన్నట్లు) కళాసంజ్ఞకమౌతుం దనేదే సూత్రానికి అర్థమని వాదించవచ్చు కాని అపుడది సుస్ (ప్రథమాంతాలు) లోనే అంతర్భవిస్తుంది కాబట్టి పునర్గ్రహణం నిరర్థకం పైగా వ్యవహారస్థమైన అయ్యో అక్కటా వంటివానికి కళాసంజ్ఞ లభించదు కాబట్టి సూత్రకర్త ఉద్దేశించి నది అయ్యో అక్కటా వంటి శబ్దాల్నే కాని తెలుగు వ్యాకరణాన్ని సంస్కృ తంలో రచించడం వలన తెలుగుకి సంస్కృత పర్యాయాలు సూత్రాల్లో గ్రథించడం వల్ల ఎర్పడిన చిక్కు యిది ఈ చిక్కు ఉండటం వలననే సూత్రకర్త ఉద్దేశం ఎదో సూత్రకర్తకే గాని ఇతరులకు తెలియరాని స్థితి ఎర్పడింది నిజానికి పైన విమృష్టాలైన పదాలకి అవే అర్థాలని (వ్యాఖ్యాత చెప్పినది) ఆ పదప్రయోక్తకు తప్ప తెలియవు కారణం ఆ అర్థాలు అతనిచే సంకేతితమైనవేతప్ప యథార్థాలు గావు

అదేవిధంగా పైసూత్రంలో (ఎవాన్+చ) ఎవాంశ్చ అనే పదానికి తెలుగు లోని నిశ్చయార్థాలైన ఎ — వంటి శబ్దాలే అర్థమని తెలియడం కేవలం వ్యాఖ్యాతకు అసాధ్యమైన పని పైగా ఎవ అనేది అవ్యయం — సంస్కృతంలో దాన్ని ఈ తెలుగు వ్యాకర్త అకారాంత పుంలింగం చేసి ద్వితీయాబహువచనాంతంగా ఇక్కడ ప్రయోగించాడు ఇది ప్రప్రథమంగా కర్తకు తప్ప తెలియదు కర్తగానివాడైతే యోజన చేసిచేసి చివరకు ఎవంచ అనో మరేదో అనో అర్థించేసికొని దాన్నే చెప్పి ఉండేవాడు అసలు ఒక భాషావ్యాకరణాన్ని తద్భిన్నభాషలో వ్రాస్తే కర్త

ఉద్దేశాలు వ్యాఖ్యాతలకు తెలియవనే బహుశః హేమచంద్రాదులు తమ ప్రాకృత వ్యాకరణ సూత్రాలకి తామే వృత్తి వ్యాఖ్యానాలు ఉదాహరణలతో వ్రాసికొని ఉంటారు

*సంధి పరిచ్ఛేదంలో*

4 పరిమితౌ సమస్తానామ్ — 5

దీని అర్థమిది పరిమితౌ=పరిమాణార్థము పరమై ఉండిన సమస్తానాం= అన్ని అచ్చులకు (సంధి గలదు) ఉదా బారెఁడు పుట్టెఁడు తూమెఁడు వీసెఁడు ఇత్యాది

దీనిలో పరిమితౌ అనేపదం పరిమాణార్థకమనీ అదిగూడ ఎఁడు అనే పదాంశమనీ కర్త కుతప్ప వ్యాఖ్యాతకు తెలియడానికి అవకాశంలేదు పరిమితి—పరిమాణం=కొలత అంతవరకే ఆ సంస్కృత పదానికి శక్తి గాని ఎఁడు ప్రత్యయాన్ని నిర్దేశించే శక్తి స్వత దానికి లెదు ముందుగానే మనసా ఆ అర్థం సంకల్పించుకొని వ్రాసినవానికితప్ప కొత్త వానికి పరిమితి శబ్దానికి ఎడ్వాది తెలుగు పదాంశాలే అర్థమని తెలియదు — ప్రప్రథమంగా తెలిసిన తరువాత ఇప్పటి చింతామణి విద్యార్థులందరికీ తెలిసినట్లు సామాన్యంగానే ఆ అర్థం తోచవచ్చు కాని చింతామణిని ప్రప్రథమంగా చదివే ఏ సంస్కృత విద్వాంసుడైనా పరిమితి శబ్దాన్ని ఎఁడ్వర్థకంగా గ్రహించలేడనడానికి నస్పాదయ హృదయమే ప్రమాణం

5 నస్యాత్తద్ధర్మోత — 6

దీనిఅర్థమిది తద్ధర్మోత =తద్ధర్మక్రియలయొక్క ఉకారమునకు నస్యాత్ సంధి లేదు ఉదా రక్షించునంబ పోషించునీశ్వరి

ఇక్కడ తద్ధర్మ శబ్దానికి తద్ధర్మ క్రియ అని అర్థం — వ్యాఖ్యాతల వ్రాతను బట్టి అయినపుడు తద్ధర్మ క్రియల్లో ఉత్వం కేవలం ప్రథమపురుషైకవచనంలో మాత్రమేకాక బహువచనంలోను ఇతర పురుషల్లోని రెండు వచనాల్లోను ఉంది1

---

1 రక్షించును-రక్షింతురు రక్షింతువు-రక్షింతురు రక్షింతును రక్షింతుము

అయినపుడు తద్ధర్మ క్రియల్లోని ఉకారానికి సంధిలేదంటే రక్షింతురు + అంబ = రక్షింతురంబ అని ఉండవలసిన స్థలాల్లో గూడ సంధిలేకుండా పోతుంది[1] నిజానికి సూత్రానికున్న అర్థమంతే కాని సూత్రకర్త ఉద్దేశించిన అర్థంమాత్రం వేరు అతడు తద్ధర్మపదంతో దానిలోని ప్రథమోత్తకమైక వచనాల్నే (మహతీతరముల బహువచనం గూడ) ఉద్దేశించాడు కాని అది అతని సంకేతితార్థం కాబట్టే విరళ్యంతరంగా నిస్సందేహంగా తాను ఉద్దేశించిన అర్థమే వ్యాఖ్యానంలో వ్రాసి ఊరుకున్నాడు వ్యాఖ్యాత భిన్నుడైతే పైసందేహాలు కలిగేవే కాదుగాబట్టి కలుగలేదు

చింతామణిని బాలసరస్వతి తర్వాత అతని వ్యాఖ్యనే ఆధారం చేసికొని వ్యాఖ్యానించినవాడు అప్పకవి అతనికి ఈ సూత్రి వ్యాఖ్యానం చేసే సందర్భంలో పై సందేహాలు కలిగాయి తద్ధర్మపదానికి మూడు పురుషల్లోని ఏకబహువచనాలు మొత్తం అర్థం కాగా సూత్రం కేవలం ప్రథమైకవచనాన్నే ఉదాహరించి ఊరుకుంటే సరిపోదనీ కాని సరిపెట్టుకోక తానుచేయగలిగినది (సూత్రానికి సంబంధించి) ఏమీలేదని తెలిసి వ్యాఖ్యానం మాత్రం విచిత్రంగా వివరంగా చేశాడు

ఉర్వి దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్య పురుషముల నేకవచనముల్
పోవవిడిచి
కడమపదములు తిఙ్మధ్యకములుగానఁ గొమ్ములను బ్రాణ సంధులు
గూర్చుటొప్పు
(అప్ప 5-73)

వదలక తద్ధర్మములను బొదలెడు ప్రథమోత్తమాఖ్య పురుషైకవచః
పదములు ద్రుతప్రకృతులగుఁ బదరును నతఁడోర్తు నేను బలుమఱు ననఁగన్
(పైది 75)

సూత్రార్థాన్ని మరికొంచెం విపులపరచి ఉత్తమపురుష ఏకవచనాన్ని గూడ తద్ధర్మసజ్ఞకంగానే గుర్తించి మిగిలినవి తిఙ్మధ్యకాలు[2] గాబట్టి వాటికి (ఉకారాంతా

---

[1] అలాలేకుండా పోవడానికి వీలులేదు సంధి కావాలి

2 క్రియల్లో మధ్యమపురుషరూపాలు చివర రు ము ఉండే రూపాలు

లకి) సంధి జరుగుతుందని విశేష ప్రతిపత్తి కలిగేవిధంగా వ్రాశాడు ఇతని ఈ వ్యాఖ్యానాన్ని సంస్కృతీకరించి అహోబలపతి తన వ్యాఖ్యానంలో అధర్వణ కారికగా పేరుపెట్టి స్థలాంతరంలో ప్రదర్శించాడు ఈ సూత్ర వ్యాఖ్యానంలోనే తన సంస్కృతీకరణను ప్రవేశపెడితే అది అప్పకవీయగ్రంథానికి అనువాదమని వెంటనే తెలుస్తుందని భావించే బహుశ దాన్ని హలంతపరిచ్ఛేదంలో 39వ సూత్ర వ్యాఖ్య చేసిన తరువాత అసందర్భంగా ఈ సూత్ర స్మరణంచేసి మనం పైన చేసిన పూర్వ పక్షమే చేసి సమాధానంగా - తద్ధర్మ క్రియల్లోని (ప్రథమోత్తమపురుషైకవచనాలు వినా) ఉత్వానికి సంధి జరగదంటే చెల్లదనీ ప్రయోగాలతో విరోధమౌతుందనీ చెప్పి అధర్వణవచనంగా

ప్రథమశ్చోత్తమశ్చైవ తాసు తద్ధర్మ సంజ్ఞకౌ
భూతాద్యవిషయౌ తత్ర చైకత్వార్థాభిధాయకౌ
ఉదన్తౌ చ సదానన్తౌ న సంధి స్తత్రకల్ప్యతే

అని ఉటంకించాడు అప్పకవి పద్యాల్ని ఈ కారికల్నీ పోల్చి చూస్తే అప్పకవీయాను వాదమే తప్పక ఈ కారికలని వెంటనే తెలుస్తుంది

అయితే ఇక్కడ పూర్వపక్షమొకటి ఉండవచ్చు అధర్వణకారికల్నే అప్పకవి తెనిగించి ఉండగూడదా అని కాని అప్పకవికి అధర్వణకారికలు తెలియవు అప్పకవి అధర్వణని వ్యాకర్తగానే ఎరుగడు ఎరిగిఉంటే తాను తన గ్రంథాదిలో ఇచ్చిన వ్యాకర్తల వ్యాకరణాల వరుసలో అధర్వణునీ అతని కారికల్నీ ఉంచేవాడే పైగా అప్పకవికి ఈ కారికల సంగతి తెలియనే తెలియదని స్వయంగా అహోబలపతే ఒకచోట సాక్ష్యమిచ్చాడు1

6 తద్వత్తదాదిజస్య - 8

దీనిఅర్థమిది తదాదిజస్య తచ్ఛబ్దాద్యర్థములయందు పుట్టిన ఇకారమునకు తద్వత్= ఉకారమునకు వలెనే వికల్పము (సంధివచ్చును) ఉదా అది యెవ్వరు అదెవ్వరు ఇది యేమి ఇదేమి

---

1 కాకునూర్యప్పకవిస్తు ఏతద్గ్రంథ సంపాదనవైధుర్యేణ శ్రీనాథస్య భ్రాన్తత్వమాహ - కవిశిరోభూషణం-సంధి-4వ సూత్రవ్యాఖ్య

దీనికి పూర్వసూత్రంలో[1] ఉకారానికి వికల్పసంధిని విధించాడు ఇక్కడ తదాదిశబ్దాలోని అచ్చుకి గూడ అట్లే సంధి అవుతుందని సూత్రించాడు సంస్కృతంలో తత్ శబ్దానికి లింగాన్నిబట్టి (పుం) వాడు (స) (స్త్రీ) ఆమె (సా) (నపుం) అది (తత్) అనే అర్థాలు వస్తాయి అన్నిటికీ ప్రాతిపదిక ఒకటే సంస్కృతంలో సమాసం ప్రాతిపదికతోటే ఏర్పడుతుంది గాబట్టి ఇక్కడ తచ్ఛబ్దానికి పై అర్థాలన్నీ పొసగుతాయి పైగా పూర్వ సూత్రంలో ఉకారసంధి ఉన్నది గాబట్టి ఇక్కడగూడ వాడు మొదలయినవాటిలోని ఉత్వానికే వికల్పసంధి చెపుతున్నాడని అనవచ్చు - ఈ సందేహాలు అభ్యంతరాలు సూత్రకర్తగానివాణ్ణి విశేషంగా బాధిస్తాయి వ్యాఖ్యాన రచన ముందుకు సాగదు కాని బాలసరస్వతికి ఆ సందేహాలూ అభ్యంతరాలు ఏమీ ఉండవు అతడు తాను సంకల్పించిన అర్థాన్నే సులభంగా వ్రాసేసి ఉదాహరణ లిస్తాడు

ఇక్కడ తత్ శబ్దానికి తత్ (నపుంసకలింగం) అనేదిగూడ అర్థం కావచ్చుగాని స సా అనేవి గూడ (సూత్రంలో సమాసం ఉండటంవలన) అర్థాలే అవుతాయి సూత్రకర్త కానివాడికి ఆపాటి తికమక చాలు నిష్కర్షగా వ్రాయలేకపోవడానికి కాగా ఇదీ స్వసంకేత ప్రసిద్ధార్థమైన సూత్రమే

7 ప్రాయస్తుస్యాత్ కిమాదికస్యేత - 8

దీనిఅర్థమిది కిమాదికస్య=కిమర్థాదులయొక్క ఇతస్తు=ఇకారమునకైన ప్రాయ =తరచుగా స్యాత్ - (సంధి) అగును ఉదా ఎమమ్మ ఏమియమ్మ ఏమయ్య ఏమియయ్య

సంస్కృతంలో కిమ్ శబ్దాలు సర్వనామ మొకటీ అవ్యయ మొకటీ రెండు ఉన్నాయి ప్రస్తుతం దీనికి పై సూత్రంలో సర్వనామ శబ్దమైన తత్ శబ్దానికి సంధి విహితమై ఉంది – తరచుగా అయినపుడు దాని వెంటనే ఉండే కిమ్ సర్వనామం కాదనీ అవ్యయమనీ దాని అర్థం కేవలం ఏమి అని మాత్రమే అనీ సూత్ర

---

చోర్వాస్యాద్వర్తమానవిహితస్య

కర్తకు తప్ప ఇతరులకి ఎలా తెలుస్తుంది? ఇక్కడ సూత్రంలో ఇతః అనే దళం గూడ ఉన్నదిగాబట్టి ఏది ఏవి ఇత్యాది శబ్దాల్లోన ఇత్తే సూత్రోద్దిష్టమని సందర్భాన్నిబట్టి అనుకుంటారు కాని బాలసరస్వతి మాత్రం స్వసంకేతితార్థం ఎమి అనే అవ్యయమె అర్థమని వ్యాఖ్యానించి ఉదాహరించి ఊరుకున్నాడు

పూర్వసూత్రంలో అది మొదలయినవాటకి సంధిని విధించి తిరిగి ఏది మొదలయినవాటకి సంధి విధానం చేస్తాడా అని ప్రశ్నరావచ్చు చింతామణి కర్తకు ఆ సంకోచమేమి లేదు చేస్తూనే ఉంటాడు ఇపుడు మనం సంస్కృతం నేర్చిన తెలుగువిద్వాంసులు కొత్తగా కొంగ్రొత్తగా చింతామణిని చూసినపుడు కలిగే అనుభవాన్ని యథార్థంగా ప్రదర్శించాలి అవుడే సూత్రకర్త వ్యాఖ్యాకర్త ఒకడేనా కాదా అనే అంశం అవలీలగా పరిష్కృతమౌతుంది

8 అపిశబ్దార్థస్యేత - 0

దీనర్థమిది అపిశబ్దార్థస్య అపి అను ఉపసర్గార్థ పదముయొక్క ఇతః= ఇకారమునకు వికల్పమున లోపము వచ్చును ఉదా హరునేనంబనే హరునేని నంబనేని

---

| | | |
|---|---|---|
| అ) | అమరిచి-అమర్చి-కావడానికి ఒకసూత్రం | (సంధి- ) |
| ఆ) | వినుచు—విన్చు—కావడానికి ఒకసూత్రం | (సంధి- 2) |
| ఇ) | అపుడు—అప్డు—కావడానికి ఒకసూత్రం | (సంధి- 5) |
| ఈ) | పునుక-పున్క-కావడానికి ఒకసూత్రం | (సంధి-42) |
| | అప్పకవీయ చింతామణి ప్రకారమైతే— | |
| ఉ) | అబ్బురము-అబ్రము-కావడానికి ఒకసూత్రం | (అప్ప—సంధి—23) |
| ఊ) | ఎటులు ఎట్లు కావడానికి ఒకసూత్రం | (అప్ప—సంధి—25) |
| ఋ) | పూనికి-పూన్కి-కావడానికి ఒకసూత్రం | (అప్ప—సంధి—28) |

విడివిడిగా ఇన్నిటికి ఇన్నిసూత్రాలు చెప్పి తృప్తిపాలక ఇంకేమైనా మిగిలిపోతే వాటికోసం మరొకసూత్రం (సంధి- 3) చేసినవానికి సూత్రనిర్మాణంలో పొదుపు జాగ్రత్త ఉన్నాయని వాదించి నెగ్గలేం

తెలుగువాడెవడికైనా సంస్కృతంలోని అపి శబ్దానికి తెలుగు పర్యాయ మనగానే వెంటనే స్ఫురించేది— కూడ అనే అవ్యయం కాని సూత్రం అప్యర్థక-తెలుగుపర్యాయం ఏవి అంటున్నది ఏని శబ్దానికి అప్యర్థ ముండవచ్చుగాని ప్రసిద్ధంగా బాలసరస్వతి ఉదాహరణనుబట్టే పర్యాయార్థ మున్నట్లు తెలుస్తుంది అయినపుడు ప్రసిద్ధంగా పర్యాయార్థమైన శబ్దాన్ని పట్టుకొని అప్యర్థమని సూత్రీకరించి వ్యాఖ్యానం చేయాలంటే సూత్రకర్తా వ్యాఖ్యానకర్తా ఒక్కరే కాకపోతే సంభవమా? ఇతరు దెవడికీ ఏని అప్యర్థకంగా స్ఫురించదు సూత్రకర్త ఉద్దేశించినదదే అని సూత్రకర్తే వ్యాఖ్యానించాలి

అప్యర్థంలో ఇదంతంగా పదమేదైనా ఉందా? తెలుగులో అని యోచిస్తే కాని అనేది కనబడుతుంది -ఏనివలెనే అయినపుడు కాని కూడ ఈ సూత్రానికి విషయమే అని సందేహించవచ్చు

సూత్రంలోని ఇత అనే పదం అప్యర్థకంగా సూత్రకర్త ఉద్దేశించినది కూడ శబ్దాన్ని కాదని తెలియచేస్తుంది నిజమే కాని ఏని పదమే కర్త చెప్పాడని కొత్తగా ఇతరునికి అపి శబ్దంవలన తెలియడం అసాధ్యం పైగా సంస్కృతావ్యయం అపి కి తెలుగులో పర్యాయంగా ను ఉను అనే సముచ్చయార్థాలు గూడ వాడటం జరుగుతుంది గదా

9 షష్ఠ్యాఉతో౽చినుమ్చేచ - 7

దీనిఅర్థమిది సే=సమాసమందు షష్ఠ్యా=షష్ఠియొక్క ఉత =ఉకారమునకు అచి=అచ్చుపరమైతే నుమ్చ=నుమాగమమును (వచ్చును) ఉదా రాజునెదుట పామునెమ్ములు

ఈ సూత్రంలో సె=సమాసమందు అని వ్యాఖ్యానం సస్సమాస² అనేది త్రివిక్రమదేవునిచే కల్పితమైన సంజ్ఞ దాని సప్తమ్యంతరూపం సే అనే పదం కాని ఈ సూత్రంలోని పే త్రివిక్రముని ప్రాకృత శబ్దానుశాసన ప్రారంభంలోని

---

రామ కృష్ణ అః=రాముడు కృష్ణుడును

2 త్రివి — —8

సంజ్ఞయొక్క సప్తమ్యంతరూపమని వ్యాఖ్యాతకు కొత్తగా తెలియడమెలా? చింతామణికి ఒక ఉపక్రమణిక ఉంది దానిలో సూత్రకర్త తానిలా ప్రాకృత పరిభాషను ప్రయోగిస్తున్నట్టు చెప్ప ఉంటే వ్యాఖ్యాత తెలిసికోగలడు ఏ సూచనా లేకుండా ఒక్కసారిగా 'సే' అంటే దాని అర్థం అది వ్రాసినవానికి తప్ప ఇతరునికి తెలియడం అసాధ్యం కాకపోయినా దుస్సాధమనే అనాలి

0 ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు — 28

దీని అర్థమిది సమాసేషు=సమాసములయందు సర్వత్ర= అన్నిచోట్ల ద్రుతస్య=ద్రుతమునకు లుక్=లోపము-(అగును) ఉదా విరికల్వ తెల్లదమ్మి

ఇది సమాసాలలో ద్రుతలోపం చెప్పే సూత్రం కాని దీనికి బాలసరస్వతి ఇచ్చిన ఉదాహరణలు ఎందుకో మారి సూత్రానికి ఉదాహరణకి సమన్వయం కుదరని తెలియని స్థితి ఏర్పడింది బాలసరస్వతి టీక ఈ ఒక్కచోట కొద్దిగా చలిస్తేనే ఈ దుస్థితి కలిగితే అసలు అతని టీకే లేకపోతే చింతామణికి అర్థ సందర్భాలే ఉండవంటే అతిశయోక్తి కాదు కాబట్టే అప్పకవి గాని అహోబలపతి గాని బాలసరస్వతి ఒసగిన అర్థాన్ని ఉదాహరణనీ యథాతథంగా తీసికొనే ఆపైన తమ వ్యాఖ్యాన విస్తృతికి పాటుపడ్డారు ప్రస్తుతం దీనికి విరికల్వ (మోముచందురుడు) తెల్లదమ్మి అని ఒకప్రతిలో[1] మోముచందురుఁడు విరిగల్వ కవినేర్పు చిల్కపల్కులు రాముని యాకృతి తెల్లదమ్మి — అని ఒక ప్రతిలో[2] అతని యాకృతి సీతారాములప్రాపు ఒప్పులకుప్ప అని వేరొక ప్రతిలో[3] ఉదాహరణలు కనుఎస్తున్నాయి వీటిలో షష్ఠతత్పురుష సమాసాలన్నింటికి ఈ సూత్రంతో సమన్వయం కుదురుతుంది[4] కాని మోము చందురుడు అనే సమా

---

1 ఆంధ్రసాహిత్యపరిషన్ముద్రణ కాకినాడ 932

2 వావిళ్ళ ప్రచురణ 97

3 వావిళ్ళ ప్రచురణ 963

4 షష్ఠిభవేద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నాం (హలంత 34) అనే సూత్రంతో రామునియొక్క ఆకృతి — రామునిన్ ఆకృతి — రాముని యాకృతి అని రూపనిష్పత్తి

సంలో ద్రుతమెక్కడ దాని లోపమెక్కడ? అట్లే విరికల్వ లోను సూత్రాన్ని సమన్వయించలేం ఇక్కడ బాలసరస్వతివాక్కు భ్రంశానికి గురికావడం జరిగి ఉండవచ్చు ఈ సూత్రానికి అప్పకవి వ్యాఖ్యానం సులభంగా సవ్యంగా ఉన్నట్లు కనుపిస్తుంది బహుశ అదే బాలసరస్వతి కృతమైనదై అప్పకవి వాక్కులలో (పద్యాలు గాబట్టి) భద్రపరచబడి ఉందేమో

వనధి తనయేశ యయినటువంటి యనుచఁ
బరపద విశేషణము తేటపఱచుకొనుచుఁ
దొలుతటి పదంబుకొననుండు ద్రుతము గుడియు
సమసనమునందుఁ జెందు లోపములఁ గృతుల

కడపటి ద్రుతమును గుడియును
బొడవడఁగినఁ బయిఁ బరుషములు సరళములౌఁ
జెడవు పెలుహల్లులెల్లను
వడలక ప్రాణంబులెల్ల పంధులు గాంచున్

జగతిఁ జప్పనికూరకుఁ జప్పఁగూర చనును జక్కనివాయకుఁ జక్కఁజాయ
హెచ్చుపచ్చనిటోపికిఁ బచ్చఁదోపి గరిమ కమ్మనితావికిఁ గమ్మఁదావి

చల్లగాలి తియ్యవిల్తునా సరళస్థి రాక్షరములు తొల్లియట్ల నిలుచుఁ
బంచబాణజనక పచ్చావు నల్లావు లనుచు నచ్చులెల్ల నదుకు నిట్లు
(అప్ప 5 64–67)

పై వ్యాఖ్యవల్ల పచ్చని తెల్లని— ంటి శబ్దాల చివరి ని వర్ణాలు ద్రుతాలనీ అవి శబ్దాంతరంతో సమసించేటపుడు లోపిస్తాయనీ తెలుస్తుంది వ్యాఖ్యలో దురన్వయం దూరాన్వయం లేవు అది ఋజువుగా కనిపిస్తుంది ప్రౌఢ వ్యాకర్త చక్కంగన్ వంటి శబ్దాల నిష్పత్తికై (చక్క–న–ని–+కాన్) ఇటువంటి (ని వర్ణానికి) న వర్ణానికి ద్రుతత్వాన్ని భంగ్యంతరంగా అంగీకరించాడు గదా (ప్రౌఢవ్యా –సమాస- 4) అలాగే శబ్దసిద్ధ నకారాన్ని ద్రుత మనడం కూడదనే సందేహమూ పడపనిలేదు ఛందోయి –వంటి సమాసాల నిష్పత్తిలో చిన్నయసూరి గూడ శబ్దావయవ నకారం ద్రుతమని అంగీకరించినట్లు మనకు అంగీకరించక తప్పదు–సవ్యంగా పరిశీలిస్తే (బాలవ్యా సంధి 8)

హలంత పరిచ్ఛేదంలో షష్ఠికి ద్వితీయా తుల్యత్వం వచ్చిన తరువాత వచ్చే ద్రుతలోపంకోసం ఆసందర్భం ఏమీ చెప్పకుండా ఈ సంధిపరిచ్ఛేదంలో సూత్ర రచన చేశాడని అహోబలపతి చేసే వ్యాఖ్యకంటే అప్పకవీయ వ్యాఖ్యానమే సక్రమంగా ఉంది—నాదృష్టికి ప్రస్తుత సూత్రానికి అహోబలపతి వ్యాఖ్యానం వలన చేరిన ఉదాహరణలే షష్ఠీతత్పురుష సమాసాలు అలాకాకుండా తెల్లదమ్మి వంటివి అప్పకవిచేత స్వీకృతాలై ఛందస్సాధన నిలిచి ఉంటే అవే బాలసరస్వతి అభిప్రేతాలని తోచేలా చేస్తున్నాయి ఇక ప్రస్తుతాంశానికి వస్తే ఈ సూత్రం తెల్లదమ్మి విషయకం గావటం స్వసంకేత ప్రసిద్ధమే

లుక్సంశ్లేషౌ నాచి — 28

దీని అర్థమిది లుక్సంశ్లేషౌ=నకారలోపమును తత్సంశ్లేషమును అచి= అచ్చు పరమైనపుడు న=లేవు ఉదా భజింతునంబను త్యజింతునఘములు

ఈ సూత్రానికి బాలసరస్వతి వ్యాఖ్యలో స్పష్టత లోపించి ఇక్కడ వైయాకరణులలో పెద్ద వివాదం చెలరేగింది ముఖ్యంగా పాండిత్య ప్రకర్షతో తొణికిసలాడే అహోబలపతి పెద్ద వాగ్వాదం చేసి ఈ సూత్రానికి బాలసరస్వతి చెప్పనిదీ అందుకనే వివాదాస్పదమైనదీ అయిన అర్థాన్ని కల్పించాడు

భజింతున్ + అంబను వంటి చోట్ల సంశ్లేషకు ప్రసక్తే లేదు అప్రసక్తమైనదానిని నిషేధించడం ఎలా సాధ్యమౌతుంది అని ప్రశ్న వేసుకొని దాన్ని సాగదీసి చర్చ ప్రతిచర్చ సాగించి చివరకు పదాది యకారం సంధి సందర్భంలో అజ్వద్భావం పొందినపుడు ఆ అచ్చు యకారస్థానికం గాబట్టి యకారం స్థిరం గాబట్టి స్థిరం పరమైతే సంశ్లేషరావచ్చు గాబట్టి ఆ సంశ్లేష రాదని చెప్పడమే ఈ సూత్రారంభ ప్రయోజనమని తేల్చాడతడు కాని భజింతున్ + అంబ వంటిచోట్ల అతని సమన్వయం కుదరదు అక్కడ పదాది నున్నది సహజమైన అచ్చే గాని యకారస్థానమైన అచ్చు కాదుగదా (భజింతున్ + యెవని) ఎవనిని వంటిచోట్ల అతని

కవిశిరోభూషణం సంధి — ఎ సూత్రవ్యాఖ్య

అలుకి చ సంశ్లేషస్స్యాత్ — సంధి 28

సమన్వయం కుదురుతుంది) అప్పకవి ఈ సూత్రానికి (బాలసరస్వతీయ మాధారం గానే) చేసిన వ్యాఖ్యానం చూస్తే అహోబలపతిది అంతా అకాండ తాండవ మని అనిపిస్తుంది

అచ్చుపరమైన నాంతపదాంతమునకు సంయుతమును లోపంబును జగతిలేవు
సంయుతంబయ్యేనేని దుస్సంధియగును లోపమైన గ్రామ్యంబగు లోకవినుత

చూచె నింతి ననెడుచోఁ జూచెన్నింతి ననిన సంధిదోషమయ్యెఁగృతులఁ
బొడిచెనర్కుఁ డనెడునెడఁ బొడిచెర్కుండు ప్రాచిననఁగ
గ్రామ్యభాష యయ్యె (అప్ప 5 - 44 45)

పై వ్యాఖ్యానాన్ని అహోబలపతి ఆడంబరపూర్ణమైన వ్రాతతో పోల్చినపుడు అప్పకవీయమే గ్రంథకృదభిప్రేతమని స్ఫురిస్తుంది అహోబలుని వాదం (యకా స్థాని కాచ్చు పరమైనపుడు సంశ్లేష ప్రాప్తించడం) అసందర్భంగా వాది బలాన్ని తెలిపే వాదంవలె ఉండి అర్జవం కొరవడినట్లు స్పష్టంగా అవగతమవుతుంది బాలసరస్వతి తన వ్యాఖ్యలో సాధురూపాలు (సంశ్లేష లేని రూపాలు) ఇచ్చి ఊరుకున్నాడే గాని ఆ సంశ్లేష పదంతో తానభిప్రాయపడిన కార్యమేదో స్పష్టపరచలేదు అప్పకవి ఆ పనిచేసి బాలసరస్వతి హృదయాన్ని ఆవిష్కరించిన వాడైనాడు

అయితే యిక్కడ సంశ్లేష శబ్దానికి నకారాంతర మొకటి వచ్చి చేరడం అర్థమని చెప్పవలసి వస్తుందే? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు నిజమే వస్తుంది తెలుగు ప్రాచీన వాఙ్మయంలో అటువంటి ప్రయోగాలు నన్నయాదులలోనే కనిపిస్తున్నాయి[1] కాని ఆ ఉన్నవాటికి గతి కల్పించి కొత్తవాటిని ఏర్పడకుండా చేయడం మన వ్యాకర్తల ముఖ్యోద్దేశం గాబట్టి నిషేధించడం జరిగింది

---

అన్ + ఇష్టసఖి=అన్నిష్టసఖి (భార ఆది 3 - 40)
అన్ + ఉర్వీశుడు=అన్నుర్వీశుఁడు (నిర్వచనోత్తర 5)
సర్వాంగునిన్ + అనుభూతాప్రతిమ=సర్వాంగునిన్ననుభూతాప్రతిమ
(ఉ హరి 6 - 226)

సరళ స్థిరాలు పరమైనపుడు ద్రుతానికి సంశ్లేష వస్తుందని గూడ చింతామణి సూత్రించినది గదా అక్కడి సంశ్లేషకు ఇక్కడి సంశ్లేషకు భేదం ఉండవచ్చునా? అని ప్రశ్నించవచ్చు సంశ్లేష అంటే రెండు హల్లులు కలవడం అవి సామాన్యంగా పూర్వోత్తర పదాల చివరి మొదటి హల్లులై ఉండటం వాటిలో పూర్వహల్లునకారం కావడం మనమెరిగిన విషయమే ఉదా మెరసెన్ + ఖడ్గము = మెరసెన్ఖడ్గము కాబట్టే లుక్సంశ్లేషౌనాచి అనే సూత్రానికి ప్రత్యుదాహరణంగా — కాంచెన్నింతి అని రెండు నకారాలు శ్లిష్టమైనట్లు చూపాడు అప్పకవి ఏదిఏమైనా అసలు లేని అర్థసందర్భాలు కల్పించి చెప్పడం కంటె ఉన్న అర్థాలు పొసగించడం న్యాయ్యం గదా

ఇక్కడ గూడ సూత్రానికి ఒనగబడిన అర్థసందర్భాలు సంకేతితాలైనట్లు తెలిసికోవచ్చు

అజంత పరిచ్ఛేదంలో

2 మహతస్సోర్డుజనితో భవేత్ పుంసి — 2

దీనిఅర్థమిది పుంసి=పుంలింగమందు అనితః=ఇదంతంకాని మహతః= మహద్వాచక శబ్దంయొక్క సోః=సుప్రత్యయమునకు డుజ్ భవేత్ - డుజ్ వచ్చును ఉదా రాముఁడు భీముఁడు

ఈ సూత్రం ఇదంతవ్యతిరిక్త పుంలింగశబ్దాలు మహద్వాచకాలుగా ఉంటే వాటికి డు ప్రత్యయం విధించేది దీనిలో డు పత్యయాన్ని డుజ్ అని జిత్తుగా[1] విధించాడు ఆ ఇత్తుల ప్రయోజనం చింతామణిలో దీనికి పూర్వసూత్రాల్లో పాణినీయ పరిభాష ననుసరించే కల్పించబడి ఉంది[2] కాని ఇక్కడ హఠాత్తుగా

---

[1] జ్ + ఇత్తు జిత్తు జ కార మిత్తుగా గలది కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తునాఁబడు

(బాలవ్యా తత్సమ 8)

2 మిత్తు కిత్తులు అంతాగమాలుగా వచ్చాయి

జిత్వ ప్రయోజనం త్రివిక్రముని ప్రాకృతశబ్దానుశాసనంలోని సానునాసికోచ్చారం జిత్ అనే పారిభాషిక సూత్రం ప్రకారం (మొదటి అధ్యాయం - మొదటి పాదం 6వ సూత్రం) అరసున్నతో కూడి డు ప్రత్యయం రావచ్చ మని వివరించబడింది. బాలసరస్వతిచేత సూత్రంలో ప్రాకృత పరిభాషానుసరణం చెయ్యాలని తెలిపే మాటలేదు సరికదా పైగా తత్సూచనగూడ లేదు - ఆ వ్యాకరణ సర్వస్వంలోనే అయినపుడు వ్యాఖ్యాత ఈ సూత్రంలోని జిత్వ ప్రయోజనాన్ని ప్రాకృత వ్యాకరణం ప్రకారం సాధించాలి అని ఎలా తెలిసికోగఁడు ప్రప్రథమంగా: సూత్రకర్తచే సంకేతితమైన అర్థమిది అది అతడు స్వయంగా వివరిస్తే తప్ప అన్యునికి తెలియదు కాబట్టి సూత్రకర్త వ్యాఖ్యాకర్త భిన్నవ్యక్తులు గావడానికి వీలులేదు ఇరువురూ ఒక్కరే

*క్రియా పరిచ్ఛేదంలో*

3 వసతిరనుబంధకస్స్యాద్ యత్రలడర్థో వివక్షితస్త్ర —
అస్తి రనుబంధకస్స్యాద్ యత్ర లృడర్థో వివక్షితోధాతోః — 2

వీటి అర్థమిది యత్ర=ఏక్కడ లడర్థ =లట్టుయొక్క అర్థము వివక్షిత :=వివక్షింపబడినదో తత్ర=అక్కడ వసతి =వసనివాసే అను ధాతువు అనుబంధక =అనుబంధముగా స్యాత్=అగును

యత్ర=ఎక్కడ ధాతోః=ధాతువునకు లృడర్థః=లృట్టుయొక్క అర్థము వివక్షిత =వివక్షింపబడినదో తత్ర=అక్కడ అస్తి =అసభువి అను ధాతువు అనుబంధక =అనుబంధముగా స్యాత్=అగును

వీటిలో మొదటి సూత్రం వర్తమానార్థంలో ధాతువుకి ఉన్న[1] అనే అనుబంధాన్ని విధిస్తుంది ఆ అనుబంధం—వసతి అనే క్రియద్వారా చెప్పబడింది కాని

---

వసతి అనే పదానికి ఉన్న అనేది అర్థం కాజాలదని దానికి ఉండు అనేదే అర్థమని చింతామణి విషయ పరిశోధనంలో 2వ విషయంగా ప్రతిపాదితమైనది ఆ ప్రతిపాదన సరికాదని చిం విష శో శో శో నిరూపించబడినది

వస ధాతువుకి నివాసమే అర్థం అంటే నివసించుచున్నాడనే ఎవరికైనా వసతి అనే క్రియకు అర్థం స్ఫురిస్తుంది నివసించడం అంటే ఉండటం అని చింతామణి కర్త అనుకొని వసతి క్రియను ఉన్న అనే విశేషణరూప – అనుబంధానికి సంకేతంగా వాడాడు ఆ సంకేతం తదితరులకు తెలియదు

రెండోసూత్రం భవిష్యదర్థంలో ధాతువుకి కల అనే అనుబంధాన్ని విధిస్తుంది ఆ అనుబంధం అస్తి అనే క్రియద్వారా చెప్పబడింది కాని అస ధాతువుకి ఉనికి అర్థం అస్తి అనే క్రియకు ఉన్నాడు అనే అర్థం గూడ పొసగడమే కాకుండా అదే సహజమైనది అయినపుడు అస్తి అనే క్రియ కేవలం కల[1] అనే విశేషణరూప–అనుబంధానికి సంకేతంగా చింతామణికర్త వాడినట్లు తెలుస్తుంది ఆ సంకేతం తత్కర్తకు తప్ప ఇతరునికి తెలియదు తెలియడానికి వీలు లేదు పైగా ఈ రెండు సూత్రాల్లో వసతి అస్తి అనే క్రియాపదాలు ఆయా ధాత్వర్థాల్లో కాకుండా వాటి భవత్ భావి శత్రర్థాల్లో ప్రయుక్తాలైనాయి ఇది మరొక స్వసంకేతితార్థం కర్తకు తప్ప అన్యునికి తెలియనివి సంకేతితార్థాలు కాగా చింతామణిని నిర్మించినవాడూ వ్యాఖ్యానించినవాడూ భిన్నవ్యక్తులు కాజాలరని సులభంగానే గ్రహించవచ్చు

## ఫలితార్థం

పై పరిశీలనం వలన చింతామణిలో వ్యాకర్త స్వసంకేత ప్రసిద్ధార్థాలైన శబ్దాలు కొల్లలుగా సూత్రాల్లో ప్రయోగించాడనీ ఆ అర్థాలు అన్య వ్యాఖ్యాతకు బొత్తిగా బోధపడవనీ కాబట్టే సంస్కృతంలోని సూత్రాలకు తెలుగులో టీక మాత్రమే నిర్మించిన బాలసరస్వతికి అవసరాన్ని అర్హతని మించిన ప్రసిద్ధి పండిత లోకంలో కల్గిందనీ తెలిసికోవచ్చు

---

అస్తి అంటే కలానుబంధం కాదని కలుగు అనే ధాతు మాత్రమే అర్థమనీ చింతామణి విషయపరిశోధనంలో శివ విషయంగా ప్రతిపాదితమైనది ఆ ప్రతిపాదన సరికాదని చిం విష శో శో లో నిరూపించబడినది

2 ఉన్న కలజి నవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులందగు

(బాలవ్యా క్రియా 48)

చింతామణి బాలసరస్వతిటీకా సహితంగానే అంటే బాలసరస్వతీయంగానే లోకానికి తెలిసింది బాలసర స్వతీయ టీకా సహితంగా చింతామణికి ఉనికే లేదు చింతామణి సూత్రాలకు బాలసరస్వతి చెప్పినవే అర్థాలు చూపినవే ఉదాహరణలు కాగా సూత్రాలూ వ్యాఖ్యానం ఒకరివేనని నిర్ణయించవచ్చు అతడు తన అష్టభాషా ప్రావీణ్యాన్ని ప్రాకృత వ్యాకరణ పరిభా పరిజ్ఞానాన్ని ప్రవేశ పెట్టడంద్వారా వినియోగించి ఈ వ్యాకరణాన్ని నిర్మి దానికి తనకు గా రిమే తెలిసిన (తాను సంకేతించిన) అర్థాలు తానే వ్యక్తపరుస్తూ టీక వ్రాసి అనన్యసామాన్య కీర్తిని ఆర్జించాడని నిశ్చయించవచ్చు

## చింతామణికి మూలాధారాలు

చింతామణిని చదువుతున్నపుడు సంధిపరిచ్ఛేదలో ప్రాంతపరచ్ఛేదంలో కొన్ని సందేహాలు తలెత్తినాయి

సంధి పరిచ్ఛేదంలో

తద్వాత్తదాదిజన్య - సంధి - 8

అది మొదలయిన పదాలచివరి ఇకారానికి వికల్పంగా ప్రత్యేకించి సంధి చెప్పడం ఎందుకు? వాటిని కిమాది గణంలో వేసి ఆ రూపాలు సులభంగా సాధించుకోవచ్చు

శబ్దాత్తచ్ఛబ్దాత -సంధి- 4

2 అది మొదలయిన శబ్దాల తొలి అకారానికి శబ్దాంతర యోగమున్నపుడు లోపం చెప్పడంగూడ అది శబ్దానికి ఒక ప్రత్యేకతని అనవసరంగా కల్పించినట్లు కన్పిస్తూ సూత్రకర్త ఈసూత్రాలు స్వతంత్రంగా నిర్మిస్తున్నాడా? లేక మరో గ్రంథం నుండి అనువాదం చేస్తున్నాడా? అనే సందేహానికి తావిచ్చింది

నలడాదే రంతఋతశ్చ అన్యేషాంచ ప్రయోగమహితానాం -సంధి-42 43

3 సంధి అనేది రెండు భిన్న స్వతంత్ర పదాల కలయికవల్ల కలుగుతుందని వైయాకరణులందరూ ఎరిగిన విషయమే అయినపుడు చింతామణిలో పదమధ్యాల్లోపం గూడ సంధిపరిచ్ఛేదంలో చెప్పడమెందుకు జరిగింది?

షష్ఠ్యా ఉతోఽచి నుమ్వా (సంధి 7)

4 తత్పురుషసమాసంలో ఉదంత శబ్దానికి అచ్చు పరమైతే నడుమ నకారం రావడాన్ని సంధిపరిచ్ఛేదంలోనే ఎందుకు సూత్రించాలి సమాసపరిచ్ఛేదంలో సూత్రించవచ్చుగదా ఆ సూత్రించేటపుడు షష్ఠి శబ్ద నిర్దేశం తప్పనిసరిగా చేయడ మెందుకు తత్పురుషసమాసం మిగిలిన విభక్తులతోగూడ ఏర్పడుతుంది-తెలుగులో అక్కడెక్కడాలేని విభక్తి నిర్దేశం ఇక్కడ మాత్రమే అవసరమెందుకయినట్లు?

హలంతపరిచ్ఛేదంలో

దేశ్యాదస్మద్యుష్మత్పృ్బూత్సుజసోర్నుమూ వురూచ స్త
న్నుమ్నూ హ్రస్వాత్పూదేరమికనవాన్యతరలుక్ చ యుక్తి
కిర్నజ మ ప్రథమాయామేదస్మద ఏతయోఽప్యహంత్వేమః - 4 5 6

తెలుగులో తదాది సర్వనామ శబ్దాలు (వాడు ఆమె అది మొ ) ఎన్నో ఉండగా వాటినన్నిటిని వదలి కేవలం అస్మద్యుష్మత్పదాలు ఉభయార్థక శబ్దం మాత్రమే (నా నీ మన) ప్రక్రియాసహితంగా నిర్మించి చూపడమెందుకు జరిగినట్లు?

పై సందేహాలు మనసులో ఉంచుకొని చింతామణికి నిజమైన కర్తగా సందేహించబడే బాలసరస్వతికి పూర్వం వెలసిన వ్యాకరణాలు పరిశీలిస్తుంటే కేతన ఆంధ్రభాషాభూషణ రచనాప్రణాళికలో పై పద్ధతి కనిపించింది

అచ్చుగ నఱ్ఱ ఱను నచ్చులె యంతమునం దెనుఁగు టవిధానములన్
విచ్చలవిడిఁబల్కుట బెఱ యచ్చులు చనుదెంచు మానవాఖ్యల యందున్
(ఆం భా భూ 46)

తత్సంధిక్రమంబెట్టిదనిన

అవనినాథుఁడు దయఁజూడ కనిఎనాఁడు రాజు దయలేక యున్నాఁడు
రమణియెడల
అలరుబంతిది మేల్బంతి యది యనంగ నెల్ల గృతులను మిక్కిలిఁ
జెల్లుఁగాన (ఆం భా భూ 48)

కేతన తపరకరణానికి కారప్రత్యయానికి బదులుగా టా ని చేర్చి అట్టు (అట్) డుట్టు (డు ప్రత్యయం) అన్నవిధంగా ప్రయోగిస్తాడు

2 అది యిట్టంతము మీఁదను గదిసిన నాద్యచ్చుడుగు వికల్పముతోఁగా
లిది కాలియది యన గఁజే తిది చేతియది యని పలుకిఁదెల్లంబగుచున్
(ఆం భా భూ 5 )

3 తెలుగులలో నచ్చంబులు డులు రులు నులు పదము తుది
నడుమఁగల్గిన ని
మ్ములు దానిమీఁది యుత్వము పొలుపుగ హల్లండెనేని పోవున్ నిలుచున్
మారుమండఁజొచ్చెమార్మండె ప్రేల్మెట్టె ప్రేలుమెట్టెపేడ్క వేడుకయ్యెఁ
గారుకాలమనఁగఁగార్కాలమనఁగాన్న కానుపనఁగ నెల్లకడలఁజెల్లు
(ఆం భా భూ 64 65)

ఏకపదము నడిమి యుత్వ మొక్కొక్కతఱి నచ్చతెనుఁగులోన
నడఁగుఁబొడముఁ
గూర్మి తాల్మి యనఁగఁ గూరిమి తాలిమి యనగఁ గృతులఁ
జెల్లుచునికిఁజేసి (ఆం భా భూ – 66)

4 ఒనర నుట్టంత షష్ఠిపై నున్న యచ్చు మొదలఁ బొల్లునకారంబు
గదిసినిల్చుఁ
గొడుకు నాల్గాతు నొడమినాఁగూడుఁగాని కూతొడమి కొడుకాలనఁ
గూడదెంచు (ఆం భా భూ 50)

ఈ లక్షణలక్ష్యాలన్నీ కేతన అనంతరబ సంధు లెరిగించెద (ఆం భా భూ 43) అనే ఉపక్రమణిక ద్వారా ఇచ్చాడు అంటే ఇవన్నీ సంధికార్యాలని అతడు భావించినట్లే

పై లక్షణలక్ష్యాలు (సంధికి సంబంధించినవి) ఇరువురివీ తులనాత్మకంగా పరిశీలిస్తే కేతననే చింతామణికర్త అనువదించాడని స్పష్టంగా నిర్ణయించవచ్చు లక్ష్యాలు బాలసరస్వతి ఆయా సూత్రాలదగ్గర యిచ్చినవి కొన్ని అచ్చంగా కేతన యిచ్చినవే గావడంగూడ పై నిర్ణయానికి దోహదం చేస్తుంది కేతనని చింతామణి కర్త చదివి ఉండటానికి వీలుంది కాని చింతామణినిగాని తత్కర్తను గాని కేతన ఎరుగడనడానికి ఏ సందేహమూ లేదు గదా పై పోలికలు యాదృచ్ఛి కాలని అనడానికి వీలులేని విధంగా ఉన్నాయని నొక్కి వక్కాణించ పనిలేదు

అలాగే కేతన సుబంత శబ్దాల నిష్పత్తిని చూపిన తరువాత సమాస నిరూపణం చేయడానికి ముందు యుష్మదస్మత్పదంబు లెఱింగించెద (ఆం భా భూ 05) అని ప్రారంభించి

ఎలమి నీవు మీరు నేనేము ప్రథమలు నిన్ను మిమ్మనంగ నన్ను మమ్మ
నన ద్వితీయలయ్యె నని యుష్మ దస్మత్పదములు తెలియనూత్న దండి
చెప్పె — 06

నీ మీ లకు నా మా లకు ధీమహితా వరుసతోఁ దృతీయాదుల యం
దేమరక చేతనాది స్తోమంబిడ నేక బహువచో వియతి యగున్ — 07

అని నీ నా శబ్దాల రూప నిష్పత్తిని మాత్రం చేసి మిగిలిన సర్వనామ శబ్దాల రూప నిర్మాణం చేయకుండా అసలు వాటి ప్రసక్తే లేకుండా అనంతరం సమాసాల నిరూపణం చేశాడు

చింతామణిలోకూడ ఈ శబ్దాల నిష్పత్తి సమాసాలకు పూర్వం సుబంత శబ్దాల నిష్పత్తి చేసిన తరువాతే ఉండటం గమనించదగ్గ అంశం చింతామణిగూడ ఆంధ్ర భాషా భూషణం లాగానే మిగిలిన సర్వనామ శబ్దాల (అ ఈ ఏ లతో ఏర్పడే శబ్దజాలం) ప్రసక్తి లేకుండా ముందుకు సాగిపోవడం గమనిస్తే ఆంధ్ర భాషా భూషణాన్ని చింతామణికర్త అధ్యయనం చేసి దాని రచనా ప్రణాళికను స్వీక రించే తాను తన గ్రంథం నిర్మించాడని నిర్ణయించవచ్చు అయితే కేతనది తెలుగు వ్యాకరణ రచనలో ప్రథమ ప్రయత్నం గాబట్టి అతని రచనా ప్రణాళికను స్వీక రించినా చింతామణి కర్త దానిని మెరుగుపరచి పెంచి ఉపయోగించుకున్నాడన్న

విషయం గూడ చింతామణి—ఆంధ్ర భాషా భూషణాల తులనాత్మక పరిశీలనం చేసినపుడు తెలిసికోవచ్చు

ఒక క్రియావిభక్తుల ప్రతిపాదనంలో కియాపద నిష్పాదనంలో తప్ప చింతామణి కర్త ఆంధ్ర భాషా భూషణాన్ని అధికంగా అనుకరించి అనువదించి ఉన్నాడు ఆ అనుకరణ అనువాద సర్వస్వం ఇక్కడ చూపదలిస్తే ఈ పరిశోధన గ్రంథం మరి పెద్దదయ్యే ప్రమాద మున్నందువల్లనుబట్టి స్వల్పంగా ఆ అనువాదసరణిని గమనిద్దాం — పరిచ్ఛేదానికి రెండేసి పోలికలు చొప్పున

సంజ్ఞా పరిచ్ఛేదంలో

కేతన

వృక్షేణ దక్షయ పక్షిభి పుత్రస్య యను విభక్తులు
తెనుంగునకుఁ జొరవు
అస్తి ప్రయాతి గాయంతి భుంక్తే సంతి నయతి స్మరతి
యను క్రియలుసొరవు
గత్వా హసిత్వా ప్రకాశ్య సంత్యజ్య నాఁదనరుక్త్వాంత
ల్యబంతములు సొరవు
గంతుంపురీం రిపుంహంతుం సుతంపాతుమను
తుమున్నంతమ్ములరయఁజొరవు

అపిచ తుహి వై న వా నను లనఁగఁబెక్కు
లవ్యయంబులు చొఱవెందు నాంధ్ర కవితఁ
బెఱపదంబులతోడను దొఱలి నిలుచు
నవి తెలుంగులు గావింతు నభిమతముగ (ఆం భా భూ 29)

చింతామణికర్త నపదాన్యవ్యయ సుప్తిఙ్క్త్వా తుమునామ్ (సంజ్ఞా 38)

కేతన వివరణలను వృక్షేణ—వంటివాటని సుప్ పదంతో అస్తి—వంటి వాటిని తిఙ్ పదంతో గత్వా — వంటివాటిని క్త్వా పదంతో గంతుం — వంటివాటిని తుమున్ పదంతో అపిచ—వంటివాటిని అవ్యయ పదంతొ సంస్కృతీకరించి మక్కికిమక్కిగా చింతామణి చెప్పింది కేవలం అనువాదం కాబట్టే క్త్వా తుమున్ ప్రత్యయాంతాలు

స్వయంగా అవ్యయాలే అయినా తిరిగి వ్యర్థంగా అవ్యయ శబ్దం సూత్రంలో చోటు చేసికొన్నది - కేతనలోవలె మూలం యథాతథంగా అనూదితమైన దన్నమాట

కేతన తుఱుచలపై నరబిందులు నెఱయఁగ నూదినను జెల్లు విడుపుల మీఁదన్ నెఱయవు (ఆం భా భూ 58)

చింతామణికర్త హ్రస్వాత్ పూర్ణోఽపి భవేత్ దీర్ఘాచ్చేత్ ఖండఏవ స జ్ఞేయ (సంజ్ఞా 8)

పై రెంటినీ పోల్చిచూస్తే తెలుగు సంస్కృతానికి ఆధారమని స్ఫురిస్తుందిగదా

సంధి పరిచ్ఛేదంలో

కేతన నాంతంబైన పదంబుల పొంతన్ బైనున్న శబ్దముల కచటతపల్
దొంతి గజడదబలగు నయ్యంత నకారమగు సున్న యభినవదండీ

వాఁగనియెఁజేరె వానిఁదక్కురిఁజేసె వాని దానిఁదెగడె
వానిఁ బొడవె
ననఁగ వరుసనివి యుదాహరణంబులు నుతగుణాభిరామ
నూత్న దండి (54 55)

చింతామణికర్త పరుషాద్రుతప్రకృతికాత్ సరళాస్స్యుః తద్ద్రుతంచ
బిందుస్స్యాత్ (సంధి 2 )

కేతన పొసఁగన్ బల్కెడునెడఁ బొల్పెసఁగిన ప్రథమాంతముల
పయిన్‌గదిసి కడున్
బసనారు కచటపలను గసడదవల్ ద్రోసవచ్చుఁ గవిజన మిత్రా

సుతుఁడు గడు వేగమున వచ్చె సుతుఁడు సనియె
సుతు డు డక్కురితోడఁ దాఁజుట్టమయ్యె
సుతు డు దండ్రికిఁ బ్రణమిల్లె సుతుడు పుట్టె
ననఁగనివి యుదాహరణంబులయ్యెఁ గృతుల (62 63)

చింతామణికర్త గనడదవాస్స్వశ్ ప్రథమామాత్రా దాత్మాస్మదోర్విసై వైతే (నంది 23)

కేతన ఉదాహరణలోని తాఁ జుట్టమయ్యె అనే అంశాన్ని గమనించి చింతామణి ఆత్మన్ శబ్దాన్ని (తాను) గనడదవాదేశం నుండి మినహాయించింది దానివంటిదే గాబట్టి అస్మచ్ఛబ్దాన్ని (నేను) గూడ కలిపింది మినహాయింపులో అంటే కేతన లక్షణానికి మెరుగులు దిద్దినదన్నమాట

అజంత పరిచ్ఛేదంలో

కేతన ఁడుఱుఁగుఁ బురుషాఖ్యలపై నఱుఱుగు నట్టియెడల నభినవ దండీ (34)

చింతామణికర్త మహతోఽత ఉద్విభక్తౌ మహతస్సోర్డుజ వితోభవేత్పుంసి (అజంత 2)

కేతనలోని ఁడుఱు అఱు ఉఱు పురుషాఖ్యలు అనేవి చింతామణిలో డుజ్ అత్ ఉత్ మహత్ లుగా మారాయి

కేతన అలినేకాక్షరపదములు వెలిగాఁ దక్కిన పదముల వెలసిన తుదయ
చ్చులనిడుపు లుడుపఁ దెను గగు నిల నెప్పటియట్లనుండు
నీయంతంబుల్

ధ్రుయన ధీయన శ్రీయన నీ యేకాక్షరంబు లీక్రియ జను గౌ
రీయన గౌరియగున్ వాణీయన వాణియగు మణి మణీయను
బోఁటన్ (3 32)

చింతామణికర్త దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్ నచైకవర్ణే (అజంత 46)

8]

హలంత పరిచ్ఛేదంలో

కేతన వానువకున్ వంతుండును మానువకున్ మంతుండను
గ్రమంబుననగు శ
బ్దానీకాంతనకారము మానించి విభక్తులెక్కు
మఱియొక్కొకచోన్ (35)

చింతామణికర్త గుణవద్గణో ద్వితీయైకవచనతుర్యో భవేద్వికృతౌ (హలంత 2)
గుణవతాం డుమూ ప్రాగ్వత్ (6)

కేతన మఱదమున నా యీ యేలను పదముల తుద నూష్మలుడుగఁ
బై వర్ణముతో
నదుకునెడఁ గుదియుసాగును గుదియునెడన్ జడ్డ్రాలగున్
బై హల్లుల్

ఆకామిని యక్కామిని యీ కొడు కిక్కొడుకు నాఁగ
నీయా రియ్యా
రేకార్యం బెక్కార్యం బాకథ యక్కథ యనంగ
నుదాహరణంబుల్ ( 6 37)

చింతామణికర్త ఇదమదసేతద్యత్ చ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుశమ్
హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి
(హలంత 24)

కేతనలోని కుదియు సాగు జడ్డ్రాలు — వీవి సంస్కృతీ కరణమే హ్రస్వ దీర్ఘ ద్విత్వాలు

క్రియా పరిచ్ఛేదంలో

కేతన స్థావర తిర్యక్ప్రకృతుల కేవెరవునఁ గ్రియలు పొందు
నేకవచనమున్
శిలగదలె శిలలుగదలెను బులిగరచెన్ బులులుగరచె (147)

చింతామణికర్త తిర్యగ్గదేషు కర్తృషు బహువచనం చైకవచన మేవస్యాత్
భూతే తద్ధర్మేచ (క్రియా 22)

కేతనలోని స్థావర తిర్యక్కులు చింతామణిలో తిర్యగ్గదాలయ్యాయి కేతన భూత కాలిక క్రియను ఉదాహరిస్తే దానికితోడు తద్ధర్మార్థకాన్ని గూడ చింతామణి జోడించింది

కేతన అసమస్త లఘు ద్వ్యక్షర లసితములగు తత్సమంబులన్
జెప్పెడిచోన్
బొసఁగు నియుంచుటయన్ గ్రియలసదృశ యించుటయోఁ
గ్రియల నగు బెఱయెడలన్

వరియించుటయు వరించుట తిరముగ నుతియించుటయు
నుతించుట బలిమిన్
బరుభజియించుటయును సంహరించుటయు వరుసతో
మదాహరణంబుల్ ( 52 53)

చింతామణికర్త లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తమస్యా నయోభవేదిద్వా
(క్రియా 36)

కేతనలోని అసమస్త పదం చింతామణిలో లఘువుగా మారింది కేతన ద్వ్యక్షరమన్నా చింతామణి ఏకాక్షరపూర్వమన్నా ఫలితార్థ మొక్కటే ఆ అంశం ఉదాహరణలలో స్పష్టపరచబడి ఉంది పై అనువాదాలు దిఙ్మాత్రంగా చూపబడ్డాయేగాని కేతన రచన మొత్తాన్ని చింతామణికర్త తనగ్రంథంలో ఉపయోగించుకున్నాడని నిరభ్యంతరంగా చెప్పవచ్చు[1] ఆరెండింటిని పోల్చి చూచినపుడు ఎక్కడైనా ఒకటీ అరా బహుశః ఛందస్సు అడ్డంవచ్చో సంస్కృతీకరణానికి అనుకూల్యం చాలకో చింతామణికర్త కేతన లక్షణాన్ని విడిచిపుచ్చి ఉంటాడని తెలిసికోవచ్చు అయితే అతడలా విడిచి పుచ్చిన దానిని అహోబలపతి అధర్వణకారికగా సంస్కృతీకరించి తన వ్యాఖ్యలో చొనుపుకున్నాడు[2]

---

1 చూ అనుబంధం

2 చూ కారికల మూలపాఠాలు అనే ప్రకరణం

చింతామణికి మూల పాఠాలు కేతనలోనేగాక విన్నకోట పెద్దనలో వెల్లంకి తాతంభట్టులో చిత్రకవి పెద్దనలో ముద్దరాజు రామనలో గూడ స్పష్టంగా కనిపిస్తున్నాయి వారందరూ బాలసరస్వతికి నిశ్చయంగా పూర్వులే బాలసరస్వతే చింతామణికి కర్త అని సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు అనే ప్రకరణంలో నిర్ణయించబడింది కాబట్టి పై వారి రచనలు చింతామణిలో ఎలా అనూదితాలైనాయో గమనిస్తే ఈ ప్రకరణం ముగించవచ్చు

## విన్నకోట పెద్దన

మఱియునంధ్రభాషా విభక్తులకుంగల నామాంతరంబులెఱింగింతు నంటూ ద్వితీయకు నుకార నికారంబులును షష్ఠికింగికుకారంబులును యొక్కలోపలయను పదంబులును అని ద్వితీయకు ను ని లు షష్ఠికి కి కు లు విభక్తి ప్రత్యయాలని చెప్పాడు ప్రథమా విభక్తికిం గ్రమంబున ముకారంబును డుకారంబును తృతీయకుఁ జేతతోడ యనునవియుఁ చతుర్థికిం గై కొఱకనునవియుఁ బంచమికి వలన పట్టి యుండి కంటె యనునవియును సప్తమికి నందు న యను పదంబులు నయ్యె-అవి మిగిలిన విభక్తి ప్రత్యయాలనుకూడ ఇచ్చాడు

ఇతనికి ముందు కేతన విభక్తుల్ని పదాలతోకలిపి ఉదాహరించాడే కాని విడిగా ఇవి విభక్తులని చెప్పలేదు – చేయువాడు ప్రథమయుఁ జేయంబడునది ద్వితీయయు అవి ఇలా సాగినదతని విభక్తి నిర్వచనం కేతనది తొలి వ్యాకరణమని అతడే తెలుగులో తొలి వ్యాకర్త అనీ నిర్ణయించడానికి ఈ ప్రాథమిక నిర్వచనాలు చాలు పైగా తెలుగు వ్యాకర్తలలో ప్రథముడు కాబట్టే సహజంగా తెలుగు వ్యవహారంలో సంప్రదానార్థంలో ప్రయుక్తమయ్యే కు ప్రత్యయాన్ని అనంతరవ్యాకర్తలవలె షష్ఠిగాగాక చతుర్థిగానే కేతన ఇవ్వగలిగాడు ఈ ఒక్క నిదర్శనంతో ఆంధ్ర భాషాభూషణమే తెలుగుకి ప్రథమ వ్యాకరణమని నిస్సందేహంగా నిర్ణయించవచ్చు

ప్రస్తుతాంశానికివస్తే వ్యాకరణాల్లో విభక్తి ప్రత్యయాలను విడిగా వింగడించి చెప్పినవారిలో మొదటివాడు విన్నకోట పెద్దన అతని విభక్తి ప్రత్యయాల్నే యథాతథంగా స్వీకరించింది చింతామణి కూర్చిలనులయోభవేద్వితీయాతు అజంత 2 (కూర్చి అదనంగా చేర్చింది) అథలోపలకికు యొక్కాన్యా – అజంత 6 యథార్థానికి ని ను రూపాంతరంగా కి కు రూపాంతరంగా గ్రహించవచ్చు

చిన్నయసూరి అలాగే చేశాడుగదా కాని తన పూర్వ వ్యాకర్త లు ఒక విధమైన నిర్ణ యం చేసిన తరువాత అనంతరకాలిక వ్యాకర్త సామాన్యంగా ఆ నిర్ణయాన్ని పాటిస్తూ ఉంటాడు కాగా ఇక్కడ చింతామణి కావ్యాలంకార చూడామణిలోని విభక్తి ప్రత్యయ నిర్దేశక సూత్రాల్ని ముఖ్యంగా ద్వితీయని షష్ఠిని యథాతథంగా స్వీకరించినదని నిర్ణయించవచ్చు

ఇదేవిధంగా కావ్యాలంకార చూడామణిలోని అజంత శబ్ద రూప నిష్పాదన క్రమాన్ని గూడ ఐకారాంత - ఔకారాంత శబ్దాల విషయంలో చింతామణి స్వీక రించినదని పూర్వప్రకరణంలో గమనించాం [1]

### వెల్లంక తాతంభట్టు

ఇతని కవిచింతామణి అముద్రితం తాళపత్ర గ్రంథంగా శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో డి 278 సంఖ్యతో అసమగ్రంగా ఉంది దానిలో విశేషణ విశేష్యార్థాల్లో భేదక భేద్య శబ్దాలు ప్రయుక్తాలై ఉన్నాయి భేద్యభేదక శబ్దాల్ని తెలుగు లక్షణగ్రంథాల్లో తాతంభట్టే మొదట ప్రయోగించినట్లుగా అతని వ్రాతను బట్టి నిర్ణయించవచ్చు

ధరభేదకము విశేషణ మరయఁగ భేద్యము విశేష్యమనఁదగును గదా
ధరుఁడు హరి ఫాలనేత్రుఁడు హరుఁడాద్యుఁడు బ్రహ్మ యివి
యుదాహరణంబుల్ (కవిచిం 5వ తాళపత్రం)

అని భేద్య భేదక శబ్దాల్ని నిర్వచించి దాని వివరణం—

యిందు (అర్థం) హరి దేవతలలోన భేదము లేక యుండఁగా గదాధరుఁడు హరియని గదాధరశబ్దం హరికి భేదము పుట్టించె గనుక హరి భేద్యము అదియె విశేష్యమున్ను గదాధరశబ్దము భేదకము అదియె విశేషణమున్ను యిత్తెఱంగున ఫాలనేత్రుడు హరుడు అద్యుడు బ్రహ్మ యిటువంటి విశేషణ విశేష్యము లూహింపవలయు అని వ్రాశాడు తాతంభట్టు ఆ వివరణ క్రమాన్ని పరిశీలిస్తే తెలుగు వ్యాకరణాల్లో తానే ప్రథమంగా ఆ భేద్య భేదక శబ్దాల్ని ప్రవేశపెడు తున్నట్లు స్పష్టపడుతుంది చింతామణికర్త కవిచింతామణిలోని ఈ పారిభాషిక పదాల్ని స్వీకరించి—

---

1 చూ చింతామణిలో లక్షితమైన భాష

ఏకత్వం భేదక గత విశేషణానాంచ దృశ్యతే విక్రుతౌ (హలంత 42) అనే సూత్రంలో నిబంధించాడు సూత్రంలో భేదక శబ్దం విశేషణార్థంలో ప్రయుక్త మైంది ఈ భేద్యభేదకశబ్దాల్ని విశేష్య విశేషణార్థాల్లో ప్రయోగించడానికి తాతంభట్టే ఆద్యుడు కాడు ఆ శబ్దాలు కాశికావృత్తిలో విశేష్య విశేషణార్థాల్లో ప్రయోగించబడి ఉన్నట్లు మహామహోపాధ్యాయ కాశీనాధ వాసుదేవ అభయంకర్ వ్రాశారు (A dictionary of Sanskrit grammar Oriental Institute Baroda) కాబట్టి చింతామణికర్త ఆ శబ్దాల్ని నేరుగా కాశికా వృత్తినుండే స్వీకరించి ఉండ వచ్చునని కూడా అనవచ్చు అయితే యితర వ్యాకరణాల నుండి చింతామణి చేసిన విషయ సంగ్రహణాన్ని గమనించినపుడు ఈ పారిభాషిక పదాల్నికూడ తెలుగులో తనకు పూర్వం నిర్మితమైన కవిచింతామణినుండే చింతామణి స్వీకరించినట్లు అంగీకరించవలసి ఉంటుంది తాతంభట్టు చిత్రకవిపెద్దన కాలానికే సుప్రసిద్ధ లాక్షణికుడుగా తెలుగునాట స్థిరపడినట్లు నిదర్శనముండటం (ల సా సా —3) గూడ ఈ సందర్భంలో గుర్తించవలసిన అంశమే

కొన్నియెడల నెత్వంబునకు రియ్యవడియునగును జడ్డఁగుచోట నైశాట
వక్త్రిదమనా (కవిచిం — 6వ తాళపత్రం)

అని లక్షణం చెప్పి దీని రూపంబు లెట్టివనిన వధూనికెకు చెల్లు వదినియ వదినె యనఁగ పర్ణికకుఁజెల్లు వన్నియ వన్నె యనఁగ అని వివరించాడు తాతంభట్టు ఆ లక్షణాన్నే చింతామణి—

ఎదంతతాచనామ్నా మన్యతరస్యా మియాన్తానామి (అజంత 8)

అనే సూత్రంలో పొందుపరిచింది తాతంభట్టుకు పూర్వుడు కేతన ఇటువంటి రూపాల్ని కూడదని నిషేధించాడు (ఆం భా భూ 7) కాని తాతంభట్టు కాలానికి ఆ రూపాలు ఉపాదేయాలై ఉండవచ్చు

చిత్రకవి పెద్దన

రేఫ అకార సాంకర్యాన్ని ఎలుగెత్తి నిషేధించిన లాక్షణికుడు చిత్రకవి పెద్దన ఇతనితోటే రేఫ అకార నిర్ణాయక గ్రంథాలు రావడం ప్రారంభమైంది — తెలుగు లక్షణవాఙ్మయంలో

పృథివి జీవుఁడీశుఁడను నభేదవాది వలెనె వాదించి కుకవి దుర్వాది సభలఁ
దాను రేఫకు ఱాకు భేదమె యనునది కృతులఁ చేపట్టు సుకవి
సమ్మతముగాదు (ల సా స 3 — 4)

ఇరఁదగు రేఫకు రేఫయె యరరఁగ బ్రాసము అకారమైన అకారం
బిరఁదగును గాని రెండును బదిఁగలయఁగ జెప్పరాదు పావనివింటే

(అ సా స 3 – 5)

అని రేఫ అకారాల వైషమ్యం నిత్యంగా పాటించాలని నిర్దేశించాడు ఈ నిర్దేశాన్నే చింతామణి సంస్కృతీకరించి

నాన్యేషాంవైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్ (సంజ్ఞ 22)

అని సూత్రించింది

చజలమీద కొన్ని పదాల్లో ఎత్వం వ్రాయవలసినచోట అత్వం వ్రాయడాన్ని గూడ నిషేధిస్తూ చిత్రకవి—

తలకట్టుగాక యెత్వమె యలవడుఁ జజసలను మూఁట (అ సా స 3–6)

అని లక్షణం చెప్పి లక్ష్యంగా చెలువచేకటొప్పు జేనయనంగను సేనకొప్పనంగఁ జెల్లుమూఁట అని చూపాడు చింతామణి ఈ నియమాన్నే—

అర్ధస్యస్తాలవ్యశ్చుర్వక్రస్స్యాత్ (సంజ్ఞ 23)

అని సంస్కృతీకరించింది చింతామణిలో అకారముంటే (చజలమీద) దంత్యోచ్చారణ ముంటుందనే అంశం అధికంగా ప్రతిపాదితమైంది అలాగే దంత్య తాలవ్యాలు సవర్ణాలనేదిగూడ చింతామణి పెద్దన లక్షణానికి దిద్దిన మెరుగుగా భావించ వచ్చు

*ముద్దరాజు రామన*

ఇతడు తాతంభట్టు సమకాలికుడయినా ఇతన్ని చిత్రకవి పెద్దన స్మరించలేదు బహుశః వయసా చిన్నవాడై ఉండటంవలన ఉపేక్షించి ఉండవచ్చు ఏమైనా బాలసరస్వతికంటె నిశ్చయంగా పూర్వుడే ఇతడు తన కాలంలోని క్రియాపదాల్లో ఇతర పదాల్లో యకారంమీద ఎత్వాత్వాలు విపర్యయంగావడం (వోయెన్-వోయన్ ఎవడు-యెవడు-యవడు) చూచి వాటిని సరిదిద్దుతూ యకారములకు తుదనుగ్రియఁ దక్క నెత్వంబు గదియదాది నత్వ మొందదు తెనుఁగుల నబ్జనాభ (కవిసం – 7

---

చూ అ సా స ఎరిక ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ 940

అని లక్షణం చేశాడు క్రియల చివర తప్పితే యకారాలకు ఎత్వం చేరదనీ అంటే పోయె చనియె కనియె-వంటి రూపాల్లో చివర ఎత్వమే ఉంటుందని మొదట అత్వముండదనీ అంటే ఎవడు అనే మాటను యవదు అన్నట్లు ఉచ్చరించదం కూడదని పై పద్య భావం అచ్చంగా ఈ లక్షణాన్నే చింతామణి

అద్య క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగంవినాసర్వః (సంజ్ఞా 20)

అని సంస్కృతీకరించింది బాలసరస్వతికి సన్నిహితపూర్వుడే ముద్దరాజు రామన ఆనాటి ఉచ్చారణ భ్రంశాల చరిత్ర తెలియకపోతే ఈ సంస్కృత సూత్రానికి అర్థ సందర్భాలేమిటో బొత్తిగా తెలియవు[1] చనియె పోయె వంటి భూతార్థక కియల లోను పదాదిలోను తప్ప ఇతరత్ర ఉండే యకారంమీద అకారముంటుందని సూత్రార్థం ఇతరత్రా అకారసహితంగా యకార ముంటుందనటంవలన ఆ రెండు స్థలాల్లో ఎకారముంటుందని ఊహించుకోవాలన్నమాట ఇది ముద్దరాజు రామన లక్షణానికి సంస్కృతీకరణమని వేరే వివరింప పని లేదుగదా

## ఫలితార్థం

అనంతుని ఛందో దర్పణంనుండిగూడ ఛందశ్శాస్త్ర విషయాలనేకం సంస్కృతీకరించబడి అప్పకవీయచింతామణిలోనికి చేర్చబడినట్లు చింతామణి పాఠభేదాలు అనే ప్రకరణంలో గమనించి ఉన్నాం కాగా పై పరిశీలనవలన చింతామణిలోని సూత్రాలు అనేకం బాలసరస్వతికి పూర్వం ప్రసిద్ధమయిన దేశీయ వ్యాకరణాల్లోని లక్షణాల సంస్కృతీకరణలే అని సోదాహరణంగా తెలిసుకోగలిగాం అలాగే చింతామణిలోని లక్షణాల స్థితిగతుల్ని గమనిస్తే ఆ గ్రంథం వ శతాబ్ది గాదుగదా 6వ శతాబ్దికి ముందుదిగూడ గావడం అసంభవమని అందులోని రేఫ అకారాల పదాది పదమధ్య యకారాల నియమాల్ని బట్టి వాటి మూలాల్ని బట్టి సులభంగా నిర్ణయించగలిగాం పూర్వప్రకరణ లలో జరిగిన పరిశీలనం ద్వారా ఆంధ్ర శబ్ద చింతామణి దాని ప్రథమ వ్యాఖ్యాతైన బాలసరస్వతి చేతనే రచితమై గ్రంథ గౌరవ సంపాదనకై అతనిచేతనే నన్నయ కృతంగా లోకానికి చాటబడినదనిగూడ నిశ్చయించు కోగలిగాం

---

1 చూ సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు

# తృతీయ భాగం

# చింతామణి వ్యాఖ్యాతృ, వికృతివివేక కర్తృత్వ నిర్ణయం

## బాలసరస్వతీయం

చింతామణికి నన్నయభట్టీయమనే పేరు అప్పకవిపెట్టినా బాలసరస్వతి వ్యాఖ్యానంతో మాత్రమే అది లోకానికి తెలియవచ్చింది అంటే బాలసరస్వతి వ్యాఖ్యానం లేకుండా కేవలం సూత్రాలతో ఉన్న చింతామణి నాటినుండి నేటవరకు ఎవరికీ ఎక్కడా లభించలేదు లభించదు గూడ — బాలసరస్వతీయాన్నిబట్టి ఎత్తి వ్రాసి కున్నది తప్ప

చింతామణిలోని సూత్రాలకు అర్థతాత్పర్యాలు ఉదాహరణ — ప్రత్యుదాహరణలు బాలసరస్వతి వ్యాఖ్యానమాత్ర సిద్ధాలు అతడు సంస్కృతంలో ఉన్న సూత్రాలకు తెలుగులో అర్థం వ్రాసి ఉదాహరణ లిచ్చాడని మాత్రమే మనకు తెలిసినా ఆ పని అనితర సాధ్యమని నిస్సందేహంగా చెప్పవచ్చు అతని వ్యాఖ్యానం ఆకారంలో అల్పంగా ఉన్నా దాని మహత్త్వం వర్ణించి చెపితే గాని తెలియదు

### బాలసరస్వతీయ మహత్త్వం

బాలసరస్వతి అహమాదీనాం ద్విత్వమ్ (సంధి 9) అనే సూత్రానికి వ్యాఖ్య చేస్తూ అహం మొదలయినవాని సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది — అహమ్మని కిమ్మని యుష్మని — అని వ్రాశాడు నిజానికి

---

నన్నయభట్టీయములో నెన్నగ గ్రంథమాద్యగాదె యాపొత్తములో
నున్నయవి యెనుబదియు రెండన్న మహాద్భుతము బొంది యపుడెల్లరకున్
(అప్ప పీఠిక 65)

2 చూ సూత్రకర్తే వివరిస్తే గాని తెలియనిసూత్రాలు

అహమ్ అనేపదం చివర మకారమే ఉంటుంది గాని సున్నగాదు—సంస్కృతంలో తెలుగువారు దాన్ని అనుస్వారాంతంగా వ్రాయడానికి అలవాటు పడ్డారు — తెలుగు లిపిలో ఆ అలవాటుచొప్పున బాలసరస్వతి చివరి సున్నకు ద్విత్వమెారా వస్తుందని శంకించి దానికి మకారంచేసుకొని తరువాత ద్విత్వాన్ని చేసుకొందని తన ధోరణిలో తాను వ్రాశాడు అతని తరువాత రెండో వ్యాఖ్యాత (మొదటివాడు అప్పకవి) అహోబలపతికి అహమాదుల్లో చివరి వర్ణం మకారమేనని తెలుసు అయినా బాలసరస్వతి చింతామణికి చేసిన వ్యాఖ్యామార్గం నుండి ఎకొద్దిగా తొలగినా ఏమి ప్రమాదమో అనే భయంతో అహోబలపతి బాలసరస్వతి వ్రాతను ఊతగా తీసుకొని తనవ్యాఖ్యలో ఒక కారిక అల్లాడు—

శబ్దానామంత్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే
తస్యాచి పరతోమస్స్యాత్ సర్వత్ర కవిభాషితే

(శబ్దాల చివర కనుపించే అనుస్వారానికి అచ్చు పరమైతే మకారమౌతుంది)

ఆ కారిక అధర్వణాచార్యుని దంటాడతడు అహమాదీనాం ద్విత్వమి —అనే సూత్రానికి బాలసరస్వతి వ్రాసిన వ్యాఖ్యానాన్నిబట్టి గాని సున్నాకు ద్విత్వంరాదు గాబట్టి మకారం చేసికోవాలి అని చెప్పవలసిన సందర్భం తటస్థించలేదు బాలసరస్వతి అలా వ్రాయకుంటే ఆ సందర్భమే ఏర్పడదు అయినపుడు 2వ శతాబ్ది వాడుగా గుర్తించబడినఅధర్వణుడు ఆ కారిక ఎలా వ్రాశాడు? అసలు ఆ కారికకు చింతామణిలో ఎక్కడైనా స్వతః సంద ర్భం ఉందా? లేదు[2]

బాలసరస్వతి వ్రాతనుబట్టి చింతామణికి అతడు చేసే వ్యాఖ్యానంలో — సూత్రవిభాగం 2 ప్రమేయవివరణం 3 ఉదాహరణ స్వరూపం[3] అని మూడు భాగాలున్నాయి

---

కవిశిరోభూషణ వ్యాఖ్య పై సూత్రానికి

2 బాలసరస్వతి వ్యాఖ్య ఆధారంగా అధర్వణునిపేర కారిక గూడ జన్మించినదని తెలియక శ్రీ చర్ల నారాయణశాస్త్రి తమ బాలసరస్వతీయ పరికలో అది (సున్నకు మా చేసుకోవడం) స్థానిత్యమని చెప్పారు (ఆం సా ప ప్ర 932)

3 బాలసరస్వతీయ పీఠిక

బాలసరస్వతి వ్యాఖ్యాన భాగాలు మూడూ అతని తరువాత చింతామణిని వ్యాఖ్యానించిన అప్పకవి అహోబలపత్యాదులకు అవశ్య - ఉపాదేయాలైనాయి సూత్రాలు సూత్రాల ప్రవృత్తి పరిధి వాటి ఉదాహరణలు - ఈ మూటివిషయంలో మార్గదర్శి బాలసరస్వతే అహోబలపతి తన వ్యాఖ్యలో అనేకాంశాల్ని నూతనంగా ప్రవేశపెట్టినా అవి అన్నీ బాలసరస్వతీయవ్యాఖ్యాన పీఠికపై నిలిచినవే అలాగే అప్పకవి చేసిన విపులవ్యాఖ్యానానికి గూడ ఆధారభూమి బాలసరస్వతీయమే కాబట్టి వారిరువురూ బాలసరస్వతికి నమస్కృతులు చేశారు

బాలసరస్వతి తన వ్యాఖ్యానాన్ని తాను నిర్ణయించుకున్న పరిధిలో సక్రమంగా నిర్వహించాడు సూత్ర విభాగమైతే ఇతరులు చేయగలరేమోగాని అర్థతాత్పర్యాలు ఉదాహరణలు ఒసగడమనే కార్యం కొన్నికొన్ని స్థలాల్లో అనితర సాధ్యమని అతని అనంతర వ్యాఖ్యాతల వ్రాతల వల్ల మనం అంగీకరించవచ్చు

బాలసరస్వతి తన వ్యాఖ్యానాన్ని తనపీఠికలో టీక[2] అనీ వెంటనే భాష్య[3] మనీ తరువాత తెనిగింపు అనీ అన్నాడు బాహుళః పైమూడు పదాలు అతని వ్యాఖ్యానానికి అన్వర్థాలేకావచ్చు

కేవలం సూత్రాల్లోని అర్థాన్ని వివరించి ఉదాహరించి ఊరుకున్నాడు గాబట్టి-టీక (ఈ అభిప్రాయం అహోబలపతిది కూడ)

అక్కడక్కడా[4] భాష్యకారుని శైలిలో స్వయంగా ఆశంకించి తత్పరిహారం గూడ చేశాడు గాబట్టి—భాష్యం

---

1 అప్పకవీయ పీఠిక—8 అహోబలపండితీయ పీఠిక—39

2 టీక్యతే (టీకృగతౌ) గ్రంథార్థఃఅనయా ఇతి టీకా=గ్రంథార్థ వివరణము-ఆంధ్రశబ్ద త్నాకరము ఇది తెలగుపదమని కొందరంటాని ఆంధ్రవాచస్పత్యము ఇది సంస్కృత పదమని Rev F కిట్టెల్ ( కన్నడ-ఇంగ్లీషు డిక్షనరీ)

3 ఆక్షేప సమాధానపరో గ్రన్థోభాష్యమ్ -మహాభాష్య వ్యాఖ్యలో హరదత్తుడు

4 సంజ్ఞాపరిచ్ఛేదంలో ఎ సంధిపరిచ్ఛేదంలో 28వ సూత్ర వ్యాఖ్యను

ఎంతచేసినా ఏమిచేసినా చివరకు సంస్కృతాన్ని తెనుగు చేయ్యడమే చరమప్రయోజనంగా కనిపిస్తుందిగాబట్టి తెనిగింపు

## సంస్కృతం ద్వారా తెలుగు

ఒక భాషావ్యాకరణాన్ని ఆ భాషలోగాక ఇతరభాషలో వ్రాసినపుడు ఆభాషా భాషుకోసమే) సహజంగా సౌలభ్యం అంతరిస్తుంది ఇతరుల భాషని సొంతభాషద్వారా అభ్యసించడం - అదివేరు కాని ఇక్కడి విషయం తెలుగువారి కోసమే తెలుగువ్యాకరణం సంస్కృతంలో వ్రాయబడింది అందులోనూ తెలుగు పదాలు సంస్కృత పర్యాయాలద్వారా తెలుపబడి ఉన్నాయి కొన్నిచోట్ల తప్పనిసరిగా ఒక ప్రత్యేకపదాన్నే వ్యాకర్త చెప్పవలసి వచ్చినా ఆ పదాన్ని సంస్కృతీకరించి చెప్పడం వలన దాని అర్థం ఆ ప్రత్యేకపదమే - అని చదువరికి స్ఫురించడం చాలావరకు అసంభవంగా ఉంటుంది ఉదాహరణకు తెలుగు క్రియాపద నిర్మాణ సందర్భంలో చింతామణి కల అనే అనుబంధం ధాతువుకి భవిష్యదర్థంలో చేరుతుందని చెప్పదలచింది కల అనే అనుబంధాన్ని సంస్కృతీకరించడం కష్టమైన పని ఆ సంస్కృతీకృత పదంవలన తెలుగులోని కల అనుబంధం వ్యక్తంకావడం నిష్కర్షగా చెప్పాలంటే అసంభవం చూడండి చింతామణిలో కల అనుబంధం అస్తి అని సంస్కృతీకరించబడింది తెలుగులో అస్తి అనే సంస్కృతక్రియకు ఉన్నాడు అని అర్థం అస్తి వా నవా? ఉన్నాడా? లేడా? మొదలైన వ్యవహారాల్లో ఆ అర్థం స్పష్టంగా తెలుస్తున్నది సంస్కృత వ్యాకరణ మర్యాదానుసారం క్రియను ధాతుమాత్రపరంగా ప్రయోగించడం జరిగిందనుకున్నా ఇక్కడ అస్తి పదానికి ఉండు అనే తెనుగుధాతువే అర్థం కావచ్చు గాని కల అనేది తప్పనిసరిగా అర్థంకావాలని వాదించి నెగ్గలేం

ఇలాంటి సందర్భాల్లో సాధారణంగా ఆ పదం నిర్మించినవానికి తప్పితే దాని తెలుగు పర్యాయమిది అని నిష్కర్షగా ఇతరునికి తెలియడం అసంభవం ప్రస్తుతం బాలసరస్వతీయ వ్యాఖ్యానంలో అలాంటి ఘట్టాలు కొల్లలుగా ఉన్నాయి అవన్నీ ఈ గ్రంథంలోనే ప్రకరణాంతరంలో[1] విమర్శింపబడినాయి కాబట్టి మిగిలిన వ్యాఖ్యానరీతు లెలాఉన్నాయో పరిశీలించడమే ఇక్కడ కర్తవ్యం

---

[1] చూ సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు

## సూత్రవిభాగం

చింతామణికి సూత్రవిభాగం బాలసరస్వతి చేసినదే నాటినుండి నేటివరకు అవ్యాహతంగా చెల్లుతుంది ఒకటి రెండు చిన్న మార్పులు ఉన్నా అవి పరిగణింప దగినవికావు బాలసరస్వతి షట్త్రింశదశ్రి తేఽన్యేచానుపశ్రివిశన్తి శబ్దయోగవశాత్ అనే పాదం మొత్తాన్ని ఒక సూత్రమంటే అహూబలపతి దాన్ని రెండుగా తన కవిశిరోభూషణంలో షట్త్రింశదశ్రి ఒకసూత్రంగా తేఽన్యేచానుపశ్రివిశన్తి శబ్దయోగవశాత్ మరొక సూత్రంగా విభజించాడు అలాగె సంజ్ఞాపరిచ్ఛేదంలోనే బాలసరస్వతి అనియమాద్ గ్రామ్యంవా యత్త్వపథింశ అనేది ఒక సూత్రంగా వ్యాఖ్యానిస్తే అతని వ్యాఖ్యానమే ఆధారంగా దాన్నే అహోబలపతి రెండుగాచేసి వ్యాఖ్యానించాడు తాత్పర్యంలో గాని సందర్భంలో గాని భేదం ఏమీలేదు కాని సూత్రసంఖ్య మాత్రం బాలసరస్వతీయ సంజ్ఞాపరిచ్ఛేదంలో 4 గా ఉంటే అహోబలపండితీయంలో 43 గా మారింది ఇలాగే మిగిలినపరిచ్ఛేదాలలో గూడ బాధారహితమైన విభాగంలో తప్ప అన్యులవ్యాఖ్యానాలు బాలసరస్వతీయ విధేయాలే

ఇక అతని వ్యాఖ్యానానికి రెండో మూడో లక్షణాల్ని ప్రమేయోదాహరణాల్ని పరిశీలిద్దాం ప్రమేయమంటే సూత్రాల ప్రవృత్తికి అవధి ప్రమేయ శబ్దంలో ప్ర ఉపసర్గ మా ధాతువు దానిమీద యత్ (ఈత్) ప్రత్యయం చేస్తే అది ఏర్పడింది ఉదాహరణం మనకు తెలిసిందే లక్షణానికి సమన్వయం చూపే మాట అది అందుకే లక్ష్యమనీ పిలుస్తాం దానిని

సూత్రవిభాగం కంటె క్లిష్టమైన గురుతరమైన కార్యమిది ఒక కొత్త వ్యాకరణాన్ని భాషాంతరంలో స్వభాషాభాషులకోసం వ్రాయబడినదాన్ని శ్లోకం ముందుఉంచి దానిలోని సూత్రాల ప్రవృత్తిని గణాల్ని[2] వివరించడమంటే సామాన్య వ్యాఖ్యాతలు చేయగలిగిన పనికాదు స్వయంగా వ్యాకర్త కాకపోయినా వ్యాకర్త వంటి ఉపజ్ఞకలవాడే చేయగలడు ఆపని కాగా బాలసరస్వతి కావించిన ప్రమేయ వివరణం అనంతర వ్యాఖ్యాత లందరికి అనుసార్యమైన విధం గూడ ఇక్కడ

---

కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రణ— 632

2 తదాది కిమాది సురాది ఏకాది గణాలు మొదలైనవి

మనం గమనించవచ్చు ఉదాహరణ స్వరూపం గూడ చింతామణి వ్యాఖ్యలో చాలా ప్రధానాంశమే సంస్కృతభాషలోని పదాలకి తెలుగుపర్యాయాలు ఒకటికంటె ఎక్కువ ఉన్నపుడు సరిగా సూత్రకృదభిప్రేత పదమేదో తెలిసికొని ఉదాహరణలు చూపడం మొదటి వ్యాఖ్యాతగా బాలసరస్వతి చేయగల్గడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయం బాలసరస్వతి ఉదాహరణల్ని గూడ అనంతర వ్యాఖ్యాత లందరూ యథాతథంగా స్వీకరించడం అందువలననే గమనించదగ్గ విషయం ఇక అతని వ్యాఖ్యలో ప్రత్యేకత వైలక్షణ్యం గల సూత్రసముదాయాన్ని క్రమంగా పరిశీలిద్దాం

### సంజ్ఞాపరిచ్ఛేదంలో

విశ్వశ్రేయ కావ్యమ్ –

ఆధునికులు చాలమంది పై సూత్రానికి సూత్రకర్త ఉద్దేశించని వ్యాఖ్యాతలు చెప్పని జగద్ధితకరమనే అర్థాన్ని స్వయంగా కల్పించుకుంటున్నారు వారిదృష్టిలో ఇక్కడి విశ్వ శబ్దం జగత్పర్యాయం కాని సూత్రకర్త ఆపదాన్ని ఆ అర్థంలో వాడలేదు అలాగే శ్రేయశ్శబ్దం గూడ ధర్మార్థంలో వాడబడినదే కాని ఇప్పటి శ్రేయోరాజ్యం వంటి పదబంధాల్లోని శ్రేయశ్శబ్దతుల్యంగా గాదు ఆ సూత్రానికి బాలసరస్వతి ఒసగిన వ్యాఖ్యానసార మిది

కావ్యమ్ కావ్యము విశ్వశ్రేయ =సర్వధర్మములలో శ్రేష్ఠము ఇష్టాపూర్తములలోపలను పూర్తవిశేషమైన కావ్యము సర్వపాపహరము కనుకను కీర్తికరమును

తటాకం ధననిక్షేపం ద్విజస్థాపనమేవ చ
వనం శివాలయ కావ్యం నందనశ్చ సదా నృణామ్
ముక్తిదా స్సప్తసంతానా మహాపాతకినామపి
తారయన్తి చ దుర్గేభ్య పితౄనుభయవంశజాన్

అని అనేక శ్రుతి స్మృతి పురాణేతిహాసవచనాదులచేత వర్ణింపబడ్డది గనుకను వ్యాసాదులు ప్రవర్తించిన విశిష్టాచారము గనుకను కావ్యము సర్వోత్కృష్టము

అనంతర వ్యాఖ్యాతలు అప్పకవ్యాదులు గూడ కేవలం ఈ అర్థతాత్పర్యాలతో చే ఈ సూత్రాన్ని వ్యాఖ్యానించారు

ఒక ప్రతిపత్తి

ఆద్యప్రకృతి ప్రకృతిశ్చాద్యే ఏషాతయోర్భవేద్వికృతి
కేవలతయానుసర్పత్యుభే చ యేయం యథాతథం భాషా - 0

అనే సూత్రంలో పూర్వార్ధానికి అర్థతాత్పర్యాలు సామాన్యంగానే తెలుస్తున్నాయి ఉత్తరార్థంలో యాఇయంభాషాయథాతథం ఉభేవ కేవలతయా అనుసర్పతి అనే వాక్యానికి —— యా = ఏదైననేమి ఇయంభాషా = ఈభాష యథాతథం = యథేచ్ఛముగాను ఉభేవ = ఆ రెంటిని కేవలతయా = ప్రత్యేకరూపముచేతను అనుసర్పతి = అనుసరించును అని ప్రతిపదార్థం వ్రాసి దాని తాత్పర్యాన్ని విడిగా దీని తాత్పర్యము కొన్ని తెలుగుమాటలు సంస్కృతమునకే ప్రత్యేకముగాఁ దద్భవ తత్సమములౌను కొన్ని ప్రాకృతమునకే ప్రత్యేకముగాఁదద్భవ తత్సమములౌను అది యెట్లంటేని - సముద్రమునకు సంద్రము చంద్రునకు చందురుఁడు మొదలయినవి ప్రాకృతమును మించి మొదలి సంస్కృతమునకే తద్భవములయినవి ప్రాకృతమునకైన సముద్దము చందుడు అని కావలయును కృష్ణుడు మొదలయినవి సంస్కృతమునకే తత్సమములైనవి ఇంక లక్ష్మికి లచ్చి ఖడ్గమునకు కగ్గము మొదలయినవి సంస్కృతమును ముట్టక ప్రాకృతమునకే తద్భవములైనవి ఎరి మట్టి బొలి (బలి) మొదలైనవి ప్రాకృతమునకే తత్సమములు ఈలాగుననే ప్రాకృతభేదములైన శౌరసేన్యాదిభాషలకును ప్రత్యేక ప్రత్యేకములుగాఁ దద్భవ తత్సమములౌను సూక్తికి సుద్ది ద్యూతమునకు జూదము - శౌరసేనికే తద్భవములు యక్షులు-జక్కులు మాగధీతద్భవము గుణము - గొనము పైశాచీతద్భవము రాజకులము - రాచకొలము చూలికా తద్భవము స్నిగ్ధము - నిద్దము మూక - మూగ అపభ్రంశ తద్భవములు ఈలాగున తత్సమములును దెలియునది అని వివరించాఁడు

---

ప్రౌ తుమాటి దొణప్ప తమ జక్కులు మాగధీ తద్భవమా? అనే వ్యాసంలో బాలసరస్వతి మొదలుఅహోబలపతి వరకు చింతామణి వ్యాఖ్యాత లందరూ జక్కులు శబ్దాన్ని గతానుగతికంగా మాగధీ తద్భవంగా పేర్కొనడం ఆశ్చర్యకరమైన ప్రసిద్ధ దోషమని సాధికారికంగా నిరూపించారు చూ భారతి 70 మే

కేవలతయానుసర్పతీత్యాది సూత్రప్రమేయం ఈవిధంగా వివరించబడింది ఉభేచ కేవలతయానుసర్పతి అనేమాటకు పై వివరణమంతా అర్థమని బాలసరస్వతి చెప్పకపోతే ఇతర వ్యాఖ్యాతలకు పరితలకు కనీసం ఆ మార్గమైనా తెలిసిఉండేది కాదు

అప్పకవి అనుకరణం

చింతామణికి రెండోవ్యాఖ్యాత అప్పకవి ఈసూత్రానికి చేసిన వ్యాఖ్య కేవలం బాలసరస్వతీయ ప్రతిబింబమే చూడండి

ప్రకృతులను రెంట రెండురూపముల నమరు తద్భవములు ప్రత్యేక మాంధ్రంబులగుచుఁ

జంద్రునకుఁ జందురుండని సంస్కృతమునఁ జందుడని ప్రాకృతమున నీచందమునను (అప్ప – 86)

తెలుగులొక్కకొన్ని దేవతాభాషనె తద్భవంబు లగుచుఁ దనరుచుండు

ధరణిఁగొన్ని ప్రాకృతముననె యగుచుండుఁ దెలియవలయువాని తెలుగులెల్ల (అప్ప – 88)

ప్రాకృతమునంటక నిలింపభాషనయ్యెఁదజ్జము సముద్రమునకు సంద్రం బటంచు

నాకసద్భాషనంటక ప్రాకృతమ ననైనచో దానిని సముద్ద మనఁగవలదె (పైది 89)

నాకులభాషను ముట్టక ప్రాకృతమున లచ్చి దాఁబరగు లచ్చి యనన్
నాకోక్తియైన లక్ష్మికిఁ బ్రాకటముగ లక్కిమి యని పలుకఁగ వలదే – 90
శౌరసేని జూదంబు పైశాచియిందు సాన చూళిక యనియెడు దాన రావ
కొలమపభ్రంశ భాషోక్తివలన మూఁగదనరు మాగధి జక్కులు
తద్భవములు 94

## అహోబలపతి అప్పకవిని తప్పుపట్టడం

అనంతర ప్రసిద్ధవ్యాఖ్యాత అహోబలపతి గూడ బాలసరస్వతి మార్గాన్ని అప్పకవి వలెనే అనుసరించాడు కాని అక్కడక్కడ అప్పకవిని తప్పుపట్టాడు బాలసరస్వతిని సరిదిద్దబోవడం చేశాడు అనుసరణప్రకారస్త్వేవం చంద్రుఁడు వనము ధనము సుఖము ఇత్యాద్యాస్సంస్కృత సమా చందురుఁడు సంద్రము ఇత్యాద్యా స్తద్భవా అప్పకవినాతు చంద్రాదిశబ్దేషు దకారస్య శషాదేశస్యాహోశ్రిచోఖో ఇతిసూత్రేణ ద్విత్వముక్తం తద్భ్రాన్తిమూలకమేవ తస్య బిందో పరత్వేనాచ పరత్వాభావాత్ నచ బిందోర ప్యచ్త్వం ప్రాకృతవ్యాకరణే తథా వ్యవహారాభావాత్ ఇత్యాదిగా సాగిందతని వ్యాఖ్యానధోరణి

అప్పకవి చంద్రశబ్దం శషాదేశస్యాహోశ్రిచోఖో అనే ప్రాకృత వ్యాకరణ సూత్రం వల్ల చంద్ద అవుతుందని అనడం పొరపాటన్నాడు అలాగే ఋచ్ఛి శబ్ద ప్రక్రియలో కూడ అప్పకవికి పరిశీలన చాలదని చెప్పాడు అయినా అతని వ్యాఖ్యానంలోని కుక్కగోశెంబోలి (అప్పకవీయం) ఇత్యాది సీసపద్యం మొత్తం ఉద్ధరించి ప్రదర్శించాడు

బాలసరస్వతివలెనే జక్కులు మాగధీతద్భవమని రాచకొలము చూళికాతద్భవ మని మూగ అపభ్రంశ తద్భవమని చెప్పి జూదశబ్దం శౌరసేనీ తద్భవమనే బాలసరస్వతి మాట ఆలోచన చాలనిదని అది శౌరసేనీ తత్సమమే కాని తద్భవం కాదని ససూత్రంగా నిరూపించాడు

---

ఇక్కడ అహోబలపండితీయ వ్యాఖ్య (సంస్కృతం) లోను దాని తెలుగు అనువాదంలోను తప్పులు ముద్రితాలై కనుపిస్తున్నాయి (ఆంధ్ర రచయితల సంఘం హైదరాబాదువారి ప్రచురణ 1960) సంస్కృతంలోని తప్పులు యథాతథంగా అనువదించి ఊరుకున్నారు తదనువక్తలు జూదము శౌరసేనీ తద్భవ నతు తద్భవ తథాహి ఏవంస్థితే జూదశబ్ద తద్భవ ఇతి సరస్వత్యోక్తం తదవిచార మూలకమేవ (మూలం) — జూదము శౌరసేనీ తద్భవము సంస్కృతప్రాకృత తద్భవము గాదు వాస్తవస్థితి యిట్లుండగా జూదము అను పదము శౌరసేనీ తద్భవమని బాలసరస్వతీ యనుట యవిచార మూలకమే (అనువాదం) బాలసరస్వతి శౌరసెనీ తద్భవ మనే అన్నాడు. అహోబలపతి గూడ శౌరసేనీ తద్భవమనే అంటే ఇక వివాదమేది? తత్స మమని అంటేనే వివాదం అహోబలుని తరువాతి వ్రాత గూడ అతడు దానిని శౌరసేనీ తత్సమమని నిర్ణయించినట్లే తెలుపుతుంది

ఇక్కడ మనం గమనించవలసిన అంశం కేవలతయానుసర్వత్యుభేచ యేయం యథాతథంభాషా అనే సూత్రానికి విషయాలుగా భిన భిన్న ప్రాకృత సమభవ శబ్దాలు గ్రహించడం బాలసరస్వతి నిర్ణయించిన వ్యాఖ్యాన మార్గమని ఆ మార్గాన పోవడంలో అప్పకవి అహూబిలపతులకు తరువాతి తదనుయాయులకు ఏఅభ్యంతరమూ లేదు కాకపోతే మధ్యమధ్య అల్పాల్పాంశాలపై అభిప్రాయభేదాలు పొడసూపినాయి అది అంతముఖ్యమైన విషయంగాదు ముందుగా వ్యాఖ్యానమార్గాన్ని వేసినవాడు బాలసరస్వతి అప్పకవ్యాదులు దానిపై ప్రయాణం చేసినవారు

లఘవో౽లఘవశ్చేతి ద్వేధా స్తస్థాన్ విదన్తి శాస్త్రార
అన్యే౽న్యవ్యాకరణ స్పష్టా రస్త్వత్రి గృహ్యతే ద్వివిధ

పైసూత్రంలో అన్యే అన్యవ్యాకరణ స్పష్టాః అనేమాటకు తొలిత బాలసరస్వతి చేసిన వివరణం అమూల్యం అతని వ్రాత ఇది దీని తాత్పర్యము యరలవలు నాలుగును ద్వివిధములు అందులో యవలకు హలిసర్వేషామ్ అను సూత్రమునందు పాణినీయములో లఘువులను అలఘువులును నని రెండువిధములును సూచితము లయ్యెను లకారము లోళ అను సూత్రమునందు ప్రాకృత వ్యాకరణములో రెండు విధములయ్యెను పరిశేషించిన రవర్ణము ఆంధ్రవ్యాకరణములో ద్వివిధమవునను అన్యవ్యాకరణాల్లో అంటే సంస్కృత ప్రాకృత వ్యాకరణాల్లో ఏయేస్థలాల్లో యవలల ద్వైవిధ్యం చెప్పబడిందో ససూత్రంగా వివరించడం వలన చింతామణికి అనంతర వ్యాఖ్యాతలందరూ ఆవివరణనే తు చ తప్పకుండా స్వీకరించారు ఈ వ్యాఖ్యానం వలన రేఫద్వైవిధ్య మొకటే ఆంధ్రవ్యాకరణంలో ఉన్నదనీ మిగిలిన అంతస్థవర్ణాల ద్వైవిధ్యంతో తెలుగునకు సంబంధం లేదనీ అనుకుంటాము

## రేఫశకట రేఫల వైషమ్యం

కాని అనంతర సూత్రంలో నాన్యేషాం వైధర్మ్యం లఘ్వ లఘూనాం రయోస్తునిత్యంస్యాత్ అనే సూత్ర వివరణంలో ఇట్లనంగా యవలు ద్వివిధములును దెలుగునఁ గలవనుట ప్రథమాంతము మీఁద వకారమునకు వచ్చిన యాదేశవ కారము లఘువకారము ల ళ లు ప్రసిద్ధములే। వీనికి యథోచితముగా నుదాహరణములు అంటూ తెలుగులో గూడ ఆ ద్వైవిధ్యాన్ని ప్రదర్శించాడు

---

లఘ్వలఘుభేదం అంతస్థవర్ణాలకు తెలుగులో తొలిగా కల్పించిన వ్యాకరణం

పీఁక్లఁబాలును గలఁనన్నెల్ల బ్రొద్దు నాయవావిభూషణుఁడు నీవు బాయకుండు

రనుచుఁ జెలికత్తెవలుక హామాచలాత్మభవ ముఖాబ్జంబువంచి సగ్గువడియుండె

ఇంక రవర్ణోదాహరణము

తెక్కలుగలట్టి పెనుబాఁప జేండ్లవంటి కఱకుఱులుకుల ఱంభుముక్క అఁగఁజేసి

పరమకల్యాణి గిరికులేశ్వరితనూజ రణవినోదంబు సలిపె నిర్జరులు వొగడ

చింతామణికి అనంతర వ్యాఖ్యాత లందరూ అచ్చంగా బాలసరస్వతి వ్యాఖ్యానాన్ని అక్షరశ పాటించారు తెలుగు వ్యాకరణ వాఙ్మయంలో మొదట అంతస్థవర్ణాల్ని లఘ్వలఘువులుగా విభజించినది చింతామణి వాటిని తెలుగుభాషలో సమన్వయించి చూపిన వ్యాఖ్యాత బాలసరస్వతి – అనే విషయం గు ర్తించదగింది ఆగమాదేశ యకార వకారాలు లఘువులని కేతనాదులు చెప్పిన జాడలేదు చింతామణి వేసిన ఈ మార్గాన్నే ఉ త్తరకాలంలో బాలవ్యాకరణం గూడ అనుసరించడంతో ఆంధ్రవ్యాకరణ చరిత్రలో అంతస్థవర్ణాల ప్రత్యేకత స్థిరపడింది

---

చింతామణి కాని దానికి గూడ ఈ విషయంలో నిశ్చితాభిప్రాయం మొదట ఉన్నట్లు లేదు ఒక సూత్రంలో అన్యే ఽన్యవ్యాకరణ స్పష్టా అని అనంతర సూత్రంలో నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తునిత్యంస్యాత్ అని చెప్పడం వలన ఆ అనిశ్చితస్థితి తెలుస్తుంది ఇంతకీ ఒకే జాతికి చెందిన అంతస్థవర్ణాల లఘ్వలఘువులలో కొన్నిటికి సాధర్మ్యం ఉండటం మరికొన్నింటికి వైధర్మ్యం ఉండటం ఏమిటో ఎందుకో తెలియదు అవి ఏర్పడినవిధం గూడ సమానంగా లేదు బాలసరస్వతి వివరణ ప్రకారం శకటరేఫ దేనికీ ఆదేశంగా వచ్చినట్లు తెలియడంలేదు అలాగే శకారం గూడ మిగిలిన యవలు ఆగమాదేశాలుగా చెప్పాడు దీన్నిబట్టి చింతామణి మధ్యలో కల్పించిన అనిశ్చయస్థితే ఇదని ప్రస్తుత శకటరేఫం ( ఱ ) వర్ణాంతరంగా ఉండేదని దానిని తీసికొని వచ్చి రేఫ యొక్క అలఘుభేదంగా చూపడంతో వైయాకరణుల్లో పెద్దకల్లోలం రేగి దానిమీద విడివిడి గ్రంథాలే (రేఫ ఱకార నిర్ణయాలు) ఎప్పుడినాయని తెలిసికోవచ్చు అయితే బాలసరస్వతికి ముందే తెలుగులో లక్షణగ్రంథాల్లో ఈ రేఫ ఱకారాల భేదముంది గాని ఈ రూపంలోమాత్రం గాదు

ద్రుతప్రకృతిక కళావిభాగం గూడ చింతామణివలననే ఆంధ్రవైయాకరణు లందరూ చివరకు స్వీకరించారని చెప్పవచ్చు కళల పట్టికలోని కొన్ని పదాల అర్థతాత్పర్యాలు బాలసరస్వతి కనిపెట్టి చెప్పగలగడం ఆశ్చర్యకరమైన విషయం ఆ పట్టికలో కొన్ని పదాలకి తెలుగు పర్యాయా లిచ్చాడు ఉదా యదా తదా కిం : ఎప్పుడు అప్పుడు ఎమి కొన్ని పదాలకి మాత్రం తత్తద్భావ సూచక శబ్దజాలం (కేవలం స్వసంకేతితార్థం) ఇచ్చాడు ఉదా ప్రశంసన అద్భుత : భళి మజ్జా ఓహో ఔరా అనంతర వ్యాకర్త లందరూ కేవలం బుద్ధిమంతులవలె ఆ అర్థాల్నే అనువదించి ఊరుకున్నారు బాలసరస్వతి వ్యాఖ్యా ప్రాబల్యం అంతటిది

## కళలలో కై పట్టి

అయితే చింతామణి నిర్దేశించిన కళలపట్టికలో కై పట్టి విభక్తి ప్రత్యయాలకి స్థానం లేకపోవడాన్ని దాని తొలివ్యాఖ్యాత బాలసరస్వతి గమనించలేదు అయి సూత్రస్థమైన ఆద్య శబ్దంతో సాధించవచ్చు గదా అని సమర్థించవచ్చు కాని ఆ ఆద్యశబ్ద స్థానాన్నిబట్టి చూస్తే మొట్టమొదట చెప్పిన విభక్తి ప్రత్యయాల్లోని అనుక్త శబ్దాల్ని దానితో (ఆద్యశబ్దంతో) సాధించడం చింతామణి అభిప్రాయం కాదని స్ఫుటంగా తెలుస్తుంది పైగా అలా సాధించదలిస్తే పట్టికలోని అనేకపదాల పృథఙ్నిర్దేశం వ్యర్థమని చెప్పవలసి వస్తుంది

సంజ్ఞాపరిచ్ఛేదాంత్య శ్లోకానికి పూర్వసూత్రం ప్రవాహానీదేశ్యా అనేదానికి బాలసరస్వతి లోకవ్యవహార సిద్ధమైనది దేశియము అని అర్థం చెపితే అనంతర వ్యాఖ్యాతలందరూ ప్రవాహశబ్దానికి ఆ లోకవ్యవహారమనే అర్థమే స్వీకరించారు గాని ఫెపాట్లీ స్వాతంత్ర్యాన్ని (పరిణామశీలం అనే అర్థం ఇవ్వడం వంటి దాన్ని) వారు తమవ్యాఖ్యల్లో చూపలేకపోయారు

---

చూ అనంతరవ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం అనే ప్రకరణం

## సంధి పరిచ్ఛేదంలో

ప్రథమసూత్రమే విచిత్రమయింది ఎక్కడ సంధిలేదో చెబితే సంధిజేరిగే స్థలాన్ని వ్యాఖ్యాత కనిపెట్టి చెప్పాలి సంధిర్నాచోచ్యమత ఈ సూత్రానికి ఉకారవ్యతిరిక్తమయిన అచ్చుకి అచ్చుపరమైతే సంధిలేదు అని అర్థం ఆ అర్థం నుండి ఉకారమునకు సంధికలదు అనే అసలు అర్థాన్ని తీసిచెప్పాడు –బాలసరస్వతి ఉదాహరణలు గూడ అతడిచ్చిన వాటనే ఇతర వ్యాఖ్యాత లందరూ అనుసరించారు

నిత్యమనుత్తమ పురుషక్రియాస్విత అనే సూత్ర వ్యాఖ్యానంలో బాల సరస్వతి ఉత్తమపురుషకైన కొలిచితి నంబను విడిచితి మన్యులను – అన్నది కిమాది గనుక క్రియాగ్రహణమున నంటలేదు అని అదనపు వ్యాఖ్యానం చేస్తే అహోబలపతి గూడ దాన్ని అనువదించాడు దీనివలన చింతామణి వ్యాఖ్యాతగా బాలసరస్వతికి ఎంత ప్రముఖస్థానాన్ని అనంతర వ్యాఖ్యాతలు ఇచ్చారో తెలుసు కోవచ్చు

శత్రర్థే యాతశ్చానో స్తస్యస్యాచ్చ పూర్ణబిందురపి అనే సూత్రం వినుచు– విన్చు – వించు అనుచు – అన్చు – అంచు వంటి రూపాల్ని సాధిస్తుంది దీనిలోని (బిందు + అ౦) అపి శబ్ద సామర్థ్యం వల్ల చనుచు ఎన్నుచు పూనుచు1 వంటిచోట్ల బిందువు రాదని బాలసరస్వతి చెబితే అనంతర వ్యాఖ్యాత లందరూ దాన్ని యథాతథంగా స్వీకరించారు

అహమాదీనాం ద్విత్వమ్ అనే సూత్రవ్యాఖ్యానంలో బాలసరస్వతి పాత్రకు ఎంత విధేయంగా ప్రవర్తించ అహోబలపతి వ్యాఖ్యచేసినదీ కారికలల్లినదీ ఈ ప్రకరణారంభంలో గమనించాం

సర్వత్రాజ్యత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః అనే సూత్రం పదాది యకారాంగీకారం వలన కల్గిన అనర్థాన్ని సరిదిద్దడానికి పుట్టింది యెవఁడు– యెమ్మె – వంటివి యాదులు గాబట్టి ద్రుతప్రకృతికాలకు అవి పరమైనపుడు ఎవఁడు ఎమ్మె వంటివిగానే వాటిని స్వీకరించాలి అని అర్థం ఇక్కడ బాలసరస్వతి

---

1 బిందువు వచ్చిన ప్రయోగాలు కనుపిస్తున్నాయి

మరికొంత వివరణం యిచ్చాడు యెవఁడు – యెమ్మె వంటి వాటిలో యకారం స్థిరం కాదు. ద్రుతప్రకృతికం కంటె అది పరమైతే కలిగెన్యెమ్మె అని సంశ్లిష్ట రూపమూ కలిగెయెమ్మె అని లోపసహిత రూపమూ[1] రావు అని అప్పకవి పదాదియకారాంగీకారికాదు గాబట్టి[2] ఈవిషయం విడిచిపుచ్చాడే కాని అహోబలపతి మాత్రం బాలసరస్వతి మాటల్ని అనువదించాడు

పఙ్ పర్తి వర్ణాలు ఔపవిభక్తికాలు

ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణాషింట్యాదయోభవన్తిహ

రుల్యాదేర్నామ్నాం స్యుస్తేహివిభక్తౌ సమాసే చ అనే సూత్రం ఔపవిభక్తికాల్ని నిర్దేశించేదీ విధించేది కూడ దీని వ్యాఖ్యలో బాలసరస్వతి టి ంటి తో పాటు తి ర్తి పఙ్ పవర్ణాలు గూడ ఔపవిభక్తికాలే అని నేతికి నేతిముంత మిత్తికి మిత్తిచేసు పామునకు పాపరేడు వేమునకు వేపచెట్టు అని ఉదాహరించారు ఔపవిభక్తికాల పట్టికలో పఙ్[3] ప వర్ణాల్ని ర్తి వర్ణాన్నీ చిన్నయసూరి తొల గించాడే గాని అప్పకవి అహోబలపతులు సరస్వతి వ్రాతను అనువదించారు దీని వ్యాఖ్యలోనే బాలసరస్వతి చివర ఔపవిభక్తికములు బహుప్రకారములు విభక్తి సమాసముల యందు యథాయోగ్యముగాఁ దెలియునది రుల్యాదులకే కొన్నింటికి రావు పైఁడుబోంపము కల్లుకుండ ఎన్నుగంట ఇత్యాది ఔపవిభక్తిక వర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు అని ఒకవివరణ వ్రాశాఁడు దాన్ని అహో బలపతి సంస్కృతీకరించి అధర్వణుని పేరిటకారికలుగా అందించాడు చూడండి

విభాషయా భవన్త్యత్ర భవన్త్యుప విభక్తయ
భవన్తి కుత్రచిన్నైవ నిదానం తత్ర సద్వచ
బహవోఽత్రాంధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికా
ప్రవృత్తిశ్చా ప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్

---

[1] సంధి 25 26 వ సూత్రాల ద్వారా

[2] చింతామణి పాఠభేదాలు అనే ప్రకరణంలో వివరించబడింది

[3] పఙ్ అంటే ప్రయోగదశలో ఁప గా మారుతుంది

తద్వివేకః ప్రయోగైక శరణం స్యాద్ధిశబ్దతః 1
యత్రైతే తత్ర తత్సంజ్ఞా నామ్నా మన్యత్రచాన్యథా

ఈకారికలు బాలసరస్వతి మాటల ప్రతిబింబాలు – బహుప్రకారములు - బహవః కొన్నింటికి రావు - భవని కుత్రచిన్నైవ విభక్తి సమానముల యందు యథా యోగ్యముగా తెలియునది విభాషయా భవన్త్యత్ర ఔపవిభక్తిక వర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు యత్రైతే తత్ర తత్సంజ్ఞ

వాక్యాన్త గత పదనాం చ అనే సూత్రం వాక్యాల చివరనుండే నకారానికి లోపవిధానం చేస్తుంది అక్కడ బాలసరస్వతి సీసపద్యాదుల చరణములు వాక్యములు అని వివరిస్తే అప్పకవి అహోబలపతి దానికి కేవలానువాదాలు చేశారు

అన్యేషాం చ ప్రయోగ మహితానామ్ అనే సూత్రం పూర్వ సూత్రాలు సాధించగా మిగిలిపోయిన పదాల్లోని మధ్యాల్లోపం విధించేది దీని కుదాహరణగా బాలసరస్వతి మానిచి – మాన్చి ఈడిచి – ఈడ్చి అనే క్రియపదా లివ్వడం చూచి అహోబలపతి ధాతుష్వపి అని తనవ్యాఖ్యలో వ్రాసి అలిగి–అల్గి పలికి–పల్కి అని ఉదాహరించాడు అలాగే బాలసరస్వతి ప్రయోగ మహితములన్నందుచేత నుత్వములకును బ్రయోగసిద్ధమైననే కాని లేదనుట – ఎనుఁగు అడుగు అని వ్రాస్తే దాన్ని యథాతథంగా భాషాంతరీకరించాడు అహోబలపతి

*అజంత పరిచ్ఛేదంలో*

మహతస్సోర్ధజనితో భవేత్ పుంసి 2

దీని వాఖ్యానం బాలసరస్వతి విపులంగా చేశాడు తొలుత సంస్కృత వ్యాకరణ మర్యాద చెప్పి దాని ప్రకారం తెలుగులో గూడ శబ్దనిష్పత్తి చేయాలని

---

స్యాత్ + హి + శబ్దత అని పదవిభాగం దీనిలోని హి శబ్దం చింతామణి సూత్రంలోని హి శబ్దానుకరణమని చి విష పరి లో ప్రతిపాదించబడింది ఆ ప్రతిపాదన నిరాధారం నిజానికి అది పాదపూరణార్థమే

తెలిపి తరువాత ప్రక్రియను రామ + సు అని యుండెను —అని ప్రారంభించాడు సు అనే ప్రత్యయాన్ని కొట్టి డుజ్ అనేది ఆదేశమయినదనీ అనుక్తమన్యవత్ అనే వైయాకరణన్యాయం ద్వారా పాణినీయ సూత్రం— హలన్త్యమ్ (ఉపదేశే అన్త్యం హల్ ఇత్) అనే దానితో డుజ్‌లోని జకార మిత్తయిన దన్నాడు సాను నాసికోచ్చారం జిత్ అనే ప్రాకృతసూత్రంతో దాపల (పూర్వం) అర్ధబిందుయుక్తి మౌతుందట మహతోఽత ఉద్విభక్తౌ అనే సూత్రంతో అకారముకారమై రాముఁడు సిద్ధించిన దని వ్రాస్తూ అనునాసికాభావపక్షే అనుస్వారస్స్యాత్ 1 అని పూర్ణబిందు వాయ్యెను అని రాముండు రూపాన్ని ఉదాహరించాడు ఈ ప్రక్రియావిధానం సర్వం అహోబలపతిచేత యథాతథంగా స్వీకరించబడింది అప్పకవీయ చింతామణి సంధిపరిచ్ఛేదంతో ముగిసింది కాబట్టి అప్పకవి వ్యాఖ్య ఇకపై ఉండదు ఇక్కడే మహత్తులయినా జడాదులుగా వివక్షిస్తే అమహత్తులే అవుతాయని బాలసరస్వతి అంటే ఆ మాటను సంస్కృతీకరించి అధర్వణకారిక ను సృష్టించాడు అహోబలపతి2 బాలసరస్వతి, సూత్రంలోని దశసార్థక్యాన్ని అనిత అనడంవల్ల రఘుపతి యదుపతి వంటిచోట్ల డుజ్ రాదని పుంఽ అనడం వల్ల దశరథాపత్యము బ్రహ్మము వంటి రూపాలున్నాయనీ వివరిస్తే అహోబలపతి దానినే అనువదించాడు

చింతామణి అకారాంత శబ్దాలకు ప్రథమా ద్వితీయా బహువచన ప్రత్యయాలు విధించేటపుడు శబ్దజాలమంతటిని (అకారాంతమైన దాన్ని) లాంతం అలాంతం అని రెండుగా విభజించింది లాంతాలకి ప్రథమా బహువచనంగా రు ప్రత్యయాన్ని ద్వితీయాబహువచనంగా ర ప్రత్యయాన్ని విధించి అలాంతాలకు సామాన్య పత్యయాల్నే అంటే లు ల లనే విధించింది

## విభక్తిలకారానికి రేఫవిధానం

లాంతాత్తు రురౌతయోః క్రమేణ స్త — 6

---

1 ఈ సంస్కృతవాక్య మెక్కడిదో ఎవరిదో తెలియదు అసలు ఈ వ్రాత బాలసర్వతిదేనా అని కూడ సందేహం ఈ వాక్యం అహోబలపతి వ్యాఖ్యలో కనబడదు.

2 చూ కారికల్లక్షు మూలపాఠాలు అనే ప్రకరణం

బాలసరస్వతి లాంత శబ్దాలకు బాల శబ్దాన్ని ఉదాహరించి బాలుడు, బాలురన్ అనే ఉదాహరణ లిచ్చాడు అది మొదలు బాలవ్యాకరణం వరకు ఈ బాలశబ్దం దాని జాతికి చెందిన నృపాలాదిశబ్దాలు ప్రక్రియా విధానంలో ప్రముఖస్థానం వహిస్తూ ప్రత్యేక సూత్రాల నిర్మాణానికి ఆధారాలైనాయి సామాన్యంగానే అహోబలపత్యాదులు బాల శబ్దాన్నే ప్రథమోదాహరణంగా స్వీకరించారు ఇక్కడే బాలసరస్వతి లాంతదశ సార్థక్యం వివరిస్తూ లాన్తాత్ అన్నాడు గనుక ల అనునది తుద నుండిననే గాని లి లు అనునవి తుద నుండిన రు ర లు లేవు బుద్ధిశాలులు దీర్ఘతాలులు అని మంచి వ్యాఖ్యానం చేశాడు దీన్నిగూడ అహోబలపతి యథాతథంగా స్వీకరించాడు ఈ బాలశబ్ద నిష్పత్తి దగ్గర సూత్రంలో దశ సార్థక్యమన్నది తెలుగు వ్యాకరణ విద్యార్థు లందరికీ నాటినుండి నేటివరకు అభ్యస్తవిద్య అయింది

### విభక్తుల ముందు ని ల - ఆగమాలు

మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్త — 8

ఈ సూత్రం తృతీయాది విభక్తి ప్రత్యయాలు పరమైతే మహద్వాచక ప్రకృతికి ఏకవచనంలో ని బహువచనంలో ల అనే ఆగమాల్ని విధిస్తుంది ఈ విధానంలో ఒక లోపం ఉంది ని అనే ఆగమం ఏకవచనంలో మహద్వాచక పదాలకే వస్తుంది ఇతరపదాలకి రాదు కాని ల ఆగమం అలాకాదు అమహద్వాచకాలైన ప్రకృతులకు కూడ అది వస్తుంది అది రాకపోతే బహువచనత్వమే ఉండదు ఏశబ్దానికైనా ఉదా॥ వనములచేత గోవులచేత మొ కాని సూత్రం మాత్రం లాగమాన్ని మహద్వాచకాలకే పరిమితం చేసేసింది కాబట్టి బాలసరస్వతి ఇక్కడ సూత్రంలో ఒక జ్ఞాపనాన్ని సృష్టించాడు– తృతీయాదౌ అనక టాదౌ అని ఎకవచన ప్రధానంగా నిర్దేశించినాడు గనుక యీకార్య మేకవచనములకే యవశ్యము బహువచనములకును అమహత్తులకును లాగమము వచ్చునని జ్ఞాపకము - సింహములచేత సింహములకొఱకు అని. ప్రక్రియా దృష్టితో

---

బాలవ్యా తత్సమ—38

2 స్త్రీపశుజడాన్ వినా అన్యేమహదాఖ్యా –చిం అజంత –9

చూచినపుడు సూత్రనిర్మాణంకంటె ఈ జ్ఞాపనకల్పనం ముఖ్యమని అనిపిస్తుంది అహోబలపత్యాదులకు ఈ జ్ఞాపనం అవశ్యశిరోధార్య మయినదని వేరే చెప్పపనిలేదు

ఈ సందర్భంలోనే బాలసరస్వతీయ వ్యాఖ్యలోని ఒక ముఖ్యాంశం గమనించాలి తెలుగులో ప్రథమా సప్తములలో తప్ప ఏకబహువచనాలు రెండింటిలో ఒకే ప్రత్యయాన్ని విధిస్తారు ఉదా : రామునిచేత రాములచేత (ఏక బహువచనాలు తత్పూర్వ నిల వర్ణాల ద్వారా వ్యక్తమౌతాయి) సంస్కృతంలో అలా గాకుండ ఎక ద్వి బహువచనాలు మూడిటిలోను మూడు విధాలైన ప్రత్యయాలు వచ్చి మూడు భిన్నరూపాలు ఏర్పడతాయి ఉదా : రామేణ రామాభ్యామ్ రామైః అయినపుడు సంస్కృతంలో వ్రాసిన ఈ తెలుగు వ్యాకరణంలో విభక్తి ప్రత్యయాలు స్వయంగా తెలుగు ప్రకృతులకు చేర్చకుండా సంస్కృత విభక్తి ప్రత్యయాల స్థానంలో విధించిన ఈ తెలుగు వ్యాకరణంలో తెలుగు విభక్తిప్రత్యయ విధానంలో చిక్కులు ఎర్పడటం సహజం చింతామణి ఆ చిక్కుల్ని త్రివిక్రమ దేవుని ప్రాకృత శబ్దానుశాసనానుకరణం ద్వారా పరిహరించుకొన్నది ఆ ప్రాకృత వ్యాకరణంలో సుప్స్వాదిరస్త్యహలా ( - -4) అనే సూత్రం ద్వారా సంస్కృత విభక్తి ప్రత్యయాల ప్రత్యాహారం నిర్మించబడి సుస్ అంటే (సు–ఔ–జస్) ప్రథమావిభక్తి మొత్తమనీ టాస్ అంటే (టా—భ్యాం—భిస్) తృతీయా విభక్తి మొత్తమనీ-ఇలా ఏర్పాటు జరిగింది చింతామణి ఆ ఎర్పాటును స్వీకరించి ప్రయోగించింది కాని అలా స్వీకరించి ప్రయోగిస్తున్నట్లు ఎక్కడా చెప్పలేదు ఆ తెలివిడి బాలసర్వతి సాధించి టాస్ మొదలయిన విభక్తి సంకేతములు ప్రాకృత శాస్త్ర ప్రసిద్ధములు అని వివరించాడు అతని ఈ మార్గదర్శకత్వాన్ని అనంతర వ్యాఖ్యాతలు సగౌరవంగా అంగీకరించారు

న చ దేశ్యపదే —47

ఈ సూత్రం దేశ్యపదాల దీర్ఘాలు హ్రస్వాలు కావని చెబుతుంది దీనికి బాలసరస్వతి ఉదాహరణము నవలా నేజా లకోరి ఇత్యాది అహోబలపత్యాదులకు గూడ అవే స్వీకర్తవ్యాలైనాయి

ఎకాదిగణం ఇతరాంశాలు

ఏకాదే రమహతాం చ డావున్న —52

ఈ సూత్రం ఒక్కఁడు మొదలైన శబ్దాల్నీ అమహద్వాచకాల్లో డు ప్రత్యయాంతాలై ఉత్వం రానివాటినీ చెప్పడానికి పుట్టింది ఏకాది గణంలో బాలసరస్వతి మెరియఁడు సరియఁడు పాపండు అనే వాటిని ఉదాహరించాడు అమహద్వాచకాలుగా కత్తళఁడు కైరఁడు జన్నఁడు అనే హయవాచక శబ్దాలు చూపాడు నాటినుండి చిన్నయసూరివరకు అమహద్వాచకాలకు అవే ఉదాహరణలు ఈ సందర్భంలో చిన్నయసూరి ఏకాది గణాన్ని మాత్రం మగాది గణంగా మార్చాడు[1] అహోబలపత్యాదులు మాత్రం బాలసరస్వతికి కేవలానువర్తులే అయినారు

వికృతౌ చ స్త్రీలింగాః పులింగక సర్వనామధేయాస్స్యు —67

ఇది తెలుగులో గూడ స్త్రీవాచక శబ్దాలు స్త్రీలింగాలైన విశేషణాలతో ప్రయోగించబడటాన్ని చెప్పే సూత్రం ఉదా గట్టురాపట్టి ఆపన్నవరద ఈ సూత్రంలో విశేష్యార్థకంగా నామధేయశబ్దం వాడబడింది ఆ శబ్దానికి ఆ అర్థం ఉన్నట్లు ఏ నిఘంటువూ చెప్పడంలేదు ఎక్కడా ప్రయోగమైనా కనపడదు కాగా అది సూత్రకర్త సంకేతించిన అర్థం ఆ అర్థం బాలసరస్వతి గ్రహించి వ్యాఖ్యానించాడంటే అతనికి సూత్రకర్తతో అభేదాన్ని మనం అంగీకరించాలి అనంతర వ్యాఖ్యాత లందరూ బాలసరస్వతి వ్రాతను యథాతథంగా అనువదించారు

వాయిరవుర్వక్రతమౌ —65

ఈ సూత్రం అయి అవులకు ఐ ఔ లు విధించేది అగుధాతు విష్వన్నాలయిన అయి అవు లే ఉచ్చారణ వశాన ఐ ఔ లని ఏకాక్షరపదాలుగా కాలక్రమాన మారాయి కాని బాలసరస్వతి వ్యాఖ్యానంలో ఆ విషయం వ్యత్యస్తం చేయబడింది అంటే ఐ ఔ లే అయి అవు లుగా మారుతాయని అతడు వ్యాఖ్యానం చేశాడు చింతామణి మీద అతనికున్న సర్వాధికారాలు పురస్కరించుకొని కావచ్చు అనంతర వ్యాఖ్యాతలందరూ ఆ వ్యాఖ్యనే స్వీకరించారు బాలవ్యాకర్త మాత్రం భాషాచరిత్ర గతిని గమనించిన వానివలె అయి అవు లే వక్రతమాలౌతాయని సూత్రించాడు[2]

---

బాలవ్యా అచ్చిక—4

2 బాలవ్యా క్రియా— 03

హలంత పరిచ్ఛేదంలో

ఆత్మన ఇమనన్తానాం డావా —7

ఆత్మన్ శబ్దానికి ఇమనిజంత శబ్దాలకీ (గరిమన్ వంటివి) తెలుగులో ఆత్మ ఆత్మము గరిమ గరిమము వంటి రూపాల నిష్పత్తికి ఉద్దిష్టమైంది సూత్రం దీనిలో విధాన మైన ప్రత్యయం డా అందులో డకార మిత్తు పోతే ఆ మిగులుతుంది డకారమిత్తు గావడంవలన ఆత్మన్ గరిమన్ వంటి శబ్దాలలో అన్ అనే టిసంజ్ఞాకమైన వర్ణాలు లోపించి (ఆత్మ్ + ఆ)ఆత్మా అనే రూపమౌతుంది (చూ.— పాణిని —3–7) తరువాత దీర్ఘం హ్రస్వమై ఆత్మ అనే రూపం సిద్ధిస్తుంది ఇది వికల్ప సూత్రం గాబట్టి డా రానిపక్షంలో ఆత్మము అనే రూపం గూడ ఏర్పడుతుంది మహత్త్వవివక్షలో ఆత్మ శు అనే రూపం సిద్ధిస్తుంది అని బాల సరస్వతి వ్యాఖ్యానించాడు దీనిలో డిత్త్వసామర్థ్యం వలన టిలోపమౌతుందనేది చింతామణి పరిభాషనుబట్టి తెలిసికోవడం అసాధ్యం ఇక్కడ పాణినీయపరిభాషను స్వీకరించాలని గ్రహించడం అసాధారణవిషయం కాబట్టే అనంతర వ్యాఖ్యాత లందరూ బాలసరస్వతిని నిశ్శబ్దంగా అనుకరించారు రాజశబ్ద నిష్పత్తిలో గూడ ఈ సాంకేతికాంశాలు నిక్షేపించబడిఉన్నాయి ఈ సందర్భంలోనే హనుమచ్ఛబ్ద వచ్ఛబ్దంబులు కొందఱ మతంబున గుణవద్గణములు గావు హనుమానుఁడు భగవానుఁడు హనుమంతుఁడు భగవంతుఁడు అనియు గలదు అని వివరణం వ్రాశాడు దీన్ని ఆధారం చేసికొనే అహోబలపతి బాలవ్యాకర్త గూడ వాఙ్మ యంలో ప్రయోగాలు కనిపించకపోయినా హనుమాను శు భగవానుఁడు వంటి రూపాలు నిష్పన్నాలు చేశారు ఈ సందర్భంలోనే బాలసరస్వతి ఈ తెనుగు లోకవ్యవహారదృశ్యము గనుక గీర్ శబ్దము వ్యవహారమున లేదు వవచ్ఛబ్దము లేదు అని గూడ వివరించాడు ఆ వివరణం ఊతగా తీసికొని అహోబలపతి ఒక కారికను సృష్టించి అథర్వణాంకితం చేశాడు.

---

బాలవ్యా తత్సమ—74

2 చూ కారికల మూలపాఠాలు అనే ప్రకరణం

ఇదమదసేతద్యత్తచ్ఛబ్దాశ్శబ్దాన్తరాన్వయే బహుళమ్

హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి —24

ఇది ఈ + దేశము ఇద్దేశము ఎద్దేశము అక్కాలము వంటి రూపనిష్పాదన కుదిష్టమయినది దీని వ్యాఖ్యలో బాలసరస్వతి బహుళోక్తివలన ఆరాజు ఈసేన యనుచోటులను రాదు శబ్దాంతరము లేకున్నను ఎది ఎద్ది అనుచోట వచ్చును అని వివరణం చేశాడు ఈ వివరణాన్ని యథాతథంగా అనంతర వ్యాఖ్యాతలు స్వీకరించారు అహోబలపతి మాత్రం రాజు సేన వంటి పదాలు పరమైనపుడు రాదనే విషయాన్ని మరికొంత విపులం చేసి రేఫసకారాలతో పాటు కేతనమాటల సహాయంతో[1] శషహ వర్ణాల్ని జోడించి ఒక కారిక అల్లి అధర్వణాంకితం చేశాడు[2]

## సమాసమందే విభక్తిపరిణామం

షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా వాఘ్నామ్ — 34

ఇది ఒకవిధంగా విచిత్రసూత్రం సమాస మేర్పడేటపుడు ఒక విభక్తి మరొక విభక్తిగా మారుతుందని చెబుతుంది తెలుగువ్యాకరణాలు సామాన్యంగా సంస్కృతివ్యాకరణ మార్గాల్లో తత్రాపి పాణినీయ పథంలో ప్రయాణించాయి పాణినీయంలో సమాసంలో విభక్తిలోపం సుప్రసిద్ధం ఒకవేళ లోపించకపోతే అలుక్ సమాసాలౌతాయి ఆవిషయం వేరు కాని ఇక్కడ తెలుగులో షష్ఠీతత్పురుషసమాస మేర్పడేటపుడు షష్ఠి ద్వితీయగా మారుతుందని సూత్రం చెబుతుంది. సాంకేతికంగా ఆలోచించినపుడు వ్యాకరణ రచనలో ఇది విచిత్రగతి బహుళః ఈ వైచిత్రిని గమనించే కావచ్చు చింతామణి వాఖ్యాతలు తప్ప (వారైనా ఉన్నదాన్ని అన్యథా చేయజాలక) అనంతర వైయాకరణులెవరూ ఈ పద్ధతిని స్వీకరించలేదు చింతామణి మీద అధిక భక్తిశ్రద్ధ లున్న సుప్రసిద్ధ వ్యాకర్త చిన్నయసూరి ఈమార్గం విడవడం గమనించదగిన పరిణామం[3]

---

ఆంధ్రభాషాభూషణం — 36

2 చూ కారికల మూలపాఠాలు అనే ప్రకరణం

3 సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు—బాలవ్యా సమాస—25

చింతామణి రచనా ప్రణాళికలో ని ల రెండూ ద్వితీయావిభక్తులే కాగా రాముని గుణములు రాములగుణములు వంటివి ద్వితీయాతుల్యాలవలె ఆభాసించడం జరిగి ఉంటుంది వ్యాకర్తదృష్టికి

రాముని గుణములు అనే సమాసంలో ద్వితీయావిభక్తి కనబడినవానికి మరి రామునిచేత వంటి పదాల్లో మాత్రం ద్వితీయ కనబడదా? అక్కడ ఉన్న సాంకేతిక జ్ఞానం ఇక్కడ ఎలా లోపించనది? సమాధానం చింతామణికర్తే చెప్పాలి

క్రియాపరిచ్ఛేదంలో

చింతామణి క్రియాధర్మమాత్ర వాచకశబ్దాన్ని ఒకదాన్ని కొత్తగా సృష్టించి ప్రవేశపెట్టింది ఈ పరిచ్ఛేదంలో అది తద్ధర్మపదం కాని దాని నిర్వచనం చింతామణిలో లేదు బాలసరస్వతి తన వ్యాఖ్యానంలో తద్ధర్మపద స్వరూపం వివరించాడు క్రియాత్రయీగోచరార్థ స్తద్ధర్మ ఇతికథ్యతే ధాతోర్ధర్మ ఇతిప్రోక్తో వికృతౌ పూర్వసూరిభి అను విశేష వచనము వలన భూతాద్యర్థత్రయ విలక్షణమైన యొకానొక ధర్మము తద్ధర్మ మనిపించుకొనును అది యేదంటేని వాచ్యార్థమాత్రమైన ధాతుధర్మమే

ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయో క్రియాణాం స్యాత్ – 8

ఈసూత్ర వ్యాఖ్యానంలో కను విను ప్రోవు – ఇటువంటిది తద్ధర్మార్థము అని బాలసరస్వతి వివరించడంతో ఈ తద్ధర్మ శబ్దానికి ఒక ఆకారం ఏర్పడింది తరువాత ఆంధ్రవ్యాకరణ వాఙ్మయంలో కొంత ఆలస్యంగానైనా తద్ధర్మ శబ్దం స్థిరపడింది కొంత ఆలస్యంగా నని అనడం ఎందుకంటె బాలసరస్వతికి అనంతర వ్యాకర్త రెండు శతాబ్దాల తరువాత కూడ చింతామణి ఫక్కిని గాక కేతన మార్గాన్నే ఆశ్రయించి వ్యాకరణ రచనకు పూనుకున్నాడు[3]

---

ఈ పదం త్రిలింగశబ్దానుశాసనంలో 8వ కాండిక 0వ సూత్రంలో ప్రయుక్తమయినది గాని దాని నిర్వచనం లేదు పైగా త్రిలింగశబ్దానుశాసన కాలకర్తృత్వాలు సందిగ్ధాలు కాబట్టి చింతామణే ఈ పదాన్ని మొదట కల్పించిన దని అనుకోవచ్చు

2 ఈ నిర్వచనం తద్ధర్మార్థక పద నిర్వచనావసర మున్న సూత్రాల్లో కాక 6వ సూత్రవ్యాఖ్యలో ఈయబడింది

3 చూ అనంతరవ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం అనే ప్రకరణం

క్రియాపదాల రూపనిర్మాణ ప్రక్రియ చూపడం బాలసరస్వతి వ్యాఖ్యలో ప్రధానాంశం అజంత పరిచ్ఛేదారంభంలో సుబంతశబ్ద నిష్పత్తిని సోదాహరణంగా ససూత్రంగా చేసి చూపినట్లే ఇక్కడ గూడ తిజంత శబ్దాల్ని సూత్రపరింపరితో సాధించి ప్రకియను ప్రదర్శించాడు అతడు చూపిన ప్రక్రియ లేకపోతే చదువరి కేవల చింతామణి సూత్ర పఠనంతో ఏ క్రియాపదాన్ని నిస్సందేహంగా తెలిసికోలేడు

ఒక సూత్రంలో భూతతద్ధర్మార్థక క్రియల ప్రథమైకవచన లోపం చెప్పి (క్రియా– ౯) మరొక సూత్రంతో భూతర్థక ప్రథమైక వచనానికి ఎత్వ విధానం చేస్తాడు (క్రియా–౩౦) అక్కడ లోప మేమిటి ఇక్కడ ఎత్వాదేశ మేమిటి? అని చదువరి సందేహంలో పడతాడు బాలసరస్వతిమాత్రం అలాంటి సందేహాల జోలికి పోకుండ లోపవిధానం చేసినచోట ఘటియించె అనే రూపాన్నీ ఎత్వవిధానం చేసినచోట ఘటించె అనే రూపాన్ని ఇచ్చి ఊరుకుంటాడు

చింతామణి ఫక్కిలో బాలసరస్వతి వాక్యానికె ఏకాధికారం కాబట్టి అతనికి రాని ముఖ్యసందేహాలు ఇతర వ్యాఖ్యాతలకి సామాన్యంగా రావు కాబట్టి అహోబలపతి ఆ సూత్రాలకి బాలసరస్వతి ధోరణిలోనే వ్యాఖ్యానం సాగించాడు

ఈ పరిచ్ఛేదంలో బాలసరస్వతీయ వ్యాఖ్యాముద్ర అప్రతిహతంగా పడిన సూత్రాలు రెండున్నాయి (క్రియా 2) అవి ఈ గ్రంథంలో బహుధా విమృష్టపూర్వాలు

చింతామణి సూత్రాల్లో ఆది శబ్దం కొన్నిచోట్ల సార్థకంగా ప్రయోగించబడలేదు-అనవచ్చు నిదర్శనంగా అజంత పరిచ్ఛేదంలోని 53వ సూత్రాన్ని చూపవచ్చు చాలచోట్ల ఆదిశబ్దాలు స్వయంస్ఫూర్తిని కోల్పోయి వివరిస్తేతప్ప తెలియవు ఉదాహరణంగా ఈ పరిచ్ఛేదంలోని వ్యతిరేకావౌ భావినివాత్స్యాత్ - 6 అనే సూత్రాన్ని చూపవచ్చు దీనిలో ధాతువుం వ్యతిరేకార్థంలో భావ్యర్థంలో

---

చూ సూత్రకర్తే వివరిస్తేగాని తెలియని సూత్రాలు

అత్వం విహితమైంది వ్యతిరేక పదానికి ఆదిశబ్దం అతికి మరొకచోట గూడ అత్వం రావచ్చు నని సూత్రం చెపుతున్నది కాని ఆచోటు ఏది? తెలియా లంటే బాలసరస్వతీయ వ్యాఖ్యే శరణ్యం ఆదిశబ్దం చేత ఘటియింపఁబడును ఘటియింపలేఁడు - అని కర్మార్థముల యందును నౌను అని ఆశబ్ద సార్థక్యం వివరించబడింది అనంతర వ్యాఖ్యాతలందరూ ఆవివరణను పాటించారు

ఆత్మనేపదం

చోరాత్మనే పదార్థే గృహ్ణాతా వాగమస్య వేత్వంస్యాత్ — 38

ఇది తెలుగు క్రియల్లో గూడ ఆత్మనేపదాల్ని[1] నిర్మించే సూత్రం సంస్కృతంలో ఆత్మనేపద ధాతువులకి చేరే ప్రత్యయాలు గూడ వేరు తెలుగులో అలాటిదేమీ లేదు కేవలం సామాన్య ధాతువుకి కొను ధాతువును సంధిస్తే ఆత్మనేపద మవుతుందని చింతామణి చెప్పింది ఘటించు + కొను ఘటించికొను ప్రస్తుత సూత్రం కొను ధాతువు పరమైనపుడు పూర్వముండే చు వర్ణం చి వర్ణంగా వికల్పంగా మారుతుందని చెపుతున్నది ఇక్కడ బాలసరస్వతి క్రియా ఫలము కర్తృగామియైన క్రియ గనుక నాత్మనేపదము కొని యనునది గ్రహిధాత్వర్థము అని సూత్రాభిప్రాయాన్ని సరిగా వ్యక్తం చేశాడు భవిష్యత్ కాలంలో బాల వ్యాకర్త ఈ బాలసరస్వతి వాక్యాన్నే సూత్రంగా మార్చాడు (బాలవ్యా క్రియా 62) అహోబలపత్యాదులు గూడ బాలసరస్వతికి అనుయాయులే

చింతామణిలో క్రియాపరిచ్ఛేదప్రారంభం సంస్కృత ధాతువుల ఆంధ్రీకరణ విధానంతో జరిగింది ఆ ధోరణిలోనే చివరి వరకు రచన సాగింది ఈపరిచ్ఛేదంలో విధించిన ఇంముగాగమం తద్ధర్మ వర్తమాన అతీత ఆగామ్యర్థాల్లో విధించబడ్డ వివిధ ప్రత్యయాలు అనుబంధాలు ఆగమాలు యథార్థానికి తత్సమ తద్భవ దేశ్య ధాతువులు మూడింటికీ అన్వయించవలసినవే అయినా చింతామణి రచనా ప్రణాళికలోని లోపంవల్ల అవి కేవలం తత్సమధాతువులకె ఉద్దిష్టమైనట్లు కనబడుతుంది చింతామణి కర్త ఆవిషయం పరిచ్ఛేదం చివరకు చేరిన తరువాతగాని గమనించ లేదు

---

1. సంస్కృతంలో ధాతువులు మూడు తెగలు 1 పరస్మై 2 ఆత్మనే 3 ఉభయ పదులు

తత్సమాలలో దేశ్యక్రియలు గతార్థం

గమనించిన వెంటనే అత్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానా చ - 48 వర్ణాగమో విశేష పురుషేష్వర్థేషు చాప వచనేషు -49 అని సూత్రిం చాడు తత్సమాలకు విధించబడ్డ అత్వాదులు దేశ్యక్రియలకు గూడ అన్వయిస్తా యని పైతొలి సూత్రార్థం ఆది శబ్దంతో ఎత్వం మొదలయినవి గూడ స్వీకరిం చాలని బాలసరస్వతి వ్యాఖ్యానం ఆ ఆది (మొదలయిన) శబ్దానికి ఈ పరిచ్ఛేదంలో ఇంతవరకు విహితమైన సర్వకార్యాలూ అని అర్థం కాబట్టే చేయంబడు చేయఁ గలఁడు పిలిచె కొలిచె అని వివిధ దేశ్యక్రియల్ని బాలసరస్వతి ఉదాహరించాడు తరువాత సూత్రానికి ఆయా పురుషల్లో ఆయా అర్థాల్లో ఆయా వచనాల్లో వర్ణాలు ఆగమంగా రావడం తత్సమాది క్రియలకంటె విశేషం అని అర్థం ఇది బహు విశాలమైన అవధులు గల సూత్రం దేన్నైనా సాధిస్తుంది దేన్నీ ఖచ్చితంగా సాధించలేదు కాబట్టే డాక్టర్ చిలుకూరి నారాయణరావు చింతామణిని బట్టి ఏదేశ్య క్రియారూపమూ నిర్మించడానికి అవకాశమే లేదని సాధికారికంగా చెప్పారు (ఆంధ్ర భాషాచరిత్ర—చింతామణి వ్యాదయం) ఆ లోపం చింతమణి రచనా ప్రణాళికలో ఉంది కాబట్టి తత్కర్త చివరి శ్లోకి యొక్కదానితో దేశ్యక్రియల లక్షణ సర్వస్వం సూత్రించ దు కాని ఆ రెండు సూత్రాలతో దేశ్యక్రియాపద ప్రక్రియను చూప యూనడం చాల హాస్యాస్పదమైన పని

బాలసరస్వతీయ వ్యాఖ్యలో క్రియాపరిచ్ఛేదంలో మాత్రం అథర్వణకారికలు అక్కడక్కడ ఉదంకించబడి ఉన్నాయి తమవద్ద ఉన్న తాళపత్ర ప్రతి అయిన బాలసరస్వతీయ వ్యాఖ్యలో ఎక్కడా ఆకారికలే లేవని కవితరంగిణీ కారులు వ్రాశారు (6వ సంపుటం 72వ పుట) ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రితమైన బాల సరస్వతీయ పరికిలో తమవద్ద ఉన్న నెం 4095 ప్రతిలో అథర్వణకారికలు లేవని ముద్రాపకులు చెప్పారు కాబట్టి బాలసరస్వతీయంలో కనిపించే కారికలు బాలసరస్వతి కరలిఖితాలని అనడానికి వీలేలేదు అవి అనంతర కాలిక లేఖకుల అహోబల పండితీయం ప్రసిద్ధమైన తరువాత దానిలోనివి ఎరి కూర్చినవే అని చెప్పవచ్చు కొన్ని ప్రతుల్లో అసలు కారికలే లేకపోవడాన్నిబట్టి స్వత ఉన్నవాటిని లేఖకులు

తీసివేయడం జరగదు కాబట్టి లేనివాటిని జొనపడం జరుగవచ్చు కాబట్టి కొన్ని ప్రతుల్లో కనిపించే కారికలు లేఖకులవే అని నిర్ణయించవచ్చు పైగా వాసుదేవ వృత్తిలో ఒక్క అధర్వణ కారిక గూడ లేకపోవడం అది బాలసరస్వతికి అప్పకవికి అనంతరం వ్రాయబడడం గమనిస్తే పై నిర్ణయాన్ని నిరభ్యంతరంగా నిరాక్షేపంగా అంగీకరించవచ్చు

## ఫలితార్థం

పై పరిశీలనం వలన బాలసరస్వతీయ వ్యాఖ్య చింతామణి వ్యాప్తికి చాల ప్రధానహేతు వని ఆ వ్యాఖ్య లేకుండ చింతామణి అభిప్రాయాలు అన్యులకు అర్థం కావడానికి వీలులేదనీ గ్రహించాం అనంతర వ్యాఖ్యానాలన్నీ బాలసరస్వతికి చాలవరకు ప్రతిధ్వనులే అనీ కొన్నికొన్ని సందర్భాలలో మాత్రం అవి బాలసరస్వతి ఏర్పరచినధోరణికి లోబడి నూతనాంశాల వివరణకు యత్నించాయనీ తెలిసికొన్నాం

## అప్పకవీయం

అప్పకవీయ మనేపేరు కర్తనుబట్టి కలిగింది దీన్ని అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి అనీ నన్నయభట్టీకి తెలుగుసేత అనీ వ్యవహరించాడు—చాలచోట్ల నన్నయభట్టు వ్రాసిన దనుకొని చింతామణిని అప్పకవి నన్నయభట్టీయ మన్నాడు[2] బాలసరస్వతి వ్యాఖ్య బాలసరస్వతీయమైంది అదేవిధంగా అప్పకవి వ్యాఖ్య అప్పకవీయమైంది తరువాత అహోబలపతి తన చింతామణి వ్యాఖ్యకు ప్రత్యేకంగా కవిశిరోభూషణ మని నామకరణం చేసినా దాన్ని లోకం అహోబలపండితీయ మనే పిలిచింది దీన్నిబట్టి కర్తలపేర్లతో కృతుల్ని పిలవడం మనవారికి అలవాటైనట్లు తెలిసికోవచ్చు ఇలా కృతుల్ని కర్తలపేర వ్యవహరించడం సంస్కృతాంగ్లాల్లో గూడ ప్రసిద్ధమైన విషయమే గదా

అప్పకవి చింతామణిని వ్యాఖ్యానించడం చాలక్లిష్టమైన పనిగా భావించాడు[3] ఆ క్లేశానికి కారణం గూడ అతడు సరిగా వివరించాడు

---

అప్ప అశ్వాసాంత గద్యలు పీఠిక 40 4 53 88 92
2 పైది పీఠిక 65
3 పైది పీఠిక 4 53 నుండి 6 వరకు

శబ్దశాసనుండు సంస్కృతగ్రంథంబు గానఁ దెలుఁగుమాట గలయరామి
లక్షణంబె కాని లక్ష్యమొక్కటియును బలుక కునికిఁదెలియఁబడవు కొన్ని

(ఎరిక—55)

చింతామణి అంటే అప్పకవి కున్న భక్తిప్రపత్తులు గమనించదగ్గవి భూత భవిష్యద్వర్తమాన కాలాలు—మూటిలోను వెల్వడే వాఙ్మయమంతా చింతామణి సూత్రబద్ధం కావలసినదేనట[1] బహుశ ఈ దృక్పథాన్నే అహోబలపతి గూడ స్వీకరించి ఉంటాడు కాబట్టే అతడు అప్పకవి కంటె ఎక్కువగా ప్రాచీనుల వ్రాతల్లో తప్పులు చింతామణి సూత్రాల ప్రకారం పట్టి చూపాడు

బాలసరస్వతి లాగానే అప్పకవి గూడ ఈవ్యాఖ్యా రచనతో పుణ్యం యశస్సు స్వర్గమూ లభిస్తాయని భావించాడు[2]

చింతామణి లాభాన్ని ఒక కథగా లోకప్రసిద్ధం చేసినవాడు అప్పకవే బాలసరస్వతి తన ఇష్టదైవతమే ఎద్దుని రూపంలో ఆంధ్రశబ్దచింతామణి ఫక్కిని అందించినట్లు మాత్రం చెబితే ఆమాటకు చిలవలుపలవలు సృష్టించి రాజరాజ నరేంద్రుని సారంగధరుని రంగంలోనికి దించాడు పైగా ఆ కథంతా తన ఇష్ట దైవతం ముఖత (కలలోనే అయినా) చెప్పించాడు[3]

అప్పకవికి కూడ చింతామణి మతంగాచల విప్రునివల్లే లభించింది (బాల సరస్వతికి మతంగాచల ఎద్దునివల్ల లభించిన విషయం మనకు తెలుసు) అది లభించిన తేది శాలివాహనశకం 578వ సంవత్సరంలో (మన్మథనామ సంవత్సరం) శ్రావణమాసంలో బహుళపక్షంలో నవమి[4] అంటే క్రీ శ 656 ఆగష్టు 4 ఈ గ్రాంథాన్ని తాను మతంగాచల విప్రుని నుండి వ్రాసికొన్నట్లు అప్పకవి

---

అప్ప ఎరిక 58

2 అప్ప ఎరిక 6

3 అప్ప ఎరిక 39 నుండి 62

4 కల అష్టమినాడు గాబట్టి మరునాడు నవమి—గ్రంథం లభించిన రోజు

చెప్పాడు[1] తన వ్యాఖ్యానానికి బాలసరస్వతీయ మాధార గ్రంథ మనిగూడ చెప్పాడు[2]

అప్పకవి తనకు దొరికిన చింతామణిలో 82 ఆర్యలే ఉన్నాయన్నాడు[3] కాని బాలసరస్వతీయ చింతామణిలో 88 ఆర్యలు నేడూ కనిపిస్తున్నాయి అహోబలపతినాడు గూడ దానిలో 88 ఆర్యలే ఉన్నాయి అప్పకవి మాటనే అహోబలపతి తన ఎరికలో సంస్కృతీకరించి చెప్పాడు బాలసరస్వతికి చింతామణి దొరికిన తేదీ అతడు (బాలసరస్వతి) చెప్పలేదు అతని వ్యాఖ్యాన ప్రారంభానికి గూడ ముహూర్తం మనకు తెలియదు కాని అప్పకవి తన సహోజధారణిలో బాలసరస్వతికి చింతామణి కీలకనామ సంవత్సరంలో దొరికినట్లు చెప్పాడు[4] తనకేమో మన్మథనామ సంవత్సరంలో దొరికిందట అంటే బాలసరస్వతికి క్రీ శ ۱۶۰0లో చింతామణి లభిస్తే అప్పకవికి 1656లో లభించినదన్నమాట మధ్యకాలం 46 సంవత్సరాలు ఈ స్వల్పకాలంలో చింతామణికి ఏర్పడినవి రెండే ప్రతులు మొదటి ప్రతిని వ్యాఖ్యా సహితంగా తాను చూచినట్లు అప్పకవి చెపుతున్నాడు అయినా రెంటిలో చాలభేదం మనకి కనిపిస్తుంది మన కాలానికి కాదు అప్పకవికి దగ్గరి కాలంలోనివాడైన అహోబలపతికి కూడా ఆ రెండు పుస్తకాల్లో చాల పాఠభేదాలు కనిపించినాయి[5] ఇది విచిత్రమయిన పరిస్థితే ఆ వైచిత్రిని ప్రకరణాంతరంలో పరిశీలించడం జరిగింది కాబట్టి ఇక అప్పకవీయ వాఖ్యానాన్ని పరిశీలిద్దాం

అప్పకవి చింతామణిలో సంజ్ఞా సంధి తత్సమ దేశ్య క్రియాపరిచ్ఛేదాలున్నట్లు చెప్పాడు కాని బాలసరస్వతీయం ద్వారా లోకానికి తెలిసిన చింతామణిలో తత్సమ దేశ్య పరిచ్ఛేదాల స్థానంలో అజంత హలంత పరిచ్ఛేదాలు కనుపిస్తు

---

1 అప్ప ఎరిక 8

2 పైది 96

3 పైది 52

4 అప్ప ఎరిక 50

5 అహోబలపండి ఎరిక 72

6 చూ చింతామణి పాఠభేదాలు

న్నాయి అప్పకవి అబద్ధం చెప్పాడా? లేక అప్పకవినాటికున్న తత్సమ దేశ్య పరిచ్ఛేదాలు నామాంతరం పొందాయా నేటికి? లేక భ్రష్టమైనాయా? భ్రష్టంకావడం జరిగి ఉండదు పరిచ్ఛేదాలైదూ ఉన్నాయి కాబట్టి పేరుమార్పు జరిగి ఉండాలి అజంత పరిచ్ఛేదాన్ని తత్సమ మనవచ్చు కాని హలంత పరిచ్ఛేదాన్ని దేశ్య మనలేం హలంత పరిచ్ఛేదంలోని కొంత భాగాన్ని గూడ తత్సమ పరిచ్ఛేదంగా మారిస్తే ప్రమాదం లేదు ముఖ్యంగా నా నీ పదప్రక్రియను ప్రదర్శించే సూత్రం నుండి ( 4వ సూత్రం) దేశ్యశబ్ద ప్రక్రియ ప్రస్తుత చింతామణిలోని హలంత పరిచ్ఛేదంలో కనుపిస్తున్నది కాబట్టి అప్పకవీయ చింతామణిలోని సూత్రాల ఏర్పాటు ప్రస్తుత బాలసరస్వతీయంలో వలెగాక భిన్నంగా ఉండి ఉన్నట్లు భావించాలి

అప్పకవీయ చింతామణి సంజ్ఞా సంధి పరిచ్ఛేదాలవరకే అనూదితమై ఉంది అప్పకవీయ రూపంలో మిగిలిన పరిచ్ఛేదాలు ఎలా ఉన్నాయో అనువదించ బడ్డాయో లేదో తెలియదు అయితే అప్పకవి చింతామణిని సంధి పరిచ్ఛేదం వరకే తెనిగించి ఉంటాడని ఆపైన తెనిగింపు జరగలేదని శ్రీగిడుగు వెంకటసీతాపతిగారు అప్పకవీయ పీఠికలో అన్నారు[1] కారణంగా చతుర్థాశ్వాసంలో గర్భకవిత్వాన్ని ఎక్కడెక్కడ నిక్షేపించినదీ ఎక్కడెక్కడ నిక్షేపించబోతున్నదీ అప్పకవి తెలిపిన సందర్భాన్ని చూపారు అందులో భాషాపరిచ్ఛేదం మొదలు సంధి పరిచ్ఛేదం వరకే సూత్రాల ఉటంకింపుజరిగింది గాని మిగిలిన తత్సమ దేశ్యక్రియాపరిచ్ఛేదాల ప్రసక్తిలేదు వాటినిగూడ వ్యాఖ్యానింప దలిస్తే ఉటంకించి ఉండేవాడే గదా కాగా చతుర్థాశ్వాసం వ్రాసేనాటికి సంధి పరిచ్ఛేదం వరకే అప్పకవి రచనా ప్రణాళిక ఏర్పడి ఉందని వారు నిర్ణయించారు

అప్పకవీయం చాల ప్రసిద్ధమైన ఛందశ్శాస్త్రం దానిలో మరికొన్ని పరిచ్ఛేదా లుంటే ఒక ప్రతిలో కాకపోయినా మరొక ప్రతిలో తప్పక కనిపించాలి కాని ఏ ప్రతిలోను సంధిపరిచ్ఛేదం పైన ఇతర పరిచ్ఛేదాలు కనబడటం లేదు కాగా అప్పకవీయం 5 ఆశ్వాసాల గ్రంథంగానే రచించబడి నిలిచిపోయిన దని నిర్ణ యించవచ్చు

---

పీఠిక 2వ పుట (వావిళ్ల 962)

అప్పకవీయ రచనా ప్రణాళిక చాల వి స్తృతమైనది అతడు 5 పరిచ్ఛేదాల చింతామణిని తాను తిరిగి 8 పరిచ్ఛేదాలుగా వింగడించి ఒక్కొక్క పరిచ్ఛేదాన్ని ఒక్కొక్క ఆశ్వాసంగా వ్రాయదలచాడు అతని విభాగ క్రమమిది : భాషా 2 వర్ణ 3 వశిప్రాస 4 పద్య 5 సంధి 6 తత్సమ 7 దేశ్య 8 క్రియా పరిచ్ఛేదాలు

అప్పకవి తన వ్యాఖ్యానాన్ని మహావి స్తృతమైన పరిధిలో కొనసాగించినా దాని కాధారం మాత్రం బాలసరస్వతీయమే అని స్వయంగా చెప్పాడు[1]

అప్పకవి ఆంధ్రశబ్దచింతామణిని తెలుగుచేస్తున్నా అతనిపై తన పూర్వులు దేశీయ మార్గంలో వ్రాసిన లక్షణ గ్రంథాల పరనం వల్ల కలిగిన సంస్కారం పుష్కలంగా ఉంది[2] ఆ సంస్కారానికితోడు అతడు—

ఇది చదివిన పిమ్మట మఱి యెదియేనియుఁ జదువుబుద్ధి యేలా వాదమున్
పదపడి గ్రంథము లన్నియు వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్
పర్వతము లెల్ల నొక్కదర్పణము నందుఁ జూపడు తెలుంగునను
గవితోపయోగ
లక్షణము లన్నియును సరళంబుగాఁగ నెఱుగఁబడునిందుఁ దెలియ
నూహించిరేని (అప్ప —7 8)

అని ఒక బృహల్లక్ష్యంతో గ్రంథరచనకు దిగినవాడు కాబట్టే చింతామణిని ఒక మిషగా పెట్టుకొని వందల పద్యాలు అల్లాడు అతడు పేర్కొన్న చింతామణి శ్లోక సంఖ్య ఆశ్వాసాల వరుసలో —

ప్రథమాశ్వాసంలో 6 ద్వితీయాశ్వాసంలో 20 తృతీయాశ్వాసంలో చతుర్థాశ్వాసంలో 5 పంచమాశ్వాసంలో 8 కాని వీటిలో పునరుక్తు లున్నాయి

---

1 అప్ప పీఠిక 96

2 అప్ప —5

ద్వితీయాశ్వాసంలోని 20 శ్లోకాల్లో తృతీయ చతుర్థాశ్వాసాలలో చెప్పిన 6 శ్లోకాలు కలిశాయి కాగా పై 50 శ్లోకాల్లో ఆ 6 తీసేస్తే 44 శ్లోకాలే అప్పకవి తెనిగించాడు అతని చింతామణిలోని మిగిలిన 38 ఆర్యలు మనకు దొరకలేదు ఈ 44 లోనే బాలసరస్వతీయంతో భేదించేవి చాల ఉన్నాయి[1] అవిగూడ దొరికి ఉంటే ఆ భేదం మరీ విస్తృతమై ఉండేదని మనం భావించాలి ఈ 44 శ్లోకాల్ని[2] తెనిగిస్తానంటూ 8 0 పద్యాలు షుమారుగా వ్రాశాడు ఈ పద్యాల్లో అతడు 73 ఇతర గ్రంథాల నుండి ఉదాహరించిన పద్యాలు దాదాపు 340 ఉన్నాయి ఈ అంశాలు పరిశీలించి నపుడు అప్పకవి ఒక పరిశోధకునివలె కనిపిస్తాడు అప్పకవి చేసిన ఈ విపుల వ్యాఖ్యానాన్ని చూచే అహోబలపతి ప్రేరితుడై తానుగూడ విపులతరమైన వ్యాఖ్యా నాన్ని చేయాలని సంకల్పించి ఉంటాడు అయితే అప్పకవి ఛందశ్శాస్త్రాన్ని మొత్తాన్ని తన ప్రణాళికలో యిరికించడం వలన అప్పకవీయం చింతామణిలోని సంధిపరిచ్ఛేదం ముగిసేసరికే 800 పద్యాల రచనగా రూపొందింది ఇదే ధోరణిలో అప్పకవి మిగిలిన పరిచ్ఛేదాలు మూడిటిని గూడ తెనిగించి ఉంటే అప్పకవీయం ఆంధ్రవాఙ్మయంలో ఛందోవ్యాకరణాలపై ఒక పెద్ద నిధిగా అవతరించి ఉండేది

ఇపుడు అప్పకవీయానికి లోకంలో ఛందోగ్రంథంగానే గుర్తింపుగాని వ్యాకర ణంగా కాదు అయినా దానిలో అహోబలపతివ్యాఖ్యానంలోని వికృతి వివేకం లోనివిగా పేర్కొనబడ్డ కారికలు ఎన్నింటికో మూలపాఠా లున్నాయి[3]

ఒక చిన్న పదాన్ని వాక్యాన్ని తీసికొని దానిమీద దీర్ఘమైన సుదీర్ఘమైన వివరణం ఒసగడమనే విధానాన్ని అప్పకవే చింతామణి వ్యాఖ్యాన శైలిలో ప్రవేశ పెట్టాడు—ప్రథమంగా ఈ ధోరణి కొంత బాలసరస్వతిలో గూడ మొదటి సూత్రాల వ్యాఖ్యానంలో కనబడుతుంది కాని తరువాత తరువాత అది క్షీణించి లోపించింది దాన్ని స్వీకరించి వృద్ధిచేసినవా డప్పకవి అప్పకవిని అనుకరించినవాడు అహో బలపతి

---

1 చూ చింతమణి పాఠభేదాలు

2 అప్పకవి 50 శ్లోకాల్ని తెనిగించినట్లు అప్పకవీయ సమీక్షకారులు వ్రాయడం సరికాదు వావిళ్ల 962

3 చూ కారికల మూలపాఠాలు

బాలసరస్వతి వ్యాఖ్యానంలోని విషయసర్వస్వాన్ని గ్రహించి తరువాత తాను కొంత అధికంగా చేర్చి వ్యాఖ్య చెయ్యడం అప్పకవి పద్ధతి

సంజ్ఞాపరిచ్ఛేదంలో

విశ్వశ్రేయ కావ్యమ్ —

దీని వ్యాఖ్యానాన్ని 8 పద్యాల్లో చేశాడు మొదటి మూడు పద్యాల్లోను బాలసరస్వతి వ్యాఖ్యానాన్నిపొదిగి (తరువాత 6వ పద్యం గూడ బాలసరస్వతి వ్యాఖ్యా నంలోని శ్లోకానువాదమే) తరువాత తానుగా కొంత వ్యాఖ్య అల్లాడు సప్తసంతా నాల్లో కావ్యంతప్ప మిగిలినవన్నీ శిలాలౌతాయని భోజుడు చంపూరామాయణాన్ని చేశాడట సప్తసంతానాల్లో కావ్యం తప్ప మిగిలిన ఆరూ నిలిచినచోటే ఉంటా యనీ కావ్యమంటె దశదిశా వ్యాప్తమౌతుందనీ చెప్పాడు కావ్యంలో ఎవనిపేరు ఎన్నిదినాలు నిలిస్తే అతడు అన్నిదినాలు స్వర్గసుఖా లనుభవిస్తాడట వాల్మీకీ మయూరుడూ శ్రీహర్షుడూ కావ్యరచనతో పొందిన లాభాలు వివరించాడు పురాణ కావ్యాల్లో పేర్కొనబడ్డవారు తప్ప ఈనాల్గు యుగాల్లో ఈ ఏడు ద్వీపాల్లో ఎందరో మానవులు పుట్టిగిట్టినా వారి ఉనికి మనకు తెలియదన్నాడు రామాయణంలో వాల్మీకి చెప్పడంవలన నేడు మన మందరం కోతులు సేతువు నిర్మించినట్లు తెలిసి కొన్నామే గాని లేకుంటే అది (సేతువు) ఒక సోగదీవి అనమా అని ప్రశ్నిం చాడు ఇలా సాగిందా వాఖ్యానం

తరువాత కావ్యభేదాలని ఉపశీర్షిక పెట్టి వర్ణం పదం వాక్యం అర్థం భావం రసం పద్యం కావ్యం—అని క్రమ పరిణామంలో కావ్యస్వరూప మావిర్భవిస్తుందని చెప్పి తర్వాత కావ్యభేదాలు వివరించాడు ఈ వ్యాఖ్యాన ధోరణిలోనే అహోబల పతి తన వ్యాఖ్యాన పద్ధతిని మలచుకొన్నాడు చూడండి

అట్టికావ్యము ద్వివిధమై యతిశయిల్లుఁబరువడిఁబ్రబంధచాటుప్రబంధములన
సర్గముల సంస్కృతమున నా శ్వాసములను దెనుఁగునఁబ్రబంధమనునది
తనరుఁగృష్ణ (అప్ప —27)

అహోబలపతివ్యాఖ్య

తత్కావ్యం చ ద్వివిధం మహాప్రబంధ చాటుప్రబంధ భేదాత్—
(సంజ్ఞ 3వ సూత్రవ్యాఖ్యానంలో)

అప్పకవి

కనుగొన సంఖ్యాబద్ధంబు ససంఖ్యాకంబు నాఁగభువినిరుదెఱఁగై
తనరారుఁబూర్వకవిమతమున నాచాటుప్రబంధములు జలజాక్షా ( —29)

అహోబలపతి

చాటునోఽప్యద్వైవిధ్యం అసంఖ్యాక సంఖ్యాకభేదాత్ (సంజ్ఞ 3)

అప్పకవి

నాల్గుదెగల యుదాహరణములు ముక్తికాది పంచదశమును సంఖ్యాన్వితములు
గద్యరగడ ద్విపద దండకములు మంజరులును సంఖ్యారహిత చాటువులు
నృసింహ ( —30)

అహోబలపతి

తత్రోదాహరణాదీనాం ససంఖ్యాకత్వం గద్య రగడ దండక ద్విపదాదీనాం
అసంఖ్యాకత్వం (సంజ్ఞ 3)

ఈవిధంగా అప్పకవిని అహోబలపతి అనువదించినా అనుకరించినా ఆవిష యం చెప్పకపోగా పైగా అప్పకవివాఖ్యానం శుద్ధాంధ్రవాగ్గుంభిత మని పండిత కవివరులు దానివలన సంతోషించ లేరనీ అంటాడు అన్యాయంగా అయితే అప్పకవి గూడ తన పూర్వుల రచనల నుండి విషయ గ్రహణం చేసి ఆవిషయం చెప్పకుండా ఊరుకున్నవాడే[2]

---

అహోబల పరిక 76

2 చిన్నకోట పెద్దన కా మా మ లో స పవిధ కవులు

తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ —2

ఈ సూత్రాన్ని తెలుగుచేసి తరువాత శబ్దార్థ లక్షణాలంకారాల మీద 52 పంక్తుల సీసమాలికనీ శబ్దార్థదోషాలమీద 28 పంక్తుల సీసమాలికనీ అల్లాడు బహుశః గణపవరపు వెంకటపతి అప్పకవిని చూచే తన సర్వలక్షణ శిరోమణిలో సీసమాలిక అల్లటం ప్రారంభించాడేమో

తరువాత సాధ్యోహిరసో యథాతథం కవిభిః —4 అనే సూత్రాన్ని తెలుగు చేసి ఇక 1 పంచవిధభావ సీసమాలిక 23 పంక్తుల్లో 2 శృంగారరస సీసమాలిక 34 పంక్తుల్లో 3 అష్టరస సీసమాలిక 38 పంక్తుల్లో 4 నాయకనిర్ణయ సీసమాలిక 32 పంక్తుల్లో చెప్పి తిరిగి సుకవిమాహాత్మ్యాన్ని 3 పద్యాల్లోను సత్కవి లక్షణాన్ని రెండు కందాల్లోను సప్తవిధ కవుల్ని రెండు పద్యాల్లోను వర్ణించి కుకవినిరసనం 5 పద్యాల్లో కవితాప్రశంస 7 పద్యాల్లో చేసి ముగించాడు చింతామణిలోని ఒక్క సూత్రానికి ఎంత పెద్ద వ్యాఖ్యానమో అందుకనే సామాన్యంగా చూచేవారికి అప్ప కవీయం ఒక స్వతంత్ర గ్రంథం లాగ ఉంటుందే తప్ప ఆంధ్రశబ్దచింతామణికి ఆంధ్రీకరణంగా ఉండదు అప్పకవి వ్యాఖ్యాన ప్రవాహంలో ఆసూత్రాలు ఏదో మూల ఇరుక్కుపోయి వెదకితే తప్ప కనబడవు అప్పకవీయంలో అతని పూర్వ వ్యాకర్తలు కేతన విన్నకోట పెద్దన లాక్షణికులు అనంతుడు ముద్దరాజు రామన చిత్రకవి పెద్దనల లక్షణగ్రంథాల ఛాయలు విరివిగా కనిపిస్తాయి కేతన ననుసరించి తెలుగుభాషాభేదాల్లో శుద్ధాంధ్రంబులు (అచ్చతెనుగు) అన్యదేశజాంధ్రంబులు (దేశ్యము) ప్రవేశపెట్టాడు—ప్రవాహినీదేశ్యా—అనే సూత్ర వ్యాఖ్యానంలో అలాగే విన్నకోట పెద్దన్న—

స్థాయిభావంబులకుననుసారులైన తద్విభావాదులను రసత్వంబు గలుగు
బరగ వెన్నకుఁ బాకసంప్రాప్తిఁజేసి తగు ఘృతత్వంబు గలుగు
చందమున నెపుడు

(కా చూ మ 2—5)

అని చెబితే దానికి ప్రతిబింబంగా అప్పకవి—

వెన్నముద్దకుఁ బాకవిధిచే ఘృతత్వంబు దనరు తంగిని నవస్థాయిభావ
ములకు విభావప్రముఖ్య భావంబులవలన రసత్వంబు గలుగుచుండు

(అప్ప —38)

అని అంటాడు

అదేవిధంగా అనంతుని ముద్దరాజు రామనను చిత్రకవి పెద్దనను క్రింది విధంగా అనుకరించాడు

అనంతుడు—

ఏని యను పదంబుతో నాదిపదమంది సంధి నిత్యయతుల జరుగుచుండు
నెట్టిక్రూర కర్ముఁడేని సద్గతినొందు విన్ను నాత్మఁదలచెనేని కృష్ణ

(ఛందో — 03)

అప్పకవి—

ఏనియను నాంధ్రశబ్దముతో నతికిన పూర్వపదము తుది వ్రాయికి న
చ్చైనను వ్యంజన వర్ణంబైన రచింపుదురు నిత్యయతులనుచుఁగవుల్

(అప్ప 3—23)

ముద్దరాజురామన—

ఒనరఁగఁబొనరఁగ ననఁగాఁ బొనరింతు నొనర్తు ననఁగఁబొలుచుం గృతులన్
వినతులు శౌరికొనర్తున్ బొనరింతు ననేక కావ్యములు హరికనఁగన్

(కవిసం —75)

అప్పకవి—

పూనె నెగసెఁబొదవెఁబొనరెఁబొందెనటన్న పలుకులందు మొదలఁగలుగునట్టి
వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు నిలుచు వలసినవుడు నీరజాక్ష

(అప్ప 2—75)

చిత్రకవి పెద్దన—

తెలుగుల మొదళ్ళ నెయిలివి యలహల్లులు గావు స్వరము లగు వ్రాయంగన్
వాకునుత్వోత్వముల నవి వ్రాయరాదు (లక్షణసారం 3–6 8)

అప్పకవి—

పద్యాదిప్రాణంబుల నాద్యంతాంతస్థములుగ నజ్ఞులు కృతులన్
జ ద్యహర వ్రాయుదురు తము విద్యాధికులెల్లఁ జూచి వికవిక నవ్వన్
(అప్ప 2–43)

ఈవిధంగా అప్పకవీయ వ్యాఖ్యానంలో దేశీయతా వాసనలు మెండు అడుగడుగున అతని పూర్వులవ్రాతల ప్రతిబింబాలు ఛాయలు గాఢంగా సరళంగా అప్పకవి వ్రాతలో కనుపిస్తుంటాయి ఇది అతని ప్రత్యేకతగా పేర్కొనవచ్చు ఇక బాలసరస్వతీయ వ్యాఖ్యకు భిన్నంగా గాని అధికంగాగాని అతని వ్యాఖ్యాన మెక్కడైనా కొత్తవిషయాల్ని తడిమితే వాటిని పరిశీలిస్తూ అతని వ్యాఖ్యానాన్ని దిఙ్మాత్రంగా పరిశీలిద్దాం

కేవలతయాను సర్వత్యభేచ యేయం యథాతథం భాషా —

దీని వ్యాఖ్యానంలో అప్పకవి తద్భవాల జాబితా నొకదాన్ని సీసపద్యంలో ఇచ్చాడు దీని ప్రాముఖ్యం గుర్తించిన అహోబలపతి దాన్ని యథాతథంగా తన వ్యాఖ్యలో ఉటంకించాడు

కుక్కగోలెంబోలి కూళగుండము కంతి గుజ్జుకరాటంబు గజికట్టె
సికచేఁత చిక్కంబు చిన్నెసింగము సెజ్జ లక్క లచ్చన సుద్ది లయ్య లాగు
ప్రోడ బొత్తము బోఁక పుడమి బన్నము బూది బీరంబు బికిరంబు
పిట్టుపుటము
వదినె వెన్నుఁడు వంక వడుగు వీడెము వన్నె రక్కసి రవణంబు రిక్కపగ్గె
పేఁట దయ్యము తోరంబు పెట్టె మట్టి బత్తి జతనంబు జాతర ముత్తియంబు
దాది కుప్పస మిటికె నిద్దంబు పెరిమె యివము దెస దిగ్గి యనఁగఁ
దద్భవములయ్యె (అప్ప —98)

దీనికి తెలివిడి గూడ సంస్కృతంలో స్పష్టంగా ఇచ్చాడు-అహోబలపతి తనవ్యాఖ్యలో

విరళాన్ పేచోషాదిక శబ్దాన్ (సంజ్ఞా 43) ఇత్యాది సూత్ర వాఖ్యానంలో అప్పకవి విచిత్రప్రతిపాదన మొకటి కొత్తగా చేశాడు కనియె అనవలసినచోట వాగను శాసనులు కివెనని గ్రామ్యంగా ప్రయోగించారట అది సాధనం చేసికొని (ఆదర్శంగా భావించి) ఆంధ్రకవితా ఎతామహుడు (కాదు రాయలు) కొనె అని ప్రయోగించాడట అప్పకవినాటికి తెలుగు వ్యాకరణ స్వరూపాన్ని గుర్తించడంలో లాక్షణికులు ఎంత శైశవావస్థలో ఉన్నారో దీన్నిబట్టి తెలిసికోవచ్చు

అనంతరం ద్వితీయాశ్వాసంలో అంటే అప్పకవీయంలోని వర్ణపరిచ్ఛేదంలో ప్రవేశిస్తాం దీనిలో వర్ణసంజ్ఞలు వర్ణోత్పత్తిస్థానం కావ్యాదిలో స్వీకరించవలసిన వర్ణాలు వర్ణద్వయయోగ ఫలం-ఇలా వర్ణాలమీద పెద్ద రచన చేయబడింది అప్ప కవి వ్యాఖ్యానంలో ప్రత్యేకాంశం తెలుగు లిప్యుద్ధరణ క్రమాన్ని నిరూపించడం అతని చింతామణిలో ఆ క్రమాన్ని తెలిపే ఆర్యలు మూడున్నాయి ఆ మూటిని వివరిస్తూ అప్పకవి ఒక తెలుగు లిపిని ప్రతిపాదించాడు కొత్తగా

బాలేందు పరిధి శృంగావర్త కుశగ్రంథి దాత్ర వరిశుసమా
ఆద్యా ఇభకరితుల్యా స్తదీర్ఘా ఖ్యాల సన్నిభావన్యా
దరశార్జ్గ పిప్పలదళాంకుశ పన్నగ సన్నిభా క్రమాత్ పరుషా
స్సంఘవిరేఖాతిక్తైః స్సఏవ వర్గ ద్వితీయ వర్ణాద్యా
కీరతరిహస్తి మస్తక శుక్తి తులాసన వితర్ది సీరసమా
అంతస్థాశ్శోష్మాణో దంత్యచజౌ గురులలౌ చ బిందుయుతౌ -

కాని లిపి శాస్త్రజ్ఞులలో ఎటక్కరూ దానిని ఏకాలానికి చెందిన లిపిగానైనా అంగీకరించడం లేదు ఒక్క వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు మాత్రం వాటిని

---

ఆముక్తమాల్యదకు కర్తి ఆంధ్రకవితా ఎతామహుడు (పెద్దన) అని అప్పకవి ఊహ

2 వీటి అర్థవివరణం చిం విష శో శో లో చూడవచ్చు

నన్నయనాటి లిపిని సంస్కరించేవిగా వ్యాఖ్యానించారు1 ప్రాజ్ఞన్నయ నన్నయ యుగ శాసనాలతో శాసన లిపితో ఎంతో పరిచయమున్న డా చిలుకూరి నారాయణ రావుగారు ఈ లిప్యుద్ధారక శ్లోకాలమీద వ్యాఖ్యానిస్తూ వాటిద్వారా చింతామణి కాలాన్ని నిర్ణయించదలచడం హాస్యాస్పదమన్నారు కారణాలుగా వాటిలో గజడదబణ నమ ల ఆకారం వర్ణించబడలేదు 2 అచ్చుల దీర్ఘాలు ఏనుగు తొండాలవలె ఉండటం అకారేతర స్వరాలకి బొ త్తిగా అన్వయించదు 3 ఖఛరథఫల క్రింద ఒత్తుండటం ఆ ఒత్తు సంభాకారంతో ఉండటం వ శతాబ్దిలో కాదు 9వ శతాబ్దిలో గూడ లేదు 4 దంత్య చజలు బొట్టుతో ఉండటం ఎక్కడాలేదు పైగా ఆబొట్టుకి స్థాన నిర్దేశం జరగలేదు—పైనా? క్రిందా? ప్రక్కనా ముందా? వెనకా? 5 నన్నయ స్వయంగా చెక్కించిన నందంపూడి శాసనంలో ఈ లిపి లక్షణాలు లేవు పసిపిల్లలు ఆకాశంలో వెళ్లేమేఘాల్ని చూసి ఎనుగు గుఱ్ఱం అని అడుకున్నట్లుగా చూడ దలచినా నందంపూడి శాసనంలో ఈ లిపి పోలికలు కనబడవు—అని వివరించారు

శ్రీ జయంతి రామయ్య పంతులు ప్రకటించిన నందంపూడి శాసన ప్రతి బింబంలో2 ఎక్కడా ఈ చింతామణిలోని లిపి కనబడదు దానిలో గజడదబ లున్నాయి శకటరేఫ ఉందిగాని చింతామణి లిపిలో వలె గాదు చుక్కలేదు సరిగదా అది నేటి శకటరేఫకు ఈషద్భిన్నంగా మాత్రమే ఉంది ప్రసిద్ధ పరిశో ధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ విజ్ఞానసర్వస్వంలో వ్రాసిన లిపి పరిణామ వ్యాసంలో యీ చింతామణి శ్లోకాల్ని స్పృశింపక పోవడం గమనించదగ్గ విశేషం ఏపాటి సందర్భం కుదిరినా వారు వాటిని పరామర్శించి ఉండేవారే

అనంతరం అద్యాయా పంచాశద్వర్ణా ప్రకృతేస్తు తే దశోనాస్స్యుః

త్రయస్త్రింశ దిహాన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్ (సంజ్ఞా—5) అనే శ్లోక వ్యాఖ్యానంలో సంస్కృత వర్ణాల్లో ఆగమజ్ఞులు శకారాన్ని మాని క్షకారాన్ని 50 అక్షరాల్లో ఒకటిగా స్వీకరించడం శబ్దసరణి గాదన్నాడు శకారాన్నే క్షకార

---

చిం విష శ్లో 57వ విషయం వారి వాఖ్యానం సమంజసం కాదని చిం విష శ్లో శ్లో లో నిరూపించబడినది

2 ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రతిక—ప్రథమ సంచిక

స్థానంలో లెక్కించాలని శకారం సంస్కృత భాషలోను తెలుగులోను ఎలా సహజ వర్ణంగా ఉందో ఉదాహరణ పురస్సరంగా చూపాడు ఈ వ్రాతే అహోబలునికి తన వ్యాఖ్యలో శకారానికి వర్ణాన్తరత్వ కల్పనకై చేసిన చర్చలో ఉపయోగపడింది

ఈ సందర్భంలోనే దేశీయవ్యాకరణ రచనలో ప్రప్రథమంగా అక్షర నిర్దేశం చేసిన అనంతుణ్ణి అప్పకవి తప్పుపట్టాడు

కాకు షా జడ్డయైన క్షకార మగుటఁ దలఁపకేఁబది లిపులలో దానిఁగూర్చి
తొలుత భిన్నాక్షరంబైన దొడ్డళాను విడిచిపెట్టె ననంతుడు వెఱ్ఱిగాఁడె—
(అప్ప 2–52)

ప్రాకృతానికి పది అక్షరాలు తక్కువ అని చెప్పే సందర్భంలో ప్రాకృత వ్యాకరణం నుండి (హేమచంద్రునిది)

ఋౠవర్ణౌ హ్రస్వదీర్ఘౌ వైఁఔద్యావనునాసికౌ

శషౌచ దశతేన్యూనా ప్రాకృతోక్తిషు సర్వత అని శ్లోకాన్ని ఉటంకించాడు ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానంలో ప్రాకృత వ్యాకరణసూత్రాలు చొనపడమనే ప్రక్రియకు అప్పకవే ఆద్యు డనవచ్చు బాలసరస్వతి ఏ సూత్రాల వివరణం తెలు పకపోతే చింతామణిలో శబ్దప్రక్రియ సాధ్యపడదో అట్టి ప్రాకృత సూత్రాలనే (లోశ సానునాసికోచ్చారణం జీత్–వంటి వాటిని) ప్రవేశపెట్టాడే గాని ఇతర సూత్రాల జోలికి పోలేదు అప్పకవి నుండి ఈ ప్రాకృత వ్యాకరణ సూత్ర ప్రద ర్శన చాతుర్యాన్ని *అహోబలపతి పుణికి పుచ్చుకొన్నాడు—అని ముందు చూడ బోతున్నాం ఈ సంజ్ఞా పరిచ్ఛేదంలో బాలసరస్వతీయ చింతామణికి భిన్నమైనవీ వత్యిరేకమైనవీ కొన్ని సూత్రాలు అప్పకవీయంలో కనుపిస్తున్నాయి వాటి చర్చ ప్రకరణాంతరంలో జరిగింది

అప్పకవి చింతామణిని తెనిగిస్తున్నా అతనిమీద ప్రాచీన దేశీయ తెనుగు వ్యాకర్తల ప్రభావం బాగానే పనిచేస్తూ వచ్చింది కాబట్టే వికృతిపదాదా

---

* చూ చింతామణి పాఠభేదాలు

ప్రథమాంతస్థ తృతీయాను నాసికౌ న స్త అనే సూత్రాన్ని తెనిగిస్తూ క్రారకొమ్ము లని ఉపశీర్షక పెట్టి—

వట్రువలు లేవు తెనుఁగున వాని పగిదిఁ
బలుకు లిపులెల్లఁ గ్రారకొమ్ములు నిజంబు
దునుమునిందాఁకఁ జైద్యుఁ డు దుష్టైననఁగ
రోహిణీభర్త చరమాద్రిఁ గ్రుంకె ననఁగ (అప్ప 2–66)

అని చింతామణితో సందర్భపడనిదిచొనిపాడు ఇది అనంతుని ఛందస్సులోని

తెలుఁగునందు లేదు అలిఁగ్రిందిసుడి గ్రుచ్చె
గ్రుమ్మెనాఁగ రేఫకొమ్ముగాని (2–58) అనే పద్యానికి ప్రతిబింబం

ఇక్కడే అద్రువ విద్రువ –వంటి పదాల్లో క్రారకొమ్ము లున్నాయని అయినా వాటి పూర్వాక్షరాలు గురువులు గావని చెప్పాడు ఇది గూడ అనంతుని మాటకు నకలే (ఛందో –49)

తరువాత ఋత్వాక్షరాన్ని సోదాహరణంగా వివరించాడు ఋకారాన్వితాలేవో రేఫాన్వితాలేవో తెలియక భ్రాంతిపడేవారికోసం ఆ వివరణం అవసరమై ఉంటుంది అటు తర్వాత పూనె నెగసె పొదవె–వంటి వాటిలో వ్యంజనలోపం చెప్పాడు[1]— ఇదంతా దేశీయవ్యాకరణాధ్యయనంవల్ల కలిగిన సంస్కారం

బాలసరస్వతీయ చింతామణిలో అజంత పరిచ్ఛేదంలో 67వ సూత్రంగా 6 అక్షరాలతో ఉన్న సూత్రం ( క్వచిద్గకారో వ ) అప్పకవీయంలో సంజ్ఞాపరిచ్ఛేదంలో 0వ శ్లోకానికి పూర్వార్థంగా 9 అక్షరాలతో దీర్ఘీకృతంగా ఉంది[2] వ్యాఖ్యానం ఉదాహరణలు సామాన్యంగానే ఉన్నాయి అయితే సూత్రంలోనే పదాదిలో ఉండే ానికి వకారం రాదని ఉండటం విశేషం అహోబలపతి ఈ అర్థాన్ని ఆధర్వణ కారికగా సృష్టించాడు[3]

---

1 ఈ పూనెపొదవుల వ్యంజనలోపమే బాలవ్యాకర్త నిరాకరించాడు–ప్రకీర్ణ 0
2 వాస్యాత్ క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గ సరళస్య
3 చూ కారికల మూలపాఠాలు

అద్దంత్యస్తాలవ్య శ్చుర్వక్రిస్స్యాన్మితప్పవర్ణశ్చ
అనే సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ

దంత్యతాలవ్య చజలకు ధరణివ్రాయు
తలిని శుద్ధాంధ్రలిపిని భేదంబు కలిమి
ద్వ్యర్థికృతులను దలకట్టులనుచు నొకట
విదియు నొకదాన నదియును విడఁగరాదు (అప్ప 2 - 35)

అని వివరిస్తూ రాఘవపాండవీయంలోని

అకట పాండురాజ యశమెన్నవైతరి

కూ్రరదశరథేశ కులమురోయ ( - 29) అనే పద్యాన్ని ఉదాహరించి దానిలోని పాండురాజ శబ్దంలోని జకారం రామాయణార్థంలో తాలవ్యంగా (పాండుర + అజ) భారతార్థంలో దంత్యంగా ఉచ్చరిత మౌతుందని అలా కాకూడదని తెలివిడి వ్రాశాడు నిజమాలోచిస్తే ఇక్కడ ఉచ్చారణలో ఏఅర్థంలోను దంత్యత లేదు రాజు అని ఉదంతోచ్చారణలోనే దంత్యత ఉంటుంది గాని పంబోధనలో ఉండదు కాబట్టి ఇదంతా ఆకాశంలో బాణలు వేయ్యడమే ఈ అంశంలో అప్పకవిని త్రిలింగలక్షణ శేషకర్త అనుకరించాడు

(చూ త్రి ల శేష పంక్త్యాదు)

అద్య క్రియాసుభూతాద్యర్థ సముద్యోతితం వినాసర్వః దీని వ్యాఖ్యాన సరళి అప్పకవీయంలో గమనించదగింది సూత్రార్థాన్ని వివరించడం మాని తన అభిప్రాయాన్ని మొదట చెప్పేశాడు అప్పకవి

అంధ్రోక్తిమొదల నాద్యంతస్థముండదు ప్రాణమై అది గనుపట్టుఁగాని
నడుగుల నడుమను గడను యాకెందును దలకట్టుదక్క నెత్వంబులేదు
యాతుభూతాది క్రియాద్యోతితములఁజూపట్టు నెత్వము దలకట్టుకాదు
తలకట్టు వక్రముల్ దాల్చు నీరెండును నలఘుయకారంబులనఁగఁబరఁగు

విప్పు డీవంకఁ గనుగొంటి నింతలోన
నెచ్చటికి నేఁగె ననఁగ నాద్యచ్ఛు లయ్యెఁ
గయ్యమైనను గానిమ్మ గాయకమునఁ
గాయవలె శౌరిననఁ దలకట్టులయ్యె (అప్ప 2—77)

పై సూత్రంలో ఎక్కడా తెనుగుమాట మొదట్లో యకార ముండదనే భావానికి మూలంలేదు కాని అప్పకవి పదాది యకారంతో విరోధిస్తాడు ఆవిషయంలో అతడు వెల్లంకితాతంభట్టు చిత్రకవి పెద్దనల తోవలోనివాడు వారిద్దరూ క్రమంగా—

తెలుఁగునకు మొదల యాలేదిల యావలెనుండు వర్ణమేకారమగున్
తెలుఁగుల మొదళ్ల నెయిలివి యల హల్లులు గావు స్వరములగువ్రాయఁగన్

(కవిచింతామణి తాళపత్రప్రతి ల పా న 2)

అని అన్నారు కాబట్టి పై సూత్రాన్ని చూచిన వెంటనే అప్పకవి తొందరపడి తన మతాన్ని ప్రకటించేశాడు నిజానికి ఈ సూత్రం ఆ కాలంలోని ఉచ్చారణ స్థలనాన్ని సరిదిద్దడానికి ఏర్పడిందే మాటల మధ్యలో చివర యకారానికి తలకట్టు తప్ప ఎత్వం లేదనీ భూతార్థక క్రియలు చనియె కనియె మొదలగు వాటిలో చనియెద కనియెద మొదలయిన తద్ధర్మార్థకాలలో ఉండేది ఎత్వమే కాని తలకట్టు గాదని సూత్ర తాత్పర్యం

ఈ సూత్రం బాలసరస్వతీయంలో అద్య క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినాసర్వ (సంజ్ఞ 20) అని రూపాంతరంతో ఉంది బాలసరస్వతికి పదాది యకారంతో విరోధం లేదు పైగా అది జనవ్యవహారంలో ఉన్న ది గాబట్టి ప్రక్రియా గౌరవమైనా దాన్ని అంగీకరించాలి—అని వాదించాడు ఈ సూత్రాల్లోని పాఠభేదాలు పరిశీలించినపుడు వ్యాఖ్యాతల అభిప్రాయాల కనుగుణంగా సూత్రాల రూపురేఖలు మారాయా అని సందేహం కలగడం సహజం1 అప్పకవి ఈసూత్ర వ్యాఖ్యానంలో తనపూర్వ లాక్షణికుడు ముద్దరాజు రామన కవిజన సంజీవనిలోని

---

చూ చింతామణి పాఠభేదాలు

తాయెతయు నుయ్యెలయుఁ బయ్యెదయుఁ దక్క
గలుగదెత్వంబు మధ్య యకారములకు
తుదను గ్రియదక్క నెత్వంబు గదియదాది
నత్వ మొందదు తెనుఁగుల నబ్జనాభ ( — I 7)

అనే పద్యాన్ని పదాంశ విభాగం చేసి విమర్శించాడు అతని విమర్శనం అతని మాటల్లోనే చూద్దాం

ఉయ్యెల పయ్యెదతాయెతుల వ్యుత్పత్తి

ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను
గలయకారంబులకు వక్రిములు నిజంబు
ముద్దరాజు రామన వానిమాటిని వద
మధ్య యాలని చెప్పె నమ్మాట మిధ్య (అప్ప 2 — 86)

ఊయెల మొదలయిన వాటిల్లో మధ్య ఉన్నది యకారం (సహజం) కాదంటూ వాటి పదాంశ విభాగ మిలాచేశాడు

ఉచునేల కాకగుటచేత నుయ్యెలయ్యెఁ
బయిని యెదకునిక్క వక్రి క్తిఁబయ్యెదయ్యెఁ
దల్లికాపునకై కట్ట దగిన యెత్తు
తేలఁబల్కఁగఁదాయెతుల్దేశ్యమునకు (పైది 87)

హేలా - ఏల ఎల హ్నల్ ఎద ఎత్తు - దండలు - ఎతు కాబట్టి అవి సహజంగా అచ్చులే అని అతని సిద్ధాంతం సంధివల్ల యకారం వచ్చినదంటాడు

ఈ పదత్రియంలోని తాయెతు మీద భాషాశాస్త్రవేత్త వొ్రి టి దొణప్ప ఆంధ్రలాక్షణిక ప్రపంచంలో ఆమాటమీద నేటివరకు వెలువడిన వివిధాభిప్రాయాల్ని క్రోడీకరించి చూపుతూ ఆపదం పుట్టుపూర్వోత్తరాలు తేల్చి వేశారు అసలది అరబ్బీ పదమని తఅవీజ్ = (రక్షణార్థము ప్రార్థించుట) దీని మూలపదమని అది ఔత్తరాహాక దాక్షిణాత్య భాషల్లో వివిధ రూపాలతో ఇస్లాంమత వ్యాప్తిదీప్తులతో పాటు ఆయాభాషల్లో చోటు చేసుకొన్నదని నిరూపించి తెలుగు వాఙ్మయంలో ఆ పదం చోటుచేసికోవడం 16వ శతాబ్దిలో మాత్రమె జరిగిందనీ కాగా దాన్ని సూత్ర

బద్ధం చేసిన వికృతివివేకం 2వ శతాబ్దిలోని అధర్వణుని కృతి కాజాలదని నిర్వివాదంగా సిద్ధాంతీకరించారు[1]

రేఫ ఱకారాల వైషమ్యం

అప్పకవి యకారాగమ విధాయక సూత్రాన్ని వ్యాఖ్యానించిన తరువాత రేఫ భేదాలు అనే ఉపశీర్షికతో రేఫాక్షరం గల పదాల్నీ అలఘురేఫాక్షరంగల పదాల్నీ సీసమాలికల్లో గుచ్చి అందించాడు ఈ రచనకు చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహంలో చేసిన రేఫఱకార నిర్ణయము ప్రేరకం కావచ్చు అదిగూడ అధికంగా సీసపద్యాల్లో గీతాల్లోరచించబడింది ఈ సందర్భంలో ఈ ఇరువురి పద్యాలూ ఎన్నో సంస్కృతీకరించి అహోబలపతి వికృతివివేక కారికల్ని సృష్టించాడు[2]

ఈ రేఫఱకారాల వైషమ్యం తెలుగు లక్షణగ్రంథాల్లో ప్రాముఖ్యం వహించడం చిత్రకవి పెద్దనతోనే ప్రారంభమయిన దని చెప్పవచ్చు అంతకుముందు రేచనకాలంనుండి ర – ఱ ల భేదం వాఙ్మయంలో పాటింపబడుతూ ఉన్నట్లు అతని కవిజనాశ్రయంలోని ఎక్కటివళ్లే సాక్ష్యం (కవిజనాశ్రయం – సంజ్ఞ) తరువాత విన్నకోట పెద్దన అనంతుడూ అలాగే ఎక్కటివళ్లలో ర – ఱ ల భేదాన్ని పాటిస్తూ వచ్చారు (కావ్య చూ 7 – 48 చందో – – 7) అంతే గాని పనిగట్టుకొని ఆ రెంటిని సాంకర్యం చెయ్యరాదని చెప్పినవారిలో చిత్రకవిదే ప్రథమస్థానం అతనిమండే ఈ రేఫ ఱకార నిర్ణయాలు విపులంగా జరిగి తద్వైషమ్య నిరూపణం వైయాకరణుల్లో ఇతర లాక్షణికుల్లో ప్రముఖస్థానం ఆక్రమించినది

అతని వివరణ మిది

తానేమి చెప్పినాఁడిట్లౌనని రఁట యెవ్వఁడెఱుఁగు ననకుఁడు సుకవుల్
నానేర్చురీతి మీకృపఁ బూనుక రేఫలు ఱకారములు నేర్పఱతున్

(ల సా స 3 – 3)

---

[1] భాషాచారిత్రక వ్యాసావళి–వికృతివివేక కర్తృత్వం–ఆంధ్రసారస్వత పరిషత్ ప్రచురణ— 72

[2] చూ కారికల మూలపాఠాలు

పృథివి జీవఁడీఱఁడను నభేదవాది వలెనె వాదించి కుకవి దుర్వాదినతఁడు
దానురేఫకు ఱాకు భేదమె యనునది కృతులు చేపట్టు సుకవినమ్మతముగాదు
ఇడఁదగు రేఫకు రేఫయె యడరఁగఁ బ్రానము ఱకారమైన ఱకారం
బిడఁదగును గాని రెండును బడికలయఁగఁజెప్పరాదు పావనివించే

(పైది ౩–౪ ౬)

అని చెప్పి అకారాద్యనుక్రమంలో రేఫలు ఱకారాలు అంటే అ ఆల మీద వచ్చే రేఫ ఱకారాలు ఇ ఈల మీద వచ్చేవి ఇలా సకారం వరకు ఒక్కొక్క అక్షరం మీద ఏవేవి ఎన్నెనో నిర్దేశించాడు అత డిచ్చిన పదాల పట్టికలన్నీ ప్రాచీనులు నన్నయాదుల గ్రంథాల్లోనివేనని ఆప్రకరణం చివర —

మును నన్నయభట్టాదులు మునుకొని రేఫలు ఱకారములు కృతులంగూ
ర్చిన వలుకు లేర్పరించితి ఘనులిక మఱిఁగలిగెనేని గైకొనఁగఁదగున్

(౩ – ౬౦)

అని చెప్పాడు పై పద్యంలో మొదట నన్నయభట్టునే పేర్కొనడం వలన అతనికి మన నన్నయభట్టీయం చరిత్ర తెలిసినట్లు లేదు తెలిస్తే ఔదలదాల్చి చెప్ప డానికి అభ్యంతర మేముంది? అయితే నన్నయభట్టీయాన్ని ఏమి మహాద్భు తంబిది హరిహరి అంటూ లోకానికి పరిచయంచేసిన బాలసరస్వతికి మాత్రం అతని లక్షణసార సంగ్రహం తెలుసు

చిత్రకవి పెద్దనే ఈ లాక్షణికుల్లో ప్రథమంగా రేఫలు ఱాలు ఉన్నపదాలు వాఙ్మయంలోనివి ఇన్నిన్నని ఏరి సంఖ్యాపూర్వకంగా చెప్పినవాడు తరువాత విక్రుతివివేకము ల్లోనే ఈ వర్ణాలు రెండూ సంఖ్యాపూర్వకంగా నిర్దిష్టాలైనాయి పెద్దనకు చింతామణి విషయం తెలియనట్లే వికృతి వివేకం గురించిగూడ తెలియదు వికృతివివేకం అప్పకవికి గూడ తెలియదనుకోండి అసలు చింతామణి బాలసరస్వతికి తప్ప ఇతరులకి తెలియనట్లే వికృతివివేకం అహోబలపతికి తప్ప ఇతరులకి

తెలియదు ఈ పోలిక ఎంతగానో పరిశీలనకు అర్హమై ఉంది ముమ్ముందు పరిశీలిద్దాం దానివిషయం[1]

## తెలుగుమాటల మొదట వుపోలు

బాలసరస్వతీయ చింతామణిలో లేనిదీ అప్పకవికి పూర్వుడు చిత్రకవి పెద్దన చెప్పినదీ[2] అయిన లక్షణ మొకటి అప్పకవీయ చింతామణిలో ఉంది క్వచిదపి న స్త ఉదోతౌదంతో ష్ఠభవస్య వికృతిశబ్దాదౌ అని తెలుగు మాటల మొదట వు వో లు ఉండవని ఆ సూత్రాని కర్థం

తరువాత అప్పకవీయంలో నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్ అనే సూత్రముంది దీని వ్యాఖ్యానంలో అప్పకవి ఒక నూతనాంశం ప్రతిపాదించాడు

రెండర్థంబుల పద్యము లుండెడిచో నొకటి యచ్చ నొక యర్థమునన్
వుండారు హల్లనగు మురఖండన వలసినను లఘుయకారము కృతులన్

(2—224)

అని లక్షణం చెప్పి లక్ష్యంగా రాఘవపాండవీయంలోని ప్రథమాశ్వాసంలోని 25 వ పద్యాన్ని చూపాడు అహోబలపతి అప్పకవికనిపెట్టిన ఈ నూతనాంశాన్ని సంస్కృతీకరించి అధర్వణాంకితం చేశాడు[3] ఇక్కడే అప్పకవి

బమ్మెరపోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ యెంతయు నారసిచూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలసి ప్రాసములైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికులెల్లను మానిరుదాహరింపఁగన్ (2—234)

అని పోతన్నను లాక్షణికులు ఈ రేఫ ఱకార సాంకర్యం కారణంగానే స్వీకరించలేదని మరొక క్రొత్త విషయం చెప్పాడు అయితే దీన్ని సంస్కృతీకరించి

1 చూ కారికల మూలపాఠాలు

2 ల సా స 3—8

3 చూ కారికల మూలపాఠాలు

అధర్వణాంకితం చెయ్యడానికి వీలులేదని కావచ్చు అహోబలపతి అలాచేయకుండా తన వ్యాఖ్యానంలో మాత్రం వ్రాసికొన్నాడు (అహోబల 22 సూ వ్యాఖ్య) అప్ప కవీయంలో ఈ సూత్ర వ్యాఖ్యానం తరువాత —

శుభవర్ణాశ్శుభశబ్దా యేచ శుభగణా స్తఏవ కావ్యాదౌ గ్రాహ్యాః
పురా స్త్రి రసగిరి రుదేశ్విష్వ కచటహ మాతృకానింద్యాః

అనే బాలసరస్వతీయేతర సూత్రాలు వ్యాఖ్యానించబడ్డాయి ఈ సూత్రాలమీద ప్రకరణాంతరంలో[1] చర్చ చేయబడింది వీటిలో రెండో సూత్రాన్ని సంస్కృతమే అయినా ఆకారం మార్చి అధర్వణాంకితం చేశాడు అహోబలపతి[2] చాగంటి శేషయ్యగారు కవితరంగిణిలో చేసిన ఊహ – అప్పకవి పద్యాల్నే సంస్కృతీకరించి అధర్వణకారిక లని పేరుపెట్టాడహోబలపతి – అనేది రుజువు కాబోతున్నది

ఈ సూత్రాల వ్యాఖ్యానం తరువాత అప్పకవి స్వయంగా దోషపరిభావము గుణావగుణబాహుళ్య విశేషంబులు మాతృకార్చనావిధానము వాగ్దేవతార్చనము ప్రబంధోపక్రమ శుభకాలంబులు అనే ఉపశీర్షికలతో పద్యాలు అల్లి చివరకు సారస్వతౌషధంబులు గూడ వివరించాడు అప్పకవి తన వ్యాఖ్యానంలో తనకు తెలిసిన విషయ మేదీ విడవకుండా మొత్తం చొప్పించి వ్రాశాడనడానికి యిది మంచి ఉదాహరణమౌతుంది

### ఒక సూత్రానికి వ్యాఖ్యగా ఒక ఆశ్వాసం

తరువాత తృతీయాశ్వాసంలో అంటే వర్ణప్రాస పరిచ్ఛేదంలో తన చింతామణిలోని ఒక శ్లోకం బాలసరస్వతీయం ప్రకారమైతే ఒకేసూత్రం (శ్లోకార్థభాగం) ఆధారంగా చేసికొని ఛందశ్శాస్త్రాన్ని తాను ఎరిగినదాన్ని మొత్తాన్ని గుప్పించి విస్తృతమైన రచన చేశాడు

అలాగే నాల్గో ఆశ్వాసంలో (పద్య పరిచ్ఛేదం) కూడ తన చింతామణిలోని 5 శ్లోకాలు బాలసరస్వతీయంలో లేనివి స్వీకరించి ఛంద ప్రభావం ఛందోవ్యాపక సంప్రదాయం ఛందస్స్వరూపం ఇతిహాసాదిస్వరూపం మొదలైన అనేక విషయాల

1 చూ చింతామణి పాఠభేదాలు

2 చూ కారికల మూలపాఠాలు

మీద షట్ ప్రత్యయాలమీద పెద్ద రచన సాగించారు ఈ శ్లోకాలు బాలసరస్వతీయంలో లేక అప్పకవీయంలోనే ఉండటానికి కారణం ప్రకరణాంతరంలో (చింతామణి పాఠభేదాలు) చర్చించి నిర్ణయించబడింది

కేవలం చింతామణి సూత్రాలు మిషగా తీసికొని అప్పకవి తన ఛంద శ్శాస్త్రపారంగతత్వాన్ని ఈ రెండు ఆశ్వాసాల్లో సువ్యక్తం చేశాడు అసలు ఈ గ్రంథబాహుళ్యం వలననే అప్పకవీయానికి వ్యాకరణత్వహానికలిగిందని సాధికారికంగా చెప్పవచ్చు

ఇక మనకు లభించిన అప్పకవీయంలో చివరిది అప్పకవీయ రచనా ప్రణాళికలో సంధిపరిచ్ఛేదంగా చెప్పబడినదీ అయిన ఐదో ఆశ్వాసంలో కళాద్రుత ప్రకృతిక విభాగం ప్రథమాంశం తరువాత సంధులు వ్యాఖ్యానించబడ్డాయి

ప్రాచీనాం చ వ్యాకర్తౄల ప్రభావం

తిజ్మధ్య శేషషష్ఠీ సుస్కార్మ ప్రవచనీయజ విభక్తిః ఇత్యాది కళా నిర్దేశక సూత్రానికి ఇతని వ్యాఖ్య గమనించదగింది అప్పకవి చింతామణికి వ్యాఖ్యానం చేస్తున్నా అతని మెదడులో కావ్యాలంకార చూడామణి మెదలుతూనే ఉంది

హేమచంద్ర త్రివిక్రమ నాములాదిఁ
బ్రాకృతముఁ జెప్పఁజూపిరా ప్రాకృతంబు
నందు భేదంబుగావున నాంధ్రమునకుఁ
గలుగులక్షణ మెఱుఁగంగవలయుఁ గవులు (అప్ప 6 – 6)

దీనికి మూలమిది

విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు
లొనరఁజూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ
నాంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన
వలయుఁ దల్లక్షణంబులవరుసఁ దెలియ (కా చూ మ 9 – 8)

అలాగే తెలుగుభాషేగదా తెలుసులే బొమ్మనే పెద్దర్సి విన్నకోట పెద్దన్న ఉదాహరణ పురస్సరంగా మందలిస్తే (కా చూ మ 9 – 7) కేవలం దాని ప్రతిధ్వనిగా అప్పకవి

తెలుగుబాస యెంత దెలిసియుండిన దీని
జదువకున్నఁ గవిత చక్కఁగాదు
ఇంటిలోన హేమమెంత గల్గిననేమి
తొడవు సేయకున్నఁదొడుగరాదు (అప్ప ౫ – ౬) అని అంటాడు

దీన్ని పరిశీలిస్తే అతనిమీద ప్రాక్తన వ్యాకర్తల ప్రభావం ఎంతో గాఢంగా ఉంది అని అంగీకరించక తప్పదు సంధులు వివరించడానికి ముందు వాటి అవసరం తెలియడం కోసం చిన్న ఉపోద్ఘాతం చేశాడు

వసుధ విసంధియును మహావిసంధియుఁ గుసంధిదోష విధముఁను దుస్సం
ధి సమాఖ్యయు ననునాల్గును బొసగింపరు సంధిదోషములటంచుఁగవుల్

(అప్ప ౫ – ౮)

అని ఆనాల్గు సంధిదోషాల్ని ఉదాహరించి చూపాడు

విసంధి=హరి మునలికిని అనుజుండు
మహావిసంధి=సాల్వభూమివరున్ అండజధ్వజురడు
కుసంధి= మగువాకతె
దుస్సంధి=అందున్నిందున్

అనంతుడు ఛందోదర్పణంలో కుసంధి దుస్సంధుల్ని పేర్కొన్నాడు (4 ఆ 9 20) అప్పకవి వాటికి మరిరెండు చేర్చాడు

తరువాత మరొక కొత్త పరిభాషను సృష్టించాడు ప్రథమైకవచనంలో ను డు ము లు చేరిన పదాలు విభక్తికాలట చేరనివి అవిభక్తికాలట నామ మని కూడ దానికే పేరట అలాగే వికల్పం నిత్యం ఆదేశం ఆగమం ప్రత్యయం లోపం అనే పారిభాషిక పదాలకి నిర్వచన మిచ్చాడు ఉపోద్ఘాతంలేని చింతామణికి ఉపోద్ఘాత ప్రియుడైన వ్యాఖ్యాత దొరకడం విశేషమే

## కళా ద్రుతప్రకృతిక విభాగం

చింతామణి తొలుత కళల్ని తరువాత ద్రుతప్రకృతికాలను సూత్రిస్తే (బాలవ సంజ్ఞ 40) అప్పకవీయ వ్యాఖ్యానం ఆ పద్ధతిని వ్యత్యస్తం చేసింది ఈ వ్యత్యస్తపద్ధతే బాలవ్యాకరణంలో స్వీకరించబడింది (సంజ్ఞ 2)

వలసినచో దుది ద్రుతములు తలచూపెడి శబ్దములు ద్రుతప్రకృతులనన్
వెలయునవి వొడమకుండెడు తెలుఁగుపదంబులు కళాప్రదేశములయ్యెన్

(అప్ప 5)

బాలసరస్వతి ఈ సూత్ర వ్యాఖ్యానంలో సూత్రప్రాప్తులచేత లోపాదులు వచ్చును గాని పొల్లు నకారముతోఁ గూడ నుండుననుట అన్నమాట కుదాహరణంగా అప్పకవి —

ధాత ధాతను భూపతి ధరణిపతివి
జనకు జనకుని గనియెఁగన్గొనియె ననుచుఁ
గడ ద్రుతము లిట్లు లోపము గ్గాంచివలయు
పట్లఁగనుపట్టునవి ద్రుతప్రకృతు లిల (అప్ప 5 – 23) అని వ్రాశాడు

తరువాత ను అంత మందుండే పదాలు ద్రుతప్రకృతికాలంటే — గూను మేను నాను మీను పేను మ్రాను చేను బోను వంటివి కావని వివరించాడు తరువాత జడ్డలున్న నకారాలు గూడ ద్రుత ప్రకృతులు కావని తెన్ను చెన్ను జున్ను వంటివి ఉదాహరించాడు ఇంతవరకు సవ్యంగానే నడిచింది వ్యాఖ్యానం కాని ఈ నియమం ( జడ్డ నకారములు ద్రుతప్రకృతులు కావు) అస్థానంలో అన్వయించా డని మన కీనాడనిపించేటట్లు

తన్ను నిన్ను నన్ను విన్ను మున్నామున్ను చన్ను కన్ను వెన్ను శబ్దములకు
జడ్డలుండఁబోవుఁ జర్చింప నివి ద్రుతప్రకృతులెపుడుగావు భక్తసులభ

(అప్ప—27)

అని నూతన వ్యాఖ్యానం చేశాడు ఈ వ్రాత నిరాధారమనక తీరదు—చింతామణి చెప్పిన కళల పట్టికలో కర్మప్రవచనీయేతర ద్వితీయావిభక్తి లేదు కాబట్టి

తరువాత క్రియాల్లో తిఙ్మధ్యములు కళలని తిఙ్మధ్యము లంటే మధ్యమ పురుషాశ్చ యేరమాంతాశ్చ (క్రియా 37) అని నిర్వచించింది చింతామణి ఆ నిర్వచనం ప్రకారం ప్రథమపురుషైకవచనాలు (వచ్చుచున్నాఁడు వంటివి) కళలు కాకపోవలసి వస్తుంటే అప్పకవి

నవ్వుచున్నాఁడు వచ్చుచున్నాఁడు వాఁడు
మనఁగఁగఁడటన్న తిజ్మధ్యమంబు లెందుఁ
గాకయును బ్రథమలలోనఁగలసి నరసి
జాతినేత్ర కళాప్రదేశంబు లగును (5–30) అని నద్వ్యాఖ్య చేశాడు

తరువాతి వ్యాఖ్యాత అహోబలపతి ఈ వాఖ్యను స్వీకరించాడు (సంజ్ఞ 40)

తరువాత సంధులు వివరించేముందు గూడ చిన్న ఉపక్రమణిక చేశాడు దానిలో అహోబలపతికి అధర్వణకారికల మూలపదార్థం గూడ కొంత దొరికింది 1 తరువాత

ఉక్సంశ్లేషొనాచి ద్రుతస్యసర్వత్ర ఉక్సమాసేషు 3

అనే సూత్రానికి అప్పకవి చేసిన వాఖ్యలు బాలసరస్వతీయంతో దాన్ని ప్రాతిపదికగా తీసికొన్న అహోబలపండితీయంతో భేదిస్తున్నాయి అయితే అప్పకవిది చింతామణికి రెండో వ్యాఖ్య పైగా తానుగూడ బాలసరస్వతీయ వ్యాఖ్యనే ఆధారం చేసికొని వ్యాఖ్యానిస్తున్నట్లు వ్రాశాడు కాగా ఈపట్టున అప్పకవీయమే ఉపాదేయం2

సంధి విధానం

సంధిర్నా చోఽచ్యసుతః 4

బాలసరస్వతీయంలో సంధిప్రకరణ ప్రారంభ సూత్రం అప్పకవీయంలో 4వదిగా మారింది వాఖ్యానం బాలసరస్వతీయ సరణిలోనే సాగింది ఉకారవ్యతిరిక్త అచ్చులుగా అప్పకవి పదింటిని ఉదాహరించాడు అన్నిచోట్ల సంధులు లేవని చూపాడు

లెస్స + అగు = లెస్సయగు

2 జాణవా + ఒఱపు = జాణవాయొఱపు

3 సిరి + అన్న = సిరియన్న

4 వలదుసుమీ + ఇంత = వలదుసుమీయింత

---

1 చూ కారికల మూలపాఠాలు

2 చూ సూత్రకర్తే వివరిస్తే గాని తెలియని సూత్రాలు

5 చన్నె + అవుపాలచవి = చన్నెయావుపాలచవి

6 రే + ఎంఠ = రేయెంఠ

7 మై + ఒప్పు = మైయొప్పు

8 కలదో + ఇంచుక = కలదోయించుక

9 ధనమొకో + ఇంతులకు = ధనమొకోయింతులకు

10 వివాసమౌ + ఎలనాగ — వివాసమౌనెలనాగ

బాలసరస్వతి ఇన్ని ఉదాహరణ లివ్వలేదు అ ఇ ఎ ఒ ఔ అనే అచ్చులకు మాత్రమే ఇచ్చాడు అహోబలపతి బాలసరస్వతినే అనుసరించాడు

నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః 7

ఇది ఉత్తమేతరపురుషల్లోని ఇత్వానికి నిత్యంగా సంధివిధించే సూత్రం దీని వ్యాఖ్యానంలో అప్పకవి చిన్న సవరణ ప్రతిపాదించాడు

పుడమి సూత్రోక్తముత్తమపురుష మనుచుఁ
దత్పురుష మెల్లఁగొనరాదు తద్బహూక్తి
మున్న తిఙ్మధ్యములతోడ నెన్నుకతన
నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటించు (అప్ప 5 62)

ఉత్తమపురుష కాక మిగిలిన ప్రథమ మధ్యమ పురుషల్లో ఇదంతక్రియా పదాలు భూతకాలంలోమాత్రమే ఉంటాయి కూర్చుండిరి కూర్చుంటివి కూర్చుంటిరి ఈ మూడువిధాలైన వాటికి నిత్యసంధిని సూత్రించింది చింతామణి ఇంతవరకు సూత్ర ప్రమేయవిషయంలో అప్పకవికి అభిప్రాయభేదం లేదు అతడు చెప్పేది సూత్రంలోని పర్యుదాసంలో ఉత్తమపురుషబహువచనం (కూర్చుంటిమి) వికల్ప సంధికి గురికాదనిమాత్రమే

### శ్రీనాథుని తప్పు పట్టడం

ఈ సూత్ర వ్యాఖ్యాన సందర్భంలోనే అప్పకవి[1] శ్రీనాథుని తప్పుపట్టాడు

---

1 ఈ పర్యుదాసం వలన ఉత్తమపురుష క్రియలు కిమాదిగణంలో చేరి వికల్ప సంధులు పొందుతాయని బాలసరస్వతి వ్యాఖ్య

అతని దగ్గరున్న లక్షణపరిధినిబట్టి చూస్తే అది తప్పుగానే తోచించి సూత్రం నిత్యసంధిని విధిస్తుండగా శ్రీనాథుడు ప్రకృతిభావంతో ప్రయోగం చేశాడు మరి

విరచించెను శ్రీనాథుడు ధరణిని శృంగారనైషధంబునఁ గూర్పం
డిరి యొండొరు నని కానక పరపురుషక్రియలఁబ్రకృతిభావము కలదే

(అప్ప 5 – 64)

అప్పకవి పట్టినతప్పును అహోబలపతి అధర్వణకారికా సహాయంతో ఒప్పుగా మార్చి అప్పకవినే తప్పుపట్టాడు తప్పుపట్టినవానిలో తప్పుపట్టడం విశేషాంశమే (చూ అహోబల ఇదే సూత్రం) మన ప్రాచీన లాక్షణికుల దృష్టిలో అయితే అహోబలపతి చూపిన అధర్వణకారికల యాథార్థ్యం శంకాస్పదం అని గ్రహించి నపుడు అహోబలపతి గొప్పతనానికి విఘాతమేర్పడుతుంది[1]

ఈ సూత్రవ్యాఖ్యానంలో అప్పకవి మరొక ముఖ్యాంశం వెలువరించాడు చింతామణిలో క్రియల సంధిని విధించేది ఇదొకటే సూత్రం ఇదైనా ఇదంతాలకి ఉత్తమేతర పురుషల్లోనే సంధివిధానం చేస్తున్నది మిగిలిన ప్రథమ మధ్యమపురుష క్రియలు వర్తమాన భావ్యర్థక క్రియలు – వీటి సంధివిషయం ఏమిటో చింతామణి చెప్పదు ఆ కొరతను కొంతవరకు బాలసరస్వతి తీర్చినా అప్పకవి స్పష్టంగా మొత్తం తీర్చేశాడు అవిధమైన క్రియలన్నిటికీ (భూతార్థక ఉత్తమపురుషైకవచనం తప్ప[2]) సంధిర్నాచో వ్యనుతః అనే సూత్రమే శరణ్యమని చనుచున్నాఁడదె మొదలైన రూపాల్ని ఉదాహరించి నిరూపించాడు

ప్రాయస్తుస్యాత్ కిమాదికస్యేతః 2

అప్పకవి ఈ సూత్రంలో నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః అనే సూత్రంలో పర్యుదాసం చేయబడిన (మినహాయించబడిన) ఉత్తమపురుషైకవచన ఇత్వసంధిని ఉదాహరించి ఉండవలసింది – కనీసం బాలసరస్వతీయవ్యాఖ్యానాన్ని

---

1 చూ కారికల మూలపాఠాలు

2 వాటికి ప్రాయస్తుస్యాత్కిమాదికస్యేత (సంధి 9) అనే దానితో వికల్ప సంధి అని బాలసరస్వతి అహోబలపతీ అప్పకవి అంతే

బట్టైనా కాని అలా చేయలేదు ఏమి అనేది వాక్యమన్నాడు ప్రయోగాన్నిబట్టి వాక్యంగా నిరూపించవచ్చుగాని అతడు పదాన్నిగూడ వాక్యమనే అంటాడు

కూర్చి విడిచి ద్వితీయఁబల్కనవి మూఁడు
నవతలి విభక్తిఁదెలుపు వాక్యములు నాల్గు
వలనఁగంటె లోపల నను వచనములును
బది విభక్తులలో ద్రుతప్రకృతులయ్యె (అప్ప 5 – 59)

తరువాత అహోబలపతి లుగ్వాస్యాత్ – 3 అనే సూత్రవ్యాఖ్యానాన్ని బాలసరస్వతీయ పక్కలోనే చేసి క్త్వాప్రత్యయాంతార్థ సంధి అని క్త్వాప్రత్యయాంత తుల్యాలైన తెలుగు పదాలకి సంధి జరుగకపోవడాన్ని వివరించాడు

కాంచి యాలకించి యెంచి యాలోచించి
యొరసి యాడి యాడి యొరగి యెఱిఁగి
యంటి యెంచి యిచ్చి యని యాడుకొని యెత్తి
యెనసి యేగి యూగి యనఁగ వచ్చు (5 – 83)

ఈ విషయాన్నే అహోబలపతి సంస్కృతీకరించి ఆథర్వణాంకితం చేశాడు

ధాతుపద సంభవానాం విశేషణానా ముత స్త్రథాను మచి 9

ఇది అబాలసరస్వతీయ సూత్రం కాబట్టి అనహోబలపండితీయం గూడ ఉదంత ధాతుజవిశేణాలకి అచ్చుపరమైతే నుమాగమాన్ని విధిస్తుంది (నుమ్ లో మకార మిత్తు కాబట్టి ప్రకృతికి అంతావయవంగా వస్తుంది) ఉదా=చేయు + అతఁడు చేయునతఁడు మొ తద్ధర్మార్థక క్రియల్లో ప్రథమైకవన రూపానికి విశేషణ రూపానికి భేదం మొదట ఉండి ఉండదు చేయున్ + అతడు=చేయునతడు విశేషణం అతడు చేయున్–క్రియ చేయున్ + వాడు=చేయువాడు విశేషణం ఇక్కడ ద్రుతం స్థిరపరకమైంది కాబట్టి లోపించింది కాని కాలక్రమాన చేయువాడు–వంటి రూపాల్లోని పూర్వపదమే విశేషణమనీ చేయున్–వంటిది క్రియారూపం మాత్రమే

---

చూ కారికల మూలపాఠాలు

అని వైయాకరణులు భావించారు ఆ భావనతో ఏర్పడిన సూత్రమే యిది దీన్ని బాలవ్యాకర్త గూడ స్వీకరించడం గమనార్హమైన విశేషం (బాలవ్యా సంధి 33)

షష్ఠ్యాఉతోఽచినుమ్సే—20

దీని ఉదాహరణల్లో ఒకటి కేతనది—కొడుకునాలు (ఆ భూ భూ 60)

అహమాదీనాం ద్విత్వం లోపో నమ ఆదికే విసర్గస్య 22

ఇవి అనుకరణకార్యాన్ని విధించే సూత్రాలు వీని వ్యాఖ్యానంలో బాలసరస్వతి కల్పించిన (సున్నకు ద్విత్వం రాదు మొ ) అపవ్యాఖ్యకు దూరంగా ఉండటం అప్ప కవిలో విశేషం అయితే రెండో సూత్రం నమఆదికే విసర్గస్య లోప అనేది అనుకరణంలో విసర్గకు లోపం చెపుతుంటే ఈ వ్యాఖ్యాత దానికి (విసర్గకి) తోడు దీర్ఘానికి గూడ లోపం అంటే హ్రస్వం వస్తుందని అతివ్యాఖ్య చేశాడు అది అబద్ధం గూడ కాబట్టే బాలవ్యాకర్త ఉదాహరణ పురస్సరంగా నిరాకరించవలసి వచ్చింది (బాలవ్యా సంధి 64)

తేషామితశ్చ తద్వత్ త్రివిక్రమ మతేన —28

ఇదీ అబాలసరస్వతీయం అనహోబలపండితీయమూ న ర ల డ లలో ఉండే ఇత్వానికి గూడ త్రివిక్రమ మతానుసారం లోపమట త్రివిక్రముడు ప్రాకృత శబ్దానుశాసన కర్త క్రీ శ 13వ శతాబ్దికి చెందినవాడని విద్వాంసులు నిర్ణయిం చారు అతడు తెలుగు వ్యాకరణానికి దేనికీ కర్తగాడు ప్రాకృత వ్యాకరణంలో నైనా ఎక్కడా న ర ల డ లలోని ఇత్వానికి లోపం చెప్పినట్లు లేదు ఒకవేళ ఉన్నా అవిధానం తెలుగు వ్యాకరణానికి ఆదర్శమెలా అవుతుందో ప్రకృత సూత్ర కర్తకే తెలియాలి ఈ సూత్రానికి చింతామణి కర్తృత్వ నిర్ణయంలో ప్రముఖస్థానం ఉండటం తప్ప దీనిలో విశేషమేమీ లేదు దీనికి ఉదా పూనికి—పూన్కి కలికి-కల్కి బుడిపి—బడ్పి మొ

నమ్మోతో హల్యధర్వణాచార్యమతాత్ —33

ఇది కనుంగవ—కనుఁగవ వంటి రూపాలు నిష్పత్తి చేస్తుంది బాలసరస్వతీ యంలో నుమ్మోత అని మాత్రమే ఉంది తరువాతి హల్యధర్వణాచార్య

మతాల్ అనేభాగం లేదు అప్పకవి బాలసరస్వతీయ గ్రంథమే స్వీకరించి తన వ్యాఖ్య సాగించినట్లు చెప్పాడు గాబట్టి బాలసరస్వతీయంలో గూడ మొట్టమొదట ఈ రూపంతోనే సూత్రముంటే అనంతర పండితులు చింతామణి కర్తృత్వ బాధను శంకించి ఆభాగాన్ని తొలగించారని అధర్వణుని ఒక్కనిపేరే గాక హేమచంద్ర త్రివిక్రముల పేర్లు గూడ అలాగే తొలగించబడ్డాయని ఆధునిక పరిశోధక పండితుల అభిప్రాయం[1]

అప్పకవీయ చింతామణిలో కేవలం 44 శ్లోకాలే దొరికాయి–6 ఆశ్వాసాల వ్యాఖ్యలో ఇంకా మూడాశ్వాసాలు అప్పకవి వ్రాయవలసి ఉంది–అతని రచనా ప్రణాళిక ప్రకారం కాని ఆ మూడాశ్వాసాలు వ్రాసినట్లు గుర్తులు లేవు ఆధారాలు లేవు కాబట్టి అప్పకవికి అసలు మొత్తం చింతామణి ప్రతి దొరికిందా ? లేక కొంతే దొరికి దాన్నే అతడు తెనిగించాడా? అనే సందేహాలు రావచ్చు అప్పకవికి చింతామణి మొత్తం దొరకలేదని అహోబలపతి వ్రాతని బట్టి నిర్ణయించవచ్చు అతడు (అహోబలపతి) అప్పకవి పాఠభేదాలవల్ల కలిగిన వ్యాకరణాంశాలు వివరిస్తానని (పీఠిక–73) చెప్పి వ్యాకరణాంశాలే కాక అప్పకవి పాఠభేదాలు గూడా పేర్కొన్నాడు కాని అవి సంజ్ఞా సంధి పరిచ్ఛేదాలవరకే పరిమితం తరువాతి పరిచ్ఛేదాల్లో అప్పకవీయ చ్ఛాయ పొడకట్టదు కారణం అప్పకవీయంలో తరువాతి ప్రకరణాలు లేవు

హేమచంద్ర త్రివిక్రముల వ్యాకరణ పరిభాషలు కొన్ని చింతామణి ప్రక్రియల్లో అవశ్యం స్వీకార్యాలుగా ఉండటాన్నిబట్టి గూడ చింతామణి కర్త వారిపేర్లు సూత్రాల్లో గ్రథించాడని మనం నిర్ణయించవచ్చు అయితే అనంతర పండిత లేఖకులు కొంత కొంత చరిత్ర జ్ఞానం ఏర్పడిన తరువాత అవి చింతామణి కర్తృత్వ శంకకు తావిస్తాయని ఆ వ్యాకర్తల పేర్లు తొలగించివేశారని గూడ నిర్ణయించవచ్చు అయితే పేర్లు తొలగించి సూత్రాల స్థానాలు మార్చడం ద్వారా కొత్త పదాలు జొనపడం ద్వారా ఆర్యా శ్లోకాల్ని యథాపూర్వంగా చెక్కుచెదరనట్లు ఉంచగలిగామని ఈ మధ్యవర్తులు అనుకున్నారే గాని చింతామణి ప్రక్రియల్లోనే అంతర్లీనంగా హేమచంద్ర త్రివిక్రముల ముద్ర లున్నాయని గ్రహించలేకపోయారు కాగా ఈ సందర్భాన అప్పకవీయ పాఠమే నిజమైన చింతామణి పాఠమని నేటి బాల సరస్వతీయ పాఠం అనంతర కల్పనమనీ నిర్ణయించవచ్చు

---

1 కందుకూరి వీరేశలింగం కవుల చరిత్ర చాగంటి శేషయ్య–కవితరంగిణి

వాక్యాన్తగత పదానాం చ—౪

దీని వ్యాఖ్యానంలో అప్పకవి నూతనాంశ మొకటి వివరించాడు

నలినాక్ష తెలుగు పద్యంబుల కిడపలనుండు నలల పొల్లులకు మహా
ప్లొలి గుడులును శృంగములును నిలుపరు చదువునెడ లాక్షణికు

లెచ్చోటన్ (5— 39)

పద్యాల చివర లు ను గాని లి ని ౯ నిలుపవని భావం దీన్ని ఆధారంగా చేసికొని అహోబలపతి కారిక సృష్టించి అధర్వణాంకితం చేశాడు[1]

ఉగ్వాద్రుతప్రకృతికాత్ పరతస్సరశే స్థిరేచ నస్యస్యాత్ —39

ఈ సూత్రవాఖ్యానంలో అప్పకవి చూపిన కొత్తదనం—సరళాక్షరాలు స్థిరాక్షరాలు—అన్నింటికీ పరమైన ద్రుతం వికల్పంగా లోపించడాన్ని సోదాహరణంగా వివరించడం 25 పంక్తుల సీసమాలికలో పై అక్షరాలన్నింటికి ఉదాహరణలు చాల ఓపికతో ఇస్తూ చివర ధ ఙ ఞ ణ అనే అక్షరాలు పదాదుల్లో ఉండవు గాబట్టి వాటికి ఉదాహరణలు ఇవ్వలేదని చెప్పాడు

ఇదేవిధంగా అలుకిచ సంశ్లేషస్స్యాత్ బిందుం ప్రవదన్తి తం క్వచిత్కేచిత్ అనే అనంతర సూత్రాంకి కూడ మొత్తం సరళాక్షరాలు స్థిరాక్షరాలు – అన్నింటికీ ఉదాహరణ లివ్వడం విశేషం ఈ సందర్భం నుండి అహోబలపతి కొన్ని కారికలు సృష్టించుకున్నాడు[2]

ఇక్కడే అప్పకవి నమకార ద్విత్వమైత్రము అనే ఉపశీర్షికతో—

---

1 చూ కారికల మూలపాఠాలు

2 చూ పైది

తమకుఁదాము ద్విత్వంబులై యమరునవియు
బిందువులు దాపలను వెలుఁగొందునవియు
నొక్కరూపయి పూర్వప్రయోగ సరణి
నములు ప్రాసంబులకు నిల్చు దమకుఁదాము (5– 58)

అని సహజంగా నకార మకార ద్విత్వం గల శబ్దాలతో బిందుపూర్వాలైన నమకారాలు ప్రాసకు చెల్లుతాయనే విశేషాంశం వివరించాడు ఉదాహరణలు గూడ ఇచ్చాడు ప్రౌఢవ్యాకర్త ఈ విశేషాంశాన్ని స్వీకరించే తన వ్యాకరణంలో సంధి పరిచ్ఛేదంలో 22వ సూత్రాన్ని నిర్మించాడు

ప్రథమలుగపి ద్వినుల్వో —42

ఇది కన్నుదోయి–కనుదోయి వంటి రూపనిష్పత్తికోసం చేయబడింది సూత్ర నిర్మాణంలో లోపం ఉంది ద్వినుల్వో అంటే రెండు ను లు ళు గల పదాలే గాని నకార లకారాలున్న పదాలని అర్థంకాదు అంటే సూత్రానికి ఉన్న అర్థం కనును ములులు అని వాటిలో మొదటి ను లు లు లోపిస్తాయి కాని వ్యాఖ్యాతలు కన్ను ముల్లు వంటివి ఈ సూత్ర విషయాలన్నారు–బాలసరస్వతిని బట్టి సూత్రకర్త ఉద్దేశమదే అనడంలో సందేహం లేదుగాని ఆ ఉద్దేశాన్ని సూత్రీకరించ గలిగాడా? అనేది గమనించక తప్పదు

దీనికి బాలసరస్వతి సమాసపరమైన ఉదాహరణలే ఇస్తే అప్పకవి కన్ను మూసె కనుమూసె వంటి వ్యస్తోదాహరణలు గూడ ఇవ్వడం విశేషం

హేమోక్తే పరుషాణాం గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే —44

దీనిలోని హేమోక్తే అనేపదం బాలసరస్వతీయంలో లేదు హేమ శబ్దానికి ప్రసిద్ధ ప్రాకృత వ్యాకర్త హేమచంద్రుడు అని అర్థం ఆంధ్రదేశంలో హేమ చంద్ర త్రివిక్రముల ప్రాకృత వ్యాకరణాలు సుప్రసిద్ధాలని అవి విరివిగా పఠన పాఠనాలలో ఉండేవని విన్నకోట పెద్దనాదులే మనకు సాక్ష్యం (కావ్యాలంకార చూడామణి–9–8) పైగా చింతామణి ప్రాకృత వ్యాకరణ ప్రభావవిలసితం కాగా దానిలో హేమచంద్ర ప్రసక్తి ఉండటంలో విడ్డూరమేమీ లేదు కాని బాలసరస్వ

తీయంలో నేడు మనకు లభించె ప్రతిలో హేమచంద్ర ప్రసక్తిలేదు హేమచంద్ర త్రివిక్రమ అధర్వణాచార్యుల పేర్లున్న శ్లోకాల్ని అప్పకవికి తర్వాత వీరేశలింగం గారికి ముందు పండితు లెవరో మార్చి వ్రాసి ఉంటార ని కొందరు పరిశోధక పండితుల అభిప్రాయం1 ఇక హేమచంద్రుని ప్రాకృతశబ్దానుశాసనంలో క చ ట త ప లు గ స డ ద వ లు గావడం కనిపించదు – ఒక్కచోట కాని సంస్కృతశబ్దాలు భ్రంశం చెందినపుడు అక్షరవైరూప్యంలో కా గా గా మారడం వంటివి ఉండవచ్చు–అక్కడక్కడ బహుశ ఆవిషయం దృష్టిలో ఉంచుకొని సూత్రకర్త వ్రాశాడనుకుంటే హేమోక్తికి సమన్వయం కుదురుతుంది

అప్పకవీయంలో చివరిసూత్రం

న వికృతిశబ్దాత్ పరతస్సాంస్కృతికానాం ఖపన్తి గసడదవా —46

పూర్వ సూత్రంతో పరుషాక్షరాలకి ప్రథమాంతాలమీద ఉన్నవాటికి గ స డ ద వ లు విధించి ప్రస్తుత సూత్రంతో దానికి అపవాదాన్ని విధిస్తున్నాడు అచ్చ తెలుగు శబ్దాలమీద ఉండే పరుషాలు గ స డ ద వ లు కావని సూత్రార్థం ఉదాహరణలు

జవరాలు కిమలవాసిని

2 ముద్దులపట్టి చిత్తజాతుఁడు

3 చుట్టంబు టంకాయుధహస్తుండు

4 మఱఁది తామరసవైరి

5 మామ పానీయరాశి

తరువాత కల్పిత కల్పవల్లీ సమాన లక్షణ ఎనమాలిక గర్భకవిత్వానికి ఉపోద్ఘాతంగా వ్రాయబడింది తరువాత పంచదశాంధ్ర పద్యగర్భితాలైన అష్టసమాసాల్ని ప్రహరణ కలిత వృత్తంలో టీకాసహితంగా వ్రాశాడు అప్పకవి దానితో పంచమాశ్వాసం అప్పకవీయం రెండూ ముగిశాయి

---

కందుకూరి వీరేశలింగంగారు చిలుకూరి నారాయణరావుగారు చాగంటి శేషయ్యగారు

### ఫలితార్థం

ఇంతివరకు చేసిన అప్పకవీయ పరిశీలనం వలన అప్పకవి చింతామణిలోని నవీన పరిభాషల్ని స్వీకరించినా అతనిలో కేతన భీమన అనంతుడు పెద్దన మొదలైన దేశీయ వ్యాకర్తల లక్షణాల ప్రభావం అపరిమితంగా ఉందని దాని కారణంగానే అతని తెనిగింపు చింతామణికే అయినా అతని గ్రంథాన్ని తెలుగువారు వ్యాకరణ గ్రంధంగా గుర్తించడం మాని ఛందోగ్రంధంగానే పరిగణిస్తున్నారని తెలిసికొన్నాం

తన గ్రంథం చదివిన తరువాత ఇతర లక్షణ గ్రంధమేదీ చూడబుద్ధి పొడమని విధంగా అనన్యసామాన్యంగా అపూర్వంగా సర్వవిషయసంకలితంగా గ్రంథాన్ని సంతరించుకోవాలని అప్పకవి చేసిన ప్రయత్నం అడుగడుగునా కనిపిస్తుంది అతని పాండిత్యప్రకర్ష అక్కడక్కడ ఆశ్చర్యకరంగా ఉన్నా అక్కడక్కడ చిన్నచిన్న తప్పులు గూడ వ్రాశాడు కనియె కు కనెను గ్రామ్యమనడం నన్ను తన్ను నిన్ను కళలనడం అలాంటివి ఇవన్నీ చింతామణి సాహచర్యంవలన కలిగిన దుష్ప్రభావాలు కావచ్చు

అనంతునిలో శ్రీనాధునిలో ముద్దరాజు రామనలో తప్పులు పట్టడం ప్రాచీన పండితుల సహజధోరణిని స్ఫురింపజేస్తుంది దోషజ్ఞత పాండిత్యమే కాని గుణగ్రాహిత్వం గూడ జతపడినపుడే అది రాణిస్తుంది ప్రాక్తన లాక్షణికులపట్ల తాను చూపిన వైఖరే తనపట్ల అనంతర లాక్షణికులు—అహోబలపత్యాదులు చూపుతారని అప్పకవి ఊహైనా చేసి ఉండడు నిజంగా అప్పకవి నుండి అహోబలపతి అనేక విషయాలు నేర్చుకున్నాడు కాని అతనిని ఎత్తిపొడుపుగా తప్ప స్మరించనేలేదు అహోబలపండితీయ వ్యాఖ్యానం వెలువడడానికి దానిలో అధర్వణకారికలు సృజించబడడానికీ ప్రధానముఖ్యమైన అప్పకవి పాండిత్యమే నిదాన మనడం—ఆరెంటిని దగ్గరగా చేర్చి చూచినవారికి అనుభవైకవేద్యం ఈ విధంగా చింతామణి మార్గం ఆంధ్రవ్యాకరణవాఙ్మయంలో స్థిరపడడానికి అప్పకవి కల్గించిన దోహదం సామాన్యమైనది గాదని గుర్తించి ఈ ప్రకరణాన్ని ముగిద్దాం

## వాసుదేవవృత్తి

చింతామణి ఇతర వ్యాఖ్యల లాగానే ఇది గూడ తత్కర్తపేరుతో వెలసింది వృత్తి శబ్దానికి గూడ వ్యాఖ్య టిప్పణి అనే అర్థా లున్నాయి కాబట్టే కాశికా

వృత్తి (పాణినీయవ్యాఖ్య) మున్నయిన పదాల్లో వృత్తి శబ్దం వ్యాఖ్యార్థాన్నే ఇస్తుంది దీనికి ప్రసిద్ధి రావలసినంతగా రాలేదు దీని ఉనికిని మొదట తెలుగు వారికి తెలిపినవారు బహుజనపల్లి సీతారామాచార్యుల వారు ఆయన తన శబ్ద రత్నాకరంలోని భాషా ప్రశంస లో చింతామణి వ్యాఖ్యానాల వరుసను ఈ యాంధ్ర శబ్దచింతామణికి బాలసరస్వతి యను పండితుడు టీక యొకటి వ్రాసెను అది బాల సరస్వతీయ మనుపేరఁ బరఁగెడును తరువాత వాసుదేవు డను పండితుఁ డు దానికి వృత్తి యొకటి వ్రాసెను దానిని వాసుదేవవృత్తి యందురు తదనంతరము అప్పకవి దానిని దెనిగించెను అది అప్పకవీయ మనుపేర నొప్పుచున్నది అని తెలపారు

## అప్పకవీయానికి ముందా ? వెనుకా ?

ఆయనమాట ప్రకారమైతే ఈ వాసుదేవవృత్తి చింతామణికి రెండోవ్యాఖ్యాన మని అనవలసి ఉంది కాని అప్పకవి ఎరికనుబట్టి అతని చింతామణినిబట్టి పరి శీలనాపూర్వకంగా చూచినపుడు అప్పకవీయమే చింతామణికి ద్వితీయవ్యాఖ్య అని చెప్పవలసి వస్తుంది అప్పకవి బాలసరస్వతికి చింతామణి లాభాన్నిగూర్చి అతనికి (అప్పకవి) అతి సన్నిహిత కాలంలో అది జరిగినట్లు మొన్నటి కీలకనమమున (అప్ప పీఠిక 50) అని చెప్పడాన్నిబట్టి గూడ బాలసరస్వతికి తరువాత 50 ఏండ్ల లోపలే అప్పకవీయం వెలసినట్లు నిర్ణయించవచ్చు పైగా అప్పకవి ఎతికలోని సంరంభాన్ని గమనిస్తే అతనిది మూడో వ్యాఖ్యాన మని అనడానికి అవకాశం లేదు చింతామణి నేరుగా మతంగనివాసి విప్రునివలన దొరికిన దని చెప్పుకొన్నా దాని వ్యాఖ్య మాత్రం బాలసరస్వతీయానుసారమే చేస్తున్నట్లు చెప్పాడు—అప్పకవి అప్పటికే వాసుదేవవృత్తి వెలువడి ఉంటే బహుగ్రంథ పరిశోధకుడైన అప్పకవికి తెలియకుండా ఉండదు తెలిసి ఉంటే అప్పకవి దాచేస్వభావం గలవాడుగా కన బడడు ఇంతకు అంతగా చిలవలుపలవలు సృష్టిస్తాడే గాని తెలిసినదాన్ని దాచలేదు

అప్పకవీయాన్ని వాసుదేవవృత్తిని పోల్చి చూచినపుడు అప్పకవి వాసుదేవ వృత్తిని చూడలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు వాసుదేవుడు నుమ్మోౘతః (సంధి 3 ) అనే సూత్రవ్యాఖ్యానంలో బాలసరస్వతీయంలో లేని కొత్త అంశాన్ని ప్రవేశ

పెట్టాడు తత్పూరుషాత్ దందుకూర్చి పట్టి విభక్తి తనేషు చ అని సమాసశ్చాత్ర లిగ్విషయఏవ గృహ్యతే త్రత్ర సరళపరుషవర్ణేష్వేవ – అని అయితే అప్పకవీయ వ్యాఖ్య మాత్రం బాలసరస్వతీయం లాగానే నడచింది

సమసనమున నామాంత శృంగముల కెల్ల
హల్లుగదియ స్వార్థంబునఁబొల్లదుౕతము
వికృతి నాగమమై దుౕతప్రకృతి పగిదిఁ
గాంచు సంధి నధర్వణకవిమతమున (అప్ప 5— 29)

చనుగవకుఁ జనుంగవయనఁ దనరుఁ దలిరు జొంపమునకుఁ
దలిరుం జొంపం
బనవచ్చు నను గుబెలఁదికి ననుఁగున్వేఁదియన్న శ్లిష్టమగు
స్థిరపరితన్ (అప్ప 5– 30)

దీనిలో బాలసరస్వతీయం కంటె విశేషాంశమేమి లేదని వేరేచెప్ప పని లేదు గదా కాని అహోబలపండితీయ వ్యాఖ్యమాత్రం వాసుదేవుని వ్యాఖ్యాగత విశేషాంశాన్ని స్వీకరించింది

'ఉకారాంతాచ్చ నుమ్స్యాత్సమాసే అందు కూర్చి పట్టి విభక్తి తనేషుచ సమాసశ్చాత్ర లిగ్విషయఏవ గృహ్యతే తత్రసరళపరుష వర్ణేష్వేవ అత్రాధర్వణ

సరళే పరుషేచైవ సమాసే నుముతో భవేత్
అద్రుతాత్ సరసాదందు పట్టి కూర్చి విభక్తిషు
తనే చ కుత్రచిదతో వికారాచ్చాపి కేచన
అమిశ్రే స్త్రీసమాత్ కేచిత్ ప్రయోగ శరణంకవే

(అహో పం సంధి 8 )

ఈవ్యాఖ్యానాల వికాసక్రమాన్ని పరిశీలించినపుడు తప్పనిసరిగా అప్పకవీయం తరువాతిదే వాసుదేవవృత్తి అవుతుందిగాని వాసుదేవవృత్తి తరువాతిది అప్పకవీయం కాజాలదని సులభంగా నిర్ణయించవచ్చు అప్పకవికి ఒక్క బాలసరస్వతీయంలోని

అంశాలే తెలుసు గాబట్టి అవే అతని వ్యాఖ్యలో ఉన్నాయి  వాసుదేవవృత్తిలోని విషయాలు తెలిస్తే విడిచిపుచ్చడానికి మనసొప్పని విశేషాంశాలవి—అని అహోబలపతి వ్రాతనుబట్టి నిర్ణయించవచ్చు  అయితే వాసుదేవుడు అప్పకవీయాన్ని చూశాడా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు  సమాధానంగా చూశాడని నిస్సందేహంగా చెప్ప వచ్చు  నస్యాత్ తద్ధర్మోక్త (సంధి 6) అనే సూత్రానికి క్రింది అప్పకవీయ వ్యాఖ్యానం వాసుదేవుడు స్వీకరించి తన వ్యాఖ్యలో పేర్కొనడమే సాక్ష్యం

ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్య
పురుషముల నేకవచనముల్ బోవవిడిచి
కడమ పదములు తిఙ్మధ్యకములు గానఁ
గొమ్ములను బ్రాణసంధులు గూర్చుటొప్పు  (అప్ప 5—73)

కాంతురజప్రభృతులు నిను సంతతమును బ్రోతువీవు సనకాదుల మ
ర్దింతు రతవుండు నీవును బంతంబుల ఖలుల ననుచు భావింతు మెదన్  74

వదలక తద్ధర్మములను బొదలెడు ప్రథమోత్తమాఖ్య పురుషైకవచ
పదములు ద్రుతప్రకృతులగుఁబదరును నతఁడోర్తు నేను బలుమఖు
నవఁగన్  75

వాసుదేవవృత్తి : అనాంతేష్వస్త్యేవ సుఖింతుమిపుడు నాంతములు అంటే ద్రుత ప్రకృతులు అవి కానివాటి ఉకారానికి సంధి అవుతుందని వ్రాయడం కడమ పదములు తిఙ్మధ్యకములు గాన గొమ్ములను బ్రాణసంధులు గూర్చుటొప్పు అనే అప్ప కవీయ మతానుసరణ మని వేరే చెప్పపనిలేదు  అప్పకవి భావింతుమెదన్ అని ఉదాహరిస్తే వాసుదేవుడు సుఖింతు మిపుడు అన ఉదాహరించాడు  కాగా వాసు దేవవృత్తి అప్పకవీయానికి తరువాత అహోబలపండితీయానికి ముందువ్రాయబడిందని నిశ్చయించవచ్చు  వాసుదేవవృత్తిలోని అనేకాంశాలు  అహోబలపతి గ్రహించి వాటిని శ్లోకాలుగా మార్చి అధర్వణకారికల పేరుతో తనవ్యాఖ్యలో పొందుపరచు కొన్నాడు  ఆ విషయం మున్ముందు పరిశీలిద్దాం

పై పర్యాలోకనం వలన వాసుదేవవృత్తి అహోబలపతికి పూర్వం అప్పకవికి తరువాత చింతామణి వ్యాఖ్యగా వెలసిం దని నిశ్చయించగలిగాం  ఈ నిశ్చయానికి

ముఖ్యంగా అహోబలపతికి పూర్వం ఈ వృత్తి పుట్టిందని చెప్పడానికి మరొక ప్రబల మైన యుక్తి గూడ ఉంది ఈ వృత్తిలో ఎక్కడ వెదకినా అధర్వణ కారికల స్పర్శేలేదు అహోబల పండితీయం నిండా ఆకారికలే వాటివల్లనే ఆవ్యాఖ్యా నానికి అంతటి ప్రసిద్ధి ఏర్పడింది అహోబలపండితీయం వాసుదేవుడు చూచిఉంటే అధర్వణకారికలతో అతనికి పరిచితి ఏర్పడి ఉండేది అహోబలపండితీయం చూచిన ఏ వైయాకరణుడూ ఆకాలంలో ఆ కారికలపై మోహానికి గురికాకుండా ఉండలేదు చింతామణికి అహోబలపతి తర్వాత వ్యాఖ్యానం చేసిన బలారి నరసింహరాజు తన వ్యాఖ్యలో ఆకారికల్ని విశేషంగా పొందు పరిచాడు వాటిమీద ఆనాటి కొత్తమోజు అలాంటిది అయినపుడు వాసుదేవుడు అహోబలపతికి పూర్వుడనీ ఆతని (వాసు దేవుని) వ్యాఖ్యానంలోని నూతనాంశాలనేకం అధర్వణకారికల పేరుతో అహోబల పండితీయంలో కనిపించడం వలన అతని (వాసుదేవుని) వ్యాఖ్య అహోబలపండి తీయానికంటె ప్రాచీనమనీ నిరభ్యంతరంగా నిర్ణయించవచ్చు శబ్దరత్నా కరకారులు గూడ వాసుదేవుని ప్రాచీనునిగ అహోబలపతి నరసింహ పండితుల్ని ఆధునికుల్నిగా పేర్కొనడం గూడ పై నిర్ణయానికి మరొక ఆధారంగా స్వీక రించవచ్చు

## టిప్పణి వంటి వ్యాఖ్య

అప్పకవీయ వ్యాఖ్యతో పోల్చినపుడు ఈ వృత్తి టిప్పణివంటిదేనని చెప్పాలి అప్పకవి ఎక్కడోతప్ప చింతామణి సూత్రానికి వ్యాఖ్యానంచేసి ఊరుకోడు అతనికి తెలిసిన అనేకాంశాల్ని సందర్భం కల్పించి చొప్పిస్తాడు అతడు చింతామణి సూత్రాలు అడ్డంపెట్టుకొని తనకు తెలిసిన వ్యాకరణ ఛందోవిషయా లన్నింటినీ తన గ్రంథంలో కుమ్మరించాడు కాబట్టే అహోబలపతి అప్పకవీయంనుండి గూడ ఎన్నో అంశాలు గ్రహించి వాటిని సంస్కృతీకరించి అధర్వణకారికల పేర తన వ్యాఖ్యలో చొనిపి దాని గౌరవం పెంపొందించుకొన్నాడు

అయితే ఈవృత్తి పరిమాణంలో చిన్నదైనా ప్రభావంలో పెద్దదే చింతామణి సూత్రాల్లోని కొరతలు ఎన్నింటినో పూరించడానికి యిందులో ప్రయత్నం చెయ్య బడింది ఈ వృత్తి చూపిన మార్గంలో ముందుకు సాగినకారణన అహోబలపతి పెద్ద వ్యాఖ్యాతగా స్థిరపడినాడని చెప్పవచ్చు

వార్తిక రచన

పాణినీయానికి కాత్యాయనుడు వార్తిక రచనతో ఆయాసూత్రాలలోని కొరతలు పూరిస్తూ నిండు తనం కల్పించినట్లు ఈ వృత్తికర్త గూడ చింతామణి సూత్రాల దగ్గర చిన్న వార్తికాలు రచించాడు

సూత్రం నిత్యం మనుత్తమ పురుషక్రియాస్వీత (చింతా సంధి 4)

వృత్తి క్వచిత్ ప్రథమపురుష బహువచనేఽపి వైకల్పిక

ఉదా కాంచిరచ్యుతుని–కాంచిరి యచ్యుతుని ఈ వృత్తినే అహోబలపతి సంగ్రహించి అధర్వణకారికగా మార్చి తన వ్యాఖ్యలో ఉటంకించాడు

సూత్రం పరిమితౌ నమస్తానాం (సంధి 5)

వృత్తి ఎడుస్స్యాత్ పరిమాణకమ్

దీనిని గూడా అహోబలపతి అధర్వణకారికగా మార్చాడు

సూత్రం నస్యాత్తద్ధర్మేత (సంధి 6)

వృత్తి తద్ధర్మపదేన తద్ధర్మక్రియాజన్యవిశేషణంచ గృహ్యతే

అహోబలపతి వ్యాఖ్య తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తజ్జన్యవిశేణంచ గృహ్యతే

ఈవిధంగా వాసుదేవవృత్తి అహోబలపతి వ్యాఖ్యానానికి మార్గదర్శకంగా అక్కడక్కడ అతని అధర్వణకారికల మూలపాఠంగా ఉపయోగపడగలిగింది కాబట్టే దానికి రావలసినంత ప్రసిద్ధి రాలేదని ప్రకరణ ప్రారంభంలో చింతించడం జరిగింది సంధిపరిచ్ఛేదంలోని ప్రాయస్తుస్యాత్ కిమాగికస్యేత –9 అనే సూత్రంలోని ప్రాయశ్శబ్దానికి బహుళార్థం కల్పించినవాడు గూడ వాసుదేవుడే ఆ వ్యాఖ్యానమే అనంతరం అహోబలపతిచేత స్వీకరించబడింది

## ముద్దరాజు రామన్నను అనుకరించడం

వాసుదేవవృత్తిలో గూడ ముద్దరాజు రామన్న కవిజన సంజీవనిలోని లక్షణానికి సంస్కృతీకరణ మొకటి కనిపిస్తున్నది

నవికృతిశబ్దాత్ పరతః సాంస్కృతికానాం భవన్తి గసడదవా (సంధి 24)

పై సూత్రవ్యాఖ్యలో కాక్వాదిషు వికల్పః అని వ్రాసి దాని వివరణంగా కాక్వర్థే–నీగుణమెన్న శక్యమె తాపసమందార సంబోధనే–రామ కొలిచెద నిన్ను అవ్యయే–వృథచేసితివి వృధసేసితివి కర్మధారయే–రామ మూఢుడనైన కర్కశుననుగావుము అచేతనార్థే–నీదుపదభక్తిపటువు వటువు అని ఉదాహరించబడి ఉంది ఈ ఆధారాన్నిబట్టి కవిజనసంజీవని నుండి ఆ లక్షణాన్ని తొలుత వాసుదేవుడే సంగ్రహించాడనీ తరువాత అతనినుండే అహోబలపతి దాన్ని స్వీకరించి ఆథర్వణాంకితం చేశాడనీ నిర్ణయించవలసి వస్తుంది అయితే అహోబలపతి కవిజన సంజీవని నుండి ఇంకా ఎన్నో లక్షణాలు లక్ష్యాలు సంగ్రహించి సంస్కృతీకరించి తన వ్యాఖ్యలో ఆథర్వణ కారికలుగా పొందుపరచి ఉన్నాడు[1] కవిజనసంజీవని అనాడు సుప్రసిద్ధ లక్షణ గ్రంథం దాని పరిచయం ఛందోవ్యాకరణాలమీద అభిమానమున్న పండితులందరికీ అనాడు సామాన్యంగా ఉండి ఉండేది కాబట్టి వాసుదేవుడూ అహోబలపతీ ఇరువురూ దానినుండి నేరుగా లక్షణసంగ్రహణంచేసి ఉండటానికి అవకాశం ఎక్కువగా ఉంది అయితే ఇతరవిషయాలనేకం వాసుదేవ వృత్తినుండి అహోబలపతి స్వీకరించినట్లు మనం పైన చూచిఉన్నాం గాబట్టి ఈ లక్షణాన్ని వాసుదేవుని నుండి అహోబలపతి గ్రహించి ఉంటాడని చెప్పవలసి వచ్చింది

లుగ్వాద్రుతప్రకృతికాత్ పరత స్స్వరశేస్థిరే చ నస్యస్యాత్ (సంధి 25)

పై సూత్రవ్యాఖ్యలో వాసుదేవుడు నూతనాంశంగా ఋకారస్య రేఫావయవత్వేన తస్మిన్‌పరే తస్యలుక్‌వాస్యాత్ అని ప్రతిపాదించి అచట ఋషులు అని

---

1 చూ కారికల మూలపాఠాలు

ఉదాహరించాడు అహోబలపతి ఈ విశేషాంశాన్ని స్వకీయవ్యాఖ్యలో పొందు పరచడం జరిగింది ఇలా ఉదాహరిస్తూపోతే గ్రంథం పెద్దదయ్యే ప్రమాదముంది ఈ వృత్తిలో అధర్వణకారికలకు మూలపాఠాలుగా ఉపయోగపడిన భాగాన్ని గూర్చి ప్రకరణాంతరంలో[1] పరిశీలిద్దాం

## కొన్ని స్ఖలనాలు

అయితే ఈ వృత్తిలో అక్కడక్కడ స్ఖాలిత్యాలు గూడ దొర్లకపోలేదు

దారార్థేఽత ఉదపిర (సంధి 34)

పై సూత్రవ్యాఖ్యలో వికృతౌ న అని విశేషాంశంగా ప్రతిపాదించి అచ్చ తెలుగులో సూత్రప్రవృత్తి లేదనడానికి వెలయాలు ఇల్లాలు అనే రూపాల్ని ఉదా హరించాడు దానికి పూర్వమే క్వచిత్ ఉకారే సిద్ధే రేఫకార్యమేవ అని వ్రాసి ఉదా హరణంగా గొడ్డురాలు అనే సమాసాన్ని ఇచ్చి ఉన్నాడు అయినపుడు గొడ్డు రాలు వికృతి కాదని అతని భావమా? వెలయాలు లాగానే గొడ్డురాలు గూడ వికృతిపదమే కదా వెలయాలు ఇల్లాలు అనే శబ్దాల్లో సూత్రం ప్రవర్తించనిమాట యథార్థమే కాని దానికి కారణం అవి వికృతిసమాసాలు గావడం మాత్రం కాదు కాబట్టే అహోబలపతి ఈ వాసుదేవవ్యాఖ్యను యథాతథంగా స్వీకరించకుండా సమా నాధికరణస్యాభావాత్ వెలయాలు ఇల్లాలు ఇత్యాదౌ నాయం విధిరిత్యేవగన్తవ్యమ్ అని మార్చి వాసుదేవుని వ్రాతలోని పై రుద్ధ్యాన్ని పరిహరించి వ్యాఖ్యానించాడు ఈ ఉదాహ రణం వలన గూడా వాసుదేవుని వృత్తి తరువాతిదే అహోబలపండితీయం గాని అహోబలపండితీయం తరువాతిది వాసుదేవవృత్తి గాదని సులభంగా నిర్ణయించ వచ్చు

## సూత్రప్రవృత్తిని విశాలతరం చేసిన వృత్తి

చింతామణికి వాసుదేవుని వృత్తి పాణినీయానికి కాత్యాయనుని వార్తికాన్ని పోలి బహూక్లృప్తంగా ఉందని ముందు వివరించబడింది అనేక స్థలాల్లో వృత్తి

---

1. చూ కారికల మూలపాఠాలు

అనేక ముఖ్య సంస్కారాల్ని సూత్రాలకి కలిగించి వాటిని అనంతర వాఙ్మయానికి గూడ అన్వయించేటట్లు చేసింది

మహతస్సోర్దు జ నితో భవేత్ పుంసి (అజంత 2)

చింతామణి మహద్వాచకాల సు ప్రత్యయానికి పుంలింగంలో డుజ్ విధిస్తే వాసుదేవుడు క్వచిన్నపుంసకాదపి డుజ్ అని వృత్తి వ్రాసి మిత్రుఁడు మిత్రము అని ఉదాహరించాడు

సవిధవర్తినామిందు (అజంత 27)

చింతామణి ప్రత్యయత్వంలేని ఇందును సప్తమిగా నిర్దేశించి విధించడం గమనించి వాసుదేవుడు అందుగ్రహణస్య సాశ్రయస్యాం అని వృత్తిని చేశాడు ఇందు వలె అందు గూడ స్వతంత్ర పదంగా ప్రయుక్తమౌతుంది—అనే తెలివిడి కోసం

నచ దేశ్యపదే (అజంత 47)

చింతామణి దేశ్యపదాల్లో దీర్ఘాు హ్రస్వాలు కావని సూత్రిస్తే దానికి సవరణగా వాసుదేవుడు క్వచిద్దేశ్యపదే హ్రస్వోవా అని ప్రతిపాదించాడు—ఉదాః తేజి

ఎదంతతాచనామ్నామన్యతరస్యామియాంతానామ్ (అజంత 8 )

చింతామణి ఇయాంత శబ్దాలకు ఎదన్తత్వాన్ని వికల్పంగా విధిస్తే వాసుదేవుడు చకారాత్ పదమధ్యేపి అని వృత్తి వ్రాసి పరియాచకము—పరేచకము అని ఉదాహరించాడు క్వచిత్ప్రాగచోలోపః అని వివరణం వ్రాసి ముత్యము కన్య పర్యాచకము—అని ఉదాహరించాడు

గుణవతాం డుమూప్రాగ్వత్ (హలంత 6)

సూత్రం గుణవద్గణానికి పూర్వంలాగానే డుము ప్రత్యయాల్ని విధిస్తే వృత్తి సంపదాపదాం స్త్రీతుల్యత్వమ్ అని విశేషాంశం చెప్పి సంపద ఆపద అని ఉదాహరించింది

దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్ సుజసో ర్నుమూ వురూచస్త హలంత

సూత్రం నీ నా శబ్దాలకి ప్రథమైకబహువచనాల్లో ను ము ప్రత్యయాల్ని విధిస్తే వృత్తి సుజసోహల్లోపోవా అని విశేషాంశాన్ని ప్రతిపాదించి ఏను ఏము ఈవు ఈరు అని ఉదాహరించింది

సంస్కృతపదేన పరిమితమాన్ధ్రపదం కర్మధారయోభవతి హలంత 48

సూత్రం సంస్కృతపదంతో పరిమితమైన తెలుగుపదమే సమసించి కర్మధారయ మౌతుందని చెబితే దానిలోని పరిమితశబ్దాన్ని వృత్తి స్వల్పర్వంచ షడ్వర్ణ పరిమిత మితి నియమ అని వివరించింది వృత్తిలోని స్వల్ప పదం బాలసరస్వతి పరిమిత శబ్దానికి ఒసగిన అర్థం

రంజతి ఘట్యాదీనాం బిన్దోశ్చస్యాం లావుభౌ భవత (క్రియా 39)

సూత్రం రంజ ఘట మొదలైన క్రియలలో బిందుపూర్వకమైన చకారానికి ద్విత్వయుక్త లకార మౌతుందని (రంజించు-రంజిల్లు) చెబితే వృత్తి క్వచిద్విత్వాభావశ్చేతి కేచిత్ అని విశేషాంశ ప్రతిపాదన చేసి పాటిలు వర్తిలు అనే ఉదాహరణ లిచ్చింది

ఫలితార్థం

పై వివరణం దిఙ్మాత్రంగా చేయడం జరిగింది వాసుదేవ వృత్తినిండా సంక్షిప్తధోరణిలో నూతనాంశాల ప్రతిపాదన అధికంగా కనబడుతుంది వృత్తిలోని నూతనాంశాలన్నిటినీ అహోబలపతి స్వీకరించి కొన్నిటిని కారికలలో నిబంధించి మరికొన్నిటిని వ్యాఖ్యానంలో భాగంగా చొప్పించాడు ఈ వృత్తి అప్పకవీయం తరువాత అహోబలపండితీయానికి ముందు వెలువడడంతో దానికి గుర్తింపు తగినంతగా రాలేదు అప్పకవీయంతో పోల్చినపుడు ఆకారంలో అల్పంగా ఉంది అప్పకవీయం తర్వాత దానితో సరితూగే బృహదాకారంతో అహోబలపండితీయం వృత్తిలోని విశేషాంశాల్ని గూడ తనలో ఇముడ్చుకొని వెలువడడంతో వృత్తి

మరుగున పడిపోయిందని నిర్ణయించవచ్చు కాని చింతామణి పక్కా ఆం వ్యాకరణ వికాసంమీద ఎక్కువ ప్రభావం చూపడానికి వాసుదేవుడు చేసిన దోహద మాత్రం అనల్పమని ఈ వృత్తిని పరిశీలించిన వారు అంగీకరిస్తారు అలా అహోబిల పండితీయానికి వచ్చిన కీర్తిప్రతిష్ఠల వెనుక వాసుదేవుని పరిశ్రమ దాగిఉన్నదనే విషయం గూడ పరిశోధన వలన తెలిసికోవచ్చు

ఈ వృత్తి నేటికీ అముద్రితంగానే మిగిలిపోవడం విచారావహమైన విషయం దీనిప్రతి తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ది 24 సంఖ్యతో ఉంది దీనిలోని విషయాలతోటే ఆ గ్రంథాలయంలోనే ఆర్ 85 25-6 నంబరుగల గ్రంథ మొకటి ఆంధ్రశబ్దచింతామణి ప్రవృత్తి అనేపేరుతో ఉంది కాని దానిలో ప్రారంభసూత్రాలు లేవు

## అహోబలపండితీయం

అహోబలపండితీయం బాలసరస్వతీయం అప్పకవీయం వాసుదేవవృత్తుల తరువాత చింతామణిమీద వెలసిన ప్రసిద్ధ వ్యాఖ్యానం చింతామణికివ్యాఖ్య ద్వారా తెలుగు వ్యాకరణానికి సంస్కృత పండితుల దృష్టిలో ఒక శాస్త్రత్వాన్ని కల్పించిన కీర్తి అహోబలపతిది అతడు లోకస్వభావం గుర్తెరిగిన పండితుడు లోకంలో కీర్తి ప్రతిష్ఠలు ఎలా ఆర్జించాలి పండిత ప్రపంచాన్ని ఎలా ఆకర్షించాలి—అనే అంశాలు అతడు నివసించిన కాలంలో అతనికి తెలిసినంతగా ఇతర పండితులకి తెలియవని చెప్పవచ్చు

### తెలుగువారి ఆత్మన్యూనతా భావం

తెలుగుజాతికి ఏనాడూ తన భాషమీద నిండుగౌరవం ఉన్నట్లు లేదు చెదురు మదురుగా భాషాభిమానం చరిత్రలో అక్కడక్కడా కనబడినా జాతిమొత్తాన్ని ఒకటిగా చూచినపుడు చాల నిరుత్సాహమే కలుగుతుంది వ శతాబ్దిలో భారతం తెలుగు చెయ్యడమంటే మహాభారతయుద్ధమే అయింది 4వ శతాబ్దిలో జనం

---

ఆంధ్ర మహాభారతంలో ఎరికలో నన్నయ మాట

ఎన్ని మంచితనాలున్నా తెలుగే కదా అని చిన్నచూపు చూశారు 16వ శతాబ్దిలో గూడ సగటు తెలుగువారి దృక్పథంలో మార్పులేదు విచిత్రంగా తెలుగు వ్యాకరణం సంస్కృతంలో వెలువడింది తెలుగులో వ్రాస్తే ఏం గొప్పతనం ఎంత తక్కువ మందికి ఎంత ఆలస్యంగా అర్థమయ్యే భాషలో వ్రాస్తే అంత గొప్పఖ్యాతి (అనర్హమైనా) రావడానికి వీలుంటుంది —సరిగా ఎదగని జాతిలో

పై వాఖ్యకు భిన్నంగా తిక్కన పాల్కురికి సోమన్న రాయలు ఉన్నారని వాదించవచ్చు తృప్తిపడనూవచ్చు కాని వారి సేవలు ఉద్యమాలు పరిమిత పరిధిలో సాగినవే ఎంతచేసినా ఒకవ్యక్తి ఒక నిద్రాణమైన జాతిని తట్టి లేపడం అసాధ్యం మొత్తంమీద తెలుగువాడికి తెలుగు కానిదానిమీదే గౌరవం ఆదరం ఆస్థి ఇప్పుడిప్పుడు కొంత మారుతుందని భావించడానికి వీలుంది గాని ఈ అహోబలుని నాటికి పాతపరిస్థితే కొనసాగుతున్నదని ఘంటాపథంగా చెప్పవచ్చు

### *బాలసరస్వతి-అహోబలపతుల పోలికలు*

అహోబలపతి వ్యక్తిగత విషయాలమీద వ్యాఖ్య చేయడం మనపని కాదుగాని ఆనాటి సమాజస్థితిని అర్థంచేసుకొనడానికి ఆ వ్యాఖ్య ఉపకరిస్తే చేయవచ్చు ఆడంబరంగా ఉండాలని తన పేరునే సంస్కృతీకరించుకొన్న వ్యక్తి ఈ వ్యాఖ్యాత ఈ సంఘటన చిన్నదైనా ఆనాటి సమాజ మానసిక స్థితికి అద్దం వంటిది ఇతనికీ ఇతని పూర్వుడు చింతామణికి కర్తృవ్యాఖ్యాతగా నిర్ణయించబడినవాడు అయిన బాలసరస్వతికీకొన్ని పోలిక లున్నాయి ఆ పోలికల్లో మొదటిది—ఇద్దరూ సొంత పేర్లతో గాక పెట్టుడు పేర్లతో పిలిపించుకోవడం బాలసరస్వతి అనేది అతని పుట్టుపేరు గాదు అది బిరుదం స్వయం కల్పితమో పండిత ప్రదత్తమో తెలియదు బిరుదాన్ని పేరుకు ముందో వెనుకో జోడించుకుంటారు గాని పేరు మాని బిరుదంతోనే పిలిపించుకోవడం ఒక మానసిక వైలక్షణ్యమే బాలసరస్వతి పేరు ఎలకూచి వెంకటకృష్ణయ్య అహోబలపతి పేరు గాలి ఔబళుడు[3] పోలికల్లో రెండవది

---

కావ్యాలంకార చూడామణిలో 8వ ఆశ్వాస ప్రారంభంలో విన్నకోట పెద్దన మాట

2 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం— 248 నం బాలసరస్వతీయంలో కలదని నిడదవోలు వెంకటరావు గారు

3 అహోబలపండితీయం—వ్యాఖ్యాంత పద్యాలు—9

ఇద్దరికీ వ్యాకరణాలు దొరకడం బాలసరస్వతికి చింతామణి అహోబలపతికి వికృతివివేకం మూడవది–ఇద్దరికి దొరికిన వ్యాకరణాల్లోను తత్కర్తల కాలానికి తరువాతి భాష వ్యాకృతమై ఉండటం నాల్గవది–ఇద్దరూ వ్యాఖ్యాతలే అయినా వారికి దొరికిన అపూర్వ వ్యాకరణాల్లోని సూత్రాల అర్థాలు వారైౖ వివరిస్తే తప్ప తెలియ రానివి గావడం ఐదవది–ఆధునిక పరిశోధక పండితులు ఆ ఇరువురి అపూర్వ వ్యాకరణాలూ వాటి కర్తలని పేర్కొనబడినవారివి గాక ఆ వ్యాఖ్యాతలవే–అని శంకించడం

బాలసరస్వతికి అహోబలపతిని గూర్చిన అవగాహన ఉండదు కాని అహో బలపతి బాలసరస్వతిని తికరణశుద్ధిగా అర్థంచేసుకొన్నాడు బాలసరస్వతికి చింతా మణికి ఉన్న యథార్థ సంబంధం బాలసరస్వతి ప్రకటించిన సంబంధం లోకంలో ఆ ప్రకటన స్వీకరింపబడిన తీరూ బాలసరస్వతికి గల్గిన ప్రతిష్ఠ–ఈ అన్నిటినీ చక్కగా అర్థం చెసికొన్నాడు అహోబలపతి

ఆకాలంలో (తనకూ బాలసరస్వతికీ 00 సంవత్సరాలపైన ఎడముంది) బాలసరస్వతిని గూర్చి ఎండితలోక మేమనుకునేదో అప్పకవివంటి లాక్షణికుని నోట విన్నాడు

ఇలఁ ద్రివిక్రమ రచిత వృత్తులను హేమ
చంద్ర సూరిప్రణీత భాష్యంబు చేతఁ
దనరు వాల్మీకి మూలసూత్రముల వలనఁ
బ్రాకృతాది షడ్భాష లుద్భవముఁజెందె —(అప్ప –78)

తెలుఁగునకు బొడము లక్షణములు బాలసరస్వతి ప్రముఖబుధకృతటీ
కల వలనను దెల్లంబై చెలువగు నీయాంధ్రశబ్ద చింతామణిచేన్

(పైది 80)

వ్రాసినది చింతామణికి టీకే అయినా హేమచంద్ర త్రివిక్రముల సరసన నిలబడ్డాడు బాలసరస్వతి పైమాటలలో త్రివిక్రముడు వృత్తి మాత్రానికి హేమచంద్రుడు

భాష్యానికి కర్తలనడం అసత్యం వాల్మీకి సూత్ర కర్తగాదని చింతామణిలో ప్రాకృతవ్యాకరణాను కరణపరిశీలనంలో తెలిసికొన్నాం కాబట్టి తానుగూడ వికృతి వివేకాన్ని అపూర్వంగాబయటపెట్టి దాని వ్యాఖ్యానమే చేసినాచాలు కీర్తి కావలసినంత వస్తుంది—ఇటువంటి మానసికస్థితిలో అహోబలపతి తన వ్యాఖ్యానానికి దిగాడు

## అహోబలపతి స్వాతిశయ ప్రకటనం

పూర్వవ్యాఖ్యలు తత్కర్తల వ్యవహారస్థ నామాలతో మాత్రమే పిలువ బడ్డాయి కాని ఈ వ్యాఖ్యలో తత్కర్త పేరుకి పండితశబ్దం అతికించబడింది కారణం : అతని వ్యాఖ్యా వ్యాఖ్యకు ముందు ఆత్మపరిచయం చేసికొన్నతీరు వ్యాఖ్య చివర చేసిన ప్రసంగం—ఈ మూడూ కలిసి అతని పేరులోనె పండితశబ్దాన్ని ఒకభాగంగా మార్చివేశాయి అతని వ్యక్తిత్వం అతని మాటల్లోనే విందాం

కామంసంతు పదశ్శతం సుకవయో గంభీర వాగ్గుంభనా
రంభోజ్జృంభిత వైభవా మదుదితం వాక్యం శృణుధ్వం పరమ్
విద్వాంసి కవయ స్త్వహోబలపతే కోవాంధ్రభాషామణే
విజ్ఞానే వద్భుతో విచక్షణణి సర్వావనీమండలేః

(అహో వం పీఠిక 77)

యన్మూర్త్యా కవితామూల కంద వాగనుశాసనౌ
జాగ్రతోఽ హోబలపతిః రాజతే స విచక్షణ (అహో వం పీఠిక 78)

---

ఈవిధమైన స్వాతిశయ ప్రకటనలకు ప్రారంభం నన్నయతోనే జరిగింది (భారత అది —9) మత్యమరాధిపాచార్య శబ్దంతో ఆయన ఆత్మ పరిచయం చేసికొన్నాడు

దీని ఆంధ్రీకరణం మనంచేసే పనిలేకుండా అహోబలపతే గ్రంథాంతంలో కొంచెం ఇంచుమించుగా చేశాడు దాన్ని గమనిద్దాం

అకుటిలకీర్తి నిర్మలత నంచితుఁడౌ భళపండితుండు వే
తొకఁడగు శబ్దశాసనుఁడహోయని మన్నన నేఁడు సేయఁగాఁ
బ్రకటము సాహసంబు కవిరాజుల కెల్ల నదెట్టులన్నఁ దా
వికృతికి మూలమై యతఁడు విశ్రుత వక్రసమాఖ్యఁ గాంచఁదే — 9

గాదిలి నన్నభట్టన వికారపుఁ బేరిది కూడదంచు లో
నాదరణంబు మానక మహామహులార గుణగ్రహైక ద
త్తాదరులార యాదరసహాయులరొచుఁ గనుంగొనుండు స
మ్మోదవిధాన సాధన మపూర్వము మద్రచిత ప్రఫక్కికన్ — 0

వేరనలేరు ధారుణి నవీనతరాంధ్ర కవిత్వసంపదా
ధార రసజ్ఞులైనఁ గవితల్లజులైన వినుండు పాండితీ
పారగులార యోపరమబాంధవులారా తదీయశబ్ద సం
భారము పారముం దెలియఁ బాల్పడనేనసుఁడీ జగంబునన్ — 1

గట్టిగ వభినవ నన్నయ
భట్టాచార్యాభిధాన వటుబిరుదాంకం
బట్టిటనక వహించిన
దిట్టను నసుఁబోలఁగల సుధీమణులేరీ? — 2

పై పద్యాల్లో మొదటిదానిలో అహోబలపతి వికృతివివేక కర్తృతా ధ్వనిస్తున్నట్లుగా తాను వికృతకిమూలమై విశ్రుత సమాఖ్య పొందినట్లు చెపా అంటే వికృతివివేకం నిజంగా తన రచనే గాని అధర్వణునిది గాదని వక్రి ప్రకటించడమే రెండవదానిలో ఈవ్యాఖ్యాత పేరుకెంత ప్రాముఖ్య మిస్ తెలిసికోవచ్చు నన్నభట్టు వికారపు పేరట నిజమదికాదు-తనపేరు ఓబ

వికారంగా ఉందని సంస్కృతీకరించుకొన్నవాని మన పరిపక్వత అది పేరు వికారమైతే కృతిని అనాదరిస్తారని అతని శంక

## తెలుగు వ్యాఖ్యల నిస్సారత

ఇలాగే అతని వ్యక్తిత్వాన్ని ఇంకా తెలిసికోవాలంటే చింతామణి పూర్వ వ్యాఖ్యలమీద అతని అభిప్రాయం చూడాలి

టీకా బాలసరస్వతీ కవికృతా శుద్ధాంధ్ర వాగ్గుమ్ఫితా
సూత్రప్రోక్త పదార్థమాత్రకథన ప్రక్షీణ శక్తిస్తత
కస్యాప్యేద్భువిపండిత కవివర కించాంధ్ర పద్యైర్మితో
గ్రంథోఽప్యప్పకవే ర్మదం దిశతు నో విద్వత్కవీనాం ఘనాం

(పీఠిక 76)

బాలసరస్వతి టీక శుద్ధాంధ్ర వాగ్గుంభితమట తెలుగువాడు తెలుగు వ్యాఖ్యా నానికిచ్చే ప్రశంసాపత్రమిది శుద్ధాంధ్ర మంటే శుభ్రమయిన అచ్చమైన తెనుగని కాదు తాత్పర్యం శుద్ధమొద్దు శుద్ధబుద్ధావతారం—వంటి వ్యవహారంలోని శుద్ధ పదం వంటిదది వట్టి అని హేళన న్యూనతను స్ఫురించే నీరసశబ్ద పర్యాయ మది

బాలసరస్వతి సూత్రంలోని పదాలు వివరించి ఉదాహరించడంతో వ్యాఖ్యానం ముగిసిందనుకున్నాడట పోనీ ఒప్పుకుందాం మరి అప్పకవి వ్యాఖ్యానం చిలవలు పలువలుగా పెరిగి పెద్దదయింది దదా దాన్నయినా మన్నిస్తాడా అహో బలపతి? లేదు అది తెలుగు పద్యాలకు పరిమితమయిందట అప్పకవి పద్యమయంగా వ్యాఖ్యానించినా ఛందస్సు అతని వ్యాఖ్యాన విస్తృతిని అడ్డగించిందని అది చూచిన వాడెవడూ అనలేదు అయినా అదీ తెలుగులో ఉండటమే దాని తప్పు భూమిలో పండితుడైన కవివరు డెవడూ పై రెండింటితో సంతోషించలేడట అదీ అతని నిర్ణయం కాబట్టి తాను కవిశిరోభూషణం సంస్కృతంలో నిర్మిస్తున్నాడు ఆ శిరో భూషణంతో అతడు ప్రసరింపజేసే కాంతులు ఇవి

కర్కశ తర్కవాక్తర్కణాకుంఠిత విశదమేధావిధా విలసనంబు
ఫణిరాజ ఫక్కికా ప్రముఖ శబ్దగ్రంథ సారసర్వస్వ విజ్ఞానపటిమ
ఉభయ మీమాంసార్థ విభవాను సంధాన బంధురమేధా ధురంధరతయు
వల్మీకసంభవ వ్యాకృత్యలంక్రియా కోశాది పరిచితీ కౌశలంబు

సరసకవితా మహామార్గ సరసగమన
చతురిమయుఁగల్గు పండితజనుల కెలమి
నెలవుకొనఁజేయు జగతిలో లలితసూక్తి
భూషణుండైన కవిశిరోభూషణుండు (గ్రంథాంత పద్యం ౬)

తర్కం వ్యాకరణభాష్యం ఉభయ మీమాంసాశాస్త్రాలు ప్రాకృత వ్యాకరణాలు తెలిసిన పండితు లందరికి ఆనందకరంగా తన వ్యాఖ్య ఉంటుందట ఆయా శాస్త్రాల్లో తానార్జించిన పాండిత్యప్రకర్ష నంతటినీ చింతామణిమీద గుమ్మరిస్తాడట మంచిదే ఇక్కడ మనం పరిశీలించవలసింది—అతని కాలంలో తెలుగంటే పండిత సమాజంలోని చులకన భావం (పీఠికాశ్లోకం ౪౪) చదువంటే సంస్కృతమే అనే ధోరణి సంస్కృతంలో వ్రాస్తే తప్ప గొప్పతనం లేదనే భావం—ఇదీ అతని వ్యాఖ్యానావిర్భూతికి మనోమయ పూర్వరంగం

ఇతని వ్యాఖ్యానానికి బాలసరస్వత్యప్పకవుల వాటికీ ఉన్న భేదాలు ముఖ్యంగా రెండు భాష సంస్కృతం కావడం—మూలం సంస్కృతం కాబట్టి వ్యాఖ్యా సంస్కృతమే అయితే ఉచితంగా ఉంటుంది 2 అధర్వణకారికలు లేక వికృతి వివేకం వ్యాఖ్యతో జోడింపబడటం ఈ రెండింటినీ ముందు పరిశీలించి తర్వాత అతని వ్యాఖ్య లోపలికి వెళదాం

### భాష సంస్కృతం కావడం

సంస్కృతంలో వివిధ శాస్త్ర చర్చల్లో సంస్కృత భాషా ప్రయోగం సుప్రతిష్ఠితం చర్చాప్రారంభం ఉపసంహారం పూర్వపక్షం సమాధానం—ఇవన్నీ

సంస్కృతంలో చేయడానికి పురానిర్ణీతమైన మార్గ మొకటి ఉంది పైగా వ్రాసే వాడు చదివేవాడు ఇద్దరూ సంస్కృతం వచ్చినవారైనపుడు శాస్త్రాల్లో ప్రవేశ మున్నవారైనపుడు అలవాటు ఆధారంగా ఒకవిధమైన ఆనందం కలుగుతుంది

భావావిష్కరణకి సంస్కృతంలో ఉన్న సౌలభ్యం స్వేచ్ఛ ప్రత్యేక పరిశ్రమ చేస్తే తప్ప తెలుగులో ఉండదు—ఆనాటి పండితులకు ఆ వాగ్ధోరణి పట్టు బడితే సంస్కృతంలో వ్యవహరించడం సులభమే గాక విషయ మెలా ఉన్నా భాషామాత్ర గౌరవం అదనంగా లభిస్తుంటుంది—వ్యవహర్తకు ఇతర శాస్త్రాల్లోని అంశాలు ఉద్ధరించి చూపడం సహజంగా అతికినట్లుంటుంది ముఖ్యంగా తెల్గునాట పండితులకి సంస్కృతంలో ఉంది కాబట్టి తెలుగు వ్యాకరణమైనా (అహో పం పీఠిక 39) దాన్ని చదవడంలో చర్చించడంలో ఒక అభాస గౌరవం ఉంటుంది మహాభాష్యంలో పతంజలి వలె సూత్రకర్తను ఆచార్యశబ్దంతో పిలుస్తూ వృత్తి క రమ (కారికల కర్తను)ద్వితీయాచార్యశబ్దంతో వ్యవహరించి తాను ఆ ఆచార్యుల వరుసలో తృతీయుడుగా (పతంజలిగా) స్ఫురింపజేశాడు—అహోబలపతి తెలుగువారికి గూడ తమ వ్యాకరణ శాస్త్రానికి ఆచార్యత్రయం ఏర్పడిందని ఒక తృప్తికలిగింది ఇదంతా సంస్కృతాధిక్యానికి దాసోఽహమనటమే తప్ప వేరుకాదు అయితే ఆ గుర్తింపు తెలుగువారికి లేదు

*అధర్వణకారికలు*

అహోబలపతి వ్యాఖ్యాన విజయానికి మూలకంద మీగ్రంథం ఇది అతని చేతిలో వజ్రాయుధం తనపూర్వుణ్ణి గాని సమకాలికుణ్ణి గాని భూషించదలచినా దూషించదలచినా ఇది తిరుగులేని ఆయుధం అతని పాలిటికి ఇది అపూర్వమైన వ్యాకరణం దాని ఉనికి మనికి అహోబలపతికి పూర్వం లోక మెరుగదు అసలు ఆ గ్రంథావిర్భావానికి అహోబలపతిని ప్రేరేచినవాడు పరోక్షంగానే ఐనా బాల సరస్వతి అతడు అదృష్టచరమూ అశ్రుతపూర్వమూ అయిన వ్యాకరణాన్ని లోకాని కందించి ఎంత కీర్తిప్రతిష్ఠలు ఆర్జించాడో అహోబలపతి అర్థం చేసుకొన్నంతగా ఏ అనంతర వైయాకరణుడూ అర్థం చేసుకోలేదనడం యథార్థ కథనం తత్త్వతః బాలసరస్వతిని అనుకరించి తానూ ఒక అదృష్టచరమూ అశ్రుతపూర్వమూ

అయిన వ్యాకరణాన్ని లోకాని కందించాడు దానిపేరే వికృతివివేకం లేక అధర్వణ కారికావళి అధర్వణకారికలు అనే పేరు మనం పెట్టుకున్నదే గాని అహోబలపతి సుందరంగా రెండు పదాల్లోను ప్రథమాక్షరాలు వి లుగా ఉండేటట్లు వికృతివివేక మని పెట్టాడు

ఈ గ్రంథాన్ని గురించి ఎవరికీ ఏమీ అహోబలపతికి పూర్వం తెలియదు గాబట్టి అతని మాటలే ముందు స్వీకరిద్దాం

అప్పార్య పుస్తకారూఢ పారభేదాద్యదుత్థితమ్
మయా సంగృహ్యతేరూపం తదప్యాధర్వణోక్తితః (పీఠిక 73)

యస్సారో౽ ధర్వణగ్రంథే సోప్యత్రైవ విధీయతే
తేన తత్ఫక్కికాలోకలాలసా త్యజ్యతాం బుధైః (పైది 8)

అహోబలపండితీయ పీఠికలో వికృతి వివేకం అనే పేరు లేకుండా అధర్వణ గ్రంథ మంటూ కారికల్ని గూర్చి చేసిన ప్రసంగ మిది లోకానికి వికృతి వివేకం కొత్తదైనా దాన్ని పరిచయంచేసే మాటలేవీ లేవు ఇంతకు ముందు 00 సంవత్సరాల క్రితమే ఏమి మహాద్భుతంబిది హరి హరి అంటూ బాలసరస్వతి అటువంటి అపూర్వ గ్రంథాల ఆవిష్కరణ క్రమాన్ని ప్రతిపాదించిపోయాడు ఇంత స్వల్పకాలంలో మళ్లీ అదే ఫక్కిలో తానూ ఒక అద్భుత ప్రకటనచేస్తే లోకం అద్భుత పడక పోవచ్చు కాబట్టి ఆ ఆవిష్కరణ విధానం మార్చి చెప్పకుండానే అది అపూర్వగ్రంథ మని లోకం గ్రహించేటట్లు చేశాడు అహోబలపతి ఇది చాల భద్రమైన పద్ధతి

ఎన్నో లక్షణాలు ఇంకెన్నో లక్ష్యాలు గ్రహించి పెద్ద ప్రామాణికుడుగా పేరుమోసిన అప్పకవికి గూడ ఈ గ్రంథసంపాదన సాధ్యం కాలేదని వ్రాసి (అహో పం సంధి 4వ సూత్ర వ్యాఖ్య) గ్రంథ ప్రాశస్త్యం తన వ్యాఖ్యలో వెలువరించాడు ఆ మహాగ్రంథం నుండి తాను అపూర్వ సూత్రాలు ఉటంకిస్తున్నట్లయినా ప్రకటించాలి కాబట్టి నిరాడంబరంగా పై శ్లోకాలు రెండు వ్రాశాడు

అయితే అహోబిలపతి వస్తుతః మేధావి ఈ కారికల యథార్థత ప్రకటితం కాకపోయినా స్ఫురించాలని అతని అభిప్రాయం తన ధీచాతుర్యంతో అపని చేశాడు ఫలితంగా పై రెండో శ్లోకంలోని ఉత్తరార్థం వ్రాయబడింది తాను చేసేది చింతామణి వ్యాఖ్యానం దానికి తన ముందు ఇరువురు వ్యాఖ్యాత లున్నారు వారిలో బాలసరస్వతి టీక అల్పంగా ఉన్నా అప్పకవి వ్యాఖ్యానం అనల్పంగానే ఉంది అయినప్పుడు తన వ్యాఖ్యలో ఏదో ప్రత్యేకత లేకపోతే దాని అవసరాన్నే పండితులు శంకించవచ్చు కాగా వికృతివివేక మనే గ్రంథం అపూర్వంగా బయట పెట్టాడు అహోబిలపతి బాలసరస్వతి వెలువరించిన గ్రంథం నన్నయ్య వ్రాశాడంచే అది సంస్కృతంలో ఉండటం చూచి నన్నయను ౧౫వ ౧౬వ శతాబ్దాల్లోని కవులు తమ కృతుల్లో శబ్దశాసన వాగనుశాసన బిరుదనామాలతో స్తుతించి నమస్కరించడం చూచి పండితపరంపర విశ్వసించింది అలాగే తాను వెలువరించిన గ్రంథం గూడ నన్నయ్య తరువాతివాడైన ఒక ప్రసిద్ధలాక్షణికుని పేర ప్రసిద్ధం చెయ్యాలని అహోబిలపతి సంకల్పం చింతామణి సంస్కృతంలో ఉండటం తన వ్యాఖ్యానం సంస్కృతంలో ఉండటం—ఈ రెండు అనుకూల్యాలతో వికృతివివేకాన్ని సంస్కృత కారికలుగా గ్రథించి తన వ్యాఖ్యానంలో అక్కడక్కడ పొదగడానికి చక్కటి అవకాశం ఏర్పడింది ఇన్ని అనుకూల పరిస్థితుల్లో వికృతివివేక కర్తృత్వం సామాన్యంగా అంగీకరింపబడేటట్లు ఛంద కర్తగా భారతకర్తగా ప్రసిద్ధుడైన అథర్వణుని పేర ఆ గ్రంథాన్ని వెలయించి ఉంటాడు అహోబిలపతి

తరువాత భవిష్యత్కాలంలో గూడ ఈ అథర్వణనామ ప్రాశస్త్యం ఏమీ తగ్గకుండా అతనికి తన వ్యాఖ్యానంలో ద్వితీయాచార్యత్వం కల్పించాడు తనకు గూడ సూత్రకర్తకూ (నన్నయకు) వార్తిక కర్తకూ (అథర్వణునకు) పరసన భాష్యకర్తగా పేరు రావడానికి ఇది సరైన ఏర్పాటుగా అతనికి తోచి ఉంటుంది ఇదంతా వికృతివివేకావిర్భావానికి పూర్వ రంగ నిర్మాణమన్నమాట ఇతని ఈ ప్రణాళికంతా సవ్యంగానే కొనసాగినట్లు చెప్పవచ్చు ఇంత నిరాఘాటంగా యిది నెరవేరడానికి ముఖ్యకారణం సంస్కృతం చాలమంది పండితులకు వ్యాకరణం మంచేనే తలనొప్పి తత్రాపి సంస్కృతంలో వ్రాసిన తెలుగు వ్యాకరణం చింతామణి దానికి సంస్కృతంలోనే వ్రాసిన వ్యాఖ్యానం అహోబిలపండితీయం అందులో అంతర్భాగం వికృతివివేకం కాగా వాటినిర్మాణం జోలికి ఏ విద్వాంసుడూ

పోలేదు ఎవరికి వారు ఉపేక్షించారు ఆడిదము సూరకవి వంటి వాడు సంస్కృతం లోని ఈ తెలుగు వ్యాకరణ రచనమీద ఇలా వ్యాఖ్యానించాడు

ఆంధ్ర మర్మంబు తెలిగొంగ ననువుపడునె
ప్రకట సంస్కృత రచిత సూత్రములచేత
నవనిఁబాణిని ఘటిత సూత్రార్థసరణి
తెనుఁగు టీకలచేత సాధింపనగునె (కవిసంశయ విచ్ఛేదం -౯)

కాబట్టే ఈ మూడూ (చింతామణి అహోబలపండితీయం వికృతి వివేకం) ఒకేచోట సంస్కృతభాషా పరిరక్షణలో చాలకాలం సహజీవనం చేశాయి కాని ఆధునిక పరిశోధక విద్వాంసులు శ్రీ కందుకూరి వీరేశలింగం ప్రభృతులు ఈ చింతామణి వికృతివివేకాల కవచాన్ని భేదించి లోపల ప్రవేశించి వాటి కాల కర్తృత్వాల్ని శంకాస్పదం చేసి తరువాతి పరిశోధకుల్ని ఈ విషయమై యోచించేటట్లు చేశారు ఫలితంగా పండితలోకంలో సంచలనం కలిగి ఈ రెండు గ్రంథాల కాల కర్తృత్వాల మీద పెక్కు వాదోపవాదాలు జరిగాయి ప్రసుతం ఈ పరిశోధనలో చింతామణి కాల కర్తృత్వాలు నిర్ణీతాలైనాయి గాబట్టి ఇక్కడ వికృతివివేక కాల కర్తృత్వాల విషయమే పరిశీలిద్దాం దీని కాల కర్తృత్వాల నిర్ణయానికి ముందు ఇది ఒక యథార్థమైన గ్రంథమా? దీనిలోని కారికలు స్వతంత్రాలా? లేక పూర్వలక్షణాల అనువాదాలా? అనే ప్రశ్నలకు సమాధానాలు కనుగొనవలసి ఉంది

## వికృతివివేకం యథార్థ గ్రంథమా?

ఇది అహోబలపతి వ్యాఖ్యలోనే మొదట కనిపించింది ఆ కనిపించడం గూడ అహోబలపతి వ్యాఖ్యానానికి ముందువెనుకలు గానే గాని సూత్రానికి తర్వాత కాదు పైగా కారికలన్నీ వ్యాఖ్యానానికి సందర్భపడతాయేతప్ప సూత్రానికి సందర్భపడవు మొత్తం కారికలన్నింటికి ఈ సూత్రంతో సందర్భపడకపోవడం తనే మాత్రం సమన్వయిస్తుంది మచ్చుకి ఒక్కొక్క పరిచ్ఛేదం నుండి ఒక్కొక్క కారికని పరిశీలిద్దాం

సంజ్ఞాపరిచ్ఛేదంలో

ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషాతయోర్భవేద్వికృతిః
కేవలతయానుసర్పత్యుభేచ యేయం యథాతథం భాషా —11

ఈ సూత్రానికి సంస్కృతం ప్రాకృతం తెలుగుకి మూలం తెలుగు సంస్కృత ప్రాకృతాల మార్పువల్ల ఏర్పడింది ఈ తెలుగు ఆ రెండు భాషల్ని ప్రత్యేకంగా (విడివిడిగా)అనుసరిస్తుంది- అని అర్థం బాలసరస్వతి తెలుగు సంస్కృత ప్రాకృతాల్ని విడివిడిగా అనుసరిస్తుందని నిరూపించడానికి తెలుగులోని పదాలు కొన్ని సంస్కృత సమాలనీ మరికొన్ని ప్రాకృత సమాలనీ కొన్ని సంస్కృత భవాలనీ మరికొన్ని ప్రాకృత భవాలనీ వివరిస్తూ జూదముశౌరసేనికే తద్భవ మని వ్రాశాడు దీన్ని అనంతర వ్యాఖ్యాత అప్పకవి యథాతథంగా తన వ్యాఖ్యలో స్వీకరించాడు అహోబలపతి మాత్రం జూదము శౌరసేనీతత్సమం గాని తద్భవం కాదని వ్యాఖ్య చేసి జూదము శబ్దంలో దంత్య జకార మున్నా అది తత్సమత్వహాని కలిగించదని తన ప్రతిపాదనకు సమర్థకంగా ప్రాకృతే తద్భవే చాపి చజౌ దంతభవౌ స్మృతౌ । అనే కారికను అథర్వణ ప్రోక్తంగా ఉదాహరించాడు కారికకు ప్రాకృత సమంలో తద్భవంలో ఉండే చకార జకారాలు దంత్యా లని అర్థం ఈ కారిక ఆధారంగా జూదము శబ్దంలో దంత్య జకారమున్నా అది ప్రాకృత సమమే అనే అహోబలపతి వాదం నెరవేరింది

ఇక్కడ గమనించవలసిన విషయం కారిక సూత్రానికి ఎంతగా సూటిగా సందర్భపడి ఉంది అని సూత్రంలో చకార జకారా ల తాలవ్య దంత్య ప్రసక్తి లేదు కాని కారికలో అది ఉంది ఆ ప్రసక్తి అహోబలపతి వ్యాఖ్యాన ధోరణికి చెందింది ఆ ధోరణి మరొక విధంగా మారి రేఫ శకటరేఫలు దానిలో ప్రసక్తమై ఉండే కారిక గూడ రేఫ శకటరేఫలకు చెందినదై ఉండేది కాగా సూత్రానికి కారికకు స్వయంగా సంబంధం లేదు

---

ఈ వికృతివివేకం ఒక గ్రంథంగా కాక అహోబలపండితీయంలోనే వికీర్ణంగా ఉండటంవలన వీటికి సంఖ్యా సందర్భం ఈయడం కుదరలేదు

సంధిపరిచ్ఛేదంలో

సంధిర్నాచో వ్యసుత —

ఈ సూత్రానికి ఉత్తు కంటె భిన్నమైన అచ్చుకి అచ్చుపరమైతే సంధిలేదని అర్థం మేనయత్త సిరియన్న వన్నెయొల్లె రోయూవి మైయొలపు గ్లోయుద యించె –ఇవి సూత్రానికి ఉదాహరణలు సూత్రం ఉత్తుకు సంధి విధించడానికి నిర్దిష్టమైంది గాబట్టి ఇంపు + అగు= ఇంపగు వంటివీ ఉదాహరణలే

తర్వాత అహోబలపతి సూత్రంలోని అనుతః అనేపదంలోని ఉతః అనేది కేవల ఉకారాన్నే (కళనే) నిర్దేశిస్తుంది గాని ద్విత్రిశపూర్వ ఉకారాన్ని నిర్దేశించదు–అని వాదించ కూడదని ఒక ప్రతిపాదన చేశాడు దానికి పూర్వపక్షం చేసి సమాధానం చెప్పి చివరికి ఈ సూత్రంతో ఉతః అనేపదం ద్రుతాంతాలకు గూడ అన్వయిస్తుందని నిర్ధారణ చేశాడు అసలు ఈ ప్రతిపాదనకు సందర్భ మేమిటో గూడ తెలిసికొంటే మంచింది రామున్ + అభిరామున్ అనే స్థలంలో ప్రస్తుత సూత్రం ప్రవర్తిస్తే రామభిరామున్ 1 అనే అనిష్టరూపం ఏర్పడవలెనే అని శంకించి ఏర్పడితే వివక్షించిన అర్థం స్ఫురించదు గాబట్టి ప్రాంశుపయోదనీల తనుభాసితుమజ్జ్వల దండధారు –(భీష్మ 1–7 ) ఇత్యాదిగా ప్రయోగా లున్నాయి గాబట్టి అలాంటి సంధులు చేయరాదు అని అంటూ పై ప్రతిపాదన చేశాడు

రాములన్ + అభిరాములన్ అనేచోట గూడ పై ప్రతిపాదనతోనే రామల భిరాములన్ అనే అనిష్టరూపాన్ని వాఽఽతః అనే అనంతర సూత్రం ద్వారా శంకించి దాని నివారణార్థం ఒక కారికను ఉదాహరించాడు

---

రామున్ + అభిరామున్ అనేచోట అనాదిమ విభక్తిమూతోవా అనే సూత్రంతో ఉత్వ సంధి ప్రాప్తించాలి కాని పై రామున్ లోని ఉకారం విభక్తిగతం కాదు కాబట్టి అక్కడ ఉత్వసంధికి ప్రాప్తే లేదని శ్రీ వెంపరాల సూర్యానారాయణ శాస్త్రి వ్రాశారు (అహో పం పీఠిక ఆంధ్రరచయితల సంఘం హైదరాబాదు )

సంధిస్తు ద్రుతపూర్వస్య ప్రాయశోనభవేదతః —అని

దీనికి ద్రుతపూర్వమైన హ్రస్వాకారానికి తరచుగా సంధిరాదు అని అర్థం రాములన్ అనేది ద్రుతపూర్వ హ్రస్వాకారం కాబట్టి సంధి రాకుండా నిరోధించబడింది ఇక్కడగూడ చింతామణి సూత్రం ఉదంతాలు కాని పదాలకు సంధికాదని చెపుతుంటే కారిక ద్రుతపూర్వ హ్రస్వ అకారానికి తరచుగా సంధికాదని చెబుతుంది ఈ కారిక అహోబలపతి వ్యాఖ్యానంలో తటస్థపడిన రాములన్ + అభిరాములన్ ఇత్యాది స్థలాల్లో సంధిని విషేధించడానికి నిర్మితమైందే కాని సూత్రానికి సందర్భపడేది కాదు అహోబలపతి వ్యాఖ్యనుండి వేరుచేసి చదివితే ఏ కారికకూ సందర్భం గాని అర్థం గాని సామాన్యంగా తెలియవు అధర్వణకారికావళి అనే ప్రత్యేకగ్రంథం ద్వితింత్రిణి (రెంటచింతల) సీతారామకవిచేత కవిజనమండన టీకా సహితంగా వెలయించబడిందే అని ఎవరైనా శంకించవచ్చు నిజమే కాని అతడు అహోబలపండితీయం నుండి కారికల్నీ వాటి అర్థాల్నీ ఉదాహరణల్నీ విడదీసి ఎత్తి వ్రాశాడు అంతే అది ఒక స్వతంత్ర గ్రంథం కాదు

అజంత పరిచ్ఛేదంలో

నామంత్రణే దుజీ త్యన్యే —20

ఈ సూత్రం సంబోధనలో దుజ్ రాదని కొందరంటారని చెబుతుంది ఉదాహరణలుగా ఓరామ ఓకృష్ణ అనే శబ్దాలు ఒనగబడినాయి దుజ్ రానిపక్షంలో ప్రాతిపదికలోని చివరి అకారానికే అత్తు (అజంత 6) వస్తుందని అహోబలపతి వ్యాఖ్యచేసి రామ + అ అని ఉంటే అక్కడ సంధి నిత్యంగా రావడానికి చింతామణిలో సూత్రమేదీ లేకపోవడంతో[1] ఒక కారికను సంధిర్నిత్యం ప్రయ్యాయాచ వ్యాఖ్యాదిగతస్యచ అని ఉదాహరించాడు ప్రత్యయాచ్చుకీ ఆర్యాది (అయ్య మొదలైన) శబ్దాలలోని అచ్చుకీ సంధి నిత్యంగా వస్తుందని కారికార్థం ఈ కారికతో రామ + అ = రామ అనే రూపంలో నిత్యసంధిని సాధించాడు

---

1. చింతామణిలో అత్వసంధికి విధాయక సూత్రమొకటే—వాఽతః (సంధి 2) అది వికల్పసూత్రం

ఇక్కడ గూడ సూత్రం సంబోధనార్థంలో డుజ్ రాదని చెబుతుంటే కారిక ప్రత్యయాచ్ఛు కి నిత్యసంధిని విధిస్తుంది కాగా కారిక అహోబలపతి వ్యాఖ్యకే సందర్భ పడుతుంది గాని సూత్రానికి కాదనేది సుస్పష్టవిషయం

హలంత పరిచ్ఛేదంలో

అన్యేషాం చ వా లుగ న్త్యస్య — 0

సూత్రానికి ఇతర హలంత శబ్దాల చివరి వర్ణాలకు వికల్పంగా లోపం వస్తుందని అర్థం పూర్వ సూత్రంలో అపయ ప్రభృతి అనే గణంలోని సకారాంత శబ్దాల చివరి వర్ణానికి లోపం చెప్పి ప్రస్తుత సూత్రంతో సాంతవ్యతిరిక్త శబ్దాల చివరి వర్ణానికి గూడ లోపం విధిస్తున్నాడు సూత్రకర్త ఉదా: పథిన్–పథి

అహోబలపతి ఈ సూత్రవ్యాఖ్యలోనే నిగమశర్మన్ అనే నాంతశబ్దం చివరి నకారానికి లోపం చేసి నిగమశర్ముఁడు అనే రూపాన్ని సాధించాడు తరువాత దానికే రూపాంతరంగా నిగమశర్మ అనే రూపాన్ని సాధించబోయాడు కాని చింతామణిలో సూత్రాలు లేవు కాగా ఒక కారికను సృష్టించాడు

క్వచిన్మనుజ సంజ్ఞాయాం డుజ్ నాంతాన్న విధీయతే కొండొకచోట మనుజ సంజ్ఞలో నాంతశబ్దంమీద డుజ్ విధించబడదు అని కారికార్థం అహోబలపతికి కావలసినవిధంగా అమరి ఉంది కారిక కాబట్టి నిగమశర్మ రూపం సిద్ధించింది మంచిదే కాని సూ తం ఇతర శబ్దాల చివరి వర్ణానికి లో౦ం విధిస్తుంటే కారిక నాంతశబ్దాల్లో మనుష్యుల పేర్లకు డుజ్ రాదు అని నిర్దేశిస్తుంది రెంటికీ బొ తిగా సందర్భం కుదరదు కారికకు సందర్భం అహోబలపతి వ్యాఖ్యతోనే తప్ప సూత్రంతో కాదు గదా

క్రియా పరిచ్ఛేదంలో

భూతాదుతాం పరేషామిత్ —35

భూతార్థక క్రియకు పరమైన హ్రస్వ ఉకారాలకు హ్రస్వ ఇకారం వస్తుందని సూత్రార్థం ఉదా ఘటించితి + ను = ఘటించితిని మొ ఈ సూత్రవ్యాఖ్యానం

లోనే అహోబలపతికి ఘటింపుము వంటి రూపాలు గూడ సాధించాలి అనే భావన కలిగింది వెంటనే కారిక నొకదానిని ప్రకటించాడు

ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతేమధ్యమార్థక
విభాషాతు వదన్త్యేకే నప్రాణేతు కదాపిచ

ప్రార్థనార్థంలో మధ్యమ పురుషైకవచనంలో ము ప్రత్యయం వస్తుంది ఇది విభాషగా వస్తుందని కొందరంటారు అచ్చు పరమైనపుడు విభాషగా రావడం ఎప్పుడూ లేదు—అని కారికార్థం

సూత్రం భూతార్థక క్రియకు పరమైన ఊకి ఈని విధిస్తుంటే కారిక ప్రార్థనార్థంలో ధాతువుకి ము ప్రత్యయాన్ని విధిస్తుంది సందర్భం సూత్రకారికలకు లేదు అహోబలపతి వ్యాఖ్యకోసం నిర్మితమైనదే కారిక

పై పరిశీలనం వలన అథర్వణుని పేర వ్రాయబడిన కారికలేవీ చింతామణి సూత్రాలతో సందర్భపడక అహోబలపతి వ్యాఖ్యానంతోటే కుదిరిక గలిగి ఉన్నాయని తెలిసింది పండితులు చాలమంది పాణిని సూత్రాలకు కాత్యాయనుడు వాక్యాలు వ్రాసినట్లు చింతామణి సూత్రాలకు అథర్వణుడు కారికలు వ్రాశాడని అనుకుంటారు కాని అది అబద్ధం వార్తికం పాణినీయాన్ని కేవలం అనుసరిస్తుంది భట్టోజీ దీక్షితుని వాఖ్యానాన్ని అనుసరించదు కారణం వార్తికం భట్టోజీ దీక్షితునికి ముందే పాణినీయానికి అనుసంధితమై ఉంది—ఇది కేవలం పోలికకోసం అన్నమాట పాణిని కాత్యాయనులతో పోలిస్తే దీక్షితుడు నిన్నమొన్నటి వాడు పాణినీయ సూత్రకాత్యాయన వార్తికాల సంబంధం సహజంగా ఉంటుంది ఉదా

సూ ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్ — —62

వా వర్ణాశ్రయే నాస్తి ప్రత్యయలక్షణమ్

సూ అస్మదోర్ద్వయోశ్చ —2—59

వా సవిశేషణస్య ప్రతిషేధః

సూ ఇతరేతరాన్యోన్యోప పదాచ్చ —3— 8

వా పరస్పరోప పదాచ్చేతి వక్తవ్యమ్

ఇలా అష్టాధ్యాయి మొత్తాన్ని ఉదాహరించవచ్చు స్థాలీపులాకన్యాయంగా మూడు పాదాలనుండి మూడు ఉదాహరించాను వార్తికాలు పాణినీయ సూత్రాలకు తప్ప ఇతరుల వ్రాతలు పాణినీయం మీద ఎన్ని ఉన్నా వాటికి అన్వయించడ మనేది జరగదు కాగా చింతామణి వికృతివివేకాలకున్న సంబంధం అష్టాధ్యాయీ వార్తికాల సంబంధం వంటి దనడం అవిచార మూలకమని నిస్సంశయంగా నిశ్చయించవచ్చు ఈ భావన (చింతామణికి కారికలు వార్తికాలు) ఇటీవలి పండితుల భ్రాంతిజనితమైనదే

## స్వతంత్రవ్యాకరణం కాజాలదు

ఇక అథర్వణకారికావళి చింతామణికి అనుబంధితం కాక స్వతంత్రవ్యాకరణమే అయివుండి అహోబలపతిచేత ఉటంకించబడి ఉండవచ్చు గదా అని ఆశంక చేయవచ్చు కాని కారికావళి ఒక స్వతంత్ర వ్యాకరణ మనడం పొసగదు అది చింతామణిలోని కొరతలు పూరించడానికి ప్రమాదాలు సరిదిద్దడానికి అహోబలపతి తనవ్యాఖ్యాన సందర్భంలో అక్కడక్కడా చేసిన అల్లిక కాబట్టి ఒక గ్రంథంగా దానిలో ఒక రచనా ప్రణాళిక గాని రూపనిష్పాదన క్రమంగాని పరిభాషా కల్పనం గాని, ఏమీలేవు

అథర్వణకారికావళిని స్వతంత్ర గ్రంథంగా (అహోబలపండితీయంనుండే) ఎత్తి వ్రాయబోయిన ద్వితింత్రిణి సీతారామకవి చివరికి చేసిందేమిటి? సంజ్ఞా పరిచ్ఛేదమని పేరుపెట్టి అహోబలపండితీయంలోని సంజ్ఞాపరిచ్ఛేదంలోని కారిక లన్నింటినీ ఏరికూర్చాడు కాని అపనివల్ల ఒరిగిందేమిటి? సంజ్ఞాపరిచ్ఛేదంలో ఒక్క సంజ్ఞైనా కనబడుతుందా? సంజ్ఞలులేని సంజ్ఞాపరిచ్ఛేదం సిద్ధమై తత్కర్తనే పరిహసించింది పైగా ఆ కారికలన్నీ అహోబలపతి వ్యాఖ్యానాన్ని పురస్కరించు కొని నిర్మితాలైనవి గాబట్టి సంజ్ఞా పరిచ్ఛేదంలో గూడ అతడు సందర్భం కల్పించు కొని సంధివిషయాలు చర్చిస్తూ కారికల్ని ఉదాహరిస్తే పాపం సీతారామకవి బుద్ధి మంతునిలా వాటిని గూడ సంజ్ఞాపరిచ్ఛేదంలోనే (అక్కడ అహోబలపండితీయంలో సంజ్ఞాపరిచ్ఛేదంలో ఉన్నాయి గాబట్టి) చేర్చి కారికావళిలో అభాస పరిచ్ఛేదాలు సృజించినవాడయ్యాడు

నఖండః ప్రథమాద్ధిస్యాత్ వైకృతేఽత్ర కదాపిచ

ఈ కారిక కెందమ్మి చెందొవ వంటి సంధుల్లో సున్నా అరసున్నా కాకుండా ఉండటానికి ఉద్దిష్టమైంది చింతామణిలోని సూత్రాలతో అవని సాధ్యం గాక దీనిని సృజించి ఉటంకించాడు వ్యాఖ్యాత దీనికి మొదటి హ్రస్వంకంటె పరంగా ఈ తెలుగులో అర్ధ బిందువు ఎప్పుడూ ఉండదని అర్థం కాబట్టి చెందొవ అనే రూపం క్షేమంగా ఉంటుంది చకారం మీది ఎకారం మొదటి హ్రస్వంగదా మరి అందువలన దానిమీద నిండుసున్నా అరసున్నా కావడానికి వీలులేదు ఈ కారికకు స్థలాంతరపాఠం అహోబలపతివ్యాఖ్యానం వలన కలిగితే దాన్ని యథాతథంగా ఉంచి సీతారామకవిగారు తమ అమాయకత్వాన్ని వ్యక్తం చేశారు ఎవరు చేసినా ఆ కారికల్ని ఏరగలరు సందర్భాన్ని గుర్తించి వర్గీకరించను గలరు కాని ఆ యేర్పాటుమాత్రంతో ఆ కారికలు ఒక ప్రణాళిక లక్ష్యం రూపనిష్పాదన ప్రక్రియ గల వ్యాకరణంగా ఎలా మారుతాయి? వాటికి వాటిదైన నిజమైన ఉనికి ఏది? ఎక్కడిది? అవి అలవోకగా చింతామణికి అతుకులు వేయడానికి కత్తిరించ బడ్డ ముక్కలు వాటిని విడిగా చీల్చిచూస్తే దేనికదిగా ముక్తకాలవలె కనబడతాయే కాని ఏకవాక్యత ఎలా సిద్ధిస్తుంది ?

## వికృతి వివేకంలో అజంత పరిచ్ఛేద ప్రారంభం

వికృతావత్ర వాలోప స్స్యాత్సంబుద్ధ్యోయి పదేతు యేః
నపూర్వత్రిస్థితస్స్యాద్రో ఇతి స్త్రీవాచకోథవేత్
పరత్రైవ ప్రయోగస్తు స్యాద్ద్వయోరపిచాన్యవత్

ఈ కారికలు సంబోధనలో ఓయి పదంలో యి లోపాన్ని అది పదానికి ముందే ఉండటాన్ని రో అనే శబ్దం స్త్రీవాచక శబ్దంమీద పరంగానే సంబోధ నార్థంలో రావడాన్ని విధిస్తున్నాయి ఈపాటి అర్థమయినా మనకు అహోబల పండితీయ సంసర్గంవలన కలిగింది అయినా ఏ విభక్తులూ లేకుండా కేవలం సంబోధనతో అజంతపరిచ్ఛేద ప్రారంభమేమిటి? ఈ కారికల తర్వాతకూడ రెండు కారికలు సంబోధన విధుల్నే వివరిస్తున్నాయి తరువాత వివక్షిత ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్ అనే కారిక ఉ ది ఈ కారికలన్నీ అహోబలపం డి

తీయంలో గూడ ఇదే వరుసలో ఉన్నాయి వాటి క్రోడీకరణమే ఇక్కడ జరిగింది అహోబలపండితీయానికి బయట ఎక్కడా కారికలు లేవు గదామరి ఈ కారికకు అర్థం వివక్ష (చెప్పాలనే కోరిక) వలన కొండొకచో ప్రత్యయాల ప్రవృత్తి ఉంటుంది —అని దానివల్ల ఏపాటిగానైనా జ్ఞానమేర్పడిందా మనకు? చెప్పాలనే కోరిక ఏమిటి? ఒకానొకచోట ప్రత్యయ ప్రవృత్తి యేమిటి? అహోబలపండితీయంలోనికి వెళితే ఈ కారికకు సందర్భం దాని తరువాత తాత్పర్యం తెలుస్తాయి

మహతస్సోర్డు జ వితో భవేత్ పుంసి (అజంత 2)

అనే సూత్ర వ్యాఖ్యానంలో అహోబలపతి మహచ్ఛబ్దాలు ఇదంత వ్యతిరిక్తాలుగా ఉంటే వాటి ప్రథమైకవచన ప్రత్యయం స్థానంలో డుజ్ వస్తుందనడానికి ఉదాహరణగా రాముఁడు ఇత్యాది రూపాలిచ్చి మహద్వాచకాలు కాకపోయినా కొన్నిశబ్దాలకు డుజ్ ప్రయోగాల్లో కనుపించడం వలన వక్త వివక్షిస్తే అమహద్వాచకాలకి ము ప్రత్యయంతో పాటు డుజ్ కూడ రావచ్చుననే అభిప్రాయాన్ని వివక్షితః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్ అనే కారిక ద్వారా తెలిపాడు ఉదాహరణలుగా సముద్రుఁడు సముద్రము వంటి రూపాలు ఇచ్చాడు సముద్ర శబ్దానికి డుజ్ ము ప్రత్యయాలు రెండూ రావడానికి వక్తృవివక్షే కారణమని అతని కారికాభిప్రాయం ఈ కారికవల్లనే వరపుంగవులు గావి వరపుంగవులు గారు మొదలయిన ప్రయోగాలు బాధారహితాలైనాయని విశదీకరించాడు

ఇదేవిధంగా అధర్వణకారికావళిలోని ఏకారికనైనా విడిగా చూసినపుడు అర్థ సందర్భాలు పొడగట్టకుండా అహోబలపతివ్యాఖ్యతో కలిపి చూచినపుడు మాత్రమే అర్థమవుతూ సమన్వయిస్తూ ఉంటుందనడానికి ఆ గ్రంథం మొత్తాన్ని ఉదాహరించి చూపవచ్చు అయినా మచ్చుకి మరొక ఉదాహరణ ప్రాదిర్విభక్తిర్నౌవ ష్ఠో క్వచిద్విషు నసీ తౌ ఈ కారికకు కొండొకచో బింబాష్ట నినలు కనబడుతున్నాయి కొండొకచో నియమదు నలు వస్తాయి అని అర్థం ఇది బొత్తిగా నేమూం దీనికొక సందర్భం గాని తాత్పర్యం గాని ఉన్నదని ఏ వ్యాకరణ విద్యార్థికైనా స్ఫురిస్తుందా? ఏదో ప్రమత్తప్రజల్పనం లాగా కనబడుతుంది కారణం ఆ కారిక దగ్గర అహోబలపతి వ్యాఖ్యానం లేదు అహోబలపతికి ఎక్కడికే

ఆ కారిక అర్థసందర్భాలు తెలుసు అతని వివరణ మిది బిందు పూర్ణబిందు పూనిచెన్ పూన్చెన్ పూంచెన్ ఇతి రూపత్రయమ్ పూఁచెనితిరూపం త్వప్రామాణికమేవ దీర్ఘాచ్చేత్ ఖండవివేత్యుక్తే దీర్ఘాత్ పరస్యానుస్వారస్యోభయ విధత్వాంగీకార విరోధాత్

ఇపుడు మనకు పూనుచు అనే ధాతువు పూంచు పూన్చు అనే రూపద్వయంతో కూడ ప్రయుక్త మవుతుందనే విషయాన్నే కారిక తెలియజేస్తుందని అహోబలపతి వ్రాత చూచిన తరువాత అర్థమయింది ఈ కారిక చింతామణిలోని ఏ పరిచ్ఛేదంలోని ఏ సూత్రానికైనా అన్వయిస్తుందని చెప్పలేం అది అహోబలపతి లీలామాత్ర నిర్మితి[1] అయినపుడు దానికి చింతామణితో సమన్వయం ఎందుకుంటుంది? స్వతంత్ర ప్రతిపత్తి మాత్రం ఎక్కడనుండి వస్తుంది

పై పరిశీలనం వలన వికృతివివేకం ఒక యథార్థమైన గ్రంథం గాదని అది అహోబలపతి వ్యాఖ్యానంలో అతని ప్రతిపాదనలు సమర్థించడానికై ఉటంకించ బడినట్లు చూపబడిన కొన్ని ముక్తకాల సముదాయమే అని తేలింది

## స్వతంత్రలక్షణాలా? అనువాదాలా?

ఇక ఈ అధర్వణకారికలు స్వతంత్రలక్షణాలా? లేక ఇతర లక్షణాల అనువాదాలా? అనే విషయాన్ని పరిశీలిద్దాం

అధర్వణకారికావళి యథార్థంగా ఒక గ్రంథం కాకపోయినా దానిలోని లక్షణాలు మౌలికమైనవైతే తత్కర్త అభినందనీయుడే అహోబలపతి సంజ్ఞా పరిచ్ఛేదంలో 20వ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ చర్చను సూత్రంలోని లొసుగులపై పు కొనిపోతూ పోయెదన్ పయ్యెద ఇత్యాది స్థలాల్లో గూడ యకారం మీద ఎత్వ ముందే అయినపుడు సూత్రం (అద్య క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వ -20) భూతార్థాల్లోనిదీ నామాది లోనిది తప్ప ఇతరమైన యకారం మొత్తం

1 ఈ విషయం ఈ ప్రకరణంలోనే ముందు నిశ్చయింపబడబోతుంది

అత్తుతోనే ఉండాలి అని నిర్దేశించడం వల్ల ఈ పదాలు– పోయెదన్ పయ్యెద మొదటిది భూతార్థం కాదు రెండోది నామాదిలో యా కలది కాదు కాబట్టి తప్పులు కావలసివస్తున్నాయే అని శంకించి ఆ పదాలకి సాధుత్వ ప్రతిపాదనార్థం క్రింది కారికలు ప్రకటించాడు

భావిక్రియాసు యస్యస్యాదేత్వమేవ ప్రయోగతః
డోలా భూషోత్తరీయాణి విన్తైత్వం నాస్తిమధ్యయే

ఈ రెండు కారికలూ పై రెండు పదాల్ని యథాక్రమంగా సాధువుల్ని చేశాయి ఈ కారికల అర్థాలు పరిశీలిద్దాం భావిక్రియాసు=భవిష్యదర్థక క్రియల యందు ప్రయోగతః=ప్రయోగమువలన యస్య=యకారానికి ఎత్వమ్ + ఏవ= ఏత్వమే (తెలుగులో ఎత్వం గూడ ఉందిగాని సంస్కృతంలో ఏత్వమొకటే వస్తుంది అనేమాట అధ్యాహార్యం)

భవిష్యదర్థక క్రియల్లో యకారానికి ఏత్వం వస్తుందనేమాటకు భావమేమిటి? చింతామణి తరువాతిది కారికావళి పైగా చింతామణి సూత్రాలు సవరించడానికీ వివరించడానికీ పుట్టింది చింతామణిలో భావ్యర్థకక్రియల్లో యకారం గాని దానిమీద ఏత్వంగాని కంచు ాగడాపెట్టి వెతికినా కనబడవు చింతామణి నిర్మించే భావ్యర్థకక్రియలు ఇలా ఉంటాయి

| | |
|---|---|
| ఘటింపకలఁడు | ఘటింపకలరు |
| ఘటింపకలవు | ఘటింపకలరు |
| ఘటింపకలను | ఘటింపకలము[1] |

చింతామణి ప్రక్రియావిధానంలో భావ్యర్థంలో కల అనే అనుబంధం లేకుండా పదమే ఏర్పడదు అయినపుడు భావిక్రియల్లో యకారమే లేదు లేని యకారానికి ఎత్వవిధాన మెలా జరిగింది? కారికాకర్తే సమాధానించాలి అన్యులవల్ల కాదు

---

1. ఇక్కడ సరైన రూపాలు ఘటింపఁగలఁడు వంటివే అయినా చింతామణిచేత అవి సాధ్యాలుకావు చూ చింతామణి రూపనిష్పాదన ప్రక్రియ

కారికాకర్త పోయెదన్ వంటి క్రియలు భావ్యర్థాలనుకున్నాడు అటువంటి క్రియల్ని వర్తమానార్థకాలుగా చెప్పిన వ్యాకర్తలు అహోబలపతికి ఈ గ్రంథంలో నిర్ణయించబడినట్లు బాలసరస్వతికీ పూర్వులు ఉన్నారు[1] కాని భావ్యర్థకాలుగా అలాంటి రూపాల్ని వ్యాకరణాల్లో చూపినవారు మృగ్యులు అయితే అటువంటి ఎదగాగమంగల క్రియలకి ప్రాచీన ప్రయోగాల్లో భవిష్యదర్థాలు గూడ ఉన్నమాట వాస్తవం[2] అయినపుడు భావి క్రియాసు అనే పదానికి పోయెదన్ వంటి క్రియలు విషయాలౌతాయని ఆ కారికాకర్తకు తప్ప ఇతర వైయాకరణునకు తెలిసే అవకాశమే లేదు

చింతామణికి పూర్వవ్యాకరణాలైన ఆంధ్రభాషాభూషణం కావ్యాలంకార చూడామణులలో భావిక్రియలుగా

| | | |
|---|---|---|
| పలుకును | పలుకుదురు | (ఆ భా భూ 46) |
| చేయును | చేయుదురు | (కా చూ మ 9– 65) వంటివి |

చూపబడి ఉన్నాయి కాగా కారికాకర్త భావిక్రియగా పోయెదన్ వంటి దానిని భావించి ప్రయోగించడం కేవలం స్వసంకేతితార్థమైన విషయమని తేలిపోయింది చింతామణిలో భావ్యర్థకాలు అస్తిధాత్వనుబంధ సహితంగా తత్పూర్వ వ్యాకరణాల్లో ను దురు వు దువు దును దుము అనే ప్రత్యయాలు ధాతువుపై చేర్చగా ఏర్పడినవిగా ఉన్నాయేతప్ప ఎదగాగమయుక్త రూపాలు లేనేలేవు–అనిమనకు రుజువయింది

ఇక రెండోకారికకు ఉన్న అర్థమేదో అహోబలపతి వివరించిన అర్థమేదో చూద్దాం

ఉన్న అర్థం డోలా=ఊయేల లేక ఊయాల వంటి యానం అందలం[3]

---

కేతన విన్నకోట పెద్దన–ఆ భా భూ 44 కా చూ మ 9–151

2 భారత –6– 98 I–4– 28

3 ప్రయోగాలు ఆధారంగా సూ ఆ ని వాచస్పత్యం చూపిన అర్థాలు

భూషా అలంకారం అలంకరణం నగ

ఉత్తరీయాణి పైబట్ట[1]

వినా మినహాయించి

మధ్యయే మధ్యస్థమైన యకారమందు

ఏత్వం : ఏకారము

నాస్తి లేదు

ఊయేల లో లేక ఊయాల లో అలంకారం లో లేక నగ లో, పైబట్ట లో మినహా మధ్యస్థమైన యా కి ఎత్వముండ దని అర్థం వస్తుంది డోలా (డోలి) వాస్తవానికి యానమైనా దానిస్వరూపంలో ఊయెల కూడ ఉంది గాబట్టి ఊయేల అనే అర్థం గూడ గ్రహించవచ్చు కాని తరువాతి పదాలు భూషా ఉత్తరీయాలు వాటి తెలుగు పర్యాయాలు నగ పైబట్ట లేక పైపంచెలలో యా ఎక్కడ? దాని కేత్వ మెక్కడ? ఏ సంస్కృత విద్వాంసునికైనా వైయాకరణుని కైనా మరే ఆంధ్రపండితునికైనా ఆంధ్ర వైయాకరణునికైనా కొత్తగా (ఇటీవలి అధర్వణకారికల పఠన పాఠనాలవల్ల కలిగిన సంస్కారాన్ని దిగవిడిచి) భూషా ఉత్తరీయాలు అనే పదాలు వింటే ఆ పదాల అర్థాలు తాయెతు పయ్యెద అనీ తెలుస్తుందా? కనీసం ఆ స్ఫూర్తి అయినా కలుగుతుందా? భూషా శబ్దం కేవలం అలంకారాన్ని గాని అలంకరణాన్ని గాని తెలుపుతుందే గాని 'తాయెత్తు' కి పర్యాయంగా అది బొత్తిగా పనికిరాదు ఆ సంస్కృతీకరణం స్వసంకేతమాత్ర వేద్యమైన అసమర్థమైన అనువాద మని చెప్పవచ్చు ఉత్తరీయ పదం గూడ పయ్యెదకు పర్యాయం కానేరదు అదీ స్వసంకేత ప్రసిద్ధార్థమే కాగా ఈకారిక తెలుగులోని ఊయెల పయ్యెద తాయెతు శబ్దాల్ని సంస్కృతీకరించగా ఏర్పడిందే ననడం సుస్పష్టం అయితే ఆ అనువాద మెక్కడిది?

---

1 సూ ఆ ని వాచస్పత్యం

కవిజన సంజీవనిలో కారికల మూలపాఠాలు

పై మూడు పదాల్ని ఒకచోటచేర్చి వాటిలోని యకారాన్ని గూర్చి ప్రసంగించిన తొలి లాక్షణికుడు ముద్దరాజు రామన ఆయన తన గ్రంథంలో ప్రథమ తరంగంలో 7 వ పద్యంగా—

1 తాయెతయు నుయ్యెలయుఁ బయ్యెదయు దక్క
గలుగ దెత్వంబు మధ్య యకారములకుఁ
దుదను గ్రియదక్క నెత్వంబుగదియ దాది
నత్వ మొందదు తెనుఁగుల నబ్జనాథ

అని లక్షణం చెప్పాడు చంద్రభాను చరిత్ర భారతారణ్యపర్వం యయాతి చరిత్రల నుండి క్రమంగా తాయెతు ఉయ్యెల పయ్యెద శబ్దాల్ని ఉదాహరించాడు

ఇక్కడ పూర్వపక్ష మొకటి చేయవచ్చు అధర్వణకారికకే ఈ లక్షణం ఆంధ్రీకరణం కాకూడదా? అది కాదు ముద్దరాజు రామన కాలానికి ఉనికి మనికీ లేనిది అధర్వణకారికావళి దాన్ని అప్పకవే ఎరుగడు ఇక ముద్దరాజు రామన్న బాలసరస్వతికి పూర్వుడు కాగా అతడు దాన్ని చూడటం అసంభవం ముద్దరాజు రామన్న లక్షణమూ తత్కర్తృత్వమూ కాలమూ వివాదాస్పదం కావు పైగా తాయెత్తు పయ్యెదల్ని అసమర్థంగా సంస్కృతీకరిస్తే భూషోత్తరీయశబ్దాలు ఏర్పడి నాయేకాని భూషోత్తరీయాల్ని తెలిగిస్తే తాయెత్తు పయ్యెదలు ఏర్పడుతాయని ప్రపంచంలోని ఏ తెలుగు సంస్కృత విద్వాంసుడూ అనడానికి సాహసించడు

కాగా పై అధర్వణకారిక ముద్దరాజు రామన పద్యానికి సంస్కృతీకరణ మని ఘంటా పథంగా చెప్పవచ్చు

అధర్వణకారికలోని పూర్వార్థం గూడ ఈ రామన్న పద్యంనుండి చేయ బడిందే పద్యంలో ఉత్తరార్థం క్రియల చివర తప్ప యా కు ఎత్వ ముందదని నిర్దేశిస్తుంది గదా ఆ నిర్దేశాన్ని యథాతథంగా కాక కొంత మార్చి సంస్కృతీ కరించడం జరిగింది సంస్కృతీకరణలో తెలుగు పద్యంలోని స్పష్టత భంగపడింది

పద్యంలో క్రియల చివర ఉండే యా కు తప్ప ఎత్వముండదంటే ఒకవిధంగా కవియె వినియె వంటివి కొంచెం ఆలోచించిన తరవాత స్ఫురించే అవకాశ ముంది సంస్కృతీకరణలో అది లేదు కాగా మొత్తం మీద ముద్దరాజు రామన్న ఉపజ్ఞగా ఉన్న లక్షణాన్నే సంస్కృతీకరిసే పై కారికలు రెండూ ఎర్పడినాయని నిర్వివాదంగా నిర్ధారణ చేయవచ్చు ఈ నిర్ధారణవలన ఈ కారికావళి అధర్వణకృతమనే వాదం స్వయం పరా స్తమౌతుంది అధర్వణుడు 13వ శతాబ్దిలోనివాడు. 16వ శతాబ్ది పూర్వార్ధంలోని ముద్దరాజురామన్నను అతడు సంస్కృతీకరించడం అసంభవం గదా! తాయెతు పదం వాఙ్మయంలో జొరబడి లక్షణ గ్రంథాల కెక్కడం చాల అర్వాచీనమైన పరిణామ మవి కాగా దానిని కారికాబద్ధం చేసిన వికృతివివేకం అధర్వణ కృతి కావాలంటే అధర్వణుడు తన కాలాన్ని విడిచి రెండు మూడు శతాబ్దాలు ముందుకు నడచి రావాలని ప్రొ తూమాటి దొణప్ప తమ భాషాచారిత్రక వ్యాసావళి లో శాస్త్రీయంగా నిరూపించారు1

ముద్దరాజు రామన కవిజన సంజీవని చాల ఉత్కృష్టమైన దేశీయ లక్షణ గ్రంథం లక్షణాలు స్వయంగా రచించి లక్ష్యాలు ప్రాచీన కవుల నుండి ఇవ్వడం ఈ గ్రంథ ప్రత్యేకత కాబట్టే అది వెలువడిన స్వల్పకాలంలోనే దానికి మంచి వ్యాప్తి పండితలోకంలో కలిగి గ్రంథం సుప్రసిద్ధమైంది బహుశః దాని రచనా మార్గం ఈ ప్రసిద్ధి ప్రాముఖ్యాల కొక కారణమై ఉండవచ్చు ఇతడు బహు శ్రమించి తన లక్ష్యాలు తిరుగులేని ప్రమాణాలుగా ఉండటం కోసం యతిప్రాస స్థల ఘటితాలుగా చూపడం మెచ్చదగిన అంశం కవిజన సంజీవనిలోని అనేక లక్షణాలకు అధర్వణునిదిగా చెప్పబడే కారికావళిలో కేవల సంస్కృతీకరణాలు కనబడుతున్నాయి

2 సంధి గూర్పంగఁ బ్రథమాంత శబ్దవితతి
పైఁ గచటతపలకు వికల్పంబు చెల్లు
కాకు సంబోధనావ్యయ కర్మధార
యంబుల నచేతనంబుల నబ్జనాథ (కవి సం — 2)

---

ఆంధ్రసారస్వత పరిషత్ హైదరాబాదు వారి ముద్రణ

తెలుగులో ప్రథమాంత శబ్దాలమీద కచటతప లు గసడదవ లు గావడం సామాన్య లక్షణ మే అయినా కాక్వర్థానికి 2 సంబోధనార్థానికి 3 అవ్యయానికి 4 కర్మ ధారయానికి 5 అచేతనార్థక శబ్దానికి పరంగా ఉన్నప్పుడు కచటతపలు గసడదవలు వికల్పంగా అవుతాయని లక్షణం

ఈ ఆయిదింటికి తన రచించిన పద్యంలో ఉదాహరణలిచ్చి ప్రామాణ్యభావం పొదు కొల్పడానికై భారతాద్యుద్గ్రంథాల నుండి ప్రాసఘటితరూపాలు ఏరి ఇచ్చాడు। ఉదాహరణల్నిబట్టి ఈ లక్షణం సంస్కృత సమ సమేతరభాషా సాధారణంగా అన్వ యించేటట్లు కనబడుతుంది లక్షణ గ్రంథాల్లో యతి ప్రాస స్థానాల ఉపయోగాన్ని కనిపెట్టి చూపినవాడు గూడ ముద్దరాజు రామనే కావచ్చు ముద్దరాజు రామన నూతన మార్గంలో చేసిన ఈ లక్షణ గ్రంథానికి అల్పకాలంలోనే అనల్ప ప్రామా ణ్యం ప్రసిద్ధీ కలిగాయి కాబట్టే పై లక్షణాన్ని అహోబలపతి సంస్కృతంలో వ్రాసి అధర్వణకారికలుగా చూపాడు

పరుషావా స్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః
కాకౌ సంబోధనేచాపి హ్యవ్యయే కర్మధారయే
అచేతనార్థకే శబ్ద ఇతి శృంగార భూషణః

ఈ కారికల్ని సంధిపరిచ్ఛేదంలో 24వ సూత్ర వ్యాఖ్యానావసరంలో చూపడం జరిగింది సూత్రం సమేతర తెలుగు శబ్దాలకు పరమైన సంస్కృతసమ శబ్దాల ఆదినుండే పరుషాలు గసడదవలు కావని నిర్దేశిస్తే ఆ నిర్దేశానికి భిన్నంగా రాఘవ పాండవీయంలో అఖిల భువనములలోన వారణ నగరి పురమ తల్లి ( – ) వంటి ప్రయోగాల్లో గసడదవాదేశం లేకపోవడం (నగరి + పురమతల్లి) ఎలా పొసగు తుంది? అని శంకించి దాని సాధుత్వ సంరక్షణార్థం ఈ కారిక కల్పించి ప్రకటించ బడింది

పద్యంలోని పూర్వార్ధంలోని ప్రథమాంత శబ్దం కారికలో యథాతథంగా స్వీకరించబడింది పద్యంలోని ఉత్తరార్థం అవే పదాలతో అదేక్రమంలో వ్యస్తంగా చేయబడి కారికలో నిబంధించబడింది

పద్యం కాకు సంబోధనావ్యయ కర్మధార
యంబుల నచేతనంబుల నబ్జనాభ

---

కవిజనసంజీవని – ప్రథమ తరంగం— 4 5 6 7 8 9 20
2 వ పద్యాలు

కారిక కాకా సంబోధనే చాపి హ్యావ్యయే కర్మధారయే
అచేతనార్థకే శబ్ద ఇతి శృంగార భూషణ

కారికలో చివరి భాగానికి విషయంలేదు గాబట్టి శృంగార భూషణుడు చేర్చబడ్డాడు ఇతడు యథార్థ వ్యక్తో లేక పాదపూరణకోసం లీలాకల్పితుడో? ముందు చూపిన ఉపపత్తులన్నీ ఇక్కడా అన్వయిస్తాయి — పద్యమే కారికకు మూలంగాని కారిక పద్యానికి మూలం కాజాలదని నిరూపించడానికి

3 సంస్కృత పదంబు గృతులఁ దత్సమముసేయు
నపుడు ముత్వంబగున్ దీర్ఘమైనఁ జెల్లు
భానుకులుఁడగ్గెఁ బరుని ప్రాణాన కనఁగ
మౌనులు భజింతు రతని సౌఖ్యాన కనఁగ (కవి సం —25)

రామన్న సంస్కృత శబ్దాలు తెలుగులో తత్సమాలుగా ఏర్పడేటప్పుడు (రామన కాలానికి తత్సమమంటే సంస్కృత పమమే ప్రాకృత సమం గాదు ఆ ఫక్కి చింతామణిది) ము లోపించి దాని స్థానంలో దీర్ఘం రావడం గూడ ఉన్నదని లక్షణాన్ని స్వయం పరిశీలనతో చెప్పి లక్ష్యంగా తిక్కన్నగారి ఉద్యోగ పర్వం నుండి___

మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా
ణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీ నాశము నుద్దామ య
శోనాశము నుడువనేల చూచెదు చెపుమా అనే పద్యాన్ని ఇచ్చాడు

అంతేగాక నిటలాన ప్రాణాలకు వంటి రూపాల్ని పూర్వకవుల నుండి ఉదాహరించి తన లక్షణాన్ని స్థిరీకరించాడు అహోబలపతి రామన్న లక్షణాన్ని ప్రాయశో వైకృతపదే లోపో దీర్ఘశ్చమోరత అనే కారికగా అజంత పరిచ్ఛేదంలో 42వ సూత్ర వ్యాఖ్యానంలో ప్రదర్శించాడు అయితే ఇక్కడ అహోబలపతి కుటిల ప్రాగల్భ్యం చూపాడు సూత్ర వ్యాఖ్యానంలో చింతామణి సూత్రం కేవలం

అచ్చతెలుగు పదాలకే అన్వయిస్తుందని—సూత్రస్థ[1] వికృతి శబ్దంతో నిర్ణయించి (ఈ నిర్ణయం నిరాధారం[2]) అక్కడే రామన్న లక్షణాన్ని ఉటంకించి అది దూషణ గ్రస్తమని నిరసించి తిరిగి దాని సంస్కృతీకరణాన్నే కారికగా ఇవ్వడం దుర న్యాయం

సంస్కృత పదంబు గృతులఁ దత్సమము సేయు
నపుడు ముత్వంబగున్ దీర్ఘమైనఁ జెల్లు అనే పద్యభాగంలోని సంస్కృత శబ్దాన్ని వైకృతపదంగా మార్చి ప్రాయశ్శబ్దాన్ని జోడించి తన కారికా నిర్మాణం చేశాడు రామన్న శ్రమించి సేకరించిన ఉదాహరణనే తానూ స్వీకరించి దాని సాధుత్వాన్ని మాత్రం తాను కల్పించిన కారికలోని ప్రాయశ్శబ్దంతో సాధించాడు

యథార్థానికి ఇక్కడి లక్షణం లక్ష్యం రెండూ కవిజనసంజీవనిలో రామన్నవే వాటిని రెంటినీ గ్రహించి చిన్న భేషజం ప్రదర్శించి తాను కనిపెట్టినట్లు నటించి రామన్నను చిన్నబుచ్చడం ఎంత అన్యాయ్యమో విజ్ఞులే యోచించి నిర్ణయించాలి

4 కవిసమ్మతమై తగు ధ
ర్మువు ధర్మమనంగ గర్మమున్ గర్మువు నా
దివిజులు వినుతింపఁగ ధ
ర్మువు బ్రోచెం గలుషమడఁచి మురహరుఁడనఁగన్
(కవి సం —37)

ధర్మాది శబ్దాలకి ము ప్రత్యయంతోపాటు వు ప్రత్యయం గూడ వాఙ్మయంలో వ్యవహరించబడుతున్నదని లక్షణం చేశాడు రామన్న ఉదాహరణగా—

---

వికృతౌ క్వచిచ్ఛలోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్యభవేత్ అజంత 42

2 వికృతావత్ర వాలోపస్సంబుద్ధ్యోయి పదేషు యే — అనే కారిక లో లాగానే ఇక్కడ గూడ వికృతి శబ్దానికి తెలుగు అని మాత్రమే అర్థం చెప్పవచ్చు

అవని యరాజకంబయిన యత్తఱి భూప్రజలెల్ల సర్వ క
ర్మములు దొఱంగ నని ప్రాసస్థ శబ్దాన్ని నన్నయ భారతం నుండి

ప్రదర్శించి శాంతి పర్వంనుండి మరొక పద్యపాదాన్ని గూడ ప్రాసఘటితమైన దానివి లక్ష్యంగా చూపాడు

అహోబలపతి ఈ లక్షణ లక్ష్యాలు రెండూ సంగ్రహించి అజంత పరిచ్ఛేదం లోని 46వ సూత్రవ్యాఖ్యానంలో సందర్భం కల్పించుకొని భవేద్ధర్మాది శబ్దానాం ముశ్చవుశ్చాత్రి కుత్రచిత్ అనే కారికను కల్పించి ఉదాహరణగా ముద్దరాజు గామన్న ఇచ్చినదాన్నే ఇచ్చాడు పద్యంలో పూర్వార్ధాన్నే కారికగా మార్చాడు

5 ఏవాఁ డెవ్వాఁ డెవ్వఁడు
నావర్తిలుఁ గృతులయందు నలినాక్ష గుణ
శ్రీ వరియింపఁగ సురలం
దేవాఁడు గలండు నా ఖగేశ తురంగా (కవి సం —40)

ఏవాఁడు ఎవ్వాఁడు ఎవ్వఁడు అనే రూపాలు మూడు కవిప్రయోగాల్లో ఉన్నా యని శాంతి విరాటపర్వాల నుండి ప్రాస ఘటిత రూపాలు (కవి సం —4 42) ఉదాహరించాడు అహోబలపతి ఈ పద్యాన్నే సంస్కృతీకరించి కారిక సృష్టించాడు అజంత పరిచ్ఛేదంలో 52వ సూత్ర వ్యాఖ్యానంలో సందర్భం కల్పించుకొని అద్విత్వంచ భవేద్ద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్ అనే కారికను సృష్టించి రామన్న ఉదాహరణలు ఎవ్వఁడు ఎవ్వాఁడు ఏవాఁడు అనేవి గూడ యథా తథంగా ఇచ్చాడు అహోబలపతికి సంస్కృత భాషమీద మంచి అధికార ముంది చింతామణి పరనం వలన సూత్రనిర్మాణ నైపుణ్యం పట్టుబడింది కాబట్టే ఒక్కొక్కచోట నిష్కారణంగా శ్లోకా లల్లిన సందర్భాలు గూడ అతని వ్యాఖ్యానంలో ఉన్నాయి (సంజ్ఞ 35వ సూత్ర వ్యాఖ్య) ఇక కవిజన సంజీవనిలోని అథర్వణ కారికల మాతృకలు స్వల్పంగా తద్వివరణం వాటి అనువాదాలయిన కారికలు ఉదాహరిస్తూ విశేషాంశాలుంటే వివరిస్తూ ఈ ప్రకరణాన్ని కొనసాగిద్దాం

6 పూంచెం బూనిచేఁ బూన్చె న
టంచుఁ బ్రయోగింపఁజెల్లు నమరశ్రేణిన్
ముంచి మనోరథ నికరము
పూంచె రమాధవుడు భక్తపోషకుఁడనఁగన్ (కవి సం -45)

పూనిచెన్ పూన్చెన్ పూంచెన్ అనే మూడు రూపాలు పద్యంలో వివరించ బడ్డాయి

ఉదా కాంచనమాలా లంకృత చంచత్తనులీలమెఱయ జవనాశ్వములన్
బూంచి యరదమున మణిమయ పంచానన కేతువెత్తె బంధుర ఫణితిన్

కారిక క్వచిద్బిందుర్నినౌదృష్టౌ క్వచిత్తేషు నసీమతౌ
(అజంత 85వ సూత్రవాఖ్య)

దీనికి అహోబలపతి వివరణ మిది బిందుః—పూర్ణబిందుః పూనిచెన్, పూన్చెన్ పూంచెన్ ఇతి రూపత్రయం ఉదాహరణం—

కాంచనమాలా లంకృత చంచత్తను లీలమెఱయ జవనాశ్వములన్
బూంచిన రథమున మణిమయ పంచానన కేతువెత్తె బంధుర ఫణితిన్

ఇక్కడ అహోబలపతే స్వయంగా ముద్దరాజు రామన్న లక్షణాన్ని లక్ష్యాన్ని తన వ్యాఖ్యలో పొందుపరిచాడు తాను కారికాసృష్టి చేసిన తరువాత ఇక ఎవరి లక్షణ లక్ష్యా లిచ్చినా నిజానికి అవి ఆ కారికల మూలాలే అయినా అతనికి అధర్వణ నామంవల్ల అతనికి కలిగిన రక్షణ జంకుగొంకు లుండకపోవచ్చు అలాంటిది

7 నేతురు నేర్తురనం దగు దైతేయారాతి నీతిదైవతగణమున్
నేతురె యఘటన ఘటనా చాతురి నానకల సుకవిజనసమ్మతిమై
(కవి సం 43)

ఉదా విరాటపర్వం నుండి ద్యూతక్రీడకుఁగొందొక ఇత్యాది కందపద్యం

ఎగసెను నెగసె ననందగు నెగసెం హరిదాల్చె దివి ఖగేంద్రుండనఁబ
న్నగళాయి కేలఁబూనఁగ నెగసెం గంకంబొగిదివి నిన్నగమనఁగన్
(కవి సం 83)

ఉదా ఆదిపర్వం— బంధనంబులెల్ల బాయుచు భీష్ముండు ఇత్యాది పద్యం

ఒనరఁగఁ బొనరఁగ నఁనఁగా
బొనరింతు నొనర్తు ననఁగఁ బొలుచుం గృతులన్
వినుతులు శౌరికొనర్తున్
బొనరింతు ననేక కావ్యములు హరికనఁగన్ (కవి సం 76)

ఉదా ఉద్యోగపర్వం నుండి ధనమును విద్యయు వంశం ఇత్యాది పద్యం

పై లక్షణాల్లోని ఎదాంత్యవర్ణాల ఇతర వర్ణాల లోపాలు గమనించిన అహో బలపతి ఒక విశాల పరిధిగల కారికను అల్లాడు క్వచిదంత్యస్య చాన్యస్యలోపో దీర్ఘశ్చకుత్రచిత్ (అజంత 86వ సూత్రవ్యాఖ్య) దీనికి పదం చివరి వర్ణం ఇతర వర్ణం అంటే ఆదివర్ణం మధ్యవర్ణం లోపిస్తుందనీ కొన్నిటిలో దీర్ఘం కూడ వస్తుందని వ్యాఖ్య చేసి ఉదాహరణలు రామన్నవి యథాతథంగా ప్రదర్శించాడు— పొనరె—ఒనరె నేర్తురు—నేతురు నెగసె—ఎగసె

8 అమరుం బోడిమి యనఁ బో
ణిమి యన నురువడియు నురువణించి యనంగా
గమలావల్లభుఁ డఖిలా
నిమిషాదులఁ దునిమె నురువణించి యనంగన్ (కవి సం — 05

శాంతి కర్ణ పర్వాలనుండి రంగనాథరామాయణం నుండి లక్ష్యాలు ప్రాస ఘటిత రూపాలు ఏరి ఇచ్చాడు (కవి సం — 06 నుండి 09 వరకు)

పై లక్షణాన్ని దానిలక్ష్యగరిమను కనుగొని అహోబలపతి అజంత వ చ్ఛేదం చివర క్వచిద్లోణ అనే కారికగా 86వ సూత్ర వ్యాఖ్యలో ప్రకటించాడు

కొండొకచో డ కారం ణ కారమౌతుందని దాని అర్థం అహోబలపతి ఒసగిన ఉదాహరణలు గూడ పూర్వం వలె రామన్నవే పోడిమి—పోణిమి ఉరువడి—ఉరువణి నాడెము—నాణెము

8 ద్విత్వము విసర్గలోపంబు వెలయుచోటఁ
జను నుకారాంత శబ్దంబు తెనుగుసేయ
రఘు రఘువు బాహు బాహువు రాహు రాహు
వూరు వూరన మఱి మేరు మేరువనఁగ (కవి సం 2– )

ఉకారాంత శబ్దాల్ని తెలుగులోనికి తీసుకొనేటపుడు కొన్నిటికి వు ప్రత్యయం వు ఆగమం లేకుండ గూడ ప్రయోగాలున్నాయని లక్షణం చెపుతున్నది

రఘు శబ్దానికి భారతం ఆదిపర్వం నుండి బాహు శబ్దానికి విరాటపర్వం నుండి రాహు శబ్దానికి శల్యపర్వం నుండి మేరుశబ్దానికి పాండురంగ మాహాత్మ్యం నుండి ఊరు శబ్దానికి ఇతర గ్రంథం నుండి ఉదాహరణలు ప్రాస ఘటిత రూపాలుగా ఉండేటట్లు ఇచ్చాడు ఈ లక్షణాన్నే సంస్కృతీకరించి అహోబలపతి వువర్ణకో భవత్యత్ర క్వచిన్నిత్యం క్వచిత్తువా అని అజంత పరిచ్ఛేదంలోని 45వ సూత్ర వ్యాఖ్యానంలో ఇచ్చాడు ఈ తెలుగులో కొండొకచోట వు ప్రత్యయం నిత్యంగాను కొండొకచోట వికల్పంగాను విఘాతమవుందని కారికార్థం దీనికి ఉదాహరణలు గూడ ముద్దరాజు రామన్నవే కావడం గమనించదగ్గ విషయం

9 పరఁగును గొన్నిటఁ దీర్ఘ స్వరమైన పదంబు పురుషవాచకపదమై
యురగులు సముద్రుఁడనఁగా నురగములు సముద్రమనఁబయో జదళాక్షా
(కవి సం 2– 9)

ఉరగ శబ్దానికి ఆదిపర్వంనుండి లక్ష్య మొసగినాడు ఈ లక్షణ లక్ష్యాల ప్రాముఖ్యం గమనించి అహోబలపతి తన వ్యాఖ్యలో అజంత పరిచ్ఛేదం 2వ సూత్రంలో వివక్షిత ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్ అనే కారికను సృష్టించి పొందుపరిచాడు డు మొదలయిన ప్రత్యయాల ప్రయోగం వక్తకోరిక

ననుసరించి కొండొకచో ఉంటుందని కారికార్థం ఉదాహరణలు కూడ కేవలం రామన్నవే కావడం విశేషాంశం

1 చను కన్ను చన్ను మొదలుగ
నొనఁగూర్ప హలాదితోడ నూదఁగఁజెల్లున్
చునఁగవ చున్నుంగవ యన
కనుఁగవ కన్నుంగవ యనంగఁ గమలాభరణా (కవి సం 2– 7)

వసంత విలాసం నుండి చున్నుఁగవ శబ్దానికి మరో గ్రంథం నుండి కన్నుఁగవ శబ్దానికి లక్ష్య లిచ్చాడు పై లక్షణాన్నే అహోబలపతి హలంత పరిచ్ఛేదంలో 23వ సూత్ర వ్యాఖ్యానంలో క్వచిద్భవేత్ సమాసేపి ప్రాణిమాత్రస్య సంస్థితి అనే కారికగా సంస్కృతీకరించి కన్దోయి చన్దోయి అనే మాటల్ని ఉదాహరించాడు కారికకు కొండొకచొ సమాసంలో గూడ హల్లు మాత్రమే ఉండటం జరుగుతుంది అని అర్థం రామన్నకంటె ముందు కేతనే ఈ లక్షణాన్ని లక్ష్యాన్ని తన ఆంధ్రభాషా భూషణంలో ( 2 వ పద్యం) ఇచ్చాడే అయినపుడు కారిక అతని గ్రంథానికి అనువాదమని ఎందుకనుకోరాదు? అని ప్రశ్నించవచ్చు అనుకోవచ్చు ప్రస్తుతం కవిజన సంజీవనిలో కారికల మాతృకలు ఎన్ని ఉన్నాయో లెక్కవేసి చెప్పడంకోసం ఇక్కడ ఇచ్చాను పైగా కొన్ని లక్షణ లక్ష్యాలు ఆంధ్ర వ్యాకరణాల చరిత్రలో ఎవరూ చెప్పనివాటిని రామన్న చెప్పిఉండటం వాటి సంస్కృతీకరణం సాధికారికంగా కారికల్లో కనబడటం వలన ఈ కవిజన సంజీవనిలో కారికా కర్తకు గట్టి పాండిత్య మున్నట్లు రుజువైంది గదా

2 చరితము చరిత్ర మొకయెడ బరగున్ స్త్రీలింగరీతి పద్మాక్ష భవ
చ్చరిత జగన్నుత మనసీ చరిత్ర శక్రాది దివిజ సంసేవ్యమనన్
(కవి సం 2–20)

పులకము అలకము లనఁగాఁ
బులకలనంగాఁ దరంగములు నాఁగఁ దరం
గలు తరగలనఁగ హంసం
బులు హంసలు నాఁగఁ గృతులఁబొలుచు ముకుందా (కవి సం 2-2 )

ఆది పర్వంనుండి చరిత చరిత్ర శబ్దాల్ని ఆముక్తమాల్యద నుండి పులకలు శబ్దాన్ని అరణ్యపర్వం నుండి అలక శబ్దాన్ని రాయని భాస్కరుని నుండి తరగలు శబ్దాన్ని కర్ణపర్వం నుండి హంస శబ్దాన్ని ఉదాహరించి చూపాడు పై లక్షణాన్ని అహోబలపతి అజంత పరిచ్ఛేదంలో 63వ సూత్ర వ్యాఖ్యలో చరితాదిక శబ్దానాం రూపం తూభయథాభవేత్ అని కారికగా అనువదించి చెప్పాడు రామన్న పద్యం లోని చరిత శబ్దమే కారికలో గణాది శబ్దంగా స్వీకరింపబడటం రామన్న పద్యం లోని ద్వితీయోదాహరణమైన చరిత్ర శబ్దానికి అనంతర వ్యాకరణాల్లో గణాది శబ్దత్వం రావడం (బాలవ్యా తత్సమ 68) గమనించదగ్గ విశేషాలు అహోబలపతి అనంతర సూత్ర వ్యాఖ్యానంలో (లాగ్భవేత్ కుళాదేర్మో –అజంత 68) ఒనగిన పులక అలక తరంగ హంస అనే ఉదాహరణలన్నీ రామన్ననుండి గ్రహించినవని చెప్పవచ్చు ఆ జంటలు యథాతథంగా రామన్నలో కనిపిస్తున్నవి

13 ఏకవచనంబె కేలన కిరుల కెల్ల
బహువచనమె తగు మురారి బాణుకేలు
తునిమె నని యమ్మహాత్ము భక్తులు భజింతు
రిరు లడఁచు సూర్యుకైవడి దురితమనఁగ (కవి సం 2–28)

ఆముక్తమాల్యద నుండి కేలా శబ్దానికి లక్ష్యాన్నిచ్చాడు పై లక్షణాన్ని అజంత పరిచ్ఛేదంలో 72వ సూత్ర వ్యాఖ్యలో సందర్భం కల్పించి బహుత్వం క్వచిదేకత్వం బహుత్వప్రత్యయ క్వచిత్ అని కారికగా ప్రకటించాడు అహోబలపతి కొండొకచో బహుత్వం కొండొకచో ఏకత్వం ఉంటాయి కొండొకచో బహువచన ప్రత్యయం మాత్రమే ఉంటుంది అని కారికార్థం ఉదాహరణలు రెండూ రామన్నవే

14 పలుకఁగఁజెల్లు విశేషణ
ములు మఱి షష్ఠికిని బ్రథమముల్ సురలందున్
గలరా భువనంబున దో
హలబాహుబలుండు నీరజాతాక్షునకున్ (కవి సం 2–33)

భీష్మ పర్వంనుండి లక్ష్యాన్నిచ్చాడు ఈ లక్షణాన్నే అహోబలపతి అజంత పరిచ్ఛేదంలో 66వ సూత్ర వ్యాఖ్యానంలో విభాషయా సుసన్తంస్యాత్ అత్రషష్ఠి విశేషణమ్ 1 అనే కారికగా సంస్కృతీకరించి ప్రకటించాడు

5 తెలిగింపఁగ బహువచనం బులక్షైనను నేకవచనము విశేషణమై
నిలుచుం బ్రాసపదంబులు వెలిగా హరికీర్తితతులు విఖ్యాతమనన్
(కవి సం 2-37)

ఆదిపర్వం నుండి లక్ష్యాన్ని ప్రదర్శించాడు రామన్న లక్షణ లక్ష్యాలు రెండూ కారిక తదుదాహరణాలుగా హలంత పరిచ్ఛేదంలో 42వ సూత్ర వ్యాఖ్యానంలో అహోబలపతిచేత మార్చబడ్డాయి క్వచిదేకత్వ మిష్టంస్యాత్ అప్రాణిస్త్రీ విశేషణే ప్రాణి వాచకాలు స్త్రీవాచకాలు కాని పదాల విశేషణాలు ఏకవచనాలు గూడ కావచ్చునని కారికార్థం హరికీర్తి తతులు విఖ్యాతము అనేది అహోబలపతి ఒసగిన ఉదాహరణ దీన్నిబట్టి అహోబలపతి రామన్న గ్రంథాన్ని కంఠస్థం చేశాడనవచ్చు

16 ధూర్తముఖ్య పదచతుష్టయంబగు నుత్వ
మేవి డుత్వమేని గృష్ణువలన
ధూర్తునీచు మూర్ధుఁ ద్రుంచెను గృష్ణుండు
చేసెరాజ్య ముగ్రసేనుఁడనఁగ (కవి సం 2-4)

విరాటపర్వం నుండి నీచు శబ్దానికి అరణ్యపర్వం నుండి వృద్ధు శబ్దానికి లక్ష్యాలివ్వబడ్డాయి తరువాత ఈప్రకారము ధూరుమూర్ధు అని ప్రయోగములు అని గ్రంథంలో ధూర్త మూర్ధ శబ్దోదాహరణలు కనుపించడం లేదు రామన ఇచ్చినా లేఖక ప్రమాదం వల్ల అవి జారిపోయి ఉండవచ్చు రామన్న ఉదాహరణలన్నే స్వకీయాలుగా చూపే అలవాటున్న అహోబలపతి నన్నయ సభాపర్వ ద్వితీయాశ్వాసంలోని 24వ పద్యభాగాన్ని మూర్ధవు శిశుపాల అని తన వ్యాఖ్యానంలో

2 ఈకారిక సూత్రార్థాన్నే పునరుక్తం చేస్తుంది

ఉటంకించాడు. పై లక్షణాన్ని సంస్కృతీకరించి అహోబలపతి తన వ్యాఖ్యలో అజంత పరిచ్ఛేదంలో 44వ సూత్ర వ్యాఖ్యానంలో ధూర్తవృద్ధౌ మూర్ఖనీచావుదంతా వపి సమ్మతౌ ఉక్త్వేనైవ తవ న్త్యన్యే ప్రయోగ స్తత్రకారణమ్ అనే కారికలుగా ప్రకటించాడు

రామన చేసిన ఈ లక్షణం తప్పనిసరిగా అధర్వణకారికకు మూలంగా విస్పందేహంగా కనబడటాన్ని గమనించిన వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు యథార్థాన్ని తిరగవేసి అధర్వణకారికల్నే రామన తెనిగించాడని అన్యాయ్యంగా వ్రాశారు (బాలసరస్వతీయ ఎరిక వావిళ్లవారి ప్రచురణ— 97 ) పైగా రామన లక్షణంలో పదచతుష్టయ మని మాత్రముండి ఉదాహరణలు మూడింటికి మాత్రమే (వృద్ధ శబ్దానికి తప్ప) ఉండటం వలన ఆ లక్షణం అధర్వణకారికకు అనువాదమని గూడ ఉపపత్తి చూపారు కాని రామన పదచతుష్టయ మని లక్షణంలో చెప్పి లక్ష్యాల్లో నాలుపదాలు చూపడం వలన పై శాస్త్రిగారి వాదం అబద్ధమని తేలిపోయింది వారు నాల్గోపదం వృద్ధ శబ్దానికి ఉదాహరణ లేదన్నారు కాని అరణ్యపర్వం నుండి రామన ఉదాహరించినట్లు పైన చూపబడి ఉంది ఎదో ఒకవిధంగా నన్నయకు చింతామణినీ అధర్వణునికి వికృతివివేకాన్నీ కట్టబెట్టాలనే దృఢనిశ్చయమే తప్ప నిజానిజ పరిశీలనాదృష్టి వారిలో లోపించింది

చెల్లు( దిర్యక్పదములెల్ల శ్రేష్ఠశబ్ద సంయుతములైన పురుషవాచకము లట్లు
వన్నగేంద్రుఁడు మృగరాజు పతగనాథు డనఁగ నశ్వోత్తముడనంగ
(కవి సం 3— )
నగజనాథ

మృగేంద్ర శబ్దానికి సౌప్తికపర్వం నుండి అశ్వోత్తమ శబ్దానికి ఆదిపర్వం నుండి రామన్న లక్ష్యాలిచ్చాడు అతని గ్రంథంలోని రచనా ప్రణాళికనుబట్టి ఈ లక్షణ లక్ష్యాలు సరిగానే ఇమిడి ఉన్నాయి ద్వితీయ తరంగంలో గూడ (కవిజన సంజీవనిలో) వీటిని పోలిన లక్షణ లక్ష్యాలే ఉన్నాయి గాని సందర్భాన్నిబట్టి చూస్తే రెండు విధాలైన లక్షణ లక్ష్యాలు గ్రంథంలో పొసగి ఉన్నాయి కాని అహోబలపతి ద్వితీయ తరంగంలోని లక్షణాన్ని సంస్కృతీకరించిన తరువాత ( 0వ ఉదాహరణ) తిరిగి ఈ లక్షణాన్ని సంస్కృతీకరించి చెప్ప పనిలేదు అతని పూర్వ లక్షణంతోనే

ఈ లక్ష్యాన్ని గూడ గతార్థం చేయవచ్చు కాని అహోబలపతి ఈ కొత్తగా కనిపించే లక్షణాన్ని సంస్కృతీకరించకుండా నిగ్రహించుకోలేకపోయాడు అజంత పరిచ్ఛేదంలోని 2వ సూత్ర వ్యాఖ్యానంలోనే దీన్ని సంస్కృతీకరించి పొందుపరిచాడు.

క్వచిదర్థ విశేషేతు క్లీబేప్యుభయ రూపతా విచక్షణ మనోమోదకారిణీ
శబ్దకల్పనా

నపుంసక లింగంలో గూడ కొండొకచో అర్థవిశేషంలో ఉభయ రూపత్వముంటుందని కారికార్థం పండితుల మనస్సులకు సంతోషకరమైనది శబ్దనిర్మాణం అని ఉత్తరార్థానికి భావం రామన్న తన లక్షణ గ్రంథంలో రెండుచోట్ల చెప్పిన లక్షణాలు రెండింటినీ సంస్కృతీకరించిన అహోబలపతి అంతటితో తృప్తిపడక తన ధోరణిలో ఆ రెండు లక్షణాల భావాన్నే వివిధ భంగిమలలో వివిధ కారికలుగా ఆ 2వ సూత్ర వ్యాఖ్యాన సందర్భంలోనే ఆవిష్కరించాడు

చంద్ర శార్దూల నాగాద్యాః పరేశ్రేష్ఠత్వ గోచరా
ముదుజన్తో మహత్స్వార్థేఽమహత్స్వార్థే రుచిర్యది
దీనిలో రామన్న లక్షణస్థ శ్రేష్ఠ శబ్దం గూడ స్వీకరించబడింది
శ్రేష్ఠతాయా మమహత క్వచిద్ముజపిసమ్మత
ఇది పై రామన్న లక్షణాన్ని యథాతథంగా సంస్కృతీకరిస్తే ఏర్పడిన దని
వేరే చెప్పవనిలేదు

కేచిచ్చామహచ్ఛబ్దా మతేకవిశిఖామణి
పురుషాఖ్యా భవన్త్యత్రి ప్రయోగ స్తత్రికారణమ్

ఈ అన్ని లక్షణాలూ లక్ష్యాలూ వివక్షిత ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్ అనే కారికతో (కవి సం 2– 6వ పద్యానువాదం) సిద్ధిస్తాయని అహోబలపతికీ తెలుసు (అహోబలపండితీయం 2వ సూత్రవ్యాఖ్యానం) కాని ఏపాటి కొత్తదనం తనకు పూర్వమున్న తెలుగువ్యాకరణాల్లో భాసించినా దాన్ని సంస్కృతీకరించి అధర్వణాంకితం చేయకుండా ఉండలేదు అతడు అహోబలపతికి రామన్న పరిశోధనం వలన ఉదాహరణలు కూడ అయత్నసిద్ధంగా చేతికందాయి ఉరగులు

అళ్వోత్తమున్ దవ్వులన్ అనే రామన్న ఇచ్చిన ఉదాహరణల్నే కొంత ఉపోద్ఘాతం వ్రాసి కారికల క్రింద లక్ష్యాలుగా చూపాడు

8 పడెc బలుచెcబెట్టి బాటన విడcదగు సంస్కృతము తుద మదేభము మొసలిం
గదుభంగపెట్టె సంకట పడె నాకుల పలిచె దు భపాటొనరించెన్
(కవి సం 3—4)

ప్రియభయ శబ్దంబులు బిందుయుతంబుగ నిల్పcదగు యతుల్ గృష్ణ శుభో
దయులు ప్రియంబదరి దురత్యయ శౌర్యులు దానవుల్ భయంపడి యనcగన్
(కవి సం 3—5)

అరణ్యపర్వం నుండి ప్రియంపడు శబ్దానికి ఆదిపర్వంనుండి భయంపడు శబ్దానికి లక్ష్యా లిచ్చాడు రామన్న అహోబలపతి తీక్షణమైన బుద్ధిగలవాడు రామన్న లక్షణంలోని పాటు శబ్దం అతన్ని ఆకర్షించింది దానికి పూర్వశబ్దాలన్నీ క్రియలు అదిమాత్రం నామవాచకం చింతామణిలోని సంధిపరిచ్ఛేదం 6వ సూత్ర వ్యాఖ్యానంలో పై పాటు శబ్దాన్ని కారికాబద్ధం చేసి ఆధర్వణాంకితం చేశాడు

ఆదంత పాదిశబ్దేతు పత్యర్థే బిందు లోపకౌ వర్ణకస్యాతి కథితౌ క్వచిత్
సుకవి సమ్మతే

ఆ అంతంలో గల పకారమాదిలో గల పత్యర్థక శబ్దం అంటే పాటు పరమైనపుడు ము వర్ణకానికి బిందువు లోపం వస్తాయని కారికార్థం కారికను కేవలం పాటు శబ్దం కోసమే సృష్టించాడు సంతోషపాటు అని ఉదాహరణ గూడ ఇచ్చి రామన్న తెలుగు మాటను సంస్కృత శంఖం లో పోసి లోకానికం దించాడు

8 తెలుcగుల నైదాలక్షరములపై సంస్కృతపదంబు పొసగింపcదగున్
గలిమిచెలి చెలిమి విభునకు వెలసిరి పదియారువేల ప్రియులు సనంగన్
(కవి సం 3—8)

కర్ణపర్వం నుండి ఆరక్షరాల శబ్దానికి లక్ష్యం చూపాడు ఈ లక్షణం అహో బలపతికి స్వీకార యోగ్యంగా తోచింది హలంత పరిచ్ఛేదంలో 48వ సూత్ర

వ్యాఖ్యలో దానిని సంస్కృతీకరించి పొందుపరిచాడు సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి అనే సూత్ర వ్యాఖ్యలో పరిమిత శబ్దాన్ని వివరిస్తున్నట్లుగా ఆంధ్రం షడ్వర్ణపర్యంతం పదంస్యాత్ కర్మధారయే అనే కారికను ప్రకటించాడు కర్మధారయ సమాసంలో తెలుగు పదం ఆరక్షరాల పరిమితి గలదై ఉండాలని కారికార్థం

చింతామణి సూత్రం కర్మధారయ సమాసంలోనే ఈ నియమమని చెబుతున్నా అహోబలపతి షష్ఠీతత్పురుషంలో గూడ ఈ నియమం అన్వయిస్తుందని వ్యాఖ్యానించాడు బహుశః అతని వ్యాఖ్యానానికి రామన్న ఉదాహరణం కటిక చీఁకటి తిండికరముల అనేది కారణం కావచ్చు ఆ ఉదాహరణం షష్ఠతత్పురుషంగదా అహోబలపతి ఈ సందర్భలో రామన్న ఇచ్చిన ఉదాహరణనే స్వీకరించడం గూడ గమనించదగ్గ అంశం

20 తెనుఁగు కృత స్త్రీలింగం బునకు విశేషణము పున్నపుంసకములచే
తనమునఁ జెల్లె యశోదా తనయు కృపా దృష్ట సౌఖ్యదాయక మనఁగన్
(కవి సం 2 – 36)

సభాపర్వం నుండి పై లక్షణానికి లక్ష్యాన్ని చూపాడు కవిజన సంజీవనీకారుడు దాన్ని చింతామణిలోని అజంత పరిచ్ఛేదం 48వ సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి సంస్కృతీకరించి కారికగా పొందుపరిచాడు

అప్రాణి వాచినామత్ర భవేదమహతాం స్త్రియాం
ద్విధా విశేషణం తత్ర మానం సువచసాం వచ

అప్రాణి వాచకాలు అమహద్వాచకాలు అయిన స్త్రీలింగ శబ్దాలకు రెండు విధాలైన విశేషణాలు (పున్నపుంసకములు) చెల్లుతాయని కారిక భావం చింతామణి సూత్రంతోనే ఈ కారికలవల్ల ఏర్పడే లక్ష్యాల్ని సాధించవచ్చు (ఉభయవిధ మమహతీనాం) కాని చింతామణి సూత్రంలో కంటె కవిజన సంజీవని లక్షణంలో స్పష్టత మెండు దానిలో కృత స్త్రీలింగంబు పుం నపుంసకములు అచేతనములు వంటి పదాలు నిస్సందేహంగా లక్షణంలోని అర్థాన్ని స్ఫుటంగా తెలుపుతున్నాయి గుణగ్రాహి అయిన అహోబలపతి ఆ లక్షణాన్ని సంస్కృతీకరించకుండా

ఉండలేక పోయాడు పైగా పై లక్షణ మాధారంగానే అతని వ్యాఖ్యానం సాగినట్లు క్రింది పంక్తుల్ని బట్టి నిర్ణయించవచ్చు అమహతీనామిత్యనేన స్త్రీలింగానామిత్యయ మర్థోగమ్యతే అమహతో ద్వివిధా స్త్రీలింగాః అస్త్రీలింగాశ్చేతి స్త్రీలింగా అపి ద్వివిధా ప్రాణివాచకాః అప్రాణివాచకాశ్చేతి తత్ర అప్రాణివాచకానాం స్త్రీలింగా మహతాం స్త్రీలింగవిశేషణం అస్త్రీలింగవిశేషణం చోభయం భవతీత్యర్థః

పై రామన్న లక్షణంలోని స్త్రీలింగశబ్దం కారికలో స్త్రియాం అని వున్నపుంసక శబ్దం ద్విధావిశేషణం అనీ అచేతన శబ్దం అప్రాణివాచినాం అనీ రూపుదిద్దుకొన్నట్లు స్పష్టంగా తెలుస్తుంది

అహోబలపతి కారికల్లో 4వ పాదానికి లక్షణం చాలకపోతే ప్రమాణం తత్ర సద్వచః మానం సువచసాం వచః అని కవి ప్రయోగాలే ఆయా లక్షణాలకు ప్రమాణమని పూరిస్తూ ఉంటాడు తెలుగు లక్షణ గ్రంథాల్లో లక్షణాలు స్వయంగా చెప్పి లక్ష్యాలు ప్రాచీన కావ్యాలనుండి ఒసగిన లాక్షణికుల్లో ముద్దరాజు రామన్నను అగ్రగామిగా అంగీకరించవచ్చు అతనికి ముందు ఆ సంప్రదాయం ఉన్నట్లు లేదు అతనిని చూచే తరువాత అప్పకవి మొదలు అడిదము సూరకవి వరకు పలువురు లాక్షణికులు తమ లక్షణ గ్రంథాల్లో ఆమార్గాన్ని పాటించారు కాగా కవిప్రయోగాలు ఆధారంగా లక్షణాల్ని సమర్థించడం అనే ధోరణి కవిజన సంజీవని నుండే అహోబలపతి తన కారికల్లో పాదపూరణం కోసమే అయినా స్వీకరించాడని నిర్ణయించవచ్చు

అహోబలపతి కవిజన సంజీవనిని బహుశ్రద్ధతో చదివి దాని లక్షణ లక్ష్యాలు ఆకళించుకున్నాడు కాబట్టే అతని వ్యాఖ్యలో ఉదాహరణలలో రామన్న సేకరించిన ఉదాహరణలు మిక్కుటంగా కనబడుతుంటాయి (అజంత 54వ సూత్ర వ్యాఖ్య) కవిజన సంజీవన్నిమార్గం అపూర్వం గాబట్టి ఎందరో లాక్షణికులు దాన్ని వెలువడిన వెంటనే శిరసావహించారు అహోబలపతి వారిలో ఒకడు అయితే తన దీపికాసానికి ఎవని రచననుండి స్ఫూర్తిని పొందాడో ఎవని గ్రంథంలోని లక్షణ లక్ష్యాలు అక్షరశఃస్వీకరించి తాను కీర్తిని పొందాడో అతనినే ఆధుని కుడని తన వ్యాఖ్యలో ఒకచోట (అజంత 42వ సూత్రవ్యాఖ్య) ఈసడించడం మాత్రం అహోబలపతి చేయదగిన పనిగాదు

పై పరిశీలనం వలన అహోబలపతి తన వ్యాఖ్యానంలో అధర్వణకృతంగా ప్రవేశపెట్టిన కారికలు అధర్వణోపజ్ఞకాలు కావనీ అవి అహోబలపత్యుపజ్ఞకాలు గూడ కావనీ అహోబలపతికి పూర్వమున్న లాక్షణికుల లక్షణాల భాషాంతరీకరణాలే అని సాధికారికంగా నిర్ణయించగలిగాం

అలాగే అధర్వణకారికలు ఒక స్వతంత్ర గ్రంథం కాదని దానికొక రచనా ప్రణాళికలేదని అవన్నీ అహోబలపతి తన వ్యాఖ్యానానికి ప్రోద్బలకంగా అక్కడక్కడా అల్లిన లక్షణఖండాలనీ సాధికారికంగా నిరూపించగలిగాం ఆ కారికలకి అహోబలపతి వ్యాఖ్యానంనుండి వేరుచేసి చూస్తే అర్థసందర్భాలే తెలియవని గూడ గమనించగలిగాం వాటికి విడిగా వ్యాఖ్యానం వ్రాసినట్లు నటించిన ద్వితింత్రిణి సీతారామాచార్యులు గూడ కేవలం అహోబలపతి వ్యాఖ్యాన భాగాల్నే ఎత్తి వ్రాయడం తప్ప స్వయంగా చేసినదేమీ లేదు అతడేకాదు వాటికి విడిగా వ్యాఖ్య వ్రాయదలిస్తే ఎవరైనా అంతకుమించిచేయగలిగేది ఏమీ ఉండదు కార ం వాటి రచన అటువంటది

ఈ కారికల మూలపాఠాలు ముద్దరాజు రామనకు పూర్వగ్రంథం కావ్యాలంకార చూడామణిలోను (విన్నకోట పెద్దన) దానికి పూర్వ గ్రంథం ఆంధ్ర భాషాభూషణం లోను (మూలఘటిక కేతన) గూడ కనిపిస్తున్నాయి అయితే ఈ కారికలు కూటసృష్టి అని తొలిగా నిరూపించడానికి ముద్దరాజు రామన గ్రంథమే తగినదిగా ఉండటం వలన దానిని ముందు స్వీకరించడం జరిగింది ఇపుడు రామనకు పూర్వుడు విన్నకోట పెద్దన్నను పెద్దన్నకు పూర్వుడు కేతనను అహోబలపతి ఎంత బాగా చదివి వారి మాటల్ని గూడ సంస్కృతీకరించి ఏవిధంగా అధర్వణ కారికలు సృష్టించాడో గమనిద్దాం అనేక లక్షణాలు లక్ష్యాలు కేతనలోను పెద్దనలోను సమానంగా ఉండటంవలన పెద్దన లక్షణాలు కొంత స్పష్టతరంగా కనిపించడం వలన అతని లక్షణాలు వ్రాసి కుండలీకరణాల్లో వాటి మూలాలు కేతనవిగూడ చూపడం జరిగింది పెద్దన లక్షణాలలో ఇముడని కేతన లక్షణాలు విడిగా చూపి వాటినుండి కారికలు సృష్టింపబడిన తీరు తరువాత గమనిద్దాం

### కావ్యాలంకార చూడామణిలో కారికల మూలపాఠాలు

మను కటుపటు శబ్దాదుల నొనరింప డకారమెపుడు నుండదు కవితం
దెనిగించి చెప్పుచోటం దనరు వుకారంబ యర్థదాయకమగుచున్ —9—29

(పైలక్షణమే అం భా భూ లోగూడ చూడవచ్చు పద్య సంఖ్య 40)

కారిక మనువట్వాది శబ్దానాం నడుక్ నిత్య ప్రయుజ్యతే — అజంత 44 సూ
వ్యాఖ్య మను వటు మొదలయిన శబ్దాలకు డుక్ ప్రత్యయం వి
ఆగమం రావు

2 వలసినపుడు శర్మ వర్మ శబ్దంబుల పై డుకారమెక్కు(బాసిపోవు
రామశర్ము(డన(గ( గామవర్ము(డనంగ వసుధశర్మయన(గ వర్మయన(గ
9—43

(పైలక్షణమే అం భా భూ లోగూడ చూడవచ్చు పద్య సంఖ్య 40 )

కారిక క్వచిన్మనుజసంజ్ఞాయాం డుక్ నాంతాన్న విధీయతే — హలంత 0 సూ
వ్యాఖ్య మనుషుల పేర్లు నకారాంతాలైనపుడు (శర్మన్ వర్మన్) కొన్నిచోట్ల
డుక్ రాదు

3 ఆది శబ్దాంత వర్ణంబునంత్యశబ్ద పూర్వ వర్ణంబుతో(గూడ(బొత్తుచేత
సంధియగు 9—46

(పైలక్షణమే అం భా భూ లోగూడ చూడవచ్చు పద్య సంఖ్య 44)

కారిక ఆద్యంత వర్ణయోరైక్యం సంధిరిత్యుచ్యతేబుధైః — సంధి 9 సూ వ్యాఖ్య
ఆది అంత వర్ణాలు ఒకటి కావడం సంధి అని చెప్పబడుతుంది-పండితుల
చేత

4 అచ్చు తుదియచ్చు పట్టున వచ్చి యకారంబు నిలుచు వలసినయెడ దా
నచ్చయి యిత్వోత్వంబుల( జొచ్చునప్రిచిత్రార్థ వాద సూచకమగుచున్ -9-47

(పై లక్షణమే అం భా భూ లోగూడ చూడవచ్చు పద్యసంఖ 49)

కారిక ప్రాణాత్ ప్రాణో లఘుర్యస్స్యాత్ సహల్‌చాచ్చ భవేత్క్వచిత్ —
సంజ్ఞ 2 సూ వ్యాఖ్య అచ్చుకు పరమైన అచ్చు లఘు యకార
మౌతుంది అది హల్లూ అచ్చూ అవుతుంది

5 మొల్లమ్మగ నెల్లెడలను హల్లులపై విడుపులగుచు నాయీయేయో
ఉల్లసితాకృతి నిలుపం జెల్లుం బ్రశ్నానునయ విశేషము లందున్ –9 - 84

(పై లక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్యసంఖ్య 54)

కారిక అచ్చతుష్కం భవేత్ ప్రాణిస్థితం ప్రశ్నాదివాచకమ్ –అజంత 85 సూ
వ్యాఖ్య ఆ ఈ ఏ ఓ లు ప్రాణివాచక శబ్దాలమీద జేరి ప్రశ్న మొద లయిన అర్థాలిస్తాయి

6 వాఁడు వీఁడను నవి బహువచనములను వారు వారలు వాండ్రును వీరు వీండ్రు
వీరలునునాఁగ నెందును విస్తరిల్లు గాఁడునకు గారు గాండ్రును గల్గు నండ్రు –9–85

(పై లక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్యసంఖ్య 72)

కారిక భవేత్తదాది శబ్దేభ్యో డుజాదిస్తు భవేన్నచోత్
జసఃస్థానే రురత్రిస్యాత్ క్వచిదత్వం భవేల్లరే
ఏకత్వేచ భవేద్వారు స్తథా లౌచక్వచిద్భవేత్ అజంత 52 సూ వ్యాఖ్య

వాఁడు మొదలయిన శబ్దాలకు డు మాత్రమే వస్తుంది ఉత్వం రాదు బహువచనంలో రు వస్తుంది (వారు) లు ల లు పరమైతే దానికే అత్వం వస్తుంది (వారలు వారలన్) ఏకవచనంలో గూడ వారు వికల్పంగా వస్తుంది (ఎవ్వారు) లు పరమైనపుడు గూడ అలాగే (ఎవ్వారలు)

7 వరుస నేయి చేయి వాయనుపలుకుల తుదలఁబెక్కుఁజెప్పఁదులు జనించుఁ
బ్రీతి నేతులనఁగఁ జేతులు వాతులు నాఁగఁజెల్లు నెల్లనాటనండ్రు –9–89
వేయి తాయి దోయనియెడి వీని బహుత నోలిఁ దుద లుత్వమొనఁగూడు
వేలు తాలు దోలనా 9—90

(పైలక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్య సంఖ్య 76 77)

కారిక కేషాంచి ద్యన్తశబ్దానాం లతిస్స్యాతాం యథోచితమ్
క్వచిత్త్వాదేశ ఏవస్యాత్ క్వచిన్నైవ ప్రయోగతః
వర్ణస్యాన్త్యస్య లోపస్స్యాత్ లులయో ప్రాయశ క్వచిత్
(అజంత 69 సూ వ్యాఖ్య)

కొన్ని యి అంతమందు గల శబ్దాలకు (రాయి నేయి మొ ) తి గాని లు గాని చేరుతుంది (రాళ్లు నేతులు మొ ) కొన్నిచోట్ల తి మాత్రమే వస్తుంది కొన్నిచోట్ల రాదు చివరి వర్ణానికి లు ల లు పరమైనపుడు తరచుగ లోపం వస్తుంది

8 కేలేకవచన మరయఁగఁ బాలును దెమ్మెరలు సహజ బహువచనంబుల్ –9-8
కారిక బహుత్వం క్వచిదేకత్వం బహుత్వ ప్రత్యయ క్వచిత్
(అజంత 72 సూ వ్యాఖ్య)

ఒకచోట బహుత్వమూ ఒకచోట ఏకత్వమూ ఒకచోట బహుత్వప్రత్యయం మాత్రమే ఉంటుంది ఇరులు ఇత్యాద్యా బహువచనాంతాః కేలు ఇత్యాద్యా ఏకవచనాంతా – వ్యాఖ్య

9 కొఱ్ఱలాళ్ళు వడ్లు గోధుమలనుములు కొల్లులనెదు పీనికెల్ల నిట్ల
ప్రకటితంబులయ్యె బహువచనంబులు ఏకవచన నియతి ఎపుడులేదు -9-92
ఎద్దునకు వరికి నెడ్లు వడ్లునాఁబను – 9 – 90
(పైలక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్యసంఖ్య 80)

కారిక ఏకత్వే సస్యవాచిత్వం బహుత్వే ధాన్యవాచితా
లోపాదేశ వికారస్తు తత్రతత్ర ప్రదృశ్యతే – అజంత 85 సూ వ్యాఖ్య

కొన్ని శబ్దాలు ఏకవచనంలో సస్యాల్నీ బహువచనంలో ధాన్యాల్నీ తెలుపుతాయి లోప ఆదేశవికారాలు అక్కడక్కడ కనుపిస్తున్నాయి వరి – వడ్లు అరుగు – అళ్ళు కొఱ్ఱ – కొఱ్ఱలు మొదలగునవి ఇది కావ్యాలంకార చూడామణి లక్షణాన్ని మెరుగుపరిస్తే ఏర్పడిన లక్షణం

0 గుణి గుణంబు చెప్పఁ గొఱలు విశేషణ పదముపై నికారమొదవుఁబాయు
నాతికెల్ల నాఁడు నల్లని కనుఁగవ నల్లకనుఁగవ యనంగ వరుస 9 – 27

(పైలక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్యసంఖ్య 4)

కారిక నివర్తకస్స్యాద్బహుళ మదన్తాద్గుణవాచకాత్ – అజంత 85 సూ వ్యాఖ్య

అదంతమైన గుణవాచక శబ్దం కంటె ని ప్రత్యయం బహుళంగా వస్తుంది నల్లని కలువ – నల్లకలువ ఇత్యాది

ఇఱఁబల్లు ముల్లు విల్లను హలాదులను నదుకుచోట నడగును జడల్
పలువరుసయు ములుమోదుగు విలుకాఁడు ననంగ నెందు విశ్రుత మగుటన్
– 9 – 30

వెన్ను కన్ను చన్నునియెడి పీనిజడ్డ లుడుపుటొప్పు సమాన నియోజనములఁ
దనర వెనుగాఁడి కనుదోయి చనుమొలకలు నా సమాసంబులొప్పు నానా
విధముల —9— 31

(పైలక్షణమే ఆం భా భూ లోచూడవచ్చు పద్య సంఖ్య 2)

కారిక క్వచిద్భవేత్ సమాసేపి ప్రాణిమాత్రస్య సంశ్రుతిః
హలంత 23 సూ వ్యాఖ్య

కొండొకచో సమాసంలో గూడ హల్లు (ఒకటి) మాత్రము వినవచ్చును కనుదోయి చనుదోయి ఇత్యాది

2 అరియిఁడిఁ కొఁడాడఱ యన ధరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరువడి వాని నెఱుంగుట పరమ పరిజ్ఞా నమాంధ్రభాషాకవితన్ —9— 42

సూఁదరి ముందరి తూఁటరి కల్లరి కాలరి ప్రేలరి కష్టుఁడనఁగ
నుప్పిఁడి ప్రాయిఁడి చప్పిఁడి గ్రేసిఁడి తన్నిఁడి చిక్కిఁడి దాతయనగఁ
నీటుకాఁడెడకాఁడు పోటుకాఁడుదురులాఁడించులాఁడెప్పుడు నీతఁడనఁగఁ
డక్కులాఁడెక్కువ నిక్కులాఁటదరులాఁడెపుడు దురాత్మకుం డీతఁడనఁగ
9— 43

పైలక్షణమే ఆం భా భూ లోగూడ చూడవచ్చు పద్య సంఖ్య 63 67)

కారికా కాఁడుర్గాఁడుర్పవేదీఁదుర స్తిత్వాద్యర్థబోధకాః
ఏకత్వవాచకాత్పుంసి స్యాదాఁడు స్త్వన్యథామత
స్త్రియామాఁడిర్బహుత్వేస్యాత్పుంసి
అన్యేచ బహవో దేశ్యా వర్ణకాః అర్థభేదకాః —అజంత 72 సూ వ్యాఖ్య

అస్తిత్వము (కల) అనే అర్థంలో కాఁడు గాఁడు ఈఁడు అనే ప్రత్యయాలు ఏకవచనాంత శబ్దంకంటె పరంగా వస్తాయి—పుంలింగంలో ఆఁడు మాత్రం బహువచనాంత శబ్దంకంటె పరంగా వస్తుంది ఆఁడి స్త్రీలింగంలో బహువచనాంత శబ్దం కంటె పరంగా వస్తుంది ఇంకా దేశీయాలైన అనేక ప్రత్యయాలు వివిధార్థాల్లో వస్తాయి వన్నెకాఁడు వన్నెలాఁడు వన్నెలాఁడి కల్గరి ఉప్పిఁడి ఇత్యాది

3 మొదలం జెప్పినయది తుద యది యాదేశంబు విధికి నవ్వచనములం
బొదవి ప్రథమ మధ్యమలకుఁ దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్ల
యగున్ — 3 — 56

చేయునది బుధుఁడు ధర్మము సేయునది బుధులు విశేష సిద్ధక్రియలం
జేయునది నీవు దర్పము సేయునది తపంబుమీరు శివునకు ననినన్
— 3 — 57

కారిక తద్ధర్మ ప్రథమైకత్వ వాచకాద్ధి క్రియాపదాత్
అది శబ్ద ప్రయోగస్స్యాత్ విశేషార్థే నిరీక్షితే — క్రియా 45సూ వ్యాఖ్య

తద్ధర్మ ప్రథమైక వచన క్రియాపదం కంటె అది అనే శబ్దం విశేషార్థంలో ప్రయోగించబడుతుంది పలుకు పలుకునది అనుష్ఠించునది ఇత్యాది

4 తెలుఁగుఁబలుకులు పునరుక్తిఁబలుకుచోట గదిసి రెండవపదమున మొదలి వ్రాఁతఁ
దనరు గిత్వంబు ప్రాసంబు దప్పకుండ వర్ణములు దీర్ఘ హ్రస్వ ప్రవర్తులగుచు
పులి గిలియనఁ గరి గిరియన నలి గిలియన నోద గిదయనగాఁబరఁగున్
నలులు గిలులనఁగ బలవంతులు మఱి గిలవంతులనఁగఁదుద సరియగుచున్
3 — 167 68

కారిక క్వచిత్ సర్వశబ్దానాం పునరుక్తిర్నదోషకృత్
తత్రస్యాద్గిత్వమాద్యస్య సమతాహ్రస్వ దీర్ఘయో —అజంత 85 సూ వ్యాఖ్య

క్వాండొకచో ఎల్లశబ్దాల పునరుక్తి దోషం కాదు వాటిలో మొదటిదానికి హ్రస్వ దీర్ఘాల ననుసరించి గి గీలువస్తాయి హరి - గిరి వహ్ని - గిహ్ని ఇత్యాది

పై ఉదాహరణల్లో ఇత్యాది అని చూపబడ్డవి అహోబలపతివి

పై పరిశీలనం వలన అధర్వణకారికలుగా అహోబలపతి తన వ్యాఖ్యలో ప్రదర్శించినవి యథార్థానికి స్వతంత్రకారికలు గావని వాటికి మూలపాఠాలు విన్నకోట పెద్దనలో అనేకం కనిపిస్తున్నాయని తెలిసికోగలిగాం విన్నకోట పెద్దన్నను అహోబలపతి ఎరుగునే కాని అహోబలపతిని పెద్దన్న ఎరగడం అసంభవం పెద్దన అధర్వణకారికలు సంస్కృతంలోనివి చూచి తెనిగించాడని వాదించడానికి బొత్తిగా వీలులేదు అతని లక్షణాలు దాదాపు అన్నీ కేతన ఆంధ్రభాషాభూషణం లోనివే పెద్దన్న కాలానికి గాదుగదా వెల్లంకి తాతంభట్టు ముద్దరాజు రామన్నల కాలానికి గూడ అధర్వణుడు వ్యాకర్త అనే విషయం పండితలోకానికి తెలియదు ఇందరు లాక్షణికులూ అధర్వణుని కారికలు రహస్యంగా ఆంధ్రీకరించారనే అబద్ధం కల్పించడం కంటె అహోబలపతే ఆ కారికలు సృష్టించి గ్రంథ గౌరవ సంపాదనార్థం బాలసరస్వతి లాగానే తానూ ఒక భారతానువక్త పేర వాటిని ప్రకటించాడు అనడం సబబు

పైగా అధర్వణకారికలుగా అహోబలపతి ఉటంకించిన వాటిలో చాలభాగం మిక్కిలి అర్వాచీనకాలానికి చెందినవి కావటంవల్ల[1] ఆ కారికలు ఆధర్వణికాలు కాకుండానైనా పోవాలి లేదా అధర్వణుడు నాల్గైదు శతాబ్దాలు ముందుకు నడిచైనా రావాలి అని ప్రసిద్ధ పరిశోధకులు నిర్ణయించి ఉన్నారు[2]

---

1 చూ అప్పకవీయంలో అధర్వణకారికల మూలపాఠాలు అన్న ప్రకరణం

2. ప్రొ తూమాటి దొణప్ప—భాషాచారిత్రక వ్యాసావళి — ఆంధ్రసారస్వత పరిషత్— 972

మన పండితుల్లో తమ పూర్వుల/ సమకాలికుల లక్షణాలు రహస్యంగా సంస్కృతీకరించి కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించాలనే దృక్పథం లేదనడానికి వీలులేదు చిన్న మొన్నటి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి దుస్సాహసం ఆయన చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని పొగచూరిన తాటాకులమీద రాత్రికి రాత్రి వ్రాసి వాటిని హరికారికలు గా ప్రకటించి చిన్నయసూరి ప్రాచీనమైన వాటినే తెలుగుచేశాడని వాదించడం తరువాత శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రి మున్నగువారు ఆ వాదాన్ని మూలోచ్ఛేదం చేయడం మనమెరిగిన విషయమే కదా అంతకు ముందు బలారి నరసింహరాజు అనే చింతామణి వ్యాఖ్యాత అహోబలపతికి కూచిమంచి తిమ్మకవికి తరువాతివాడు కవిసంశయ విచ్ఛేదంలోని తద్భవ లక్షణా లనేకం సంస్కృతీకరించి తన వ్యాఖ్యలో చొనపడం జరిగింది[1] అంతవరకెందుకు అహోబలపతి అప్పకవీయ పీఠికలోని పద్యాలు అనేకం సంస్కృతీకరించి చెప్పాడు గదా మన ప్రాచీన పండితుల్లోని ఈ మనస్తత్వాన్ని పూర్వరంగంగా భావించి చూస్తే అహోబలపతి తప్పకుండా తనకు పూర్వులైన లాక్షణికుల లక్షణాన్నే సంస్కృతీ-కరించి తనకు పరోక్షగౌరవం తన వ్యాఖ్యకు ప్రత్యక్షగౌరవం కల్పించుకున్నాడని నిస్సంశయంగా నిర్ణయించవచ్చు

ఆంధ్ర భాషా భూషణంలో కారికల మూలపాఠాలు —

ఇపుడు చిన్నకోట పెద్దన లక్షణాలలో ఇముడని కేతన లక్షణాలు వాటి నుండి పుట్టిన కారికలూ ఏమిటో పరిశీలిద్దాం —

పెక్కుటి కొక క్రియ యిడుచో నొక్కడఁదుదినొందె మొదలనొందెను మఱియొ

క్కొక్కటి కొందెను బెట్టుదు రక్కట క్రియనడుమబెట్ట రాంధ్రకవీంద్రుల్
ఆం భా భూ 86

కరియరిగెఁ దురగ మరిగెను గరియున్ దురగమ్ము నరిగెఁ గ్రక్కున నరిగెన్

గరియును దురగము ననఁదగుఁ గరియరిగెన్ దురగమనఁగఁగై కొనరార్యుల్
పైది 87

---

మా కవిజనాంజనము చింతామణి వ్యాఖ్య

కారిక క్రియాయాస్తు ప్రయోగస్స్యాత్ కారకాద్యంత భాగయో
మధ్యభాగే తత్ ప్రయోగో నసాధుహ్యాదయం గమః
అజంత 56 సూ వ్యాఖ్య

క్రియాప్రయోగం కారకం యొక్క ఆదిలోగాని అంతంలో గాని చెయ్య వచ్చు మధ్యలో చేయరాదు నడచెనేనుఁగు గుఱ్ఱము ఏనుఁగు గుఱ్ఱము నడచెను ఇత్యాది పూర్వార్థ ఉదాహరణమ్ ఏనుఁగు నడచెను గుఱ్ఱము ఇత్యాది ప్రయోగోన సాధుసమ్మత అహోబలపతి వ్యాఖ్య

వీటిపై ఇతరుల వ్యాఖ్య అవసరం లేకుండానే తెలుగు సంస్కృతానికి మూలమని తెలుస్తుంది

2 ఏకవచనపుఁ దుదలందు సెలసినిలుచు నుత్వమత్వమౌ నిత్వమ్ము నీత్వమొందు
నార బహువచనంబుపైఁ జేరినిలుచు హ్రస్వములు నిడుపులగుఁగవ్యను
మతమున (ఆం భా భూ 02)

సుతుఁడ సుతుఁడా యనఁగ సుదతి సుదతీ యనఁగ విమలతరమతులారా
హితకారులార యనఁగా నతిశయముగ వరుసతో నుదాహరణంబుల్
(పైది 03)

కారిక సంబోధనే వాదీర్ఘస్స్యాత్ ప్రయోగస్య తథాగతే
భవేదత్రాది తామేవ దీర్ఘత్వం వికృతే ఋచే —అజంత 4 సూ వ్యాఖ్య

ప్రయోగానుసారంగా సంబోధనంలో దీర్ఘం వికల్పంగా వస్తుంది అచ్చ తెలుగులో అత్వ–ఇత్వాలకు మాత్రమే ఆ దీర్ఘం వస్తుంది నను గృపజూడు భారతీ భావభవ నిభ సుభగా ఇత్యాది అహోబలపతి ఉదాహరణం రెంటిని గమనించినపుడు ఎ వివరణం లేకుండానే కేతనను సంస్కృతీకరించి అధర్వణుని పేర కారికలు సృష్టించాడు–అహోబలపతి అని తెలుసుకోవచ్చు కాబట్టి ఇకపై కేవలం కేతన పద్యాలు కారికలు మాత్రమే వాటివాటి ఉదాహరణలతో ఉటంకిస్తాను

3 దీవెనకగు నెడుఁగాతను గావుతనున్ దెనుగుకవుల కబ్బంబులలో
శ్రీ వెలిగెడు మధిపుఁడు మేల్గావించుంగాత మేలుకావుతమనఁగన్
(ఆం భా భూ 6 )

కారిక డుమకాతౌ కావుతాద్యా ఆశీరర్థేతు సమ్మతా —అజంత 8 సూ వ్యాఖ్య

దీవెనలో డుమ కాత అనే ప్రత్యయాలు కావుత మొదలయినవీ సమ్మతాలు శుభము ఘటియింపుడుము ఇత్యాది

అందు నిందు నెందు ననునర్థములు మఱి యటయు నిటయు నెటయు ననుక్రమమునఁ
గ్రియల రాకపోకలయి మీఁదనుండిన నుత గుణాభిరామ నూత్నదండి
(ఆం భా భూ 74)

అటఁబోయెడి నిటవచ్చెడి నెటకఱిగెడి ననుట యుచిత మిటువలెఁగాదే
యట నాడెడి నిటఁబాడెడి నెటఁగూర్చున్నాఁడనంగ నెసఁగవుకృతులన్
(పైది 75)

కారిక ఉదన్తటాన్తాః స్థానార్థ వాచకా యుక్తబోధకా కొవరేతుళవేదత్వం
(అజంత 78 సూ వ్యాఖ్య)

ఇటు రమ్మ అటుపొమ్మ ఎటుపోయెదు ఇటకు ఎటకు అటకు ఇత్యాది

5 పెక్కు సంస్కృతశబ్దంబు లొక్కపదము క్రిందఁ దద్విశేషణము లింపొందఁగూర్చి
తెలుఁగు తత్సమానము క్రిందఁ గలుగునప్పు డగ్రపదముతో విలసగు వర్థఘటన
(ఆం భా భూ 30)

తన విశిష్టకులాచార ధర్మమనఁగఁ దన జగద్గీత సాధువర్తనమనంగఁ
దన దిగంతర వర్తి ప్రతాపమనఁగనివి యుదాహరణంబులై యెందుఁజెల్లు
(ఆం భా భూ 3 )

సీ సంస్కృతంబుతోడ సమాసించును సీ వినూత్న మణినూపుర
శబ్దాసక్త చిత్తహంస త్రాసకరాంబుదమునాఁగఁ దఅచై యునికిన్ పైది 35

కారిక సమాసయుక్ భవేనాద్య ఆత్మాదిక విభక్తిగ —హలంత 33 సూ వ్యాఖ్య

సంస్కృత శబ్దాలు తన మొదలయినవాటితో సమాసాన్ని పొందుతాయి తనధర్మవిభవము నాబుద్ధిపాటవము నీమహోదారత ఇత్యాది

6 వినెఁ గనెఁ గొనె నను పగిదింజను పలుకులనుండు నడఁగు సంబంధంబుల్
వినియెఁ గనియెఁ గొనియె ననఁగ ననుపై వర్తిల్లుఁగాన నభినవ దండీ
(అం భా భూ 82)

కారిక యస్యాద్దేశ్య క్రియాస్తేషు భూత ఏకత్వవాచక
ఇతఏవ పరస్సస్యాత్ భవేన్నాన్తకాత్ పరే —సంజ్ఞా 20 సూ వ్యాఖ్య

భూతార్థక—ఏకవచనంలో దేశ్యక్రియల చివర య వస్తుంది అది ఇత్వానికి పరంగానే వస్తుంది ఇత్తు నాంతక్రియలకు పరంగా వస్తుంది కవియె వినియె ఇత్యాదావేత్వ విశిష్టం యత్వమ్

7 అన్యుఁబనుపుచో నుట్టంతమైన శబ్ద మచ్చుపై నున్న ముట్టంత మగుట నిజము
మొనసి పొడవరి సేనల ననఁగఁజనదు పొడవు మరి పేన ననుటయె పోలుఁగాని
(అం భా భూ 72)

కారిక ప్రార్థనార్థే మురేకత్వే కథ్యతే మధ్యమార్థక
విభాషాతు వదన్త్యన్యే నప్రాణేతు కదాపిచ (క్రియా 35 సూ వ్యాఖ్య)

ప్రార్థనార్థంలో ము ప్రత్యయం ఏకవచనంలో చెప్పబడుతుంది కొందరు అది వికల్పంగా వస్తుందంటారు అచ్చుపరమైనపుడు మాత్రం వికల్పంగా రావడం ఎప్పుడూ లేదు ఘటింపు సుఖము అచి పరేతు ఘటింయింపు మమల సుఖము ఇత్యేవరూపమ్

---

1 కేతన ప్రత్యయాల్ని అక్షరాల్ని విడిగాచెప్పవలసి వచ్చినపుడు ఙా ని వాటి చివర చేర్చి చెపుతాడు ఉదా ముఙు—ముప్రత్యయం ఉఙు—ఉ అక్షరం ఇతడు సంస్కృతంలోని తపర కరణానికి మారుగా ఈ ఙా ని ఎన్నుకున్నాడు

ఇదేవిధంగా ఆంధ్రభాషాభూషణంలోని లక్షణాలు మరికొన్ని అధర్వణకారి కలుగా భాషాంతరీకరింపబడి ఉన్నాయి వాటిని ఇంకా సంక్షేపంగా అవసరమైతే తప్ప నిర్వ్యాఖ్యానంగా ఇస్తాను

8 ఒక కర్తచేయు పనులకుఁ బ్రకటితముగ మొదలనైన పని యిత్వాంతం
బకృతంబయినను క్త్వాం తంబ కుటిల కర్తవ్య కార్య మన్వంత మగున్
(ఆం భా భూ 57)

అమిలేమికి నిమికల్మికి నమరంగాఁ దనము ధర్మమగుటకుఁ దగుఁగా
నమి వినమి తాల్మి కూరిమి తమ మంచి తనంబు లోభితన మనఁజనుటన్
(పైది 66)

కారిక క్త్వార్థేతు వ్యతిరేకార్థే క ధాతోన్త త్రైవ మిర్భవేత్
(క్రియా 46 సూ వ్యాఖ్య)

వ్యతిరేక క్త్వార్థంలో క ప్రత్యయం వస్తుంది వ్యతిరేకార్థంలోనే ధాతువుకి మి ప్రత్యయం వస్తుంది ఉదా వండక ఘటింపక వండమి ఘటింపమి

9 తినుటకును దింటయును నగుఁ గొనుటకుఁ గొంటయగు గనుటకుం
గంటయగున్
వినుటకు వింటయగున్ దానుటకు నంట యగు వలసినప్పుడు గృతులన్
(ఆం భా భూ 159)

కారిక టవర్ణకః క్రియాన్తేస్యాత్ భావార్థే సాఽసమాసయో
పూర్వస్య నవికారోన్తే స్తస్మిన్ లోపశ్చ కస్యచిత్ (క్రియా 46 సూ వ్యాఖ్య)

క్రియల చివర భావార్థంలో సమాసమందు అసమాసమందు ట ప్రత్యయం వస్తుంది అది పరమైనపుడు ముందున్న ను అనేదానికి వికారం లేదు ఉదా: అనుట వినుట కనుట కేతన పైరూపాలు అంట వింట కంట అన్నట్లు మారుతాయని సూత్రిస్తే అది కూడదంటుంది కారిక ఈ కారికావ్యాఖ్యానంలో అహోబలపతి అనేన అంట వింట కంట ఇత్యాది ప్రయోగస్య భావార్థే నసాధుత్వం

తేన అను౦ ఇత్యాదేరేవ సాధుత్వం అని వ్యాఖ్యానించడం గమనించదగిన అంశం అతడే కారికాకర్త గూడ అని నిర్ణయించబడింది గాబట్టి పై కేతన లక్షణం చెల్లదని చెప్పడానికే ఈ కారికాసృష్టి జరిగినట్లు తెలుసుకోవచ్చు

0 తెనుఁగులఁ గొన్నిటిలో మునుకొని జడ్డలతోడ నిలిచి క్రొన్నెలకృతికిన్
బనివడి క్రొత్తయు నెలయును ననుటఁ దెలియఁజెప్పు వరుసనవి యెట్లన్నన్
(ఆం భా భూ 24)

క్రొన్నెల క్రొమ్మెఱుఁగులు నాఁగ్రొన్నన క్రొక్కాఱునాఁగఁ గ్రొత్తమ్మలునా
నెన్నడుము నెమ్మొగము నా నెన్నడ నెత్తావి యనఁగ నెన్నెదురనఁగన్
(ఆం భా భూ 25)

తెలుఁగున కెంచెమ్మలు మునుగల వాక్యము లరుణకాంతిఁ గావించును గెం
దలిరులు కెందమ్మలునాఁ జెలువుగఁ జెంగల్వలనఁగఁ జెందొవలనఁగన్
(పైది 26)

పేరనియెడు శబ్దం బేపారన్ దెనుఁగులకు మొదల నధికతఁదెలుపున్
బేరాకలి పేరామని పేరాముద పాకులనఁగఁ పేరింపనఁగన్ (పైది 27)

కారిక శబ్దానామాదిభాగేషు నూతనత్వాది బోధకా
ఏకద్వివర్ణకాశ్శబ్దా అర్థభేదేఽపిచ క్వచిత్
వైపుల్యవాచకత్వేన పేరుశబ్దోవిధీయతే (అజంత 85 సూ వ్యాఖ్య)

శబ్దాల మొదట కొత్తదనము మొదలైన అర్థాలు తెలిపే ఒకటీ రెండూ అక్షరాలు కలిగిన శబ్దాలు ఉన్నాయి అవి కొన్నిచోట్ల అర్థభేదంలో కూడ వస్తాయి విపులత్వము అనే అర్థంలో పేరు అనే శబ్దం విధించబడుతుంది క్రొన్నన క్రొంజిగురు నెన్నడుము చెంగలువ నెత్తావి నెత్తమ్మి పేరాముదము పేరురము ఇత్యాది

అలికి రాలగు దిగువ గుణాలి నిలిచి పలుకుచోట నమవగునెడగొ
డ్రాలు జవరాలు పాతకు రాలు గెదపు రాలు ముద్దరాలనఁజనుటన్
(ఆం భా భూ 68)

కారిక అజ్ఝలో రాలుశబ్దేన సమార్థకతా యది
సమాసే తత్రచోద్రస్స్యాత్ రేఫ ఏవక్వచిద్భవేత్ హలంత 0 సూ వ్యాఖ్య

ఆలు శబ్దంతో సామానాధికరణ్య మున్నపుడు అజంత హలంత శబ్దాలకు ఉత్వము రేఫము వస్తాయి కొన్నిచోట్ల రేఫమాత్రమే వస్తుంది బుద్ధిమంతురాలు గుణవంతురాలు పేదరాలు జవరాలు

2 ఋకారాంతంబులపై యుఱగు నన్నయును దల్లియును నను క్రియనా
యు ట్టంత మొందుచోటుల నుఱ్ఱగు మనుమఁడును నందనుండును ననఁగన్
(ఆం భా భూ 37)

కారిక యువర్ణ కస్స్యాద్యన్తాత్తు నువర్ణక ఉతో భవేత్ ద్యోతకావర్థభేదస్య చాన్య
తాపిక్వచిద్భవేత్ (అజంత 40 సూ వ్యాఖ్య)

ఇ అంతమందు కలిగిన పదానికి యు ప్రత్యయము ఉ అంతమందు గలిగిన పదానికి ను ప్రత్యయము విశేషార్థాన్ని తెలుపుతూ (సముచ్చాయార్థాన్ని) కొండొక చోట వస్తాయి తల్లియు తండ్రియు రాముఁడును భీముఁడును

3 మానయు జేనయు లోనగు నానా పరిమాణములు జనము గొలుచునెడన్
మానెఁడు జేనెఁడు నను క్రియ మానఁకెడుల నొందు మీఁద ౹మానయకేతా
(ఆం భా భూ 38)

కారిక మానార్థాన్నిత్య మేకత్వే ఎడుస్స్యాత్ పరిమాణకే (సంధి 6 సూ వ్యాఖ్య)

ఏకవచనాంతమైన శబ్దంకంటె ఎడు అనేది నిత్యంగా పరిమాణార్థంలో వస్తుంది మానెఁడు జేనెఁడు తూమెఁడు ముంతెఁడు

4 ఉనుదురు లొరులకుఁ జెప్పను దనరఁగ దువుదురు లెదిరికిఁ దనకు
దునుదుముల్ (ఆం భా భూ 45)

కారిక ఉన్స్యాద్భవిష్యదర్థేవా బహుత్వేతు దురుర్భవేత్ క్రియా 8 సూ వ్యాఖ్య[1]

---

బాలసరస్వతీయ వ్యాఖ్యలో (ఆంధ్రసాహిత్య పరిషత్) దూర్చబడిన కారిక యిది

భవిష్యదర్థంలో ఏకవచనానికి ఉన్ బహువచనానికి దురు ప్రత్యయాలు వస్తాయి ఘటించుదున్ ఘటించుదురు

పై పరిశీలనం వలన అధర్వణకారికలు యథార్థానికి అహోబలపతి తనకు పూర్వమున్న లాక్షణికుల లక్షణాలను సంస్కృతీకరిస్తే ఏర్పడినవే గాని స్వతంత్ర రచనలు కాజాలవని స్పష్టంగా గ్రహించగలిగాం

### కవి చింతామణిలో కారికలమూలపారాలు

ఈ కారికలకు మూల మొకటి కవి చింతామణిలో[1] గూడ స్పష్టంగా కని పిస్తుంది కవి చింతామణి కర్త వెల్లంకి తాతంభట్టు అష్టభాషావతార బిరుదాంకితుడు తన కవి చింతామణిని కావ్యానుశాసన మని పేర్కొన్నాడు—ఆశ్వాసాంత గద్యలో 16వ శతాబ్దివాడైన చిత్రకవి పెద్దన ఈ తాతంభట్టును తన లక్షణసార సంగ్రహంలో (ల సా సం 3–3) పేర్కొనడం వలన ఇతనిని నిస్సందేహంగా బాలసరస్వతికీ అప్పకవికీ అహోబలపతికీ పూర్వుడని నిశ్చయించవచ్చు తాతంభట్టు తన గ్రంథంలో అధర్వణభారతం నుండి పద్యమొకటి ఉటంకించాడు కాగా తాతంభట్టుకి గూడ అధర్వ ణుడు—అతని గ్రంథాలు తెలుసు గాని అతని కారికల జాడ తెలియదన్నమాట నిజంగానే అధర్వణుడు కారికల కర్త అయి అవి అహోబలపతికి పూర్వం ఉండి ఉంటే ప్రసిద్ధ లాక్షణికుడు అధర్వణుని పేర్కొన్న మొదటి ఆంధ్ర లాక్షణికుడూ అయిన తాతంభట్టుకు వాటి జ్ఞానం లేకుండా ఉంటుందని విశ్వసించలేం ప్రకృతాం శానికి వద్దాం

ఆది లఘువుమీఁద నర్థబిందువు నిలువదు (కవిచింతామణి 8వ ఆకు)

నుడి తొలిహ్రస్వంమీద ఖండబిందువుండదనే సూత్రం చేయడానికి ఎంతో వాఙ్మయపరిశీలనం కావాలి భాషాస్వభావాన్ని ఆకళించుకున్నవానికి గాని అలాంటి సూత్రం చేసేశక్తి ఉండదు అష్టభాషావతారుడుగా ప్రసిద్ధుడైన తాతంభట్టు ఆ సూత్రం చేశాడు దాన్ని అహోబలపతి తన వ్యాఖ్యలో సంజ్ఞాపరిచ్ఛేదంలో 8వ సూత్రం దగ్గర సందర్భం కల్పించుకొని సంస్కృతీకరించాడు

---

1 ఇది తాళపత్ర గంథం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధ నాలయంలో – 4–6 సంఖ్యతో ఉంది

నఖండః ప్రథమాత్ హ్రస్వాత్ పై కృతేఽత్ర కదాఽపిచ
ఈ తెలుగులో ఎప్పుడు గాని మొదటి హ్రస్వం కంటె ఖండబిందువుండదు

ఉదా కెందమ్మి చెందొవ

తాతంభట్టు లక్షణంలోని ఆదిలఘువు కారికలో ప్రథమ హ్రస్వ మైనది అలాగే అక్కడి అర్ధబిందువు ఇక్కడ ఖండ మైనది భాషాంతరీకరణాన్ని స్పష్టంగా గుర్తించవచ్చు

## లక్షణసార సంగ్రహంలో కారికల మూలపాఠాలు

తాతంభట్టు తర్వాత తెలుగు లాక్షణికుల్లో పేర్కొనవలసినవారు–కాలాన్ని బట్టీ సామర్థ్యాన్ని బట్టిగూడ చిత్రకవి పెద్దన అతని లక్షణాలు గూడ కొన్ని సంస్కృతీకరించబడి ఆధర్వణకారికలుగా అహోబలపతిచేత తన వ్యాఖ్యలో దూర్చబడినాయి

సంస్కృతార్ణములఁ దత్సమమగు తెలుఁగుల
యందుఁ గ్రియా పదాంతాక్షరములఁ

బరుతుచో రేఫలు గలుగు వింతియె కాని
గలుగదు బండి అకార మరయ

అద్వయి ఇద్వయి ఎద్వయి ఒ ఔలు
కగచజ తదపబాక్షరము లెన్న

నమర నసల లిన్ని యమరు నిర్వది రెండు
వీనిపై జారేఫ వితతు లొదవు

వాని వర్గులచేఁ దేర్చు వరుసతోడఁ గడమ యిరువది తొమ్మిదక్కరముల తుదఁ

గదిసి రేఫలు గలిగినఁ గలిగెఁ గాని మఱి అకారంబు లేదెందు మారుత

సుత (ల సా సం 3-10)

పెద్దన లఘ్వలఘు రేఫల్ని గూర్చి ముఖ్యంగా యతిప్రాసలలో వాటి సాంకర్యం చెల్లదంటూ కేవలం రేఫ శకారనిర్ణయం తన లక్షణసార సంగ్రహంలో తృతీయాశ్వాసంలో చేశాడు ఇతనికి పూర్వం తాతంభట్టు కవిచింతామణిలో గూడ ఈ రేఫ శకారాల చర్చ కొంత ఉన్నా ఇంత తీవ్రంగా అధికంగా లేదు తాతంభట్టుకు పూర్వుడు విన్నకోట పెద్దన ఈ రేఫ శకారాల వైషమ్యాన్ని పట్టించుకోలేదు అతని కాలానికి వాటికి ప్రాముఖ్యం ఉంది ఉండదు

పై లక్షణంలో శా రేఫలు ఏయే అక్షరాలమీద ఉంటాయో ఎక్కడెక్కడ రేఫలు శకారాలు మాత్రమే ఉంటాయో చెప్పబడింది క్రియాపదాల చివర రేఫలుంటాయనీ శారేఫలు రెండూ అఆ ఇఈ ఎఏ ఒఓ క గ చ జ త ద ప బ న మ ర వ స ల అనేవాటిమీద మాత్రమే ఉంటాయని వాటినన్నిటిని వర్గభేదంతో వివరిస్తానని చెపుతూ పై 22 అక్షరాలు కాక మిగిలిన 29 అక్షరాల చివర ఉంచే రేఫలుంటాయే గాని శాలు ఉండవని పెద్దన పరిశోధన చేసి చెప్పాడు అతని పరిశోధనకు నన్నయభట్టాదుల కృతులే ఆధారమట (ల సా సం 3–60) కాని అతడు గూడ నన్నయను ఆధర్వణునీ వ్యాకరణకర్తలుగా ఎరుగడు అసలు వారు (నన్నయాధర్వణులు) అయితే గదా అతడెరగడానికి

పై లక్షణాన్నే అహోబలపతి సంస్కృతీకరించి సంజ్ఞాపరిచ్ఛేదంలోని 8వ సూత్ర వ్యాఖ్యానంలో పొందుపరిచాడు

కారిక క్రియాన్తే చాన్య వర్ణేచ లఘురేఫా ప్రకీర్తితా
ద్వివిధాది దుతశ్చ స్వరయలౌ చకగౌ తథా
చజౌ పబౌ తదౌ వర్ణౌ ననరా వస సంయుతా
ఎతేద్వితయ సంయుక్తా రేఫోఽప్యత్రతుసమ్మత

పెద్దన లక్షణాన్ని అహోబలపతి యథాతథంగా క్రమం గూడ చెడకుండా సంస్కృతీకరిస్తే అనంతర లేఖకుల ప్రమాదాలవల్ల పెద్దన లక్షణంలోని నమర వసల వర్ణాలు అహోబలుని కారికలో ననరా వసలు గా మార్పుచెందాయి పెద్దన అద్వయి ఇద్వయి ఎద్వయులు కారికలో ద్వివిధాది దుతశ్చ అని (ఉత్ అధికంగా చేరి) మారినాయి మిగిలిన అక్షరాలు లక్షణం అక్షతంగా నిలిచి ఉండటం జరిగింది అయితే ఈ కారికలు లక్షణసార సంగ్రహంలోని పై లక్షణానువాదాలని తెలిస్తేనే

తప్పు తెలిసిన తరువాత గూడ ఆ లక్షణంతో పోల్చిచూస్తే తప్పు ఈ కారికలకు నిష్కర్షగా అర్థమిది అని తెలియదు కాబట్టే అహోబలపండితీయానికి తెనుగు అనువాదాలు చేసినవారు అధర్వణకారికలకు వ్యాఖ్యానాలు వ్రాసినవారూ అందరూ ఈ కారికల అర్థం సరిగా తెలిసికోలేక ఏదో వ్రాసి సరిపెట్టుకున్నారు

అయితే ఇక్కడ గూడ అధర్వణకారికల్నే చిత్రకవి పెద్దన అనువదించి ఉండగూడదా? అని పూర్వపక్షం చెయ్యవచ్చు దానికి సమాధానంగా ముద్దరాజు రామన కవిజన సంజీవనిలో అధర్వణ కారికలకు మూలపారాలు దొరికినపుడు చెప్పిన దాన్నే చెప్పవచ్చు అధర్వణకారికల కాలం కర్తృత్వం రెండూ సందేహాస్పదాలే చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహ విషయమై అలాంటివేవీ లేవు పెద్దన రచనలో అతని కాలంతో విరోధించే భాషాలక్షణాలు లేవు కారికల నిండా అధర్వణకాలంతో విరోధించే లక్షణాలే కారికల కర్తగా పూర్వ పరిశోధకులచే శంకితుడైన అహోబలపతి చిత్రకవి పెద్దన్న నెరుగునే కాని పెద్దన్న అహోబలపతిని ఎరుగడు కాగా పెద్దన్ననే కారికా కర్త అనువదించాడని నిర్ణయించ వచ్చు పైగా అధర్వణునివిగా చెప్పబడిన ఈ కారికలకు అర్థమేమిటో సరిగా ఎవరికీ నేటివరకు తెలియకుండా ఉంది చిత్రకవి రచనలో అలాంటిదేమీ లేదు పైగా రెండింటిని పోల్చిచూచినపుడు చిత్రకవి రచన మూలమని కారికలు వాటి అనువా దాలని నిర్ద్వంద్వంగా నిరూపితమౌతూ ఉంది

2 జకారానకు రేఫలు లేవు ల సా సం 3—24

జలధి జెటిపోతు జలజల జాతెననఁగ జటిగొనియె జాలువుప్పుట
జిటిజిటి యన

జాల జాలయనంగ¹ తొమ్మిదివి జకారంబుపై ద్రొద్దణాలు
నకారానకు ణాలులేవు 3—48

నరకు నెరబడి నైరణ నరు లనంగ నరకునేయక సురిగిరి నొరిది యనఁగ
సురియ నోరనగండ్లును సూరెలనఁగ సారెసారెన నొగటాల సారెలనఁగ
సిరి యనంగను లక్ష్మియౌ నేసిరనఁగ నేనరుల నెక్కు తనసరి నేసిరనఁగ
నప్త దశరేఫలయ్యె సాక్షరముమీఁద జానికీ జాని చరణాబ్జ చంచరీక

---

¹గ్రంథ పాఠము (సాహిత్య పరిషత్ కాకినాద 940)

పై లక్షణాల్లో మొదట జకారానికి రేఫలు లేవని వచనంలో చెప్పి ఉన్న ళాలనుమాత్రం తరువాత పద్యంలో నిబంధించాడు పెద్దన అలాగే సకార విషయం లోను సకారానకు ళాలు లేవు అని వచనంలో చెప్పి ఉన్న రేఫలుమాత్రం తరువాతి పద్యాల్లో నిబంధించి చూపిఉంటాడు అయితే లేఖకుల ప్రమాదం వలన ఆ చిన్న వచన ఖండం జారిపోయి సకారానికి రేఫలు మాత్రమే కలవని నిరూపించే పద్యాలే నిలిచాయి—ప్రస్తుత ముద్రిత ప్రతిలో

పై లక్షణాలు చూచిన అహోబలపతి వాటిని సంస్కృతీకరించి అధర్వణాంకితం చేశాడు—పై సందర్భంలోనే (సంజ్ఞ 8వ సూత్రవ్యాఖ్య)

కారిక లఘుర్నాస్తి జకారస్యా ళఘుస్సస్య కదాపిన

జకారానికి లఘురేఫమూ సకారానికి అలఘురేఫమూ ఉండవు

ఈ సందర్భంలోనే పరిశీలనార్హమైన విషయ మింకొకటి కనుపిస్తున్నది చిత్రకవి తన రేఫ ఱకార నిర్ణయంలో ఏయే అక్షరాల మీద లఘ్వలఘురేఫలు ఎన్నెన్ని వాఙ్మయంలో ఏయే పదాలలో ప్రయుక్తాలై ఉన్నాయో వాటినన్నిటినీ నన్నయాదుల రచన లాధారంగా ఏర్చి కూర్చి సంఖ్యాపూర్వకంగా చెప్పాడు ఆ చెప్పడంలో వీలైతే తెలుగు అంకెల్లోనే చెప్పాడు ఛందస్సు అనుకూలించకపోతే సంస్కృతంలో సంఖ్యాగణనకు ప్రసిద్ధమైన పద్ధతిలో (సంఖ్యానాం వామతోగతి) చెప్పాడు ఆ చెప్పడం రేఫలకు విడిగా ళాలకు విడిగా అ మొదలు ల వరకు ముందు చెప్పిన 22 అక్షరాలమీదా జరిగింది

3 అద్వయిమీఁద రేఫ లిర్వదియు రెండు పదునొకొండ్రేఫ లిద్వయి పయిని హనుమ
(డి యన) ముప్పది ళాలు నద్వయిని (నిటికి) ఇకారంబుపై ళాలు నాలుగు
(ఁగజ) (ల సా స 3_5 6)

తపర రేఫ లీక్షణ మరుద్బంధులు హరి (పైది 26)

ఈ విధంగా లక్షణసార సంగ్రహంలో రచన సాగింది దాన్నే అహోబలపతి క్రోడీకరించి బహూళః అన్నీ కలిపి కూడి ఆ అంకెల్ని సంస్కృతీకరించి

మొత్తం రేఫలు ఇన్ని అనీ ళాలు ఇన్ని అనీ చెప్పడానికి ప్రయత్నించి ఉంటాడు- కాబట్టే క్రింది కారికలు ఏర్పడినాయి—సంజ్ఞాపరిచ్ఛేదంలో 9వ సూత్ర వ్యాఖ్యలోనే

లఘు వహ్నిఖి శైలాగ్న యోఽన్యేఖగజబర్హిష
అన్యేఽ న్తరిష ఖద్రుళోఽన్యేన యుక్తా కదాపిచ
కేచిద్వద న్తిచ లఘూన్ బిందు బాణశిలీముఖాన్
తథావద న్తి కేచిత్తు హర్యంఘ్రి ఖశరాన్ పరాన్

రేఫలు 373 కొందరివి 380 అని అన్నారు మరికొందరు 200 అని అన్నారు ఇంకా కొందరు 550 అని అన్నారు కొందరు శకటరేఫతో గూడిన శబ్దాలు 500 అని అంటున్నారు—అని పైకారికలకు అర్థం

లక్షణసార సంగ్రహంలోని రేఫల్నీ ళాక్షరాల్నీ మొత్తంగా కూడి చూస్తే కారికలలోని సంఖ్యతో ఖచ్చితంగా సరిపోవడంలేదు గాని కొంచెం హెచ్చుతగ్గులగా సరిపోవచ్చు అహోబలపండితీయంలోని కారికలలో లేఖక ప్రమాదాలు సుప్రసిద్ధమైన విషయమే గాబట్టి ఆ సంఖ్యలు ఒక దానితో ఒకటి పెద్దన్నవీ అహోబలపతివీ సమానం కాకపోయినా పెద్దన్న గ్రంథాన్ని అనువదిస్తేనే అధర్వణకారికలలోని ఆయా రేఫ ళకార సంఖ్యలు ఏర్పడినాయని చెప్పవచ్చు_రేఫళకారాలకు సంఖ్యానిర్ణయంచేసే పద్ధతి చిత్రకవి పెద్దన్నదే కాబటి

పై పరిశీలనం వలన లక్షణసార సంగ్రహం కొద్దిభాగం భాషాంతరీకరిస్తే అధర్వణునివిగా పేర్కొనబడ్డ కారికలు కొన్ని ఏర్పడినాయని నిర్ణయించగలిగాం

బాలసరస్వతీయంలో కారికలమూలపారాలు.

తరువాత ఈ కారికలకు మూలపారాలు కొన్ని బాలసరస్వతి వ్యాఖ్యానంలో కనుపిస్తున్నాయి వాటిని పరిశీలిద్దాం

అహమాదీనాం ద్విత్వమ్ —సంధి 9

దీని వ్యాఖ్యానంలో బాలసరస్వతి ఒక పొరపాటుమాట వ్రాశాడు— అహమ్

శబ్దాన్ని అహం అనివ్రాసే అలవాటును పురస్కరించుకొని సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది అహమ్మని కిమ్మని యుమ్మని అని

అహోబలపతి బాలసరస్వతి పొరపాటునే ఆలంబనంగా తీసికొని—ఆ సూత్ర వ్యాఖ్యానంలోనే—క్రింది కారిక అల్లాడు

శబ్దానామంత్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే
తస్యాచి పరతో మస్స్యాత్ సర్వత్ర కవిసమ్మతే

శబ్దాల చివర కనుపించే సున్నకు అచ్చుపరమైతే మకారం వస్తుందని కారిక కర్థం

నిజానికి బాలసరస్వతి ఆ పొరపాటు వ్యాఖ్య చేయకుంటే ఈ కారిక పుట్టి ఉండేదే కాదు

ఈ కారికకు బాలసరస్వతి వ్యాఖ్యానాన్నిబట్టి చూస్తే అర్థసందర్భా లేర్పడుతున్నాయే గాని స్వతంత్రంగా చింతామణిలోని ఏ సూత్రంతోను దీనికి సందర్భం లేదు అయినపుడు అధర్వణుడే కారికల్ని వ్రాసి ఉంటే అతడు బాలసరస్వతి తరువాతివాడై బాలసరస్వతీయాన్ని చదివి దానిలోని పొరపాటు వ్యాఖ్యానాన్ని నిజమని నమ్మి దాన్ని ఆధారం చేసికొని ఈ కారికను వ్రాసి ఉండాలి కాని ఇదంతా అసంభవమని వేరే వాదించపనిలేదు బాలసరస్వతి తరువాతివాడూ బాలసరస్వతీయాన్ని చదివినవాడూ దానిలోని పొరపాటుమ నిజమని భ్రమించిన వాడూ అహోబలపతి కాగా అతడే ఈ కారికకూ దానితోపాటు అన్ని కారికలకూ కర్త అని సులభంగా నిర్ధారణ చెయ్యవచ్చు

2 నుమ్యోత —సంధి 3

పై సూత్ర వ్యాఖ్యానంలో బాలసరస్వతి నుమ్ అనే ఆగమంలోని ఉకార మకారాలలోపం గురించి శబ్ద సూత్ర ప్రాప్తిని ఉపకార మకారములు లోపమగును అని వ్రాశాడు శబ్ద సూత్రం అంటే పాణినీయం—ప్రాచీనుల వ్యవహారంలో పాణినీయాన్నిబట్టి అంటే అందులోని హలన్త్యమ్ (—౩—౩) అనే సూత్రంతో

ఉపదేశే అజనునాసికఇత్ ( -3-2) అనే సూత్రంతో మకార ఉకారాలు లోపిస్తా యని అతని ఉద్దేశం తెలుగు వ్యాకరణంలో ప్రక్రియాదశలో పాణినీయాన్ని స్వీక రించవచ్చునని బాలసరస్వతి చెప్పాడు ఆ సూచనను ఆధారంగా చేసికొని అహో బలపతి

ఆద్యా మహార్థాసామూలం సర్వస్యేతి నిగద్యతే తదను క్తస్య కార్యస్య వక్తా భవతిపాణిని

అని ఒక కారికను కల్పించి సంజ్ఞాపరిచ్ఛేదంలోని వ సూత్రవ్యాఖ్యలో పొందిగాడు

పై సూత్ర నుమ్వోత ) వ్యాఖ్యానంలోనే బాలసరస్వతి అలరుంబోంపము చిగురుంగైదువు అనే ఉదాహరణ లిచ్చాడు వీటిలో పూర్వపదం ఉదంతం ఉత్తర పదం సరళం తరువాత మరొక సూ త (మోస్తు విభ క్త్యేకవచనకేపుంపూ-35) వ్యాఖ్యానంలో సరసపు(బలుకులు సరసంపు(బలుకులు అని ఉదాహరించాడు ఆ సమాసాల పద విభాగం చేస్తే సరసము + పలుకులు సరసపు + పలుకులు సరస పున్ పలుకులు సరసపు(బులుకులు అని ప్రక్రియాదశలు వేర్వేరుగా ఏర్పడతాయి వాటిలో పూర్వ పదం చివర ము వర్ణ వికారమైన పు వర్ణం ఉండి ఉత్తర పదాదిల్తో పరుషాక్షర ముంది వాటి మధ్యలో న్ ఆగమంగా వచ్చి బిందువుగా మారి ఉంది

పై వ్యాఖ్యానంలోని ఈ ముఖ్యాంశాల్ని అహోబలపతి గ్రహించి వాటినే భాషాంతరీకరించాడు ఆ సూత్ర (నుమ్వోతః) వ్యాఖ్యానంలో

సరళే పరుషేచైవ సమాసే నుముతో భవేత్ తనేచ కుత్ర చిదతో వికారా ద్చాపికేచన

సమాసమందు ఉదంత శబ్దానికి పరుషం గాని సరళం గాని పరమైతే నుమ్ ఆగమంగా వస్తుంది తన శబ్దంస్థపరమైనపుడు కొండొకచో అదంత శబ్దానికి గూడ నుమాగమం వస్తుంది పుంప్వాదేశ వికారానికి గూడ నుగాగమం వస్తుంది అని సూత్రాని కర్థం

పై కారికలో పరుషసరళాలు వికారాలు పరమైతే నుమాగమం రావడమనే అంశాన్ని బాలసరస్వతీయ వ్యాఖ్యానం నుండి సంగ్రహించా డనేది స్పష్టమవుతూనే ఉంది మిగిలిన తన శబ్దం పరమైనపుడు నుమ్ రావడమనే అంశాన్ని అహోబలపతి వాసుదేవుని వృత్తినుండి స్వీకరించాడు[1] అక్కడక్కడ అతడు (అహోబలపతి) ఇలా రెండు ఆకరాలను ఒకచోటచేర్చి చెప్పడం కద్దు

8 ఔపవిభక్తికసంజ్ఞా వర్ణాఃంట్యాదయో భవన్తీహ
రుల్వాదేర్నామ్నాం స్యుస్తేహి విభక్తౌ సమాసేచ

పై సూత్రవ్యాఖ్యలో బాలసరస్వతి కొన్ని ముఖ్యమైన వాక్యాలు వ్రాశాడు అక్కడక్కడ ఔపవిభక్తికములు బహుప్రకారములు విభక్తి సమాసముల యందు యథా యోగ్యముగాఁ దెలియునది రుల్వాదులకే కొన్నింటికి రావు ఔపవిభక్తిక వర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు అని

ఆంధ్రవ్యాకరణ వికాసంలో ఈ ఔపవిభక్తికాలకి ప్రత్యేక స్థానముంది ఈ పదంతో ఈ ఉపవిభక్తుల్ని కనిపెట్టి చెప్పడం చింతామణి చేసిన గొప్ప పని కాగా దాని ప్రథమ వ్యాఖ్యాతగా బాలసరస్వతి ఈ ఔపవిభక్తికాలను గూర్చి వ్రాసినమాటల ప్రాముఖ్యం పైయాకరణుడైన అహోబలపతి గ్రహించాడు తెలుగు వ్యాకరణాలకే కొత్తదైన ఈ ఔపవిభక్తిక పరిభాషను విపులంగా వ్యాఖ్యానించడానికి బాలసరస్వతి మాటలే ప్రమాణంగా గ్రహించి వాటినే కొద్దిగా మార్చి సంస్కృతీకరించి అధర్వణాంకితం చేశాడు ఈ సూత్ర వ్యాఖ్యానంలోనే

బహవోఽత్రాంధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికా
ప్రవృత్తిశ్చా ప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్
తద్వివేక ప్రయోగైక శరణ స్సాద్ధిశబ్దతః
యత్రైరితే తత్ర తత్ సంజ్ఞా నామ్నామన్యత్రచాన్యథా

అనే కారికలు పొందుపరిచాడు నిదానించి చూస్తే ఈ కారికలు బాలసరస్వతీయ వాక్యాల భాషాంతరీకరణమే ఔపవిభక్తికములు బహుప్రకారములు—బాల

---

[1] చూ వాసుదేవవృత్తి

సరస్వతి బహువోఽత్రాంధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికా—కారిక విభక్తి సమాస ముల యందు యథాయోగ్యముగా౯ దెలియునది రుల్వాదులకే కొన్నింటికి రావు—బాలసరస్వతి ప్రవృత్తిశ్చ ప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్—కారిక ఔపవిభక్తిక వర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు—బాలసరస్వతి యత్రైతే తత్ర తత్ సంజ్ఞా నామ్నామన్యత్రచాన్యథా—కారిక వీటిలో మొదటి కారికలో పదాలు గూడ బాలసరస్వతివే రెండవదానిలో పదాలు మారినా యథా యోగ్యముగా అనే మాటను ప్రవృత్త్యప్రవృత్తి వికల్ప రూపంగా వ్యాఖ్యానించినట్లు కారికా రచన జరిగింది మూడవ దానిలో భావమూ భాషా బాలసరస్వతివే బాలసరస్వతి ఔపవిభక్తికములు లేనివాటికి పేరుపెట్టలేదు కాబట్టి కారికాకర్తా పెట్టలేదు

4 మహతస్సోర్దు జనితో భవేత్ పుంసి — అజంత 2

పై సూత్ర వ్యాఖ్యానంలో బాలసరస్వతి మహత్తులయినను జడాదులుగా వివక్షించినపుడు గొన్ని యమహత్తులగును అని విశేషాంశ ప్రతిపాదన మొకటి చేసి సముద్రము మేఘము అని ఉదాహరించి అజడములుగా వివక్షించితేని సముద్రుఁడు మేఘుఁడు అని తెలిపాడు ఈ వ్యాఖ్యాన ప్రాముఖ్యం గుర్తించిన అహోబలపతి తన వ్యాఖ్యలో వివక్షాతః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచిద్భవేత్ అనే కారికను కల్పించి ఉదాహరణలుగా అత ఏవ సముద్రుఁడు సముద్రము మేఘుఁడు మేఘము ఇత్యాది రూపం అని ఇచ్చాడు బాలసరస్వతి వ్రాతనే వివక్షా శబ్దంతో సంస్కృతీకరించి ఉదాహరణలు గూడ బాలసరస్వతివే స్వీకరించాడు

5 తదుపరి పునరుమ్బూ ప్రాచామ్ —అజంత 35

పై సూత్ర వ్యాఖ్యానంలో బాలసరస్వతి వనము + ము అని యుండిన మొదటి ము సున్నయై ద్విత్వమాయెను వనమ్ము బు ఉండినట్లే - వనంబు అని రూపమాయెను అని విశేషాంశాన్ని ప్రతిపాదించాడు ఈ విశేషాంశం ప్రాముఖ్యాన్ని గమనించిన అహోబలపతి దాన్ని వెంటనే కారికాబద్ధం చేసి అధర్వణాంకితం చేశాడు ఈ సూత్ర వ్యాఖ్యానంలోనే బౌపరే మస్యబిందుస్స్యాన్మాపరే మేళనం భవేత్ బు పరమైతే మా కి బిందువౌతుంది ము పరమైతే కలయిక (మాముడి) అవుతుంది అని కారికభావం ఇది కేవలం బాలసరస్వతీయానికి భాషాంతరీకరణమని వేరే వ్రాయపనిలేదు

6 గుణవతాం డుమూ ప్రాగ్వత్ — హలంత 6
డుస్స్యాత్ సదారాజ్ఞ — హలంత 8

దేశ్యా దస్యద్యుష్మచ్ఛబ్దాత్ సుజసోర్నుమూ పురూచ స్త -హలంత 4

పై మొదటి సూత్ర వ్యాఖ్యానంలో బాలసరస్వతి ఈ తెనుగు లోక వ్యవహార దృశ్యము గనుక గిర్ శబ్దము వ్యవహారములేదు అనే విశేషాంశం తెలిపాడు

రెండో సూత్ర వ్యాఖ్యానంలో భవచ్ఛబ్దము లేదు అనే వివరణం చేశాడు

మూడో సూత్ర వ్యాఖ్యానంలో యుష్మదస్మచ్ఛబ్ద ములకు దత్సమపు దెలుగు లేదు గనుక దేశ్యాత్ అని దేశ్య తెలుగులే చెప్పుచున్నాడు అనే వివరణం చేశాడు

బాలసరస్వతీయాన్ని ఎక్కువ శ్రద్ధలతో చదువుకున్న అహోబలపతి పై విశేషాంశాల నన్నిటిని క్రోడీకరించి హలంత పరిచ్ఛేదంలో 0వ సూత్ర వ్యాఖ్య తరువాత —

భవద్ గిర్ముఖ శబ్దానామాద్యయోర్యుష్మదస్మదో
భాషాయాం నాత్ర యోగస్స్యాదితిసిద్ధాంత పద్ధతిః

అని గీర్వాణించి అధర్వణ పరంగా ప్రకటించాడు

భవచ్ఛబ్దానికి గిర్ శబ్దం మొదలయిన వాటికి సంస్కృత యుష్మదస్మ చ్ఛబ్దాలకీ ఈ తెలుగులో (ప్ర) యోగం లేదని కారిక భావం

7 ఇదమద సేతద్యత్త చ్ఛబ్దాశ్శబ్దాన్తరాన్వయేబహుళమ్
హ్రస్వం ప్రపద్యదీర్ఘా ద్విత్వముపర్యక్షరస్య జనయన్తి —హలంత 24

పై సూత్ర వ్యాఖ్యలో బాలసరస్వతి బహుళోక్తి వలన ఆ రాజు ఈపేన యను చోటులను రాదు అని విశేషించి వ్రాశాడు ఆ వ్యాఖ్యానాన్ని ఆంధ్రభాషా భూషణంలోని 36వ పద్యాన్ని జోడించి అహోబలపతి ఈ సూత్ర వ్యాఖ్యలోనే సంస్కృతీకరించాడు—అధర్వణకారిక పేరుతో

ఊష్మరేఫాన్ వినాద్విత్వమయుక్తస్య హలోమతమ్

శ ష స హ అనే అక్షరాల్నీ రేఫను మినహాయించి సంయుక్తం గాని హల్లుకి ద్విత్వం వస్తుందని కారిక భావం బాలసరస్వతి ఉదాహరణలే అహో బలపతి గూడ ఆరాజు అపేన ఇత్యాది అని ఇవ్వడం పై అంశాన్ని గట్టిపరుస్తుంది

పై పరిశీలనంతో అధర్వణకారికలకు నిజమైన కర్త అధర్వణుడు గాక బాలసరస్వతీయ వ్యాఖ్యానం చదివి జీర్ణించుకున్న అహోబలపతే అని గమనించ గలిగాం అతడు తనకు పూర్వులు వ్రాసిన దేశీయ వ్యాకరణాధ్యయనం గూడ క్షుణ్ణంగా చేసి వాటిలోని నిగ్గు సంస్కృతంలోకి మార్చడమే కాకుండ చింతామణి మీద తనకు పూర్వం తెలుగులో సంస్కృతంలో వెలువడిన వివిధ వ్యాఖ్యానాలు శ్రద్ధగా అధ్యయనం చేసి వాటిలోని ప్రధానాంశాలు గూడ భాషాంతరీకరించాడు ప్రస్తుతం అతనికి పూర్వం వెలసిన వాసుదేవవృత్తిలో గూడ అతని ఈ కారికలకు మూలపారాలు ఎవైనా ఉన్నాయేమో పరిశీలిద్దాం మంచెళ్ల వాసుదేవుడు చింతామణికి అప్పకవి తర్వాత ఒక వృత్తిని సంస్కృతంలో వ్రాసినట్లు మనం పూర్వ ప్రకరణంలో గమనించి ఉన్నాం అతని వ్రాతలో గూడ ముఖ్యాంశాలేవైనా ఉంటే అహోబలపతి వాటినిగూడ ఛందస్సులో బిగించి అధర్వణాంకితం చేసి ఉండవచ్చు

## వాసుదేవ వృత్తిలో కారికల మూలపారాలు

నిత్య మనుత్తమ పురుషక్రియాస్విత —సంధి 4

అనే సూత్ర వ్యాఖ్యలో క్వచిత్ ప్రథమ పురుష బహువచనేపివై కల్పికః అని వాసుదేవుడు చింతామణి సూత్రానికి ఒక సవరణ ప్రతిపాదించాడు ఇది ముఖ్యమైన ప్రతిపాదనమే దీనివల్లనే అప్పకవి కూర్చుండిరి యొందొరుం గదిసి అనే శ్రీనాథుని కవితలో పట్టిన తప్పు ఒప్పుగా మారుతుంది (చూ అప్పకవీయం-6 - 64) కాబట్టి అహోబలపతి దీన్ని సంగ్రహించి ప్రథమేచోత్తమేచైవ క్రియేతో వాతవేచ్ఛ్వతిః - (సంధి 4 సూత్ర వ్యాఖ్య) అని ఛందోబద్ధం చేసి అప్పకవి తప్పన్నదాన్ని ఒప్పుగా తీర్పు చేప్పాడు ప్రథమ ఉత్తమ పురుషక్రియల ఇత్వానికి వికల్పంగా సంధి

అవుతుందని కారికార్థం ప్రథమపురుష వంటిదే ఉత్తమ పురుష (కూర్చుండిరి— కూర్చుంటిమి) గాబట్టి దాన్ని గూడ జోడించాడు తన కారికలో

2 పరిమితౌ సమస్తానాం సంధి 5

అనే సూత్ర వ్యాఖ్యలో ఏదుస్స్యాత్ పరిమాణకమ్ అనే మంచి వివరణం చేశాడు వాసుదేవుడు దాని ప్రాముఖ్యాన్ని గుణగ్రాహి అహోబలపతి గ్రహించి వెంటనే దాన్ని మానార్థాన్నిత్యమేకత్వే ఎదుస్స్యాత్ పరిమాణకే (సంధి 5 సూత్ర వ్యాఖ్య) అని ఛందోబద్ధం చేసి అధర్వణాంకితం చేశాడు

3 నుమ్యోత్తః — సంధి 3

అనే సూత్ర వ్యాఖ్యలో అందు కూర్చి పట్టి విభక్తి తనేమచ అని వార్తికం వ్రాసి తరువాత తత్రి సరళ పరుష వర్ణేష్వేవ అని వివరణం చేశాడు వాసుదేవుడు ఈ వ్యాఖ్యా ప్రాముఖ్యాన్ని గమనించిన అహోబలపతి దీన్ని అధర్వణుని పేర —

సరళే పరుషేచైవ సమాసే నుముతో భవేత్
అద్రుతాత్ సరసాదందు పట్టి కూర్చి విభక్తిషు

తనేచ కుత్రచిద్ అని ఛందోబద్ధం చేశాడు వాసుదెవుని వృత్తిలోని విషయమంతా కారికలో నిబంధితమైందని వేరే వ్రాయపనిలేదు

4 దారార్తేత ఉదపిరః — సంధి 34

దీని వృత్తిలో వాసుదేవుడు క్వచిదుకారేఽద్ధే రేఫకార్యమేవ అనే విశేషాంశ ప్రతిపాదనం చేశాడు అహోబలపతి ఆ అంశాన్ని క్రింది కారికగా మార్చివేశాడు

అజ్ఝలో రాలుశబ్దేన సమానార్థకతా యది

సమాసే తత్రచోద్రః స్యాద్రేఫ ఎవక్వచిద్భవేత్ -హలంత 0సూత్ర వ్యాఖ్య అచ్చు హల్లులకు ఆలు శబ్దంతో సమాసమేర్పడేటపుడు ఉత్తు రేఫము వస్తాయి కొండొకచో రేఫ మాత్రమే వస్తుంది అని కారికార్థం ఉకారంశబ్ద సిద్ధంగానేఉంటే రేఫ మాత్రమే వస్తుందనే విశేషాంశాన్ని వాసుదేవుని నుండి అహోబలపతి గ్రహిం చినట్లు తెలుస్తుంది గదా

5 మోస్తు విభక్త్యే కవచనకే పుంపూ —సంధి 35

పై సూత్ర వృత్తిలో వాసుదేవుడు బహువచనేఽ మోరేవ స్థావిత్వం అని సూత్ర పరిధిని విస్తృతపరిచే మాట వ్రాశాడు దానివలన ఏకవచన ప్రత్యయమైన ము స్థానంలోనే కాక బహువచనాగమమైన ము స్థానంలో గూడ పుంపు లు రావడానికి వీలవుతుంది ఆ విషయాన్ని అహోబలపతి—

సామానాధికరణ్యేతు బహుత్వార్థే పరేఽపిచ

ముబ్వోర్భవేతాం పుంప్వాఖ్యావా దేశావ తసర్వదా (సంధి 35సూత్రవ్యాఖ్య) అని విస్తృతపరచి ఛందోబద్ధం చేశాడు సామానాధికరణ్యంలో (కర్మధారయ సమాసంలో) బహువచనం పరమైనా ము బు లకు పుంపు లౌతాయని కారికార్థం భావం మాత్రం కేవలం వాసుదేవునిదే ఉదాహరణ గూడ వాసుదేవునిది – సరసపు పలుకులు అహోబలపతి స్వీకరించాడు

6 వాఽత —సంధి 2

దీని వ్యాఖ్యలో వాసుదేవుడు క్వచిన్నిత్యం అనే వృత్తిని వ్రాసి చంద మామల్లుడు ఆవంత వంటలక్క అని ఉదాహరించాడు అహోబలపతి ఆ వృత్తినే దీర్ఘీకరించి భవన్తి కేచిచ్ఛబ్దాస్తు సాంగత్యేనైవ సాధవః (సంధి 2సూత్రవ్యాఖ్య) అని ఛందోబద్ధం చేసి అధర్వణాంకితం చేశాడు కొన్నిశబ్దాలు నిత్య సంధివల్లనే సాధువులు అని కారికార్థం ఉదాహరణలు గూడ వాసుదేవునివే ఒక్కటీ విడవ కుండా స్వీకరించాడు అహోబలపతి

6 డుజ్ మహత్పదానాంవా —అజంత 44

దీని వ్యాఖ్యలో వాసుదేవుడు సమాసాంతేతు భృతగుఁడు అనే విశే షాంశం వ్రాశాడు గో శబ్దం సమాసంలో ఉన్నపుడు దానిమీద వు ప్రత్యయం గాక డు మాత్రమే వస్తుందని అతని మాటకు భావం ఉదాహారణ గూడ

ఆ భావాన్నే వ్యక్తం చేస్తుంది అహోబలపతి ఈ విషయాన్నే విపులంగా స్పష్టంగా

భిన్నత్వే చాప్యభిన్నత్వే నదుజోద న్తతో భవేత్
సమాసా న్త విధానేతు తత్ప్రయోగో హితో భవేత్

(అజంత 44 సూత్రవ్యాఖ్య)

అని ఛందోబద్ధం చేశాడు సమాసంలో గాని వ్యస్తంగా గాని ఓదంత శబ్దాలకి డుజ్ రాదు సమాసాంత కార్యం విహితమైనపుడు వస్తుంది అని కారి కార్థం వాసుదేవుని వృత్తికి వ్యాఖ్యాప్రాయమైన కారిక

8 సవిధవర్తినా మిందు —అజంత 27

పై సూత్ర వృత్తిలో వాసుదేవుడు అందు గ్రహణస్య సాశ్రయస్యాపి అని వ్రాసి దాని వివరణం నిరాశ్రయత్వమస్తీత్యధికరణ లక్షణార్థాభిధాయకస్య నిరాశ్రయస్యాప్యత్రేత్యవ్యయ పర్యాయస్యేన్దోర్గ్రహణం అని చేశాడు ఆ వ్రాతనే అహోబలపతి సాశ్రయానాశ్రయాఽపి స్యాత్ తత్రార్థగత సప్తమీ (అజంత 27 సూత్ర వ్యాఖ్య) అని ఛందోబద్ధం చేశాడు తత్రార్థ గత సప్తమి (అందు) సాశ్రయం గాను అనాశ్రయంగాను (ప్రత్యయంగాను అప్రత్యయంగాను —స్వతంత్ర పదం గాను) ఉంటుందని కారికార్థం సాశ్రయ నిరాశ్రయ శబ్దాలు వాసుదేవునివే అహోబలపతి స్వీకరించి ప్రయోగించాడు

9 ఎదన్తతాచనామ్నామన్యతరస్యామియాంతానామ్ —అజంత 8

దీని వృత్తిలో వాసుదేవుడు క్వచిద్యాత్ ప్రాగచోలోప అనే విశేషాంశ ప్రతిపాదనం చేసి ఉదాహరణగా ముత్యము కన్య పర్యాచకము అని ఇచ్చాడు సూత్రం ముత్తియము - ముత్తెము కావడాన్నిచెబుతుంటే వృత్తి ఆ రూపమే ముత్యము గా గూడ ఉండవచ్చునని తెలుపుతుంది అహోబలపతి ఈ అంశాన్ని కారికగా —

ఇయాంతత్వే కుత్రచిత్ స్యాదేత్వ యశ్చాపి తద్భవే
లఘుః సోఽపిచ సంయుక్త ఇతి కేషాంచిదీరణా

అని నిబంధించాడు తద్భవాల్లో కొన్ని ఇయాంత శబ్దాలకు ) ఎత్వం 2) లఘువూ సంయుక్తమూ అయిన యకారం వస్తాయని కొందరంటారని కారికార్థం సంయుక్త యకార మంటే ముత్యము వంటి రూపమే అహోబలపతి తరువాత కన్య (కన్నియ) శబ్దాన్ని గూడ ఉదాహరించాడు ఈ సందర్భంలోనే వాసుదేవుడు చకారాత్ పదమధ్యేఽ – పరియాచకము – పరేచకము అని వ్యాఖ్య చేస్తే అహోబలపతి దాన్ని గూడ స్వీకరించాడు తన వ్యాఖ్యలో

0 ఆత్మన ఇమనంతానాం డావా – హలంత 7

పై సూత్రవృత్తిలో వాసుదేవుడు క్వచిన్నిత్యం అని సూత్రానికి నవరణ ప్రతిపాదించి బ్రహ్మ అని ఉదాహరించాడు – పుంస్యేవ అని ఆ రూపం పుంలింగ శబ్దానికే అని గూడ వివరించాడు ఈ అంశాల నన్నింటిని అహోబలపతి-

పుం బ్రహ్మణో వేధసశ్చ హ్రస్వత్వేనైవ సంస్థితి – (హలంత 0 సూత్రవ్యాఖ్య) అనే కారికలో నిబంధించాడు పుంలింగంలోని బ్రహ్మన్ వేధస్ శబ్దాలు హ్రస్వంతోనే ఉంటాయని కారికార్థం బ్రహ్మన్ శబ్దానికి వేధశ్శబ్దాన్ని జోడించడం అహోబలపతి స్వయంగా చేశాడు

సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయోభవతి - హలంత 48

పై సూత్ర వృత్తిలో వాసుదేవుడు స్వల్పత్వంచ షడ్వర్ణ పరిమిత మితినియమ అని నూతన ప్రతిపాదనం చేశాడు బాలసరస్వతి ఈ సూత్ర వ్యాఖ్యలో పరిమిత శబ్దానికి స్వల్పము అని అర్థం వ్రాశాడు అతని ఆ అర్థాన్ని వాసుదేవుడు గ్రహించి దానికి షడ్వర్ణ పరిమితి నిర్ణయించాడు ఈ అంశాన్ని అహోబలపతి —

ఆంధ్రం షడ్వర్ణ పర్యన్తం పదంస్యాత్ కర్మధారయే - (హలంత 48 సూత్రవ్యాఖ్య) అని కారికగా నిబంధించాడు తెలుగు పదం కర్మధారయ సమాసంలో ఆరక్షరాల పరిమితి గలిగినదే అవుతుంద ని కారికార్థం

12 రంజతి ఘట్యాదీనాం బిన్దోశ్చస్యాపి లావుభౌభవత – క్రియా 39

పై సూత్ర వృత్తిలో వాసుదేవుడు క్వచిత్ సకర్మకత్వం - ప్రణమిల్లె నతనికి క్వచిదుభయమపి - చింతించె చింతిల్లె అని నూతనాంశాల్ని ప్రతి పాదించాడు వాటిని అహోబలపతి —

అకర్మణస్సకర్మత్వ మకర్మత్వం సకర్మణః తద్వత్తా క్వచిదైక్యం స్యాచ్ఛబ్దశక్తిర్హి తాదృశీ -(క్రియా 39 సూత్రవ్యాఖ్య) అని కారికగా నిబంధించాడు అకర్మకాలు సకర్మకాలు కావడం సకర్మకాలు అకర్మకాలు కావడం ఉంది కొన్నిచోట్ల ఆ స్థితికైక్యం ఉంది అని కారికార్థం అహోబలపతి ఉదాహరణలు కూడ వాసుదేవునివే కావడం విశేషం

పై పరిశీలనం వలన అధర్వణకారికలుగా అహోబలపతి లోకానికి పరిచయం చేసిన కారికలలో చాలభాగం అతనికి పూర్వుల లక్షణాల రూపాంతరాలని తెలిసికో గలిగాం వాసుదేవుడు తన వృత్తిలో సంస్కృతంలోనే వచనంలో ప్రతిపాదించిన నూతనాంశా లనేకం అహోబలపతి ఛందోబద్ధం చేసి అధర్వణాంకితం చేశాడని గూడ గ్రహించగలిగాం

ఇక వాసుదేవవృత్తి తరువాత వెలువడిన అప్పకవీయ వ్యాఖ్యానంలో అతడు సృష్టించిన కారికల మూలపాఠాలు ఎన్ని ఉన్నాయో గమనిద్దాం

### అప్పకవీయంలో అధర్వణ కారికల మూలపాఠాలు -

హల్విస్యాత్ పూర్ణోపి భవేత్ దీర్ఘాచ్చేత్ ఖండఏవ సజ్ఞేయ – అప్ప చిం వర్ణ 4

పై సూత్ర వ్యాఖ్యలో అప్పకవి తన పరిశోధన ఫలితంగా ఒక నూతనాంశం బయటపెట్టాడు

హల్లులను బంచవర్గంబులందు మొదలివర్ణములకును మూడవ వర్ణములకుఁ
దక్క నితరాక్షరములకు దాపలికడ నాంధ్రపద మధ్యమునఁబుట్టదయ్యెబొట్టు
(అప్ప 2–3 )

కచటతప గజడదబ అనే వర్ణాలకు ముందుతప్ప తెలుగు పదాల్లో ఇతర హల్లులకు ముందు బిందువుండదని తాత్పర్యం ఇది ఎంతో వాఙ్మయపరిశీలనం వలన గాని తేల్చి చెప్పలేని సూత్రం దీని ప్రాముఖ్యాన్ని గమనించిన అహోబలపతి వెంటనే దీన్ని శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి బాలవ్యాకరణ సూత్రాన్ని సంస్కృతీకరించినట్లు కొంత అలసతతో సంస్కృతీకరించాడు

> తృతీయే ప్రథమే వర్ణే పరఏవ హిదృశ్యతే బిందుర్వైకృత మధ్యేఽత్ర
> నాన్యవర్ణేపరే తు సః (సంజ్ఞ 8 సూత్రవ్యాఖ్య)

వైకృత పదాల మధ్యలో సున్న మూడో మొదటి వర్ణం పరమైనపుడు మాత్రం కనబడుతుంది ఇతర వర్ణాలు పరమైతే లేదు అని కారిక భావం కాని అహోబలపతి వ్యాఖ్య ఉదాహరణ లేకపోతే ఈ కారిక అసందర్భప్రలాపం లాగ ఉంటుంది మూడో వర్ణం మొదటి వర్ణం ఏమిటి? అ ఆ ఇ ఈ అనే వర్ణాలతో మన అక్షర సమామ్నాయం ఆరంభించబడుతుంది మొదటి మూడో వర్ణాలంటే అ ఇ ఉ కావాలి అవి పరమైతే బిందువులు కనుపించడం లేకపోతే కనిపించకపోవడం ప్రయోగవిరుద్ధమైన సంగతి గదా ఇదే భాషాంతరీకరణంలో అహోబలపతి వహించిన అలసత

మొదటిసారిగా కారికను చదివితే అర్థసందర్భాలే ఏర్పడటంలేదు అప్పకవి పద్యం దానికి మూలమూ స్వయంకృతమూ కాబట్టి అది చదివితే అర్థ తాత్పర్యాలు వెంటనే తెలుస్తున్నాయి ఈ నిదర్శనంతోనే ఈ కారికలు అధర్వణునివి కావడం గూడ అబద్ధమని నిర్ణయమైపోతుంది

పై సూత్ర వ్యాఖ్యలోనే అప్పకవి మరొక నూతనాంశం గూడ ప్రతిపాదించాడు

2 సగము జాబిల్లివలె వ్రాయ సగము సున్న నిండుజాబిల్లివలె వ్రాయ నిండుసున్న
యయ్యెడ సీభేదము లెఱింగి యాంధ్రకృతుల వ్రాయఁదగు బిందువులు
పొందవేయ పక్ష అప్ప 2 - 33

అరసున్న అర్ధచంద్రాకారంతో నిండుసున్న పూర్ణచంద్రాకారంతో వ్రాయాలని పద్యభావం[1]

అప్పకవి ప్రతిపాదనలోని కొత్తదనాన్ని గమనించి కాబోలు అహోబలపతి దాన్నిగూడ కవిసంకాల విపర్యయాన్ని గూడ (అధర్వణుని కాలం) గుర్తించకుండా సంస్కృతీకరించి అధర్వణాంకితం చేశాడు

పూర్ణేన్దు సదృశః పూర్ణస్స్వరస్త్వర్ధేన్దుసన్నిభః —(సంజ్ఞ 43 సూత్రవ్యాఖ్య) నిండు జాబిల్లి వంటిది నిండుసున్న అనీ సగము జాబిల్లి వంటిది అరసున్న అనీ కారికభావం

అప్పకవి నాటి లేఖనంలో గూడ లేని ఈ పద్ధతి అప్పకవీయంలో ఉండటం విచిత్రమే ఒకవేళ అప్పకవికి తరువాత ఇతరు లెవరైనా ప్రక్షేపించారు—అ నిర్వచనాన్ని అనుకుంటే ఆ ప్రక్షేపం అహోబలపతి నాటికే ఉన్నదని నిర్ణయించు కోవాలి లేకుంటే అహోబలపతి దాన్ని సంస్కృతీకరించడం జరగదు[2]

దరశార్ఙ్గ పిప్పలదళాంకుశ పన్నగ సన్నిభా క్రమాత్ పరుషా

స్తంభవిరేఖాధిక్యై స్తఏవ వర్గద్వితీయవర్ణాద్యాః (అప్ప చిం వర్ణ 5)

ఇది అప్పకవీయ చింతామణిలో మాత్రం కనిపించే లిప్యుద్ధరణను తెలిపే సూత్రం దీన్ని వ్యాఖ్యానిస్తూ అప్పకవి సూత్రాన్ని మించి కొంత కొత్త వివరణం చేశాడు

---

తాళపత్ర గ్రంథాల్లో నేటికీ కనబడేవాటిలో సున్నాల వ్రాత అప్పకవి కథనానికి భిన్నంగా ఉంది సున్నలు రెండూ నిండుగానే వ్రాస్తూ నిండుసున్న దగ్గర పరవర్ణాన్ని ద్విత్వయుక్తంగా వ్రాయడం వ్రాయసకాంధ్ర అలవాటు కాబట్టే అనంతాదులు సున్నల్ని తేల వ్రాయడం ఊది వ్రాయడం అని పేర్కొన్నారు (ఛందోదర్ప — 5 52) కాగా అప్పకవి దీనిని ఒక నూతన ప్రతిపాదనగా లిప్యుద్ధారక క్రమాన్ని ఒసగినవాడు కాబట్టి చేస్తే తప్పు లేదుగాని లేకపోతే అతని నిర్వచనం ప్రయోగవిరుద్ధమౌతుంది

2 ఈ అభిప్రాయం శ్రీ దొణప్ప గారు వెలువరించింది

3 శంఖశార్ఙ్గ ద్విపాశన దళాంకుశ వన్నగాకృతులను మీఁద నడ్డరేఖ
వలపల నొక్కటి నిలువంగఁ బరుషంబులై దును వరుసఁజెన్నారుచుండుఁ
గ్రిందఁగంబమువోల్కి గీఁటొక్కటిడిన నాద్యములు రెండవలివులై
పొనంగుఁ
బై నున్న గీఁటు లిబ్బడి సేయఁబ్రథమాక్షరంబులు సరళవర్ణంబులగును
గంబమొక్కటి రేఖాయుగంబుక్రింద వ్రాసినఁదృతీయమును జతుర్థంబు
నగును
నిలువుగీటులు రెండునుంగలిసి తమ్మఁగదియఁదొల్లింటి వనునాసికంబు
లగును (అప్ప 2–35)

సూత్రంలో వర్గద్వితీయాక్షరాల లేఖనవరకే చెప్పబడి ఉంది తృతీయ చతుర్థ పంచమాక్షరాల లేఖన క్రమం చెప్పబడలేదు దాన్ని అప్పకవి స్వయంగా కల్పించి చెప్పాడు పై పద్యపాదాల్లో అప్పకవీయాన్ని శ్రద్ధగా చదివిన అహోబలపతి ఆ కొత్తవిషయాన్ని పాత విషయంతో కలిపి మొత్తం అప్పకవీయ పద్యాన్ని సంస్కృతంలోనికి మార్చాడు అధర్వణకారికలని లోకానికి చూపాడు

పంచవర్గాదయోవర్ణా శ్శంఖ శార్ఙ్గాది సన్నిభాః
తిర్యగ్రేఖా యుజశ్చోర్ధ్వం దండరేఖాన్వితా అథ
త ఏవచ ద్వితీయాస్స్యు రూర్ధ్వరేఖా ద్వికాన్వితాః
ప్రథమాస్తు ద్వితీయాస్స్యు తృతీయాస్తే చతుర్థకాః
రేఖాద్వయోర్ధో దండేన యుక్తాస్స్యు రనునాసికాః
మిళద్దండద్వయోపేతాః ప్రథమా లిపయ స్మృతాః (సంజ్ఞా 43సూత్రవ్యాఖ్య)

అప్పకవీయ పద్యానికి భాషాంతరీకరణమే ఈ కారికలని వేరే నిర్ణయించ పనిలేదు పద్యంలోని శంఖశార్ఙ్గశబ్దాలు యథాతథంగానే శ్లోకాల్లో చేరితే అడ్డరేఖ వంటివి తిర్యగ్రేఖ వంటివిగా గీర్వాణీంపబడ్డాయి మిగిలిన భాగాలన్నీ మక్కికి మక్కిగా అనువదింపబడి ఉన్నాయి

అధర్వణకారికల్నే అప్పకవి లేక ఇతరులు తెలిగించి ఉండకూడదా? అనే వాదం ఈ గ్రంథంలో అనేక స్థలాల్లో అనేక విధాల ఖండితమై ఉంది గాబట్టి ఇక్కడ వదిలేద్దాం

వికృతిపదాదౌ ప్రథమాంతస్థ తృతీయానునాసికౌన స్త అప్ప చిం వర్ణ 8

పై సూత్ర వ్యాఖ్యలో అప్పకవి తనకు తెలిసిన నూతనాంశ మొకటి తన సహజ ధోరణిలో చొప్పించాడు

4 అద్రువ విద్రువ సమక్రియాపదంబులయందుఁ దగిలి వట్రుసుడులపగిదినుండు
వ్రాలు తేలఁబల్కఁగ్రారకొమ్ములుగాని వట్రుసుడులుగావు వనజనాథ"
(అప్ప 2 - 7)

ఈ విషయప్రాముఖ్యం ఇతని ముందు లాక్షణికుడు అనంతుడే గమనించి దానితో ఒక ప్రాసభేదాన్ని సమలఘుప్రాస నామంతో సృష్టించాడు (ఛందోదర్ప — 49) అదుర్వ విదుర్వ వంటి రూపాల్లో దకారానికి రేఫతో కలయిక ఉన్నా, తత్పూర్వాక్షరం గురువు కాదు వైయాకరణుని దృష్టితో ఈ అంశప్రాముఖ్యాన్ని గుర్తించిన అహోబలపతి తన వ్యాఖ్యలో దీన్ని కారికగా సంస్కృతీకరించాడు -

పదేఽపిచ తథాత్వంస్యాత్ — సంజ్ఞా 8 సూత్ర వ్యాఖ్య

పద్యభావానువాదాన్ని మాత్రమే విడిగా చూపాను పదంలో గూడ అట్టిస్థితి ఉంటుందని మాత్రమే పై కారిక భావం అట్టిస్థితి అంటే రేఫతో కలిసినా తత్పూర్వాక్షరం గురువు కాకపోవడ మనిఅర్థం అహోబలపతి దేశీయవ్యాకరణాల్ని అంటే కేతనాదుల త్రోవలో నిర్మించబడిన వాటిని గూడ సరిగా చదివి విషయ గ్రహణం చేసినవాడు కాబట్టే అనంతుని ఛందోదర్పణంలో ( — 68) చెప్పబడ్డ విషయాన్ని గూడ భంగ్యంతరంగా సంస్కృతంలోకి మార్చి పై కారిక ముందు కారికలుగా ప్రదర్శించాడు1

---

సంయుక్తే సంస్కృతాద్యేస్యాత్సర్వమాంధ్రపదం లఘు భవేదాద్య సమాసేఽపి రేఫయోగాత్పదం తథా పద్యేపిచ తథాత్వంస్యాత్క్వచిన్నైవన రేఫయో

పై సూత్ర వ్యాఖ్యానంలోనే అప్పకవి మరొక నూతనాంశాన్ని వివరించాడు

5 పూనె నెగసెఁబొదవెఁబొనరెఁబొందె నటన్న పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబులడఁగి వానిపై స్వరములు నిలుచు వలసినపుడు నీరజాక్ష (అప్ప 2-75)

పూనె నెగసె పొదవె పొనరె పొందె—అనే పదాలు ఊనె ఎగసె ఒదవె ఒనరె ఒందె అని హల్లులు లేకుండా కూడ వ్యవహరింపబడతాయని పద్య భావం దాన్ని అహోబలపతి ఇలా భాషాంతరీకరించాడు

క్వచిదంత్యస్య చాన్యస్య లోపో దీర్ఘశ్చ కుత్రచిత్ (అజంత 85 సూత్ర వ్యాఖ్య)

కొన్నిచోట్ల అంత్యాక్షరానికి గాని ఇతరాక్షరాలకి గాని లోపం వస్తుంది దీర్ఘం గూడ వస్తుంది అని కారిక భావం ఈ కారికను ఇలా చూస్తే అర్థసందర్భాలు బొత్తిగా తెలియవు కాని దీనికి అహోబలపతి ఒసగిన ఉదాహరణల్నిబట్టి దీని అర్థసందర్భాలు తెలుస్తున్నాయి పూనె నెగసె పొదవె పొనరె పొందె నిత్యత్ర ఆ ద్యస్యహల్మాత్రస్యలోపే ఊనె నిత్యాది రూపాణి కవిప్రయోగ సిద్ధాని ఈ వివరణం చూస్తేగాని మనకి అప్పకవీయాన్ని అహోబలపతి సంస్కృతీకరించాడనే అంశం స్ఫురించదు

వాస్యాత్ క్వచిద్వకారో నాదిగతస్యాద్యవర్గ సరళస్య —అప్ప చిం వర్ణ

పై సూత్రి వ్యాఖ్యానంలో అప్పకవి సూత్రిస్థమే అయిన అంశాన్ని క్రింది విధంగా విశదపరిచాడు

6 తీగియలుక్తీవియలు వయిఁదిగిచెఁదివిచె ననుచు సిబ్బంగి నొకవేళ నాదివర్ణ
ములకుఁ దక్కఁగఁ గొన్నిమాటలను గృతులఁ బ్రథమ సరళంబులకు
వకారములు వచ్చు (అప్ప 2- 2)

సూత్రిం అపవాద్యమైన గకారానికి వకారాన్ని విధిస్తున్నది అప్పకవి పద్యంలోనూ అదే ఉంది అయితే అహోబలపతి బాలసరస్వతీయ చింతామణిని

తీసికొని వ్యాఖ్య సాగించాడు కాబట్టి దానిలో సూత్రం క్వచిద్గకారోవః అనేది ఆ సూత్రం ప్రకారం గకారం పదాదిని ఉంటే వకారం గాదు అనే అర్థం రాదు, కాబట్టి అప్పకవీయ పద్యభాగాన్ని సంస్కృతంలోనికి మార్చి ఆద్యగస్య గకారస్య వకారస్తు నదృశ్యతే (అజంత 67 సూత్ర వ్యాఖ్య) అనే కారికను సృష్టించాడు

అద్ద స్యస్తాలవ్యశ్చర్వర్గ్రస్యాన్మిథస్సవర్ణశ్చ – (అప్ప చిం వర్ణ 2) పై సూత్రవ్యాఖ్యలో అప్పకవి —

7 ప్రాకృత మునందుఁదద్భవ పదమునందు ద న్త్యములెకాని తాలుజాతములు లేవు - (అప్ప 2 - 22)

అనే విశేషాంశ ప్రతిపాదనం చేశాడు దాన్ని అహోబలపతి ప్రాకృతే తద్భవేచాపి చజౌ దంతభవౌస్మృతౌ అని సంస్కృతీకరించాడు ప్రాకృతంలోను తద్భవములోను చజ లు దంత్యాలే అవుతాయని కారిక భావం (సంజ్ఞా సూత్రవ్యాఖ్య)

పై సూత్ర వ్యాఖ్యానమె సుదీర్ఘంగా సాగిస్తూ అప్పకవి —

8 పోడిమియు నురవడియును నాఁడెమునను బలుకులఁ దృతీయ సరళముల్ వలసినపుడు
భువి స్వకీయానునాసికంబులును గాఁగఁ బలుకఁబడు నాదికవుల కబ్బముల కలిమి (అప్ప 2 - 61)

అన్న విశేషాంశాన్ని ప్రతిపాదించాడు పోడిమి ఉరవడి వంటి శబ్దాలు పోణిమి ఉరవణి వంటివిగా మారడాన్ని నిర్దేశించింది అప్పకవి పద్యం అందులోనే తవర్గాక్షరభేదాలంటూ అప్పకవి మరొక నూతనాంశాన్ని ప్రతిపాదించాడు

వెతకి వాని కతికెఁ జతికిలఁబడి యావుఁబితుక చీరలుతికె నుసుచు
బలుకుచోఁదకారములు దకారములును వలసెనేని నిలుపవచ్చుఁగృతుల
(అప్ప 2– 67)

-

వెతకు కతుకు వంటివి వెదకు గదుకు వంటివిగా మారడాన్ని సూత్రిస్తున్నది అప్పకవి పద్యం దానిలోనే మరో నూతనాంశం

దాక దగ్గఱ డిగ్గియ దాయ దోయ, దాపలను దిగ్గుమను పైకృతములమొదల
డాక డగ్గఱ డిగ్గియ డాయ డోయ డాపలను డిగ్గుమని దాకడగి నిలుచు
(అప్ప 2— 49)

అనే పద్యంలో ప్రతిపాదించాడు

పైమూడు నూతనాంశాల్ని అహోబలపతి స్వీకరించి—

క్వచిత్తోద క్వచిద్డోణో దృష్టోడుస్తు క్వచిత్ప్రిత
(అజంత 85 సూత్ర వ్యాఖ్య)

అని సంస్కృతీకరించాడు కొన్నిచోట్ల తకారం దకారమౌతుంది కొన్ని చోట్ల దకారం ఐకారమౌతుంది కొన్నిచోట్ల దా స్థానంలో డా కనిపించింది అవి కారిక భావం వెదకెన్ గదికెన్ చదికిలబడియెన్ పిదికెన్ ఉదికెన్ ఇత్యాదౌ వెతకె నిత్యాదీని తకారేణాపి రూపాణి పోడిమి ఉరువడి నాడెము ఇత్యత్ర పోణిమి ఇత్యాది రూపాణి ఐకారే ణాపి సిద్ధాని అనే అహోబలపతి ఉదాహరణల్ని గూడ చూసిన తరువాత కేవలం అప్పకవీయానువాదమే పైకారిక అని అనడంలో ఎవరికీ సందేహముండదు గదా ఉదాహరణలు గూడ అప్పకవివే

యచ్ఛ్రుతి మార్యాలఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్
(అప్ప చిం వర్ణ 5)

పై సూత్ర వ్యాఖ్యలో అప్పకవి రేఫాక్షరసీసమాలిక ఒకదాన్ని అల్లాడు అందులో—

రా దక్క సకలాక్షరముల మీఁదను కార కదియ నకారశకారములన
నట రవర్ణమున కొక్కటికిని బై నిఫ యని నిల్పుటను రేఫమనఁగఁబరఁగె
(అప్ప 2— 98)

అని వర్ణనిర్దేశంలో కార ఇఫ ప్రత్యయాల ప్రయోగాన్ని తెలిపాడు అప్ప

కవీయ విశేషాంశాల సంస్కృతీకరణకు అలవాటుపడ్డ అహోబలపతి దాన్ని గూడ భాషాంతరీకరించి అధర్వణాంకితం చేశాడు

దీర్ఘస్స్యాద్వర్ణనిర్దేశే ప్రత్య యేఽన్యత్రచక్వచిత్
కేషాంచిత్ ప్రత్యయేనైవ తత్ప్రయోగస్తు సమ్మతః
(అజంత 85 సూత్రవ్యాఖ్య)

అప్పకవి రేఫను రా అని చెప్పడంతో వర్ణనిర్దేశంలో దీర్ఘప్రయోగం చేశాడు తరువాత కార ఇఫ ప్రత్యయాల ప్రయోగం చూపాడు కారిక ఆ విష యాల్నే చెబుతున్నది

పై పీనమాలిక చివర అప్పకవి—

0 కులచలమీఁదిరేఫ అకారములు రెండును అయిన వానికి లక్ష్యములు
(అప్ప 2_9 పుట)

అంటూ తొరఁగుట కు తొలఁగుట క్కూడ నృసింహపురాణం నుండే (ఆశ్వా 1–54) (ఆశ్వా 2—69) ఉదాహరణ లిచ్చాడు ఈ అంశాన్ని అహో బలపతి—

లఘుర్భవేత్ గురుః కుత్రచిద్గురుశ్చ లఘు స్తథా
ఉచ్చారణస్య కల్ప్యత్వాన్నిదానం తత్ర సద్వచః (సంజ్ఞా 9 సూత్రవ్యాఖ్య)

అనే కారికగా మార్చిచెప్పాడు ఇక్కడ గూడ కేవలం అప్పకవి ఒసగిన ఉదాహరణల్నే ప్రదర్శించడం జరిగింది దీన్నిబట్టి అహోబలపతి ఏ క్రమాలేకుండా కారికల సృష్టి సాగించాడని తెలిసికోవచ్చు అతడిచ్చిన కారికలు ఇతరులు చేసిన లక్షణాల సంస్కృతీకరణమే ఇక ఉదాహరణలు గూడ ఇతరులవే అని ముద్దరాజు రామన్న కవిజన సంజీవని నుండిగూడ గ్రహించగలిగాం అయినపుడు కేవలం భాషాంతరీకరణమే అహోబలపతి చేసినపని

పై రేఫ అకారాల విషయాన్నే విపులీకరిస్తూ అప్పకవి—

చెల్లునని ముందు భీమన చెప్పననుచు గలుపుదురు రేఫములును
అకారములును
దుష్టకవులవి యొకటైనఁదొంటి పెద్దలందఱును నేల విభజింతురని తెలియరు
తొలుతటివారలు వాడని తెలుగుల పలుకులనుగల ద్వితీయాంతస్థం
బులు గూర్పరు తద్భేదంబులు దెలియమి బుధులు ప్రాసములకుయతులకున్
(అప్ప 2–232 2 8)

అని రేఫఅకారసాంకర్యం చేయరాదని చెబుతాడు ఆమాటనే అహోబలపతి—

కశ్చిద్వదతి సాంగత్యం యథావేవానయోస్తథా
అవదచ్చాత్రిసాంగత్యం ప్రాసేష్వపిచకశ్చన
అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ
అస్యాఅత్యంత దోషత్వా ద్దుష్కవిస్సాకథ్యతే (సంజ్ఞా 22 సూత్ర వ్యాఖ్య)

అని సంస్కృతీకరించాడు అప్పకవి అభిప్రాయాన్ని చక్కగా కారికల్లో నిబంధించాడు—రేఫ అకారాల సాంకర్యం చేసినవాడు దుష్టకవి అని

ఈ సందర్భంలోనే అప్పకవి బమ్మెరపోతరాజు రేఫ లకు అకారాలకు కలిపి ప్రాసలు వేశాడని అందువల్లే అతనిని ఏ ఆది లాక్షణికులూ ఉదాహరించలేదనీ వ్రాస్తే (అప్ప 2–234) ఆమాటను గూడ అహోబలపతి సంస్కృతీకరించాడంచే (సంజ్ఞ 22 సూత్రవ్యాఖ్య అప్పకవీయాన్ని అతడు ఎంత బాగా చదివి జీర్ణించు కున్నాడో ఊహించవచ్చు

నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్
(అప్ప చిం వర్ణ 6)

పైసూత్ర వ్యాఖ్యానంలో లఘ్వలఘు యకారాల విషయాన్ని విపులీకరిస్తూ అప్పకవి ఒక నూతనాంశాన్ని రాఘవపాండవీయాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రతి పాదించాడు

2 రెండర్థంబుల పద్యము లుండెడిచో నొకటి యచ్చు నొక యర్థమునన్
నిండారు హల్లునగు మురఖండన వలసినను లఘుయకారము కృతులన్
(అప్ప 2–224)

రెండర్థాల పద్యాల్లో యకార మొకటే ఒక అర్థంలో సామాన్య (అలఘు) యకారమై మరొ- అర్థంలో లఘుయకారం (అచ్చు) గూడ కావచ్చునని ఉదాహరణగా రాఘవపాండవీయ పద్యాన్నే (ఆశ్వా —26) ఇచ్చాడు రాఘవపాండవీయ క ర్త సూరన్న అధర్వణునికి బాగా తరువాతివాడనే విషయమైనా గమనించకుండా[1] అధర్వణాంకితంగా అప్పకవి పద్యాన్ని అహోబలపతి సంస్కృతీకరించి వేశాడు

ప్రాణాత్ ప్రాణో లఘుర్యస్స్యాత్సహల్చాచ్చభవేత్ క్వచిత్
వేద్యత్వం తస్య కల్ప్యంస్యాత్ - (సంజ్ఞా 2 సూత్ర వ్యాఖ్య)

అచ్చుకంటె పరమైన అచ్చు లఘు యకారమౌతుంది అది అచ్చూ హల్లూ రెండూ అవుతుంది అని భావం ఉదాహరణగా రాఘవపాండవీయపద్యాన్నే ఇచ్చాడు పై సూత్ర వ్యాఖ్యనే అప్పకవి పొడిగిస్తూ —

8 నువు నువ్వు నూవు నూఁబువ్వెవఁడే వాఁడెవ్వఁడేవఁడీతఁడనంగాఁ
బువు పువ్వు పూవు పూమొగ్గవురావికసించె ననఁగ నగువలయు నెడన్
అప్ప 2 — 258

అనే విశేషాంశాన్ని ప్రతిపాదించాడు దాన్ని అహోబలపతి అద్విత్వంచ భవేద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చకేషుచిత్ (అజంత 52 సూత్ర వ్యాఖ్య) అని సంస్కృతీకరించాడు కొన్నింటియందు ద్విత్వముంటుంది అద్విత్వ ముంటుంది దీర్ఘముంటుంది హ్రస్వమూ ఉంటుంది అని భావం ఎవ్వాడు ఎవ్వడు నువు నువ్వు నూవు నూఁబువ్వు నూపువ్వు పూవు పూమొగ్గ ఇత్యాదిని రూపాణి సామంజస్యం లభ న్తే అని ఉదాహరణలు

పురా స్త్రీ రసగిరి రుద్రేష్వకచటహమాతృకానింద్యాః (అప్ప చిం వర్ణ 20)

ఇది అప్పకవీయ చింతామణిలో మాత్రం కనిపించే సూత్రం దీని వ్యాఖ్యలో అప్పకవి —

---

1 సూరనకు ముందు భీమన రాఘవపాండవీయం వ్రాశాడనటమే కాని కనబడటంలేదని సూరన్నే వ్రాశాడు-గ్రంథాదిలో

4 మూఁడవ తావున మొదలిటి మూఁడు సరళవర్ణములును మూఁడవస్వరమున్
మూఁడవ యూష్మాక్షరమును గూడదు కదియింప నెట్టి కూళకునైనన్
వ్యంజనాహ్వయమున నొప్పు వ్రాలలోన షోడశాక్షర మాఱవచోట నిలిపి
మచ్చరంబునఁదనుఁజంప వచ్చినట్టి చెడుగునకునైనఁబద్యంబు నుడుగరాదు
అప్ప 2 - 368 369

అని కొన్ని పరిహరింపవలసిన అక్షరాలూ వాటిస్థాన నిర్దేశమూ చేశాడు దాన్ని విశేషాంశంగా భావించిన అహోబలపతి—

తృతీయోచ్చ తృతీయోష్మ తృతీయే సరళాశ్రయః
షోడశం వ్యంజనంచాపి షష్ఠస్థానే నయుజ్యతే —సంజ్ఞా 9 సూత్ర వ్యాఖ్య

అని సంస్కృతీకరించాడు మూడవ స్థానంలో మూడవ అచ్చు కూడదు అలాగే సకారం గజడ అనే వర్ణాలు తృతీయస్థానంలో వాడకూడదు ఆఱవ స్థానంలో తకారం కూడదు అని భావం అప్పకవి పద్యమే సంస్కృతీకృతమైనట్లు గ్రహించవచ్చు

కళాదుర్గితప్రకృతిక విభాగం చేసే తిజ్మధ్య శేషష్ఠ మొదలైన సూత్రాలు వ్యాఖ్యానిస్తూ అప్పకవి సంధివివేకం అనే ఉపశీర్షిక క్రింది —

5 వెనుకటి శబ్దమునకుఁ దుదిఁ దనరెడు వర్ణమును బైపదమునకు మొదలం
గనుపట్టు నక్షరంబును ననకస్తుత కూర్చి పలుక సంధియనఁజనున్
ఎచట సంధి గలుగు నచటఁబూర్వపదాంత హల్లుతోడఁ గూడినట్టి స్వరము
లోపముగ నొనర్చి యాపొల్లుతో మీఁది యక్షరంబు గూర్పనయ్యెసంధి
(అప్ప 5—33 37)

అని తెలుగులో సంధి జరగడమంటే పూర్వపదాంత్యమైన అచ్చును పోగొట్టి ఆస్థానంలో పర పదాది అచ్చు చేర్చడమని మంచి నిర్వచనం చేశాడు దాని ప్రాముఖ్యాన్ని గమనించిన అహోబలపతి—

ఆద్యంతవర్ణ యోరైక్యం సంధిరిత్యుచ్యతేబుధైః
పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్ (సంధి 9 సూత్రవ్యాఖ్య)

అని సంస్కృతీకరించాడు[1]

అది అంత వర్ణాల కలయిక సంధి అనబడుతుంది పూర్వ వర్ణానికి పర రూపం రావడం తెలుగులో నియతమైన విషయం అని భావం

అప్పకవి సర్వత్రాజ్వదిత్యాది సూత్ర వ్యాఖ్యలో —

6 అరయ వైకృతోక్తులఁబదాదులయందు యకారముండదా
తీరునఁబల్కు వ్రాఁత గణుతింపఁగ నచ్చగు (అప్ప 6 - 40)

అని పదాది యకారవిషయమై తన అనంగీకారాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించాడు ఆ విషయంలో అప్పకవితో ఏకీభవించే అహోబలపతి పై అప్పకవి మతాన్ని ఆద్యవర్ణాస్తు హల్త్వేన నగృహ్యన్తే కదాపిచ అని సంస్కృతీకరించాడు (సంజ్ఞా 20 సూత్ర వ్యాఖ్య) మొదటి వర్ణాలు హల్లులుగా ఎప్పుడూ స్వీకరించబడవు అని కారికార్థం సందర్భం తెలియకుండా చూస్తే కారిక భ్రాంతిజనకంగా ఉంటుంది మొదటి వర్ణాలు హల్లులుగా ఉండకపోవడమేమిటి? గంట గంప ఇత్యాది పదజాలంలో మొదటి వర్ణాలు హల్లులుగావా? కారికా కర్త ఉద్దేశం పదాదిలో యకారం (హల్లు) ఉండదనే పదాదుల యందు యకార ముండదనే మాటను పదాదిలో హల్లు ఉండదన్నట్లు అనువదించాడు అహోబలపతి ఆద్యవర్ణాలంచే అచ్చులని అర్థం చెప్పి అచ్చుల్ని హల్లులుగా ఎప్పుడూ స్వీకరించకూడదు అనే అర్థం ఈకారికకు కొందరు చెప్పడం జరిగింది అప్పుడైనా ప్రయోగ విరోధం తప్పదు అచ్చులు హల్లులుగా స్వీకరించబడక పోవడమేమిటి? మనస్సులో పదాది యకారాన్ని ఉంచుకొని పలికిన మాటే అది

---

1 ఈ కారికలు కావ్యాలంకార చూడామణి ఆంధ్రభాషా భూషణాలలోని నిర్వచనాలకు గూడ సమానంగా ఉండటంవలన ఆ గ్రంథాల నుండి గూడ పుట్టినట్లు ఈ ప్రకరణంలోనే చెప్పడం జరిగింది అహోబలపతిమీద దేశీయ వ్యాకరణాలు అన్నింటి ప్రభావం నిండుగా ఉండటం వలన అనేకవ్యాకరణాల

అప్పకవి లుక్ సంశ్లేషౌ నాచిద్రుతస్య (అప్ప చిం సంధి 8) అనే సూత్ర వ్యాఖ్యానంలో ఒక విశేషాంశాన్ని ప్రతిపాదించాడు

7 ధరణి ద్రుతప్రకృతులపై స్వరపూర్వపదములు గదిసి సంధిగలయుచో
నరకాసురదమన ద్రుతాక్షరములు లోపములు గాక కడపల నిలుచున్
(అప్ప 5-46)

ద్రుతప్రకృతికాలకు అచ్చులు పరమైతే ఆ ద్రుతాలు లోపించవని పద్య తాత్పర్యం ఇది చాలముఖ్యమైన అంశం - తెలుగు సంధి విషయంలో ఈ నియమం వల్లనే కొలుకునిచ్చె కొలుకిచ్చె వంటి రూపాల్లో (కొలుకున్ + ఇచ్చె) రెండచ్చులకి నడుమ ద్రుతంతో వ్యవధానముంటే సంధి ఎలా జరిగింది అనే ప్రశ్నకు సమాధానం లభిస్తుంది కాగా ఈ నియమ ప్రాముఖ్యాన్ని గుర్తించిన అహోబలపతి దీనిని అచాం సంధౌ ద్రుతోఽ దృశ్య స్థితో ఎచథవేత్సదా (సంధి 3 సూత్ర వ్యాఖ్య) అని సంస్కృతీకరించాడు అచ్చుల మధ్య ద్రుతమున్నా సంధిజరిగేటపుడు అదృశ్యమౌతుందని కారికార్థం

అప్పకవి నస్యాత్తద్ధర్మోత (సంధి 6) అనే సూత్రవ్యాఖ్యలో చింతామణి కర్త చేసిన పెద్ద పొరపాటును సరిదిద్దుతూ —

8 ఉర్వింౘద్ధర్మమునఁబ్రథమోత్తమాఖ్య పురుషము లనేకవచనముల్ వోవవిడిచి
కడమ పదములు తిఙ్మధ్యకములుగానఁ గొమ్ములను బ్రాణసంధులు
గూర్చుబొప్పు
కాంతురజప్రభృతులు నిను సంతతమునుబ్రోతువీవు సనకాదుల మ
ర్దింతు రథవుండు నీవును బంతంబుల ఖలులననుచుభావింతుమెదన్

---

సంస్కారబలంతో అతడు కారికలు నిర్మించి ఉండవచ్చు - అని తెల్పడమే దీనిలక్ష్యం

వదలక తద్ధర్మములను బొదవెడు ప్రథమోత్తమాఖ్య పురుషైకవచః
పదములు ద్రుతప్రకృతులగుఁబదరును నతఁడోర్తు నేను బలుమరుననఁగన్
(అప్ప 5 - 73 74 75)

చింతామణి సూత్రం తద్ధర్మార్థక క్రియల ఉత్త్వానికి సంధిలేదని చెబుతుంటే (కాంతురు + అజప్రభృతుః = కాంతురజప్రభృతులు – సంధి జరిగిన రూపం) దానిలోని ప్రయోగ విరోధాన్ని పరిహరిస్తూ అప్పకవి తద్ధర్మ పదానికి ప్రథమ - ఉత్తమ పురుషైకవచనాలే అర్థం గాని ఇతర రూపాలు అర్థంగాదని ఆ రెండూ (ప్రథమ - ఉత్తమపురుష ఏకవచనాలు) ద్రుతప్రకృతులనీ అప్పకవి వివరించాడు అప్పకవి వ్యాఖ్యాన ప్రాముఖ్యాన్ని కనిపెట్టిన అహోబలపతి ఆ వ్యాఖ్యను —

ప్రథమశ్చోత్తమశ్చైవ తాసుతద్ధర్మ సంజ్ఞకౌ
భూతాద్యవిషయౌ తత్రచైకత్వార్థాభిధాయకౌ
ఉదంతౌచ సదానాన్తౌ నసంధిస్తత్రకల్ప్యతే

అని హలంతపరిచ్ఛేదంలో 31వ సూత్రవ్యాఖ్యలో సందర్భాన్ని కల్పించుకొని సంస్కృతీకరించాడు తద్ధర్మక్రియల్లో ప్రథమ ఉత్తమపురుష-ఏకవచనాలు మాత్రమే తద్ధర్మసంజ్ఞ కలవి అవి ఉదంతాలుగా దుత్రప్రకృతికాలుగా ఎప్పుడూ ఉంటాయి ఆ రెంటికి సంధిలేదు అని కారికార్థం సంధి పరిచ్ఛేదంలోని అంశాన్ని హలంత పరిచ్ఛేదంలో ఉటంకించడానికి బహుశః తన అనువాదం స్పష్టంగా మక్కీకి మక్కీగా ఉండటంవలన బయటపడుతుందనే సంకోచం కారణం కావచ్చు లేక మహాభాష్యఫక్కీలో వ్యాఖ్యానిస్తున్నానని అహోబలపతి అనుకున్నాడు గాబట్టి స్థల విపరిణామముంటే అదొక సొగసు అని భావించి ఉండవచ్చు

అప్పకవి అపిశబ్దేతో లుగ్వాస్యాత్ అనే సూత్ర వ్యాఖ్యలో చింతామణి చెప్పని నూతనాంశ మొకటి—

9 వారిజాతనేత్ర క్త్వాప్రత్యయాంతార్థములు వచింతుఁదెలుఁగుపలుకులకును
బై స్వరంబులుండుపట్టులఁబ్రకృతిభావంబుగాని సంధి వాటపడదు
కాంచి యాలకించి యెంచి యాలోకించి యెరసి యాడియోడి యెరగి
యెఱిఁగి

యంటి యెంచి యిచ్చి యని యాడుకొని యెత్తి యెనసి యాగియనఁగవచ్చు
(అప్ప 5 - 82 83)

అని ప్రతిపాదించాడు అహోబలపతి వెంటనే ఆ అంశాన్ని భాషాంతరీకరించి అధర్వణాంకితం చేశాడు క్త్వార్థేతో నభవేత్ సదా (సంధి 9 సూత్రవ్యాఖ్య) క్త్వార్థమైన ఇత్తుకి ఎప్పుడూ సంధిలేదు అని కారికార్థం

అప్పకవి తన్మనమాసే పుంపూ అనే సూత్రవ్యాఖ్యలో —

20 మగువ సూక్ష్మపుఁగౌను సూక్ష్మంపుఁగౌను - (అప్ప 5 - 27)

అని ఉదహరించాడు సూత్రం ము వర్ణం సమాసంలో పుంపు లు గా మారుతుందని చెబుతుంటే అప్పకవి ఆ పుంప్వాదేశమైన తరువాత పరంగా పరుషాక్షరముంటే మధ్య సుమాగమం వస్తుందనే విషయాన్ని ఉదాహరణలో సూచించాడు - సూక్ష్మము + కౌను=సూక్ష్మపుకౌను సూక్షపుఁగౌను అసూచనను అహోబలపతి అందిపుచ్చుకొని వికారాచ్చాపి కేచన (సంధి 32 సూత్ర వ్యాఖ్య) అని సంస్కృతంలోనికి మార్చాడు వికారంకేంటె గూడ సుమాగమం వస్తుందని కొందరంటాని కారికార్థము తన అనువాదంలో వికార మనడం వలన అర్థస్ఫూర్తి కొరవడిందని వికారాత్ - పుంప్వాదేశ వికారాదిత్యర్థ అని వివరించి చూపాడు మిరియపుంబొడి కుందనపుంటాయ ఇత్యాది అని ఉదాహరణలు గూడ చూపాడు

అప్పకవి వాక్యాన్తగతపదానాంచ అనే సూత్ర వ్యాఖ్యలో —

2 తదంత్యపదము తుదఁబొనఁగు నకారంబు పొల్లవోవున్నిలుచున్ (అప్ప 5 — 36) అని వ్రాశాడు తదంత్యమంటే వాక్యాంతమని అర్థం అహోబలపతి ఆ మాటను వాక్యావసానగస్య స్యాల్లోపోన ప్రాయశోఽత్రవా (సంధి 4 సూత్ర వ్యాఖ్య) అని సంస్కృతీకరించాడు వాక్యంచివరి నకారానికి తరచుగా ఈ తెలుగులో లోపం వస్తుంద ని కారికార్థం

పై సూత్ర వ్యాఖ్యనే అప్పకవి పొడిగిస్తూ—

22 నలినాక్ష తెలుఁగు పద్యంబుల కడపలనుండునలలపొల్లులకు మహీ
స్థలి గుడుసులు శృంగములును నిలుపరు చదువునెడ లాక్షణికులెచ్చోటన్
(అప్ప 5 - 39)

అని పద్యాలచివర నకార లకారాలమీద ఇత్వోత్వాలు ఉంచగూడదని ఒకనియమం చేశాడు అంటే పద్యాల చివర ద్రుతానికి స్వత్వముండదని భావం ఆ నియమ ప్రాముఖ్యం గుర్తించిన అహోబలపతి దాన్ని పద్యావసానే సర్వేషాం స్వత్వం నాప్నోతి సాధుతాం (సంధి 2 సూత్ర వ్యాఖ్య) అనేక కారిగా మార్చాడు. పద్యాలచివర అందరి మతంలోను స్వత్వం సాధువుగాదు అని కారికార్థం అహోబలపతిఅప్పకవీయ మూలకమైన తన కారికాబలంతో వైజయంతీ నవాంశుక వ్యాజమునను అనే (2 - 60) జైమినీభారత పద్యాన్ని తప్పుపట్టాడు కూడ

అహోబలపతికి సంస్కృతంలో శ్లోకాలల్లడం నల్లేరుమీద బండినడక లీలగా హేలగా ఛందస్సు అతని మాటలో ఒదిగి వస్తుంది సంజ్ఞాపరిచ్ఛేదంలో 36వ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ అధర్వణుని పేరగాక ఊరకే అలవోకగా ఒక శ్లోకం అల్లాడు

సూత్రద్వయే సవర్ణత్వాద్ గృహ్యేతే దన్తజౌ చజౌ
సాసంజ్ఞైవ తయోస్తేన నాన్యా సంజ్ఞాప్రవర్తతే

సూత్రాలు రెంటిలోను సవర్ణత్వం వలన దంత్య చజలు (తాలవ్యాలతోపాటు) స్వీకరింపబడతాయి వాటికదే పేరు వేరొక పేరులేదు అని శ్లోకార్థం సంస్కృత భాషమీద మంచి అధికారం సంపాదించడం వలన అతనికి అతని వ్యాఖ్యానానికి గొప్పకీర్తి కలిగింది కారికలనన్నింటినీ అక్కడికక్కడ తన పూర్వ వ్యాకరణ-పరిజ్ఞానంతో ఇట్టే అల్లడానికి అతనికున్న సామర్థ్యం ప్రశ్నించరానిది చింతామణి సూత్రాలు కొన్ని బాలసరస్వతి వివరిస్తే తప్ప బోధపడనట్లు వికృతివివేక కారికలు పెక్కిటికి అహోబలపతి వివరిస్తేతప్ప అర్థసందర్భాలు ఏర్పడవని పై పరిశీలనం వలన తెలిసికోగలిగాం కాగా చింతామణిని బాలసరస్వతి చేసి నన్నయపేర ప్రకటించినట్లు వికృతివివేకాన్ని అహోబలపతి చేసి అధర్వణునిపేర ప్రసిద్ధం చేశాడు—అని నిర్ణయించవచ్చు ఈ విషయంలో ఇద్దరు వ్యాఖ్యాతలూ సన్నిహిత సమాన మనస్తత్వం గలవారు

ఇపుడు మనం జరిపిన పరిశీలనం వలన అధర్వణకారికలు లేక వికృతివివేక మనేది ఒక స్వతంత్ర వ్యాకరణం కాదని 2 అది అహోబలపతికి పూర్వ లాక్షణికులు–కేతన మొదలు అప్పకవివరకు గల అనేకుల లక్షణాల సంస్కృతానువాదమే అని 3 ఆయా లక్షణాల్ని అహోబలపతి తన వ్యాఖ్యలో అక్కడక్కడ సందర్భ పరచి తన వ్యాఖ్యా గౌరవాన్ని పెంచుకున్నాడని నిర్ణయించగలిగాం కాగా అధర్వణుడు అనే వ్యాకర్త వికృతివివేకం వ్రాయడం నన్నయ ఆంధ్రశబ్ద చింతామణిని వ్రాయడం లాగ ఒక అబద్ధమని కేవలం గ్రంథగౌరవ సంపాదనం కోసం అహోబలపతి ఆ అబద్ధాన్ని సృష్టించి బాలసరస్వతి మార్గంలో ప్రచారం చేశాడని గూడ కనిపెట్టగలిగాం ఈ విధంగా అహోబలపండితీయంలో అంతర్భాగంగా ఉన్న అధర్వణకారికల పుట్టుపూర్వోత్తరాలు వెలికితీసిన తరువాత ఇక అహోబలపండితీయ వ్యాఖ్యానాన్ని గూడ దిఙ్మాత్రంగా పరిశీలించి ఈ ప్రకరణం ముగిద్దాం

అహోబలపతి చింతామణికి ఈ వ్యాఖ్యానాన్ని పాణినీయానికి మహాభాష్య ఫక్కీలో వ్రాశాడు —అని ముందే అనుకున్నాం ఒక్కొక్కచోట సుదీర్ఘమైన చర్చచేయడం ఒక్కొక్కచోట రెండే మాటలతో వ్యాఖ్యను ముగించడం గూడ అహోబలపతి వ్రాతలో చూడగలం ఉదా - మహతస్సోర్దుజనితో భవేత్పుంసి (అజంత 2) నిత్యం దారాదేశ్చస్యాల్లోర్దులయో రురౌచ తత్రిస్త (అజంత 72) అనే సూత్రాలు సుదీర్ఘంగా సోర్లుగితః (అజంత 36) ఉద్వహా త్వే (అజంత 37) అనే సూత్రాలు అత్యల్పంగా వ్యాఖ్యానించబడి ఉన్నాయి

ముఖ్యంగా అతని వ్యాఖ్యలో మొదటి సూత్రాలలో అతనికున్న వివిధ శాస్త్ర పాండిత్యాన్ని గుప్పించి వ్రాశాడు అభాగాన్ని అతడు మహాభాష్యంలోని పస్పశాహ్నికాన్ని తలపుకు తెస్తూ వ్యాఖ్యానించాడన్ని విజ్ఞులంటారు అహోబలపతి వ్యాఖ్యలో బాలసరస్వతి అప్పకవి వాసుదేవుల వ్యాఖ్యానాలసారం ఇమిడి ఉండటంవలన దానికి ఒక సంపూర్ణత్వం కలిగినమాట యథార్థం పైగా సంస్కృతంలో మహాభాష్యశైలిలో సూత్రకర్తను ఆచార్య శబ్దంతో వ్యవహరిస్తూ చేసిన ప్రసంగాలు ఈ వ్యాఖ్యకు వన్నె తెచ్చాయి–సంస్కృత పండితుల దృష్టిలో

తన పూర్వ వ్యాఖ్యాతలు చెప్పిన ముఖ్యాంశా లన్నింటినీ క్రోడీకరించడమే కాకుండా ఇతర దేశీయ వ్యాకర్తల లక్షణాల్ని గూడ సంస్కృతీకరించి కారికలుగా

ప్రవేశ పెట్టడంతో అహోబలపండితీయం అది వెలువడిన కాలానికి దాదాపు లక్షణసర్వస్వంగా పరిగణితమైంది అయినా దీనిలో అక్కడక్కడా అహోబల పతి వ్యక్తిత్వంలో లాగ కొన్ని దొసగులు స్పష్టంగా కనిపిస్తున్నాయి

అనవసరంగా సంస్కృతవ్యాకరణ మర్యాదలు తెలుగులో చొప్పించడం

2 అసందర్భంగా ప్రాకృత వ్యాకరణపాండిత్య ప్రదర్శన చేయడం

3 కొన్ని తెలుగు ప్రయోగాల సాధుత్వాన్ని సంస్కృత ప్రయోగ సాధుత్వంతో కృత్రిమంగా సాధించడం

4 స్వవచన వ్యాఘాతాలు గమనించక వ్యాఖ్యానించడం

ప్రథమాపై భక్తికమోర్బిన్దుశ్చమహాన్ పతిక్రియార్థేషు (సంధి 8)

పై సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి సంతోషము + పడి అనేది పై సూత్రంతో సంతోషం పడి అని మారినపుడు అక్కడి సున్నా ముప్రత్యయ స్థానికం కాబట్టి స్థానివదాదేశోఽనల్విధౌ (పాణిని - -56) అనే సంస్కృత వ్యాకరణ సూత్రం ప్రకారం స్థానివద్భావం పొందితే దాని తరువాతి పడి లోని పకారానికి గసడదవాస్స్యుః ప్రథమామాత్రా దాత్మాన్మదోర్వినైవైతే (సంధి 23) అనే సూత్రం ద్వారా వకార మాదేశ మౌతుందని పూర్వపక్షం చేశాడు

తెలుగు వ్యాకరణంలో స్థానివద్భావం ప్రసిద్ధం కాదు అని అనగూడదంటూ గంగనుకానె ఇత్యాది స్థలాల్లో గంగ అనే శబ్దం సంస్కృతీయమై క్వచిత్ సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్రచ్యుతో భవేత్ అనే అథర్వణకారిక ప్రకారం చివరి అచ్చును కోల్పోయి అను శబ్దంతో సంధితం కావాలంటే అక్కడ గంగ అనే శబ్దానికి సంస్కృతీయత్వం ఈ స్థానివ ద్భావం రాకుండా ఎలా సిద్ధిస్తుంది? కాబట్టి తెలుగు వ్యాకరణంలో గూడ స్థానివద్భావం అన్వయించవలసిందే అని సిద్ధాంతం చేస్తాడు ప్రస్తుత సందర్భంలో సంతోషం పడి అనేచోట పా కి వాదేశం రావడం అల్విధి కాబట్టి అల్విధి శబ్దానికి నాల్గువిధాలైన వ్యాఖ్యానం సంస్కృత వైయాకరణులు చేశారంటూ స్థానివద్భావం అనల్విధిలోనే వస్తుంది గాని అల్విధిలో రాదని సూత్రానికి అర్థమని తానే తన పూర్వపక్షాన్ని ఖండించి సంతోషంవడి వంటి అపరూపం రాదని వివరిస్తాడు

పై క్లిష్టకల్పనలన్నీ అవ్యాఖ్యాత పాండిత్యాతిశయం వలన అవసరమైనవే కావి నిజానికి తెలుగులో స్థానివద్భావం వంటి సంస్కృత వ్యాకరణ మర్యాదలు అన్వయించవలసిన అవసరం లేదు కారికలోని సంస్కృతీయ శబ్దానికి సంస్కృత సమమని అర్థం చెబితే ఈ పూర్వపక్షాల తత్ ఖండనల అవసరమే ఉండదు అలా అర్థం చెప్పడం వలన వాటిల్లే విపత్తు తెలుగు వ్యాకరణానికి ఏమీలేదు కాబట్టే చిన్నయసూరి సంస్కృతీయంబునకు సంధియగునవి యథర్వణాచార్యులు చెప్పిరి గావి (బాలవ్యా సంధి 4 సూ) అని అథర్వణమతంగా పై అహోబలపతి ప్రతిపాదించిన విషయాన్నే సామాన్యంగా స్థానివద్భావం జోలికి పోకుండా ఉటంకించాడు సంస్కృతీయమంటే సంస్కృత సమమనే సూరి అభిప్రాయం ఆ విషయమే వ్యాఖ్యాతలు వెలువరించారు గూడ (గ్రాంథి కాంధ్ర కల్పకము)

అన్యేషాంచ వాలుగన్త్యస్య —హలంత ॥

పై సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి అగ్నిమథుఁడు ప్రాంచుఁడు భగవంతుఁడు మఘవన్తుఁడు ధీమన్తుఁడు హనుమానుఁడు భగవానుఁడు అనే రూపాల ప్రక్రియను చూపి తరువాత హనుమంతుఁడు అనే రూపం ప్రాకృతసమం గూడ అవుతుంది అని నూతన ప్రతిపాదన చేస్తాడు దానికి ఆధారంగా మంత మణ వన్త మా ఆలు ఆల ఇర ఇల్ల ఉల్లి ఇన్తా మతుపః (ప్రాకృత శబ్దానుశాసన 2– –) మతుప్ ప్రత్యయస్య మంత మణ వంత మా ఆలు ఆల ఇర ఇల్ల ఉల్ల ఇంత ఇత్యేతే దశ ఆదేశాః యథాప్రయోగం భవన్తి (వృత్తి) అనే సూత్రాన్ని ఉటంకించాడు

హనుమంతుడు అనే రూపం తెలుగు వ్యాకర్తలకీ వైయాకరణులకీ అందరికీ సామాన్యంగా సంస్కృతసమంగానే కనిపిస్తుంది సంస్కృతసమత్వం ప్రాకృత సమత్వమనేవి కొన్ని నిర్దిష్టమైన నియమాల ప్రకారం తెలుగు వ్యాకరణాల్లో ఏర్పడింది గూడ అహోబలపతి కాలానికే అయినపుడు ఒక్క హనుమంతుఁడు శబ్దాన్ని పట్టుకొని అది సంస్కృత సమమని ముందు చెప్పి తరువాత ప్రాకృత సమం గూడ కావచ్చు నని ప్రతిపాదించడం కేవలం అనవసరమూ అసందర్భమూ అయిన అంశం ఒకేపదం సంస్కృత సమంగా ప్రాకృతసమంగా (రెండుగా) ఉండటానికి వీలులేదు ఆ సమత్వం లోకవ్యవహార రూఢం గూడ కావాలి కేవలం

పండితు డొకడు ఇలా అని నిర్ణయిస్తే సరిపోదు అతని ఆ ప్రతిపాదనం వలన ఒరిగినది ఏమీలేదు అతనికి ప్రాకృత వ్యాకరణంలో గూడ విశేష పాండిత్య మున్న దనే విషయం తెలియడం తప్ప ఈవిధంగా శాస్త్రగౌరవానికంటె ఆత్మగౌరవానికే అధికప్రాముఖ్యమిస్తూ వ్యాఖ్యానించడం వ్యాఖ్యాత యొక్క పరిణత ప్రజ్ఞను ప్రద ర్శించదు

నిత్యం దారాదేశ్చస్యాల్లోర్లులయో రురౌచ తత్రిస్త —అజంత 72

పై సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి అసందర్భంగా రమణకెక్క అనే తెలుగు ప్రయోగానికి సాధుత్వాన్ని సంపాదింపదలిచి సంస్కృత—ఆలంకారికుల వైయాకరణుల మతా లనేకం ఉదాహరిస్తూ పెద్దచర్చ సాగించాడు రమణకు అనే పదం రమణత్వమునకు అనే అర్థంలో అంటే ధర్మివాచకం ధర్మవాచకంగా ప్రయు క్తమైఉంది-పైన అది చెల్లుతుందని గమ్యార్థానాం నప్రయోగ అన్యథా పౌనరు క్త్యమ్ అనే ఆలంకారికోక్తిని ఉటంకించాడు ఇక్కడే కాళిదాసుని ఎతావతా నన్వనుమేయ శోభి అనే ప్రయోగంలో గూడ పై ఆలంకారికోక్తి వల్లే సాధుత్వం సంపాదించ బడిందనీ మహాభాష్యవ్యాఖ్యాత కైయటుడు గూడ గమ్యార్థస్యాప్రయోగ ఏవ లోపోఽభిమత మొదలైన వ్రాతలో పై విషయాన్నే సమర్థించాడనీ వ్రాశాడు— అహోబలపతి అంతటితో ఆగక దివిజపాలకునట్టిద నీకునొప్పు సామ్రాజ్యము (నభా 1–279) భావభవనిభసుభగా (ఆది 8– ) మొదలైన నన్నయ ప్రయో గాల్లో గూడ సాధుత్వసంపాదనం చేయాలంటే గమ్యార్థమయిన శబ్దం ప్రయుక్తం కాకపోయినా తప్పులేదనే పై ఆలంకారికోక్తే శరణ్యమని వివరిస్తూ నప్తమ్యుప మానపూర్వపదస్య బహువ్రీహేరుత్తరపదలోపశ్చ అనే వార్తికాన్ని ఉదాహరించి తనకున్న శబ్దశాస్త్ర పాండిత్యాన్నంతటినీ ప్రదర్శిస్తాడు

వ్యవహార రూఢినిబట్టి రమణకెక్క వంటి ప్రయోగాలు శిష్టాలేనాయనే యథార్థాన్ని ఇంతకంటె తక్కువ ఆడంబరంతో వ్యక్తం చేయవచ్చు నిజానికి అలాంటి ప్రయోగాలు చేసినవారు వాటి సాధుత్వానికి ఇంత పూర్వరంగమున్నదని తెలిసిచేయరు గదా వాటి సాధుత్వానికి నిజమైన ఆధారం లోకరూఢి మాత్రమే కాని అహోబలపతి చూపిన ఉపపత్తులు గావు అయినపుడు అతని వ్రాతలో చాలభాగం అస్థాన సంరంభంగా కనపిస్తుందనడం యథార్థం

వాఽతః —సంధి 2

పై సూత్ర వ్యాఖ్యలో అహోబలపతి క్త్వార్థేతో నభవేత్సదా అనే కారికను ప్రతిపాదించి నిలిచి+ఉన్న అనేచోట సంధి కారాదని నిలిచియుండు అనే ఉండాలని వ్యాఖ్యచేసి నిలిచున్నవాడు వంటి ప్రయోగాల్లో నిలుచు+ఉన్నవాడు అన్నట్లుగా పదవిభాగమే కాని నిలిచి అని క్త్వార్థక రూపానికి సంధిచేయనే రాదని వ్రాశాడు - తిరిగి తానే అజంత పరిచ్ఛేదంలోని 8(6వ సూత్రవ్యాఖ్యచేసిన తరువాత అద్రుతానా మకాదీనాంద్వి రుక్త్వావ న్త్యలోపితా అన్యేషాంచ ద్వీరుక్తౌ స్యుర్భహులో పాగమామతాః అనే కారికను ప్రతిపాదించి దాని ప్రకారం ఓహోహో అయ్యో య్యో వంటి సంధి రూపాలు ఏర్పడినాయని చెపుతూ అవియాని అలసి యలసి అడియాడి ఇత్యాది రూపాలు మాత్ర మసాధువులే అని తన అభిప్రాయం వ్యక్తం చేస్తాడు అని అలసి-అడి, అనేవి అను - అలయు అడు అనే ధాతువుల క్త్వార్థకరూపాలు అయినపుడు వాటికి సంధిరాదని తానే స్వయంగా కారిక సృష్టించి సంధి పరిచ్ఛేదంలో నిర్ణయించి ఉన్నాడు ఇక్కడ అజంత పరిచ్ఛేదంలో తిరిగితానే తన సంధి పరిచ్ఛేదంలోని మాటను ఖండించుకుంటున్నాడు ఇటువంటి స్థితి శ్రుతి మించిన పాండిత్యం వలన తప్ప కలగడానికి వీలులేదు గదా

అతని వ్రాతలో కొన్ని విపరీత వ్యాఖ్యలు గూడ చింతామణి సూత్రాలకు చేయబడ్డాయి అజంత పరిచ్ఛేదంలోని 8(6వ సూత్ర వ్యాఖ్య తరువాతే అతడు ఒక కారికను—

క్వచిద్బిన్దుర్భి నౌదృష్టా క్వచి త్తేషు నసీమతౌ

అనే దానిని ప్రవేశపెట్టి వ్యాఖ్యానిస్తూ కారికలోని బిందు శబ్దం వలన పూనిచెన్ పదం పూంచెన్ గా మారుతుందని వ్రాస్తూ ఆ బిందు శబ్దానికి ఖండ బిందువు గూడ అర్థమౌతుందని భావించగూడదని ఒక ప్రతిపాదన చేసి దానికి సమర్థకంగా దీర్ఘాచ్చేత్ ఖండ ఏవ సజ్ఞేయః - సంజ్ఞ 8 అనే సూత్రాన్ని ఉదా హరించాడు నిజానికి ఆ సూత్రం ప్రకారమైతే - దీర్ఘం తరువాత విహితమైన బిందువు తప్పకుండా ఖండ బిందువే కావాలి - అయినా ఆ విషయాన్ని తలక్రిందులు చేసి తన అభిప్రాయానికి బలం చేకూర్చుకోవడంకోసం - దీర్ఘంకంటె పరంగా అను

స్వారముంటే అది రెండుగా పూర్ణంగా ఖండంగా ఉండటానికి వీల్లేదని ఒక్కటే ఉండాలని ఆ ఒక్కటి పూర్ణబిందువేనని వ్యాఖ్యానిస్తాడు ఇది విరంకుశమైన వ్యాఖ్యానం పూనిచె-పూంచె కావడానికి తాను మరోవిధంగా యత్నించి ఉండాలే గాని చింతామణి సూత్రానికి విపరీత వ్యాఖ్యచేసి ఆ రూపాన్ని సాధించడం న్యాయ్యంగా లేదు

ఈ విధంగా అహోబలపతి వ్యాఖ్య కొన్నిచోట్ల అతని మనోగత వైలక్ష ణ్యాన్ని ప్రతిబింబిస్తూ విచిత్రంగా విపరీతంగా ఉంది అయినా మొత్తంమీద చింతామణి మీద వెలసిన గొప్ప పెద్ద వ్యాఖ్యానం అదే దానిలో అతని కాలానికి తెలుగు వ్యాకరణ వాఙ్మయంలో వెలువడిన అనేక నూతనాంశాలకి అధర్వణకారికల పేర ప్రవేశం కలిగినదని తెలిసికొన్నాం చింతామణి ఫక్కి ఆంధ్రవ్యాకరణ రంగంలో సుప్రతిష్ఠితం కావడానికి అహోబలపతిచేసిన దోహదం మరువరానిది ముఖ్యంగా అతని వ్యాఖ్యాన ధోరణివల్ల తెలుగు వ్యాకరణానికి ఒక శాస్త్ర గౌరవం ఏర్పడిందని నిరభ్యంతరంగా నిర్ణయించవచ్చు

## చింతామణికి ఇతరవ్యాఖ్యలు

### *కవిజనాంజనము*

దీని కర్త బలారిసింహ నరసింహ రాజసింహుడు ఇతడు కవిసంశయ విచ్ఛేద కర్త అడిదము సూరకవి రచనను కారికలుగా సంస్కృతీకరించి తన గ్రంథంలో యిమిడ్చినవాడు (ఆ విషయం ముందు నిరూపించబడుతుంది) కాబట్టి 8వ శతాబ్దివాడైన ఆ సూరకవికి[1] తరువాతివాడు-అంటే 19వ శతాబ్ది ప్రారంభం లోనివాడని నిర్ణయించవచ్చు

ఈ వ్యాఖ్యానావసరాన్ని స్వయంగా కర్త హరిస్వముగఁడీక బాలసరస్వ తుండు[2] చేసె దానికి నేను విశేషముగను గవిజనోక్తులు లక్ష్యముల్ గాఁగఁజేతుఁ గవిజంనాజనమనెడు వ్యాఖ్యానమొకటి అని వివరించాడు కాని బాలసరస్వతి టీక

---

1 అడిదము సూరకవి కాలనిర్ణయం శ్రీ తిమ్మావఝల కోదండరామయ్య కవి సం వి లో పీఠికలో చేశారు

2 ఈ రూపం చింతామణి సాధ్యంకాదు దాని ప్రకారం దుష్టం కూడా అవుతుంది

హ్రస్వంగా ఉండట మొకటే కారణమైతే అతడు ఈ వ్యాఖ్య చేయవనిలేదు దీర్ఘమైన టీక అప్పకవి వ్రాశాడు అని ప్రశ్నించవచ్చు నిజమే కాని అప్పకవీయ వ్యాఖ్య చింతామణి మొత్తానికి గాక దానిలోని సంజ్ఞా సంధి పరిచ్ఛేదాలకు మాత్రమే ఉందికాబట్టి నరసింహ రాజసింహాడు ఈ వ్యాఖ్యను వ్రాయబూనడం సమర్థనీయమే అయితే విపులమైన వ్యాఖ్య చింతామణికి అహోబలపతిచేత సంతరించబడి ఉంది కాని అది సంస్కృతం కాబట్టి ఈ వ్యాఖ్యాత తెలుగులో విపుల వ్యాఖ్య చేయ సంకల్పించి ఉంటాడు

ఇంకా అతని వ్యాఖ్యాన సరణి ఎలా ఉంటుందో అతని మాటల్లోనే తెలుసుకుందాం సురగణ కుశాది గణముల వరుస లెటిగింతు శబ్ద వైకల్పికముల్
తిరవరతు వ్రాయఁగాఁదగు తటి వ్రాసెద వితర కవి మతంబుల నెల్లన్
అని తన వ్యాఖ్యాన పరిధిని అతడు నిర్ణయించుకున్నాడు ఆ పరిధిలో అతని వ్యాఖ్య చక్కగా నిర్వహింపబడిందనే చెప్పవచ్చు

ఇతని వ్యాఖ్యానంలో ముఖ్యాంశం కవి సంశయ విచ్ఛేదంలోని తృతీయ తరంగంలోని తద్భవపద లక్షణాల్ని సంస్కృతీకరించి విశ్వబద్ధంగా తన వ్యాఖ్యలో కారికలుగా ప్రవేశ పెట్టడం పూర్వ లాక్షణికుల తెలుగు లక్షణాల్ని సంస్కృతంలోనికి కారికలుగా మార్చడమనే ప్రక్రియ ఆదిలో బాలసరస్వతితో ప్రారంభమై[1] తరువాత అహోబలపతిలో వెల్లివిరిసి[2] చింతామణి ఫక్కికి సంబంధించినంతవరకు ఈ నరసింహ రాజసింహానితో అంతమైనట్లు గమనించవచ్చు

కవిసంశయ విచ్ఛేదం తృతీయతరంగంలో తద్భవపద లక్షణాల్ని వివరిస్తే వాటిని నరసింహరాజసింహాడు సంస్కృతీకరించి కారికలుగా ఆద్య ప్రకృతి ప్రకృతిశ్చాద్యే ఏషాతయో ర్భవేద్వికృతిః సంజ్ఞా– అనే సూత్ర వ్యాఖ్యలో పొందుపరిచాడు (ఈ కారికలు అధర్వణునివని ప్రకటించకపోవడం అతడుచేసిన

---

1 చూ చింతామణికి మూల పాఠాలు

2 చూ కారికల మూలపాఠాలు

మహోపకారం—ఆంధ్ర వ్యాకరణ ప్రపంచానికి అతడే అలా ప్రకటించి ఉంటే, ఆ అథర్వణకారికల పుట్టుపూర్వోత్తరాల అన్వేషణ కార్యక్రమం మరీ జటిలమై ఉండేది అపుడు కవిసంశయ విచ్ఛేదకర్తే ఆ అథర్వణ కారికలు పండిత పరంపరాయాతంగా తెలిసికొని ఆంధ్రీకరించాడని చింతామణివిషయ పరిశోధన నిర్మాతలవంటివారు వాదించిఉండేవారు ఇపుడు మూలాల్ని అనువాదాల్ని క్రమంగా పరిశీలిద్దాం

కవిసంశయ విచ్ఛేదము

1 ఋత్వమునకు నిత్వమ్మును నేత్వము సిద్ధించు నోత్వ మెనయును నుత్వం
బౌత్వమునకు నోత్వంబగు నైత్వం బేత్వమగు సుమశరాశన మథనా
(తృతీయ తరంగం—7)

కవిజనాంజనము -

ఉత్వస్యవాత వేదోత్వ మోత్వ మౌత్వస్య జాయతే
ఋకారస్య భవే దిత్వ మేత్వ మిత్వం భవే దుత
(సంజ్ఞా–1 వ సూత్ర వ్యాఖ్య)

కవిసంశయ విచ్ఛేదము -

వర్గంబుల ద్వితీయ వర్ణ చతుర్థ వర్ణములు తదాదివర్ణత భజించు
నణశలకు రేఫలకు తథదధలకు టడల కాదేశంబు డత్వమగును
ఞలకు చసలు శకారంబు చేకూరు శషచల కెల్లను సత్వమగును
కత్వదాత్వములకు యత్వమాదేశమౌ జ్ఞణలల నత్వంబు సంభవించు
వరుస తచరల చసటడవపనణలకు కగల కన్యోన్య సంప్రాప్తి గలుగుచుండు
యతుల్యకును బలె వర్ణైక్యమగును తలచు జనములు తదాది వర్ణ బాంధవము
గాంచు (తృతీయ తరంగము—6)

కవిజనాంజనము -

ద్వితీయస్య చతుర్థస్య తదాదిర్భవతి క్రమాత్
కఖయోరపి గప్రాప్తిః శషయో స్సత్వముచ్యతే

తటర్గశ రేఫాణాం దత్వాదేశోఽభవేదిహ
ఝణలానాం భవేన్నత్వం కహయోర్యత్వముచ్యతే
తవర్గస్య చవర్గస్య రలయోశ్చ నయోస్తథా
పవయోశ్చాపి మిత్రత్వం హ్రస్వోఽభవతి దీర్ఘతః
(సంజ్ఞా- వ సూత్ర వ్యాఖ్య)

కవిసంశయ విచ్ఛేదము -

3 హజబలకు బిందుపూర్వక మయ్యేనేని గత్వమాదేశమగుచుండుఁ గాలకంఠ యత్వమునకు నాదేశము జత్వమగును యూష్మ లంతస్థలును భేదమొంద కుండు (తృతీయ తరంగము–8)

కవిజనాంజనము

హజబాం పూర్వబిందూనాం గత్వాదేశో భవేదిహ
యకారస్య జకారస్స్యాత్ అచాంవత్వ ముదీరితమ్
(సంజ్ఞా— వ సూత్ర వ్యాఖ్య)

పై జంటలను పరిశీలించినపుడు విడిగా వివరణ మవసరము లేకుండానే ఏపాటి సంస్కృతాంధ్ర భాషా పరిజ్ఞానమున్నా కవిసంశయ విచ్ఛేదం మూలమనీ కవిజనాంజన శ్లోకాలు అనువాదాలనీ తెలిసికోవచ్చు

తరువాత అతడు తాను చెప్పినట్లు ఇతర లాక్షణికుల మతాలుకూడా అక్కడక్కడ సందర్భపరిచాడు ముఖ్యంగా కావ్యాలంకార చూడామణి ఆంధ్రభాషా భూషణాలనుండి అనంతుని ఛందస్సు కవిజన సంజీవనులనుండి ఆయా వ్యాకరణాంశాలు సోదాహరణంగా ఉటంకించాడు అతని వ్యాఖ్యలో మరొక విశేషాంశ మేమిటంటే క్రియాపరిచ్ఛేదంలో అధర్వణ కారిక లధికంగా ఉదాహరించడం వాటిలో కొన్ని కొత్తవిగా అహోబలపండితీయంలో లేనివిగా కూడా ఉండటం ఉదా- లఘుపూర్వక నకారాంత క్త్వార్థోపరిభవేచ్చయ భూతార్థస్త్యైక వచనే ప్రథమాయామి

తీరిత అని కారికా ప్రకటనం చేస కనియె వినియె చనియె అనియె —అని ఉదాహరించాడు ఆ రూపాల సిద్ధి కనుగుణంగా సంస్కృతంలో శ్లోకమల్లి

అహోబలపతి మార్గాన అధర్వణపరం చేశాడన్నమాట అలాగే మరొకటి క్త్వేత్వ స్త్వేత్వంచ రిత్వంచ స్తోభూతే ప్రథమా ద్వయోః అనే కొత్త కారికకు చూచి చూచె చూచిరి అనేవి ఉదాహరణలట ఇంకా అతని కొత్తకారికలు కొన్ని -

తత్ర నాద్యాదికం భూతే సర్వేషామితి కేచన
ఉదా -చూచినాఁడు చూచినావు చూచినాను చూచినారు మొ
భవిష్యదర్థే తత్రైవ హ్యేదస్యాఽ దితికేచన
నుమూ వురూ ప్రాగ్వదేవ తస్మాన్మధ్యోత్తమాసుచ

ఉదా - చూచెదను చూచెదము చూచెదవు చూచెదరు మొ ఇటువంటి కారికలు అతని వ్యాఖ్యానంలో క్రియాపరిచ్ఛేదంలో యింకా కనిఎస్తున్నాయి ఈ ధోరణిని బట్టి ఈ వ్యాఖ్యాత కూడ అహోబలపతి చూపిన అధర్వణ కారికల యదార్థ స్వరూపం తెలిసి తాను కూడ కొన్నిటిని సృష్టించి వాటిలో కలిపాడని సులభంగా గ్రహించవచ్చు ఈ విధంగా అధర్వణ కారికా కల్పన కాంక్షక్రమం అహోబలపతితో ప్రారంభమై నరసింహ రాజసింహానితో సమాప్త మైనట్లు గమ నించవచ్చు

ఉద్ద్యోతిని

ఈ వ్యాఖ్యకు కర్త శ్రీ పారనంది రామశాస్త్రి ఈయన ఈ శతాబ్ది (20వ శతాబ్ది) పూర్వార్థంలో జీవించి ఉన్నవారు ఈ వ్యాఖ్యాసృష్టికి ఒక ప్రత్యేక ప్రయో జనం ఉంది దాన్ని తత్కర్తే సంస్కృతంలో గ్రంథాదిలో చెప్పారు

తస్యాంధ్ర శబ్ద చిన్తామణి భారతయోర్మిథ
కేచిద్విరోధం శంకన్తేవద న్త్యన్యేతు సంగతిం
తద్విచారస్తు కర్తవ్యో భాషాజ్ఞానవతాం ముహుః
తదర్థం రచ్యతే నన్నయార్య భావ ప్రకాశికా
ఉద్ద్యోతినీ సమాఖ్యేయం వ్యాఖ్యా కాశ్యపగోత్రిణా

రామశాస్త్ర్యభిధానేనాంధ్ర శబ్దచింతామణేర్ముదా
అసూయా మత్సరౌ హిత్వా వస్తుతత్త్వ విభావకై
గృహ్యతామితి చార్థ్యన్తే సన్తో సన్తోఽపి వాఽనిశమ్ (ఉద్ద్యోతినీ–పీఠిక)

ఆంధ్రశబ్దచింతామణికీ నన్నయ భారతానికీ విరోధ ముందని కొందరూ సాంగత్య ముందని మరికొందరూ అనడం చూచి ఆ వివాద పరిష్కారార్థం ఈ వ్యాఖ్య చేస్తున్నట్లు వ్యాఖ్యాత చెప్పారు అసూయామత్సరాలు వదలి వస్తు తత్త్వాన్ని గ్రహించమని పరితల్ని కోరడంగూడ మెచ్చదగిన అంశమే అయితే ఆయన వస్తుతత్త్వ పరిశీలనా దృష్టితో నన్నయ భారతం ఈ చింతామణి లక్ష్య లక్షణా లౌతాయేమో చూచి ఉంటే మంచి ఫలితం వచ్చి ఉండేది కాని ముందే చింతామణికి లక్ష్యంగా భారతాన్ని ప్రకటించి తీరవలసిందే అనే నిశ్చయంతో పరిశీలనకు ఉపక్రమించడంతో వ్యాఖ్యలో పెక్కుదోషాలు దొర్లాయి పాండిత్య మెంత ఉన్నా నిజానిజాలు వ్యక్తం చేయడం అసాధ్యం కదా క్రింది సూత్రాల్ని వాటికి నన్నయ భారతోదాహరణలుగా ఆయన చూపిన భాగాల్ని పరిశీలిస్తే శాస్త్రిగారి వస్తు తత్త్వ పరిశీలనం ఏపాటిదో తెలుస్తుంది

వికృతౌక్వచిచ్ఛలోపో మోర్ధ్ఘశ్చాత ఆదిమస్యభవేత్ (అజంత—42)

అనే సూత్రానికి నన్నయ భారతోదాహరణంగా భూరిరత్నాలయస్థుల (భార అర 3 6) అనే పదాన్ని ఇచ్చారు వారి ఉద్దేశం ప్రకారం రత్నముల–రత్నాల అనే పరిణామం పై ఉదాహరణంలో ఉంది కాని ఆ పద్యాన్ని మొత్తంగా చూచి చదివితే అది ఈ సూత్రానికి బొత్తిగా అనుదాహరణమని తేలిపోవడమేకాక శాస్త్రి గారికి సంస్కృత పాండిత్య మెంత ఉన్నా తెలుగు భాషలో వారికున్న ప్రవేశం స్వల్పమైనదని కూడా తెలుస్తుంది

కాలకల్పుల నుగ్రతేజులఁ గాలకేయుల భూరిర
త్నాలయస్థుల వీర్యవంతుల నర్ణవంబు నమస్తన
త్త్వాలి దోఁచఁగ వట్టినన్ విషయం బగున్ వధియింపగాఁ
బోలదొండు విధంబునం బరిపూర్ణ వార్ధి జలోన్నతిన్ (భార అర 3– 6)

పై పద్యంలో రత్నాలయస్థులన్ అనే పదంలో రత్న + ఆలయస్థులన్ అనేది పద విభాగమని సముద్రంలో ఉండేవారని దాని అర్థమని తెలుస్తుందిగదా

రత్నాలయ అనే సవర్ణ దీర్ఘ సంధి పదాన్ని రత్నాల+అస్థులన్ అని విడదీశారు శాస్త్రిగారు ఇక దీనిమీద వ్యాఖ్య అనవసరం.

కర్మ ప్రవచనీయకే కూర్చిః (అజంత - 7)

దీనికి నన్నయ భారతోదాహరణంగా అంబుజసంభవుంగుఱిచి (భార ఆది 2- 69) అనే పద్యభాగాన్ని ఇచ్చారు యథార్థానికి కూర్చి అనే పదం విభక్తిగా భావింపబడటం కేతన కాలానికి గూడ లేదు అతని తరువాతి వ్యాకర్త విన్నకోట పెద్దన కూడ కూర్చిని విభక్తిగా పేర్కొననే లేదు నన్నయ చింతామణి కర్తృత్వ విషయ మెలా ఉన్నా నన్నయలో కూర్చి విభక్తిగా ప్రయుక్తమై ఉంటే కేతనాదులు గ్రహించి వ్యాకరించి ఉండేవారే వారు తమ కాలానికి కాల త్రయంలో వాడే క్రియాపదాల్ని విడివిడిగా వ్యాకరించి ప్రదర్శించడం నన్నయాదుల ప్రయోగాల్నిబట్టేకదా [1] అయినపుడు నన్నయ కాలానికి ఇంకా రూపు దాల్చని విభక్తి ప్రత్యయాన్ని నన్నయలో చూపడం ఎవరికైనా ఎలా సాధ్యం? కాబట్టే సూత్రం కూర్చి ద్వితీయా విభక్తి ప్రత్యయమంటూంటే ఉదాహరణగా వ్యాఖ్యాత గుఱిచి అనే పదాన్ని చూపారు గుఱిచి అనేది సూత్రానికి అనుదాహరణమనడానికి వేరే రుజువు అనవసరం

జేస కై కొఱకూ — అజంత-22

దీనిలోని కొఱకు అనేది నన్నయకు తర్వాత విన్నకోట పెద్దన్న కాలానికి (కావ్యాలంకార చూడామణి-9-67) గాని విభక్తిగా రూపొందలేదు కాబట్టే కేతన చతుర్థీ విభక్తికి కున్ అనే ప్రత్యయాన్ని చెప్పాడేగాని కొఱకు చెప్పలేదు (ఆంధ్రభాషాభూషణం-89) అయినపుడు నన్నయలో కొఱకు అనే చతుర్థికి ఉదాహరణ ఎలా వస్తుంది? కాబట్టే ఈ వ్యాఖ్యాత ఎట్టిన భారత ప్రయోగాన్ని నీకొఱకుఁగాదు (అరణ్య-7- 67) ఇచ్చారు కై శబ్దం కు+ఐ అనే అర్థంలో నన్నయలో ఒకటి రెండు చోట్ల కనబడుతున్నా [2] దాన్ని విభక్తి ప్రత్యయంగా పేర్కొనడం కష్టసాధ్యమైన పని

---

1 చూ చింతామణిలో లక్షితమైన భాష

2 నన్నయ పద ప్రయోగ కోశం కై శబ్దానికి ఒక ఉదాహరణనే శకుని నాకై కడంగి జూదమాడెడి 2-1- 74 అని ( కాదు 2వ ఆశ్వాసం) చూపి మరొక ప్రయోగం చైద్యునకై 2-2-38 అనే దాన్ని చూపకపోవడం విచారకరం ఈ ప్రయోగాన్ని ఉద్ద్యోతిని వ్యాఖ్యాత చూపారు

అదేవిధంగా ఎదంతతా చనామ్నా మన్యతరస్యామియాన్తానామ్ అజంత-31 అనే సూత్రోదాహరణంగూడ సక్రమంగాదు[1]

వసతి రనుబంధకస్యాద్యత్ర లదర్థో వివక్షిత స్తత్ర – (క్రియా – )

దీని ఉదాహరణగా ఈ వ్యాఖ్యాత నన్నయ భారతం నుండి సేయుచున్న వాడు (ఆది – 7 – 36) అనే క్రియాజన్యవిశేషణాన్ని ఇచ్చారు సూత్రకర్త క్రియల్ని చెబుతుంటే వ్యాఖ్యాత క్రియాజన్యవిశేషణాల్ని చూపడం మరీ అన్యాయ్యమైన పని నన్నయలో బాలసరస్వతి కాలంలో ఏర్పడిన చేయుచున్నాఁడు -వంటి క్రియాపదాలు ఉండటం ఎలా సాధ్యపడుతుంది ? కాబట్టే ఏదో ఒకటి ఇచ్చేశారు వ్యాఖ్యాత

అస్తి రనుబంధక స్స్యాద్యత్రల్పదర్థో వివక్షితోధాతో – (క్రియా - 2)

దీనికీ చేయఁగలవారము (ఆది – 7 - 32) అనే క్రియాజన్యవిశేషణాన్నే నన్నయ భారతంనుండి ఇచ్చారు ఇదీ అనుదాహరణమనీ నన్నయనాటికి కాదుగదా కేతన విన్నకోట పెద్దనలకాలానికి గూడ చింతామణి సూత్రించిన వర్తమాన భవిష్యదర్థక క్రియలు చేయుచున్నాఁడు చేయఁగలఁడు – వంటివి ఏర్పడనేలేదనీ ప్రకరణాంతరంలో నిరూపించడం జరిగింది[2]

నచదేశ్యపదే (అజంత — 47)

ఈ సూత్రానికి వ్యాఖ్యాత ఏనూఱు గాడీలను (ఆది - 8 2 ) అనే వాక్య శకలాన్ని ఇచ్చారు కాని అక్కడి గాడీలను అనే పదానికి గాడిదలను అనే పాఠాంతరముందని అదే గ్రంథకృత్ప్రియు క్తమని సంస్కృత మూల పార

1 చూ చింతామణిలో లక్షితమైన భాష

2 చూ పైది

పరిశీలనంతో పాటు దేశంలోని ముద్రిత లిఖిత ప్రతుల నన్నింటినీ గాలించి ఆచార్య తూమాటి దొణప్పగారు తమ నన్నయ అన్యదేశ్యాభాసములు అనే వ్యాసంలో శాస్త్రీయంగా నిర్ణయించి ఉన్నారు కాగా ఇదీ అనుదాహరణమే అయ్యింది

ఈవిధంగా ఈ వ్యాఖ్యానంలో వ్యాఖ్యాత అసంభవాన్ని సంభవంగా చేయ దలచి చాల దొసగులు చేశారని స్పష్టంగా తెలుస్తుంది కాగా ఎ ప్రయోజనం గోరి వ్యాఖ్యారచనం జరిగిందో ఆ ప్రయోజనం నెరవేరకపోగా ప్రాచీన పండితులు కొన్ని కొన్ని సందర్భాల్లో అశాస్త్రీయ దృక్పథం విడనాడకపోవడంవలన ఎంతగా పొరబడతారో తేటతెల్లమైంది

ఈ ఉద్యోతినీ పరిశీలనంతో ఆంధ్రదేశంలో చింతామణికి లభించే వ్యాఖ్యానా లన్నింటిని గమనించినట్లయింది ఆంధ్రభాషాచరిత్రలో డా చిలుకూరి నారాయణ రావుగారు అనుబంధంగా చింతామణి హృదయమనే పేరుతో చింతామణి పై విమర్శ నాత్మక వ్యాఖ్య ఒకటి చేశారు దానిలోని ప్రధానాంశాలు లిప్యుద్ధారక శ్లోకాలవద్ద సానుబంధాలైన వర్తమాన భావ్యర్థక క్రియాపద నిర్మాణసందర్భంలో ఈ గ్రంథంలో ఉటంకించబడి ఉన్నాయి నన్నయనాటి భాషమీద మహాపరిశోధన గావించిన నారాయణరావుగారు చింతామణిని ఎట్టి పరిస్థితులలోను వ శతాబ్దిదిగా గాని నన్నయ కృతమైనదిగా గాని అంగీకరించడానికి వీలులేదని ఆ వ్యాఖ్యలో పదేపదే సోదాహరణంగా ప్రతిపాదించారు

ఆయన వ్యాఖ్యలో మనకు స్ఫురించే మరో ముఖ్యాంశమేమిటంటే చింతామణి ఒక ఉద్గ్రంథంగాని కనీసం నిర్దుష్టమైన రచనగాని కాదని దాని కర్తృత్వం వలన నన్నయకు ఆపాదించబడేది అపకీర్తిగాని కీర్తి గాదని ఈ అభిప్రాయం ఆయన నిష్పాక్షికంగా వెలువరించినదే అని ప్రస్తుత పరిశీలనంలో తేలింది

చింతామణికి మరికొన్ని వ్యాఖ్యలు నృసింహపండితీయం[2] రామకృష్ణీయం[3]

---

చూ భాషాచారిత్రక వ్యాసావళి – ఆచార్య తూమాటి దొణప్ప
ఆంధ్రసారస్వత పరిషత్ హైదరాబాద్

2 శబ్దరత్నాకర పీఠిక శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు

3 ఆంధ్రకవి సప్తశతి

చిన్నయసూరీయం[1] – ఉన్నట్లు అక్కడక్కడ గ్రంథాల్లో ఉంది కాని అవి నేడు లభించడంలేదు కృష్ణభూపాలీయ నామంతో నేటి కర్ణాటక రాష్ట్రంలో ఒక వ్యాఖ్య చింతామణిమీద వ్రాయబడినట్లు తెలియవచ్చింది కాని అదిగూడ దొరకకపోవడం వలన దాని పరిశీలనం ఇక్కడ చేయలేదు ఇక శ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రి రచించిన వైయాకరణ పారిజాత వ్యాకరణ సంహితా సర్వస్వాలు చింతామణి మాత్ర వ్యాఖ్యలని అనలేము అవి కలగాపులగపు వ్రాతలు క్రొత్తక్రొత్తగా పేర్లు నన్నయాధర్వణీయము వంటివి సృష్టించి కేవల భావనా బలంతో చింతామణి _ వికృతివివేకాల కొక అవినాభావ సంబంధాన్ని పరస్పర పూరకత్వ లక్షణాన్ని నిరూపించడానికి అన్నిటినీ మించి చింతామణి నన్నయ కృతంగా వికృతివివేకం అధర్వణకృతంగా తిరుగులేని యథార్థాలైనట్లు తాను నమ్మి లోకాన్ని బలవంతంగా నమ్మించడానికి చేసిన ప్రయత్నాలే ఆ రచనలు

వాటిలోని అంశాలు చింతామణి వికృతి వివేకాల కాల కర్తృత్వ పరిశీలనంలో విమృష్టమై ఉన్నాయి ఈవిధంగా చింతామణి వ్యాఖ్యానాల పరిశీలన కార్యక్రమాన్ని ముగించి ఇక చింతామణి ప్రభావం అనంతర వ్యాకరణాలమీద ఎలా ప్రసరించిందో గమనిద్దాం

## చతుర్థ భాగం

# అనంతర వ్యాకరణ రచనపై చింతామణి ప్రభావం

చింతామణికి కర్త దాని తొలి వ్యాఖ్యాత బాలసరస్వతే అనే నిర్ణయం పూర్వ ప్రకరణాల్లో పరిశీలనాపూర్వకంగా చేయబడింది గాబట్టి దాని రచనాకాలం 6వ శతాబ్ది చివర గాని లేక 7వ శతాబ్ది ప్రారంభంలో గాని అని చెప్పవచ్చు తనకు చింతామణి లభించిన తేదీ యిస్తూ అప్పకవి (క్రీ శ 1656) బాలసరస్వతికి తన కంటె 46 సంవత్సరాల ముందు ఆ గ్రంథం దొరికిందని చెప్పినమాట (అప్ప

---

1. చిన్నయసూరి శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

పీఠిక 83) తప్ప చింతామణిని బాలసరస్వతి ఏ సంవత్సరంలో వ్రాశాడో చెప్ప డానికి ఆధారాలు లేవు బాలసరస్వతి యితర కృతు లన్నిటిలోను చింతామణి ఉదా హృతమై ఉండటం వలన అతని రచనల పౌర్వాపర్య నిర్ణయంలో చింతామణి స్థాన మెక్కడో తెలియడం అసాధ్యమైంది ఎది ఎమైనా బాలసరస్వతి కాలాన్నిబట్టి చింతామణి రచనాకాలాన్ని గూర్చిన పైమాట సరైనదే

చింతామణి ప్రభావం అది వెలువడినవెంటనే ఆంధ్రవ్యాకరణ రచనమీద పడినట్లు లేదు 8వ శతాబ్దిలోని అడిదము సూరకవి గాని దాదాపు అదే శతాబ్దిలోని గణప వరపు వెంకటపతి గాని తమ లక్షణగ్రంథాల్లో చింతామణి ఫక్కిని స్పృశించనేలేదు అడిదము సూరకవి చింతామణి ఫక్కికను ఆదరించకపోవడానికి కారణమా అన్నట్లు తన కవిసంశయ విచ్ఛేద ఉపక్రమణికలో_

ఆంధ్ర మర్మంబు దెలియంగ ననువుపడునె ప్రకట సంస్కృత రచిత సూత్రములచేత
నవవిఁబాణిని ఘటిత సూత్రార్థసరణి తెనుఁగు టీకలచేత సాధింప నగునె
(కవిసం వి -6)

అని తెలుగుకి సంస్కృతంలో సూత్రరచన చెయ్యడం సక్రమమార్గం గాదని తన అభిప్రాయాన్ని వ్యాకరణ రచనావిధానం మీద వెలువరించాడు ఇది చాల అభినందించదగిన పద్ధతి ఇక తాను వ్యాకరణ రచనకు సగ్రమమైనదిగా ఏమా ర్గాన్ని ఎంచుకున్నాడో చెప్పాడు

కవిజన సంజీవనిలోఁదవిలిన పద్ధతులు మఱి యితర లక్షణ ల
క్ష్యవినిర్దిష్టగతుల్ చెప్పవలయుననని వేఱయొక్క పద్ధతిచేతన్
ప్రియమందఁగఁగవులు కవిత్రయ సుకవిత్వానుసరణి దప్పక కవి సం
శయ విచ్ఛేదనమను నాహ్వాయమిడి లక్షణ మొనర్తు నార్యులు మెచ్చన్
(కవిసం వి -6 7)

ముద్దరాజు రామన కవిజన సంజీవని మార్గంలో తాను వ్యాకరణ రచన చేస్తాననీ తన లక్షణాలకి మూలం కవిత్రయ సుకవిత్వమే అని అతడనడాన్నిబట్టి

చూస్తే అతడు నన్నయను చింతామణి కర్తగా అంగీకరించినట్లు లేదు పై మొదటి పద్యంలో సంస్కృత సూత్రాలతో తెలుగును వ్యాకరించడం విషయవైశద్యానికి ఉప యోగపడదని అనడం చింతామణిని తనకు పూర్వం బాలసరస్వతి వెలువరించిన వ్యాకరణాన్ని దృష్టిలో ఉంచుకొనే అని అనుకోవాలి లేకపోతే ఆ ఎత్తిపొడుపుకి అర్థసందర్భాలే ఉండవు గదా అయినపుడు వెంటనే తాను కవిత్రయ సుకవిత్వాను సరణి తప్పకుండా లక్షణ నిర్మాణం చేస్తానని అనడం నిజంగా నన్నయ్యే వ్యాక రణం వ్రాసినట్లు ఆతడు విశ్వసించి ఉంటే పొసగదు నన్నయ్య వ్రాసిన వ్యాక రణవిధానం పనికిరాదంటూ అతని రచన ఆధారంగా లక్షణాన్ని చేస్తానని ఏతెలుగు కవీ అనడు

కవిజన సంజీవనిలో వలెనే కవిసంశయవిచ్ఛేదంలో గూడ లక్షణాలు రచయి తవి లక్ష్యాలు పూర్వులవి ఇది మెచ్చదగిన పద్ధతి ఈ పద్ధతిలోని సామంజస్యాన్ని గమనించే దీనిని అప్పకవ్యాదులు గూడ అనుసరించారు పూర్వం ఇతని లక్షణ గ్రంథంలోని మొదటి రెండు తరంగాలూ సాంప్రదాయక మార్గంలో సంధులు సమాసాలు పదాలు క్రియలు-వీటి స్వరూప నిరూపణం సాధుత్వ నిర్ణయంకోసం వ్రాయబడ్డాయి ద్వితీయ తరంగం మొదట రేఫ శకటరేఫల స్వరూప స్వభావాలు వర్ణించబడి ప్రాచీన గ్రంథాలనుండి ఉదాహరణలీయబడ్డాయి చివరి మూడో తరంగం మాత్రం తద్భవ పద లక్షణ లక్ష్యాల నిరూపణంకోసం ఉద్దిష్టమైఉంది ఇతని ఈ తద్భవ లక్షణాల్ని బలారి నరసింహ రాజసింహాడు సంస్కృతీకరించి తన చింతా మణి వ్యాఖ్య కవిజనాంజనం లో కారికలుగా ప్రవేశపెట్టాడు[1] మన లాక్షణికుల్లో గుణగ్రాహిత్వం మెచ్చదగిందే కాని ఆ గ్రహించడం ప్రకటంగా నిష్కపటంగా జరిగితే మంచిది కవిసంశయ విచ్ఛేదంలో చింతామణి కల్పించిన సంజ్ఞలు గాని పరిభాషలు గాని బొత్తిగా స్వీకరించబడలేదు నకారాన్ని ద్రుతమనడం కచటతపల్ని పరుషాలనడం గజడదబల్ని సరళాలనడం కవి సంశయ విచ్ఛేదంలో లేదు కళా ద్రుతప్రకృతిక విభాగం గూడ చింతామణి మార్గంలో గాక కేతన మార్గంలో సొంత పదాలు—ఇతరాలు అన్నట్లే స్వీకరింపబడి ఉంది మహదమహత్సంజ్ఞలూ లేవు ఇవి అవి అనడ మెందుకు? చింతామణి వాసన లేదు

---

చూ చింతామణికి ఇతరవ్యాఖ్యలు

ద్రుతప్రకృతికంగా ద్రుతంగా చింతామణి పక్కిలో చెప్పవలసిన మాటను సూరకవి నాంతమని నత్వమని అంటాడు

నాంతక్రియాపదంబుల పొంతల నచ్చున్న నత్వము ధ్రువంబుగనౌ
సంతత మొదవుంబాయును చెంతల హల్లుండెనేని శ్రీశైలపతీ
(కవిసం వి – 8)

పై పద్యంలో నాంత నత్వ పదాలు అలాంటివే ఈ మార్గం కేతన వేసింది

నాంతంబైన పదంబుల పొంతన్ బైనున్న శబ్దముల కచటతపల్
దొంతి గజడదబలగు నయ్యంతనకారమగుసున్న యభినవదండీ
(అం భా భూ 34)

మహదమహత్సంజ్ఞల్ని గాక కేతన వలె (ఆం భా భూ 47) దేవ మానవ జడపదాలనే సూరవి ప్రయోగిస్తాడు

తెలియ భూతార్థ గోచర దేవమానవ క్రియాపదములు బహువచనయుక్తి
గలసి వర్తిల్లు నచ్చులు గలయకుండు హరునకై కేలుమోడ్చిరి యమరులనఁగ
(కవిసం వి –90)

చింతామణి అనుత్తమపురుష క్రియల ఇత్వానికి నిత్యసంధిని చెబితే కవిసంశయ విచ్ఛేదం వికల్ప సంధిని చెప్పింది రెండింటి నడుమ దాదాపు శతాబ్దం ఎడముంది గాబట్టి ఆ మార్పు సహజమే అనవచ్చు అమహత్తుల్ని జడపదాలనడం ఉదా —

జడపద బహువచనములకు నిడఁదగును విశేషణముల నేకవచనముల్
మృతుని ఘనకీర్తులు బెడంగడరెం దట్టములు దిశల నన్నవిధముగన్
(కవిసం వి - 07)

చింతామణి ఉనికిని బొత్తిగా గుర్తించలేదు సూరకవి అనడానికి మరొక మంచి ఉదాహరణముంది సంస్కృత ధాతువుల్ని తత్సమాలుగా మార్చేటపుడు కొన్నిటికి వికల్పంగా ఇకారాన్ని చేర్చి తరువాత ఇంచుగాగమం చేయడం

కొన్నింటికి ఇకారాన్ని చేర్చకపోవడం జరుగుతుంది ఉదా గణ్ - గణించు— గణియించు ఘట్ — ఘటించు - ఘటియించు ఆ విషయాన్ని కేతన సూత్రించాడు అతన్నిబట్టే తరువాత చింతామణి గూడ సూత్రించింది—కొంతమెరుగ్గా[1] అయితే సూరకవి ఆ విషయంలో ఏదో మార్పును సూత్రించబోయి ఆసందర్భంలో పనిగట్టుకొని కేతననే ఉదాహరించాడు గాని చింతామణిని గాదు

ప్రతిఘటించె ననెడు పట్టునఁ బ్రతిఘటియించెననఁగజెల్లు నెల్లి దముగ
ఖానుకోటితోన ప్రతిఘటియించెను హరుని దివ్యతేజమన్నయట్లు

ఆంధ్రభాషా భూషణకారుఁడు అసమస్త లఘుద్వ్యక్షరములమీఁదఁగాని వికల్పము పుట్టదన్నాఁడు చతురక్షరములమీఁద కూడ నుండవచ్చును
కవిసం వి — 00 0

ఆంధ్రభాషా భూషణంలో 52వ పద్యంగా చింతామణి క్రియాపరిచ్ఛేదంలో 36వ సూత్రంగాను ఈ సూరకవి ఆక్షేపించిన లక్షణా లున్నాయి దీన్నిబట్టి సూరకవి కాలానికి అంటే 8వ శతాబ్దికి కూచిమంచి తిమ్మకవి వంటివాడు చింతామణి మార్గాన లక్షణ నిర్మాణంచేసి అభినవ వాగనుశాసన బిరుదాలు పొందుతున్నా పండితలోకంలో చింతామణి పక్కన సరిగా నిలదొక్కుకోలేదనీ చింతామణి పక్కని ఆమోదించడానికి ఆంధ్ర వైయాకరణులకు దాదాపు 200 సంవత్సరాల కాలం పట్టిందని భావించవచ్చు 9వ శతాబ్దిలో గాని చింతామణిని నన్నయ భట్టీయంగా తెలుగుకి ఆదివ్యాకరణంగా పండితలోకం అనుకోవడం జరగలేదు

సూరకవికి చింతామణి ప్రసంగం తెలిసినదే అనుకున్నపుడు అతనికి అహోబలపండితీయంలోని వికృతివివేకాలుగా వ్యవహరింపబడే కారికల గురించి గూడ తెలిసే ఉండాలి కాని ఆ కారికల మతానికి విరుద్ధంగా—

ఇడఁగవచ్చును ల్యప్పుపై నిత్యసంధి మాత్రమొక్కొక్కచోటను
మట్టుమీఱఁ
గొలుతు నఘమడంపఁగోరిందుశేఖరు నన్నయట్లు కవిజనానుమతిని
(కవిసం వి 1–14)

---

1 చూ చింతామణికి మూలపాఠాలు

అని లక్షణం చేశాడు లక్ష్యాలు గూడ తిక్కనాదులనుండి ఉదాహరించాడు

సూరకవి సమకాలికుడే గణపవరపు వెంకటపతికవి తన ఆంధ్రకౌముదిలో కేతన మార్గంలోనే చివరివరకు రచన సాగించడం జరిగింది తన వ్యాకరణానికి సంస్కృత వ్యాకరణ గ్రంథం పేరు పెట్టినా సంస్కృతంలో వ్రాసిన తెలుగు వ్యాకరణాల మార్గాన్ని మాత్రం స్వీకరించ లేదు పాణినీయ పరిభాషల్ని జస్త్వసంధి వంటివాటిని వాడటంద్వారా తన వ్యాకరణంలో కౌముదీత్వాన్ని ప్రదర్శించాడేతప్ప అతని రచనాప్రణాళిక మొత్తం కేతన మార్గాననే సాగింది తవర కరణానికి ఇత్తుకిక్రమంగా తాంతంగా వర్ణాన్ని పదాన్ని వ్యవహరించడం (ఆం కౌ 4వ పుట) మహచ్ఛబ్దాల్ని పురుషాఖ్యలనడం (ఆం కౌ వ పుట) ద్రుతాన్ని నకారపుటిబొల్లు అనడం (ఆం కౌ వ పుట) షుంప్వాదేశాన్ని పునాదేశమనడం (ఆం కౌ 7వ పుట) వెంకటపతి కవిలో ఉన్నాయి

అంతే గాకుండా సంధులవివరణంలో చేతది–చేతియది వంటి రూపాల్ని చెప్పడం (ఆం కౌ 3వ పుట) క్రియాపదాలు దును దురు వంటి ప్రత్యయాలతో నిర్మించి చూపడం (ఆం కౌ 24వ పుట) చూస్తే ఆంధ్రకౌముది కేతన మార్గంలో రచించబడ్డ వ్యాకరణమే అని అనవచ్చు దీనివలన 8వ శతాబ్ది వైయాకరణులు తెలుగునాట చింతామణి ఫక్కిని అనుసరించడానికి సందేహిస్తూనే ఉన్నారని చెప్పవచ్చు అయితే ఆంధ్ర కౌముదిలో సప్తమీవిభక్తి ప్రత్యయ నిర్దేశాన్ని వర్తమానార్థక క్రియాపద నిర్మాణాన్ని గమనిస్తే తెలిసో తెలియకో వైయాకరణుల్లో ఈషణ్మాత్రంగా చింతామణి ఫక్కి వ్యాపిస్తున్నదని గూడ అనవచ్చు

ఇందు నందు ననంగ నివియ సప్తమిగనొప్పు (ఆం కౌ 6వ పుట)

పురుషులఁజెప్పునప్పుడె యాఁడనఁగవచ్చి మునిపల్కుచున్నాఁడ ననఁగ
(పైది 24 పుట)

అయితే 20వ శతాబ్దిలో కేతన మార్గానికి చింతామణి మార్గానికి వ్యాకరణాల్లో ప్రసిద్ధ విషయంలో ఎంత వ్యత్యాసముందో అంత వ్యత్యాసం 8వ శతాబ్దిలోనూ తత్పూర్వమూ చింతామణిమార్గానికి కేతనమార్గానికిఉన్నదనడం యథార్థం అంటే నేటి

చింతామణి ఫక్కీవలె నాదు కేతన మార్గమే తెలుగునాట వైయాకరణు లందరూ అనుసరించేవారన్నమాట

తరువాతికాలంలో చింతామణిమీద అది నన్నయ కర్తృకమన్నభ్రాంతి మూలంగా తెలిసీ తెలియని స్థితిలో ఒక అఖండగౌరవం ఏర్పడింది తెలిసీ తెలియని స్థితి అని అనడానికి ఒక మంచి ఉదాహరణం 19వ శతాబ్ది చివర అంటే 1894 ఆగస్టు 28వ తేదీన ఆంధ్రభాషాభివర్ధినీ సమాజం లో (నెల్లూరులో) ఆంధ్రభాషా చరిత్ర సంగ్రహము నే పేరుతో ఒక వ్యాసం శ్రీ మంగు వెంకట రామానుజరావుచే చదువబడి తరువాత ప్రకటించబడింది—గ్రంథరూపంలో[1] దానిలోని ఒక చిన్న పేరా పరిశీలిస్తే ఆనాటి నగటు పండితుల పరిజ్ఞానం చింతామణి విషయంలో ఎలా ఉండేదో గమనించవచ్చు

ఇటీవల నన్నయభట్టీయమునకు అప్పయ్యదీక్షితుడు కవిశిరోభూషణము అను సంస్కృతవ్యాఖ్యానమును వ్రాసెను ఈయన యహోబలపండితుఁ డగుటచే నీ వ్యాఖ్యానమునకు నహోబలపండితీయ మన పేరును గలదు

ఆధునికులలో నన్నయభట్టీయమునఁగాని యధర్వణకారికావళిలోఁ గాని యప్పకవీయమునందుఁగాని లేనివిశేషాంశములఁ బ్రయోగమననుసరించి వ్యాకరణమును వ్రాసినది చిన్నయసూరియు సీతారామాచారియు ఇఁక నేషాతయోర్వికృతిః అను సూత్ర భాగమును విమర్శింతము వికృతమున దేశ్యమును నన్నయ చేర్చలేదని మనము శ్లోకములోని కేవలతయానుసర్పత్యభేదేయం యథాతథాభాషా అను సూత్రమే ప్రమాణము

ఇది ఒక సభలో చదువబడి తరువాత ముద్రితమైన వ్యాసం గాని ఒక వ్యక్తి ఏకాంతంగా నిర్మించినది గాదు 19వ శతాబ్దిలో తెలుగునాట తెలుగుకి బ్రహ్మరథం పట్టాలనే ఉత్సుకత తెలుగుజాతి ఔన్నత్యాన్ని యావద్భారతానికి చాటాలనే ఆరాటం విద్యావంతుల్లో అధికంగా ఉండేవి ఆకాలంలో తెలుగుకు సంస్కృతంలో వ్యాకరణం ఆదికవి నన్నయ వ్రాసి ఉంటాడనుకోవడంలో గూడ

---

1. గౌతమీ గ్రంథాలయం—రాజమండ్రిలో ఈ వ్యాసముంది

ఒక ఔన్నత్యభావం స్ఫురించి తెలుగు పండితులు చింతామణిని తొలి వ్యా రణంగా నన్నయకృతంగా గతానుగతికంగా అనుకొన్నారు అయితే ఆ పొంగు కొంత తగ్గి శాస్త్రీయ దృక్పథమూ హేతువాదమూ తెలుగునాట కందుకూరి వీరేశలింగం గారి రాకతో ప్రాంరంభం కాగానే చింతామణి ప్రభ తగ్గడం ప్రారంభించింది ఈ మధ్యకాలంలో అంటే వీరేశలింగం గారికి ముందు 8వ శతాబ్ది ముగిసిన తరువాత చింతామణి ఫక్కి తెలుగునాట తామరతంపరగా వెల్లివిరిసింది బ్రిటిషువారి పాలనలో తెలుగు చదువు దానిలో వ్యాకరణం అవసరమై పండితులు చాలమంది నన్నయభట్టీయంగా తామనుకున్న చింతామణి ఫక్కికి అనువాదాలు అనుసరణలూ తండోపతండాలుగా చేశారు మద్రాసులో హైదరాబాదులో ఏలూరులో రాజమండ్రిలో కాకినాడలో అనకాపల్లిలో మచిలీపట్టణంలో ఎన్నో తెలుగు వ్యాకరణాలు విద్యార్థుల ఉపయోగార్థం వివిధ పండితులచేత వివిధ భంగిమలలో వ్రాయబడి ప్రచురించబడ్డాయి అయితే భంగులు భంగిమలుఎన్నైనా అన్ని వ్యాకరణాల మూలపదార్థమూ ఒకటే అది చింతామణి ఫక్కి అందరూ అన్ని గ్రంథాల్లోను చింతామణి మార్గాని అంటే అది కల్పించిన సంజ్ఞలు వాడిన పరిభాషలు గుప్పించి మక్కికి మక్కిగా కొందరు కొంత స్వాతంత్ర్యంతో కొందరూ రచనలు చేశారు అయితే ఒకవిధంగా చూచినపుడు ఆ అన్నివ్యాకరణాలు చింతామణి మూసలో పోతపోయబడినట్లే కనిపిస్తాయితప్ప వాటి రచనా స్వాతంత్ర్యం అత్యల్పమే అనక తప్పదు ఉదాహరణగా ఆనాటి కొన్ని వ్యాకరణాల రచనా ధోరణుల్ని పరిశీలిద్దాం

## పట్టాభిరామ పండితీయము

వేదము పట్టాభిరామశాస్త్రిగారిచే రచించబడి ఆయన పేరుతో ప్రసిద్ధమైనది ఆయన 8వ శతాబ్ది ప్రారంభంలో ఈస్టిండియా కంపెనీవారి ఫోర్టుసెంటుజార్జి కళాశాల మద్రాసులో సంస్కృతాంధ్ర పండితులుగా పనిచేశారు ఆయన ఆ కళాశాలలో క్రీ శ 820 వరకు పనిచేసి మరణించినట్లు కంపెనీవారి ప్రకటన ఒకదానివలన తెలుస్తుంది ఈయన వ్యాకరణం చింతామణికి అనువాదం అజంత పరిచ్ఛేదం

---

చూ పట్టాభిరామ పండితీయ ఎరిక–22–6–950 నాటి త్రిలింగ పత్రిక నుండి ఉద్ధృతం

లోని తోడవిభక్తిప్రత్యయ విధానం వరకే ఇతని అనువాదం లభిస్తుంది తరువాత అనువదించలేదేమో గ్రంథాంతాన సమాప్తము అనే మాట గూడ ఉంది చింతామణి అజంతపరిచ్ఛేదంలోని తోడసహార్థేటాస (28) అనేదానివరకున్న 7 సూత్రాల్ని 22 పద్యాలుగా తెనిగించారు సంజ్ఞా సంధిపరిచ్ఛేదాలు మొత్తమూ అజంత పరిచ్ఛేదంలోని 28 సూత్రాలూ అనూదితాలై నాయన్నమాట

అనువాదం మూలవిధేయంగానే జరిగినా అక్కడక్కడ సూత్రాల పరిధిని పెంచి మెరుగుపరచి వ్రాసిన జాడలు గూడ కనిపిస్తున్నాయి సంజ్ఞాపరిచ్ఛేదంలోని విశ్వశ్రేయ కావ్యమ్ ఇత్యాది సూత్రాలు మాని ఆద్యాయా పంచాశద్ వర్ణా అనే సూత్రం నుండి వ్యాకరణానువాదం చేయడం ఈయన వహించిన స్వాతంత్ర్యం బహుశ ఆ వరవడినే అనంతరవ్యాకర్తలు(వ్యాకర్త లంటే వ్యాకర్తలుగారు అనువక్తలూ అనుసర్తలు మాత్రమే చింతామణికి) పాటించడం వలననే తెలుగు వ్యాకరణాల ప్రారంభం అక్షర సమామ్నాయంతో స్థిరపడి ఉంటుంది కేతనాదుల వ్యాకరణాల్లో ప్రారంభంలో గాని మధ్యలో గాని అంతాన గాని అక్షర సమామ్నాయ వర్ణనం లేదు వ్యాకరణాంశాల్లో అక్షరమాలని ఒనగడ మనే వద్ధతిని తొలుత అనంతుడు ప్రవేశపెట్టినట్లు అతని ఛందోదర్పణం చతుర్థాశ్వాసం 09 0 పద్యాలవల్ల తెలుస్తుంది ఆ వద్ధతినే బాలసరస్వతి కొంత మార్చి సంస్కృత ప్రాకృతాలు తెలుగుకి మూలాలనే ప్రతిపాదన కారణంగా అయాభాషా వర్ణాల నిర్దేశంతో చింతామణి రచన సాగించాడు చింతామణి—

అద్దన్త్యస్తాలవ్యశ్చర్వకశ్రిస్పాస్త్యత్ మిథస్సవర్ణశ్చ —సంజ్ఞ 27

అని దంత్య చజలు అత్తుతో తాలవ్య చజలు ఎ ఒలతో ఉంటాయని సూత్రిసే పట్టాభిరామపండితీయం దానిని వ్యాఖ్యానించినట్లు—

అ ఆ లను ఉ ఊ లనట్లుగా నొ ఓలతోడ నొప్పరంబుతోడఁ గూడు చజలు దంత్యములగు —(పట్టాభి 2 ) నని అనువదించడం మెచ్చదగిన అంశం అలాగే లఘు వోఽలఘువశ్చేతి ద్వేధా నస్తాన్ విదన్తి శాస్త్రార (సంజ్ఞ 22) అనే సూత్రాన్ని అనువదిస్తూ అలఘు లకారానికి స్వరూప నిర్ణయం చేయడం ఈ వ్యాకరణంలో గమనించదగిన అంశం ఏలు గోరు పాలన్నచో నేళ్ల గోళ్ల పాళ్లని రలాదులను గొట్టి వచ్చునట్టి లాక్షర మలఘు పెలయంత లఘువు బెళుకు తళుకను

నదియు నలఘుగాఁబలుకుదు రిల -(పట్టాభి 0 ) ఇతని ఈవ్యాకరణ మార్గమే చింతామణి అనువాదాలు అనుసరణ లన్నింటిలో తరువాతి కాలంలో స్వీకరించబడి ఉంది

సంధి పద నిర్వచనం (పట్టాభి 30) గూడ అనంతర తెలుగు వ్యాకర్తలకు మార్గదర్శకంగా చేశారీయన అయితే ఈ నిర్వచనానికి అప్పకవీయ మూలకమైన వికృతి వివేక కారిక మూలం1

పట్టాభిరామ పండితీయంలో చింతామణి విధేయత అధికంగా ఉందనడానికి చింతామణిలో వలెనే దీనిలో గూడ పదమధ్యాఙ్లోపం సంధిపరిచ్ఛేదాంతంలోనే సూత్రించబడడం ఒక నిదర్శనం చింతామణిలోని అజంత పరిచ్ఛేదాన్ని ఈ వ్యాకరణం శబ్దపరిచ్ఛేద మనేపేర తెనిగించడం జరిగింది పేరునుబట్టి చూస్తే దీనిలో అజంత హలంత శబ్దాలు అన్నింటినీ సూత్రించదలచినట్లు తోస్తుంది కాని అజంతపరిచ్ఛేదంలోని విభక్తివిధానమే సంపూర్ణంగా జరగకుండా గంథం నిలిచిపోవడం జరిగింది త్రిలింగలక్షణ శేషకర్త తన వ్యాకరణంలో శబ్దపరిచ్ఛేదమని ఒక విభాగం చేసి అజంత హలంత శబ్దాల ప్రక్రియను దానిలో ప్రదర్శించడం బహుశ ఈ వ్యాకరణాధ్యయనంవలని సంస్కారంవలన జరిగి ఉండవచ్చు

తెనుఁగు వ్యాకరణము

కాలాన్నిబట్టి చూచినపుడు పట్టాభిరామపండితీయం తరువాతిది రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెనుఁగు వ్యాకరణం ఈయన క్రీ శ 770 నుండి 836 వరకు జీవించి ఉన్నారు ఈ వ్యాకరణం తొలిముద్రణం శాలివాహన శకగత సంవత్సరములు 758లో దుర్ముఖినామ సంవత్సరంలో చర్చి మిస్సయాన్ ప్రెస్సులో జరిగినట్లు ముఖపత్రంమీద ఉంది

ఈ వ్యాకరణానికి మూల గ్రంథాలు నన్నయభట్టీయం బాలసరస్వతీయం అహోబలపండితీయం పట్టాభిరామీయం అప్పకవీయం (ఈ వరుస గ్రంథకర్త

---

ఆద్యన్త వర్ణయోరైక్యం సంధిరిత్యుచ్యతేబుధైః
పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్ చూ కారికల మూలపాఠాలు

క్రియాప్రకరణానికి అధికప్రాధాన్య మిచ్చారు - వ్యాకర్త మిగిలిన ప్రకరణాలన్నీ 90 పుటలలో ముగిస్తే క్రియాప్రకరణం మాత్రం 74 పుటలు విస్తరించి ఉంది ధాతువులు క్రియలు సరిగా అవగాహన కావడం కోసం పట్టికవేసి ప్రదర్శించడం గూడ ఆ కాలానికి ముందు చూపుతో గూడినపని

పరుష సరళ స్థిర సంజ్ఞలు కళాద్రుత ప్రకృతిక విభాగం మహదమహ ద్భేదం తద్ధర్మ క్రియ వంటి చింతామణి సంప్రదాయ చిహ్నాలు వ్యాకరణంలో పుష్కలంగా ఉన్నాయి వ్యాకరణ రచనకు మూల పదార్థం చింతామణే అయినా నిర్మాణంలో భేదముంది ఆంగ్లేయుల ప్రభావం విద్యార్థుల అవసరాలు కారణంగా ఆ భేదం ఏర్పడి ఉండవచ్చు ఆ కాలంలో ఈ వ్యాకరణం మంచి వ్యాప్తిలో ఉండేదని అనుకోవాలి—వ్యాకర్త వ్యక్తిత్వాన్ని అతడు నిర్వహించిన పదవినిబట్టి చూస్తే ఈ విధంగా చింతామణి సంప్రదాయం ఆంధ్ర వైయాకరణుల్లో స్థిరపడ టానికి రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి సేవ అమోఘ మైనదిగా గుర్తించవచ్చు

*బాలవ్యాకరణము*

గుణాన్నిబట్టి తెలుగు వ్యాకరణా లన్నిటిలో మొదటిదయినా కాలాన్నిబట్టి బాలవ్యాకరణానికి 9వ శతాబ్దిలో వెలసిన వ్యాకరణాల్లో తృతీయస్థానమే ఈయవలసి వచ్చింది చిన్నయసూరి వ్యాకరణ రచనలో ఎన్నో ప్రయత్నాలు ప్రయోగాలు వివిధరీతులలో చేసి చేసి చివరకు బాలవ్యాకరణాన్ని సంతరించ గలిగినట్లు అతని వ్యాకరణ రచనల పరిశీలనం వలన తెలిసికోవచ్చు బాలవ్యాకరణం తొలిముద్రణ 858 లో సూరి పర్యవేక్షణలో జరిగినట్లు దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు వ్రాశారు (రమణీయము)

సంస్కృతంలో అయితే సంక్షిప్త రచనకు అనుకూల్య ముంటుంది పురా నిర్ణీతమైన సంప్రదాయం పరిభాషలు ఉంటాయి—అనే దృష్టితో సూత్రాంధ్రవ్యాక రణం రచించి ఉంటారు——సూరి సంస్కృత ప్రాభవం విషయంలో ఆయన దృష్టి సక్రమమే అయినా అన్యభాషలో భాషను వ్యాకరించి చూపడం అనేక క్లేశా లకు కొరతలకు కారణమౌతుందని తరువాత చూచుకొని గ్రహించి ఉంటారు చిటితాదౌ చేర్లోప పోతౌ తద్ధితే వంటి సూత్రాలతో స్వాభిప్రాయావిష్కరణం దుష్కరమని గుర్తించి ఉంటారు

అధ్యయనానికి అనువుగా ధరించడానికి వీలుగా ఉంటుంది కాబట్టి ఛందోబద్ధంగా వ్యాకరణాన్ని నిర్మించాలని భావించి ఉంటారు ఫలితంగా పద్యాంధ్ర వ్యాకరణం వెలువడింది అయితే సూత్ర రచనకూ ఛందస్స్వీకర్యానికి పొత్తు కుదరదని స్వానుభవం వలన గ్రహించి ఉంటారు కాగా ఆ మార్గం విడిచిపుచ్చవలసి వచ్చి ఉంటుంది

ఆద్యభాషకు నే(బది యక్షరములు ప్రకృతికవి పది కొలవడి వఱలునిందు
ముప్పదాఱగు నవి యన్యములును శబ్దయోగవశమునఁ బిఱునొచ్చు
సుదధిశయన

వంటి రచన ఆయన ఆమోదాన్ని పొందలేకపోయింది

సంస్కృతానికి సంస్కృతంలో వ్రాసినట్లు తెలుగుకి తెలుగులోనే శబ్దానుశాసనం చేద్దామని భావించి రచనా మార్గాన్నిమాత్రం సంస్కృతంలోని ప్రసిద్ధాంధ్ర వ్యాకరణమైన చింతామణి ఫక్కీలోనే వేసికొని ఉపక్రమించారు ఫలితంగా ఆంధ్ర శబ్దానుశాసనము వెలువడింది అయితే చింతామణిని ఎంత సుందరము సులభమూ అయిన శైలిలో అనువదించినా తెలుగువారికి కావలసిన వ్యాకరణజ్ఞానం దానివలన సరిగా కలగడం అసాధ్యమని అనుభవమే నేర్పి ఉంటుంది కాగా ఆ మార్గమూ పరిత్యక్తమే కావలసి వచ్చింది

స్రంస్కృత ప్రాకృతంబులు ప్రకృతులు
ఈయది వికృతి
ఆద్యప్రకృతికి వర్ణము లే(బది
ద్వితీయంబునకు ఋగ్వక్రశమ జ ఞ శ ష లు ద్రిక్కనగు
ఇట ముప్పదియాఱు —

వంటి తెలుగు శబ్దానుశాసనాలతో (సూత్రాలతో) ఆయన సంకల్పించిన వ్యాకరణం ఎర్పడదని తెలిసి ఉంటుంది

సూత్రాలు అల్పాక్షరాలతో అసందిగ్ధంగా ఉండాలి గాని అనువృత్త్యావృత్తుల్ని తెలుగు సూత్రాల్లో ప్రవేశపెడితే అసందిగ్ధత లోపిస్తుందని గ్రహించి సూత్రాల్ని సాధ్యమైనంత స్వయం సంపూర్ణంగా నిర్మించాలని సంకల్పించి శబ్దలక్షణ సంగ్రహాన్ని చేసి ఉంటారు కాని —

జడ్డ లోపంబున నిత్యంబు — శబ్దలక్షణ సంగ్రహం — 3 — 79
టింటులు కిత్తులుం గలవు — — 3 — 204
భేద్యంబు రా నిగాగమంబగు — — 6 — 92

వంటి సూత్రాలు స్వయంగా వృత్తి వ్రా ఉదాహరిస్తేతప్ప అవగతం కావని స్ఫురించి పై రచనకే మెరుగులు దిద్ది తిరిగి వ్రాసి దానికే వృత్తినీ ఉదాహరణల్నీ సంతరించడంతో బాలవ్యాకరణం రూపు దాల్చింది అని భావించవచ్చు

పై ప్రయోగాలు చేసే సమయంలోనే స్వత ప్రతిభావంతుడు గాబట్టి తెలుగు విభక్తుల స్వరూపస్వభావాల్ని విడిగా వ్యాకరించి చూపవలసిన అవసరమున్నట్లు భావించి విభక్తిబోధిని ని ప్రయోగ దృష్టితోనే నిర్మించి ఉంటారు దీనిలో విశేషం – ప్రశ్నోత్తర రూపంలో వ్యాకరణజ్ఞానాన్ని అందించడం విభక్తి నిర్వచనాన్ని —

విభక్తి యనఁగా నేమి?

కర్తృ కర్మాద్యర్థములను దెలుపునదియై శబ్దముల మీదను గ్రియల మీదను వచ్చునది ఈ విధంగా చిన్నయసూరి తాను లోకంలోనికి వచ్చినది వ్యాకరణ మొకటి తెలుగు వారికి నిర్మించి యిచ్చిపోవడం కోసమే అన్నట్లు తన శక్తి యుక్తుల్నీ కాలాన్ని వ్యయపరచి వివిధ ప్రయోగాల ఫలితంగా బాలవ్యాకరణాన్ని నిర్మించి తెలుగు జాతికి ఇచ్చిపోయారు

బాలవ్యాకరణంలోని సూత్ర నిర్మాణ కౌశలం వృత్తి – ఉదాహరణలు ఒసగడంలోని అందచందాలు అసలు రచనాప్రణాళికను నిర్మించుకొనడంలోని ప్రతిభావ్యుత్పత్తులు అవగాహనకు రావాలంటే ఆంధ్రవ్యాకరణాల పుట్టుపూర్వోత్తరాలు గమనించాలి ఒక్కొక్క వ్యాకర్త ఒక్కొక్క ఫక్కిల్లో లక్షణావిష్కరణం చేస్తాడు అయితే ఆ ఫక్కిక లోకారాధ్యం కావాలంటే దానిలో ఎంతో

---

మిగిలిన సూరి వ్యాకరణాల్లో సూత్ర సంఖ్య ఒసగబడలేదు

సామాన్యంగా కనిపించే అసామాన్య శక్తి దాగి ఉండాలి లేకుంటే ఆ గ్రంథం ప్రసిద్ధినీ ప్రశస్తినీ పొందలేదు 19వ శతాబ్దిలో తెలుగుకు సరైన వ్యాకరణ రచనాసరణిని కనిపెట్టడానికి ఎందరో ఎన్నో ప్రయత్నాలు చేశారు చివరకు అందరి ప్రయత్నాలు ప్రయోగాలు చిన్నయసూరి బాలవ్యాకరణావతరణంతో ముగిసాయి కాని బాలవ్యాకరణానికి సమకాలంలో అనంతర కాలంలో గూడ ఎన్నో వ్యాకరణాలు తెలుగులో వెలిశాయి వాటి రూపురేఖలు ఏమిటో పరిశీలిద్దాం

## ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము

ఇది చిన్నయసూరి సమకాలికులు శ్రీ పుదూరి సీతారామశాస్త్రిచే ప్రణీతం బాలశిక్ష గా సుప్రసిద్ధమైన పాఠ్య గ్రంథానికి గూడ ఈయనే రచయిత ఈ వ్యాకరణం గూడ రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారి తెనుగు వ్యాకరణం వలెనే మహారాజరాజశ్రీ మేస్తరు కుకలోదొర గారి యనుజ్ఞవడసి నన్నయభట్టీయము మొదలగు నాంధ్రవ్యాకరణముల శోధించి సుఖముగా బాలురకు బోధకలిగెడు కొరకు నేర్పరచినదని ఎరికవల్ల తెల్లమౌతుంది సంజ్ఞా సంధి శబ్ద కారకాది క్రియా పరిచ్ఛేదాలని ఐదుగా విభక్తమైంది ఈ పరిచ్ఛేదాల్లో ఉపవిభాగాలు కూడ సంజ్ఞా పరిచ్ఛేదంలో భాషా వర్ణ నామ ప్రకరణాలు అన్నట్లు ఉన్నాయి తొలిముద్రణ 1852 లో జరిగినట్లు మూడో ముద్రణలో 95 లో (వావిళ్ల) చెప్పబడి ఉంది

ఇది పేరుమబట్టే ప్రశ్న — సమాధాన రూపంలో ఉందని తెలుస్తూనే ఉంది మొదట ప్రశ్న ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణంబున నెన్నిపరిచ్ఛేదములు అని ప్రకరణాలు పరిచ్ఛేదాలు ఎన్నైనా దీనికి గూడ ముడివదార్థం చింతామణే చింతామణి సంజ్ఞలు పరిభాషలు రచనా ప్రణాళిక సమగ్రంగా స్వీకరించబడ్డాయి-దీనిలో

చింతామణి ఏషాతయోర్భవేద్వికృతి (సంజ్ఞ ) అని అంటే ఈ

వ్యాకరణం ఆ మాటను —

ప్రశ్న ః ఆంధ్రభాష యేలాగు పుట్టినది

ఉత్తరము  సంస్కృత ప్రాకృత భాషల వలన బుట్టినది

అని మార్చి వ్రాసింది మిగిలిన రచనను గూడ ఈ ఉదాహరణను బట్టి అవగాహన చేసికోవచ్చు సంధ్యాదీతర పరిచ్ఛేదాల్లో గూడ చింతామణిచ్ఛాయ అడుగడుగున కనిఎస్తూనే ఉంది ఈ వ్యాకరణం చివరి ప్రశ్నోత్తరాల్ని పరిశీలించి వ్యాకరణాంతరానుశీలనం చేద్దాం

ప్రశ్న : తత్సమ క్రియల కంటెను దేశ్యక్రియలకు పురుషల యందును నర్థముల యందును వచనముల యందు నేమి విశేషము? అపుడు వానికి నుదాహరణము లేలాగు?

ఉత్తరము : కొన్ని దేశ్యక్రియలకు వర్ణాగమంబు విశేషంబు వానికి వచ్చు చున్నాఁడు రాఁడు రాఁగలఁడు వచ్చు వత్తురు రిప్పించెన్ రావించెన్ అని ఉదాహరణంబులు

ఈ ప్రశ్నోత్తరాలు చింతామణిలోని క్రియాపరిచ్ఛేదాంత సూత్రం వర్ణాగమోవిశేష పురుషేష్వర్థేషుచాఽ వచనేషు అనేదానికి తెనిగింపని వేరే చెప్పవని లేదు బాలసరస్వతీయ వ్యాఖ్య ప్రకారం చింతామణి తెనిగింపు ఈ వ్యాకరణంలో జరిగింది

ఈ ప్రశ్నోత్తర రూపంలోనే కనిఎంచే మరొక వ్యాకరణం —

## ప్రశ్నోత్తరదీపకము

దీని కర్తపేరు సంక్షిప్తంగా శ్రీం స అని ఉంది దీనిలో సంజ్ఞా సంధి తద్భవ తత్సమ తద్ధిత సమాసాతిదేశ వాక్య క్రియా కృదంతాలు ఉపన్యాసఫక్కి ప్రశ్నోత్తర రూపానఁ జెప్పుట జరిగింది ఇదీ ఈ కాలంలోని ఇతర వ్యాకరణాల లాగ చింతామణి ఫక్కిలోనే రచించబడింది 899లో పకటితం

ప్రశ్న  వక్రతమము లిందెవ్వి?

ఉత్తరము  ఏ ఓ లు వక్రములు ఐ ఔ లు వక్రతమములు

ప్రశ్న : సిద్ధ సాధ్య బిందువు లెట్టివి

ఉత్తరము అఱ నెఱ సున్నలు శబ్దసిద్ధములైనవి సిద్ధములు కలఁగి
యందు సంధివలన వచ్చినవి సాధ్యములు చేసెఁగావ్యము

ప్రశ్న గ్రామ్య మనఁగా నెట్టిది?

ఉత్తరము దేశభాషలలోవి తప్పుమాటలు వస్తాదు వోతే

ప్రశ్న సంధి యన నేమి?

ఉత్తరము : పూర్వ పర స్వరములకుఁ బరస్వరైక్యము

ఇది ఆనాటి విద్యార్థుల పాఠ్య గ్రంథంగా రచితమైనట్లు కర్త స్వయంగా చెప్పాడు అనుగుణంగానే వ్యాకరణం చివర తాడిచెట్టు చిలుక పేను ఆవిరి యంత్రము మొదలైన అంశాలపై పుటకుమించని చిన్నవ్యాసాలు ఉత్తరం చేర్చ బడ్డాయి కాగా ఆ కాలంలో కొన్ని వ్యాకరణాలు తాత్కాలిక ప్రయోజనాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని వాచకాల వలె వ్రాయబడిఉన్నట్లు గ్రహించవచ్చు

ఆనాటి బడిపిల్లలకోసమే వ్రాయబడిన చిన్న చిన్న వ్యాకరణాలు 19వ శతాబ్ది చివరలో 20వ శతాబ్ది ప్రారంభంలో కొన్ని కన్పిస్తున్నాయి

*పద్యాంధ్రవ్యాకరణము*

కర్త – మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారు క్రీ శ 1897 లో ఏలూరులో ముద్రితం వర్ణ 2 శబ్ద 3 వాక్య 4 ఛంద పరిచ్ఛేదాలున్నాయి 94 పుటల గ్రంథం ఉప విభాగాలు అనేకం దీనికి ఆంగ్లంలో వ్రాసిన ముందుమాటలో ఈ వ్యాకరణం విద్యార్థులకోసమే వ్రాసినట్లు ఈ తెలుగులో వ్రాసిన ఎరికలో ఈ వ్యాకరణం అన్ని తరగతుల విద్యార్థులూ చదువ వచ్చునని తెల్పబడింది

చింతామణి ప్రతిబింబాల వంటి పద్యాలు అధికంగా ఉన్నాయి వికృతి వివేకచ్ఛాయ గూడ అక్కడక్కడా ఉంది

సిద్ధసాధ్య భేదమున బొట్లు ద్వివిధమై యుండు
వర్ణ లోపాగమ వ్యత్య యాదేశాది వికృతిని జెందిన ప్రకృతినిందుఁ
దద్భవ మందురు

## తెలుగు వ్యాకరణము

కర్త—బులుసు పాపయ్యశాస్త్రిగారు మఖపత్రంమీదే ఆరంభ పుస్తకము అని ఉంది 906 లో ముద్రితం— అనకాపల్లిలో

దీనిలో స్థూలంగా తెలుగులో పదాల విభాగం తత్సమాలు ఏర్పడే రీతి ధాతువుల తెలుగులో చేరేటపుడు పొందే మార్పు చెప్పబడింది సంజ్ఞా పద క్రియా వాక్య పరిచ్ఛేదాలునా యి ఉప విభాగాలు మెండు ఈ రచనపై చింతామణి కంటె బాలవ్యాకరణమే ఎక్కువ ప్రభావం నెరపినట్లుంది–ఔపవిభక్తి కాలు ఇ టి తి అని చెప్పటం ను వర్ణాన్ని ద్వితీయగా చెప్పడం - మొదలయిన విదర్శనాల వలన

## ఆంధ్ర వ్యాకరణము

కర్త—శృంగారకవి వెంకట్రామయ్య గారు క్రీ శ 904లో కాకినాడలో ముద్రితం ప తరగతినుండి వ ఫారమువరకు పాఠ్యపుస్తకమట 24 పుటల చిన్న గ్రంథం అయినా చింతామణి పక్కలోనే ఉంది- తెలుగునకు వికృతి యని పేరు

## The ower Seco dary Te ugu made ea y

కర్త—బుద్ధిరాజు ఈశ్వరప్ప గారు ఏలూరులో 899 లో ముద్రితం ప్రశ్నోత్తర రూపంలో వర్ణ పద పరిచ్ఛేదాల్లో అనేకాంశాలు చింతామణి పక్కలోనే ఘటించబడ్డాయి నానార్థాలు ప్రకృతి—వికృతులు వాక్య పమ్మేళనం వాక్య విభాగక్త నామెతలు వంటి విభాగాల్నిబట్టి ఇది కేవలం ప్రాథమిక కక్ష్యల వారి కుం రేవైనమైనట్లే తెలుస్తుంది

## ఆంధ్ర వ్యాకరణము

కర్త—తా వెంకయ్య గారు క్రీ శ 89 లో Empress of Ind a Press చెన్నపట్నంలో ముద్రితం తరువాత వావిళ్ల వారిచేత గూడ 98 లో ముద్రించబడింది ఈ వ్యాకరణం పాఠశాలోపయోగార్థము వ్రాయబడినట్లు చెప్ప బడింది చింతామణి ప్రతిబింబాలైన సూత్రాలు అనేకం సంజ్ఞా 2 సంధి 3 అజంత 4 హలంత 5 క్రియా పరిచ్ఛేదాలు చింతామణిలో వలె ఉన్నాయి

సంస్కృతంబు ఆద్యప్రకృతి – సంజ్ఞ 3

సమానంబులం దంతట ద్రుతంబునకు లోపంబు గలుగును – సంధి 24

విద్యార్థుల ఉపయోగంకోసం ఆయా ప్రకరణాల చివర అభ్యాసాలు ఇవ్వ బడ్డాయి చిన్నయసూరి ప్రభావం ఆనాటికే అన్యవ్యాకర్తల మీద బాగా ప్రసరించింది అఁట ఇఁక చుఁడు అను శబ్దములం దక్క మొదటి హ్రస్వంబు మీ ద అరసున్న యుండదు — సంజ్ఞ 4

## ఆంధ్ర వ్యాకరణము

కర్త – ఎ గున్నయ్య గారు క్రీ శ 97 లో హైదరాబాదులో ముద్రితం నాటి నిజాం విద్యాధికారి ఈ పుస్తకాన్ని చూచి మెచ్చుకుంటూ వ్రాసిన ఉత్తరం ఆంగ్లంలో దీనిలో ముద్రితమై ఉంది చింతామణి ఫక్కిలోనే సంస్కృతము ఆద్యప్రకృతి సంస్కృతభాషకు వర్ణము లేఁబది వంటి సూత్రాలతో నిండి ఉంది

పైన చూపిన వ్యాకరణాలు ప్రశ్నోత్తర దీపకం మొదలు పి గున్నయ్యగారి ఆంధ్ర వ్యాకరణం వరకు అన్ని వాచకాల వలె పరిమితమైన కాలంలో పరిమిత పరిధిలో పరిమితమైన ప్రభావాన్ని చూపి మరుగున పడిపోయాయి వాటి నిర్మాణంలో వాటి కర్తలు ఆశించింది తాత్కాలిక ప్రయోజనమే — ఆనాటి బడిపిల్లలకు తెలుగు సరిగా చదవను వ్రాయను నేర్పడం అది నెరవేరినవెంటనే వాటి ఉనికి అనపేక్షిత మైనట్లు గ్రహించాలి

బాలవ్యాకరణానికి ముందు రచించబడ్డవే అయినా పట్టాభిరామ పండితీయం రావిపాటి గురుమూర్తిశాస్త్రి గారి తెనుగు వ్యాకరణం గుణంలో బాలవ్యాకరణానికి దీటుగా లేనికారణాన మరుగు పడిపోయాయి పట్టాభిరామ పండితీయం అసమగ్రం పైగా శాస్త్రాన్ని ఛందస్సులో ఇమడ్చడం ఎవరికైనా కానిపని గురుమూర్తిశాస్త్రి గారి వ్యాకరణంలో స్పష్టతకోసం అతిగా యత్నించడంవల్ల సూత్రాలలో సూత్రత్వం మృగ్యమై రచన చులకనైంది బాలవ్యాకరణంతో పోల్చినపుడు అదిగూడ ఒక మంచివాచకం వలె కనిపిస్తుందే గాని సార్వకాలికమైన శాస్త్ర గ్రంథంగా కాదు

మరికొన్ని తెలుగు వ్యాకరణాలు ఆ కాలంలోనే పైన చూపిన వాటికంటె మెరుగైన రచనా కౌశలం కలవి రచించబడ్డాయి వాటిని పరిశీలిద్దాం

## లఘువ్యాకరణము

ఇది వేదము వెంకటరమణశాస్త్రి గారిచే రచింపబడింది ఈయన చిన్నయ సూరికి సమకాలికుడు ఈ వ్యాకరణానికి పూర్వం దీనికర్త ప్రశ్నోత్తర రూపంలో సంధి విరహితంగా గ్రామ్యపదబహుళంగా ఒక లఘువ్యాకరణం క్రీ శ 856 వ సంవత్సరంలో వ్రాసినట్లు దీని పీఠికలో స్వయంగా చెప్పారు దానికి పూర్వం నరసాపుర వ్యాకరణాన్ని గూడ తానే రచించినట్లు పేర్కొంటూ తన వ్యాకరణ రచన ఆనాటి ఆంగ్లాధికారులైన హెన్రీ మారిస్ హెన్రీ బవర్స్ ల అనుమతి మేరకు జరిగినట్లు గూడ వెల్లడించారు ఈయన పీఠికలో మరొక విశేషాంశమేమిటంటే మన ప్రాచీన లాక్షణికుల లాగా (కేతన ఆం భా భూ 92 అప్పకవి పీఠిక 28) దోషంబులు పెక్కులు గానంబడిన విశేషజ్ఞులు వానిని విసివి యుపేక్షింపక కరుణించి సవరింతురు గావుత అని ముగించడం దీనిలో సంజ్ఞా సంధి సుబన్త క్రియా పరిచ్ఛేదాలున్నాయి సుబన్త పరిచ్ఛేదంలో తత్సమ అచ్చతెనుగు విభక్త్యర్థ ప్రకరణాలు ఉపవిభాగాలుగా ఉన్నాయి

దీనిలో సూత్రం వృత్తి ఉదాహరణలు మూడు ఉన్నాయి సూత్ర నిర్మాణం వృత్తి రచన ఎలా ఉన్నాయో దిఙ్మాత్రంగా చూద్దాం

సూ అచ్చతెలుఁగు భాషకు వర్ణములు ముప్పదియేడు —సంజ్ఞ 7

సప్తత్రింశదిహ అనే అన్నకవీయ చింతామణి పాఠానికి తెనుగుసేత-

సూ అకారమున కచ్చుపరంబగునపుడు సంధి విభాషనగు — సంధి

వాఽఽత (చింతా సంధి 2) అనే సూత్రానికి అనువాదం

వృత్తి తెనుఁగునందు నచ్చులలో అకార ఇకార ఉకారములకే తఱచుగా సంధి యగు

సూ వర్ణాగమంబు విశేషంబు — క్రియా 65

వృత్తి దేశ్య క్రియలకు వ్యతిరేకాద్యర్థములయందుఁ బూర్వోక్త లక్షణముల కవిషయములైన పలుతెఱంగులగు రూపభేదంబులు వర్ణవిశేషాగమాదేశ లోపప్రాప్తి చేతం గలుగు నని యర్థము

వర్ణాగమో విశేషః పురుషేష్వర్థేషు చాపి వచనేషు — చింతా క్రియ 49

అనే సూత్రానికి తెనిగింపే పై సూత్రం దాని బాలసరస్వతీయ వ్యాఖ్యకు తెనిగింపే వృత్తి

## సంగ్రహవ్యాకరణము

కర్త—కందుకూరి వీరేశలింగము గారు క్రీ శ 923 లో 24వ ప్రచురణ రాజమహేంద్రవరం నుండి జరిగినట్లు ముఖపత్రం వలన తెలుస్తుంది వీరేశలింగం గారి ఇతర సాంఘిక సాహిత్య కార్యక్రమాలలో లాగానే దీనిలోను ఆయన విశిష్టత ముందు చూపు కనిపిస్తాయి ప్రాథమిక వ్యాకరణంగా పాఠశాలా ఉపయోగార్థం వ్రాసినట్లు చెప్పబడింది

విద్యార్థులకి వ్యాకరణమంటే ఏమిటో తెలిపి తరువాత తన వ్యాకరణాన్ని వర్ణ 2 పద 3 వాక్య 4 కావ్య పరిచ్ఛేదాలని నాల్గు విభాగాలు చేసి ఒక్కొక్కదానిలో ఉపవిభాగాలు ఎన్నోచేసి ఆయనకున్న ఆంగ్లవిద్యాసంస్కారం ఆధారంగా నూతన శైలిలో వ్యాకరణాన్ని రచించడానికి సఫలయత్నం చేశారు చింతామణి ముద్ర ఆనాటి అన్ని వ్యాకరణాల్లో లాగానే దీనిలోను పుష్కలంగా ఉంది

కాని వీరేశలింగం ప్రత్యేకత అడుగడుగునా వ్యక్తమవుతూనే ఉంది వ్యాకరణ రచన మీద చిన్నయసూరి ప్రభావం స్ఫుటంగా కనిపిస్తుంది ఇఁక అఁట చుఁడు శబ్దములందక్క ప్రథమ హ్రస్వముమీఁద అరసున్న లేదు (వర్ణపరిచ్ఛేదం) వ్యాకరణం చివర లేఖన చిహ్నాలు వంటివి ఇవ్వడం వ్యాకరణ పారిభాషిక పదాల పట్టిక ఏర్పరచడం జరిగింది

## ఆంధ్రాక్షర తత్త్వము

కర్త – శ్రీపాది వెంకటస్వామి 906 కాకినాడలో ప్రచురితం ఈయన అభినవాంధ్రకౌముది ఆంధ్రకావ్యపయోనిధి మొదలగు అనేక గ్రంథాల కర్తగా పేర్కొనబడ్డారు గ్రంథాదిలో తిరుపతి వేంకటకవులూ కొక్కొండ వెంకటరత్నం గారు ఈ గ్రంథం మీద అభిప్రాయ ప్రకటనం చేశారు ఇది వ్యాకరణంలోని ఏక దేశాన్ని స్వీకరించి విస్తరించి వ్రాసిన గ్రంథం ద్రుతాన్ని గూర్చి ఈ నకారము కన్నడమున లేకున్నను ద్రావిడ భాషా సంప్రదాయ మెరిగిన పూర్వాంధ్ర వైయాకరణు లెవ్వరో చక్కగా నాలోచించి ద్రు – గతౌ యను ధాత్వర్థానుసారముగఁ గావలసి నపుడు వచ్చి యక్కఱ లేనిచోఁ బోవునది ద్రుతమని సంజ్ఞ కావించినద ని తన అభిప్రాయాన్ని తెలిపారు విషయము రచన ప్రణాళిక ఎట్టిదైనా దీనిలో గూడ చింతామణి మార్గం ప్రస్ఫుటంగా ఉంది

## ఆంధ్ర వ్యాకరణ సర్వస్వ తత్త్వము

ఇది వ్యాకరణం గాదు వ్యాకరణ విమర్శ కర్త – వేదం వేంకటరాయశాస్త్రి శుక్ల సంవత్సరంలో భారతిలో ముద్రితమై తరువాత క్రీ శ 9౹0లో మద్రాసులో ప్రకటించబడింది – పుస్తకరూపంలో

ఆంధ్ర వ్యాకరణ సర్వస్వ మనే పేరుతో పార్థసారథి అయ్యంగార్ ఒక గ్రంథం నిర్మిస్తే దానిలోని దొసగుల్ని నిశితంగా ఆనాటి పండితుల వాద వివాద ధోరణిని తలపునకు తెస్తూ చేసిన విమర్శ ఇది

మచ్చుకొక చిన్న అంశాన్ని గమనించి వదలుదాం

పరుషములు - పట్టుదలగాఁ బలుకఁబడునవి అని సర్వస్వము
పట్టుదల యేమి?

సరళములు — విసరుగాఁబలుకునవి విసరేమి? విసరుగాఁబలికిన బాలుని
ఒజ్జగారు దండింపరా?

సంజ్ఞాప్రకరణము ఈ గ్రంథమందు వచ్చు గుర్తులను దెలుపు సూత్రముల
సమూహము అని యున్నది

చిన్నయసూరి లోనగు పూర్వ వ్యాకర్తలు తమ యాయాయి గ్రంథములలో అనంతరము వ్యవహృతములేవో ఆ సంజ్ఞలను మాత్రమే ప్రాయకముగా సంజ్ఞ పరిచ్ఛేద మందు చెప్పినారు వీరు అప్రసక్తములను అనఁగా సర్వస్వములో నెటను పిమ్మటరావి సంజ్ఞలను వృథాగా వింత వింత వివరణములతో నుపన్యసించినారు — ఇలా సాగింది విమర్శ

దీనిలో మనం గమనించవలసింది 20వ శతాబ్ది ప్రారంభానికే చిన్నయసూరి సుప్రతిష్ఠిత వ్యాకర్త కాగలిగాడనీ అన్య పండితులు తమ వాద వివాదాల్లో ఆయనను ఉటంకించవలసినంత ప్రామాణ్యాన్ని సంపాదించా రని మాత్రమే చిన్నసూరికి ప్రామాణ్యం ప్రసిద్ధి—అంటే చింతామణి ఫక్కికి భంగ్యంతరంగా లోకవ్యాప్తి అనే అర్థం

ఈ పరిచ్ఛేదంలో ఇంతవరకు సాగిన పరిశీలనం వలన చింతామణిని ఆధారంగా తీసికొని ఆంధ్రవ్యాకరణ రచనలు అనేకులు అనేకరీతుల్లో చేశారని ఆ అన్ని రచనల్లో బాలవ్యాకరణమే తత్కర్త ప్రతిభా వ్యుత్పత్తులు కారణంగా తెలుగునాట చింతామణి ఫక్కికి విజయపతాకగా నిలబడ గలిగిందని గ్రహించ గలిగాం సూరికి ముందూ వెనుకా వెలసిన వ్యాకరణాల్లో చాలభాగం పరిమిత ప్రయోజనాన్ని అంటే ఆనాటి పాఠశాలా కళాశాలా విద్యార్థి మాత్రోపయోగాన్ని కాంక్షించి చేసినవి గావడంతో కాల పరీక్షకు నిలువలేక తమంత తాము అంతరించినాయని సూరి రచన పాఠశాలా కళాశాలల్ని మాత్రమే ఉద్దేశించి గాక వాఙ్మయాన్ని నన్నయనుండి ప్రామాణికత్వం పొందిన సాహిత్యాన్ని దృష్టిలో ఉంచుకొని చేయబడింది గాబట్టి

అనుషంగికంగా విద్యార్థుల కుపయోగపడినా పడుతున్నా అంతకు మించిన మహా ప్రయోజనాన్ని అది సాధించగలిగింది అని నిర్ణయించవచ్చు పైగా వ్యాకరణ రచనలో సూరి వలె వివిధ ప్రయోగాలు వివిధ ప్రక్రియల్లో అంటే పద్యమయంగా గద్యమయంగా ఉదాహరణ సహితంగా రహితంగా వృత్తిసహితంగా విరహితంగా సంస్కృతంలో తెలుగులో చేసి నిగ్గుతేల్చికొన్నవారు ఆయన సమకాలికుల్లో లేరనడం యథార్థ కథనమే

పైన జరిపిన చిన్న పెద్ద వ్యాకరణాల పరిశీలనం వలన చిన్నయసూరి ప్రతిభా వ్యుత్పత్తులు పరిశ్రమ తేటతెల్లమై తెలుగునాట బాలవ్యాకరణమే నిలబడటానికి కారణాలు తెలిసికోగలిగాం

బాలవ్యాకరణంలో గూడ చింతామణిచ్ఛాయలు ఆకాలంలో రచించబడ్డ అనేక వ్యాకరణాల్లో లాగానే స్ఫుటంగా ఉన్నాయి కాని బాలవ్యాకరణ స్వాతంత్ర్యం గూడ ఆకాలంలోని ఏ ఇతర వ్యాకరణంలో లేనివిధంగా అడుగడుగునా దాని రచనా ప్రణాళికలో పరిచ్ఛేద విభాగంలో సూత్ర కల్పనంలో అన్య వ్యాకర్త వైయాకరణుల మత ప్రదర్శనంలో వృత్త్యుదాహరణలు ఒసగడంలో వ్యక్తమౌతూనే ఉంది సూరి కూడ అతని కాలంలోని అన్య వ్యాకర్తల వలె కేవలం చింతామణికి తెనుగుసేత చేసిన సందర్భాలు బాలవ్యాకరణ పూర్వరచనల్లో శబ్దలక్షణ సంగ్రహం, ఆంధ్రశబ్దానుశాసనం పద్యాంధ్ర వ్యాకరణాల్లో కనుపిస్తాయి ఉపజ్ఞ కొరవడిన ఆ రచనలు అందుకనే ఇతర వ్యాకర్తల వ్యాకరణాల లాగా ప్రసిద్ధిని ప్రశస్తిని పొందలేక పోయాయి

రాను రాను బాలవ్యాకరణ ప్రతిష్ఠ ప్రసిద్ధీ ఎంతగా పెరిగాయంటే దాన్ని అడ్డుకోవడానికి ఈర్ష్యాళువులు అనిమిత్త మహత్పరివాదశీలులూ అయిన పండితులు కొందరు కపటంతో విఫల ప్రయత్నం చేసి బాలవ్యాకరణ దీప్తిని ద్విగుణీకృతం చేశారు దీనికి ఒక చక్కని ఉదాహరణం శిష్టు కృష్ణమూర్తి గారి బాలవ్యాకరణ సంస్కృతీకరణం ఆయన సూరి వ్యాకరణానికి హరికారికా కల్పనంతో మూలోచ్ఛేదం చేయబోయారు గాని ఆ ప్రయత్నం బెడిసి బాలవ్యాకరణ అజరామమై నిలిచింది కాని మధ్యలో కొంత సందిగ్ధస్థితి సంఘటిల్లడం

గూడ జరిగింది ఆ స్థితిలో హరికారికావళి స్వతంత్ర గ్రంథమనుకొని దాన్ని తెనిగించి ప్రకటించిన పండితులు గూడ ఉన్నారు1

చింతామణి ఫక్కి సామాన్యంగా సంస్కృత ప్రాకృత వ్యాకరణానుసారి అని పూర్వ ప్రకరణాల్లో గమనించాం అది కల్పించిన సంజ్ఞాపరిభాషలు అదిచేసిన రూపనిష్పాదన ప్రక్రియ – తెలుగు వ్యాకంణాల మీద అమిత ప్రభావం నెరపడం 19వ శతాబ్దిలో గాని జరగలేదని గూడ గమనించి ఉన్నాం ఇక్కడ మరొక అంశాన్ని గుర్తించాలి దాని సంజ్ఞల్లో రూపనిష్పాదన ప్రక్రియలో బాలవ్యాకరణం వేటిని ఉపేక్షించిందో స్వీకరించలేదో అవితెలుగు వ్యాకరణంలో మరుగున పడి పోయాయి ఉదా అది పేర్కొన్న సమాసాల్లో ఉత్తరపదలోపము ఉపమానము రూపకము వంటివి బాలవ్యాకరణ పరిత్యక్తం కావడం వలన వాటి సమాసత్వం నష్టప్రాయమైంది వాటిలో చివరి రెండూ అలంకారాలుగా సుప్రసిద్ధాలు మొదటిది సమాసాల వరుసలో ఇమడక విడిచిపుచ్చబడింది అయినా చింతామణి మీది గౌరవంతో వాటిని యథాతథంగా గ్రంథస్థం చేసి వాటి నిర్మాణ విధానాన్ని భాషా ప్రవీణ డా జె సూర్యనారాయణ ఎం ఏ పియెచ్ డి తమ పరిశోధన గ్రంథంలో2 ఆధునిక భాషాశాస్త్రరీతుల్లో పున పరిశీలన జరిపారు అది చేసిన రూపనిష్పాదన ప్రక్రియలో తత్పురుష సమాసంలో షష్ఠి ద్వితీయగా మారుతుందనే సూత్రీకరణం చిన్నయసూరి పరిగృహీతం కాలేదు గాబట్టి అనంతర వ్యాకరణాల్లో ఆ రీతి ఉపేక్షితమైంది చింతామణి కళాద్రుతప్రకృతిక విభాగాన్ని చేయడంలో కళల్ని పేర్కొని శేషించినవి ద్రుత ప్రకృతికాలంటే ఆ పద్ధతిని వ్యత్యస్తం చేసి సూరి ద్రుత ప్రకృతికాలు నిర్దేశించి శేషించినవి కళలని సూత్రించడంతో ఆ విధానమే అనంతర వ్యాకరణ విద్యార్థులకు శిరోధార్యమైంది 8వ శతాబ్దికి వ్యాకర్తలకే అక్కరపట్టని చింతామణి ఫక్కి అంటే దాని సంజ్ఞలు పరిభాషలు రూప నిష్పాదన ప్రక్రియ ఈ నాడు తెలుగు వ్యాకరణంలో సుప్రతిష్ఠితమై తిరుగు లేని విధంగా చెల్లుబాటులో ఉంది

---

1 శిష్టవ్యాకరణము – పండితరాజ పెన్మత్స సత్యనారాయణ రాజు

2 A study of Te ugu Compounds – Venkateswara IJn vers ty Tırupatı 965

ఈ విధంగా చింతామణి పక్కి తెలుగునాట స్థిరపడడానికి అది రచించబడ్డ తరువాత రమారమి 200 ఏండ్లు పైగా పట్టింది దానికి ప్రాముఖ్యం భారతీయుల్లో, స్వాభిమానం బహుముఖంగా అంటే జాతి మత భాషా రూపాల్లో పునరుజ్జీవిత మయ్యే కాలానికి తెలుగునాట ఏర్పడిందని నిర్ణయించవచ్చు సరిగా ఆ కాలంలోనే చిన్నయసూరి చింతామణి మార్గంలో బాలవ్యాకరణాన్ని నిర్మించడంతో తెలుగు వ్యాకరణ పరిభాష మొత్తం చింతామణి పక్కికామయమై నిలిచింది

## ఉపసంహారం

ఈ పరిశీలన ప్రధానోద్దేశం చింతామణి వికృతివివేకాల కాలకర్తృత్వ నిరూపణమే కాబట్టి దీనిలోని నాల్గుభాగాల్లోను అన్ని ప్రకరణాల్లో ఆ లక్ష్యం వైపుగానే రచన సాగింది ఆయా భాగాల్లో జరిగిన ఫలితాన్ని దిఙ్మాత్రంగా ఒకచోట ఉంచడానికి యత్నిస్తాను

ప్రాచీనుల నవీనుల దృష్టిలో చింతామణి అనే ప్రథమభాగంలో చింతామణిని గూర్చిన అవగాహనం పాచీన నవీన లాక్షణికులకు కవి పండితులకు ఎలా ఉందో వివరించడం జరిగింది మధ్యకాలంలో తప్ప ప్రాచీన యుగంలో చింతామణి నన్నయ్యల సంబంధం ఎవరికీ తెలియదు కాని నవీనకాలంలో చింతామణిలోని అంతర్బహిస్సాక్ష్యాలు ఆధారంగా దాని కాలం కర్తృత్వం శంకాస్పదాలైనాయి తరువాత తనకు పూర్వం తనకాలంలో చింతామణి నన్నయ కర్తృకం కాజాలదంటూ వెలువడిన విమర్శలకు సమాధానం చింతామణి విషయ పరిశోధనాన్ని శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి ఎర్పరిచారు కాని దానిలోనివి అభావనిర్ణయాలే గాని నిజ మయినవి కావని ఈభాగంలోనే రుజువుపరచడం జరిగింది

చింతామణి స్వరూప స్వభావాలు కాలకర్తృత్వ నిర్ణయం అనే ద్వితీయ భాగంలో చింతామణిని వివిధకోణాలలో పరీక్షించడం జరిగింది దాని స్వరూపం, దానిలోని ప్రాకృత వ్యాకరణానుసరణం కేశనాదుల లక్షణాల సంస్కృతీకరణం పరిశోధితాలైనాయి అలాగే దానిలో లక్షితమైన భాష సూత్రకర్తే వివరిస్తే గాని తెలియని సూత్రాలు గూడ పరిశీలితాలై చింతామణి నన్నయకృతం కాజాలదని దాని తొలి వ్యాఖ్యాతగా ప్రసిద్ధుడైన బాలసరస్వతే దానికి నిజమయిన కర్త అని నిష్క-